ఓమ్

# వాసిష్ఠ రామాయణము

అను

# శ్రీయోగవాసిష్ఠము

(తాత్పర్యప్రకాశికయను ఆంధ్రానువాద సహితము)

## మహర్షి వాల్మీకి ప్రణీతము

పూర్వార్ధము - ప్రథమ సంపుటము


అనువాదకులు :

శ్రీ పూర్ణానంద స్వాములవారు



సంపాదకులు - ప్రకాశకులు :

శ్రీ వ్యాసాశ్రమము

వ్యాసాశ్రమము పోస్టు, (మార్గము) ఏర్పేడు, చిత్తూరు జిల్లా. (అ.ప్ర.)

పిన్ : 517 621 ఫోన్ నెం. 08574 - 68528

2009

★

| | | |
|---|---|---|
| ప్రథమ ముద్రణ | 1948 సం॥ | 1000 ప్రతులు |
| ద్వితీయ ముద్రణ | 1969 సం॥ | 1000 " |
| తృతీయ ముద్రణ | 1997 సం॥ | 2000 " |
| చతుర్థ ముద్రణ | 2009 సం॥ | 800 " |
| | మొత్తం : | 4800 |

వెల: రూ.





ప్రకాశకులు :
శ్రీ వ్యాసాశ్రమమువారు

ధార్మికగ్రంథ ప్రచురణకు ఆర్థిక సహాయం అనే పథకం క్రింద **తిరుమల తిరుపతి దేవస్థానం వారిచ్చిన ఆర్థిక సహాయంతో ఈ గ్రంథం ప్రచురింపబడింది**

ప్రతులకు :
మేనేజరు - శ్రీ వ్యాసాశ్రమము,
వ్యాసాశ్రమం పోస్టు (మార్గము) ఏర్పేడు,
చిత్తూరు జిల్లా (ఆం.ప్ర), పిన్ : - 517 621

ముద్రణ :
శక్తీ ప్రాసెస్
నెం. 21/F కుంభాలమ్మన్ కోయిల్ స్ట్రీట్,
మద్రాసు - 81, ఫోన్ : 5950331

# నివేదన

శ్రీవ్యాసాశ్రమం వారు ప్రకటించిన ఆధ్యాత్మిక గ్రంథాలు ఆంధ్రదేశంలో విస్తృతప్రచారం పొందాయి. వాటిలో తలమానికంగా ఎన్నదగినది యోగవాసిష్ఠం. దీన్ని 'వాసిష్ఠ రామాయణం', 'వసిష్ఠగీత' అని కూడా వ్యవహరిస్తారు.

వాల్మీకి కృతిగా ప్రసిద్ధమైన ఈ గ్రంథంలో ముప్పది రెండువేల శ్లోకా లున్నాయి. వైరాగ్య - ముముక్షు - ఉత్పత్తి - స్థితి - ఉపశమ - నిర్వాణ ప్రకరణా లన్న పేరుతో ఆరు విభాగా లున్నాయి. అద్వైతవేదాంతం ఈ పుస్తకంలో అత్యద్భుతంగా ప్రతిపాదింపబడింది. వసిష్ఠ మహర్షి శ్రీరామ చంద్రుణ్ణి ఉద్దేశించి చేసిన తత్త్వోపదేశమే ఇందలి విషయం.

"మహాగ్రంథాలలో ఒకటైన యోగ వాసిష్ఠం నాదృష్టిలో ప్రపంచంలో వ్రాయబడిన గ్రంథాలన్నింటిలోనూ అత్యాశ్చర్యకరమైనది"(One of the greatest books, the most wonderful according to me ever written under the sun, is Yogavasistha.) అని శ్రీ స్వామి రామతీర్థులవారు ఈ గ్రంథాన్ని ప్రశంసించి వున్నారు.

దీన్ని మహర్షి సద్గురు శ్రీమలయా[illegible]ములవారు సమగ్రంగా ఆంధ్రతాత్పర్యంతో సహా నలుబదేండ్ల క్రి[illegible] ముద్రింపజేశారు. అంతకు ముందెవరూ దీన్ని తెలుగులో సంపూ[illegible]గా ముద్రించలేదు. శ్రీ సద్గురు స్వాములవారి ప్రోత్సాహంతో [illegible]పూర్ణానందేత్యవర నామధేయు శ్రీనిర్వికల్పానంద స్వాములవారు ఈ గ్రంథానికి చెందిన పూర్వార్ధాన్ని అనువదించారు. తరువాతి భాగాన్ని శ్రీ సద్గురు దేవుల ముఖ్య శిష్యులు శ్రీ విద్యా ప్రకాశానంద స్వాములవారు తెనిగించారు. 1936 లో ప్రారంభమైన దీని ముద్రణ 1954 లో పూర్తి అయింది. నాల్గువేల పుటలకు పైబడిన ఈ పుస్తకం మొదట నాలుగు సంపుటాలుగా రాయల్ సైజులో ప్రచురింపబడింది.

జిజ్ఞాసువులైన పాఠకుల ప్రీతికి పాత్రమై మూడుసార్లు ముద్రితమయింది.

ఇటీవల చాలాకాలం నుండి దుర్లభంగా వుండిపోయిన ఈ గ్రంథరత్నం కావాలంటూ ఆశ్రమానికి పలువురు లేఖలు వ్రాసేవారు. భగవదనుగ్రహం వల్ల, గురుకరుణవల్ల ఈ మహాగ్రంథాన్ని ఇప్పుడు మళ్లీ ప్రచురించే సదవకాశం లభించింది. పాఠక సౌకర్యాన్ని దృష్టిలో ఉంచుకొని దీని నిప్పుడు డెమ్మీ 1/8 సైజులో ఎనిమిది సంపుటాలుగా ప్రచురిస్తున్నాము.

ఈ గ్రంథగౌరవాన్ని గుర్తించి తిరుమల తిరుపతి దేవస్థానం వారు దీని పునర్ముద్రణకు ఉదారంగా ఆర్థిక సహాయం అందించారు. ఇందుకు దేవస్థానం పాలకమండలికి ఎంతో కృతజ్ఞులము. ఈ విషయంలో సహకరించిన ఆశ్రమపూర్వ విద్యార్థి, తిరుమల తిరుపతి దేవస్థానం ధర్మప్రచార పరిషత్ కార్యదర్శి శ్రీ సముద్రాల లక్ష్మణయ్యగారిని అభినందిస్తున్నాము.

ఈ ఉద్గ్రంథం ఇంకా విస్తృత వ్యాప్తి చెంది పాఠకులకు ఆత్మానందాన్ని ప్రసాదించుగాక!

శ్రీ వ్యాసాశ్రమం — ప్రకాశకులు

22-8-1997.

ఓమ్.

# శ్రీ యోగవాసిష్ఠ గ్రంథ ప్రశంస.

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

మోక్షోపాయాభిధానేయం సంహితా సారసంమితా
త్రింశద్ద్వే చ సహస్రాణి జ్ఞాతా నిర్వాణదాయినీ.

శ్రీ వసిష్ఠుడు:— సారవంతములగు అర్థములచే పరిపూర్ణమై, ఉపనిషత్తుల్యమై, మోక్షోపాయంబను పేరుగల్గి 32,000 శ్లోకములతో తులతూగునట్టి యీ గ్రంథము (యోగవాసిష్ఠము) మోక్షమును గల్గజేయునదై యున్నది.

దీపే యథా వినిద్రస్య జ్వలితే సంప్రవర్తతే
ఆలోకోఽనిచ్ఛతోఽప్యేవం నిర్వాణమనయా భవేత్.

మేల్కొనినవాడు తానిచ్ఛగింపకున్నను దీపపు ప్రకాశముచే పదార్థముల గాంచునట్లు, ఈ సంహిత (యోగవాసిష్ఠము) నెఱింగినచో మనుజుడు తానిచ్ఛగింపకున్నను మోక్షమును పొందును.

స్వయం జ్ఞాతా శ్రుతా వాపి భ్రాన్తిశాన్త్యైకసౌఖ్యదా
ఆపేత్య వర్ణితా సద్యో యథా స్వర్గతరఙ్గిణీ.

దీనిని స్వయముగా లెస్సగ తెలిసికొనినను, లేక ఇతరులకు జెప్పినను, ఇతరులవలన వినినను గంగానదివలె సర్వపాపములను శీఘ్రముగ హరింపజేయునదై యున్నది.

యథా రజ్జ్వామహిభ్రాన్తిర్వినశ్యత్యవలోకనాత్
తథైతత్ప్రేక్షణాచ్ఛాన్తిమేతి సంసారదుఃఖతః.

రజ్జువుయొక్క యథార్థజ్ఞానముచే సర్పభ్రాంతి నశించునట్లు, ఈ గ్రంథమును విచారపూర్వకముగ నవలోకించుటచే సంసారదుఃఖము శమించును.

ఇదముత్తమ మాఖ్యానమధ్యేయం వేదవత్సదా
వ్యాఖ్యేయం పూజనీయం చ పురుషార్థఫలప్రదమ్.

పరమపురుషార్థమగు మోక్షమను ఫలమును గల్గజేయు ఈ యుత్తమ గ్రంథము, వేదమువలె నిత్యము పఠింపదగినదియు, వ్యాఖ్యానము సేయదగినదియు, మఱియు పూజింపదగినదియు నగును.

యదస్మాత్ప్రాప్యతే శాస్త్రాత్ తత్తద్వేదాదవాప్యతే
అస్మిన్ జ్ఞాతే త్రిమూర్తిజ్ఞానం ద్వయం గతాని పవిత్రతామ్.

అధ్యాత్మ శాస్త్రము (యోగవాసిష్ఠము)చే నెయ్యది లభించునో అదియే వేదముచేతను లభించును. ఏలన, యిద్దాని నెఱుంగుటచే కర్మకాండ, జ్ఞానకాండములు రెండును పవిత్రవంతములగును.

వేదాంతతర్కసిద్ధాంత స్త్వస్మిన్ జ్ఞాతే చ బుద్ధ్యతే
ఇదముత్తమమాఖ్యానం వ్యాఖ్యాతం శాస్త్రదృష్టిషు.

వేదాంత, తర్కసిద్ధాంతము లెయ్యోవి మహర్షులచే నిర్ణయింపబడెనో, అవన్నియు నీగ్రంథము నెఱింగిననే బోధపడగలదు. ఏలన, వేదాంతశాస్త్రములలో నియ్యది శ్రేష్ఠమని యెన్నబడినది.

కారుణ్యాద్భవతామేతదహం వచ్మి న మాయయా
భవన్త స్త్వవగచ్ఛంతి మాయామేతద్విచార్యతామ్.

ఓ జనులారా! మీపై కరుణచే నేనిదంతయు చెప్పుచున్నాడను గాని కపటముచే గాదు. ఈ యధ్యాత్మశాస్త్రమును విచారించుచో యీ జగత్తు మాయయని తెలిసికొనగలరు.

అస్మాచ్ఛాస్త్రవరాద్బోధా జాయన్తే యే విచారితాత్
లవణైర్వ్యంజనానీవ భాన్తి శాస్త్రాంతరాణి తైః.

ఈ యుత్తమ శాస్త్రము (యోగవాసిష్ఠము)ను విచారించుటచే పరమోత్కృష్టమగు జ్ఞానము సంప్రాప్తమగును. అపుడే తక్కిన శాస్త్రములన్నియు లవణసంయోగమును బొందిన శాకమువలె రుచించును.

అనార్యమిదమాఖ్యాన మిత్యనాదృత్య దృశ్యధీః
మా భవత్వాత్మహన్తారో భవన్తో భవభాగినః.

ఈ యధ్యాత్మ శాస్త్రము కావ్యమువలె యుత్తమమైనది కాదని తలంచి యిద్దానిని నిరాదరణయొనర్చి ఆత్మహంతకులును, సంసారాసక్తులునుగాకుడు.

మోక్షోభ్యుపాయానుమహానుభావాన్
జ్ఞాస్యన్తి యే తత్త్వవిదాం వరిష్ఠాః
పునః సమేష్యన్తి న సంసృతిం తే
కోఽర్థః సుతాఽన్యేన బహూదితేన.

వెయ్యేల, మందాధికారులైనను, మోక్షోపాయమనంబడు ఈ పవిత్రగ్రంథమును మహాత్ముఁడగు గురువువలన శ్రవణము చేసినచో నట్టివారు తత్త్వజ్ఞులలో నుత్తములై మరల నీ సంసారమున బడకుందురు.

ఓం తత్ సత్.



# శ్రీ యోగవాసిష్ఠము

## పూర్వార్ధము – ప్రథమ సంపుటము

## విషయానుక్రమణిక

[సశేషము]

ఓమ్
శ్రీ గణేశాయనమః.

# తొలిపలుకు.

ఓం పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణముదచ్యతే ।
పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే ॥

అందఱును అన్వేషించునది ఆనందము. ఈ ఆనందాన్వేషణమునకును, ప్రాప్తికిని వేదాంత దర్శనము సాయపడునట్లితరములు సాయపడజాలవని నుడివిన నతిశయోక్తి కాజాలదు. ఈ దర్శనమునకు సంబంధించిన గ్రంథములు కొల్లలు; కాని ఇవన్నియు భాషావిషయమునసేమి, తత్త్వవిషయమునసేమి జటిలములును, గహనములును, దుర్బోధ్యములునునై యున్నవి. కాని, సరళములగు గ్రంథములు లేకపోలేదు. వాటిలో యోగవాసిష్ఠము — పంచదశిని విడచిన — అగ్రగణ్యమని చెప్పవచ్చును.

ఇందు గ్రంథకారుఁడు, అమోఘమగు తన మనీషను ప్రదర్శించి, కావ్యభాషలో తత్త్వచింతను ప్రస్ఫుటితమొనర్చి, ఈ ఉభయక్షేత్రములలో నగ్రపీఠమును నిర్వివాదముగ ఆరోహించినాఁడు; అగుట జేసి, కావ్యప్రియులును, ఆత్మకాములును నగు ఆంధ్రుల కీగ్రంథ మత్యంతోపకారియై, వారి ఆదరమును జూరగొనగలదని మా తలంపు.

గ్రంథకారుడు వాల్మీకి, 32 వేలశ్లోకములతో నీ గ్రంథమును గూర్చినాఁడు; వైరాగ్య, ముముక్షు, ఉత్పత్తి, స్థితి, ఉపశమ, నిర్వాణములను ప్రకరణములుగ ప్రపంచింపఁబడినది. ఈ మహద్గ్రంథ మింతవరకు సంపూర్ణముగ తెలుగున ప్రకటింపబడలేదు. (కేవలము ఇదేయన్నమాట ఏమి? — వేదాంత గ్రంథము లనేకములు తెలుఁగున లేవు; వేలకొలది మైళ్లదూరముననున్న పరభాషలలో నీటియనువాదములు వెలయుచుండ, మన భాషలో లేకుంట కడుంగడు శోచనీయమగు విషయము. దీనికిఁ గలకారణములు: జ్ఞానాభావము, ధనాభావము, రైల్వే,వాఙ్మయమునకుఁగల సమాదృతి) అందువలన శ్రీ వ్యాసాశ్రమమువారి ప్రోత్సాహమున దీనిని సంపూర్ణముగ నాంధ్రీకరించి, తెలుగువారి కరకమలములనుంచు భారమును వహించితిని. ఈ గ్రంథము తెలుగువారి సమాదరమును బడసిన, ఇట్టివేయగు వేదాంతగ్రంథముల పెక్కింటిని బ్రచురించు కోఱిక ఎంతేని యున్నది.

అయితే, ఈ గ్రంథానువాదమునకు ప్రస్తుతానువాదకుడు యోగ్యుడా? అను ప్రశ్న సహజముగ నిప్పట్ల ఉదయించును.

యోగ్యతను ప్రతిపాదించుకొను ధృష్టత మాకులేదు. మేమందుముగదా: సహజపాండితీ విరాజితుడగు ఏ పోతనయో ఇక్కార్యమునకు దొరకొనిన, బంగారమునకు తావి యబ్బినట్లుండెడిదని.

కేవలము వేదాంతాభిరుచి, భాషాభిమానము, ముముక్షుజనసేవానురక్తి, శ్రీ మలయాళస్వాములవారి ప్రోత్సాహము మమ్మిందులకు ప్రేరేపింపజేసినవని మనవి.

తెలిగించుపట్ల, శ్రీమదానందబోధేంద్ర సరస్వతీ విరచిత 'తాత్పర్యప్రకాశిక' యను సంస్కృత వ్యాఖ్యయొక్క సాయమును గొంటిని. ఈయన, మెలిపెట్టి అర్థమును లాగినపట్ల, అంతకంటె తేలికగ అర్థము లభించునని తోచినపట్ల, ఒకించుక స్వతంత్రించితిని. పాఠాంతరముల గుఱించి: ఆనందసరస్వతి మొమ్మొదట వ్యాఖ్యగావించిన పాఠములే, యుక్తియుక్తము లగుటవలన, వాటినే నేను గ్రహించితిని.

ఒకపరి మూలశ్లోకమునుజూచి, ఆంధ్రానువాదమును బరికించిన భావార్థము పండితులకును, అపండితులకును, సుగమము కాగలదని ఆశింతును. —— ఆశాసాఫల్యవిధాత భగవానుడు.

ముఖ్యముగ సంస్కృతానభిజ్ఞులకును, ఈషదభిజ్ఞులకును ఈ అనువాదము తోడ్పడగలదని ఎంతును. ఏ ఒక్కరికైన ఈ యనువాదమువలన యథార్థోపకృతి చేకూరిన, నా శ్రమ సఫలమని తలంతును; నన్ను ధన్యునిగ ఎంచుకొందును.

ఈ బృహద్గ్రంథమున దోసగులు పొసగుట అసంభవముకాదు —— అందువలన 'సంతః శ్రమజ్ఞాః కృపయా క్షమధ్వం స్ఖలితం క్వచిత్' అని ప్రార్థన. మఱియు దొరలిన దోషములను, సూచనలను దెల్పిన కృతజ్ఞులమై రాబోవు సంస్కరణమున పరివర్తన మొనరించుకొనగలవారమని మనవి.

ఓం సహనావవతు, సహనౌభునక్తు, సహవీర్యం కరవావహై,
తేజస్వినావధీతమస్తు, మావిద్విషావహై,
ఓం శాంతిః శాంతిః శాంతిః.

ఇట్లు,
శ్రీ పూర్ణానందేత్యపరనామధేయ
శ్రీ నిర్వికల్పానందస్వామి.

శ్రీ రామకృష్ణమఠము,
భువనేశ్వర్, ఒరిస్సా.
19—9—1936.



## కృతి



ఓం నమో బ్రహ్మణే బ్రహ్మవిద్భ్యో బ్రహ్మవిద్యా సంప్రదాయ కర్తృభ్యో
వసిష్ఠ విశ్వామిత్ర వ్యాస వాల్మీకి శుక గౌడపాద శంకర
రామకృష్ణాదిభ్యః శ్రీరామభద్రాయ చ.

### 1. గురువందనము

వితరితుమవతీర్ణం జ్ఞానభక్తిప్రశాంతీః
ప్రణయగళితచిత్తం జీవదుఃఖాసహిష్ణుమ్ ।
ధృతసహజసమాధిం చిన్మయం కోమలాంగం
విమలపరమహంసం రామకృష్ణం భజామః ॥ 1

తత్త్వం దేవ న జానామి రామకృష్ణ తవ ప్రభో ।
యాదృశోఽసి కృపాసింధో తాదృశాయ నమో నమః ॥ 2

అవిద్యా తిమిరాంధస్య నయనోన్మీలకం ప్రభుమ్ ।
ద్వినేత్రం ద్విభుజం శాంతం నిత్యమానందవిగ్రహమ్ ॥ 3

సచ్చిన్మయం నభస్తుల్యం వరేణ్యం జ్ఞానదాయినమ్ ।
నమామి శ్రీ శివానందం శివరూపం గురుం సదా ॥ 4

### 2. నతి

వక్త్రేందుభిర్దిక్షు తమోహరద్భిర్వేదార్థసారామృతముద్గిరంతమ్ ।
వాణీభుజాశ్లిష్టమభీష్టసిద్ధ్యై తం బ్రహ్మవిద్యాది గురుం భజేఽహమ్ ॥ 5

నమో బ్రహ్మణ్యదేవాయ గోబ్రాహ్మణహితాయ చ ।
జగద్ధితాయ కృష్ణాయ గోవిందాయ నమో నమః ॥ 6

పశూనాం పతిం పాపనాశం పరేశం గజేంద్రస్య కృత్తిం వసానం వరేణ్యమ్ ।
జటాజూటమధ్యే స్ఫురద్గాంగవారిం మహాదేవమేకం స్మరామి స్మరారిమ్ ॥ 7

## 3. అంకితము

జన్మాద్యస్య యత స్తస్మై నారాయణాయ వేధసే।
అర్పణమస్తు గ్రంథస్య గాంగైః గంగార్చనం యథా। 8

అతినిశితసుధారం యస్య చక్రం సుతారం కనకమయవిచిత్రే కుండలే యస్య కర్ణే।
భ్రమరశతసహస్రైః సేవితా యస్య మాలా అసురకులనిహంతా ప్రీయతాం
వాసుదేవః। 9

## 4. మంగళము

జయతి జయతి దేవో దేవకీ నందనోఽయం
జయతి జయతి కృష్ణో వృష్ణివంశప్రదీపః।
జయతి జయతి మేఘశ్యామలః కోమలాంగో
జయతి జయతి పృథ్వీభారనాశో ముకుందః। 10

దృఢబద్ధ ధర్మమూలో వేదస్కంధః పురాణశాఖాఢ్యః।
క్రతుకుసుమో మోక్షఫలో మధుసూధనపాదపో జయతి। 11

ఓం శాంతిః శాంతిః శాంతిః.

ఓం తత్సత్.

సర్వే జనా సుఖినో భవంతు.

---



శ్రీవాణ్యై నమః.

# వాసిష్ఠ మహారామాయణమ్

## వైరాగ్య ప్రకరణమ్.

### ప్రథమః సర్గః

★

### మంగళాచరణమ్.

యతః సర్వాణి భూతాని ప్రతిభాన్తి స్థితాని చ
యత్రైవోపశమం యాన్తి తస్మై సత్యాత్మనే నమః. 1

ఎద్దానినుండి భూతములన్నియు ఆవిర్భవించుచున్నవో, ఎద్దానస్థితిని గనుచున్నవో, తుద కద్దాన లయమునుఁ బొందుచున్నవో, ఆ సత్యస్వరూపియగు బ్రహ్మమునకు నమస్కారము.

జ్ఞాతా జ్ఞానం తథా జ్ఞేయం ద్రష్టా దర్శన దృశ్యభూః
కర్తా హేతుః క్రియా యస్మాత్ తస్మై జ్ఞప్త్యాత్మనే నమః. 2

జ్ఞాత, జ్ఞాన, జ్ఞేయ, ద్రష్ట, దర్శన, దృశ్య, కర్త, హేతు, క్రియలను వ్యావహారిక తత్వము లెద్దానినుండి ప్రభవించినవో, ఆ నిత్యజ్ఞాన స్వరూపియగు బ్రహ్మమునకు నమస్కారము.

స్ఫురన్తి సీకరా యస్మాదానందాస్యాంబరేవనౌ
సర్వేషాం జీవనం తస్మై బ్రహ్మానందాత్మనే నమః. 3

ఏ మహానంద సాగరమందలి కణమగు విషయానందము సమస్తజీవులలో ప్రకాశము నందుచున్నదో, ఎద్దానియొక్క ఆనందకణము జీవులకు జీవనమో, ఆ బ్రహ్మానంద రూపుడగు ఆత్మకు నమస్కారము.

### కథారంభః.

సుతీక్ష్ణో బ్రాహ్మణః కశ్చిత్ సంశయాకృష్టమానసః
అగస్తేరాశ్రమం గత్వా మునిం పప్రచ్ఛ సాదరమ్. 4

సుతీక్ష్ణుండను ఒకానొక బ్రాహ్మణుని మనస్సు సంశయ పీడితముకాగా, నాతడు అగస్తి మునీంద్రుని ఆశ్రమమున కరిగి వినయముతో నిట్లు ప్రశ్నించెను.

సుతీక్ష్ణ ఉవాచః—

భగవన్! ధర్మతత్వజ్ఞ! సర్వశాస్త్రవినిశ్చిత
సంశయోఽస్తి మహానేకస్త్వమేతం కృపయా వద. 5

సుతీక్ష్ణుడు:- భగవానుడా! ధర్మరహస్యముల నన్నిఁటిని మీరెఱుంగుదురు. శాస్త్రముల నన్నింటిని నిశ్చిత బుద్ధితో పఠించితిరి. నాకొక పెద్దసందియము కలిగినది. దానిని దీర్చ వేడెదను.

మోక్షస్య కారణం కర్మ జ్ఞానం వా మోక్షసాధనం
ఉభయం వా వినిశ్చిత్య ఏకం కథయ కారణమ్. 6

మోక్షకారణము కర్మయా? లేక జ్ఞానమా? లేక కర్మజ్ఞానములు రెండునుఁగూడ మోక్షసాధనములా? వీటిలో నెయ్యది మోక్షకారణమో నిశ్చయించి నాకుఁ జెప్పుడు.

అగస్తిరువాచ:—

ఉభాభ్యామేవ పక్షాభ్యాం యథా ఖే పక్షిణాం గతిః
తథైవ జ్ఞానకర్మాభ్యాం జాయతే పరమంపదమ్. 7

అగస్తి:- పక్షులాకాశమున రెండు ఱెక్కల సాయమునఁ జరించునట్లు, జీవుడు జ్ఞానకర్మల సాహాయ్యమున పరమపదమునుఁ బొందును.

కేవలాత్ కర్మణో జ్ఞానాన్న హి మోక్షోఽభిజాయతే
కింతూభాభ్యాం భవేన్మోక్షం సాధనం తూభయం విదుః. 8

కేవలము కర్మవలనఁగాని, జ్ఞానమువలనఁగాని మోక్షము లభింపదు. ఈ రెంటివలన మోక్షము లభించును; కనుక సాధుజనులు ఈ రెంటిని మోక్షోపాయములని పరిగణింతురు.

అస్మిన్నర్థే పురావృత్తమితిహాసం వదామి తే
కారుణ్యాఖ్యః పురా కశ్చిద్ బ్రాహ్మణోఽధీతవేదకః. 9
అగ్నివేశ్యస్య పుత్రోఽభూత్ వేదవేదాంగపారగః
గురోరధీతవిద్యః సన్నాజగామ గృహం ప్రతి. 10

ఈ సందర్భమున నీకొక పురాతనేతిహాసమును వచించుచున్నాను. పూర్వకాలమున అగ్నివేశ్యముని పుత్రుఁడగు కారుణ్యుఁడను నాయనయుండెను. అతఁడు వేదవేదాంగములఁ బఠించెను. శాస్త్రముల నన్నిటిని అభ్యసించెను. గురుకులమున అధ్యయనమును ముగించి గృహమునకు మరలివచ్చెను.

తస్థావకర్మకృత్తూష్ణీం సంశయానో గృహే తదా
అగ్నివేశ్యో విలోక్యాథ పుత్రం కర్మవివర్జితం. 11
ప్రాహ ఏతద్వచోఽనింద్యం గురుః పుత్రం హితాయ చ

అప్పుడాయన కర్మకాండయెడల సంశయముగలిగి, కర్మలఁ ద్యజించి, తూష్ణీంభావమును వహించి యూరకుండెను. అప్పుడు అగ్నివేశ్యుఁడు కర్మవివర్జితుండగు పుత్రునిగాంచి వాని మంచి కొఱకు ఇట్లుపల్కెను.

అగ్నివేశ్య ఉవాచ:—

కిమేతత్ పుత్ర! కురుషే పాలనం న స్వకర్మణః? 12

అగ్నివేశ్యుడు:- పుత్రా! ఇదేమి? నీవు స్వధర్మమునుఁ (కర్మల) బాలించుట లేదేమి?



అకర్మనిరతః సిద్ధిం కథం ప్రాప్స్యసి తద్వద
కర్మణోఽస్మాన్నివృత్తేః కిం కారణం తన్నివేద్యతామ్. 13

నీవు కర్మవివర్జితుడవై సిద్ధినెట్లు పొందెదవో నాకుఁ దెలియఁ జెప్పుము. మఱియు కర్మల నెందులకు ద్యజించితివో నుడువుము.

కారుణ్య ఉవాచ:—

యావజ్జీవమగ్నిహోత్రం నిత్యం సంధ్యాముపాసయేత్
ప్రవృత్తిరూపో ధర్మోఽయం శ్రుత్యా స్మృత్యా చ చోదితః. 14

కారుణ్యుడు: 'మరణపర్యంతము అగ్నిహోత్రము నొనర్చునది, నిత్యము సంధ్యావందనము చరించునది' - ఈ రూపములగు శ్రుతి స్మృతి వాక్యములన్నియుఁ బ్రవృత్తి ధర్మమునకుఁ జెందినవి.

న ధనేన భవేన్మోక్షః కర్మణా ప్రజయా న వా
త్యాగమాత్రేణ కిం త్వేకే యతయోఽశ్నంతి చామృతమ్. 15

ధనమువలన, కర్మలవలన, సంతానోత్పాదనమువలన మోక్షము లభింపదు. త్యాగము అనగా సర్వకర్మసంన్యాసమువలననే అమృతత్వమును బొందిరి. (ఇట్టివాక్యములన్నియు నివృత్తిపరములు.)

ఇతి శ్రుత్యోర్ద్వయోర్మధ్యే కిం కర్తవ్యం మయా గురో!
ఇతి సందిగ్ధతాం గత్వా తూష్ణీంభూతోఽస్మి కర్మణి. 16

తండ్రీ! ఈ రెంటిలో నెయ్యది నడుపదగినది? అను సందియము కలిగి, సందిగ్ధచిత్తుడనై కర్మలఁ ద్యజించితిని.

అగస్తిరువాచ:—

ఇత్యుక్త్వా తాత విప్రోఽసౌ కారుణ్యో మౌనమాగతః
తథావిధం సుతం దృష్ట్వా పునః ప్రాహ గురుః సుతమ్. 17

అగస్తి:- కారుణ్యుఁడు తండ్రితో నిట్లు పలికి యూరకుండెను. అప్పుడు మౌనమును వహించిన పుత్రునితో అగ్నివేశ్యుఁ డిట్లు పలికెను.

అగ్నివేశ్య ఉవాచ:—

శ్రుణు పుత్ర కథామేకాం తదర్థం హృదయేఽఖిలమ్
మత్తోఽవధార్య పుత్ర త్వం యథేచ్ఛసి తథా కురు. 18

అగ్నివేశ్యుడు:- పుత్రా! నీకొక కథను జెప్పెదను; వినుము. విని, దానిని బాగుగా విచారించిచూచి నీకు నచ్చిన ట్లొనర్పుము.

సురుచిర్నామ కాచిత్ స్త్రీ అప్సరోగణ ఉత్తమా
ఉపవిష్టా హిమవతః శిఖరే శిఖిసంవృతే. 19
రమంతే కామసంతప్తాః కిన్నర్యో యత్ర కిన్నరైః
స్వర్ధున్యోఘేన సంసృష్టే మహాఘౌఘవినాశినా. 20

దూతమింద్రస్య గచ్ఛంతమంతరిక్షే దదర్శ సా
తమువాచ మహాభాగా సురుచిశ్చాప్సరోవరా. 21

పూర్వము, కామతస్థలుం కిన్నరకిన్నరీ సమూహములు విహారముల సల్పునదియు, మయూరీ మయూరములు ప్రమోదక్రీడలు నొనర్చునదియు, పాపనాశినియగు గంగానది ప్రవహించునదియు నగు హిమవత్పర్వత శిఖరమున సురుచియను అప్సరస కూర్చొని యుండెను. ఆమె, ఆకాశమున నరుగుచున్న ఇంద్రదూతను గాంచి ఇట్లనెను.

**సురుచిరువాచః—**

దేవదూత మహాభాగ కుత ఆగమ్యతే త్వయా
అధునా కుత్ర గంతాసి తత్సర్వం కృపయా వద. 22

సురుచి:- దేవదూతా! ప్రకాశస్వరూపా! నీ వెటనుండి అరుదెంచుచున్నావు? ఇప్పుడెట కరుగుచున్నావు? దయయుంచి నాకుఁ జెప్పుము.

**దేవదూత ఉవాచః—**

సాధు పృష్టం త్వయా సుభ్రు యథావత్ కథయామి తే
అరిష్టనేమీ రాజర్షిర్దత్వా రాజ్యం సుతాయ వై. 23
వీతరాగః స ధర్మాత్మా నిర్యయా తపసే వనమ్
తపశ్చరత్యసౌ రాజా పర్వతే గంధమాదనే. 24

దేవదూత:- సురుచీ! యుక్తప్రశ్న నొనరించితివి. నా వృత్తాంతమును వచించుచున్నాను. అరిష్టనేమియను రాజర్షి వైరాగ్యమునుఁదాల్చి, పుత్రునకు రాజ్యభారము నొసఁగి, తపస్సు నొనరించుటకుగాను అరణ్యమున కరిగెను. ఇప్పుడాయన. గంధమాదన పర్వతమున తపము నాచరించుచున్నాడు.

కార్యం కృత్వా మయా తత్ర తత ఆగమ్యతేఽధునా
గంతాస్మి పార్శ్వే శక్రస్య తం వృత్తాంతం నివేదితుమ్. 25

(నేనింద్రుని ఆజ్ఞననుసరించి అట కరిగితిని.) అట నా కార్యమును నిర్వర్తించి, ఇంద్రుని కచ్చటి వృత్తాంతమును నివేదించుటకుఁగాను మరల నరుగుచున్నాను.

**అప్సరా ఉవాచః—**

వృత్తాంతః కోఽభవత్తత్ర కథయస్వ మమ ప్రభో
ప్రష్టుకామా వినీతాఽస్మి నోద్వేగం కర్తుమర్హసి. 26

అప్సరస:- ప్రభూ! అచ్చటి వృత్తాంతమేమి? నేను వినఁగోరుచున్నాను. వినయముతోఁ బ్రశ్నించుచున్నాను. వచింపుడు; నన్ను చుల్కన చేయవద్దు.

**దేవదూత ఉవాచః—**

శృణు భద్రే యథావృత్తం విస్తరేణ వదామి తే
తస్మిన్ రాజ్ఞి వనే తత్ర తపశ్చరతి దుస్తరమ్. 27



దేవదూత:- అచ్చటి వృత్తాంతమును వివరముగ వచింపుచున్నాను, వినుము. అరిష్టనేమి గంధమాదన పర్వతారణ్యమున కఠోరమగు తపస్సు నాచరించుచున్నాడు.

ఇత్యహం దేవరాజేన సుభ్రూరాజ్ఞాపితస్తదా
దూత త్వం తత్ర గచ్ఛాశు గృహీత్వేదం విమానకమ్. 28
అప్సరో గణసంయుక్తం నానావాదిత్రశోభితమ్
గంధర్వసిద్ధయక్షైశ్చ కిన్నరాద్యైశ్చ శోభితమ్. 29
తాళవేణుమృదంగాది పర్వతే గంధమాదనే
నానావృక్షసమాకీర్ణే గత్వా తస్మిన్ గిరౌ శుభే. 30
అరిష్టనేమిం రాజానం దూతారోప్య విమానకే
ఆనయ స్వర్గభోగాయ నగరీమమరావతీమ్. 31

'నీవచ్చటికి శీఘ్రముగా అప్సరసలు, సిద్ధులు, కిన్నరులు, యక్షులతో గూడినదియు, వేణువు, వీణ, మృదంగము ఇత్యాదులగు మధురవాద్యములతో శోభిల్లునదియునగు ఈ విమానముఁ దీసికొని, గంధమాదన పర్వతమున శాల, తాళ, తమాల, హింతాలాది వృక్షములతో నిండియున్న ఆ పవిత్రశృంగమున కఱిగి, అరిష్టనేమి నిందెక్కించుకొనిరమ్ము. ఆయన ఇటకరుదెంచి స్వర్గభోగముల ననుభవించును' అని ఇంద్రుఁ డాజ్ఞాపించెను.

ఇత్యాజ్ఞాం ప్రాప్య శక్రస్య గృహీత్వా తద్విమానకమ్
సర్వోపస్కరసంయుక్తం తస్మిన్నద్రావహం యయౌ. 32

నేనిట్లింద్రునిచే నాజ్ఞాపితుఁడనై పలువిధములగు భోగవస్తువులతో నలంకరింపఁబడిన ఆ విమానముఁ గైకొని గంధమాదనపర్వతమున కేగితిని.

ఆగత్య పర్వతే తస్మిన్ రాజ్ఞో గత్వా క్రమం మయా
నివేదితా మహేంద్రస్య సర్వాజ్ఞాఽరిష్టనేమయే. 33

ఏగి, రాజర్షి అరిష్టనేమి ఆశ్రమమునుఁ బ్రవేశించి, ఆయన కింద్రుని ఆజ్ఞ నంతటిని నివేదించితిని.

ఇతి మద్వచనం శ్రుత్వా సంశయానోఽవదచ్ఛుభే

నాపలుక్కుల విని, అరిష్టనేమి సంశయచిత్తుఁడై ఇట్లు పల్కెను.

**రాజోవాచః—**

ప్రష్టుమిచ్ఛామి దూత త్వాం తన్మే త్వం వక్తుమర్హసి. 34
గుణా దోషాశ్చ కే తత్ర స్వర్గే వద మమాగ్రతః
జ్ఞాత్వా స్థితిం తు తత్రత్యాం కరిష్యేఽహం యథారుచి. 35

అరిష్టనేమి:- ఓ ఇంద్రదూతా! నిన్నొకటి అడిగి తెలుసుకొనగోరెదను. నీవు చెప్పఁగలవు. స్వర్గమునందలి గుణదోషముల వర్ణించి చెప్పుము. అచ్చటి పరిస్థితులఁ దెలిసికొనిన పిమ్మట నాకు నచ్చినట్లొనర్తును.

దూత ఉవాచ:—

స్వర్గే పుణ్యస్య సామగ్ర్యా భుజ్యతే పరమం సుఖమ్
ఉత్తమేన తు పుణ్యేన ప్రాప్నోతి స్వర్గముత్తమమ్. 36
మధ్యమేన తథా మధ్యః స్వర్గో భవతి నాన్యథా
కనిష్ఠేన తు పుణ్యేన స్వర్గో భవతి తాదృశః. 37

దూత:- పుణ్యమెక్కుడుగానున్నచో, స్వర్గమున పరమసుఖము ననుభవింపవచ్చును. పుణ్యముయొక్క తారతమ్యము ననుసరించి ఉత్తమ, మధ్యమ, అధమ భేదముల నొప్పు స్వర్గములు లభించును.

పరోత్కర్షాసహిష్ణుత్వం స్పర్ధా చైవ సమైశ్చ తైః
కనిష్ఠేషు చ సంతోషో యావత్ పుణ్యక్షయో భవేత్. 38

పుణ్యక్షయమగు దనుక భోగముల ననుభవించు స్వర్గమున తమకంటె నెక్కుడు భోగముల ననుభవించువారియెడల నసూయ, తోటివారిని గాంచిన స్పర్ధ, తక్కువవారినిఁ గాంచిన సంతోషము కలుగును.

క్షీణే పుణ్యే విశంత్యేతం మర్త్యలోకం చ మానవాః
ఇత్యాదిగుణదోషాశ్చ స్వర్గే రాజన్నవస్థితాః. 39

పుణ్యక్షయమైనతోడనే మరల మర్త్యలోకమున కరుగుచున్నారు. ఇట్టి గుణదోషములు స్వర్గమున నున్నవి.

ఇతి శ్రుత్వా వచో భద్రే స రాజా ప్రత్యభాషత.

ఈ పల్కుల విని రాజిట్లు ప్రత్యుత్తరించెను.

రాజోవాచ:—

నేచ్ఛామి దేవదూతాహం స్వర్గమీదృగ్విధం ఫలమ్. 40

రాజు:- ఓ దేవదూతా! నేనిట్టి ఫలములతో గూడిన స్వర్గమును గోరను.

అతఃపరం మహోగ్రం తు తపః కృత్వా కళేవరమ్
త్యక్ష్యామ్యహమశుద్ధం హి జీర్ణాం త్వచమివోరగః. 41

నేనిక కఠోరతపము నొనరించి, పాము కుబుసమును విడుచునట్లు అపవిత్రమగు ఈ శరీరమును విసర్జింతును.

దేవదూత విమానేదం గృహీత్వా త్వం యథాఽఽగతః
తథా గచ్ఛ మహేంద్రస్య సన్నిధౌ త్వరితం నమోఽస్తు తే. 42



ఓ దేవదూతా! నీవీవిమానమునుఁ దీసుకొని ఇంద్రునికడకు వచ్చినత్రోవనే మరలి వెళ్లుము. నీకు నమస్కారము.

దేవదూత ఉవాచ:—

ఇత్యుక్తోఽహం గతో భద్రే శక్రస్యాగ్రే నివేదితుం
యథావృత్తం నివేద్యాథ మహదాశ్చర్యతాం గతః. 43

దేవదూత:- రాజిట్లు పల్క, నేనీవాక్యముల ఇంద్రునికడకేగి విన్నవించితిని; ఇంద్రుడు మిక్కిలి అచ్చెరువందెను.

పునః ప్రాహ మహేంద్రో మాం శ్లక్ష్ణం మధురయా గిరా

ఇంద్రుడు మరల మధురముగ, కోమలముగ నాతో నిట్లనియెను.

ఇంద్ర ఉవాచ:—

దూత గచ్ఛ పునస్తత్ర తం రాజానం నయాశ్రమమ్. 44
వాల్మీకేర్జ్ఞాతతత్త్వస్య స్వబోధార్థం విరాగిణమ్
సందేశం మమ వాల్మీకేర్మహర్షేస్త్వం నివేదయ. 45

ఇంద్రుఁడు:- దూతా! మరల నీవచ్చటి కరుగుము. వైరాగ్యసంపన్నుడగు అరిష్టనేమిని తత్వజ్ఞుఁడగు వాల్మీకి మహర్షి ఆశ్రమమునకు తత్త్వజ్ఞానార్థము దీసుకొని వెళ్లుము. మఱియు నా సందేశమును వాల్మీకి కిట్లు తెలుపునది:—

మహర్షే త్వం వినీతాయ రాజ్ఞేఽస్మై వీతరాగిణే
న స్వర్గమిచ్ఛతే తత్త్వం ప్రబోధయ మహామునే. 46
తేన సంసారదుఃఖార్తో మోక్షమేష్యతి చ క్రమాత్

"మహర్షీ! విరాగియు, వినయియు, స్వర్గభోగవిరతుఁడును అగు ఈ రాజునకు తత్త్వజ్ఞానముపదేశింపుడు. దానివలన, సంసార దుఃఖార్తుఁడగు ఈ రాజు క్రమముగా ముక్తి నందగలడు."

ఇత్యుక్త్వా దేవరాజేన ప్రేషితోఽహం తదన్తికే. 47

ఇంద్రునివలన నిట్లాజ్ఞాపింపఁబడి మరల నచ్చటికి (అరిష్టనేమి ఆశ్రమమునకు) పంపబడితిని.

మయాఽఽగత్య పునస్తత్ర రాజా వాల్మీకిజన్మనే
నివేదితో మహేంద్రస్య రాజ్ఞా మోక్షస్య సాధనమ్. 48

రాజును వెంటనిడుకొని వాల్మీకి ఆశ్రమమున కఱిగితిని. అఱిగి, వాల్మీకికి మహేంద్రుని ఆజ్ఞయు, రాజుయొక్క మోక్షయత్నమును నివేదించితిని.

తతో వాల్మీకిజన్మాసౌ రాజానం సమపృచ్ఛత
అనామయమతిప్రీత్యా కుశలప్రశ్న వార్తయా. 49

వాల్మీకి అతిప్రేమతో రాజును దేశము, కోశము, (= ధనాగారము) పుత్రులు, తపస్సు మున్నగువానినిగుఱించిన కుశలము నడిగెను.

రాజోవాచః—

భగవన్ ధర్మతత్త్వజ్ఞ జ్ఞాతజ్ఞేయవిదాం వర
కృతార్థోఽహం భవద్దృష్ట్వా తదేవ కుశలం మమ. 50

రాజు:- భగవానుడా! తాము ధర్మతత్త్వజ్ఞులు, జ్ఞానసంపన్నులు, లోకవ్యవహారజ్ఞులు. (ఇట్టి) మీ దర్శనమువలనను, మీ కృపాదృష్టివలనను కృతార్థుడనైతిని. ఇదియే నా కుశలము.

భగవన్ ప్రష్టుమిచ్ఛామి తదవిఘ్నేన మే వద
సంసారబంధదుఃఖార్తేః కథం ముంచామి తద్వద. 51

భగవానుడా! మిమ్ముల నొక్కవిషయ మడిగి తెలుసుకొనగోరెదను. నిర్విఘ్నముగా వచింపుడు. సంసారబంధ బంధితుడ నగు నేనెట్లు ముక్తుడనగుదునో వచింపుడు.

వాల్మీకిరువాచః—

శృణు రాజన్ ప్రవక్ష్యామి రామాయణమఖండితమ్
శ్రుత్వాఽవధార్య యత్నేన జీవన్ముక్తో భవిష్యసి. 52

వాల్మీకి:- రాజా! అఖండరామాయణమును వచింపుచున్నాను, వినుము. దీనిని విని, అవగతమొనర్చుకొనిన జీవన్ముక్తుడవగుదువు.

వసిష్ఠరామసంవాదం మోక్షోపాయకథాం శుభామ్
జ్ఞాతస్వభావో రాజేంద్ర వదామి శ్రూయతాం బుధ. 53

జ్ఞాతస్వభావా! బుధా! వసిష్ఠరామ సంవాదమును, శుభదాయకమును, మోక్షోపాయమును నగుదానిని నీకు వచింపుచున్నాను. వినుము.

రాజోవాచః—

కో రామః కీదృశః కస్య బద్ధో వా ముక్త ఏవ వా
ఏతన్మే నిశ్చితం బ్రూహి జ్ఞానం తత్త్వవిదాం వర. 54

రాజు:- తత్త్వజ్ఞా! రాముఁడెవడు? అతఁడెట్టివాఁడు? బద్ధుఁడా? ముక్తుఁడా? నాకిద్దానిఁ దెలియఁజెప్పుడు.

వాల్మీకిరువాచః—

శాపవ్యాజవశాదేవ రాజవేషధరో హరిః
ఆహృతాజ్ఞానసంపన్నః కించిజ్జ్ఞోఽసౌ భవత్ప్రభుః. 55

వాల్మీకి:- (నీ ఇష్టదైవమగు) నారాయణుడే, భక్తులిచ్చిన శాపవాక్యముల సఫలమొనర్ప రాజవేషమును ధరించి, జ్ఞానమును వీడి, అల్పజ్ఞునివలె ప్రకాశించెను.



రాజోవాచః—

చిదానందస్వరూపే హి రామే చైతన్యవిగ్రహే
శాపస్య కారణం బ్రూహి కః శప్తా చేతి మే వద. 56

రాజు:- చిదానందస్వరూపుడును, చైతన్యవిగ్రహుఁడునునగు రామునకు శాపమేల గల్గినది? ఎవరు శపించిరి? వచింపుడు.

వాల్మీకిరువాచః—

సనత్కుమారో నిష్కామో హ్యవసద్బ్రహ్మసద్మని
వైకుంఠాదాగతో విష్ణుస్త్రైలోక్యాధిపతిః ప్రభుః. 57
బ్రహ్మణా పూజితస్తత్ర సత్యలోకనివాసిభిః
వినా కుమారం తం దృష్ట్వా హ్యువాచ ప్రభురీశ్వరః. 58

వాల్మీకి:- నిష్కాముఁడగు సనత్కుమారుఁడు బ్రహ్మలోకమున నుండెను. అప్పుడటకు వైకుంఠమునుండి జగత్ప్రభుఁడగు నారాయణు డరుదెంచెను. బ్రహ్మలోకనివాసులును, బ్రహ్మయు గోవిందునిఁబూజించిరి. కాని సనత్కుమారుఁడెట్టి సత్కారమును సలుపలేదు. అతనినిఁగాంచి మాధవుఁడనెను:—

సనత్కుమార స్తబ్ధోఽసి నిష్కామో గర్వచేష్టయా
అతస్త్వం భవ కామార్తః శరజన్మేతి నామతః. 59

సనత్కుమారుడా! నీకు యుక్తాయుక్త విచక్షణలేదు; నిష్కాముఁడనను గర్వమున్నది. అందువలన కుమారస్వామివై జన్మించి కామపీడితుఁడవు కమ్ము!

తేనాపి శపితో విష్ణుః సర్వజ్ఞత్వం తవాస్తి యత్
కించిత్ కాలం హి తత్త్యక్త్వా త్వమజ్ఞానీ భవిష్యసి. 60

విష్ణువుకూడ, సర్వజ్ఞత్వమును గోల్పోయి, అజ్ఞానియై, కొంతకాలముండునట్లు, సనత్కుమారునివలన శపింపబడెను.

భృగుభార్యాం హతాం దృష్ట్వా హ్యువాచ క్రోధమూర్ఛితః
విష్ణో తవాపి భార్యాయా వియోగో హి భవిష్యతి. 61

భృగువు తనభార్య, కేశవునివలనఁ జంపబడుటఁగాంచి, క్రోధపరవశుఁడై నీకుఁగూడ భార్యావియోగము గలుగుఁగాక యని శపించెను.

---

౨౧. ఖ్యాతియనునామె భృగుని పత్ని. ఈమె పురాకల్పమున విష్ణుని శరీరమున లీనమవ కోఱుకొనెను. నారాయణుఁడాకోర్కెను సఫలమొనర్ప భృగువు, విష్ణువు తనభార్యను సంహరించినాడని భ్రమపడి యిట్లు శపించెను.— అను.

వృందయా శపితో విష్ణుశ్ఛలనం యత్త్వయా కృతమ్
అతస్త్వం స్త్రీవియోగం తు వచనాన్మమ యాస్యసి. 62

బృంద, విష్ణువు తన్ను మోసగించెనని గ్రహించి, భార్యావియోగము కలుగునని శపించెను.

భార్యా హి దేవదత్తస్య పయోష్ణీతీరసంస్థితా
నృసింహవేషధృగ్విష్ణుం దృష్ట్వా పంచత్వమాగతా. 63
తేన శప్తో హి నృహరిర్దుఃఖార్తః స్త్రీవియోగతః
తవాపి భార్యయా సార్ధం వియోగో హి భవిష్యసి. 64

దేవదత్తునిభార్య పయోష్ణీనదీతీరముననున్న నృసింహరూపియగు విష్ణునిగాంచి, భయపడి ప్రాణములఁ ద్యజించెను. అప్పుడు, భార్యావియోగదుఃఖితుఁడగు దేవదత్తుఁడు, దుర్లభదర్శనుఁడగు నారాయణుని, నీవుఁగూడ భార్యావియోగము కల్గుగాక యని శపించెను.

భృగుణైవం కుమారేణ శపితో దేవశర్మణా
వృందయా శపితో విష్ణుస్తేన మానుష్యతాం గతః. 65

నారాయణుఁడిట్లు, సనత్కుమార, భృగు, బృంద, దేవదత్తులవలన శపింపఁబడి మనుష్యరూపమును దాల్చెను.

ఏతత్తే కథితం సర్వం శాపవ్యాజస్య కారణమ్
ఇదానీం వచ్మి తత్సర్వం సావధానమతిః శృణు. 66

ఇత్యార్షే వాసిష్ఠ—మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే
మోక్షోపాయే ద్వాత్రింశత్ సాహస్ర్యాం సంహితా
యాం వైరాగ్యప్రకరణే సూత్రపాతనకోనామ
ప్రథమః సర్గః.

నీకీ నానావిధశాపముల గురించి వచించితిని. ఇప్పుడు మోక్షసాధనమును సంపూర్ణముగా వచించెదను. సావధానుఁడవై వినుము.

ఇది మత్పరమహంస పరివ్రాజకాచార్య జగద్గురు శ్రీ రామకృష్ణదేవ
ప్రశిష్య శ్రీమత్ శివానంద పురీ పూజ్యపాదశిష్య శ్రీ పూర్ణా
నంద కృత శ్రీయోగవాసిష్ఠ తాత్పర్యప్రకాశిక యను
ఆంధ్రానువాదమున వైరాగ్య ప్రకరణమున
సూత్రపాతనకయను ప్రథమసర్గము ॥ 1 ॥

---

లోకమున ఒకప్పుడు రాధ అలిగి శాపమీయ, సుధాముఁడు దానవకులమున జలంధరుడై జన్మించెను; బృంద ఈతని భార్య. ఈయమ సతీత్వము నాశనముగానిచో, జలంధరునకు మృత్యువులేదు. నారాయణుడు కపటరూపమున బృంద పాతివ్రత్యమును భంగపరచెను. జలంధరుడు మృతిఁ జెందెను. అందువలన, బృంద అలిగి శాపమిడెను. ఈ కథ నెఱుంగ గోరువారు బ్రహ్మవైవర్త, పద్మ, పురాణములం జూ[illegible] — అను.



## ద్వితీయః సర్గః.

దివి భూమౌ తథాఽఽకాశే బహిరంతశ్చ మే విభుః
యో విభాత్యవభాసాత్మా తస్మై సర్వాత్మనే నమః. 1

భూలోకమున, అంతరిక్షలోకమున, స్వర్గలోకమున, నాయందు, బయట, లోపల వ్యాపించి అన్నిఁటినిఁ బ్రకాశింపఁజేయుచున్న సర్వాత్మకునకు నమస్కారము.

**వాల్మీకిరువాచ:—**

అహం బద్ధో విముక్తస్స్యామితి యస్యాస్తి నిశ్చయః
నాత్యంతమజ్ఞో నో తజ్జ్ఞః సోఽస్మిన్ శాస్త్రేఽధికారవాన్. 2

వాల్మీకి:- నేను సంసారబద్ధుడను, ముక్తుఁడనగుదును — ఇట్టి నిశ్చయము గలవాడే ఈ శాస్త్రమునుఁ బఠింపనర్హుడు. అతి అజ్ఞుడును, (దేహాత్మబుద్ధి గలవాడును), తత్వజ్ఞుడును (ముక్తుడును) ఈ శాస్త్రమును పఠింపఁదగదు.

కథోపాయాన్ విచార్యాదౌ మోక్షోపాయానిమానథ
యో విచారయతి ప్రాజ్ఞో న స భూయోఽభిజాయతే. 3

మొదట కథారూపమగు సప్తకాండ రామాయణమునుఁ బఠించి, పిదప షట్ప్రకరణాత్మకమగు ఈ మోక్షతత్వము నాలోచించువాడు మరల జన్మింపడు.

అస్మిన్ రామాయణే రామకథోపాయాన్ మహాబలాన్
ఏతాంస్తు ప్రథమం కృత్వా పురాఽహమరిమర్దన. 4
శిష్యాయాస్మి వినీతాయ భరద్వాజాయ ధీమతే
ఏకాగ్రో దత్తవాంస్తస్మై మణిమబ్ధిరివార్థినే. 5

నేను మొదట రామకథను విరచించి సముద్రుఁడు కోరినవారికి రత్నములనిచ్చునట్లు బుద్ధిమంతుడును, వినయియు, మేధావియు, శిష్యుడునునగు భరద్వాజునకొసఁగితిని.

తత ఏతే కథోపాయా భరద్వాజేన ధీమతా
కస్మింశ్చిన్మేరుగహనే బ్రహ్మణోఽగ్ర ఉదాహృతాః. 6
అథాస్య తుష్టో భగవాన్ బ్రహ్మా లోకపితామహః
వరం పుత్ర గృహాణేతి తమువాచ మహాశయః. 7

పిమ్మట భరద్వాజుఁడు దానిని సుమేరు పర్వతారణ్యముననున్న బ్రహ్మకు వినిపించెను. లోక పితామహుఁడగు బ్రహ్మదేవుఁడు సంతోషించి భరద్వాజుని వరముఁ గోరుకొనమనెను.

భరద్వాజ ఉవాచ:—

భగవన్ భూతభవ్యేశ వరోఽయం మేఽద్య రోచతే
యేనాయం జనతా దుఃఖాన్ముచ్యతే తదుదాహర. 8

భరద్వాజుఁడు:- భగవానుఁడా! భూతభవిష్యద్వేదీ! దేనివలన జనులు దుఃఖమునుండి విముక్తులగుదురో, దానిని వచింపుడు. ఇదియే నా ఇష్టవరము.

శ్రీ బ్రహ్మోవాచ:—

గురుం వాల్మీకిమత్రాశు ప్రార్థయస్వ ప్రయత్నతః
తేనేదం యత్ సమారబ్ధం రామాయణమనిందితమ్. 9
తస్మిన్ శ్రుతే నరో మోహాత్ సమగ్రాత్ సంతరిష్యతి
సేతునేవాంబుధేః పారమపారగుణశాలినా. 10

బ్రహ్మ:- నీవతెగి వెంటనే ఈ విషయమును వాల్మీకి నడుగుము. అతఁడారంభించిన రామాయణమును వినినంతనే మనుజుఁడు సేతువువలన సముద్రమును దాటిపోవునట్లు మోహమును సంపూర్ణముగా తరింపగలఁడు.

శ్రీ వాల్మీకిరువాచ:—

ఇత్యుక్త్వా స భరద్వాజం పరమేష్ఠీ మదాశ్రమమ్
అభ్యాగచ్ఛత్ సమం తేన భరద్వాజేన భూతకృత్. 11

వాల్మీకి:- ఇట్లు పలికి సృష్టికర్తయగు బ్రహ్మ భరద్వాజుని వెంటనిడుకొని నాయాశ్రమమున కఱుదెంచెను.

తూర్ణం సంపూజితో దేవః సోఽర్ఘ్యపాద్యాదినా మయా
అవోచన్మాం మహాసత్త్వః సర్వభూతహితే రతః. 12

నేనాయనను వెంటనే అర్ఘ్యపాద్యాదులు నొసఁగి పూజించితిని. సర్వభూతహితరతుఁడును సత్త్వమూర్తియునునగు బ్రహ్మ నాతో నిట్లనియె:

రామ స్వభావకథనాదస్మాద్వరమునే త్వయా
నోద్వేగాత్ స పరిత్యాజ్య ఆసమాప్తేరనిందితాత్. 13

‘నీవారంభించిన ఆనందదాయకమగు రామచరిత్ర ప్రయాసతో గూడినదని, ముగింపక వదలివేయకుము.

గ్రంథేనానేన లోకోఽయమస్మాత్ సంసారసంకటాత్
సముత్తరిష్యతి క్షిప్రం పోతేనేవాశు సాగరాత్. 14

[illegible] సముద్రమును దాటిపోవునట్లు, ఈ రామాయణమువలన జనులు సంసార సముద్రము [illegible]గలరు.

వక్తుం తదేవమేవార్థమహమాగతవానయమ్
కురు లోకహితార్థం త్వం శాస్త్రమిత్యుక్తవానజః. 15

నేనీవిషయమును నీకెఱింగించుటకే ఇట కరుదెంచితిని. లోకహితార్థమీ శాస్త్రమును రచింపుము.’



మమ పుణ్యాశ్రమాత్ తస్మాత్ క్షణాదంతర్ధిమాగతః
ముహూర్తాభ్యుత్థితః ప్రోచ్చైస్తరంగ ఇవ వారిణః. 16

నా యీ పుణ్యాశ్రమమునుండి నిమేషమాత్రమై లేచిన జలతరంగమువలె నంతర్హితుం డాయెను.

తస్మిన్ ప్రయాతే భగవత్యహం విస్మయమాగతః
పునస్తత్ర భరద్వాజమపృచ్ఛం స్వస్థయా ధియా. 17
కిమేతద్ బ్రహ్మణా ప్రోక్తం భరద్వాజ వదాశు మే
ఇత్యుక్తేన పునః ప్రోక్తం భరద్వాజేన తేన మే. 18

బ్రహ్మదేవుఁ డంతర్హితుఁడైనపిమ్మట, నాకుఁగల్గిన విస్మయమునుండి తేఱుకొని, బ్రహ్మ యేమి వచించినదియు తెల్ప భరద్వాజు నడిగితిని. అతఁడిట్లనియె.

భరద్వాజ ఉవాచ:—

ఏతదుక్తం భగవతా యథా రామాయణం కురు
సర్వలోక హితార్థాయ సంసారార్ణవ తారకమ్. 19

భరద్వాజుఁడు:- జనులందరి హితము కొఱకు సంసారసముద్రమునుండి తరింపఁజేయు రామాయణమును పూర్తినొనరింపుము. అని బ్రహ్మ యాజ్ఞాపించినాఁడు.

మహ్యం చ భగవన్ బ్రూహి కథం సంసారసంకటే
రామో వ్యవహృతో హ్యస్మిన్ భరతశ్చ మహామనాః. 20
శత్రుఘ్నో లక్ష్మణశ్చాపి సీతా చాపి యశస్వినీ
రామానుయాయినస్తే వా మంత్రిపుత్రా మహాధియః. 21
నిర్దుఃఖితాం యథైతే తు ప్రాప్తాస్తద్బ్రూహి మే స్ఫుటమ్
తథైవాహం భవిష్యామి తతో జనతయా సహ. 22

భగవానుఁడా! సంసార సంకటమునంబడి శ్రీరామ, భరత, లక్ష్మణ, శత్రుఘ్నులును, సీతాదేవియు, మంత్రి పుత్రులును ఎట్లు సంచరించిరి? దుఃఖము నేరీతిగ తప్పించుకొనిరి? నాకిద్దానిని వివరించి తెల్పుఁడు. దీనిని విని నేనును, ఇతరులును దుఃఖవిముక్తిని గందుము.

భరద్వాజేన రాజేంద్ర వదేత్యుక్తోఽస్మి సాదరమ్
తదా కర్తుం విభోరాజ్ఞామహం వక్తుం ప్రవృత్తవాన్. 23

భరద్వాజుని వేడుకోలుఁ గైకొని, బ్రహ్మదేవుని ఆజ్ఞ ననుసరించి చెప్ప మొదలిడితిని.

శృణు వత్స భరద్వాజ యథా పృష్టం వదామి తే
శ్రుతేన యేన సమ్మోహమలం దూరే కరిష్యసి. 24

వత్సా! భరద్వాజా! నీవడిగిన దానినిఁ జెప్పుచున్నాను వినుము. దీనిని వినిన మోహము దూరమైపోవును.

తథా వ్యవహర ప్రాజ్ఞ యథా వ్యవహృతః సుఖీ
సర్వాసంసక్తయా బుద్ధ్యా రామో రాజీవలోచనః. 25

లక్ష్మణో భరతశ్చైవ శత్రుఘ్నశ్చ మహామనాః
కౌసల్యా చ సుమిత్రా చ సీతా దశరథస్తథా. 26

కృతాస్త్రశ్చావిరోధశ్చ బోధపారముపాగతాః
వసిష్ఠో వామదేవశ్చ మంత్రిణోఽష్టౌ తథేతరే. 27

ధృష్టిర్జయంతో భాసశ్చ సత్యో విజయ ఏవ చ
విభీషణః సుషేణశ్చ హనుమానింద్రజిత్తథా. 28

ఏతేఽష్టౌ మంత్రిణః ప్రోక్తాః సమనీరాగచేతసః
జీవన్ముక్తా మహాత్మానో యథా ప్రాప్తానువర్తినః. 29

ఏతైర్యథా హుతం దత్తం గృహీతముషితం స్మృతమ్
తథా చేద్వర్తసే పుత్ర ముక్త ఏవాసి సంకటాత్. 30

పద్మనేత్రుఁడగు రాముఁడును, లక్ష్మణుఁడును, భరతుఁడును, శత్రుఘ్నుడును, కౌసల్యయును, సుమిత్రయును, సీతయు, దశరథుడును, కృతాస్త్రి విరోధులను రామస్నేహితులును, వసిష్ఠ వామదేవాదులును, అష్టమంత్రులును ఏరీతిగ నిర్లిప్తులై సంచరించి ఆనందము ననుభవించిరో, నీవును అట్లే యొనర్పుము. ధృష్టి, జయంతుఁడు, భాసుడు, సత్యుడు, విజయుఁడు, సుషేణుఁడు, హనుమంతుడు, ఇంద్రజిత్తు* వీరష్టమంత్రులు. వీరందరును సమదర్శనులు, వైరాగ్యచిత్తులు, జీవన్ముక్తులు, ప్రారబ్ధకర్మల ననుసరింపువారు. వీరొనరించినట్లు హోమ, దాన, గ్రహణ, స్మరణాదుల నొనరించిన నీవును సంకటమునుండి విముక్తుఁడవగుదువు.

అపారసంసారసముద్రపాతీ లబ్ధ్వా పరాం యుక్తిముదారసత్త్వః
న శోకమాయాతి న దైన్యమేతి గతజ్వరస్తిష్ఠతి నిత్యతృప్తః. 31

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే మోక్షోపాయే
సూత్రపాతనికో నామ ద్వితీయః సర్గః ॥ 2 ॥

అపారమగు సంసార సముద్రమున మునిఁగిన వ్యక్తి, (పరమయోగమునుఁబొంది) ఉత్కృష్ట జ్ఞానముఁబడసి, శోకమును, దైన్యమును, అభిమానమును వీడి నిత్యతృప్తుడై వెలయును.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు వైరాగ్య ప్రకరణమున
సూత్రపాతనికయను ద్వితీయ సర్గము ॥ 2 ॥

*ఈ ఇంద్రజిత్తు సుగ్రీవుని మంత్రి — అను.



## తృతీయః సర్గః.

భరద్వాజ ఉవాచః—

జీవన్ముక్తస్థితిం బ్రహ్మన్ కృత్వా రాఘవమాదితః
క్రమాత్ కథయ మే నిత్యం భవిష్యామి సుఖీ యథా. 1

భరద్వాజుఁడు:- బ్రహ్మవేత్తా! క్రమముగా జీవన్ముక్తస్థితి నెట్లు పొందవచ్చునో, రాముని ననుసరించి, నాకుఁజెప్పుడు. అట్లయిన సుఖినగుదును.

శ్రీ వాల్మీకిరువాచః—

భ్రమస్య జాగతస్యాస్య జాతస్యాకాశవర్ణవత్
అపునః స్మరణం మన్యే సాధో విస్మరణం వరమ్. 2

శ్రీ వాల్మీకి:- సాధూ! ఆకాశమునకు రూపము లేకపోయినను నీలరూపమున్నట్లు భ్రమ గలుగునట్లు, వాస్తవమగు సత్తలేని జగత్తు బ్రహ్మమున ఆరోపింపఁబడుచున్నది. ఇట్టి కల్పితప్రపంచము మరల మనస్సున నుదయింపకుండునట్లు, విస్మరించుటయే ముక్తిస్వరూపము. ఇత్యాది నా అనుభవము.

దృశ్యాత్యన్తాభావబోధం వినా తన్నానుభూయతే
కదాచిత్ కేనచిన్నామ స్వబోధోఽన్విష్యతామతః. 3

కనుఁబడు ప్రతిపస్తువయు, (దృశ్యము) అస్తిత్వములేనిది. ఈ జ్ఞానము కలుగనిదే పైనఁ జెప్పఁబడిన, ముక్తిస్వరూపమును ఎవరును దెలిసికొనజాలరు. అందువలన ఆత్మసాక్షాత్కారము కొఱకై యత్నింపుము.

స చేహ సంభవత్యేవ తదర్థమిదమాతతమ్
శాస్త్రమాకర్ణయసి చేత్ తత్త్వమాప్స్యసి నాన్యథా. 4

ఈ శాస్త్రాధికారికి ఆత్మదర్శనము లభించును. ఈ శాస్త్రమును వినినయెడలనే ఆత్మసాక్షాత్కారము లభించును. మఱి ఇంకొక ఉపాయములేదు.

జగద్భ్రమోఽయం దృశ్యోఽపి నాస్త్యేవేత్యనుభూయతే
వర్ణో వ్యోమ్న ఇవాఖేదాద్విచారేణామునాఽనఘ. 5

అనఘా! భ్రాంతివలన కల్పింపఁబడిన ఈ జగత్తు కనులంబడుచున్నను, ఆకాశమునందలి రంగువలె, అస్తిత్వము లేనట్టిది; శాస్త్రవిచారమువలన అనాయాసముగా ఇట్టి యనుభూతి కలుగును.

దృశ్యం నాస్తీతి బోధేన మనసో దృశ్యమార్జనమ్
సంపన్నం చేత్తదుత్పన్నా పరా నిర్వాణనిర్వృతిః. 6

దృశ్యవస్తువు అసలునకు లేదు; మిథ్య. ఇట్టి తత్వజ్ఞానమువలన మనస్సునుండి దృశ్యవస్తువు తొలఁగిపోయినచో, నిర్వాణముక్తియొక్క పరమానందము లభించును.

అన్యథా శాస్త్రగర్తేషు లుఠతాం భవతామిహ
భవత్యకృత్రిమాజ్ఞానాం కల్పైరపి న నిర్వృతిః. 7

అట్లొనర్పక, అజ్ఞానమునకు లోబడి మరల మరల పుట్టుచు చచ్చుచుండు వ్యక్తి అనేక కల్పములుగ శాస్త్రములను గుంటలోబడి కొట్టుకొనినను ముక్తి లభింపదు.

అశేషేణ పరిత్యాగో వాసనానాం య ఉత్తమః
మోక్ష ఇత్యుచ్యతే బ్రహ్మన్ స ఏవ విమలక్రమః. 8

బ్రాహ్మణుడా! వాసనల సంపూర్ణ త్యాగమే ఉత్తమమగు మోక్షము. చిత్తశుద్ధినుండియే పరంపరాక్రమమున ఆ మోక్షము లభించుచున్నది.

క్షీణాయాం వాసనాయాం తు చేతో గలతి సత్వరమ్
క్షీణాయాం శీతసంతత్యాం బ్రహ్మన్ హిమకణో యథా. 9

శీతకాలము ముగిసినతోడనే మంచుతుంపురులు మాసిపోవునట్లు వాసనలు క్షయమైనచో మనస్సు లయమైపోవును.

అయం వాసనయా దేహో ధ్రియతే భూతపంజరః
తనునాంతర్నివిష్టేన ముక్తౌఘస్తంతునా యథా. 10

ముత్యములు లోపల గ్రుచ్చబడిన దారమువలన ధరింపఁబడునట్లు ప్రాణులను పక్షులకు పంజరమగు (లేక పంచభూత నిర్మితమగు దేహపంజరమను) ఈ శరీరము వాసనల బలముననే నిలబడియున్నది.

వాసనా ద్వివిధా ప్రోక్తా శుద్ధా చ మలినా తథా
మలినా జన్మనో హేతుః శుద్ధా జన్మవినాశినీ. 11

వాసనలు రెండువిధములని నుడువబడినవి. అవి శుద్ధములు, మలినములు. మలినవాసనలు జన్మకుఁ గారణములు. శుద్ధవాసనలు జన్మనాశనమునకు దోడ్పడును.

అజ్ఞానసుఘనాకారా ఘనాహంకారశాలినీ
పునర్జన్మకరీ ప్రోక్తా మలినా వాసనా బుధైః. 12

మలినవాసనలు ప్రబలాహంకారమునంజేసి, అజ్ఞానక్షేత్రమున దట్టముగా పెఱిగి, పునర్జన్మఫలము నొసఁగునని పండితులు చెప్పుదురు.

పునర్జన్మాంకురం త్యక్త్వా స్థితా సంభృష్టబీజవత్
దేహార్థం ధ్రియతే జ్ఞాతజ్ఞేయా శుద్ధేతి చోచ్యతే. 13

శుద్ధవాసనలు తత్త్వజ్ఞానమున కనుకూలమైనవి. వీనియందు పునర్జన్మకుపయోగపడు అంకురములుండవు. వీటిపని ఈ శరీరముతోడనే నిలచిపోవును; అవి వేయించబడిన గింజలవంటివి. అని చెప్పుదురు.



అపునర్జన్మకరణీ జీవన్ముక్తేషు దేహిషు
వాసనా విద్యతే శుద్ధా దేహే చక్ర ఇవ భ్రమః. 14

శుద్ధవాసనలు జీవన్ముక్త పురుషునియందు చక్రభ్రమణము♦ వలె నుండును. మరల జన్మను కలుగజేయు సామర్థ్యము వాటికి లేదు.

యే శుద్ధవాసనా భూయో న జన్మానర్థభాజనం
జ్ఞాతజ్ఞేయాస్త ఉచ్యంతే జీవన్ముక్తా మహాధియః. 15

శుద్ధవాసనల నాశ్రయించి తత్త్వజ్ఞానఫలముగ అనర్థమగు పునర్జన్మనుఁ బాసిపోయిన వారందరు జీవన్ముక్తులనంబడుచున్నారు.

జీవన్ముక్తిపదం ప్రాప్తో యథా రామో మహామతిః
తత్తేఽహం శృణు వక్ష్యామి జరామరణశాంతయే. 16

మహామతియగు రాముడెట్లు జీవన్ముక్తస్థితినిఁ బొందెనో, వచించుచున్నాను. జరామరణనాశము కొఱకిద్దానిని వినుము.

భరద్వాజ! మహాబుద్ధే! రామక్రమమిమం శుభమ్
శృణు వక్ష్యామి తేనైవ సర్వం జ్ఞాస్యసి సర్వదా. 17

భరద్వాజా! మహామతీ! రాముని శుభచరిత్రనుఁ జెప్పుచున్నాను వినుము. ఇద్దాని వలననే అంతయు దెలిసికొనగలవు.ȣ

విద్యాగృహాద్వినిష్క్రమ్య రామో రాజీవలోచనః
దివసాన్యనయద్గేహే లీలాభిరకుతోభయః. 18

పద్మలోచనుఁడగు రాముఁడు గురుకులవాసమునుండి, విద్యల ముగించివచ్చి కొన్ని దినములు లీలలందు నిర్భయుడై గడపెను.

అథ గచ్ఛతి కాలే తు పాలయత్యవనిం నృపే
ప్రజాసు వీతశోకాసు స్థితాసు విగతజ్వరమ్. 19

దశరథుని పాలనమున ప్రజల కేవిధమైన దుఃఖములును, జ్వరాది ఉపద్రవములును లేకుండెను; దినములిట్లు జరుగసాగెను.

---

♦ చక్రభ్రమణము:— కుమ్మరివాడు చక్రముబోలు సారెను మాటిమాటికి త్రిప్పుచు కుండలను తయారుచేయును. కుండలు తయారుచేయుట అయిపోయిన నిక సారెను త్రిప్పడు. త్రిప్పకపోయినను పూర్వవేగమున కొంతవరకు సారె అట్లు తిరుగుచునేయుండును. అట్లే వాసనలుకూడ వాటి పూర్వశక్తి ననుసరించి ఆమరణాంతము జీవన్ముక్తునియందు పనిచేయుచుండును. పిదప వాటికి సామర్థ్యముండదు—అను.

ȣ ఏకవిజ్ఞానమున సర్వ విజ్ఞాన ప్రతిజ్ఞ ఈ శ్లోకము తెలుపుచున్నది.

తీర్థపుణ్యాశ్రమశ్రేణీర్ద్రష్టుముత్కంఠితం మనః
రామస్యాభూద్భృశం తత్ర కదాచిత్ గుణశాలినః. 20

రాఘవశ్చిన్తయిత్వైవ ముపేత్య చరణౌ పితుః
హంసః పద్మావివ నవౌ జగ్రాహ నఖకేసరౌ. 21

అప్పుడొకదినమున శ్రీరాముని మనమున తీర్థములను, పవిత్రాశ్రమములను జూడ మిక్కుటమగు కోర్కె పొడమెను. రాఘవుడు చింతించుచు, హంస పద్మముల నాశ్రయించునట్లు నఖకేసరముల (గోళ్లు అను కింజల్కములు) తోగూడిన తండ్రి పాదపద్మముల గ్రహించెను.

శ్రీరామ ఉవాచ:—

తీర్థాని దేవసద్మాని వనాన్యాయతనాని చ
ద్రష్టుముత్కంఠితం తాత! మమేదం నాథ! మానసమ్. 22

శ్రీరాముడు :— దేవా! నా మనస్సు దేవాలయములను, తీర్థములను, తపోవనములనుఁ జూడ ఆతురపడుచున్నది.

తదేతామర్థితాం పూర్వాం సఫలాం కర్తుమర్హసి
న సోఽస్తి భువనే నాథ! త్వయా యోఽర్థీ న మానితః. 23

నా ఈ మొదటికోర్కెను చెల్లింపనగును. జగత్తున నీ వేయర్థికోర్కెను నిరాకరించి యుండలేదు.

ఇతి సంప్రార్థితో రాజా వసిష్ఠేన సమం తదా
విచార్యాముంచ దేవైనం రామం ప్రథమ మర్థినమ్. 24

ఇట్లు ప్రార్థింపఁబడి, దశరథుఁడు వసిష్ఠునితో నాలోచించి, ప్రథమప్రార్థియగు రాముని తీర్థయాత్ర కంగీకరించెను.

శుభే నక్షత్రదివసే భ్రాతృభ్యాం సహ రాఘవః
మంగళాలంకృతవపుః కృతస్వస్త్యయనో ద్విజైః. 25

వసిష్ఠప్రహితైర్విప్రైః శాస్త్రజ్ఞైశ్చ సమన్వితః
స్నిగ్ధైః కతిపయైరేవ రాజపుత్రవరైః సహ. 26

అంబాభిర్విహితాశీర్భిరాలింగ్యాలింగ్య భూషితః
నిరగాత్ స్వగృహాత్తస్మాత్ తీర్థయాత్రార్థముద్యతః. 27

నిర్గతః స్వపురాత్ పౌరైస్తూర్యఘోషేన వాదితః
పీయమానః పురస్త్రీణాం నేత్రైర్భృంగౌఘభంగురైః. 28

గ్రామీణలలనాలోల హస్తపద్మాపనోదితైః
లాజవర్షైర్వికీర్ణాత్మా హిమైరివ హిమాచలః. 29



ఆవర్జయన్ విప్రగణాన్ పరిశృణ్వన్ ప్రజాశిషః
ఆలోకయన్ దిగంతాంశ్చ పరిచక్రామ జాంగలాన్. 30

శుభదినమున శుభనక్షత్రమున రాఘవుఁడును, తమ్ములును మంగళాలంకారముల నలంకరింపఁబడిరి. బ్రాహ్మణులు 'స్వస్తి'నిఁజెప్పిరి. వసిష్ఠుఁడు పంపిన శాస్త్రజ్ఞులగు విప్రులును, ముఖ్యస్నేహితులగు కొందఱు రాజపుత్రులును సహచరులైరి. తల్లులు మాటిమాటికి మూర్కొనుచు, ఆశీర్వదించుచు, అలంకరించిరి. ఇట్లు శ్రీరాముఁడు తీర్థయాత్రకై సంసిద్ధుడై తానుండు గృహమునుండి వెలికివచ్చెను. పురవాసులు 'బాకా'లనూదసాగిరి. పురస్త్రీలు తమకన్నులను తుమ్మెదలతో రాఘవుని వీక్షింపసాగిరి. గ్రామ స్త్రీలు చలించు చేతులతో పేలాలనుఁ జల్లిరి. అప్పుడు రాముడు మంచుతుంపురులతో గప్పఁబడిన హిమాలయమువలె గన్పట్టెను. బ్రాహ్మణులకు దక్షిణల నిచ్చుచు, ప్రజల దీవెనల వినుచు దిగంతముల గాంచుచు, శ్రీరాముఁడడవుల దాటిపోసాగెను.

అథారభ్య స్వకాత్తస్మాత్ క్రమాత్ కోసలమండలాత్
స్నాన దాన తపో ధ్యాన పూర్వకం స దదర్శ హ. 31

నదీతీరాణి పుణ్యాని వనాన్యాయతనాని చ
జంగలాని జనాంతేషు తటాన్యబ్ధి మహీభృతాం. 32

మందాకినీ మిందునిభాం కాళిందీం చోత్పలామలామ్
సరస్వతీం శతద్రూం చ చంద్రభాగామిరావతీమ్. 33

వేణీం చ కృష్ణవేణీం చ నిర్వింధ్యాం సరయూం తథా
చర్మణ్వతీం వితస్తాం చ విపాశాం బాహుదామపి. 34

ప్రయాగం నైమిశం చైవ ధర్మారణ్యం గయాం తథా
వారాణసీం శ్రీగిరిం చ కేదారం పుష్కరం తథా. 35

మానసం చ క్రమసరస్తథైవోత్తరమానసమ్
వడవావదనం చైవ తీర్థబృందం ససాదరం. 36

అగ్నితీర్థం మహాతీర్థమింద్రద్యుమ్నసరస్తథా
సరాంసి సరితశ్చైవ తథా నదహ్రదావలీమ్. 37

స్వామినం కార్తికేయం చ సాలగ్రామం హరిం తథా
స్థానాని చ చతుఃషష్టిం హరేరథ హరస్య చ. 38

నానాశ్చర్యవిచిత్రాణి చతురబ్ధితటాని చ
వింధ్యమందరకుంజాంశ్చ కులశైలస్థలాని చ. 39

రాజర్షీణాం చ మహతాం బ్రహ్మర్షీణాం తథైవ చ
దేవానాం బ్రాహ్మణానాం చ పావనానాశ్రమాఞ్ఛుభాన్. 40

శ్రీరాముఁడు స్వదేశమగు కోసలమునుండి ఆరంభించి, ఉచితరీతి స్నానదాన ఉపవాసాదులను, ధ్యానమును ఒనరించుచు, పవిత్ర నదీతీరములను, అరణ్యములను, ఆశ్రమములను, చిట్టడవులను, సముద్రతీరములను, పర్వతభూములను, గంగాయమునలను, సరస్వతిని, ఐరావతి శతద్రూ, చంద్రభాగలను, వేణీకృష్ణవేణులను, నిర్వింధ్యాసరయూ చర్మణ్వతీనదులను, వితస్తా, బాహుదా, విపాశా నదులను, ప్రయాగ, నైమిశారణ్య, ధర్మారణ్యములను, వారణాసీ, గయా, కేదార, శ్రీశైలములను, పుష్కర, మానసరోవర, చక్రతీర్థ, ఉత్తరమానసములను, బడబాముఖమును, అగ్నితీర్థ, మహాతీర్థములను, ఇంద్రద్యుమ్నసరోవరమును, మఱియు ఇతరనదీ ప్రవాహ సమూహములను, కార్తికేయుని, సాలిగ్రామనారాయణుని, హరిహరుల అరువది నాలుగు స్థానములను, నానావిధ ఆశ్చర్యములతోఁగూడిన నాలుగు సముద్రతీరములను, వింధ్యమందర పర్వత నికుంజములను కులాచలభూములను, ముఖ్యులగు రాజర్షి, బ్రహ్మర్షి, దేవబ్రాహ్మణుల పవిత్ర భూములను ఆశ్రమములను గాంచెను.

భూయో భూయః స బభ్రామ భ్రాతృభ్యాం సహ మానదః
చతుర్ష్వపి దిగంతేషు సర్వానేవ మహీతటాన్. 41

దిగంతముల నన్నిటిని అనుజులతోఁగూడి మఱలమఱల శ్రీరాముఁడు పరిభ్రమించెను.

అమరకిన్నరమానవమానితః సమవలోక్యమహీమఖిలామిమామ్
ఉపయయౌ స్వగృహం రఘునందనో విహృతదిక్ శివలోకమివేశ్వరః 42

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే వైరాగ్యప్రకరణే
తీర్థయాత్రాకరణం నామ తృతీయః సర్గః ॥ 3 ॥

సుర నర కిన్నరుల పూజితుఁడై రాఘవుఁ డీభూమండలము నంతటిని వీక్షించి, శివలోకమున కరుగు ఈశ్వరునివలె నిజపురి కరుదెంచెను.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు వైరాగ్యప్రకరణమున
తీర్థయాత్ర యను తృతీయ సర్గము ॥ 3 ॥



## చతుర్థః సర్గః

శ్రీ వాల్మీకిరువాచ:—

రామః పుష్పాంజలివ్రాతైర్వికీర్ణః పురవాసిభిః
ప్రవివేశ గృహం శ్రీమాన్ జయంతో విష్టపం యథా. 1

వాల్మీకి:— పురవాసులు పుష్పాంజలుల నర్పించగా, శ్రీరాముఁడు, జయంతుఁడు స్వర్గముఁ బ్రవేశించునట్లు రాజభవనమునుఁ బ్రవేశించెను.

ప్రణనామాథ పితరం వసిష్ఠం భ్రాతృబాంధవాన్
బ్రాహ్మణాన్ కులవృద్ధాంశ్చ రాఘవః ప్రథమాగతః. 2

పిదప రాఘవుఁడు తల్లిదండ్రులను, వసిష్ఠునను, జ్ఞాతి భ్రాతృగణమునను, బ్రాహ్మణులను, కులవృద్ధులను నమస్కరించెను.

సుహృద్భిర్మాతృభిశ్చైవ పిత్రా ద్విజగణేన చ
ముహురాలింగితాచారో రాఘవో న మమౌ ముదా. 3

తల్లిదండ్రులు, మిత్రులు, బ్రాహ్మణులు మాటిమాటికి కౌగిళ్ల దేల్పగా రాముఁడానందించెను.

తస్మిన్ గృహే దాశరథేః ప్రియప్రకథనైర్మిథః
జుఘూర్ణుర్మధురై రాశా మృదువంశస్వనైరివ. 4

దశరథుని గృహమున వేణునాదమువంటి రాముని మధుర వాక్యముల నాలించి, అందఱును సంతోషమున తబ్బిబ్బై తిరుగాడసాగిరి.

బభూవాథ దినాన్యష్టౌ రామాగమన ఉత్సవః
సుఖం మత్తజనోన్ముక్తకలకోలాహలాకులః. 5

రాముని ప్రత్యాగమనమున ఎనిమిదిరోజులు ఉత్సవము జరిగెను. అది ఆనందితులగు జనుల కోలాహలముతో నిండియుండెను.

ఉవాస స సుఖం గేహే తతః ప్రభృతి రాఘవః
వర్ణయన్ వివిధాకారాన్ దేశాచారానితస్తతః. 6

అప్పటినుండి రాముఁడు నానావిధ దేశాచారముల వర్ణించుచు, సుఖముగా గృహమున నుండెను.

ప్రాతరుత్థాయ రామోఽసౌ కృత్వా సంధ్యాం యథావిధి
సభాసంస్థం దదర్శేంద్రసమం స్వపితరం తథా. 7

ఉదయమున లేచి సంధ్యావందనాది నిత్యకృత్యముల నెరవేర్చి, సభామధ్యముననున్న దశరథుని గాంచుచుండెడివాడు.

కథాభిః సువిచిత్రాభిః స వసిష్ఠాదిభిః సహ
స్థిత్వా దినచతుర్భాగం జ్ఞానగర్భాభిరాదృతః. 8
జగామ పిత్రానుజ్ఞాతో మహత్యా సేనయాఽఽవృతః
వరాహమహిషాకీర్ణం వనమాఖేటకేచ్ఛయా. 9

అచ్చట ప్రథమయామమును జ్ఞానచర్చయందు గడుపుచుండెడివాడు. పిదప, తండ్రి ఆజ్ఞను గైకొని, మహాసైన్యమును వెంటనిడుకొని; మహిషవరాహములతోగూడిన వనమునకు వేటాడ నరిగెడువాడు.

తత ఆగత్య సదనే కృత్వా స్నానాదికం క్రమమ్
సమిత్రబాంధవో భుక్త్వా నినాయ ససుహృత్ నిశామ్. 10

అటనుండి తిరిగివచ్చి, స్నానాదికము నొనరించి, బంధుమిత్రులతో గూడి భోజన మొనర్చి రాత్రి గడపెడువాడు.

ఏవం ప్రాయదినాచారో భ్రాతృభ్యాం సహ రాఘవః
ఆగత్య తీర్థయాత్రాయాః సమువాస పితుర్గృహే. 11

తీర్థయాత్రనుండి తిరిగివచ్చినపిదప రాఘవుడు, ఇట్లు దైనికకృత్యముల నొనర్చుచు, తమ్ములతోగూడి పితృగృహమున వాస మొనర్పసాగెను.

నృపతిసంవ్యవహారమనోజ్ఞయా సుజనచేతసి చంద్రికయాఽనయా
పరినినాయ దినాని స చేష్టయా స్తుతసుధారసపేశలయాఽనఘ! 12

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే వైరాగ్యప్రకరణే
దివసవ్యవహార నిరూపణం నామ చతుర్థః సర్గః ॥ 4 ॥

అనఘా! రాజులతో సముచితరీతి నెగడుచు, సుజనహృదయముల మనోజ్ఞప్రవర్తన యను మధుర కౌముదీ(=వెన్నెల) రసమున సంతోషింపజేయుచు, రాఘవుఁడు దినములం గడుపసాగెను.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు వైరాగ్యప్రకరణమున
దివసవ్యవహారనిరూపణమను చతుర్థ సర్గము ॥ 4 ॥

---



## పంచమః సర్గః

శ్రీ వాల్మీకిరువాచ:—

అథోనషోడశే వర్షే వర్తమానే రఘూద్వహే
రామానుయాయిని తథా శత్రుఘ్నే లక్ష్మణేఽపి చ. 1
భరతే సంస్థితే నిత్యం మాతామహగృహే సుఖమ్
పాలయత్యవనిం రాజ్ఞి యథావదఖిలామిమామ్. 2
జన్యత్రార్థం చ పుత్రాణాం ప్రత్యహం సహ మంత్రిభిః
కృతమంత్రే మహాప్రాజ్ఞే తజ్జ్ఞే దశరథే నృపే. 3

కృతాయాం తీర్థయాత్రాయాం రామో నిజగృహే స్థితః
జగామానుదినం కార్శ్యం శరదీవామలం సరః. 4

వాల్మీకి:— ఇట్లు గృహమున వసించుచున్న రాముఁడు శరత్కాల సరోవరమువలె కృశింపసాగెను. అప్పుడాతని వయస్సు పదునైదేండ్లు. లక్ష్మణ శత్రుఘ్నులాతని ననుసరించుచుండెడివారు. భరతుఁడు సుఖముగ తాతగారియింట కాలమును వెళ్ళబుచ్చుచుండెను. దశరథుడు భూమండలమునంతటిని నియమానుసారముఁ బాలించుచుండెను. మంత్రులతో పుత్రుల వివాహమును గురించి ప్రాజ్ఞుఁడగు దశరథుఁ డాలోచింపసాగెను. తీర్థయాత్రల నొనరించివచ్చిన రాముఁడు (సంసారదుఃఖమేమియు లేకపోయినను) కృశింపసాగెను.

కుమారస్య విశాలాక్షం పాండుతాం ముఖమాదదే
పాకఫుల్లదళం శుక్లం సాలిమాలమివాంబుజమ్. 5

శ్రీరాముని విశాలలోచన ముఖమండలము పాలిపోయి, భ్రమరచుంబితమును, వికసితమునునగు, తెల్లతామర పూవువలె నాయెను.

కపోలతలసంలీనపాణిః పద్మాసనస్థితః
చింతాపరవశస్తూష్ణీమవ్యాపారో బభూవహ. 6

శ్రీరామచంద్రుడు విచారపరవశుఁడై, చెక్కిలిమీద చేయివైచుకొని, పద్మాసనమున గూర్చుండి, ఏమియునొనర్పక తూష్ణీంభావమును వహించియుండెడువాడు.

కృశాంగశ్చింతయా యుక్తః ఖేదో పరమదుర్మనాః
నోవాచ కస్యచిత్ కించిల్లిపికర్మార్పితోపమః. 7

చింతవల్ల చిక్కి, శ్రీరాముఁడు విమనస్కుడై, బొమ్మవలెనుండి, ఎవరితోడను, ఏమియు మాటలాడకుండెడువాడు.

ఖేదాత్ పరిజనేనాసౌ ప్రార్థ్యమానః పునః పునః
చకారాహ్నికమాచారం పరిమ్లానముఖాంబుజః. 8

సేవకులు మాటిమాటికి విచారముతో ప్రార్థింప, దినకృత్యముల నతికష్టముతో నెరవేర్చెడువాడు. అతని మోము అను దామర వాడువడెను.

ఏవం గుణవిశిష్టం తం రామం గుణగణాకరం
ఆలోక్య భ్రాతరావస్య తామేవాయయతుర్దశామ్. 9

గుణసముద్రుఁడగు రాముని ఈస్థితిఁగాంచి, అతనిసోదరులిద్దరుఁగూడ ఆదేస్థితినిఁ బొందిరి.

తథా తేషు తనూజేషు ఖేదవత్సు కృశేషు చ
సపత్నీకో మహీపాలశ్చింతావివశతాం యయౌ. 10

ఇట్లు పుత్రులు విచారముతో కృశించుచుండుటఁగాంచి, దశరథుడును, ఆయన భార్యలును చింతావివశులైరి.

కా తే పుత్ర! ఘనా చింతేత్యేవం రామం పునః పునః
అపృచ్ఛత్ స్నిగ్ధయా వాచా నైవాకథయదస్య సః. 11

'పుత్రా! నీకున్న చింతయేమి?' అని దశరథుఁడు అనేక పర్యాయములు స్నేహపూర్ణ వాక్యముల బ్రశ్నించినను, రామచంద్రుఁడు దేమియును బల్కలేదు.

న కించిత్తాత! మే దుఃఖమిత్యుక్త్వా పితురఙ్కగః
రామో రాజీవపత్రాక్షః తూష్ణీమేవస్మ తిష్ఠతి. 12

'తండ్రీ! నాకెట్టి దుఃఖమును లేదు!' అని తండ్రి తొడమీదనున్న రాముఁడు పల్కియూరకుండెడువాఁడు.

తతో దశరథో రాజా రామః కిం ఖేదవానితి
అపృచ్ఛత్ సర్వకార్యజ్ఞం వసిష్ఠం వదతాం వరమ్. 13

'రాముఁడు విచారపూరితమనస్కుఁడైనాఁడేల?' అని అనంతరము దశరథుఁడు సర్వకార్యజ్ఞుడును, వాగ్మియును నగు వసిష్ఠునిఁ బ్రశ్నించెను.

ఇత్యుక్తశ్చింతయిత్వా స వసిష్ఠమునినా నృపః
అస్త్యత్ర కారణం శ్రీమాన్ మా రాజన్! దుఃఖమస్తు తే. 14

'దీనికిఁదగుకారణమున్నది, దుఃఖింపకుము' అని దశరథునితో వసిష్ఠుడు ధ్యానమొనరించి పల్కెను.



కోపం విషాదకలనాం వితతం చ హర్షం
నాల్పేన కారణవశేన వహంతి సంతః
సర్గేణ సంహృతిజవేన వినా జగత్యాం
భూతాని భూప నమహాన్తి వికారవన్తి. 15

ఇత్యార్షే వాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే వైరాగ్యప్రకరణే
కార్శ్య నివేదనం నామ పంచమః సర్గః ॥ 5 ॥

రాజా! ధీరులు సామాన్యకారణమునంబేసి, విషాదమును, అత్యంతసంతోషమును, లేక క్రోధమును బొందరు. జగత్తుయొక్క అంగములగు పృథివ్యాదిపంచ మహాభూతములు సృష్టిలేక సంహారముయొక్క వేగములేకుండ వికారమునందునా?

ఇది వాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు వైరాగ్యప్రకరణమున
కార్శ్య నివేదనమను పంచమ సర్గము ॥ 5 ॥

## షష్ఠ సర్గః

శ్రీ వాల్మీకిరువాచ:—

ఇత్యుక్తే మునినాథేన సందేహవతి పార్థివే
ఖేదవత్యాస్థితే మౌనం కించిత్ కాలప్రతీక్షణే. 1

వాల్మీకి:— మునినాథుఁడిట్లుపల్కఁ, సందేహఖేదము లుబికిన చిత్తముతో దశరథుఁడు కొంత కాలము మౌనమును వహించి యూరకుండెను.

పరిఖిన్నాసు సర్వాసు రాజ్ఞీషు నృపసద్మసు
స్థితాసు సావధానాసు రామచేష్టాసు సర్వతః 2
ఏతస్మిన్నేవకాలే తు విశ్వామిత్ర ఇతి శ్రుతః
మహర్షిరభ్యగాత్ ద్రష్టుం తమయోధ్యానరాధిపమ్. 3
తస్య యజ్ఞోఽథ రక్షోభిస్తథా విలులుపే కిల
మాయావీర్యబలోన్మత్తైర్ధర్మకార్యస్య ధీమతః. 4

రక్షార్థం తస్య యజ్ఞస్య ద్రష్టుమైచ్ఛత్స పార్థివమ్
న హి శక్నోత్యవిఘ్నేన సమాప్తుం స మునిః క్రతుమ్. 5

రాజులందరును రాజమందరమున ఖిన్నులైయుండిరి; రాముని నడవడిపై తమదృష్టినుంచి సావధానత దాల్చియుండిరి. ఇట్టి సమయమునఁ బ్రసిద్ధుడగు విశ్వామిత్రమహర్షి అయోధ్యాపతియగు దశరథునిగాంచుట కరుదెంచెను. మాయాబలోన్మత్తులగు రాక్షసుల పీడవలన బుద్ధిమంతుడగు విశ్వామిత్రుని యజ్ఞము సంపూర్ణమవలేదు; యజ్ఞరక్షణకై రాజునుఁజూడ నిచ్ఛించెను.

తతస్తేషాం వినాశార్థముద్యతస్తపసాం నిధిః
విశ్వామిత్రో మహాతేజా అయోధ్యామభ్యగాత్ పురీమ్. 6

పిదప, మహాతేజుఁడును తపోనిధియునగు విశ్వామిత్రుఁడు రాక్షసుల జంప నడుముకట్టి అయోధ్యకరుదెంచెను.

స రాజ్ఞో దర్శనాకాంక్షీ ద్వారాధ్యక్షానువాచ హ
శీఘ్రమాఖ్యాత మాం ప్రాప్తం కౌశికం గాధినః సుతమ్. 7
తస్య తద్వచనం శ్రుత్వా ద్వాస్థా రాజగృహం యయుః
సంభ్రాంతమనసః సర్వే తేన వాక్యేన చోదితాః. 8
తే గత్వా రాజసదనం విశ్వామిత్రమృషిం తతః
ప్రాప్తమావేదయామాసుః ప్రతిహారాః పతేస్తదా. 9

ఆయన రాజుంజూడగోరి ద్వారపాలకులతో రాజునకు గాధినందను డరుదెంచినాడని దెల్పవచించెను. వారామాటలవిని సంభ్రాంతచిత్తులై రాజగృహమున కఱిగిరి; అఱిగి, విశ్వామిత్రుని అగమన వార్తను దమప్రభున కెరింగించిరి.

అథాస్థానగతం భూపం రాజమండల మాలినమ్
సముపేత్య త్వరాయుక్తో యాష్టీకోఽసౌ వ్యజిజ్ఞపత్. 10
దేవ ద్వారి మహాతేజా బాలభాస్కరభాసురః
జ్వాలారుణజటాజూటః పుమాన్ శ్రీమానవస్థితః 11
సభాసురపతాకాంతం సాశ్వేభపురుషాయుధమ్
కృతవాంస్తం ప్రదేశం యస్తేజోభిః కీర్ణకాంచనమ్. 12
ఉచ్యమానే తు యాష్టీకే నివేదయతి రాజని
విశ్వామిత్రో మునిః ప్రాప్త ఇత్యనుద్ధతయా గిరా. 13

అనంతరము ద్వారపాలకులలో ముఖ్యుడగు యాష్టీకుఁడు సామంతరాజ పరివేష్టితుఁడై అధివసించియున్న [illegible]నికడ కరుదెంచి ఇట్లు విన్నవించెను. దేవా! బాలసూర్యునివలె ప్రకాశించు తేజస్వియొకడు ద్వారదేశమున [illegible] అతని జటలు అగ్నిశిఖలవలె తామ్రవర్ణములు. అతని తేజస్సు



నంజేసి ఏనుగలు, గుఱ్ఱములు, ఆయుధములు ఇత్యాదులగు వస్తువులన్నియు బంగారు రంగును దాల్చినవి. అప్పుడు దశరథుడు యాష్టీకుని వైపు దృష్టిని మరల్చ, నతడతివినయముతో విశ్వామిత్ర మహర్షి అరుదెంచినాడని విన్నవించెను.

ఇతి యాష్టీకవచనమాకర్ణ్య నృపసత్తమః
స సమంత్రీ ససామంతః ప్రోత్తస్థౌ హేమవిష్టరాత్. 14

ఈ మాటల వినినంతనే దశరథుడు మంత్రులు, సామంతులతో సహితముగ, బంగారు గద్దె నుండి లేచెను.

పదాతిరేవ సహసా రాజ్ఞాం వృందేన మాలితః
వసిష్ఠవామదేవాభ్యాం సహ సామంతసంస్తుతః. 15
జగామ యత్రతత్రాసౌ విశ్వామిత్రో మహామునిః
దదర్శ మునిశార్దూలం ద్వారభూమావవస్థితమ్. 16
కేనాపి కారణేనోర్వీతలమర్కముపాగతమ్
బ్రాహ్మేణ తేజసా క్రాంతం క్షాత్రేణ చ మహౌజసా. 17

దశరథుఁడు వసిష్ఠ వామదేవులు వెంటరా, సామంతులు స్తుతించుచుండ, ద్వారదేశముఁ కఱిగి, బ్రహ్మక్షత్రియ తేజములతో బ్రకాశించుచున్న విశ్వామిత్ర మహర్షిం గాంచెను. ఆ ప్రకాశముం గాంచిన, యే కారణముననో సూర్యుడు భూమికిం దిగివచ్చెనా యని యనిపించుచుండెను.

జరాజరఠయా నిత్యం తపఃప్రసరరూక్షయా
జటావల్ల్యావృతస్కంధం ససంధ్యాభ్రమివాచలమ్. 18

వార్ధక్యమగుటజేసి కేశములు నెరసెను. తపస్సువలన శరీరము మోటువారెను. జటలచే నాతని భుజములు కప్పబడి, సాయంకాలమేఘములచే గప్పబడిన పర్వతమా యనునట్లుండెను.

ఉపశాంతం చ కాంతం చ దీప్తమప్రతిఘాతి చ
నిభృతం చోర్జితాకారం దధానం భాస్వరం వపుః. 19
పేశలేనాతిభీమేన ప్రసన్నేనాకులేన చ
గంభీరేణాతిపూర్ణేన తేజసా రంజితప్రభమ్. 20
అనంతజీవితదశా సఖీమేకామనిందితామ్
ధారయంతం కరే శ్లక్ష్ణాం కుండీమమ్లానమానసమ్. 21
కరుణాక్రాంతచేతస్త్వాత్ ప్రసన్నైః మధురాక్షరైః
వీక్షణైరమృతేనేవ సంసించన్తమిమాః ప్రజాః. 22
యుక్తయజ్ఞోపవీతాంగం ధవళప్రోన్నతభ్రువమ్
అనంతం విస్మయం చాంతః ప్రయచ్ఛన్తమివేక్షితుః. 23

మునిమాలోక్య భూపాలో దూరాదేవానతాకృతిః
ప్రణనామ గలన్మౌలి మణిమాలితభూతలమ్. 24

అతని శరీరము దీప్తిమంతమును, ప్రశాంతమును, సౌఖ్యమును, ఉజ్వలమును, బలిష్ఠమును నై యుండెను. మనోజ్ఞమును, భీషణమును, ప్రసన్నమును, జటిలమును, విశాలమును, గంభీరమును నగు అతని శరీర తేజము ప్రభను గల్పించుచుండెను. అతని చేతియందు జీవితసఖుఁడగు కమండలముండెను; చిత్తము ప్రసన్నమై యుండెను. కరుణతోఁగూడిన చిత్తము గలవాడగుటఁజేసి, తియ్యనిమాటలతోడను, అమృత వీక్షణములతోడను జనులను దనుపుచుండెను. యజ్ఞోపవీతముండెను. కనుబొమ్మలు తెల్లపడెను. అవి ఉన్నతములు. చూచువారల కాతడు ఆశ్చర్యమును గలిగించుచుండెను.

(ఇట్టి) మహర్షిని దూరముననే గాంచియే వినయావనతశిరస్కుఁడై దశరథుఁడు, కిరీటపరిశోభితమస్తకమును భూతలమునందుంచి ప్రణమిల్లెను.

మునిరప్యవనీనాథం భాస్వానివ శతక్రతుమ్
తత్రాభివాదయాంచక్రే మధురోదారయా గిరా. 25

సూర్యుడింద్రునకు ప్రత్యభివందన మొనర్చునట్లు, విశ్వామిత్రుడు గూడ, మధురములగు ఆదరవాక్యములతో ప్రత్యభివాద మొనర్చెను.

తతో వసిష్ఠప్రముఖాః సర్వ ఏవ ద్విజాతయః
స్వాగతాదిక్రమేణైనం పూజయామాసురాదృతాః. 26

పిదప, వసిష్ఠాది బ్రాహ్మణులు స్వాగతవచనములబల్కి ఆదరముతో యథోచిత సపర్యల సల్పిరి.

దశరథ ఉవాచః—

అశంకితోపనీతేన భాస్వతా దర్శనేన తే
సాధో స్వనుగృహీతాః స్మో రవిణేవాంబుజాకరాః. 27

దశరథుడు:— సాధుపుంగవా! సూర్యునివలన పద్మము లనుగ్రహింపఁబడినట్లు, మీ యీ పవిత్ర దర్శనమువలన మేమనుగ్రహింపబడినాము.

యదనాది యదక్షుణ్ణం యదపాయవివర్జితమ్
తదానందసుఖం ప్రాప్తం మయా త్వద్దర్శనాన్మునే. 28

శ్రేష్ఠా! నీ దర్శనమునఁజేసి, వృద్ధిక్షయములులేని ఆ అనంతసుఖము నందితిని.

అద్య వర్తామహే నూనం ధన్యానాం ధురి ధర్మతః
భవదాగమనస్యేమే యద్వయం లక్ష్యమాగతాః. 29

మీ దృష్టి మా మీద పడినందువలన ధర్మబలమున నేడు మేము ధన్యులలో నగ్రగణ్యుల



ఏవం ప్రకథయంతోఽత్ర రాజానోఽథ మహర్షయః
ఆసనేషు సభాస్థానమాసాద్య సముపావిశన్. 30

ఇట్లు దశరథుఁడును, మహర్షులును పల్కుచు సభాగృహమునఁ బ్రవేశించి, ఆసనముల నలంకరించిరి.

స దృష్ట్వా జ్వలితం లక్ష్మ్యా భీతస్తమృషిసత్తమమ్
ప్రహృష్టవదనో రాజా స్వయమర్ఘ్యం న్యవేదయత్. 31

తపోలక్ష్మిచే నలంకరింపఁబడిన విశ్వామిత్రునిగాంచి అపరాధము గలుగునేమో యని భయపడుచు, నగుమోముతో దశరథుఁడు అర్ఘ్యము నర్పించెను.

స రాజ్ఞః ప్రతిగృహ్యార్ఘ్యం శాస్త్రదృష్టేన కర్మణా
ప్రదక్షిణం ప్రకుర్వంతం రాజానం పర్యపూజయత్. 32

విశ్వామిత్రుడు శాస్త్రోచితరీతి అర్ఘ్యము గైకొని, ప్రదక్షిణమొనర్చుచున్న దశరథునిఁ బ్రశంసించెను.

స రాజ్ఞా పూజితస్తేన ప్రహృష్టవదనస్తదా
కుశలం చావ్యయం చైవ పర్యపృచ్ఛన్నరాధిపమ్. 33

విశ్వామిత్రుడు (ఇట్లు) పూజితుడై, ప్రసన్నవదనుడై దశరథుని కుశలప్రశ్న మొనరించెను. ఆర్థికవిషయముల నడిగెను.

వసిష్ఠేన సమాగమ్య ప్రహస్య మునిపుంగవః
యథార్హం చార్చయిత్వైనం పప్రచ్ఛానామయం తతః. 34

(పిదప) వసిష్ఠునిఁ గలసికొని యథోచితమగు గౌరవముఁజూపి నవ్వుచు, శిష్యమృగపక్ష్యాదుల కుశలమునుఁ బ్రశ్నించెను.

క్షణం యథార్హమన్యోన్యం పూజయిత్వా సమేత్య చ
తే సర్వే హృష్టమనసో మహారాజ నివేశనే. 35

యథోచితాసనగతా మిథః సంవృద్ధతేజసః
పరస్పరేణ పప్రచ్ఛుః సర్వేఽనామయమాదరాత్. 36

వారందరు రాజభవనమున ఆసీనులై, ఒండొరుల పలుకరించుకొనుచు, ఆనందమనస్కులైరి. వారి తేజస్సు వృద్ధినందెను. (అప్పుడు) వారు, పరస్పరము కుశలప్రశ్న నొనరించుకొనసాగిరి.

ఉపవిష్టాయ తస్మై స విశ్వామిత్రాయ ధీమతే
పాద్యమర్ఘ్యం చ గాం చైవ భూయోభూయో న్యవేదయత్. 37

ఆసీనుడైన విశ్వామిత్రునకు దశరథుడు గంధ పుష్ప వస్త్రాలంకారములను, గోవులను, దక్షిణలను, ఫలతాంబూలములను విరివిగా నర్పించెను.

అర్చయిత్వా తు విధివద్విశ్వామిత్ర మభాషత
ప్రాంజలిః ప్రయతో వాక్యమిదం ప్రీతమనా నృపః. 38

విశ్వామిత్రుని విధివిహితముగా పూజించి, ప్రీతుడై, చేతులు జోడించి, వినయముతో దశరథుడిట్లనెను.

యథాఽమృతస్య సంప్రాప్తిర్యథా వర్ష మవర్ష కే
యథాంధస్యేక్షణప్రాప్తిర్భవదాగమనం తథా. 39
యథేష్టదారాసంపర్కాత్ పుత్రజన్మాఽప్రజానతః
స్వప్నదృష్టార్థలాభశ్చ భవదాగమనం తథా. 40
యథేప్సితేన సంయోగ ఇష్టస్యాగమనం యథా
ప్రనష్టస్య యథా లాభో భవదాగమనం తథా. 41
యథా హర్షో నభోగత్యా మృతస్య పునరాగమాత్
తథా త్వదాగమాత్ బ్రహ్మన్ స్వాగతం తే మహామునే. 42

'మానవున కమృతముదొరకినట్లు, కఱువురోజులలో వర్షము కురిసినట్లు, అంధునకు దృష్టి లభించినట్లు మీ దర్శనము మాకు లభించినది. సంతానహీనుడగు మనుజునకు వాంఛితవనితాసంగమమున పుత్రుడుకలిగినట్లు, కలలోగాంచిన వస్తువుదొరకినట్లు, చాలరోజులనుండి కోరువస్తువు లభించినట్లు, ఇష్టులగువా రరుదెంచినట్లు, పోయినది మరల దొరకినట్లు, మీ దర్శనము మాకు లభించినది. ఆకాశగమనము వలనను, మృతుడగువాడు మరల జీవించినను కలుగు ఆనందము మీ రాకవలన మాకుఁ గల్గినది. మీకు సుస్వాగతము!

బ్రహ్మలోకనివాసో హి కస్య న ప్రీతిమావహేత్
మునే తవాగమస్తద్వత్ సత్యమేవ బ్రవీమి తే. 43

'బ్రహ్మలోక నివాసమెవనికి ఆనందముగొల్పదు? మీ రాక అట్టిది. సత్యమును వచింపుచున్నాను.

కశ్చ తే పరమః కామః కిం చ తే కరవాణ్యహమ్
పాత్రభూతోఽసి మే విప్ర ప్రాప్తః పరమధార్మికః. 44

'తమకోర్కె ఎద్ది? నే నేమి యొనర్పగలను? ధర్మపరాయణులును, దానపాత్రులును అగు తామరుదెంచితిరి.

పూర్వం రాజర్షి శబ్దేన తపసా ద్యోతితప్రభః
బ్రహ్మర్షిత్వమనుప్రాప్తః పూజ్యోఽసి భగవన్ మయా. 45

'పూర్వము తాము తపోకాంతుల వెదజల్లు రాజర్షులు; తపోబలమున బ్రహ్మర్షులైన తాము మాకు పూజనీయులు.



గంగాజలాభిషేకేన యథా ప్రీతిర్భవేన్మమ
తథా త్వద్దర్శనాత్ ప్రీతిరంతః శీతయతీవ మామ్. 46

'గంగాస్నానమున తాపము శమించునట్లు, మీ దర్శనమునంజేసి అంతఃకరణము చల్లబడినది.

విగతేచ్ఛా భయక్రోధో వీతరాగో నిరామయః
ఇదమత్యద్భుతం బ్రహ్మన్ యద్భవాన్మాముపాగతః. 47

'మీకు ఇచ్ఛాభయక్రోధములు, కోర్కెలు, రోగములులేవు. అయినను మీరు నా కడ కరుదెంచితిరి. ఆశ్చర్యము!

శుభక్షేత్రగతం చాహమాత్మాన మపకల్మషమ్
చంద్రబింబ ఇవోన్మగ్నం వేదవేద్యవిదాం వర. 48

'ఓ తత్త్వజ్ఞశ్రేష్ఠుడా! మీరాకవలన నా గృహము ఆత్మయు పవిత్రములైనవి. నే నానందమున అమృతమయమగు చంద్రమండలమున దేలియాడుచున్నాను.

సాక్షాదివ బ్రహ్మణో మే తవాభ్యాగమనం మతమ్
పూతోఽస్మ్యనుగృహీతశ్చ తవాభ్యాగమనాన్మునే. 49

'మీ రాక చతుర్ముఖుని రాకయేయని భావించుచున్నాను; మీరాకవలన నే ననుగ్రహింప ... కనైతిని.

త్వదాగమనపుణ్యేన సాధో యదనురంజితమ్
అద్య మే సఫలం జన్మ జీవితం తత్ సుజీవితమ్. 50

'సాధువరేణ్యా! మీరాకవలన లభించిన పుణ్యమునఁజేసి, నా జీవితము సఫలమైనది. నా జన్మ సార్థకమైనది.

త్వామిహాభ్యాగతం దృష్ట్వా ప్రతిపూజ్య ప్రణమ్య చ
ఆత్మన్యేవ న మామ్యంతర్దృష్ట్వేందుం జలధిర్యథా. 51

చంద్రోదయమున సాగరముబ్బి తబ్బిబ్బైనట్లు, మిమ్ముల పూజించి, నమస్కరించి ఆనందమును బట్టజాలకున్నాను.

యత్కార్యం యేనవార్థేన ప్రాప్తోఽసి మునిపుంగవ
కృతమిత్యేవ తద్విద్ధి మాన్యోఽసీతి సదా మమ. 52

'మునిపుంగవా! మీ రెద్దాని కొఱకు, ఎందులకు అరుదెంచితిరో, అయ్యది నెరవేర్పబడినదనియే యెంచునది. మీరు మాకు మాన్యులుకదా!

స్వకార్యే నవిమర్శం త్వం కర్తుమర్హసి కౌశిక
భగవన్నాస్త్యదేయం మే త్వయి యత్ ప్రతిపద్యతే. 53

'భగవానుడా! కౌశికా! ప్రయోజనమును గుఱించి అడుగుటకు సంకోచింపవలదు. మీ కియ్యదగని దేమున్నది?

కార్యస్య నవిచారం త్వం కర్తుమర్హాసి ధర్మతః
కర్తా చాహమశేషం తే దైవతం పరమం భవాన్. 54

'సంకోచింపవలదు. మీ కార్యమును సంపూర్ణ మొనరించు భారమునాది. మీరు మాకు పరదేవతలు.'

ఇదమతి మధురం నిశమ్య వాక్యం శ్రుతి సుఖమాత్మవిదా వినీతముక్తమ్
ప్రథితగుణయశా గుణై ర్విశిష్టం మునివృషభః పరమం జగామ హర్షమ్. 55

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే వైరాగ్య
ప్రకరణే విశ్వామిత్రాభ్యాగమనం నామ
షష్ఠః సర్గః ॥ 6 ॥

ఆత్మవేత్తయు, పరేంగితజ్ఞానియునగు, మునివృషభుడు వినయముతో నొప్పారు దశరథుని శ్రుతిమధురవాక్యములను విని పరమానందము నొందెను.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు వైరాగ్య ప్రకరణమున
విశ్వామిత్రాభ్యాగమనము అను
షష్ఠ సర్గము ॥ 6 ॥



## సప్తమః సర్గః.

శ్రీ వాల్మీకిరువాచః—

తచ్ఛ్రుత్వా రాజసింహస్య వాక్యమద్భుత విస్తరమ్
హృష్టరోమా మహాతేజా విశ్వామిత్రోఽభ్యభాషత. 1

వాల్మీకి:- మహాతేజుఁడగు విశ్వామిత్రుడు రాజసింహుడగు దశరథుని అద్భుతవాక్యములవిని పులకితశరీరుడై ఇట్లుపల్కెను.

సదృశం రాజశార్దూల తవైవైతన్మహీతలే
మహావంశప్రసూతస్య వసిష్ఠవశవర్తినః. 2

రఘువంశమునజన్మించి, వసిష్ఠుని ఆజ్ఞల మెలగుచున్న, నీకొక్కనికే ఇట్టి ఔదార్యము తగును.



యత్తుమే హృద్గతం వాక్యం తస్యకార్యవినిర్ణయమ్
కురుత్వం రాజశార్దూల ధర్మం సమనుపాలయ. 3

రాజశార్దూలా! నామనస్సున నున్నదానిని విని, కార్యమును నిర్ణయించుకొని ధర్మరక్షణము నొనర్పుము.

అహం ధర్మం సమాతిష్ఠే సిద్ధ్యర్థం పురుషర్షభ
తస్యవిఘ్నకరా ఘోరా రాక్షసా మమ సంస్థితాః, 4

పురుషశ్రేష్ఠా! నేను యజ్ఞసిద్ధి కొఱకారంభించినప్పుడు విఘ్నదాయకులగు రాక్షసులు వచ్చి చేరుచున్నారు.

యదా యదాతు యజ్ఞేన యజేఽహం విబుధవ్రజాన్
తదాతదాతు మే యజ్ఞం వినిఘ్నంతి నిశాచరాః. 5

నేను దేవతల కొఱకు యజ్ఞము నారంభించినప్పుడెల్ల రాక్షసులు వచ్చి దానిని పాడుచేయుచున్నారు.

బహుశో విహితే తస్మిన్ మయా రాక్షసనాయకాః
అకిరంస్తే మహీం యాగే మాంసేన రుధిరేణచ. 6

నేను యజ్ఞమును అనేకపర్యాయములారంభించితిని; ప్రతిపర్యాయము రాక్షసనాయకులరుదెంచి, రక్తమాంసముల యజ్ఞభూమిని గప్పివేయుచున్నారు.

అవధూతే తథాభూతే తస్మిన్ యాగకదంబకే
కృతశ్రమో నిరుత్సాహ స్తస్మాద్దేశా దుపాగతః. 7

ఇట్లారంభించిన యజ్ఞములన్నియు చాల శ్రమపడినను, పాడైపోవుటచే నిరుత్సాహముతో నిట కరుదెంచితిని.

నచ మేక్రోధముత్స్రష్టుం బుద్ధిర్భవతి పార్థివ
తథాభూతంహి తత్ కర్మ నశాప స్తస్య విద్యతే. 8

క్రోధమువలన (శాపమిచ్చి) వారిని నశింపజేయ ఇచ్ఛ పొడమకున్నది; ఆ యజ్ఞ మొనర్చునప్పుడు క్రోధాదులను త్యజింపవలెను. క్రోధమును దెచ్చుకొనకుండ శాపమీయలేము కదా!

ఈదృశీ యజ్ఞదీక్షా సా మమ తస్మిన్మహాక్రతౌ
త్వత్ప్రసాదాదవిఘ్నేన ప్రాపయేయం మహాఫలమ్. 9

యజ్ఞనియమమిట్టిది. నీ యనుగ్రహమున ఆ మహాయజ్ఞమును నిర్విఘ్నముగానొనరించి మహాఫలము నందగలను.

త్రాతుమర్హసి మామార్తం శరణార్థినమాగతమ్
అర్థినాం యన్నిరాశత్వం సత్తమేఽభిభవోహి సః. 10

నేనార్తుడను, శరణాపన్నుడను. నన్ను రక్షించుట నీ ధర్మము. అర్థులను నిరసించుట గొప్పవారికి నింద.

తవాస్తి తనయః శ్రీమాన్ దృప్తశార్దూలవిక్రమః
మహేన్ద్రసదృశో వీర్యే రామో రక్షోవిదారణః. 11
తం పుత్రం రాజశార్దూల రామం సత్యపరాక్రమం
కాకపక్షధరం శూరం జ్యేష్ఠం మే దాతుమర్హసి. 12

రాజశార్దూలా! శార్దూలపరాక్రమముడును, ఇంద్రసమబలుడును, సత్యపరాక్రమముడును, జ్యేష్ఠుడును, కాకపక్షధరుడును, అగు రాముడు రాక్షస వినాశ మొనర్పగలడు. వానిని నాకిమ్ము (అనగా నా వెంట బంపుము.)

శక్తో హ్యేష మయా గుప్తో దివ్యేన స్వేనతేజసా
రాక్షసా యేఽపకర్తార స్తేషాంమూర్ధవినిగ్రహే. 13

నా దివ్యతేజమువలన రక్షింపబడి, రాముడు రాక్షసుల సంహరింపగలడు.

శ్రేయశ్చాస్య కరిష్యామి బహురూప మనన్తకమ్
త్రయాణామపి లోకానాం యేన పూజ్యో భవిష్యతి. 14

నానావిధములగు (అస్త్రములనొసంగి) శ్రేయములను రామునకుఁగూర్చుదును. దాన నాతడు త్రిలోక పూజితుఁడగును.

నచ తే రామమాసాద్య స్థాతుం శక్తా నిశాచరాః
క్రుద్ధం కేసరిణం దృష్ట్వా వనే తృణ ఇవైణకాః. 15

కోపించిన సింహము ముంగల లేళ్లు నిలఁబడలేనట్లు, రాముని ముందర రాక్షసులు నిలంబడజాలరు.

తేషాం నచాన్యః కాకుత్స్థాద్యోద్ధు ముత్సహతే పుమాన్
ఋతే కేసరిణః క్రుద్ధాన్మత్తానాం కరిణామివ. 16

మదించిన ఏనుగు నెదుర్కొన సింహముకాక, అన్నిమృగములుత్సహించనట్లు, వారితో శ్రీరాముడుతప్ప ఇతరులు యుద్ధమొనర్ప నుత్సహించరు.

వీర్యోత్సిక్తాహి తే పాపాః కాలకూటోపమా రణే
ఖరదూషణయోర్భృత్యాః కృతాన్తాః కుపితా ఇవ. 17
రామస్య రాజశార్దూల సహిష్యంతే న సాయకాన్
అనారతగతా ధారా జలదస్యేవ పాంసవః. 18

రాజశార్దూలా! బలగర్వితులును, పాపులును, విషప్రాయులును, యమనిభులును నగు ఖరదూషణభృత్యులు, ధూళిపుంజములు ఎడతెగని వర్షధారల సహింపజాలనట్లు, శ్రీరాముని శరముల (= బాణముల) సహింపజాలరు.

నచ పుత్రకృతం స్నేహం కర్తుమర్హసి పార్థివ
నతదస్తి జగత్యస్మిన్ యన్న దేయం మహాత్మనామ్. 19

పుత్రునిపై మమతను జూపఁదగదు; మహాత్ములకీయదగని దీ ప్రపంచమున లేదుగదా!



హన్త నూనం విజానామి హతాంస్తాన్ విద్ధి రాక్షసాన్
న హ్యస్మదాదయః ప్రాజ్ఞాః సందిగ్ధే సంప్రవృత్తయః. 20

రాక్షసుల జంపబడినవారినిగా నే నెఱుంగుదును, నీవును అట్లే గ్రహించునది. మమ్ముబోలు ప్రాజ్ఞులు సందిగ్ధవిషయముల బ్రవృత్తులవరు.

అహం వేద్మి మహాత్మానం రామం రాజీవలోచనం
వసిష్ఠశ్చ మహాతేజా యేచాన్యే దీర్ఘదర్శినః. 21

కమలలోచనుడును, మహాత్ముడునునగు రాముని నే నెఱుంగుదును. వసిష్ఠుడాదిగాగల జ్ఞానులుగూడ ఎఱుంగుదురు.

యది ధర్మో మహత్త్వంచ యశస్తే మనసి స్థితమ్
తన్మహ్యం సమభిప్రేత మాత్మజం దాతుమర్హసి. 22

ధర్మము, మహత్త్వము, యశము వీటియొక్క కాంక్ష నీకుండిన నేకోరిన పుత్రుని ఒసంగునది.

దశరాత్రశ్చ మే యజ్ఞో యస్మిన్ రామేణ రాక్షసాః
హన్తవ్యా విఘ్నకర్తారో మమ యజ్ఞస్య వైరిణః. 23

నా యజ్ఞము పది దివసములుపట్టును. ఇందు యజ్ఞవైరులగు రాక్షసులు రామునివలన సంహరింపబడుదురు.

అత్రాప్యనుజ్ఞాం కాకుత్స్థ దదతాం తవ మన్త్రిణః
వసిష్ఠప్రముఖాః సర్వే తేన రామం విసర్జయ. 24

శ్రీరాముని నాతో బంపుటకుగాను, మంత్రులకును వసిష్ఠాది ప్రముఖులకును, ఆజ్ఞనొసగుము.

నాత్యేతి కాలః కాలజ్ఞ యథాయం మమ రాఘవ
తథా కురుష్వ భద్రం తే మాచ శోకే మనః కృథాః. 25

సమయజ్ఞుడవగు దశరథుడా! నాసమయము నష్టమవకుండునట్లు చూడుము. నీకు శుభమగుగాక పుత్రునకు కీడు గలుగునని శంకింపకుము.

కార్యమణ్వపి కాలేతు కృతమేత్యుపకారతామ్
మహదప్యుపకారోఽపి రిక్తతామేత్యకాలతః. 26

సమయమునకుఁ దగినట్లు కొంచెము సాయమొర్చినను, అది ఉపకారమగును. అవసరములేనప్పుడొనర్చిన గొప్పసాయము ఉపకారముక్రింద పరిగణింపబడదు.

ఇత్యేవముక్త్వా ధర్మాత్మా ధర్మార్థసహితం వచః
విరరామ మహాతేజా విశ్వామిత్రో మునీశ్వరః. 27

ధర్మాత్ముడగు విశ్వామిత్రుడిట్లు ధర్మవాక్యములుపల్కి యూరకుండెను.

శ్రుత్వా వచో మునివరస్య మహానుభావ
స్తూష్ణీమతిష్ఠ దుపపన్నపదం స వక్తుమ్
నోయుక్తియుక్తకథనేన వినైతి తోషం
ధీమానపూరితమనోఽభిమతశ్చ లోకః. 28

ఇత్యార్షే వాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే వైరాగ్య
ప్రకరణే విశ్వామిత్రవాక్యం నామ
సప్తమః సర్గః ॥ 7 ॥

రాజు మునీంద్రుని పల్కుల విని ప్రత్యుత్తరమీయ ఆలోచించుచు, కొంతసేపు మౌనమును వహించి యూరకుండెను. బుద్ధిమంతులును, అపూర్ణ మనోరథులును నగువారు యుక్తియుక్తములగు వాక్యములగాక, సంతోషముఁబడయరు.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు వైరాగ్య
ప్రకరణమున విశ్వామిత్రవాక్యమను
సప్తమ సర్గము ॥ 7 ॥



## అష్టమః సర్గః.

---

శ్రీ వాల్మీకిరువాచః—

తచ్ఛ్రుత్వా రాజశార్దూలో విశ్వామిత్రస్య భాషితమ్
ముహూర్తమాసీన్నిశ్చేష్టః సదైన్యం చేదమబ్రవీత్. 1

వాల్మీకి:– దశరథుఁడు విశ్వామిత్రుని పల్కుల నాలించి, కొంతసేపు నిశ్చేష్టుండై, దైన్యముతోనిట్లు పల్కెను.

ఊనషోడశవర్షోఽయం రామో రాజీవలోచనః
న యుద్ధయోగ్యతామస్య పశ్యామి సహరాక్షసైః. 2

కమలలోచనుఁడగు రాముని వయస్సు పదునైదేండ్లు. రాక్షసులతో యుద్ధమొనర్పగలశక్తి వానికున్నదని నే ననుకొనను.



ఇయమక్షౌహిణీ పూర్ణా యస్యాః పతిరహం ప్రభో
తయా పరివృతో యుద్ధం దాస్యామి పిశితాశినామ్. 3

ప్రభూ! ఈ యక్షౌహిణీ సంఖ్యాసైన్యమునకు నేనధిపతిని. నేనీ సైన్యమునునడిపి రాక్షసులతో యుద్ధమొనర్చెదను.

ఇమేహి శూరా విక్రాంతా భృత్యా మంత్ర విశారదాః
అహం చైషాం ధనుష్పాణిర్గోప్తా సమరమూర్ధని. 4

ఈ శూరులందరును బలపరాక్రమ సంపన్నులు; యుక్తిపరులు. నేను ధనుస్సును గైకొని రణరంగమున నిలంబడి వారిని రక్షింతును.

ఏభిః సహైవ వీరాణాం మహేంద్రమహతామపి
దదామి యుద్ధం మత్తానాం కరిణామివ కేసరీ. 5

సింహము మదపుటేనుగు నెదుర్కొనునట్లు, ఇంద్రునికంటె గొప్పవారగు వీరులం గూడ నెదుర్కొనఁ గలను.

బాలో రామస్త్వనీకేషు న జానాతి బలాబలమ్
అంతఃపురాదృతే దృష్ట్వా నానేనాన్యా రణావనిః. 6

బాలుఁడగు రాముడు సైన్యముల బలాబలములు నెఱుఁగడు; పురమధ్యమున వినోదార్థము కల్పింపఁబడిన రణరంగమును గాక, అసలైన యుద్ధక్షేత్రము నాతడు చూచియుండలేదు.

న శస్త్రైః పరమైర్యుక్తో న చ యుద్ధవిశారదః
న వాస్త్రైః శూరకోటీనాం తజ్జ్ఞః సమరభూమిషు. 7

అతఁడు అస్త్రశస్త్రముల నెఱుఁగడు; యుద్ధమున నేర్పరిగాడు; లెక్కకు మించిన వారల నెల్లెదుర్కొనవలయునో అతఁడెఱుగడు.

కేవలం పుష్పఖండేషు నగరోపవనేషు చ
ఉద్యానవనకుంజేషు సదైవ పరిశీలనమ్ 8

విహర్తుమేవ జనాతి సహ రాజకుమారకైః
కీర్ణపుష్పోపహారాసు స్వకాస్వజిరభూమిషు. 9

కేవలము ఉద్యానవనముల యందునను, నగరనికుంజములందునను విహరించుటయు, మిత్రులతోఁగూడి పూలురాలిన ప్రాంగణభూముల సంచరించుటయు నతఁడెఱుంగును.

అద్య త్వతితరాం బ్రహ్మన్ మమ భాగ్యవిపర్యయాత్
హిమేనేవ హి పద్మాభః సంపన్నో హరిణః కృశః. 10

నా దురదృష్టము! రాముఁడిప్పుడు మంచుకుఱిసిన సరోవరమువలె, శోభావిహీనుఁడై పాలి పోయి కృశించుచున్నాఁడు.

నాత్తుమన్నాని శక్నోతి నవిహర్తుం గృహావనిమ్
అంతఃఖేదపరీతాత్మా తూష్ణీం తిష్ఠతి కేవలమ్. 11

అన్నమును దినుటలేదు ఇంటఁగూడ లేచి తిరుగుటలేదు. విచారమనస్కుఁడై ఊరక గూర్చొనియుండును.

సదారః సహభృత్యోఽహం తత్కృతే మునినాయక
శరదీవ పయోవాహో నూనం నిఃసారతాం గతః. 12

మునినాయకా! నేనును, నాభార్యలును, నా సేవకులును వానికొఱకై, శరత్కాల మేఘములవలె సుఖవిహీనులమగుచున్నాము.

ఈదృశోఽసౌ సుతో బాల ఆధినాఽథ వశీకృతః
కథం దదామి తం తుభ్యం యోద్ధుం సహనిశాచరైః. 13

వయస్సున పిన్నయు, మనోవిచార పీడితుఁడును నగురాముని రాక్షసులతో యుద్ధమొనర్ప నీకెట్లర్పింపగలను?

అపి బాలాంగనాసంగాదపి సాధో సుధారసాత్
రాజ్యాదపి సుఖాయైవ పుత్రస్నేహో మహామతే. 14

సాధుశ్రేష్ఠ, మహామతీ! పుత్రప్రేమ యువతీసంగమముకంటె, అమృతపానముకంటె, రాజ్యప్రాప్తికంటె నెక్కుడు సుఖము నిచ్చును.

యే దురంతా మహారంభాస్త్రిషు లోకేషు ఖేదదాః
పుత్రస్నేహేన సంతోఽపి కుర్వతే తానసంశయమ్. 15

ముల్లోకముల దురంతములును, కష్టదములునునగు కార్యముల ధార్మికులు పుత్రస్నేహబద్ధులై నిస్సందేహముగ నొనర్చుచున్నారు.

అసవోఽథ ధనం దారా స్త్యజ్యంతే మానవైః సుఖమ్
న పుత్రో మునిశార్దూల స్వభావో హ్యేష జంతుషు. 16

మునిశార్దూలా! మనుజులు ధన, ప్రాణములను, భార్యను, సుఖములను, త్యజింపగలరు. కాని పుత్రుని వదలలేరు; ఇది మనుష్యస్వభావము.

రాక్షసాః క్రూరకర్మాణః కూటయుద్ధవిశారదాః
రామస్తాన్ యోధయత్విత్థం యుక్తిరేషాతి దుస్సహా. 17

రాక్షసులు క్రూరకర్ములు; కూటయుద్ధవిశారదులు, రాముడు వారితో యుద్ధమొనరించునను మాట నే సహింపజాలను.

విప్రయుక్తోహి రామేణ ముహూర్తమపి నోత్సహే
జీవితుం జీవితాకాంక్షీ న రామం నేతుమర్హసి. 18

రామునివిడిచి నేనొక్కక్షణమైన నుండజాలను. నేను బ్రతికియుండవలెనన్న, రామునిఁ దీసికొనిపోవలదు.



నవవర్ష సహస్రాణి మమ జాతస్య కౌశిక
దుఃఖేనోత్పాదితాస్త్వేతే చత్వారః పుత్రకా మయా. 19

కౌశికా! తొమ్మిదివేలఏండ్లు కష్టపడి ఈ నలుగురు పుత్రులగంటిని.

ప్రధానభూతస్తేష్వేవ రామః కమలలోచనః
తం వినేహ త్రయోప్యన్యే ధారయంతి న జీవితమ్. 20

వీరిలో కమలలోచనుఁడగు రాముడే ముఖ్యుడు; అతఁడు లేకున్న మిగిలిన ముగ్గురును ప్రాణముల నిల్పఁజాలరు.

స ఏవ రామో భవతా నీయతే రాక్షసాన్ప్రతి
యదితత్పుత్రహీనం త్వం మృతమేవాశు విద్ధిమామ్. 21

ఇట్టి రాముని రాక్షసులతో యుద్ధమొనర్పుటకుగాను, మీరు గొనిపోయిన, నేను పుత్రహీనుడనై మరణింతును.

చతుర్ణామాత్మజానాం హి ప్రీతిరత్రైవ మే పరా
జ్యేష్ఠం ధర్మమయం తస్మాన్న రామం నేతుమర్హసి. 22

నలుగురిలో రాముడే నాకు ప్రియతముడు. జ్యేష్ఠుఁడును ధర్మమయుఁడునునగు రాముని దీసికొనిపోవలదు.

నిశాచరబలం హంతుం మునే యది తవేప్సితమ్
చతురంగ సమాయుక్తం మయాసహ బలం నయ. 23

రాక్షసులఁగూల్చుటయే మీ కోర్కెయైన చతురంగబలయుతుఁడగు నన్ను గొనిపొండు.

కింవీర్యా రాక్షసాస్తే తు కస్యపుత్రాః కథంచతే
కియత్ప్రమాణాః కేచైవ ఇతి వర్ణయ మే స్ఫుటమ్. 24

ఆ రాక్షసుల బలమెట్టిది? వారెవరి పుత్రులు? వారెట్టివారు? వారి సంఖ్యయెంత? వారెవరు? వివరించి నాకుఁజెప్పుడు.

కథం తేన ప్రతికర్తవ్యం తేషాం రామేణ రాక్షసాం
మామకైర్బాలకైర్బ్రహ్మన్ మయావా కూటయోధినామ్. 25

బ్రాహ్మణుడా! రాముఁడుగాని నాపుత్రులుగాని, నేనుగాని మాయాయుద్ధవిశారదులగు వారిని ఎట్లెదుర్కొనవలయును?

సర్వం మే శంస భగవన్ యథా తేషాం మహారణే
స్థాతవ్యం దుష్టభాగ్యానాం వీర్యోత్సిక్తాహి రాక్షసాః. 26

ఆరాక్షసుల నెదుర్కొనునప్పుడెట్లు మెలగవలయునో తెలుసుకొనుటకుఁగాను, నేనడిగిన విషయముల వివరించిచెప్పుడు. రాక్షసులు బలగర్వితులు గదా!

శ్రూయతే హి మహావీర్యో రావణో నామ రాక్షసః
సాక్షాద్వైశ్రవణభ్రాతా పుత్రో విశ్రవసో మునేః. 27

న చేత్తవ మఖే విఘ్నం కరోతి కిల దుర్మతిః
తత్ సంగ్రామే న శక్తాః స్మో వయం తస్య దురాత్మనః. 28

రావణుఁడను రాక్షసవీరునిగురించి విందుము. అతఁడు కుబేరుని సహోదరుఁడు; విశ్రవసుని పుత్రుఁడు. అతఁడా మీయజ్ఞమునుఁ బాడుఁజేయునది? అట్లయిన, అతనితో యుద్ధమొనర్పఁగల శక్తిమాకులేదు.

కాలే కాలే పృథగ్ బ్రహ్మన్ భూరివీర్యవిభూతయః
భూతేష్వభ్యుదయం యాంతి ప్రలీయంతే చ కాలతః. 29

బలసంపదలు ఒక్కొక్కప్పు డొక్కొక్కనియందు వికసించి మరల కాలముతోఁబాటు వినష్టమైపోవును.

అద్యాస్మింస్తు వయం కాలే రావణాదిషు శత్రుషు
న సమర్థాః పురః స్థాతుం నియతేరేష నిశ్చయః. 30

ప్రస్తుతము, మేము కాలవశమున రావణుని ముందర నిలుపఁజాలము; దీనికిఁ గారణము ఈశ్వర నియతియే!

తస్మాత్ ప్రసాదం ధర్మజ్ఞ కురు త్వం మమపుత్రకే
మమ చైవాల్పభాగ్యస్య భవాన్ హి పరదైవతమ్. 31

అందువలన నో ధర్మజ్ఞా! మందభాగ్యుఁడనగు నాయందు, నాపుత్రునియందు దయఁజూపుము. మీరే మాపరదేవతలు.

దేవదానవగంధర్వా యక్షాః పతగపన్నగాః
న శక్తా రావణం యోద్ధుం కింపునః పురుషా యుధి. 32

దేవ, దానవ, గంధర్వ, యక్ష, పతగ, పన్నగులే రావణునితోఁ బోరఁజాలరు. ఇకమనుష్యుల మాటయేమి?

మహావీర్యవతాం వీర్యమాదత్తే యుధి రాక్షసః
తేన సార్ధం నశక్తాః స్మ సంయుగే తస్య బాలకైః. 33

రావణుఁడు మహావీరులగు ఇంద్రాదులనే ఓడించినాఁడు, వానితో మేమే యుద్ధమొనర్పఁజాలము. ఈ బాలకులేమి యొనర్పఁగలరు?

అయమన్యతమః కాలః పేలవీకృతసజ్జనః
రాఘవోఽపి గతో దైన్యం యతో వార్ధకజర్జరః. 34

కాలమాహాత్మ్యమిట్టిది! సజ్జనులు దుర్బలులైనారు. రఘువంశమున బుట్టియుకూడ నేను వార్ధక్యమున శక్తిహీనుఁడనైతిని.



అథవా లవణం బ్రహ్మన్ యజ్ఞఘ్నం తం మధోః సుతమ్
కథయత్వసురప్రఖ్యం నైవ మోక్ష్యామి పుత్రకమ్ 35

మధుని పుత్రుఁడగు లవణాసురుఁడు మీ యజ్ఞమును పాడొనర్చుచున్నాఁడన్నను, నేను నా పుత్రుని విడువను.

సుందోపసుందయోశ్చైవ పుత్రౌ వైవస్వతోపమౌ
యజ్ఞవిఘ్నకరౌ బ్రూహి నతే దాస్యామి పుత్రకమ్. 36

యమునిఁబోలు సుందోపసుందుని పుత్రులు, యజ్ఞవిఘ్నకారులన్నను, నా పుత్రునొసఁగను.

అథ నేష్యసి చేద్బ్రహ్మం స్తద్ధతోఽస్మ్యహమేవ తే
అన్యథా తు న పశ్యామి శాశ్వతం జయమాత్మనః. 37

బ్రాహ్మణుఁడా! బలాత్కారముగ తీసికొనిపోయిన, నన్ను మృతునిగ నెఱుంగునది; ప్రాణత్యాగముతప్ప నాకు వేఱొక ఉపాయములేదు.

ఇత్యుక్త్వా మృదువచనం రఘూద్వహోఽసౌ
కల్లోలే మునిమతసంశయే నిమగ్నః
నాజ్ఞాసీత్ క్షణమపి నిశ్చయం మహాత్మా
ప్రోద్వీచావివ జలధౌ సముహ్యమానః. 38

ఇత్యార్షే వాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే వైరాగ్య
ప్రకరణే దశరథవాక్యం నామ
అష్టమః సర్గః ॥ 8 ॥

మహాత్ముఁడును రఘుకులశ్రేష్ఠుఁడునునగు దశరథుఁడిట్లు మృదువుగపల్కి, విశ్వామిత్రుని నాజ్ఞ నెరవేర్చుటెట్లాయని సందిగ్ధచిత్తుఁడై, ఉత్తాలతరంగసంక్షుభితసాగరమునం బడినవానివలె, ఏమి యొనర్పనగునో నిశ్చయించుకొనఁజాలకపోయెను.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు వైరాగ్య
ప్రకరణమున దశరథ వాక్యమను
అష్టమ సర్గము ॥ 8 ॥



## నవమ సర్గః

శ్రీ వాల్మీకిరువాచః—

తచ్ఛ్రుత్వా వచనం తస్య స్నేహపర్యాకులేక్షణం
సమన్యుః కౌశికో వాక్యం ప్రత్యువాచ మహీపతిమ్. 1

వాల్మీకి:- స్నేహాకుల నేత్రములతో దశరథుడు పల్కినవాక్యములవిని, విశ్వామిత్రుడు కోపమున నిట్లుపల్కెను.

కరిష్యామీతి సంశ్రుత్య ప్రతిజ్ఞాం హాతుమర్హసి
స భవాన్ కేసరీ భూత్వా మృగతామివ వాంఛసి. 2

'మీపనినొనర్చెదన'ని ప్రతిజ్ఞనొనర్చి దానిని భంగపరుపనున్నావు. ఇయ్యది సింహము లేడి కాగోరుచున్నట్లున్నది.

రాఘవాణామయుక్తోఽయం కులస్యాస్య విపర్యయః
న కదాచన జాయంతే శీతాంశోరుష్ణరశ్మయః. 3

ఇట్టి విపరీతకార్యము రఘువంశమున బుట్టినవారికిఁ దగనిపని. చంద్రునినుండి ఉష్ణకిరణములు వెలువడవు.

యది త్వం నక్షమో రాజన్ గమిష్యామి యథాగతం
హీనప్రతిజ్ఞ కాకుత్స్థ సుఖీభవ సబాంధవః. 4

దశరథా! నీవీపని నొనర్పజాలని యెడల, నేను వచ్చినట్లే వెడలుచున్నాను. నీవు ప్రతిజ్ఞాభంగమొనర్చి బంధువులతో సుఖముగనుండుము.

శ్రీ వాల్మీకిరువాచః—

తస్మిన్ కోపపరీతేఽథ విశ్వామిత్రే మహాత్మని
చచాల వసుధా కృత్స్నా సురాంశ్చ భయమావిశత్. 5

విశ్వామిత్రుడిట్లు కోపింప భూమండలమంతయునుఁ గంపించెను; దేవతలు భయమునందిరి.

క్రోధాభిభూతం విజ్ఞాయ జగన్మిత్రం మహామునిం
ధృతిమాన్ సువ్రతో ధీమాన్ వసిష్ఠో వాక్యమబ్రవీత్. 6

ధైర్యశాలియు, సువ్రతుఁడును బుద్ధిమంతుడునునగు వసిష్ఠుఁడు విశ్వామిత్రుని గోపించినవానిగ సె[illegible] ([illegible]రథునితో) ఇట్లు పల్కెను.

శ్రీ వసిష్ఠ[illegible]చః—

ఇక్ష్వాకూణాం కులే జాతః సాక్షాద్ధర్మ ఇవాపరః
భవాన్ దశరథః శ్రీమాంస్త్రైలోక్యగుణభూషితః. 7



ధృతిమాన్ సువ్రతో భూత్వా న ధర్మం హాతుమర్హసి
త్రిషు లోకేషు విఖ్యాతో ధర్మేణ యశసా యుతః. 8

వసిష్ఠుడు:- ఇక్ష్వాకుకులమున జనించిన ధర్మమూర్తివి నీవు. ముల్లోకములనున్న గుణవంతుల గుణములన్నియు నీ యవి. ధైర్యశాలివి. సువ్రతుడవు. నీ ధర్మకీర్తి త్రిలోక ప్రసిద్ధము. (ఇట్టి నీవు) ప్రతిజ్ఞాహాని నొనర్చుట తగనిపని.

స్వధర్మం ప్రతిపద్యస్వ న ధర్మం హాతు మర్హసి
మునేస్త్రిభువనేశస్య వచనం కర్తుమర్హసి. 9

స్వధర్మమును పాలింపుము, ధర్మమును త్యజింపకుము. మునివరుని ఆజ్ఞననుసరించుము.

కరిష్యామీతి సంశ్రుత్య తత్తే రాజన్నకుర్వతః
ఇష్టాపూర్తం హరేద్ధర్మం తస్మాత్ రామం విసర్జయ. 10

ఒనర్తునని ప్రతిజ్ఞ నొనర్చి, ఒనర్పకపోయిన * ఇష్టాపూర్త ధర్మమును బోగొట్టుకొందువు. అందువలన, రాముని నొసంగుము.

ఇక్ష్వాకువంశజాతోఽపి స్వయం దశరథోఽపి సన్
న పాలయసి చేద్వాక్యం కోఽపరః పాలయిష్యతి. 11

ఇక్ష్వాకుకులమున జనించిన దశరథుడే మాట నిలబెట్టుకొననిచో, ఇంక ఇతరులమాటయేమి?

యుష్మదాదిప్రణీతేన వ్యవహారేణ జంతవః
మర్యాదాం న విముంచంతి తాం న హాతుం త్వమర్హసి. 12

మీ యట్టివారు చూపిన ఆచరణ ననుసరించియే, జనులు శాస్త్రమర్యాదకు లోబడుదురు. ఇట్టి మర్యాద నుల్లంఘించుట నీకు పాడికాదు.

గుప్తం పురుషసింహేన జ్వలనేనామృతం యథా
కృతాస్త్రమకృతాస్త్రం వా నైనం శక్ష్యంతి రాక్షసాః. 13

ఈ పురుషసింహునిచే రక్షింపఁబడువ్యక్తిని అతఁడు యుద్ధమున నేర్పరికానిమ్ము, కాకపోనిమ్ము. దేవలోకమున అగ్నిచే రక్షింపఁబడు అమృతము నితరులు చేరలేనట్లు, కన్నెత్తిచూడజాలరు.

ఏష విగ్రహవాన్ ధర్మ ఏష వీర్యవతాంవరః
ఏష బుద్ధ్యాధికో లోకే తపసాంచ పరాయణమ్. 14

ఈముని రూపుదాల్చిన ధర్మము. తపస్విశ్రేష్ఠుఁడు. బుద్ధిబలమున లోకోత్తరుఁడు. తపస్సునకాశ్రయస్వరూపుఁడు.

---

* వైదికధర్మము త్రివిధము. అది ఇష్టా, పూర్త, దత్తములను పేరవ్యవహరింపఁబడుచున్నది. ఇష్టమన, అగ్నిహోత్రాది యజ్ఞయాగములు. పూర్తమన కూపతటాకాది ఖననము, దత్తమన దానధర్మాదులు, ఇవియే ఇట సూచింపఁబడినవి—అను

ఏషోఽస్త్రం వివిధం వేత్తి త్రైలోక్యే సచరాచరే
నైతదన్యః పుమాన్ వేత్తి నచవేత్స్యతి కశ్చన. 15

ఇతఁడు నానావిధ అస్త్రముల నెఱుఁగును. ఇతఁడెఱిగినన్ని అస్త్రముల నితరులెవ్వరును ఎఱుఁగరు. ఎఱుఁగబోరు.

న దేవా నర్షయః కేచి న్నాసురా నచ రాక్షసాః
న నాగా యక్షగంధర్వాః సమేతాః సదృశా మునేః. 16

దేవ, రాక్షస, నాగ, యక్ష, గంధర్వ, అసుర, ఋషి ప్రపంచమంతయు కలిసినను విశ్వామిత్రున కీడుకాదు.

అస్త్రమస్మై కృశాశ్వేన పరైః పరమదుర్జయమ్
కౌశికాయ పురాదత్తం యదారాజ్యం సమన్వగాత్. 17

విశ్వామిత్రుడు పూర్వము రాజ్యాధిపత్యమునందినప్పుడు, కృశాశ్వుడు దుర్జయములగు అస్త్రముల నీతనికిఁ బ్రసాదించెను.

తేహి పుత్రాః కృశాశ్వస్య ప్రజాపతిసుతోపమాః
ఏనమన్వచరన్ వీరా దీప్తిమంతో మహౌజసః. 18

ఈ యస్త్రములు సంహారకార్యమున రుద్రునిఁబోలునవి. వీర్యవంతములు; దీప్తిశాలియు, మహాతేజుఁడునునగు, విశ్వామిత్రుని అనుచరులు.

జయా చ సుప్రభాచైవ దాక్షాయణ్యౌ సుమధ్యమే
తయోస్తు యాన్యపత్యాని శతం పరమ దుర్జయమ్. 19
పంచాశతం సుతాన్ జజ్ఞే జయా లబ్ధవరా పురా
వధార్థం సురసైన్యానాం తే క్షమాః కామచారిణః. 20
సుప్రభా జనయామాస పుత్రాన్ పంచాశతం పరాన్
సంహర్తాన్నామ దుర్ధర్షాన్ దురాకారాన్ బలీయసః. 21
ఏవం వీర్యో మహాతేజా విశ్వామిత్రో జగన్మునిః
న రామగమనే బుద్ధిం విక్లవాం కర్తుమర్హసి. 22

జయాసుప్రభలు దక్షునిపుత్రికలు. (కృశాశ్వునిభార్యలు) వీరికి నూర్గురుపుత్రులు గల్గిరి. వీరందరును అస్త్రదేవతలు. జయ భర్తృ వరమునంది అసురుని వినాశార్థ మేబది పుత్రులంగనెను. వీరు కామచారులు. కార్యనిర్వహణసమర్థులు. సుప్రభ మఱేబది పుత్రులంగనెను. వీరు బలిష్ఠులు. అజేయులు. శీఘ్రకారులు. వారినామము సంహర్తులు. విశ్వామిత్రుఁడిట్టి బలముగలవాఁడు. అందువలన, రాముడరుగునని వికలమతి కావలదు.



అస్మిన్ మహాసత్త్వతమే మునీంద్రే
స్థితే సమీపే పురుషస్య సాధో
ప్రాప్తేఽపి మృత్యావమరత్వమేతి
మా దీనతాం గచ్ఛ యథా విమూఢః. 23

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే వైరాగ్యప్రకరణే
వసిష్ఠ సమాశ్వాసనం నామ నవమః సర్గః ॥ 9 ॥

మహాసత్త్వుఁడగు విశ్వామిత్రుఁడు దగ్గరనున్న, మృతింపనున్న పురుషుఁడు గూడ అమరత్వమునందును. అందువలన, మూఢునివలె ఆతురపడవలదు.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు వైరాగ్యప్రకరణమున
వసిష్ఠ సమాశ్వాసమను నవమ సర్గము ॥ 9 ॥



## దశమః సర్గః.

శ్రీ వాల్మీకిరువాచ:—

తథా వసిష్ఠేబ్రువతి రాజా దశరథః సుతమ్
సంప్రహృష్టమనా రామమాజుహావ సలక్ష్మణమ్. 1

వాల్మీకి:- వసిష్ఠుడిట్లు పల్కఁగ విని సంతోషించి, రామలక్ష్మణులఁ దోడ్కొని రమ్మని దౌవారికున కాజ్ఞాపించెను.

ప్రతిహార మహాబాహుం రామం సత్యపరాక్రమమ్
సలక్ష్మణ మవిఘ్నేన పుణ్యార్థం శీఘ్రమానయ. 2

దశరథుఁడు:- ప్రతీహారీ! వీరుఁడును సత్యపరాక్రముఁడును నగు రాముని లక్ష్మణునితో తీసికొనిరమ్ము; పుణ్యకార్యమున్నది.

ఇతి రాజ్ఞా విసృష్టోఽసా గత్వాంతఃపురమందిరమ్
ముహూర్త మాత్రేణాగత్య తమువాచ మహీపతిమ్. 3

ఇట్లు దశరథునిచే నాజ్ఞాపింపబడి, లోనికఱిగి నిమిషములోఁదిరిగివచ్చి, దౌవారికుఁడిట్లు పల్కెను.

దేవ దోర్దళితాశేషరిపో రామః స్వమందిరే
విమనాః సంస్థితో రాత్రౌ షట్పదః కమలే యథా. 4

దేవా! వినిర్జితశత్రూ! రాత్రి తుమ్మెద పద్మమునఁగూర్చొని యుండునట్లు, రామఁడు విషణ్ణుఁడై గృహమున గూర్చొనియున్నాఁడు.

ఆగచ్ఛామి క్షణేనేతి వక్తి ధ్యాయతి చైకతః
న కస్యచిచ్చ నికటే స్థాతుమిచ్ఛతి ఖిన్నధీః. 5

'ఇప్పుడే వచ్చుచున్నాను. పద' అని వచించుచు చింతాపరుఁడైనాఁడు. ఖిన్నమనస్కుఁడగు రాముఁ డితరులకడ నుండఁగోరుటలేదు.

ఇత్యుక్తస్తేన భూపాలస్తం రామానుచరమ్ జనమ్
సర్వమాశ్వాసయామాస పప్రచ్ఛ చ యథాక్రమమ్. 6

ఇట్లాతఁడు పల్కఁగ, (అతని వెంట నరుదెంచిన రామానుచరుని) ఆశ్వాసించి క్రమముగా నిట్లు ప్రశ్నించెను.

కథం కీదృగ్విధో రామ ఇతి పృష్టో మహీభృతా
రామ భృత్యజనః ఖిన్నో వాక్యమాహ మహీపతిమ్. 7

రాముఁడెట్లు, ఏవిధమున నున్నాఁడు? అని ప్రశ్నింప, రామసేవకుఁడు ఖేదముతో నిట్లు పల్కెను.

దేహయష్టిమిమాం దేవ ధారయన్త ఇమే వయమ్
ఖిన్నాః ఖేదే పరిమ్లానతనౌ రామే సుతే తవ. 8

రాముఁడు దుఃఖవశమున కృశశరీరుఁడైనాఁడు. మేమును కృశించి ఎట్లో ఈ శరీరమును దాల్చియున్నారము.

రామో రాజీవపత్రాక్షో యతః ప్రభృతి చాగతః
సవిప్రస్తీర్థయాత్రాతస్తతః ప్రభృతి దుర్మనాః. 9

బ్రాహ్మణులతో గూడి తీర్థయాత్ర నొనర్చి వచ్చిన నుండి, రాముఁడు ఖిన్నమనస్కుఁడై యున్నాఁడు.

యత్నప్రార్థనయాస్మాకం నిజవ్యాపారమాహ్నికమ్
సోఽయమామ్లానవదనః కరోతి న కరోతి వా. 10

మేము ప్రార్థించి, ప్రయత్నముల సల్పిన, నిత్యకృత్యముల నొక్కొక్కప్పుడొనర్చును. మఱొక్కప్పుడొనర్చఁడు.

స్నానదేవార్చనాదానభోజనాదిషు దుర్మనాః
ప్రార్థితోఽపి హి నాతృప్తే రశ్నాత్యశనమీశ్వరః. 11

ప్రభూ! స్నాన, దేవతార్చన, దానాది విషయములలో అతని మనస్సులేదు. బ్రతిమాలినను కడుపునిండు నట్లన్నముఁ దినుటలేదు.



లోలాంతఃపుర నారీభిః కృతదోలాభిరంగణే
న చ క్రీడతి లీలాభిర్ధారాభిరివ చాతకః. 12

వర్షధారలతో క్రీడించు చాతకమువలె, అంతఃపురకాంతలతో నుయ్యాలల నూగుటలేదు.

మాణిక్యముకుళప్రోతా కేయూరకటకావళిః
నానందయతి తం రాజన్ ద్యౌః పాతవిషయం యథా. 13

రాజా! భోగాంతమున స్వర్గమునుండి పడఁబోవువానికి, స్వర్గసుఖము లానందమునుఁ గూర్పఁజాలనట్లు, మాణిక్యముకుళముతోఁ గూర్పఁబడిన కేయూరకటకములు, రాముని కానందమును గొల్పుటలేదు.

క్రీడద్వధూవిలోకేషు వహత్ కుసుమవాయుషు
లతావలయగేహేషు భవత్యతివిషాదవాన్. 14

క్రీడించుచున్న వనితల చూడ్కులతోను, పూలగాలులతోను శోభిల్లు లతాగృహములలో గూడ రాముడు విషాదమునందుచున్నాఁడు.

యద్ద్రవ్యముచితం స్వాదు పేశలం చిత్తహారి చ
బాష్పపూర్ణేక్షణ ఇవ తేనైవ పరిఖిద్యతే. 15

రాజభోగ్యములును, రుచికరములును, మనోహరములును, మృదులములునునగు వానిం గాంచియు అతఁడు దుఃఖితుఁడగును. కనుల నీరు బుకును.

కిమిమా దుఃఖదాయిన్యః ప్రస్ఫురంతీః పురాంగనాః
ఇతి నృత్తవిలాసేషు కామినీః పరినిందతి. 16

హావభావములతో నృత్యమొనరించు పురాంగనలఁ గాంచి, దుఃఖదాయినులగు వారెవరు? అని నిందించును.

భోజనం శయనం యానం విలాసం స్నానమాసనమ్
ఉన్మత్తచేష్టిత ఇవ నాభినందత్యనిందితమ్. 17

పిచ్చివానివలె, ఉత్తమములగు స్నాన, భోజన, ఆసన, శయన, యాన, విలాస, ద్రవ్యముల నిందించును.

కిం సంపదా కిం విపదా కిం గేహేన కిమింగితైః
సర్వమేవాసదిత్యుక్త్వా తూష్ణీమేకోఽవతిష్ఠతే. 18

సంపదలు, ఆపదలు, భవనములు, కోర్కెలు, వీటితో పనియేమి? ఇవన్నియు అసారములు, అనిపల్కి యూరకుండును.

నోదేతి పరిహాసేషు న భోగేషు నిమజ్జతి
న చ తిష్ఠతి కార్యేషు మౌనమేవావలంబతే. 19

పరిహాసములం బాల్గొనఁడు. భోగాసక్తుఁడవఁడు, పనులనొనర్పఁడు, మౌనమును మాత్రమే అవలంబించి యూరకుండును.

విలోలాలకవల్లర్యో హేలావలితలోచనాః
నానందయంతి తం నార్యో మృగ్యో వనతరుం యథా. 20

లేడి అరణ్యవృక్షముల నానందింప జేయజాలనట్లు, ఊఁగులాడు ముంగురులుగల చపలనయనలు, రాముని ఆనందింప చేయజాలకున్నారు.

ఏకాంతేషు దిగంతేషు తీరేషు విపినేషుచ
రతి మాయాత్యరణ్యేషు విక్రీత ఇవ జంతుషు. 21

అడవి మనుష్యున కమ్ముడు పోయినవానివలె, రాముడిప్పుడు, జనశూన్య ప్రదేశములను, నదీతీరములందునను, వనమధ్యమునను, నుండగోరుచున్నాడు.

వస్త్రపానాశనాదానపరాఙ్ముఖతయా తయా
పరివ్రాడ్ ధర్మిణం భూప సోఽనుయాతి తపస్వినమ్ 22

రాముడిప్పుడు అన్నపానాదులయెడంగల విరక్తింజేసి పరివ్రాజకుఁడగు యతినిఁ బోలుచున్నాడు.

ఏక ఏవ వసన్ దేశే జనశూన్యే జనేశ్వర
న హసత్యేకయా బుద్ధ్యా న గాయతి న రోదతి. 23

అత డేకాగ్రచిత్తుడై, ఏకాంతప్రదేశముల గూర్చొనియుండును; హాస గాన రోదనాదుల నొనర్పడు.

బద్ధపద్మాసనః శూన్యమనా వామకరస్థలే
కపోలతలమాధాయ కేవలం పరితిష్ఠతి. 24

శూన్యమనస్కుడై, చెక్కిలిపై చేతినుంచి పద్మాసనమున నూరక కూర్చొనియుండును.

నాభిమాన ముపాదత్తే నచ వాంఛతి రాజతామ్
నోదేతి నాస్తమాయాతి సుఖదుఃఖానువృత్తిషు. 25

అతని కభిమానము లేదు. రాజప కోర్కె లేదు. సుఖదుఃఖములందు హర్షశోకములనందడు.

న విద్మః కిమసా యాతి కిం కరోతి కిమీహతే
కిం ధ్యాయతి కిమాయాతి కథం కిమనుధావతి. 26

అతడెందులకు చరించునో, ఏ మొనర్చునో దేనిని చింతించునో, దేనిని వెదకునో, ఎట్లు వెదకునో మే మెఱుంగము.

ప్రత్యహం కృశతామేతి ప్రత్యహంయాతి పాండుతామ్
విరాగం ప్రత్యహం యాతి శరదంత ఇవ ద్రుమః. 27

రోజురోజున కాతడు కృశించుచున్నాడు. రోజురోజున కతడు పాలిపోవుచున్నాడు. వైరాగ్య మంతకంత కెక్కుడగుచున్నది. అతనిస్థితి శిశిరఋతువునందలి వృక్షమువలెనున్నది.



అనుయాతౌ తథైవైతౌ రాజన్ శత్రుఘ్న లక్ష్మణౌ
తాదృశావేవ తస్యైవ ప్రతిబింబావివ స్థితౌ. 28

అతని అనుచరులగు లక్ష్మణ శత్రుఘ్నుల స్థితియు నిట్లేయున్నది. వారాతని ప్రతిబింబమట్లున్నారు.

భృత్యై రాజభి రంబాభిః సంపృష్టోఽపి పునః పునః
ఉక్త్వా న కించిదేవేతి తూష్ణీమాస్తే నిరీహతః. 29

సామంతులు, తల్లులు, మాటిమాటికి ప్రశ్నింపగ, ఏమియులేదని యూరకుండును.

ఆపాతమాత్రహృద్యేషు మా భోగేషు మనః కృథాః
ఇతి పార్శ్వగతం భవ్యమనుశాస్తి సుహృజ్జనమ్. 30

విషయేంద్రియ సంయోగమువలన కలుగునవియు దుఃఖాంతములును, క్షణికములునునగు భోగముల మనస్సుంచకుము' అని ప్రక్కనుండు మిత్రున కుపదేశించును.

నానావిభవరమ్యాసు స్త్రీషు గోష్ఠీగతాసుచ
పురః స్థితమివాస్నేహో నాశమేవానుపశ్యతి. 31

వినోదభవనముననున్న సౌందర్యవతుల గాంచి సంతోషించుటట్లుండ వారిని మృత్యువట్లు గాంచును.

నీతమాయు రనాయాసపదప్రాప్తి వివర్జితైః
చేష్టితై రితి కాకల్యా భూయోభూయః ప్రగాయతి. 32

మోక్షపదమున కుపయోగింపని ప్రయత్నములలో నాయువు వ్యయింపఁబడుచున్నది. అని మధురమును; స్ఫుటమును నగు రీతి మాటిమాటికిఁ బాడుచుండును.

సమ్రాడ్ భవేతి పార్శ్వస్థం వదంతమనుజీవినం
ప్రలపంత మివోన్మత్తం హసత్యన్యమనా మునిః. 33

'సామ్రాట్టువు కమ్ము' అని ప్రక్కనున్న అనుజీవి పల్కిన, పిచ్చివానివలె వాగుచున్నాడే యనుకొని, అన్యమనస్కుడై నవ్వుకొనును.

నప్రోక్త మాకర్ణయతి ఈక్షతే నపురోగతం
కరోత్యవజ్ఞాం సర్వత్ర సునమేత్యాపి వస్తుని. 34

మాటలాడిన వినడు; ఎదురనున్న వస్తువుల గాంచడు. మంచివస్తువులంగూడ తిరస్కారభావమునఁబరికించును.

అప్యాకాశ సరోజన్యా అప్యాకాశ మహావనే
ఇత్థమేతన్మన ఇతి విస్మయోఽస్య న జాయతే. 35

ఆకాశమను సరోవరమున, ఆకాశపద్మముయొక్క ఉనికి అసంభవమైనట్లు, ఈ మనస్సును తత్కల్పిత సృష్టియు అలీకములు, — ఈ సంగతిని అతడు గ్రహించియుండుటవలన సామాన్యుల కాశ్చర్యమును గలిగింపజేయు విషయము లాతనికచ్చెరువును గల్పింపజాలకున్నవి.

కాంతామధ్యగతస్యాపి మనోఽస్య మదనేషవః
న భేదయంతి దుర్భేద్యం ధారా ఇవ మహోపలమ్. 36

జలధారలు పెనురాతిబండను భేదింపలేనట్లు, అతడు కాంతాజనమధ్యముననున్నను మన్మథబాణము లాతని భేదింపలేకున్నవి.

ఆపదామేకమావాస మభివాంఛసి కిం ధనం
అనుశిష్యతి సర్వస్వ మర్థినే సంప్రయచ్ఛతి. 37

ధనమును ఆపదలకు పుట్టిల్లుగ దలంచి, అర్థులకిచ్చి వైచుచున్నాడు.

ఇయమాపదియం సంప దిత్యేవం కల్పనామయః
మనసోఽభ్యుదితో మోహ ఇతి శ్లోకాన్ ప్రగాయతి. 38

ఇది ఆపద, ఇది సంపద అను భావములు కల్పనామయములగు మనస్సున జనించిన మోహము అను నీ యర్థమునిచ్చు శ్లోకముల బఠించును.

హాహతోఽహమనాథోఽహ మిత్యాక్రందపరోఽపి సన్
న జనో యాతి వైరాగ్యం చిత్రమిత్యేవ వక్త్యసౌ. 39

"చచ్చితిని, నాకు గతిలేదు" అని రోదించియు జనులు వైరాగ్యమును బడయకున్నారు. ఆశ్చర్యము! అని నుడువుచుండును.

రఘుకాననశాలేన రామేణ రిపుఘాతినా
భృశమిత్థం స్థితేనైవ వయం ఖేద ముపాగతాః. 40

రఘుకులారణ్యశాల వృక్షమగు (=రఘువంశ శ్రేష్ఠుడగు) రాముడిట్టి స్థితిం బొంద మేమును ఖిన్నులమైతిమి.

న విద్మః కిం మహాబాహో తస్య తాదృశచేతసః
కుర్మః కమలపత్రాక్ష గతిరత్రహి నో భవాన్. 41

మహారాజా! ఇట్టి రామునితో యే మొనర్పవలసినదియు, తెలియజాలకున్నాము. మఱి మీరే గతి.

రాజానమథవా విప్ర ముపదేష్టార మగ్రతః
హసత్యజ్ఞ మివావ్యగ్రః సోఽవధీరయతి ప్రభో. 42

ప్రభూ! క్షత్రియుడే గానీ, బ్రాహ్మణుడే గానీ, రాజనీతి మొదలగు విషయముల నుపదేశింపం బూనిన, వారివాక్యములను విలువలేనట్లు, ధీరభావమునం దిరస్కరించును.

యదేవేదమిదం స్ఫారం జగన్నామ యదుత్థితం
నైతద్వస్తు న చైవాహ మితి నిర్ణీయ సంస్థితః. 43

బహువిధముల బహిర్దృష్టికిం గన్పడు ఈ జగత్తు లేదు. మిథ్య, స్థూలబుద్ధికి గోచరమగు అహంకారము గూడ ఇట్టిదే, అని నిర్ణయించుకొని తత్త్వజిజ్ఞాసువై యున్నాడు.



నారా నాత్మని నో మిత్రే న రాజ్యే నచ మాతరి
న సంపదా న విపదా తస్యాస్థా న విభో బహిః. 44

శత్రుమిత్రులు; కష్టసుఖములు, రాజ్యము, తల్లి; శరీరము, ఇత్యాదులగు బాహ్యవిషయముల నాతడు లక్ష్యించుటలేదు.

నిరస్తాస్థో నిరాశోఽసౌ నిరీహోఽసౌ నిరాస్పదః
న మూఢో నచముక్తోఽసౌ తేన తప్యామహే భృశమ్ 45

అతనికాశలేదు ప్రయత్నములేదు, శాంతిలేదు; అతడు మూఢుడుకాదు. లేక ముక్తుడును గాదు. అందువలన మే మంతరము మిక్కుటముగ విచారించుచున్నాము.

కిం ధనేన కిమంబాభిః కిం రాజ్యేన కి మీహయా
ఇతి నిశ్చయవానంతః ప్రాణత్యాగపరః స్థితః. 46

ధనముతోడను, తల్లులతోడను, రాజ్యముతోడను, ప్రయత్నములతోడను, పనియేమని నిశ్చయించుకొని, ప్రాణముల ద్యజింపనున్నాడు.

భోగేఽప్యాయుషి రాజ్యేషు మిత్రే పితరి మాతరి
పరముద్వేగ మాయాత శ్చాతకోఽవగ్రహే యథా. 47

అనావృష్టి చాతకమున కుద్వేగ కరమైనట్లు, రాజ్యము, భోగములు, తల్లిదండ్రులు, జీవితము అతని కుద్వేగకరములైనవి.

ఇతి లోకే సమాయాతాం శాఖాప్రసరశాలినీమ్
ఆపత్తామల ముద్ధర్తుం సముదేతు దయాపరః. 48

మీ పుత్రునికిట్టి విపత్తు ఘటిల్లినది. శాఖాప్రశాఖలతో బెరుగనున్నది. దీనిని దూరమొనర్ప ప్రయత్నింపుడు.

తస్య తాదృక్ స్వభావస్య సమగ్రవిభవాన్వితమ్
సంసారజాలమాభోగి ప్రభో ప్రతివిషాయతే. 49

ఇట్టి రాముడు పరిపూర్ణ విభవములతోం గూడిన సంసారమును కృత్రిమవేషమును దాల్చినదానిగ నెన్ని, విషమువోలె గాంచుచున్నాడు.

ఈదృశః స్యాన్మహాసత్త్వః క ఇవాస్మిన్ మహీతలే
ప్రకృతే వ్యవహారే తం యో నివేశయితుం క్షమః. 50

అతనిమనస్సును సంసారమునకు మళ్ళింపగల మహామహులెవరైన ఈ ప్రపంచమునను న్నారా?

మనసి మోహమపాస్య మహామనః
సకలమార్తితమః కిల సాధుతాం
సఫలతాం నయతీహ తమోహరః
దినకరో భువి భాస్కరతామివ. 51

ఇత్యార్షే వాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే వైరాగ్య ప్రకరణే
రాఘవవిషాదో నామ దశమః సర్గః ॥ 10 ॥

భాస్కరుఁడు అంధకారమునుఁ బోఁగొట్టి తనపేరును సార్థకమొనర్చునట్లు, రాముని హృదయమునందలి మోహమును బోఁగొట్టి, తన ఉపదేశమును సార్థకమొనర్చుకొనఁగల మహాత్ము లెవరైనా కలరా?

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు వైరాగ్యప్రకరణమున
రాఘవవిషాదమను దశమ సర్గము ॥ 10 ॥



## ఏకాదశః సర్గః.

శ్రీ విశ్వామిత్ర ఉవాచః—

ఏవంచేత్త న్మహాప్రాజ్ఞా భవంతో రఘునందనం
ఇహానయంతు త్వరితా హరిణం హరిణా ఇవ. 1

విశ్వామిత్రుఁడు:– అట్లయిన నో ప్రాజ్ఞులారా! హరిణరాజును, హరిణములు గొనివచ్చినట్లు రామునిఁ గొనిరండు.

ఏష మోహో రఘుపతే ర్నాపద్భ్యో నచ రాగతః
వివేక వైరాగ్యవతో బోధ ఏవ మహోదయః. 2

ఈ స్థితి రామున కాపదవలనగాని, రాగమువలనగాని, కలుగలేదు. ఇది వివేకవైరాగ్య పూర్వకమగు జ్ఞానోదయము;

ఇహాయాతు క్షణాద్రామ ఇహచైవ వయం క్షణాత్
మోహం తస్యాపనే ష్యామో మారుతోఽద్రేర్ఘనం యథా. 3

రాము నిటకు రానిండు! వెంటనే, వాయువు పర్వతముననున్న మేఘముల నెగురఁగొట్టునట్లు అతని మోహమును క్షణము తొలగింతుము.



ఏతస్మిన్ మార్జితే యుక్త్యా మోహే స రఘునందనః
విశ్రాంతిమేష్యతి పదే తస్మిన్ వయమివోత్తమే. 4

యుక్తివలన నతని మోహము దూరమైన, మావలెనే పరమపదమున విశ్రాంతినందును, ముక్తస్వరూపుడగును.

సత్యతాం ముదితాం ప్రజ్ఞాం విశ్రాంతి మపతాపతాం
పీనతాం వరవర్ణత్వం పీతామృత ఇవైష్యతి. 5

అతఁడు సత్యస్వరూపమును, పరమానంద స్వరూపమును, జ్ఞానస్వరూపమును, విశ్రాంతిని తాపహీనత్వమును, పుష్టిని, లావణ్యమును, అమృతముఁ ద్రాగినవానివలె, పడయును.

నిజాంచ ప్రకృతామేవ వ్యవహారపరంపరాం
పరిపూర్ణమనా మాన్య ఆచరిష్యత్యఖండితమ్. 6

అప్పుడతఁడు స్వవర్ణాశ్రమోచిత ధర్మముల నవిచ్ఛిన్నముగ, మనఃపూర్తిగ నాచరించును.

భవిష్యతి మహాసత్త్వో జ్ఞాతలోకపరావరః
సుఖందుఃఖ దశాహీనం సమలోష్టాశ్మకాంచనః. 7

(అప్పుడు) ఆతని సత్త్వగుణము వృద్ధినందును. లోకముల కార్యకారణతత్త్వము నెఱుఁగును. సుఖదుఃఖముల కతీతుఁడగును. గడ్డిపరకను, రాతిని, బంగారమును, సమముగా జూచును.

ఇత్యుక్తే మునినాథేన రాజా సంపూర్ణమానసః
ప్రాహిణోద్రామ మానేతుం భూయో దూతపరంపరామ్. 8

మునినాథుఁడిట్లు వచింప, దశరథుఁడు సంతోషించి, రామునిఁ గొనివచ్చుటకు మరలమరల దూతలనంపెను.

ఏతావతాథ కాలేన రామో నిజగృహాసనాత్
పితుః సకాశమాగంతు ముత్థితోఽర్క ఇవాచలాత్. 9

ఇంతలో, తండ్రికడ కరుగుటకై రాముడు, ఉదయాద్రిని వీడు సూర్యునివలె నిజాసనము వీడెను.

వృతః కతిపయైర్భృత్యై ర్భ్రాతృభ్యాంచ జగామహ
తత్ పుణ్యం స్వపితుః స్థానం స్వర్గం సురపతేరివ. 10

కొందఱు భృత్యులును, సోదరులును, వెంటరాగా స్వర్గమునుబోలు తండ్రి సభకటిగెను.

దూరాదేవ దదర్శాసౌ రామో దశరథం తదా
వృతం రాజసమూహేన దేవౌఘేనేవ వాసవమ్. 11

శ్రీరాముఁడు దూరముననుండియే, రాజమండల పరివేష్టితుఁడై, దేవతలచే గొల్వఁబడు ఇంద్రునివలెనున్న దశరథుని, గాంచెను.

వసిష్ఠ విశ్వామిత్రాభ్యాం సేవితం పార్శ్వయోర్ద్వయోః
సర్వశాస్త్రార్థ తజ్జ్ఞేన మంత్రిబృందేన మాలితమ్. 12

చారుచామరహస్తాభిః కాంతాభిః సముపాసితమ్
కకుద్భిరివ మూర్తాభిః సంస్థితాభి ర్యథోచితమ్. 13

ఆతని ఉభయపార్శ్వముల వసిష్ఠవిశ్వామిత్రులు గూర్చొనియుండిరి. నలువైపుల సర్వశాస్త్రార్థవిదులగు మంత్రు లావేష్టించియుండిరి. సుందరములగు చామరముల చేతఁదాల్చిన వనితలాతనిఁ దగురీతి సేవించుచుండిరి; చూచుటకు వారు దిక్కు లాకృతిని దాల్చినవా యనునట్లుండిరి.

వసిష్ఠవిశ్వామిత్రాద్యా స్తథా దశరథాదయః
దదృశూ రాఘవం దూరా దుపాయాంతం గుహోపమమ్. 14
సత్త్వావష్టబ్ధగర్భేణ శైత్యేనేవ హిమాచలం
శ్రితం సకలసేవ్యేన గంభీరేణ స్ఫుటేనచ. 15
సౌమ్యం సమం శుభాకారం వినయోదారమానసం
కాంతోపశాంతవపుషం పరస్యార్థస్య భాజనమ్. 16
సముద్యద్యౌవనారంభం వృద్ధోపశమశోభనం
అనుద్విగ్నమనానందం పూర్ణప్రాయమనోరథమ్. 17
విచారితజగద్యాత్రం పవిత్రగుణగోచరం
మహాసత్త్వైకలోభేన గుణై రివ సమాశ్రితమ్. 18
ఉదార మార్య మాపూర్ణ మంతఃకరణ కోటరమ్
అవిక్షుభితయా వృత్త్యా దర్శయంత మనుత్తమమ్. 19

వసిష్ఠవిశ్వామిత్రులును, దశరథాదులును, దూరమునుండియే వచ్చుచున్న రాముని, కుమారస్వామినిఁ బోలువాని, గాంచిరి. అతఁడు సత్త్వగుణము, గాంభీర్యములతో నొప్పారుచు, తాపము నుపశమింపఁజేయు హిమాలయపర్వతమువలె నుండెను. అతఁడు ప్రియదర్శనుఁడును, సులక్షణుఁడును, శుభాకారుఁడును, ప్రశాంతుఁడును, మనోహరుఁడును, వినయియు పురుషార్థ అధికారియు నైయుండెను. యౌవనప్రారంభముయొక్క సంపూర్ణవికాసమును, వృద్ధుని ప్రశాంతభావమును నాతని నలంకరించియుండెను. అతని కుద్వేగములేదు, ఆనందమునులేదు. అతనికోర్కె పూర్ణప్రాయము. అతడు సంసారగతినిఁగూర్చి చింతించెను; పవిత్రగుణములకునికి. సత్త్వప్రాప్తినందగోరి గుణములన్నియు నాతని నాశ్రయించె నాయను నట్లుండెను. అతఁడుదారుడు; ఉన్నతుఁడు. సాధనసంపన్నుఁడైనను, సత్త్వబోధనందక పోవుటవలన కలిగినలోటు అతని ప్రవర్తనలోఁ గనఁబడుచుండెను.

ఏవంగుణగణాకీర్ణో దూరాదేవ రఘూద్వహః
పరిమేయస్మితాచ్ఛాచ్ఛ స్వహారాంబర పల్లవః. 20
ప్రణనామ చలచ్చారుచూడామణిమరీచినా
శిరసా వసుధాకంపలోలదేవాచలశ్రియా. 21



ఏవం మునీంద్రే బ్రువతి పితుః పాదాభివందనం
కర్తుమభ్యాజగామాథ రామః కమలలోచనః. 22
ప్రథమం పితరం పశ్చా న్మునీ మాన్యైకమానితౌ
తతో విప్రాం స్తతో బంధూం స్తతో గురుగణా న్సుహృత్. 23

ఇట్టిగుణములతో శోభిల్లు రాముఁడు, నిర్మలమగు చిరునవ్వువలె వెల్లనగు వస్త్రాభరణములతో శోభిల్లుచు, తండ్రికడకరుదెంచి, మనోహరములగు మణిభూషణములతో రాజిల్లు శిరస్సును వంచి, పితృచరణములకుఁ బ్రణమిల్లెను. అప్పుడు శిరోలంకారమగు రత్నముయొక్క ప్రభలచే చలించిన ఆతని మస్తకము, భూకంపసమయమునఁ జలించిన మేరుగిరివలెనుండెను. ఈ సమయమున విశ్వామిత్రుడు దశరథునితో (వెనుక వర్ణించినట్లు) సంభాషించుచుండెను. శోభనహృదయుఁడగు శ్రీరాముఁడు మొదటతండ్రికిని, తఱువాత మాన్యులగువారిచేగూడ గౌరవింపఁబడు వసిష్ఠ విశ్వామిత్రులకును పిదప విప్రులకును, కడపట బంధువులకును, తుదకు గురుజనులకును, నమస్కరించెను.

జగ్రాహాచ తతో దృష్ట్యా మనాఙ్మూర్ధ్నా తథా గిరా
రాజలోకేన విహితాం తాం ప్రణామపరంపరామ్. 24

సామంతరాజు లొనర్చిన ప్రణామపరంపరను చూడ్కులచేతను, తలనూపియు మాటలవలనను గ్రహించెను.

విహితాశీ ర్మునిభ్యాంతు రామః సుసమమానసః
ఆససాద పితుః పుణ్యాం సమీపం సురసుందరః. 25

వసిష్ఠవిశ్వామిత్రు లాశీర్వదించిన పిదప, సురసుందరుఁడగు రాముడు, పవిత్రమగు పితృపార్శ్వమును సమీపించెను.

పాదాభివందనపరం తమథాసౌ మహీపతిః
శిరస్యభ్యాలిలింగాశు చుచుంబ చ పునః పునః. 26
శత్రుఘ్నం లక్ష్మణంచైవ తథైవ పరవీరహా
ఆలిలింగ ఘనస్నేహో రాజహంసోఽంబుజే యథా. 27

అనంతరము శత్రువీరహంతయగు దశరథుఁడు శ్రీరామలక్ష్మణశత్రుఘ్నుల కౌగలించుకొని శిరస్సును మూర్కొని, రాజహంస పద్మమును చుంబించునట్లు మరల మరల ముద్దిడుకొనెను.

ఉత్సంగే పుత్ర తిష్ఠేతి వదత్యథ మహీపతౌ
భూమౌ తా పరిజనా స్తీర్ణే సోంఽశుకేఽథ న్యవిక్షత. 28

‘ఒడిలోగూర్చొనుము’ అని దశరథుఁడు పల్కనను వారు సేవకులు పరచిన వస్త్రము మీద గూర్చొనిరి.

రాజోవాచ:—

పుత్ర ప్రాప్తవివేక స్త్వం కల్యాణానాంచ భాజనమ్
జడవజ్జీర్ణయా బుద్ధ్యా ఖేదాయాత్మా న దీయతామ్. 29

రాజు:— కుమారా! నీవు వివేకివి, శుభగుణశోభితుడవు. మూఢునివలె బుద్ధినిఁగోల్పోయి దుఃఖితుఁడవవలదు.

వృద్ధవిప్రగురుప్రోక్తం త్వాదృశేనానుతిష్ఠతా.
పదమాసాద్యతే పుణ్యం నమోహా మనుధావతా 30

పెద్దలును గురువులును నగువారు చెప్పినట్లాచరించుటవలననే నీ యట్టివారు పుణ్యపదమునఁబొందుదురు. మోహాధీనులై కాదు.

తావదేవాఽఽపదోదూరే తిష్ఠంతి పరిపేలవాః
యావదేవ న మోహస్య ప్రసరః పుత్రదీయతే. 31

పుత్రా! మోహాధీనుడవవనంతవఱకు, ఆపదలు నీ దగ్గఱకు రాజాలవు.

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

రాజపుత్ర మహాబాహో శూర స్త్వం విజితా స్త్వయా
దురుచ్ఛేదా దురారంభా అప్యమీ విషయారయః. 32

వసిష్ఠుడు:— రాజపుత్రా! నీవు వీరుడవు. విషయములను అజేయశత్రువులను జయించుట కష్టమైనను, వాటిని నీవు జయించితివి.

కిమతజ్జ్ఞ ఇవాజ్ఞానాం యోగ్యే వ్యామోహసాగరే
వినిమజ్జసి కల్లోలబహులే జాడ్యశాలిని. 33

అయినను, నీవేల జడరూపమగు వ్యామోహసముద్రమున, అజ్ఞానివలె, మునుకలిడుచుంటివి?

శ్రీ విశ్వామిత్ర ఉవాచ:—

చలన్నీలోత్పలవ్యూహసమలోచనలోలతామ్
బ్రూహి చేతఃకృతాం త్యక్త్వా హేతునా కేన ముహ్యసి. 34

విశ్వామిత్రుఁడు:— మనోవికారమువలన నీ కండ్లు కదులుచున్న నీలపద్మములవలెనున్నవి; ఈ చాంచల్యమును వీడి నీ మోహకారణమును వచింపుము.

కిం నిష్ఠాః కే చ తే కేన కియంతః కారణేన తే
ఆధయః ప్రవిలుంపంతి మనోగేహ మివాఖవః. 35

మూషికము లింటిని పాడుచేయునట్లు, నీ చిత్తమునుఁగలంచు దుఃఖమెట్టిది? కారణమేమి? ఎద్దానివలన నీ కీదుఃఖము కల్గినది.



మన్యే నానుచితానాం త్వమాదీనాం పదముత్తమమ్
ఆపత్సు చాఽప్రయోజ్యం తే నిహీనా అపి చాధయః. 36

నీ యట్టి వానికిట్టి చింతతగదు. ప్రతీకారమొనర్చుట నీ కెంతటిపని? ఈచింతకు తావులేదని నే ననుకొందును.

యథాభిమతమాశు త్వం బ్రూహి ప్రాప్స్యసి చానఘ
సర్వమేవ పునర్యేన భేత్స్యంతే త్వాంతు నాధయః. 37

అనఘా! నీ యభీష్టమెట్టిదో వచింపుము. అది సిద్ధించును. మఱి, చింతనందవలసిన అగత్యముండదు.

ఇత్యుక్తమస్య సుమతే రఘువంశకేతు
రాకర్ణ్య వాక్యముచితార్థ విలాసగర్భమ్
తత్యాజ ఖేదమభిగర్జతి వారివాహే
బర్హీ యథా త్వనుమితాభిమతార్థసిద్ధిః. 38

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే వైరాగ్యప్రకరణే
రాఘవసమాశ్వాసనం నామ ఏకాదశః సర్గః ॥ 11 ॥

సుమతియగు విశ్వామిత్రుఁడిట్లు యుక్తములగు పల్కులఁబల్క, రాముడాకర్ణించి, మేఘగర్జనమునువిని నెమిలి సంతసించునట్లు, వాంఛితార్థ ప్రాప్తియగునని ఊహించి, సంతోషించెను.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు వైరాగ్యప్రకరణమున
రాఘవసమాశ్వాసనమను ఏకాదశ సర్గము ॥ 11 ॥



# ద్వాదశః సర్గః

**శ్రీ వాల్మీకిరువాచ:—**

ఇతి పృష్టో మునీంద్రేణ సమాశ్వాస్య చ రాఘవః
ఉవాచ వచనం చారు పరిపూర్ణార్థమంథరమ్. 1

వాల్మీకి:— ఇట్లు మునీంద్రునిచేఁ బ్రశ్నింపఁబడి ఓదార్పఁబడి రాముఁడు అర్థయుక్తములును, మధురములును నగువాక్యముల మెల్లగ నుడువసాగెను.

**శ్రీరామ ఉవాచ:—**

భగవన్ భవతా పృష్టో యథావదధునాఖిలమ్
కథయామ్యహ మజ్ఞోపి కో లంఘయతి సద్వచః. 2

శ్రీరాముడు:— సాధుపురుషుల వాక్యముల నెవరు లంఘింపఁగలరు? అగుటచేసి, అజ్ఞుడనైనను ఉన్నదున్నట్లు చెప్పుచున్నాను.

అహం తావదయం జాతో నిజేఽస్మిన్ పితృసద్మని
క్రమేణ వృద్ధిం సంప్రాప్తః ప్రాప్తవిద్యశ్చ సంస్థితః. 3

నేను పితృగృహమున పుట్టిపెఱిగి, విద్యనార్జించి యుంటిని.

తతః సదాచారపరో భూత్వాహం మునినాయక
విహృత స్తీర్థయాత్రార్థ ముర్వీ మంబుధిమేఖలామ్. 4

మునీశ్వరా! పిదప సదాచారపరాయణుఁడనై, తీర్థయాత్రల సముద్రవలయితమగు, భూమండలము నందంతటను విహరించితిని.

ఏతావతాథ కాలేన సంసారాస్థా మిమామ్ హరన్
సముద్భూతో మనసి మే విచారః సోఽయమీదృశః. 5
వివేకేన పరీతాత్మా తేనాహం తదనుస్వయమ్
భోగనీరసయా బుద్ధ్యా ప్రవిచారితవానిదమ్. 6

ఇప్పుడు నాకు సంసారమనిన, ఆసక్తి నశించినది. వివేకయుక్తుఁడనై, భోగేచ్ఛను బరిత్యజించి ఇట్లు విచారించితిని.

కిం నామేదం బత సుఖం యేయం సంసారసంతతిః
జాయతే మృతయే లోకో మ్రియతే జననాయచ. 7

ఈ సంసారచక్రమున సుఖమేమున్నది? చచ్చుటకై పుట్టుచున్నారు. మరల జన్మించుటకొఱకు చచ్చుచున్నారు.



అస్థిరాః సర్వ ఏవేమే సచరాచరచేష్టితాః
ఆపదాం పతయః పాపా భావా విభవభూమయః. 8

స్థావరజంగమములగు జీవుల ప్రయత్నమునఁగలిగినఁ భోగవిషయములన్నియు, అశాశ్వతములు, ఆపదలకు తావు; పాపములకుఁ గారణములు.

అయఃశలాకాసదృశాః పరస్పరమసంగినః
శ్లిష్యంతే కేవలం భావా మనఃకల్పనయా స్వయా. 9

విషయములకు పరస్పరసంబంధములేదు. అవి ఇనుపకమ్మలవలె విడివిడివి. వాటిసంబంధము కేవలము మనస్సుయొక్క కల్పనయే.

మనః సమాయత్తమిదం జగదాభోగి దృశ్యతే
మనశ్చాసదివాభాతి కేన స్మ పరిమోహితాః. 10

మాయావేషమునుఁదాల్చిన ఈ జగత్తు దీనియొక్క సృష్టిస్థితిలయములుకూడ, మనఃకల్పితములే; బాగుగా పరికించిచూచిన మనస్సున కస్తిత్వములేదు. అగుటఁజేసి, మనము మోహబద్ధులమగుట వృథా.

అసతైవ వయం కష్టం వికృష్టా మూఢబుద్ధయః
మృగతృష్ణాంభసా దూరే వనే ముగ్ధమృగా ఇవ. 11

ఎండమావుల నీళ్లద్రావ పరిగిడు లేళ్లవలె మూఢులమగు మేము, సుఖమునొసగలేని అలీకవస్తువుల * వెంటఁబడుచున్నాము.

న కేనచిచ్చ విక్రీతా విక్రీతా ఇవ సంస్థితాః
బత మూఢా వయం సర్వే జానానా అపి శాంబరమ్. 12

ఆహా! మాయయని తెలిసికొనియు, మూఢులమగు మేము అమ్ముడుపోకపోయినను, అమ్ముడుపోయిన వానివలెనుంటిమి.

కిమేతేషు ప్రపంచేషు భోగా నామ సుదుర్భగాః
ముధైవహి వయం మోహాత్ సంస్థితా బద్ధభావనాః. 13

ఈ ప్రపంచమున, విషయసుఖము లనఁనేమి? — దృష్టములును, నష్టస్వభావములును, దుఃఖబీజములును అగుటవలన) దౌర్భాగ్యస్వరూపములు, మోహవశమున, వాంఛలవలన, గట్టబడితిమి.

అజ్ఞాతం బహుకాలేన వ్యర్థమేవ వయం వనే
మోహే నిపతితా ముగ్ధాః శ్వభ్రే ముగ్ధా మృగాఇవ 14

ఇప్పటికిఁ దెలిసికొంటిని. మృగములు వనమధ్య గర్తమునఁగూలునట్లు, మేమును మోహమునఁబడియున్నారమని.

* అలీకవస్తువన అసద్వస్తువు, తుచ్ఛము, శూన్యము, లేనట్టిది అని గ్రహించునది. ఆకాశపుష్పము, కుందేటికొమ్ము, గంధర్వనగరము, వంధ్యాపుత్రుడు ఇత్యాది అలీకవస్తువులు — అను.

కిం మే రాజ్యేన కింభోగైః కోఽహం కిమిదమాగతమ్
యన్మిథ్యైవాస్తు తన్మిథ్యా కస్య నామ కిమాగతమ్. 15

నేనెవ్వడను? ఎందుల కిటకరుదెంచితిని? నాకీ రాజ్యములతోడను, భోగములతోడనుఁబని యేమున్నది? మిథ్య మిథ్యయే యగుగాక! ఐననేమి?

ఏవం విమృశతో బ్రహ్మన్ సర్వేష్వేవ తతో మమ
భావేష్వరతిరాయాతా పథికస్య మరుష్వివ. 16

బ్రహ్మజ్ఞా! ఇట్లుభావించుటవలన, పాంథునకు మరుభూమియన్న విరక్తి గలుగునట్లు నాకును భోగములన్న విరాగము గలిగినది.

తదేతద్భగవన్ బ్రూహి కిమిదం పరినశ్యతి
కిమిదం జాయతే భూయః కిమిదం పరివర్ధతే. 17

భగవానుడా! ఈపరిదృశ్యమానప్రపంచము (లేక ఈశరీరము) నశించు టెందులకు, మరల జన్మించి స్థితినందు టెందులకు — వచింపుడు. ♦

జరామరణమాపచ్చ జననం సంపదస్తథా
ఆవిర్భావ తిరోభావై ర్వివర్ధంతే పునఃపునః. 18

దుఃఖదాయకములగు జరామరణములు, మృత్యువు, సంపదలు, మరలమరల వచ్చుచు పోవుచున్నవి.

భోగైస్తైరేవ తైరేవ తుచ్ఛైర్వయమమీ కిల
పశ్య జర్జరతాం నీతా వాతైరివ గిరిద్రుమాః. 19

భోగలంపటులమగు మేము మాటిమాటికి జన్మలనెత్తి వాయువువలన శిథిలమొనర్పఁబడిన వృక్షములవలె ఎట్లుంటిమో కాంచుడు!

అచేతనా ఇవ జనాః పవనైః ప్రాణనామభిః
ధ్వనంతః సంస్థితా వ్యర్థం యథా కీచకవేణవః. 20

జనులచేతనులవలె, ఏమియు దెలియనట్లు పురుషార్థవిహీనులై యున్నారే! * కీచకవేణువట్లు ప్రాణవాయుప్రేరితులై శబ్దమునొనర్చుచున్నారు.

♦ ఈప్రశ్న[illegible] [illegible]త్తరము, క్రమముగ, ఉత్పత్తి, స్థితి, ఉపశమ, ప్రకరణముల ప్రవచింపఁబడినది. — [illegible]

* వేణువన వెదురు. దీనికి రంధ్రముల నొనర్చి గాలిని పూరించిన ధ్వనించునను విషయము లోకప్రసిద్ధము. వెదుళ్లుగాలికి ఊగులాడ, లోనికి గాలిప్రవేశించినను, ధ్వనించును. ఇట్లుధ్వనించు వెదురును కీచ[illegible] [illegible]ందురు.



శామ్యతీదం కథం దుఃఖమితి తప్తోఽస్మి చింతయా
జరద్ద్రుమ ఇవోగ్రేణ కోటరస్థేన వహ్నినా. 21

ఈ దుఃఖ మెట్లుపశమించునాయని, కోటరమందున్న అగ్నివలన తప్తమగు జీర్ణవృక్షమువలె తపించుచున్నాను.

సంసార దుఃఖపాషాణ నీరంధ్ర హృదయోఽప్యహమ్
నిజలోక భయాదేవ గలద్బాష్పం న రోదిమి 22

నా హృదయము సంసారదుఃఖమను గట్టిరాతివలన కప్పబడినను, తల్లిదండ్రులకు కష్టమును గలిగింతునను భయమున, కన్నీరు గార్చి ఏడ్చుటలేదు.

శూన్యా మన్ముఖవృత్తీస్తాః శుష్కరోదననీరసాః
వివేక ఏవ హృత్సంస్థో మమైకాంతేషు పశ్యతి. 23

నా హృదయముననున్న వివేకముతప్ప, ఇతరులు నారోదనమును, గ్రహించుటలేదు. నా ముఖవృత్తులన్నియు, (హాస్యాదులన్నియు) నిరశ్రురోదనమున, నీరసములైనవి. నేనొనర్చు వాక్యాలాపహాస్యాదులన్నియు కృత్రిమములు.

భృశం ముహ్యామి సంస్మృత్య భావాభావమయీం స్థితిమ్
దారిద్ర్యేణేవ సుభగో దూరే సంసారచేష్టయా. 24

దురదృష్టవశమున దరిద్రుఁడైన ధనికునివలె, సంసారప్రయత్నముల గుఱించియు, విషయముల వినాశశీలత్వమును గుఱించియు, మిక్కుటముగ మోహమునందుచున్నాను.

మోహయంతి మనోవృత్తిం ఖండయంతి గుణావలిం
దుఃఖజాలం ప్రయచ్ఛంతి విప్రలంభపరాః శ్రియః. 25

నిలుకడలేని సిరి మనోవృత్తుల మోహింపజేయుచున్నది, గుణముల బారద్రోలుచున్నది, దుఃఖముల నిచ్చుచున్నది.

చింతానిచయచక్రాణి నానందాయ ధనాని మే
సంప్రసూతకలత్రాణి గృహాణ్యుగ్రాపదామివ. 26

దరిద్రునకు, స్వగృహము దుఃఖప్రదమైనట్లు, చింతలతోఁగూడఁబెట్టఁబడిన ధనరాసులు నాకానంద దాయకములుకావు.

వివిధదోషదశా పరిచింతనైః
ర్వితతభంగురకారణకల్పితైః
మమ న నిర్వృతిమేతి మనో మునే
నిగడితస్య యథా వనదంతినః. 27

ఉపాయపూర్వకముగ బంధింపఁబడిన అడవి ఏనుగకు శాంతిలేనట్లు సంసారమునందలి వివిధదోషముల గతిని చింతించుటవలనను, అశాశ్వతములగు కారణపరంపరల దలపోయుటవలనను, నాకు మనఃశాంతి లేకున్నది.

ఖలాః కాలేకాలే నిశి నిశిత మోహైకమిహికా
గతా లోకే లోకే విషయ శతచౌరాః సుచతురాః
ప్రవృత్తాః ప్రోద్యుక్తా దిశిదిశి వివేకైక హరణే
రణే శక్తాస్తేషాం క ఇవ విదుషః ప్రోజ్ఝ్య సుభటాః. 28

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే వైరాగ్యప్రకరణే
ప్రథమపరితాపో నామ ద్వాదశః సర్గః ॥ 12 ॥

అజ్ఞానమను రాత్రియందు, దట్టమగు మోహజాలములను తుషారధూమముల, జ్ఞానమను వెలుఁగు కప్పఁబడ చతురులును, పాపులుననగు విషయములను లెక్కకుమించినచోరులు, వివేకమను రత్నమును దొంగలింప, అన్నివేళల అన్నిచోట్ల తిరుగుచుందురు. వీరితో యుద్ధమొనరింప తత్త్వజ్ఞాని గాక మరెవరు సమర్థులు?

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు వైరాగ్యప్రకరణమున
ప్రథమపరితాపమను ద్వాదశ సర్గము ॥ 12 ॥



## త్రయోదశః సర్గః.

శ్రీరామ ఉవాచ:—

ఇయమస్మిన్ స్థితోదారా సంసారే పరికల్పితా
శ్రీర్మునే పరిమోహాయ సాపి నూనం కదర్థదా. 1

మునీ! మూఢులగువారు ఈ సంసారమున లక్ష్మియే సుఖములనిచ్చును. ఆపె చాలగొప్పది. అనుకొందురు. కాని నిజమున కిదియే, మోహకారణము, అనర్థదాయకమును నైయున్నది.

ఉల్లాస బహుళానంత కల్లోలానల మాకులాన్
జడాన్ ప్రవహతి స్ఫారాన్ ప్రావృషీవ తరంగిణీ. 2

పైకిలేచిపడుచుండు మలినతరంగములఁ బ్రవహించు వర్షాకాలనదివోలె, ఉత్సాహపూర్వకమగు బహుళమనోరథములఁ గలతఁబెట్టబడిన మనస్సు పెక్కురు మూర్ఖుల పరవశ మొనర్చును.



చింతాదుహితరోబహ్వ్యో భూరిదుర్లలితైధితాః
చంచలాః ప్రభవంత్యస్యా స్తరంగాః సరితో యథా. 3

సరస్సున తరంగములు లేచునట్లు, ఈలక్ష్మికిచెడుచేతల పెఱుఁగు చింతలను అనేకకన్యలు న్నారు; వీరుచంచలలు.

ఏషాహి పదమేకత్ర న నిబధ్నాతి దుర్భగా
దగ్ధేవానియతాచార మితశ్చేతశ్చ ధావతి. 4

కాలు కాలినదానివలె ఇది ఒకచోట నుండలేదు. ఇటనట తిరుగుచుండును.

జనయంతీ పరం దాహం పరామృష్టాంగికా సతీ
వినాశమేవ ధత్తే న్తర్దీపలేఖేవ కజ్జలమ్. 5

దీపమును ముట్టుకొనిన చేయికాలును, చేతికి మసి యంటుకొనును. అట్లే, లక్ష్మినొకమారు స్పర్శించిన వ్యయాదిరూపకమగు తాపము గల్గును; మోహరూపమగు వినాశము గల్గును.

గుణాగుణవిచారేణ వినైవ కిల పార్శ్వగం
రాజప్రకృతివన్మూఢా దురారూఢావలంబతే. 6

దీని ప్రకృతి రాజుస్వభావమువలె మూఢమైనది; తన్ను సమీపింప గలిగినవారి నెవరినైనను గుణదోష విచారములేకయే ఆశ్రయించును.

కర్మణా తేనతేనైషా విస్తారమనుగచ్ఛతి
దోషాశీ విషవేగస్య యత్ క్షీరం విస్తరాయతే. 7

పాలు పామునకు బలమునిచ్చునట్లు హింసానృత దోషములవలననే లక్ష్మి వృద్ధినందును.

తావచ్ఛీతమృదు స్పర్శః పరేస్వేచ జనే జనః
వాత్యయేవ హిమం యావచ్ఛ్రియా న పరుషీకృతః. 8

సహజముగ మంచుతుంపురులు, శీతస్పర్శను మృదుత్వమును గల్గియుండును; గాలితగిలిన రొండిపోవును. అట్లే, లక్ష్మిస్పర్శ (=ధనము) కలిగి మనుష్యుఁడు శుష్కించనంతవఱకు, మృదుస్వభావమును, శాంతమును గలిగి యుండును.

ప్రాజ్ఞాః శూరాః కృతజ్ఞాశ్చ పేశలా మృదవశ్చ యే
పాంసుముష్ట్యేవ మణయః శ్రియా తే మలినీకృతాః. 9

మకిలిచెయ్యి మణులనుఁబాడు చేయునట్లు, శూరులును, కృతజ్ఞులును, మెత్తనివారును, మృదుస్వభావులును, అగువారు లక్ష్మివలన పాడుచేయఁబడినారు.

న శ్రీః సుఖాయ భగవన్ దుఃఖాయైవ హి వర్ధతే
గుప్తా వినాశనం ధత్తే మృతిం విషలతా యథా. 10

భగవానుఁడా! సంపదల సభివృద్ధిపరుప లభించునది దుఃఖమే, సుఖముకాదు. దానిని రక్షించుట (కూడబెట్టుట) వినాశకారిణియగు విషలతనుఁ బెంచుటవంటిది.

శ్రీమానజననింద్యశ్చ శూరశ్చాప్యవికత్థనః
సమదృష్టిః ప్రభుశ్చైవ దుర్లభాః పురుషాస్త్రయః. 11

లోకనిందలేని ధనికుఁడు, పొగడ్తలేని వీరుఁడు, పక్షపాతము లేని ప్రభువు — ఇట్టి వారు లభింపరు.

ఏషాహి విషమా దుఃఖభోగినాం గహనా గుహా
ఘనమోహా గజేంద్రాణాం వింధ్యశైల మహాతటీ. 12

ఈలక్ష్మి — ఆపదలను పాములకు పుట్ట; మోహము లను ఏనుగులకు విశాలమగు వింధ్య పర్వతభూమి. (అనగా, పాములు ఇతరులు చొరలేని గుహ నాశ్రయించుకొని యుండునట్లును, ఏనుగులు వింధ్యపర్వతభూమి నాశ్రయించుకొని యుండునట్లును, దుఃఖమోహములు లక్ష్మి నాశ్రయించుకొని యుండునని భావము.)

సత్కార్య పద్మరజనీ దుఃఖకైరవ చంద్రికా
సుదృష్టి దీపికా వాత్యా కల్లోలౌఘతరంగిణీ. 13

ఈ లక్ష్మి — సత్కార్యములను పద్మములకు రాత్రి, దుఃఖములను కలువలకు వెన్నెల. పరమార్థదృష్టియను దీపమునకు పెనుగాలి, కోర్కెలను కల్లోల తరంగములకు తావగు చెఱువు.

సంభ్రమాభ్రాదిపదవీ విషాద విషవర్ధినీ
కేదారికా వికల్పానాం ఖేదాయ భయభోగినీ. 14

ఈ లక్ష్మి — భయభ్రాంతులను మేఘములకు మొదలిబాట; విషాదమునుఁ బెంపొంద జేయును. వికల్పముల కాటపట్టు, దుఃఖమును గల్పించు పెనుబాము.

హిమం వైరాగ్యవల్లీనాం వికారోలూకయామినీ
రాహుదంష్ట్రా వివేకేందోః సౌజన్యాంభోజచంద్రికా. 25

ఈ లక్ష్మి — వైరాగ్యలతకు మంచు, కామాది వికారములను గ్రుడ్లగూబలకు రాత్రి. వివేకమను చంద్రునకు రాహువు. మంచియను తామరకు వెన్నెల.

ఇంద్రాయుధవదాలోల నానారాగమనోహరా
లోలాతడిదివోత్పన్నధ్వంసినీ చ జడాశ్రయా. 16

ఈ లక్ష్మి — ఇంద్రధనస్సువలె చలించు రంగులతో (రాగాది వికారములతో) మనోహరముగ కన్పట్టును. మెఱపుతీగవలె చంచలము. "ఇట్టెవచ్చి, అట్టెపోవును." మూర్ఖుల నాశ్రయించుకొనియుండును. (ధనికులందరు సామాన్యముగ మూర్ఖులే గదా!)

చాపలావజితారణ్యానకులీ న కులీనజా
విప్రలంభనతాత్పర్య జితోగ్రమృగతృష్ణికా. 17

ఈ లక్ష్మి — చాపల్యమున అడవిముంగిని జయించును. సత్కులమున జనించినవారి కడనుండదు. మోసగించుటలో ఎండమావిని మించినది.



లహరీవైకరూపేణ పదంక్షణమకుర్వతీ
చలా దీపశిఖేవాతిదుర్జ్ఞేయగతిగోచరా. 18

ఈ లక్ష్మి — విరిగిపడిపోవు తరంగములవలె నొకచోటునంటిపెట్టుకొని యుండదు. దీపశిఖవలె చంచలము. దీని ఉనికి మనుజులఁ దెలియజాలము.

సింహీవ విగ్రహవ్యగ్ర కరీంద్రకులపోథినీ
ఖడ్గధారేవ శిశిరా తీక్ష్ణతీక్ష్ణాశయాశ్రయా. 19

ఈ లక్ష్మి — ఆడుసింహమువలె, యుద్ధమొనర్ప నిచ్చించు ఏనుగులను శత్రువుల నాశమొనర్చును. ఖడ్గధారవలె శీతలమైనను క్రూరాశయములు గలవారి నాశ్రయించుకొని యుండును.

నానయాపహృతార్థిన్యా దురాధివరిలీనయా
పశ్యామ్యభవ్యయా లక్ష్మ్యా కించిద్దుఃఖాదృతే సుఖమ్. 20

మహర్షీ! పరవంచన ఇత్యాదులకు పాపములం బ్రోగుజేయబడిన దీ లక్ష్మి. ఇది దుఃఖముల వెంటఁబెట్టుకొని వచ్చును. నేను గ్రహించినదేమన, దీన దుఃఖముగాక, అవంతైన సుఖములేదు.

దూరేణోత్సారితాऽలక్ష్మ్యా పునరేవ తమాదరాత్
అహోబతాశ్లిష్యతీవ నిర్లజ్జా దుర్జనా సదా. 21

సవితిఱుగు దారిద్ర్యమువలన ఒకానొకపురుషుని నుండి తఱుమబడియు, ఈ లక్ష్మి సిగ్గులేని దానివలె మరల ఆ పురుషునే ఛీ! ఆలింగనమొనర్చుకొనును.

మనోరమా కర్షతి చిత్తవృత్తిం కదర్థసాధ్యా క్షణభంగురాచ
వ్యాలావలీ గాత్ర వివృత్త దేహా శ్వభ్రోత్థితా పుష్పలతేవ లక్ష్మీః. 22

ఇత్యార్షే వాసిష్ఠ-మహారామాయణే వాల్మీకీయే వైరాగ్య
ప్రకరణే లక్ష్మీనిరాకరణం నామ
త్రయోదశః సర్గః ॥ 13 ॥

ఈ లక్ష్మి హత్యాదులగు దుస్సాహస కార్యముల వలన లభించును; క్షణభంగురము; పాములున్న పాడునూతినుండి బయలువెడలిన పుష్పలతవలె మనోహరమై కన్పట్టి మనస్సుల హరించును.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు వైరాగ్య
ప్రకరణమున లక్ష్మీనిరాకరణమను
త్రయోదశ సర్గము ॥ 13 ॥



## చతుర్దశః సర్గః.

శ్రీరామ ఉవాచ:—

అయుః పల్లవకోణాగ్రలంబాంబుకణభంగురమ్
ఉన్మత్తమివ సంత్యజ్య యాత్యకాండే శరీరకమ్. 1

శ్రీరాముడు:— ఆయువు చివురుటాకు కొననున్న నీటిబొట్టువలె క్షణభంగురము. ఉన్మత్తునివలె చటుక్కున ఈ శరీరము వదలిపోవును.

విషయాశీ విషాసంగ పరిజర్జరచేతసాం
అప్రౌఢాత్మ వివేకానా మాయురాయాస కారణమ్. 2

విషయములను విషసర్పములవలన చితికిన మనస్సుగలవారును, వివేకములేనివారును నగు వారికి ఆయువు దుఃఖ హేతువు.

యేతు విజ్ఞాతవిజ్ఞేయా విశ్రాంతా వితతే పదే
భావాభావ సమాశ్వాస మాయుస్తేషాం సుఖాయతే. 3

తత్త్వజ్ఞానబలమున బ్రహ్మపదమునుండి శాంతినందిన వారికిని, లాభాలాభముల సమదృష్టితో బరికించువారికిని, ఆయువు (=జీవితము) సుఖదాయకము.

వయం పరిమితాకార పరినిష్ఠిత నిశ్చయాః
సంసారాభ్ర తడిత్పుంజే మునే నాయుషి నిర్వృతాః. 4

మునీ! మాకు ఆత్మబుద్ధి పరిమితాకారమగు ఈ శరీరముననే. (ఆత్మ అపరిమితుడు, అఖండుడు, అని ఇచ్చటధ్వని) అందువలన, మాకీసంసార మేఘముల మెఱుపగు జీవితమున సుఖములేదు.

యుజ్యతే వేష్టనం వాయో రాకాశస్యచ ఖండనం
గ్రథనంచ తరంగాణా మాస్థా నాయుషి యుజ్యతే. 5

గాలిని ప్రోగుచేయుట, ఆకాశమును తునుకలుగావించుట, తరంగములఁదూచుట— సంభవములైననగుగాక! అయినను, ఆయువును నమ్మజాలము.

పేలవం శరదీవాభ్ర మస్నేహ ఇవ దీపకః
తరంగక ఇవాలోలం గతమేవోపలక్ష్యతే 6

జీవితము శరత్కాలమేఘములవలెను, చమురులేని దీపమువలెను, సారశూన్యము: తరంగ చంచలము; దీనిని పోయినదానిగనే తలంచుట మంచిది.

తరంగం ప్రతిబింబేందుం తడిత్ పుంజం నభోఽంబుజం
గ్రహీతుమాస్థాం బధ్నామి న త్వాయుషి హతస్థితౌ. 7

తరంగమును, చంద్రునిప్రతిబింబమును, మెఱుపు సమూహమును, ఆకాశకమలమును గైకొనుటకు నమ్మవచ్చును కాని, అస్థిరమగు జీవితమును నమ్మలేము.



అవిశ్రాంతమనాః శూన్య మాయురాతతమీహతే
దుఃఖాయైవ విమూఢోఽంతర్గర్భమశ్వతరీ యథా. 8

వ్యాకులచిత్తముతో మూఢులు వ్యర్థమగు జీవితమును పొడిగింప జూతురు; ఇది అశ్వతరి* గర్భమును గోరుటవంటిది.

సంసార సంసృతావస్యాం ఫేనోఽస్మిన్ సర్గసాగరే
కాయవల్ల్యాంభసో బ్రహ్మన్ జీవితం మే న రోచతే. 9

బ్రహ్మజ్ఞుడా! ఈ సంసారమున పరిభ్రమించుట కనుకూలమైన శరీరలత, సృష్టి సముద్రము నందలి నుఱుగువంటిది; ఇట్టి అశాశ్వత వస్తువునందు నాకు రుచిలేదు.

ప్రాప్యం సంప్రాప్యతే యేన భూయో యేన న శోచ్యతే
పరాయా నిర్వృతేః స్థానం యత్తజ్జీవిత ముచ్యతే. 10

ఎద్దానివలన పరమపురుషార్థమగు మోక్షము లభించునో, పునర్జన్మదుఃఖము నశించునో, పరమసుఖమగు జీవన్ముక్తి సుఖమునకెయ్యది స్థానమో, అయ్యదియే యథార్థజీవితము.

తరవోఽపి హి జీవంతి జీవంతి మృగపక్షిణః
స జీవతి మనో యస్య మననేన న జీవతి. 11

చెట్టుచేమలును జీవించుచున్నవి, పశుపక్షులును జీవించుచున్నవి. (కాని వాని బ్రతుకు బ్రతుకుకాదు) తత్త్వచింతవలనగాని, వాసనాక్షయము వలనగాని, లయమైన మనస్సుగలవాని జీవితమే జీవితము.

జాతాస్త ఏవ జగతి జంతవః సాధుజీవితాః
యే పునర్నేహ జాయంతే శేషా జరఠగర్దభాః. 12

మరల పుట్టుకలేని సాధువుల జీవితమే జీవితము. అశుద్ధమగు దేహాత్మబుద్ధిగల తక్కిన జీవులందరు ముసలిఎద్దులు. (ముసలియెద్దువలె, దీర్ఘాయుర్దాయమున్నను వారిజీవిత మప్రశస్తమని భావము)

భారోఽవివేకినః శాస్త్రం భారో జ్ఞానంచ రాగిణః
అశాంతస్య మనో భారో భారోఽనాత్మవిదో వపుః. 13

అవివేకులకు శాస్త్రజ్ఞానము పెనుబరువు; అనర్థక శ్రమహేతువు. కోర్కెల గలవారికి సర్వ దుఃఖముల దూరీకరించు జ్ఞానముకూడ బరువే! చింతగలవారికి మనస్సు బరువు. అనాత్మవిదునకు శరీరమే బరువు.

రూపమాయుర్మనోబుద్ధి రహంకారస్తథేహితం
భారోభారధరస్యేవ సర్వం దుఃఖాయ దుర్ధియః. 14

బరువుమోయువారికి దుఃఖమును లేక కష్టమునుఁ గలిగించునట్లు, దుర్మతులకు రూపము, ఆయువు, మనస్సు, బుద్ధి, అహంకారము, ప్రయత్నము ఇత్యాదులన్నియు దుఃఖమును గలిగించును.

---

* అశ్వగర్దభములకుఁ గలిగినది అశ్వతరి; దీనిగర్భనిర్గమనము ఉదరవిదారణము వలననే యనుసంగతి లోకప్రసిద్ధము.

అవిశ్రాంతమనాఃపూర్ణమాపదాం పరమాస్పదం
నీడం రోగవిహంగానా మాయురాయాసనం దృఢమ్. 15

ప్రత్యహం ఖేదముత్సృజ్య శనైరల మనారతం
ఆఖునేవ జరచ్ఛ్వాభ్రం కాలేన వినిహన్యతే. 16

ఆయువే అశాంతి, అతృప్తి, పరిశ్రమలకు కారణము, రోగములను పక్షులకు గూడు. ఎలుకలు కష్టములకు భయపడక, ప్రతిదినము కలుగును ద్రవ్వునట్లు, కాలముగూడ ఆయువు నుత్తరించుచున్నది.

శరీరబిలవిశ్రాంతై ర్విషదాహప్రదాయిభిః
రోగై రాపీయతే రౌద్రై ర్వ్యాలై రివ వనానిలః. 17

అరణ్యవాయువును సర్పములు క్రోలునట్లు, శరీర బిలమునను్న రోగము లాయువును పీల్చుచున్నవి; వీటి స్వభావము క్రూరము. ఇవి విషమును బోలు లేపమునిచ్చును.

ప్రస్నువానై రవిచ్ఛేదం తుచ్ఛై రంతరవాసిభిః
దుఃఖై రావృశ్చ్యతే క్రూరై ర్ఘుణై రివ జరద్ద్రుమః. 18

ఘుణమను పురుగు ఎండువారిన మ్రాను మొదలనుండి, పొట్టునుఁ జిమ్ముచు దాని నుత్తరించునట్లు రోగాది దుఃఖములు శరీరమందుండి మలరక్తముల వెలువరించుచు, ఆయువును. నశింపఁజేయుచున్నవి.

నూనం నిగరణాయాశు ఘనగర్ధమనారతం
ఆఖుర్మార్జారకేణేవ మరణే నావలోక్యతే. 19

ఎలుకను మ్రింగ పిల్లి వేచియుండునట్లు, మృత్యువు జీవితమునుఁ గబళింప వేచియున్నది.

గంధాదిగుణగర్భిణ్యా శూన్యయాఽశక్తివేశ్యయా
అన్నం మహాశనేనేవ జరయా పరిజీర్యతే. 20

రూపాది కృత్రిమగుణములుఁ గల్గి శక్తిహీనయగు వేశ్యనుఁబోలిన జర, ఆహార పుష్టిగల మనుజుఁ డెక్కుడుగ భోజనమొనర్చి హరించుకొనునట్లు, బలక్షయముతోఁబాటు ఆయువును జీర్ణమొనరించుకొనును.

దినైః కతిపయైరేవ పరిజ్ఞాయ గతాదరం
దుర్జనః సుజనేనేవ యౌవనేనావముచ్యతే. 21

సుజనుఁడు దుష్టుని అల్పసమయముననే గుర్తించి నిరాదరణ పూర్వకముగ వానిని వదలునట్లు, యౌవనముగూడ పురుషార్థప్రాప్తికై యత్నమొనరింపని పురుషుని నిరాదరణను దెలిసికొని, వానిని వెంటనే వదలిపెట్టును. (అనగా యౌవన మనిత్యమనియు, బలశక్తులు కలిగియున్న సమయముననే మోక్షముకొఱకు ప్రయత్నము సల్పవలెననియు భావము.)



వినాశ సుహృదా నిత్యం జరామరణ బంధునా
రూపం ఖంగవరేణేవ కృతాంతేనాభిలష్యతే. 22

విటుడు సౌందర్యము నభిలషించునట్లు వినాశమునకును, జరామరణములకును మిత్రుడగు యముఁడు ఆయువు నభిలషించును.

స్థిరతయా సుఖభాసితయా తయా
సతత ముజ్ఝిత ముత్తమ ఫల్గు చ
జగతి నాస్తి తథా గుణవర్జితం
మరణభాజనమాయురిదం యథా. 23

ఇత్యార్షే వాసిష్ఠ-మహారామాయణే వాల్మీకీయే వైరాగ్య ప్రకరణే
జీవితగర్హో నామ చతుర్దశః సర్గః ॥ 14 ॥

ఆయువు సుఖవిహీనము, చంచలము, అతితుచ్ఛము, గుణవిహీనము, మరణభాజనము; జగత్తున నిట్టివస్తువు మరొకటిలేదు.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు వైరాగ్యప్రకరణమున
జీవితగర్హణమను చతుర్దశ సర్గము ॥ 14 ॥



## పంచదశసర్గః.

---

శ్రీ రామ ఉవాచః—

ముధైవాభ్యుత్థితో మోహాత్ ముధైవ పరివర్ధతే
మిథ్యామయేన భీతోఽస్మి దురహంకారశత్రుణా. 1

శ్రీరాముఁడు:—మోహమే, అనగా అజ్ఞానమే అహంకారమునకు మూలము; దీని ఉత్పత్తిస్థితులు వ్యర్థములు. మిథ్యారూపమగు ఈ శత్రువనిన నాకు మిక్కుటమగు భయము.

అహంకారవశాదేవ దోషకోశ కదర్థితాం
దదాతి దీనదీనానాం సంసారో వివిధాకృతిః. 2

కర్మఫలరూపమగు ఈ సంసారమున జ్ఞానధనము లేని హీనులను, రాగద్వేషములున్న కోశమున కధిపతులఁ జేయున దీయహంకారమే.

అహంకారవశాదాపదహంకారా ద్దురాధయః
అహంకార వశాదీహా త్వహంకారో మమామయః. 3

వ్యాధులు, చింతలు, కోర్కెలు, అహంకారవశముననే కలుగుచున్నవి; ఈ అహంకారమే నారోగము.

తమహంకార మాశ్రిత్య పరమం చిరవైరిణమ్
నభుంజే నపిబామ్యంభః కిముభోగాన్ భుజే మునే. 4

మునీంద్రా! ఇట్టి పరమ శత్రువగు అహంకారము నాశ్రయించి అన్నపానముల వదలి వైచితిని. ఇంక భోగముల మాటయేమి?

సంసారరజనీ దీర్ఘా మాయా మనసి మోహినీ
తతాహంకార దోషేణ కిరాతేనేవ వాగురా. 5

కిరాతుఁడు వలను పన్నినట్లు, ఈ సంసారమను రాత్రియందు అహంకారముకూడ జీవుని మనస్సున దీర్ఘమును మోహరూపమును నగు వలనుఁ బన్నుచున్నది.

యాని దుఃఖాని దీర్ఘాణి విషమాణి మహాంతిచ
అహంకారాత్ ప్రసూతాని తాన్యగాత్ ఖదిరాఇవ. 6

ఖదిరవృక్షములు పర్వతమునుండి పుట్టునట్లు, బహుకాలముండునవియు, నానావిధములును, ప్రబలములును నగు దుఃఖములు అహంకారమునుండియే కలుగుచున్నవి.

శమేందు సైంహికే యాస్యం గుణపద్మహిమాశనిమ్
సామ్యమేఘ శరత్కాల మహంకారం త్యజామ్యహమ్. 7

ఈ అహంకారము:—శమయను చంద్రునకు రాహువు, సుగుణములను పద్మములకు హిమరూపకమగు వజ్రము, సర్వభూత దయయను మేఘములకు శరత్కాలము; ఇద్దానిని విడుచుచున్నాను.

నాహం రామో నమేవాంఛా భావేషు నచమే మనః
శాంత ఆసితుమిచ్ఛామి స్వాత్మనీవ *జినోయథా. 8

నేను రాముఁడను గాను, నాకు కోర్కెలులేవు, నాకు మనస్సు లేదు. నేను బుద్ధునివలె శాంతభావమున సర్వభూతముల నావలె గాంచ గోరెదను.

అహంకారవశాద్యద్యన్మయా భుక్తం హుతం కృతమ్
సర్వం తత్తదవస్త్వేవ వస్త్వహంకారరిక్తతా. 9

అహంకారవశుడనై, నేను తినినది, వ్రేల్చినది, ఒనర్చినది, అన్నియు తుచ్ఛములు. అహంకారత్యాగమే సారవస్తువు.

* జిత్ ఇతివాపాఠః.



అహమిత్యస్తిచేద్ బ్రహ్మన్నహమాపది దుఃఖితః
నాస్తిచేత్ సుఖితస్తస్మా దనహంకారితా వరమ్. 10

'అహం' భావమున్న, ఆపదలందు 'అహం' పదవాచ్యుడనగు నేను దుఃఖము ననుభవింపవలసియుండును; అహంకారము లేనిచో, మఱి దుఃఖము ననుభవించునదెవరు? — దుఃఖము లేకపోవుటయే సుఖము. అందువలన అహంభావము లేకపోవుటయే మంచిది.

అహంకారం పరిత్యజ్య మునే శాంతమనస్తయా
అవతిష్ఠే గతోద్వేగో భోగౌఘో భంగురాస్పదః. 11

మునీ! నేనహంకారమును త్యజించి మనశ్శాంతిని బడసి, ఉద్వేగ విహీనుడనైతిని. భోగ పదార్థములు క్షణభంగురములు; ఇంద్రియాధీనములు (వీటివలన నిత్యస్థితి కలుగదు.)

బ్రహ్మన్ యావదహంకారవారిదః పరిజృంభతే
తావద్ వికాసమాయాతి తృష్ణాకుటజమంజరీ. 12

మహాత్మా! అహంకార మేఘములు విస్తరించుచున్నంతవఱకు, తృష్ణ యను కుటజ మంజరులు వికసించుచునే యుండును.

అహంకారఘనే శాంతే తృష్ణా నవతడిల్లతా
శాంతదీప శిఖావృత్త్యా క్వాపి యాత్యతి సత్వరమ్. 13

అహంకార మేఘములు తేలిపోయిన, తృష్ణయను మెఱుపుతీగె ఆరిపోవు దీపమువలె యెచ్చటికో మాయమైపోవును.

అహంకార మహావింధ్యే మనోమత్తమహాగజః
విస్ఫూర్జతి ఘనాస్ఫోటైః స్తనితైరివ వారిదః. 14

మేఘము ఉఱుములతో నాడంబరమొనర్చునట్లు, మనస్సను మదపుటేనుగ, అహంకారమను వింధ్యపర్వత గుహలలో, ఉత్సాహముతో విజృంభించుచుండును.

ఇహ దేహమహారణ్యే ఘనాహంకారకేసరీ
యోఽయ ముల్లసతి స్ఫారస్తేనేదం జగదాతతమ్. 15

శరీరారణ్యముననున్న, ఈ అహంకార సింహమునుండియే (సుకృత దుష్కృత ఫలభోగ రూపమగు) ఈ జగత్తు విస్తరిల్లుచున్నది.

తృష్ణాతంతులవప్రోతా బహుజన్మపరంపరా
అహంకారోగ్రఖంగేన కంఠే ముక్తావలీ కృతా. 16

ఈ జన్మపరంపరలు తృష్ణయను దారమున గ్రుచ్చఁబడియున్నవి; దీనిని అహంకారమను విటుఁడు ముత్యాలమాలవలె కంఠమునఁ దాల్చినాడు.

పుత్రమిత్రకళత్రాది తంత్రమంత్ర వివర్జితం
ప్రసారితమనేనేహ మునేఽహంకారవైరిణా. 17

మునీ! పుత్రమిత్రకళత్రాద రూపకమగు వలను ఈ అహంకార శత్రువు మంత్రతంత్రముల సాయము నపేక్షింపకయే, పన్నినాడు *

ప్రమార్జితేఽహమిత్యస్మిన్ పదే స్వయమపి ద్రుతం
ప్రమార్జితా భవంత్యేతే సర్వఏవ దురాధయః. 18

అహంకారమును మొదలంట నరికి వైచిన, తక్కిన బాధలన్నియు తమంతటఁదామే, తొలఁగిపోవును.

అహమిత్యంబుదే శాంతే శనైశ్చ శమశాలినీ
మనోగహన సమ్మోహ మిహికా క్వాపి గచ్ఛతి. 19

మనో గగనముననున్న శాంతినాశినియగు మోహమను మంచుబొట్టు, అహంకారమను పొగమంచు తొలఁగినచో మాయమైపోవును.

నిరహంకారవృత్తేర్మే మౌర్ఖ్యాచ్ఛోకేన సీదతః
యత్కించి దుచితం బ్రహ్మం స్తదాఖ్యాతుమిహార్హసి. 20

బ్రహ్మజ్ఞా! నే నహంకారమును విడచి పెట్టితిని. కాని అజ్ఞానవశమున దుఃఖమునందు చున్నాను. నామంచి కవసరమగు దానిని వచింపుడు!

సర్వాపదాం నిలయమధ్రువ మంతరస్థ
మున్ముక్త ముత్తమగుణేన న సంశ్రయామి
యత్నాదహం కృతిపదం పరితోఽతిదుఃఖం
శేషేణ మాం సమనుశాధి మహానుభావ. 21

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే వైరాగ్యప్రకరణే
అహంకారజుగుప్సా నామ పంచదశః సర్గః ॥ 15 ॥

మహానుభావా! సర్వాపదలకు నిలయమును, హృదయమునందలి సద్గుణము లన్నిటివలనను ఖండింపఁబడినదియు, దుఃఖప్రదమునునగు అహంకారమును ప్రయత్నముతో వివర్జించితిని. ఇఁక కర్తవ్యమేమియో వచించి, నాకాత్మతత్వము నుపదేశింపుడు.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు వైరాగ్యప్రకరణమున
అహంకారజుగుప్సయను పంచదశ సర్గము ॥ 15 ॥

---

* లేక, అహంకార వైరిచే గూర్పఁబడిన ఈ పుత్రమిత్ర కళత్రాదులు, మంత్రతంత్రము॥ అవసర మపేక్షింపకయే, మనుష్యుని నేప్పింతురు; లేక మంత్రతంత్రములవలనగూడ, ఈ వలనుండి యీవల బడజాలము — అను.



# షోడశః సర్గః

శ్రీరామ ఉవాచః—

దోషైర్జర్జరతాం యాతి సత్కార్యాదార్యసేవనాత్
వాతాన్తః పిచ్ఛలవవచ్చేతశ్చలతి చంచలమ్. 1

శ్రీరాముఁడు:- మనస్సు ముముక్షువుల కత్యంతావసరమగు సాధుసేవను విడచి కామాది దోషముల నాశ్రయించి శక్తినిఁ గోల్పోవును; నెమిలిపింఛపు తుదికొన గాలిలో నూగులాడునటు, చంచలమై చలించుచుండును.

ఇతశ్చేతశ్చ సువ్యగ్రం వ్యర్థమేవాభిధావతి
దూరాద్దూరతరం దీనం గ్రామే కౌలేయకో యథా. 2

గ్రామమున కుక్క అటునిటు తిరుగులాడునట్లు, కారణములేకుండగనే వ్యాకులమై దీన భావమున దూరప్రదేశముల దిరుగులాడుచుండును.

న ప్రాప్నోతి క్వచిత్ కించిత్ ప్రాప్తైరపి మహాధనైః
నాంతః సంపూర్ణతామేతి కరణ్డక ఇవాంబుభిః. 3

దీని కెచ్చటను, ఏమియు దొఱకదు. గొప్పధనరాశి దొఱకినను దీనికడుపు * ఓటికుండ వలె, నిండదు.

నిత్యమేవ మునే శూన్యం కదాశా వాగురావృతమ్
న మనో నిర్వృతిం యాతి మృగో యూథాదివ చ్యుతః. 4

మునీ! దురాశయను వలలోబడిన శూన్యచిత్తము, మందనువీడి వలలో బడిన లేడివలె శాంతిని బొందజాలదు.

తరంగతరలాం వృత్తిం దధదాలూనశీర్ణతామ్
పరిత్యజ్య క్షణమపి హృదయే యాతి న స్థితమ్. 5

తరంగములవలె చంచలమగు మనస్సు, స్థూలసూక్ష్మావయవముల చింతనువీడి, హృదయమున నొక్కనిమిషమైన స్థిరముగనుండ నేరదు.

మనో మననవిక్షుబ్ధం దిశో దశ విధావతి
మందరాహననోద్ధూతం క్షీరార్ణవపయో యథా. 6

మందర పర్వతమువలన మథింపఁబడిన క్షీరసముద్రమందలి నీటివలె, విషయానుచింతనమున ఖిన్నమైన యీ మనస్సు దశదిశలకు పరుఁగులిడుచున్నది.

---

* మూలమున కరగుక మను శబ్దము ప్రయోగింపబడినది. కరగుకమన వెదుళ్లతో నల్లినబుట్ట, దీనియందు నీళ్లునిలువవుకదా! — అను.

కల్లోలకలితావర్తం మాయయా మకర మాలితం
న నిరోద్ధుం సమర్థోఽస్మి మనోమయమహార్ణవమ్. 7

వివిధములగు చిత్తవృత్తులవలనఁ గల్పింపఁబడిన సుడిగుండములును, పరవంచన, క్రూరత్వములను మొసళ్లును, యీ మనస్సను మహాసముద్రమునను న్నవి; దీని నరికట్టలేకుంటిని.

భోగదూర్వాంకురాకాంక్షీ శ్వభ్రపాత మచింతయన్
మనోహరిణకో బ్రహ్మన్ దూరం విపరిధావతి. 8

మహాత్మా! మనస్సను లేడి కోర్కెలను పచ్చిగడ్డికై, లోభముతో నరకమను గుంటలో పడుటనుగూర్చి చింతింపక దూరముగ పరువులిడుచున్నది.

న కదాచన మే చేతః స్వామాలూనవిశీర్ణతాం
త్యజత్యాకులయా వృత్త్యా చంచలత్వమివార్ణవః. 9

ఆకులములగు వృత్తులతో గూడుకొనియున్న నా మనస్సు, సముద్రము చంచలత్వమును వీడలేనట్లు, దేహచింతను వీడలేకున్నది.

చేతశ్చంచలయా వృత్త్యా చింతానిచయచంచురం
ధృతిం బధ్నాతి నైకత్ర పంజరే కేసరీ యథా. 10

మనస్సు స్వభావతః చంచలము; అన్యచింతలతో మరింత చంచలమైనది. శక్తినంతయు వినియోగించి నిరోధించినను, బోనులోనుంచఁబడిన సింహమువలె నొకచోట కుదుర్కొని యుండజాలదు.

మనో మోహరథారూఢం శరీరాత్ సమతాసుఖం
హరత్యపహతోద్వేగం హంస క్షీరమివాంభసః. 11

మోహరథము నెక్కిన మనస్సు, హంస పాలను నీటినుండి వేఱుపరచి గైకొనునట్లు, ఉద్వేగనాశకరమగు సమరసస్వరూపకమగు ఆత్మజ్ఞానమును శరీరమునుండి వేఱుపరచి హరించుచున్నది.

అనల్పకల్పనాతల్పే విలీనా శ్చిత్తవృత్తయః
మునీంద్ర న ప్రబుధ్యంతే తేన తప్యేఽహా మాకులః. 12

మునీంద్రా! ద్వైతభావనా రూపకమగు వివిధకల్పనలను శయ్యయందు పరుండిన చిత్తవృత్తులు, ఆత్మాధ్యోపదేశమునందినను మేల్కొనవు; అందువలననే నేను మిక్కుటముగ విచారించుచున్నాను.

క్రోడీకృత దృఢగ్రంథి తృష్ణాసూత్రే స్థితాత్మనా
విహగో జాలకేనేవ బ్రహ్మన్ బద్ధోఽస్మి చేతసా. 13

మహాత్మా! వేటకాడు నాఱులను పన్ని, దారమును చేతనుంచుకొని, దూరమున పొంచియుండి, పక్షులు చిక్కుబడినప్పుడు దారమునులాగి ముడిపడునట్లొనర్చి, వాటిని బంధించునట్లు, చిత్తము తృష్ణయను సూత్రమును ... యందమున నుంచుకొని, నన్ను బంధించుచున్నది.



సంతతామర్ష ధూమేన చింతాజ్వాలాకులేనచ
వహ్నినేవ తృణం శుష్కం మునే దగ్ధోఽస్మి చేతసా. 14

మునివరా! ప్రబలమగు రోషమను ధూమముచే నావృతమై, చింతలను జ్వాలలతో గూడిన అగ్నింబోలు నాచిత్తము, ఎండుగడ్డినిఁబోలు నన్ను దహించుచున్నది.

క్రూరేణ జడతాం యాత స్తృష్ణాభార్యానుగామినా
శవం కౌలేయకేనేవ బ్రహ్మన్ భుక్తోఽస్మి చేతసా. 15

బ్రహ్మజ్ఞా! క్రూరమగు చిత్తము తృష్ణయను భార్యననుసరించుచు జ్ఞానవిహీనుడనగు నన్ను కుక్క ఆచేతనశవమును భక్షించునట్లు భక్షించుచున్నది.

తరంగతరలాస్ఫాల వృత్తినా జడరూపిణా
తటవృక్ష ఇవౌఘేన బ్రహ్మన్ నీతోఽస్మిచేతసా. 16

బ్రాహ్మణుడా! గట్టులఁగొట్టుకొను నదీతరంగములు గట్టునను న్న చెట్టును బడగొట్టునట్లు అలలవలె చంచలమును, కోరినవిషయములు లభింపకపోవుటవలన ఘాతప్రతిఘాతముల నందినదియు నగు చిత్తము నన్ను పడఁగొట్టుచున్నది.

అవాంతర నిపాతాయ శూన్యేవా భ్రమణాయ చ
తృణం చండానిలేనేవ దూరే నీతోఽస్మి చేతసా. 17

సుడిగాలి, దూరమున పడవేయుటకుగాని, లేక ఆకాశమధ్యమునఁ ద్రిప్పుటకుగాని, గడ్డిపరకను దీసికొనిపోవునట్లు, చిత్తము నన్ను మధ్యపదములగు స్వర్గాదిభోగముల ననుభవింపఁజేయుటకో లేక శూన్యస్వరూపమగు యీ పృథివియందు కీటకపతంగాది నానారూపముల భ్రమింపజేయుటకో దీసికొనిపోవుచున్నది.

సంసారజలధేరస్మా న్నిత్య ముత్తరణోన్ముఖః
సేతునేవ పయఃపూరో రోధితోఽస్మి కుచేతసా. 18

జలప్రవాహము అడ్డుకట్టిన నాగిపోవునట్లు, సంసారసాగరమునుండి బయటపడుటకు యత్నించుచున్న నేను, దుష్టచిత్తమువలన నవరోధింపఁబడుచున్నాను.

పాతాలాద్గచ్ఛతా పృథ్వీం పృథ్వ్యాః పాతాలగామినా
కూపకాష్ఠం కుదామ్నేవ వేష్టితోఽస్మి కుచేతసా. 19

కట్టబడిన త్రాటివలన ఏతము క్రిందుమీదనుఁ బోవునట్లు, నేను మంచిచెడ్డలగు తలంపులతో స్వర్గనరకముల కఱుగుచు వచ్చుచున్న మనస్సువలన బంధింపఁబడియున్నాను.

మిథ్యైవ స్ఫారరూపేణ విచారాద్విశరారుణా
బాలో వేతాళకేనేవ గృహీతోఽస్మి కుచేతసా. 20

బాలకుడు భూతగ్రస్తుడగునట్లు, కల్పితమును, మిథ్యయునగు చిత్తమువలన నేను గ్రహింపఁబడియున్నాను.

వహ్నే రుష్ణతరః శైలాదపి కష్టతరక్రమః
వజ్రాదపి దృఢో బ్రహ్మన్ దుర్నిగ్రహమనోగ్రహః. 21

బ్రాహ్మణుఁడా! మనస్సను యీ భూతమును నిగ్రహించుట చాలకష్టము. ఇది అగ్నికంటె నెక్కుడుగ తాపమునిచ్చును. దీని నతిక్రమించుట పర్వతమును దాటుటకంటె కష్టతరము. ఇది వజ్రముకంటె కఠినమైనది.

చేతః పతతి కార్యేషు విహగః స్వామిషేష్వివ
క్షణేన విరతిం యాతి బాలః క్రీడనకాదివ. 22

పక్షులు మాంసమునుఁ జూచిన ఆకాశమునుండిదిగి దానిమీదఁబడునట్లు, చిత్తము సతతము విషయములమీద వ్రాలుచున్నది. మఱియు బాలుడు ఆటలుదొఱకిన చదువును విడిచిపెట్టునట్లు, చిరాభ్యస్తములగు ధ్యానాది సత్ వ్యాపారముల క్షణములో విడచిపెట్టుచున్నది.

జడప్రకృతిరాలోలో వితతావర్త వృత్తిమాన్
మనోఽబ్ధిరహితవ్యాలో దూరం నయతి తాత మామ్. 23

వృత్తులను పెద్ద సుడిగుండములు గలదియు, కామాది రిపుషట్కములను సర్పములతో గూడినదియునగు, కల్లోల మనోసముద్రము నన్ను దూరమునకుఁ దీసికొని పోవుచున్నది.

అప్యబ్ధిపానాన్మహతః సుమేరూన్మూలనాదపి
అపి వహ్న్యశనాత్ సాధో విషమ శ్చిత్తనిగ్రహః. 24

సాధువర్యా! మనస్సును వశపరచుకొనుట, సముద్రపానముకంటెను, మేరుపర్వతమును పెకలించుటకంటెను, అగ్నిని భక్షించుటకంటెను కష్టతరము.

చిత్తం కారణ మర్థానాం తస్మిన్ సతి జగత్త్రయం
తస్మిన్ క్షీణే జగత్ క్షీణం తచ్చికిత్స్యం ప్రయత్నతః. 25

విషయములకుఁ గారణము చిత్తమే. చిత్తమున్న మూడులోకములకును అస్తిత్వమున్నది. చిత్తము అనగా వాంఛలు నశించిన జగత్తున్ను క్షీణమగును. అందువలన, రోగచికిత్స నొనర్చునట్లు ప్రయత్నముతో, మనోచికిత్స నొనర్పఁదగును.

చిత్తాదిమాని సుఖదుఃఖశతాని నూన
మభ్యాగతాన్యగవరాదివ కాననాని
తస్మిన్ వివేకవశత స్తనుతాం ప్రయాతే
మన్యే మునే నిపుణమేవ గలంతి తాని. 26

మునీంద్రా! శతశతములగు ఈ సుఖదుఃఖములన్నియు, పెద్దపెద్ద పర్వతములనుండి అరణ్యములు పెరుగుచునట్లు, మనస్సునుండియే నిశ్చయముగ జనించుచున్నవి. వివేకమువలన మనోలయమైన, ఈ సుఖదుఃఖములన్నియు నశించునని తలఁపోయుచున్నాను.



సకలగుణజయాశా యత్ర బద్ధా మహద్భి
స్తమరిమిహ విజేతుం చిత్తమభ్యుత్థితోఽహం
విగతరతితయాన్త ర్నాభినందామి లక్ష్మీం
జడమలిన విలాసాం మేఘలేఖామివేందుః. 27

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే వైరాగ్యప్రకరణే
చిత్తదౌరాత్మ్యంనామ షోడశః సర్గః ॥ 16 ॥

ముముక్షువు లెద్దానిని జయించి, అవిద్యాకామకర్మముల బారినుండి బయటపడి; శాంత్యాది సద్గుణముల కధిపతులగుదురో, అట్టిచిత్తమును ఇప్పుడే జయింపగోరుచున్నాను. జలభారమున నీలిరంగునుదాల్చిన మేఘమును చంద్రుఁడు గోరనట్లు, అజ్ఞానకళంకితులగు జనులను సంతోషపెట్టులక్ష్మిని నేను గోరను—నాకు రుచింపదు.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు వైరాగ్యప్రకరణమున
చిత్త దౌరాత్మ్యమను షోడశ సర్గము ॥ 16 ॥



## సప్తదశః సర్గః.

శ్రీ రామ ఉవాచ:—

హార్దాంధకారశర్వర్యా తృష్ణయేహ దురంతయా
స్ఫురంతి చేతనాకాశే దోషాః కౌశికపంక్తయః. 1

శ్రీ రాముఁడు:—తృష్ణను ఖండించుట చాలకష్టము; ఇది ఆత్మతత్వమును మరుగుపరచు రాత్రి. ఈ రాత్రియందు రాగద్వేషాదులను గ్రుడ్లగూబలు జీవుడను ఆకాశమున విహరించుచుండును.

అంతర్దాహ ప్రదాయిన్యా సమూఢరసమార్దవః
పంక ఆదిత్యదీప్త్యేవ శోషం నీతోఽస్మి చింతయా. 2

సూర్యకిరణములు బురదను ఎండజేయునట్లు, హృదయతాపమును గలిగించు చింత దయావినయాది గుణముల శుష్కింపఁజేసి నా హృదయమును శూన్యమొనర్చుచున్నది.

మమచిత్తమహారణ్యే వ్యామోహ తిమిరాకులే
శూన్యే తాండవినీ జాతా భృశమాశాపిశాచికా. 3

అజ్ఞానావృతమై విచారహీనమగు నామానసమను శూన్యారణ్య ప్రదేశమున, ఆశయను పిశాచిని తాండవము సల్పుచున్నది.

వచోరచితనీహారా కాంచనోపవనోజ్జ్వలా
నూనం వికాసమాయాతి చింతాచణకమంజరీ. 4

చింతలను చణకమంజరులు* విలాపవాక్యములను హిమకణములవలన వికసించుచున్నవి. బంగారమను ఉపవనము దీనికి శోభను గూర్చుచున్నది.

అలమంతర్భ్రమాయైవ తృష్ణా తరలితాశయా
ఆయాతా విషమోల్లాస మూర్మిరంబునిధావివ. 5

తరంగములు సముద్రమునుఁ గలఁచుచు లేచుట సుడిగుండములనుఁ గల్పించుటకే; అట్లే తృష్ణయు మాయారూపమగు మనఃక్షోభమును లేవదీసి, ధనార్జనాది భ్రమలనుఁ గల్పించుటకే సంచరించుచుండును.

ఉద్దామకల్లోలరవా దేహాద్రౌ వహతీహ మే
తరంగతరలాకారా తరత్తృష్ణా తరంగిణీ. 6

తృష్ణ నానావిధ విషయముల సంచరించుచుండును; దీనితరంగములు నా శరీరమను పర్వతమునఁ బ్రవహించుచున్నవి—ప్రవృత్తియే దీని తరంగములు. అసత్యవచనములు, పరనిందాది కుత్సిత భాషణములే ఈ తరంగముల ధ్వనులు.

వేగం సంరోద్ధుముదితో వాత్యయేవ జరత్తృణం
నీతః కలుషయా క్వాపి తృష్ణయా చిత్తచాతకః. 7

ఎండుగడ్డి గాలిచే నెగురఁగొట్టఁబడి ఎక్కడకోపోయి పడునట్లు, నామనస్సను చాతకపక్షి తృష్ణావేగమును వారింప యత్నించియు, విఫలమై అనిర్దిష్టస్థలముల వ్రాలుచున్నది. (చాతకము మేఘజలములఁ దక్క నితరములఁ ద్రావదను సంగతి లోకప్రసిద్ధము. దాహమైనప్పుడటునిటు తిరుగుచు చెట్లకొమ్మలవ్రాలి మేఘముల నాశించును. కాని దాహమెక్కుడగుటచే నక్కడ నిలువఁజాలక మరొకచోట కెగిరిపోవును. అట్లే, మనస్సుగూడ ధర్మమేఘసమాధి రూపకమగు పరమపురుషార్థము నాశించి, ప్రయత్నించుచు, తృష్ణచే నీడ్వఁబడి యత్నముల నిలకడఁబూనదని భావము.)

యాం యామహమతీవాస్థాం సంశ్రయామి గుణాశ్రియం
తాం తాం కృంతతి మే తృష్ణా తంత్రీమివ కుమూషికా. 8

మూషికము వీణతీగలను కొఱికివేయునట్లు, తృష్ణయు నేనాశ్రయించు వివేకవైరాగ్యాది గుణముల నాశనమొనర్చుచున్నది.

---

* చణక శబ్దార్థము సెనగ; మంజరులన మొగ్గలు,—అను.



వయసీవ జరత్పర్ణం వాయావివ జగత్తృణం
నభసీవ శరన్మేఘ శ్చింతాచక్రే భ్రమామ్యహమ్. 9

సుడిగుండమునందలి ఎండుటాకువలెను, సుడిగాలిలోని ఎండుగడ్డి పరకవలెను, ఆకాశమునందలి శరన్మేఘములవలెను, చింతాచక్రమునఁబడి నేను పరిభ్రమించుచున్నాడను.

గంతుమాస్పద మాత్మీయ మసమర్థధియో వయం
చింతాజాలే విముహ్యామో జాలే శకునయో యథా. 10

బుద్ధియోగమున స్వస్వరూప ప్రాప్తినందలేక, పక్షులు మోసపోయి వలలోపడునట్లు చింతాజాలములబడి, మోహితులమగుచున్నాము.

తృష్ణాభిధానయా తాత దగ్ధోఽస్మి జ్వాలయా తథా
యథా దాహోపశమన మాశంకే నామృతైరపి. 11

మునీంద్రా! తృష్ణాజ్వాలలఁబడి దగ్ధుడనైతిని. అమృతమువలననైన నీతాపము తీరునా యనుకొనుచున్నాను.

దూరం దూరమితో గత్వా సమేత్యచ పునఃపునః
భ్రమత్యాశు దిగంతేషు తృష్ణోన్మత్తా తురంగమీ. 12

తృష్ణయను గుఱ్ఱము మాటిమాటికి స్వస్థానము నుండి దూరప్రదేశమున కఱిగి, మరల వెనుకను తిరిగి వచ్చుచు, దిగంతముల సంచరించుచున్నది.

జడసంసర్గిణీ తృష్ణా కృతోర్ధ్వాధోగమాగమా
క్షుబ్ధా గ్రంథిమతీ నిత్యమారఘట్టాగ్ర రజ్జువత్. 13

అజ్ఞాన సంబంధము కలదియు, సంచలనము కలదియు, భోక్తృ, భోగ్య, తాదాత్మ్య, సంసర్గ, అధ్యాసలను గ్రంథులు గలదియు, ధర్మాధర్మవిషయముల ననుసరించుటవలన స్వర్గనరకములకుఁ బోవుచు వచ్చునదియునగు తృష్ణ ఘటీ యంత్రమువలె నున్నది.

అంతర్గ్రథితయా దేహే సర్వదుశ్ఛేదయాఽనయా
రజ్జ్వేవాశు బలీవర్ద స్తృష్ణయా వాహ్యతే జనః. 14

ముక్కుతాడుపోయఁబడిన యెద్దువలె, తెంపనలవికాని తృష్ణాసూత్రముచే బంధింపబడిన మనుజుడు, ఐహికాముష్మిక ఫలరూపమగు భారమును వ్యర్థముగ మోయుచున్నాడు.

పుత్రమిత్రకళత్రాది తృష్ణయా నిత్యకృష్టయా
ఖగేష్వివ కిరాత్యేదం జాలం లోకేషు రచ్యతే. 15

కిరాతుని భార్య పక్షులనుఁబట్ట వలను బన్నునట్లు, తృష్ణ లోకులను బడద్రోయుటకుగాను పుత్రమిత్ర కళత్రాది రూపకమగు వలను బన్నుచున్నది.

భీషయత్యపి ధీరం మామంధయత్యపి సేక్షణం
ఖేదయత్యపి సానందం తృష్ణా కృష్ణేవ శర్వరీ. 16

తృష్ణ చీకటి రాత్రివంటిది – నేను ధీరుఁడనైనను అది నాకు భయమును గలిగించుచున్నది. కళ్లున్నను గ్రుడ్డిగ నొనర్చినది. ఆనందస్వరూపుఁడనగు నాకు దుఃఖమును గలిగించుచున్నది.

కుటిలా కోమలస్పర్శా విషవైషమ్య శంసినీ
దశత్యపి మనాక్ స్పృష్టా తృష్ణా కృష్ణేవ భోగినీ. 17

వక్రగమనము, కోమలస్పర్శగలదియు, విషమును గుటిపించునదియునగు తృష్ణయను యీ నల్ల త్రాచును ఒకింత స్పర్శించినను కఱచును.

భిందతీ హృదయం పుంసాం మాయామయవిధాయినీ
దౌర్భాగ్యదాయినీ దీనా తృష్ణా కృష్ణేవ రాక్షసీ. 18

నల్లరక్కసిం బోలు తృష్ణ, దురదృష్టమునకుఁ గారణము — మాయామయ ప్రపంచమును గల్పించుచున్నది; మానవ హృదయముల భేదించుచున్నది.

తంత్రీతంత్రీగణైః కోశం దధానా పరివేష్టితం
నానందే రాజతే బ్రహ్మం స్తృష్ణా జర్జరవల్లకీ. 19

బ్రహ్మజ్ఞా! పాడువడిన బుఱ్ఱకల వీణ ఆనందోత్సవముల నుపయోగపడునట్లు, నిద్రతోడను, నాడీసమూహములతోడను గూడిన శరీరకోశముననున్న తృష్ణ ఆనందత్వమును బ్రకాశింప జేయజాలదు.

నిత్యమేవాతిమలినా కటుకోన్మాద దాయినీ
దీర్ఘతంత్రీ ఘనస్నేహా తృష్ణాగహ్వారవల్లరీ. 20

హృదయమను పర్వతగుహాయందు పుట్టిన తృష్ణయను లత అతిమలినమును నీచమును నై యున్నది. (నీచప్రకృతియగుటవలన నికృష్టమును, సూర్యకిరణములు సోకకపోవుటవలన మలినము అని గ్రహించవలెను.) కోర్కెలు ఫలింపనందువలన పిచ్చిని గలిగించును; దీనిపరిణామము దుఃఖము. దీని తీగెలు పొడవైనవి; మోహదాయకములు.

అనానందకరీ శూన్యా నిష్ఫలా వ్యర్థమున్నతా
అమంగలకరీ క్రూరా తృష్ణా క్షీణేవ మంజరీ. 21

వాడిపోయిన మొగ్గలగుత్తి వలె తృష్ణపుష్పవిహీనయును ఫలశూన్యయును, వ్యర్థమును నై యున్నది. క్రూరకంటకము (ముల్లు) వలె కష్టమునుగూర్చును.

అనావర్జితచిత్తాపి సర్వమేవానుధావతి
న చాప్నోతి ఫలం కించిత్ తృష్ణా జీర్ణేవ కామినీ. 22

వృద్ధవేశ్యవలె, మనస్సును లోబరచుకొనలేకపోయినను, అది అందరివెంట పరుగిడును; దీని వలన ఫలము ఒకించుకైనను లభింపదు.



సంసారబృందే మహతి నానారస సమాకులే
భువనాభోగరంగేషు తృష్ణా జరఠనర్తకీ. 23

సంసారము శోకమోహాది రసములతో గూడిన భోగనాట్యరంగము; తృష్ణ ఇందలి పరిపక్వ నర్తకి.

జరా కుసుమితారూఢా పాతోత్పాత ఫలావలిః
సంసార జంగలే దీర్ఘే తృష్ణావిషలతా తతా. 24

విశాలమగు సంసారారణ్యమున తృష్ణయను విషలత దీర్ఘముగ వ్యాపించియున్నది; జరయే దీని పుష్పములు. హెచ్చుతగ్గులే దీనిఫలములు.

యన్నశక్నోతి తత్రాపి ధత్తే తాండవితాం గతిం
నృత్యత్యానందరహితం తృష్ణా జీర్ణేవ నర్తకీ. 25

వృద్ధనర్తకివలె తృష్ణ సాధింపవీలులేని తావులకు గూడ తాండవమొనర్పఁబోవును; అటగి, నిరుత్సాహముతోడ నృత్యమునొనర్చును.

భృశం స్ఫురతి నీహారే శామ్యత్యాలోక ఆగతే
దుర్లంఘ్యేషు పదం ధత్తే చింతా చపలబర్హిణీ. 26

చంచలమగు నెమలి వర్షాగమమును సూచించు మేఘావరణను గాంచి నృత్యము సల్పునట్లును; చొరరానిచోట్ల కటిగి గూడును గట్టుకొనునట్లును, చపలచిత్తము మోహావరణమున నృత్యముసల్పును; అప్రాప్య విషయముల నాసక్తిగొనును; శరత్కాలమురా సూర్యుడు ప్రకాశించిన నెమళ్ళ నాట్య మాగిపోవును; అట్లే, వివేక మను వెలుగు పొడసూపిన మోహము మాసిపోవును.

జడకల్లోల బహులా చిరం శూన్యాంతరాంతరా
క్షణముల్లాస మాయాతి తృష్ణా ప్రావృట్తరంగిణీ. 27

వర్షాకాలమందలి ఏఱువలె, తృష్ణ అజ్ఞానతరంగములతోడను, జ్ఞానోదయమైన పిదప శూన్య తను పొందుచు క్షణకాలముమాత్రమే ఉల్లసిల్లుచున్నది.

నష్టముత్సృజ్య తిష్ఠన్తం తృష్ణా వృక్షమివాపరం
పురుషాత్ పురుషం యాతి తృష్ణా లోలేవ పక్షిణీ. 28

ఆకలిదప్పులవలన బాధపడుచు పండ్లులేనిచెట్టునువీడి మరొకచెట్టు నాశ్రయించు చంచల పక్షివలె, తృష్ణ ఒకానొక పురుషునివీడి, మరొకనిని ఆశ్రయించుచుండును.

పదం కరోత్యలంఘ్యేఽపి తృప్తాపి ఫలమీహతే
చిరం తిష్ఠతి నైకత్ర తృష్ణా చపలమర్కటీ. 29

తృష్ణయను చపలమర్కటి యొకచోటనుండదు. పొందవీలులేని వస్తువులఁబడయ దుముక లిడును. తృప్తినందినను, ఇతరవిషయముల వాంఛించును.

ఇదం కృత్వేద మాయాతి సర్వమేవాసమంజసం
అనారతంచ యతతే తృష్ణా చేష్టేవ దైవికీ. 30

'ఇది మంచిపని' అని ఒకదానిని ఆరంభించి అదిముగియక మునుపె అద్దానిని అశుభకార్యముగ నెంచి మఱొకకార్యము నారంభించుచు, 'విసుగువిరామము' లేకుండ శుభాశుభఫలములకొఱకు తృష్ణ యత్నించుచునే యుండును. అందువలన ప్రాణుల కర్మల ననుసరించి ఫలములనొసఁగు బ్రహ్మదేవుని యత్నముతో నిద్దానిఁ బోల్పనగును.

క్షణమాయాతి పాతాలం క్షణంయాతి నభస్థలం
క్షణం భ్రమతి దిక్కుంజే తృష్ణా హృత్పద్మషట్పదీ. 31

హృత్కమల భ్రమరమగు తృష్ణ, ఒకక్షణమున పాతాళమునను, మఱొక క్షణమున ఆకాశమునను, ఇంకొకక్షణమున దిక్కుంజము (దిక్కులను పొదల్లు)లను, విహరించుచుండును.

సర్వసంసారదోషాణాం తృష్ణైకా దీర్ఘదుఃఖదా
అంతఃపురస్థమపి యా యోజయత్యతిసంకటే. 32

సంసారమందున్న దోషములన్నిటిలో, తృష్ణయే దీర్ఘదుఃఖమును గల్పించునది. అంతఃపురముననున్నవానిని గూడ (ధనాది ఆశలఁజూపెట్టి) అతిసంకట ప్రదేశముల కాకర్షించును.

ప్రయచ్ఛతి పరం జాడ్యం పరమాలోకరోధినీ
మోహం నీహారగహనా తృష్ణా జలదమాలికా. 33

మంచుతోఁగూడిన మేఘములగుంపు చలిని గలిగించి, సూర్యుని గప్పివేయునట్లు, మోహముతోఁగూడిన తృష్ణ అజ్ఞానమును గలిగించి, ఆత్మజ్ఞానమును గప్పివేయుచున్నది.

సర్వేషాం జంతుజాతానాం సంసారవ్యవహారిణామ్
పరిప్రోతమనోమాలా తృష్ణా బంధనరజ్జువత్. 34

బహుపశువుల మెడలకుఁగట్టఁబడిన త్రాడు, మఱొక పెద్దత్రాటికి గట్టబడునట్లు, యీ సంసారమున చరించు జీవులమనస్సు తృష్ణయను త్రాటికిఁ గట్టఁబడియున్నది.

విచిత్రవర్ణా విగుణా దీర్ఘా మలినసంస్థితిః
శూన్యా శూన్యపదా తృష్ణా శక్రకార్ముకధర్మిణీ. 35

తృష్ణకును ఇంద్రధనస్సునకును సామాన్యధర్మములున్నవి; ఇంద్రధనస్సు విచిత్రములగు వర్ణములతోఁగూడియున్నది. విగుణ అనగా అల్లెత్రాడులేనిది. పొడుగైనది. మలినములగు మేఘములపై శూన్యమగు ఆకాశమునఁ గల్పింబడినది; అట్లే, తృష్ణయు విచిత్రములగు వివిధ విషయములతోఁగూడిన సమ్మోహరూపమునుదాల్చి, అసద్గుణములతో వెలయుచున్నది. మఱియునిది, మలిన పురుషునిమనస్సునఁ గల్పింపఁబడిన అవస్తువు.



ఆశానిర్గుణ సస్యానాం ఫలితా శరదాపదాం
హిమం సంవిత్ సరోజానాం తమసాం దీర్ఘయామినీ. 36

ఈతృష్ణ — వివేకాది సుగుణములను పైరులకు పిడుగు; ఆపదలపంట కనువగు శరత్కాలము; జ్ఞానకమలములకు మంచు; అజ్ఞానమునకు హేమంతరాత్రి.

సంసార నాటకనటీ కార్యాలయ విహంగమీ
మానసారణ్యహారిణీ స్మరసంగీత వల్లకీ. 37

ఈతృష్ణ — సంసారమను నాటకరంగమందలినటి. ప్రవృత్తియను గూటియందుండు పక్షి. మనస్సను అరణ్యమున తిరుగు చంచలహరిణము. కోర్కులను సంగీతము ధ్వనించు వీణ.

వ్యవహారాబ్ధిలహరీ మోహమాతంగ శృంఖలా
సర్గన్యగ్రోధసులతా దుఃఖకైరవచంద్రికా. 38

తృష్ణయే వ్యవహారప్రపంచమందలి అలలను గల్పించుచున్నది. తృష్ణయే మోహమను ఏనుఁగను బంధించుచున్నది. దీనివలననే, సంసారవటవృక్షము యొక్క ఊడలు దిగుచున్నవి. ఇదియే దుఃఖములను కలువల వికసింపజేయు వెన్నెల.

జరామరణదుఃఖానామేకా రత్నసముద్గికా
ఆధివ్యాధివిలాసానాం నిత్యం మత్తావిలాసినీ. 39

జరామరణ దుఃఖములను రత్నపేటికయే, తృష్ణయను విలాసినికడనున్నది. ఆధివ్యాధులె దాని సంతోష సామగ్రి.

క్షణమాలోకవిమలా సాంధకారలవా క్షణం
వ్యోమవీథ్యుపమా తృష్ణా నీహారగహనా క్షణమ్. 40

తృష్ణయను ఆకాశమున — అప్పుడప్పుడు వివేకమను వెలుఁగు వెలుఁగుచుండును. అప్పుడప్పుడు అవివేకమను అంధకారము క్రమ్ముచుండును; అప్పుడప్పుడు అజ్ఞానమను మంచు ఆవరించుచుండును.

గచ్ఛత్యుపశమం తృష్ణా కాయవ్యాయామశాంతయే
తమీ ఘనతమః కృష్ణా యథా రక్షోనివృత్తయే. 41

మేఘములతో క్రమ్ముకొనిన రాత్రి ముగిసిన, రాక్షసులు పలాయన మొనరించునట్లు, తృష్ణ ఉపశమించిన దేహపరిశ్రమముతోడ నాశనమగును. — ముక్తిలభించును.

తావన్ముహ్యత్యయం మూకో లోకో విలులితాశయః
యావదేవానుసంధత్తే తృష్ణావిషవిషూచికా. 42

విషూచి (కలరా) వ్యాధిచే బాధపడు మనుజుఁడు, అది తగ్గనంతవఱకు మాటలాడు శక్తిని గోల్పోయి, మూర్ఛితుడై పడియుండునట్లు, సంసారియు తృష్ణోపశమన మవనంతవఱకు, వేదాంత శాస్త్రమున మూకరై, వ్యాకులచిత్తుఁడై, మోహగ్రస్తుఁడై పడియుండును.

లోకోఽయ మఖిలం దుఃఖం చింతయోజ్ఝిత మోజ్ఝతి
తృష్ణావిషూచికామంత్ర శ్చింతాత్యాగోహి కథ్యతే. 43

చింతావర్జనమే తృష్ణయను విషూచివ్యాధికి మహౌషధము అని చెప్పఁబడుచున్నది. చింతలను ద్యజించిన లోకులు దుఃఖమును తప్పించుకొందురు.

తృణపాషాణ కాష్ఠాది సర్వమామిషశంకయా
ఆదదానా స్ఫురత్యంతే తృష్ణా మత్స్య హ్రదేయథా. 44

చెఱువునీటినుండి మాంసమును భ్రమతో తృణపాషాణకాష్ఠాదుల కఱచికఱచి, తుదకు ఎరకాశించి, చంపఁబడు చేపవంటి దీ తృష్ణ.

రోగార్తిరంగనా తృష్ణా గంభీరమపి మానవమ్
ఉత్తానతాం నయత్యాశు సూర్యాంశవ ఇవాంబుజమ్. 45

సూర్యకిరణములు పద్మమును ఊర్ధ్వవికసిత మొనర్చునట్లు, రోగపీడయు, స్త్రీ వాంఛయు ధీరుఁడగు మనుజునిగూడ అధీరునొనర్చివైచును.

అంతఃశూన్యా గ్రంథిమత్యో దీర్ఘస్వాంకురకంటకాః
ముక్తామణిప్రియా నిత్యం తృష్ణా వేణులతా ఇవ. 46

తృష్ణయను వెదురు సారహీనమైనది. జడపదార్థముల చేతనబుద్ధియను కణుపులు దీనికున్నవి. చింతాద్వేషములు దీని కంటకాంకురములు. విషయములను ప్రీతింగొల్పు ముత్యముల నిది గోరును.

అహోబత మహచ్చిత్రం తృష్ణామపి మహాధియః
దుశ్ఛేదామపి కృంతంతి వివేకేనామలాసినా. 47

ఆహా! ఏమి ఆశ్చర్యము! అచ్ఛేద్యమైన యీ తృష్ణను బుద్ధిమంతులు వివేకమను నిశితఖడ్గముతో నరుకుచున్నారు.

నాసిధారా న వజ్రార్చిర్నతప్తాయః కణార్చిషః
తథా తీక్ష్ణా యథా బ్రహ్మం స్తృష్ణేయం హృది సంస్థితా. 48

బ్రహ్మజ్ఞుఁడా! హృదయమున మెలంగు యీ తృష్ణ ఖడ్గపు కొనకంటెను, వజ్రముకంటెను కాలుచున్న ఇనుపగుండ్ల మంటలకంటెను తీక్ష్ణమైనది.

ఉజ్జ్వలాసిత తీక్ష్ణాగ్రా స్నేహదీర్ఘదశావరా
ప్రకాశాదాహదుఃస్పర్శా తృష్ణా దీపశిఖా ఇవ. 49

తృష్ణ దీపజ్వాలవలె నుజ్వలమై పొడుగాటి వత్తినిగలిగి, మలినమగు కొనతో ముట్టుకొనిన కష్టమును కలిగించుచు, దీర్ఘకాలము వెలయునదై యున్నది. (అనగా, తృష్ణ బాల్యయౌవనముల ఆశ్యంతాసక్తిని కల్పించుచు, చాలకాలముండును. భోగాంతమున దీపముకొడివలె కష్టమునిచ్చును. ఇట్టితృష్ణ పొంతకుఁబోయిన వంతకాక మరేమి? —— హృదయతాపమునిచ్చును.



అపి మేరుసమం ప్రాజ్ఞమపి శూరమపి స్థిరం
తృణీకరోతి తృష్ణైకా నిమేషేణ నరోత్తమమ్. 50

మేరుపర్వతమువలె ధీరుఁడును, బుద్ధిమంతుడును, పౌరుషయుక్తుడును, అపరిగ్రహవ్రతమున స్థిరుడును నగు పురుషునిఁగూడ తృష్ణ ఒక్కనిముసములో గడ్డిపరకవలె నొనర్చుచున్నది. (తృష్ణతో యాచింపఁ బూనినవాడు ఇతరుల దృష్టిలో గడ్డిపరకయే కదా!)

సంస్తీర్ణగహనా భీమా ఘనజాల రజోమయీ
సాంధకారోగ్ర నీహారా తృష్ణా వింధ్యమహాటవీ. 51

సాహసకార్యములను చొరరాని విశాలారణ్యములతోడను, ఆశాపాశరూపకమగు రజోగుణమను లతాధూళితోడను, అంధకారరూపకమగు తమోగుణమను అజ్ఞానహిమముతోడను గూడుకొనిన భయంకర వింధ్యపర్వతభూమి యీ తృష్ణ.

ఏకైవ సర్వభువనాంతర లబ్ధలక్ష్యా
దుర్లక్ష్యతాముపగతైవ వపుః స్థితైవ
తృష్ణా స్థితా జగతి చంచల వీచిమాలే
క్షీరోదకాంబుతరలే మధురేవ శక్తిః. 52

ఇత్యార్షే వాసిష్ఠ-మహారామాయణే వాల్మీకీయే వైరాగ్య ప్రకరణే
తృష్ణాభంగో నామ సప్తదశః సర్గః ॥ 17 ॥

ఒకే మాధుర్యశక్తి జలములన్నిటియందున నున్నను, ఒకే మాదిరిగ గన్పడదు. జలభేదము ననుసరించి రుచిమారును. అట్లే యీ శరీరమందున్న తృష్ణయే, జగత్తుననున్న సమస్తభోగ్యవస్తువులతో గలసియున్నను, శరీర తృష్ణ యట్లగుపించదు; ఆశ, కామము ఇత్యాదులగు వివిధ భేదములతో నగుపించును.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు వైరాగ్యప్రకరణమున
తృష్ణాభంగమను సప్తదశ సర్గము ॥ 17 ॥



## అష్టాదశః సర్గః.

శ్రీరామ ఉవాచః—

ఆర్ద్రాంత్రతంత్రీగ... వికారీ పరిపాతవాన్
దేహః స్ఫురతి సంసారే సోఽపి దుఃఖాయ కేవలమ్. 1

శ్రీ రాముఁడు;- మలమూత్రముల తోలుసంచియు, నాడీజటిలమును, కృశించుట మొదలు గాఁగల వికారములు కలదియు, మరణశీలమును నగు ఈ శరీరము సంసారమున సుఖభోగములకు ఇల్లు అనుకొనఁబడుచున్నది. కాని, ఇదికూడ కేవలము దుఃఖమున కొఱకే.

అజ్ఞోఽపి తజ్జ్ఞసదృశో వలితాత్మచమత్కృతిః
యుక్త్యా భవో్యపభవ్యోఽపి న జడో నాపిచేతనః. 2

దేహము జడవస్తువైనను, పంచకోశములచే నావరింపఁబడిన ఆత్మయొక్క విచిత్ర సంసర్గమువలన చేతనవస్తువువలెనే ప్రతిభాతమగుచున్నది. అసారవస్తువైనను సంసార తరణమునకు (మోక్షమునకు) ఉపయోగపడుచున్నది. ఇది సాధారణ జడవస్తువుల వంటిదిగాదు; మఱియు చేతనమును గాదు.

జడాజడ దృశోర్మధ్యే దోలాయితదురాశయః
అవివేకీ విమూఢాత్మా మోహమేవ ప్రయచ్ఛతి. 3

శరీరము జడమా? చేతనమా ? అను సందేహమున నూగులాడు మనస్సుకును, మూఢాత్మకును నిలయమును, వివేకానుపయోగియును నగు శరీరము మోహమునే గల్పించుచున్నది.

స్తోకేనానందమాయాతి స్తోకేనాయాతి ఖేదితాం
నాస్తి దేహసమః శోచ్యో నీచో గుణబహిష్కృతః. 4

అల్పములగు అన్నపానములు లభించిన సంతోషించుచున్నది. అల్పములగు శీతతాపములు గల్గిన దుఃఖించుచున్నది. అందువలన, దేహమునుఁ బోలు నీచమును, గుణహీనమును నగు శోచనీయ వస్తువు మరియొకటి లేదు.

ఆగమాపాయినా నిత్యం దంతకేసరశాలినా
వికాసస్మితపుష్పేణ ప్రతిక్షణమలంకృతః. 5
భుజశాఖోఘనస్కంధో ద్విజస్తంభశుభస్థితిః
లోచనాలిబిలాక్రాంతః శిరఃపీఠబృహత్ఫలః. 6
శ్రవదంతరసగ్రస్తో హస్తపాదసుపల్లవః
గుల్మవాన్ కార్యసంఘాతో విహంగమకృతాస్పదః. 7
సచ్ఛాయో దేహవృక్షోఽయం జీవపాంథగణాస్పదః
కస్యాత్మీయః కస్య పర ఆస్థానాస్థే కిలాత్ర కే. 8

ఈ దేహమును వృక్షముతో బోల్పనగును, బాహువులే దీనిశాఖలు, భుజములే దీని స్కంధము (=మాను.) కన్నులే తుమ్మెదలుండు తొఱ్ఱలు. కలయే దీని ఫలము. కాలుసేతులు దీని చివుళ్లు.



రోగములే దీనితీగెలు. ఇది చెవులను కంసాలిపిట్టలవలన బొడువఁబడుచున్నది. ఇందు జీవేశ్వరులను రెండుపిట్టలు నివసించుచున్నవి. దీన, రోగములను గుల్మములున్నవి. ఇట్టి కార్యసంఘాతమగు శరీరమను చెట్టును గొడ్డలితో నరుకునట్లు నరుకవచ్చును. ఇది నవ్వను పువ్వులతోడను, దంతములను కేసరములతోడను ఒప్పారుచున్నది; దీని శోభ క్షణకాలమే. మఱియు, ఈ దేహవృక్షము కాంతియను ఛాయతో విలసిల్లుచున్నది. జీవుడను పథికున కిది విశ్రామస్థానము. దీనితో, జీవునకు వాస్తవమగు సంబంధము లేదు. ఇది ఎవ్వరిబంధువు, ఎవ్వరి శత్రువు? దీనియెడల ప్రేమ ఎవరికి? ద్వేష మెవరికి?

తాతసంతరణార్థేన గృహీతాయాం పునఃపునః
నావి దేహలతాయాంచ కస్యస్యాదాత్మభావనా. 9

సంసార సాగరమును తరించుటకు నౌకగా గైకొనఁబడిన ఈ దేహలతయం దాత్మభావన ఎవరికి గల్గును ?

దేహనామ్ని వనే శూన్యే బహుకర్తసమాకులే
తనూరుహాసంఖ్యతరౌ విశ్వాసం కోఽధిగచ్ఛతి. 10

రోమములను అసంఖ్యావృక్షములతోడను, నవరంధ్రములను గోతులతోడను నున్న దేహమను యీ శూన్యారణ్యమున చిరము వాసమొనర్తునను నిస్సందేహబుద్ధి ఎవరికి కలుగును ?

మాంసస్నాయ్వస్థివలితే శరీరపటహేఽదృఢే
మార్జారవదహం తాత తిష్ఠామ్యత్ర గతధ్వనౌ. 11

చినిగి, డొల్లపడి, ధ్వనింపని డోలునందున్న పిల్లివలె, నేను మాంసము, నరములు, ఎముకలచే నిర్మింపబడిన అదృఢ శరీరమున నున్నాను. దీనినుంచి బయటపడు ఉపాయశబ్దమును విన వీలు కలుగుట లేదు.

సంసారారణ్య సంరూఢో విలసచ్చిత్తమర్కటః
చింతామంజరితాకారో దీర్ఘదుఃఖఘుణక్షతః. 12
తృష్ణా భుజంగమీగేహం కోపకాకకృతాలయః
స్మితపుష్పోద్గమః శ్రీమాన్ శుభాశుభమహాఫలః. 13
సుస్కంధోఘలతాజాలో హస్తస్తబకసుందరః
పవనస్పందితాశేష స్వాంగావయవపల్లవః. 14
సర్వేంద్రియఖగాధారః సుజానుస్తంభ ఉన్నతః
సరసచ్ఛాయయా యుక్తః కామపాంథనిషేవితః. 15
మూర్ధసంజనితా దీర్ఘ శిరోరుహ తృణావలిః
అహంకార గృధ్రకృత కులాయః సుషిరోదరః. 16

విచ్ఛిన్నవాసనాజాల మూలత్వాద్దుర్గవాకృతిః
వ్యాయామ విరసః కాయప్లక్షోఽయం నసుఖాయ మే. 17

సంసారమను కారడవియందు, చింతలను మొగ్గలతోడను, దుఃఖములను ఘుణమువలన కొట్టబడినదియు, నగు దేహమను జీర్ణవృక్షము చిత్తమను చపల మర్కట మెక్కినది. ఈ దేహ (ప్లక్ష) వృక్షము కామదఃను పథికున కాశ్రయము, యౌవనము దీనిఛాయ, రూక్షత్వమే దీని వ్యాయామ విహీనశాఖలు, ఉదరమే దీని ఛిద్రము. తృష్ణ యను పాము, రోషమను కాకి, ఇంద్రియములను పక్షి గణములు, అహంకారమను గ్రద్ద ఇందు నివసించుచున్నవి. చిఱునవ్వే దీని పువ్వులు, శుభాశుభములే దీనిఫలములు, బాహువులే దీని శాఖలు, చేతులే దీని పూలగుత్తులు, ప్రాణవాయువువలన కంపింపబడిన అవయవములే దీని చిగుళ్లు. ఉన్నతములగు జానువులే దీనియొక్క లావైన మొదళ్లు. శిరోజములే ఈ చెట్టున నుద్భవించు తృణాదులు. గట్టిగ పెనవేసికొనిపోయిన కోర్కెలే దీని అచ్ఛేద్యమైన వేళ్లు. ఇట్టి దేహవృక్షము నాకు సుఖమును గూర్పజాలదు.

కలేబరమహంకార గృహస్థస్య మహాగృహం
లుఠత్వభ్యేతువా స్థైర్యం కిమనేన మునే మమ. 18

మునీ! అహంకారమను గృహస్థుని నివాస మందిరమగు ఈ శరీరము ఉండిన ఉండుగాక ఊడిన ఊడుగాక, దీనితో నాకేమిపని?

పంక్తిబద్ధేంద్రియపశుం వల్గత్తృష్ణా గృహాంగనమ్
రాగరంజిత సర్వాంగం నేష్టం దేహగృహం మమ. 19

ఈ శరీరగృహమున ఇంద్రియములను పశువులు వరుసగ కట్టఁబడియున్నవి. తృష్ణయను గృహ యజమానురాలు ఇటునటు తిరుగాడుచున్నది. ఇల్లంతయు నానావిధములగు కోర్కెలనుఁ ముగ్గులతో నలంకరింపఁబడియున్నది—ఇది నా కిష్టమును గూర్చు వస్తువుకాదు.

పృష్ఠాస్థి కాష్ఠసంఘట్ట పరిసంకట కోటరం
అంత్రరజ్జుభిరాబద్ధం నేష్టం దేహగృహం మమ. 20

వెన్నెముకతో గూర్పఁబడిన గూడును, మలమూత్రాదులను త్రాటితో గట్టబడి నదియునగు ఈ శరీరగృహమును నే నభిలషింపను.

ప్రసృతస్నాయుతంత్రీకం రక్తాంబుకృతకర్దమం
జరామంకోల ధవలం నేష్టం దేహగృహం మమ. 21

వ్యాపించియున్న నాడులవలన నిలబెట్టబడినదియు, రక్తమాంసములను అడుసుచే పూయం బడినదియు, ముదిమియను సున్నముతో వెల్లవేయబడినదియునగు ఈదేహగృహము నా ఇష్టవస్తువుకాదు.

చిత్తభృత్యకృతానంత చేష్టావష్టబ్ధ సంస్థితి
మిథ్యామోహామహా స్థూణం నేష్టం దేహగృహం మమ. 22

చిత్తమను భృత్యుని ఎడతెగని ప్రయత్నములవలన, ఈశరీరము నిలంబడియున్నది; అనృతాజ్ఞానములే దీని స్తంభములు—ఇట్టి దేహగృహమును నేను వాంఛింపను.



దుఃఖార్భక కృతాక్రందం సుఖశయ్యామనోరమం
దురీహా దగ్ధదాసీకం నేష్టం దేహగృహం మమ. 28

ఈ దేహగృహము దుఃఖమను బాలకుని ఏడ్పులతో నిండియున్నది. సుఖములను శయ్యలతో మనోహరమై చూపట్టుచున్నది. దుశ్చేష్టలను పాడుదాసీలు ఇందు తిరుగాడు చున్నారు—దీనిని నేను గోరను.

మలాఢ్యా విషయవ్యూహ భాండోపస్కర సంకటం
అజ్ఞానక్షారవలితం నేష్టం దేహగృహం మమ. 24

బహువిధములగు విషయములను భాండముల నింపబడిన దోషములను గృహద్రవ్యములతో గూడినదియు, అజ్ఞానమను చవిటితో గూడినదియునగు యీ శరీరగృహము నా ఇష్టవస్తువు కాదు.

గుల్ఫ గుగ్గులువిశ్రాంత జానూర్ధ్వస్తంభ మస్తకం
దీర్ఘదోర్దారు సుదృఢం నేష్టం దేహగృహం మమ. 25

జానువులను యీ దేహగృహ స్తంభమునకు పాదగ్రంధి ఆధారకాష్ఠము; జానువులు దీనిపై నిలచియున్నవి; బాహువులు, సంయోజక కాష్ఠములు. మూలము వినష్టమైన, యీ గృహమంతయు పడిపోవును. అందువలన, నేను దీనిని గోరను.

ప్రకటాక్ష గవాక్షాంతః క్రీడత్ప్రజ్ఞాగృహాంగనం
చింతాదుహితృకం బ్రహ్మన్నేష్టం దేహగృహం మమ. 26

బుద్ధియను గృహాంగన జ్ఞానేంద్రియములను గవాక్షముల క్రీడసల్పుచున్నది; చింత దీని కూతురు. ఇట్టి దేహగృహమును నేను వాంఛింపను.

మూర్ధజాచ్ఛాదనచ్ఛన్న కర్ణశ్రీచంద్రశాలికం
ఆదీర్ఘాంగులి నిర్వ్యూహం నేష్టం దేహగృహం మమ. 27

శిరోజములను మిద్దెకలదియు, కర్ణశ్రీయను శోభన గృహముకలదియు, వ్రేళ్ళను బొమ్మలు కలదియునగు యీ శరీరగృహమును నేను గోరను.

సర్వాంగ కుడ్యసంఘాత ఘనరోమయవాంకురమ్
సంశూన్యపేటవివరం నేష్టం దేహగృహం మమ. 28

అవయవములే గోడలుగాగలదియు, వాటినుండి జనించు రోమములను యవాంకురములు గలదియు, పొట్టయను ఛిద్రముగలదియునగు యీ దేహమును నేను అభిలషింపను.

నఖోర్ణనాభినిలయం సరమారణితాంతరం
భాంకారకారి పవనం నేష్టం దేహగృహం మమ. 29

గోళ్ళను సాలెగూళ్ళతోనున్నదియు, క్షుధయను శునకముచే నాకులితమొనర్పఁబడినదియు, ప్రాణవాయువుయొక్క భాంకారరవముతో గూడినదియు నగు యీ శరీరగృహమును నేనభిలషింపను.

ప్రవేశ నిర్గమవ్యగ్ర వాతవేగ మనారతం
వితతాక్షగవాక్షం తన్నేష్టం దేహగృహం మమ. 30

ఈ శరీరగృహమున నిరంతరము ఉచ్ఛ్వాసనిశ్వాసవాయువులవేగము చరించుచున్నది; ఇంద్రియములను దీర్ఘగవాక్షములు దీనికున్నవి. ఇద్దానిని నేను గోరను.

జిహ్వామర్కటికాక్రాంత వదనద్వారభీషణం
దృష్టదంతాస్థిశకలం నేష్టం దేహగృహం మమ. 31

ఈ శరీరమందిరమునకు ప్రవేశద్వారము నోరు; ఇది నాలుకయను కోతిచే నాక్రాంతమై భయమును గొల్పుచున్నది; పైకికనఁబడు దంతములే దీని నాగబంధము. ఇది నాకిష్టవస్తువుకాదు.

త్వక్సుధాలేపమసృణం యంత్రసంచారచంచలం
మనః సదాఖునోత్ఖాతం నేష్టం దేహగృహం మమ. 32

ఈ శరీరము చర్మమను సౌడితోనద్దబడియున్నది. కీళ్ళను యంత్రముల చలనముతో చంచలమై యొప్పుచున్నది మనస్సను ఎలుక ఎల్లవేళల కన్నమును ద్రవ్వుచున్నది. ఇట్టి శరీరగృహమును నేనెట్లు వాంఛింతును ?

స్మితదీపప్రభోద్భాసి క్షణమానంద సుందరం
క్షణం వ్యాప్తం తమఃపూరై ర్నేష్టం దేహగృహం మమ. 33

ఒక్కొక్కప్పుడు ఈషత్ హాస్యమను దీపప్రభలతో వెలుఁగుచు, మఱొకప్పుడు శోక మోహములను అజ్ఞానాంధకారమున కప్పఁబడిపోవు శరీరమందిరమును నేను గోరను.

సమస్తరోగాయతనం వలీపలితపత్తనం
సర్వాధిసారగహనం నేష్టం దేహగృహం మమ. 34

రోగముల కునికిపట్టు, ముడుతలుపడు చర్మమునకును, నెఱసిన వెంట్రుకలకును తావును, మనోవ్యాధుల అడవియును నగు యీ దేహగృహమును నేను గోరను.

అక్షర్క్షక్షోభవిషమా శూన్యా నిఃసార కోటరా
తమోగహన దిక్కుంజా నేష్టా దేహాటవీ మమ. 35

ఈ శరీరారణ్యము ఇంద్రియములను ఎలుగుగొడ్ల క్షోభవలన నతిభయంకరమైయున్నది. శూన్య... సారహీనములునునగు నవద్వార కోటరములున్నవి; కుడియెడమలనున్న అవయవములను చీకటిపి... డియున్నది. ఇద్దానిని నేను గోరను.

దేహాలయం ధారయితుం న శక్నోమి మునీశ్వర
పంకమగ్నం సముద్ధర్తుం గజమల్పబలో యథా. 36

మునీశ్వరా! బురదలో కూరుకొనిపోయిన ఏనుఁగును అల్పబలుఁడు ఉద్ధరించలేనట్లు నేనీశరీరమందిరము... ...ంచలేకున్నాను.



కింశ్రియా కించరాజ్యేన కిం కాయేన కిమీహితైః
దినైః కతిపయైరేవ కాలః సర్వం వికృంతతి. 37

సంపదలతోడను, రాజ్యములతోడను, శరీరముతోడను, కోరికలతోడను, ఖనియేమి? కొద్దిరోజులలోనే మృత్యువన్నింటిని తుదముట్టించును కదా !

రక్తమాంసమయస్యాస్య సబాహ్యాభ్యంతరం మునే
నాశైకధర్మిణో బ్రూహి కైవ కాయస్య రమ్యతా. 38

ఈ శరీరము రక్తమాంసమయము; దీనిపరిణామము నాశనమే. దీని రమ్యతయేమిటో విచారించి చెప్పుడు !

మరణావసరే కాయా జీవం నానుసరంతి యే
తేషు తాత కృతఘ్నేషు కైవాస్థా వద ధీమతామ్. 39

మునీంద్రా! చక్కఁగ పోషింపబడి, పెంపఁబడినను, మరణసమయమున జీవు ననుసరింపని కృతఘ్న శరీరముల నమ్మిక మెవరుంచుదురు?

మత్తేభకర్ణాగ్రచలః కాయో లంబాంబుభంగురః
నసంత్యజతి మాం యావత్తావదేనం త్యజామ్యహమ్. 40

ఈ శరీరము — ఏనుఁగుచెవివలె చంచలము; పడనున్న నీటిబొట్టువంటిది, ఇది నన్ను విడువకమునుపే నేను, దీనిని త్యజింతును.

పవనస్పందతరలః పేలవః కాయపల్లవః
జర్జరస్తనువృత్తిశ్చ నేష్టో మే కటునీరసః. 41

దేహమను చిగురుటాకు ప్రాణవాయువువలన స్పందించుచున్నది. జర్జరము, క్షుద్రము దీనిని నేను ప్రేమింపను.

భుక్త్వా పీత్వా చిరంకాలం బాలపల్లవ పేలవాం
తనుతామేత్య యత్నేన వినాశమనుధావతి. 42

ఈ శరీరము చిరకాలము భోజనపానాదుల నొనర్చి చివురుటాకువలె మృదుత్వము నందుచున్నది; యత్నమొనర్పకపోయిన కృశత్వమును, నాశనమును నందుచున్నది.

తాన్యేవ సుఖదుఃఖాని భావాభావమయాన్యసౌ
భూయోప్యనుభవన్ కాయః ప్రాకృతో హి న లజ్జతే. 43

శరీరము సుఖదుఃఖముల మాటిమాటికీ అనుభవించుచు, మరలమరల వాటినే గోరుచున్నది. సిగ్గుపడదు పామరులకు సిగ్గుండదు కదా !

సుచిరం ప్రభుతాం కృత్వా సంసేవ్య విభవశ్రియం
నోచ్ఛ్రాయమేతి నస్థైర్యం కాయః కిమితి పాల్యతే. 44

చాలకాలము ప్రభుత్వమొనరించియు, భోగముల ననుభవించియు, శరీరము గొప్పతనమును గాని, అవినాశత్వమునుగాని పొందదు, అగుచో దానిని పోషించి లాభమేమి?

జరాకాలే జరామేతి మృత్యుకాలే తథామృతిమ్
సమ ఏవావిశేషజ్ఞః కాయో భోగిదరిద్రయోః. 45

ముసలితనమున ముసలితనమును, మృత్యుకాలమున మృతిని, ఈ శరీరము వివేచనలేకుండ—ధనికుని శరీరమే గానీ, దరిద్రుని శరీరమే గానీ—పొందుచున్నది.

సంసారాంబోధిజఠరే తృష్ణా కుహరకాంతరే
సుప్తస్తిష్ఠతి ముక్తేహో మూకోఽయం కాయకచ్ఛపః. 46

ఈ శరీరమను తాబేలు సంసార సముద్రగర్భమున, తృష్ణయను కలుగున, ఉద్ధార ప్రయత్నము నొనర్పకయే చల్లగ నిద్రించుచున్నది.

వహన్తి కార్థయోగ్యాని కాయకాష్ఠాని భూరిశః
సంసారాబ్ధావిహైతేభ్యః కంచిత్తేషు నరం విదుః. 47

ఈ సంసారసముద్రమున దేలుచున్న కట్టెలలో చాలకట్టెలు బహువుచేటు; వాటిలో కొన్నిమాత్రమే నరదేహములు.

దీర్ఘదౌరాత్మ్యవలయా నిపాతఫలపాతయా
న దేహలతయా కార్యం కించిదస్తి వివేకినః. 48

దుర్మార్గ వలయముగలదియు, పతనమను ఫలము గలదియునగు దేహలతతో వివేకులగువారికిఁ బనియేమి?

మజ్జన్ కర్దమకోశేషు ఝటిత్యేవ జరాం గతః
నజ్ఞాయతే యాత్యచిరాత్ కః కథం దేహదర్దురః. 49

విషయములను బురదగుంటలోఁబడుచు, అమాంతముగ జరచే నాక్రమింపబడిన దేహమను కప్ప ఇంతలో నెచ్చటి కెట్లరుగునో తెలియలేము.

నిఃసార సకలారంభాః కాయాశ్చపలవాయవః
రజోమార్గేణ గచ్ఛంతో దృశ్యన్తే నేహ కేనచిత్. 50

ఈ శరీరమను వాయువుయొక్క కార్యములన్నియు సారహీనములు; ఇది రజోమార్గము పనే ... గతి నెవ్వరును గాంచజాలరు.

వాయోర్దీపస్య మనసో గచ్ఛతో జ్ఞాయతే గతిః.
అగచ్ఛతశ్చ భగవన్ శరీరస్య కదాచన. 51

భగవంతుడా! వాయువుయొక్కయు, దీపముయొక్కయు, మనస్సుయొక్కయు, గమనాగమనము (ఉత్పత్తి నాశముల) నెఱిగిన నెఱుగగలము గాని, శరీరముయొక్క గమనాగమనముల నెఱుగజాలము.



బద్ధాస్థా యే శరీరేషు బద్ధాస్థా యే జగత్స్థితౌ
తాన్మోహమదిరోన్మత్తాన్ ధిగ్ ధిగస్తు పునః పునః. 52

శరీరమును, జగత్తును, చిరస్థాయి, సత్యము, సారవంతములనుకొను మోహమదిరోన్మత్తులకు మాటిమాటికి ధిక్కారమగు గాత!

నాహం దేహస్య నో దేహో మమ నాయమహం తథా
ఇతి విశ్రాంతచిత్తా యే తే మునే పురుషోత్తమాః. 53

మునీంద్రా! దేహమునకును నాకును, నాకును దేహమునకును, సంబంధమేమియును లేదు; నేనీ జడదేహమును గాను, అని తెలిసికొని పరమాత్మయందు విశ్రాంతినందిన చిత్తముగలవాడే పురుషోత్తముఁడు.

మానావమానబహులా బహులాభమనోరమాః
శరీరమాత్రబద్ధాస్థం ఘ్నంతి దోషదృశో నరమ్. 54

మానావమానములను, వివిధ భ్రాంతులను జూపించి, జనులమనస్సును హరించు అజ్ఞానశక్తి, దేహాత్మభ్రాంతుడగువానిని మృత్యువశ మొనర్చుచున్నది.

శరీరశ్వభ్రశాయిన్యా పిశాచ్యా పేశలాంగయా
అహంకారచమత్కృత్యా ఛలేన ఛలితా వయమ్. 55

శరీరబిలమున శయనించియున్న, అహంకారమను పిశాచివలన గల్పింపఁబడిన విషయ తృష్ణలవలన మేము మోసగింపఁబడుచున్నారము.

ప్రజ్ఞావరాకీ సర్వైవ కాయబద్ధాస్థయానయా
మిథ్యాజ్ఞానకురాక్షస్య ఛలితా కష్టమేకికా. 56

అహో! శరీరము స్థిరమను నమ్మికకు మూలకారణమగు మిథ్యయను రాక్షసి మోసమున, దీనయగు సద్బుద్ధి ఏకాకియై (వివేకవిహీనయై) పడుచున్నది.

నకించిదపి దృశ్యేఽస్మిన్ సత్యం తేన హతాత్మనా
చిత్రం దగ్ధశరీరేణ జనతా విప్రలభ్యతే. 57

ఈ జగత్తున సత్యమొకించుకైన లేకపోయినను అస్థిత్వవిహీనమగు ఈ పాడు శరీరము జనులను వంచించుచున్నది.

దినైః కతిపయైరేవ నిర్ఝరాంబుకణో యథా
పతత్యయమయత్నేన జరఠః కాయపల్లవః. 58

కొద్దిరోజులలోనే, ఈ శరీర పల్లవమెండి, నిర్ఝరాంబుకణమువలె, పడిపోవుచున్నది.

కాయోఽయమచిరాపాయో బుద్బుదోఽంబునిధావివ
వ్యర్థం కార్యపరావర్తే పరిస్ఫురతి నిష్ఫలః. 59

సముద్రజలమందలి బుడగవలె, క్షణధ్వంసియగు నీ శరీరము సంసారకార్యములను సుడిగుండమున వ్యర్థముగ తిరుగుచున్నది.

మిథ్యాజ్ఞానవికారేఽస్మిన్ స్వప్నసంభ్రమపత్తనే
కాయే స్ఫుటతరాపాయే క్షణమాస్థా న మే ద్విజ. 60

ద్విజుడా! యీ శరీరము మిథ్యాజ్ఞాన పరిణామము; స్వప్నపురివంటిది. దీని ఉనికి క్షణమాత్రకాలమే. కాన, దీనియందు నాకు నమ్మకము లేదు.

తడిత్సు శరదభ్రేషు గంధర్వనగరేషు చ
స్థైర్యం యేన వినిర్ణీతం స విశ్వసితు విగ్రహే. 61

మెఱపుతీగెలను, శరత్ - మేఘములను, గంధర్వ నగరములను స్థిరమని నమ్మువాడే యీ శరీరమునుఁగూడ స్థిరమని నమ్ముగాక.

సతతభంగుర కార్యపరంపరా
విజయిజాతజయం హతవృత్తిషు
ప్రబలదోషమిదంతు కలేబరమ్
తృణమివాహమపోహ్య సుఖం స్థితః. 62

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే వైరాగ్యప్రకరణే
కాయజుగుప్సానామ అష్టాదశః సర్గః ॥ 18 ॥

క్షణభంగురత్వమున నిది గంధర్వనగరమును మించినది; దీనిని తృణసమముగ నెంచి నేను సుఖముగనున్నాడను.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు వైరాగ్యప్రకరణమున
కాయజుగుప్సయను అష్టాదశ సర్గము ॥ 18 ॥



## ఏకోనవింశః సర్గః.

శ్రీరామ ఉవాచః—

లబ్ధ్వాపి తరలాకారే కార్యభారతరంగిణి
సంసారసాగరే జన్మ బాల్యం దుఃఖాయ కేవలమ్. 1

శ్రీరాముఁడు:—వివిధకార్యసమూహ తరంగములతో చంచలమును, సంకులమునునగు సంసార సముద్రమున పడుట దుఃఖముకొఱకే; అందును బాల్యము కేవలము దుఃఖముతో ఘూడియున్నది.



అశక్తిరాపదస్తృష్ణా మూకతా మూఢబుద్ధితా
గృధ్నుతా లోలతా దైన్యం సర్వం బాల్యే ప్రవర్తతే. 2

శక్తిలేకపోవుట, ఆపదలు, చిఱుతిళ్లకోఱిక, మాటలాడలేకపోవుట, మూఢత్వము, ఆటలాడ కోరిక, చాపల్యము, దైన్యము — ఇవన్నియు బాల్యధర్మములు.

రోషరోదనరాద్రాసు దైన్యజర్జరితాసుచ
దశాసు బంధనం బాల్యమాలానం కరిణామివ. 3

స్తంభమునకుఁ గట్టివేయఁబడిన ఏనుఁగువలె బాలుఁడు రోషరోదన చంచలత్వదైన్యముల వలన బీడింపఁబడును.

నమృతౌ నజరారోగే నచాపది నయౌవనే
తాశ్చింతాః పరికృంతంతి హృదయం శైశవేషు యాః. 4

శైశవసమయమున హృదయమును బీడించు చింతలు, యౌవనమున, వార్ధక్యమున, రోగసమయమున మృతించునప్పుడుగూడ కలుగవు.

తిర్యగ్జాతి సమారంభః సర్వైరేవావధీరితః
లోలో బాలసమాచారో మరణాదపి దుఃఖదః. 5

బాల్యావస్థ మరణముకంటె దుఃఖప్రదము, అందరును తిరస్కరింతురు; చాపల్యమెక్కువ. అప్పటి చేష్టలన్నియు పశుపక్ష్యాదుల ననుకరించి యుండును.

ప్రతిబింబఘనాజ్ఞానం నానాసంకల్పపేలవమ్
బాల్యమాలూన సంశీర్ణమనః కస్య సుఖావహమ్. 6

శైశవము ప్రతిబింబించు అజ్ఞానమువంటిది. పలువిధములగు అర్థహీనసంకల్పములతో గూడుకొనినది; అందువలన మనస్సు విక్షిప్తమై సదా దుఃఖమున మునిగియుండును. ఇట్టిదగు బాల్యమెవరికి సుఖమును గలిగించును?

జలవహ్న్యనిలాజస్ర జాతభీత్యా పదేపదే
యద్భయం శైశవేఽబుద్ధ్యా కస్యాపది హి తద్భవేత్. 7

నీరు, నిప్పు, గాలులవలన, చిన్నతనమునఁ గలుగు భయమునుఁ బోలు భయము, ఎట్టి ఆపదలనున్న వానికైనను గలుగదు.

లీలాసు దుర్విలాసేషు దురీహాసు దురాశయే
పరమం మోహమాధత్తే బాలో బలవదాపతన్. 8

బాలుఁడు ఆటలలోను, ఛిలిపి చేష్టలలోను, ఇంగితములలోను ప్రబలాసక్తిని గన్పరచుచు అజ్ఞానమును వెల్లడించుచుండును.

వికల్పకల్పితారంభం దుర్విలాసం దురాస్పదం
శైశవం శాసనాయైవ పురుషస్య న శాంతయే. 9

బాలకుఁడు, ఫలశూన్యములగు పనుల నుత్సాహముతో నొనర్చును. అల్లరిచేయును. విలువ లేనిదీబాల్యము; పెద్దలు పెట్టుచివాట్లను, కొట్టుదెబ్బలను పడవలసియుండును. కనుక, దుఃఖమయ మైనది.

యేదోషా యేదురాచారా దుష్క్రమా యే దురాధయః
తే సర్వే సంస్థితా బాల్యే దుర్గర్త ఇవ కౌశికాః. 10

తప్పులు, చెడ్డపనులు, మనోవ్యాధులు — ఇవన్నియుఁ జీకటికొట్టమునకు గ్రుడ్లగూబలవలె బాల్యముననే అరుదెంచును.

బాల్యం రమ్యమితి వ్యర్థబుద్ధయః కల్పయంతి యే
తాన్ మూఢపురుషాన్ బ్రహ్మన్ ధిగస్తు హతచేతసః. 11

మహాత్మా! బాల్యము రమ్యమని దలచుమూఢులకు ధిక్కారమగు గాత!

యత్ర దోలాకృతిమనః పరిస్ఫురతి వృత్తిషు
త్రైలోక్యాఽభవ్యమపి తత్ కథం భవతి తుష్టయే. 12

బాల్యమున చిత్తమెల్లప్పుడును దోలాయమానమగుచుండును; ఇట్టి పాడుస్థితి మరొకటి మూడులోకములు వెదకిచూచినను గన్పట్టదు. ఇది సంతోషము నెట్లు గలిగించగలదు?

సర్వేషామేవ సత్త్వానాం సర్వావస్థాభ్య ఏవ హి
మనశ్చంచలతామేతి బాల్యే దశగుణం మునే. 13

మునీంద్రా! ఎల్లరికిని, అన్నివేళలకంటె, బాల్యముననే చిత్తము పదిమడుంగు లెక్కువగ చంచలమగును.

మనః ప్రకృత్యైవ చలం బాల్యంచ చలతాంవరం
తయోః సంశ్లిష్యతో స్త్రాతా క ఇవాన్తః కుచాపలే. 14

మనస్సు స్వభావతః చంచలము; బాల్యావస్థగూడ అత్యంతచంచలమైనది. ఈ రెంటి కలయికవలన కలిగిన చాపల్యమునుండి వెలువరింప ఎవరు సమర్థులు?

స్త్రీలోచనైస్తడిత్పుంజైర్జ్వాలాజాలైస్తరంగకైః
చాపలం శిక్షితం బ్రహ్మన్ శైశవాక్రాంతచేతసః. 15

స్త్రీలలోచనములును, విద్యుత్తులును, అగ్నిజ్వాలలును, తరంగములును, చంచలత్వమును బాలురకడనుండియే నేర్చుకొనినవి.

శైశవం చ మనశ్చైవ సర్వాస్వేవ హి వృత్తిషు
భ్రాతరావివ లక్ష్యేతే సతతం భంగురస్థితీ. 16

అన్నివేళల, అన్నికార్యముల, చంచలములగు బాల్యము, మనస్సులు, అన్నదమ్ములవలె కన్పబడుచున్నవి.



సర్వాణి దుఃఖభూతాని సర్వేదోషా దురాధయః
బాలమేవోపజీవంతి శ్రీమంత మివ మానవాః. 17

ధనికుని ఆశ్రయించుకొని ఇతరులగు జనులు జీవించునట్లు, అన్నిదుఃఖములును, అన్నిదోషములును, అన్నిపీడలును, బాలునే ఆశ్రయించుకొని జీవించుచున్నవి.

నవంనవం ప్రీతికరం న శిశుః ప్రత్యహం యది
ప్రాప్నోతి తదసౌ యాతి విషవైషమ్యమూర్ఛనామ్. 18

ప్రతిదినము క్రొత్తక్రొత్తవస్తువులు దొరకక పోయిన బాలుఁడు విషమునుఁబోలు చిత్తవికారమునందును.

స్తోకేన వశమాయాతి స్తోకేనైతి వికారితామ్
అమేధ్య ఏవ రమతే బాలః కౌలేయకో యథా. 19

కొద్దితోడనే బాలుఁడు సంతోషించుచున్నాడు; మరల కొద్దితోడనే దుఃఖమునందుచున్నాడు. కుక్కవలె అపవిత్రస్థితియందే క్రీడించుచున్నాడు.

అజస్రబాష్పవదనః కర్దమార్ద్రో జడాశయః
వర్షోక్షితస్య తప్తస్య స్థలస్య సదృశః శిశుః. 20

శిశువు వర్షధారలనుంచిన; కాలిన పెనమువంటివాడు; ఎడతెగకుండ కన్నీళ్ళను గార్చును, మలినశరీరుడు, జడుఁడు.

భయాహారపరం దీనం దృష్టాదృష్టాభిలాషిచ
లోలబుద్ధి వపుర్ధత్తే బాల్యం దుఃఖాయ కేవలమ్. 21

భయము, ఆహారవాంఛ, దీనత్వము, సృష్టా దృష్ట వస్తువులయెడ నభిలాష, చంచలత్వము — ఇవి బాల్యధర్మములు. ఇది కేవలము దుఃఖముకొఱకే.

స్వసంకల్పాభిలషితాన్ భావానప్రాప్య తప్తధీః
దుఃఖమేత్యబలో బాలో వినికృత్త ఇవాశయే. 22

బలహీనుఁడగు బాలుడు తాను కోరుకొను వస్తువులు దొరకకపోయిన, పరితపించును; హృదయము విచ్చిపోయినంత దుఃఖమును బొందును.

దురీహాలబ్ధలక్ష్యాణి బహువక్రోల్బణానిచ
బాలస్య యాని దుఃఖాని మునే తాని న కస్యచిత్. 23

మునీ! బాలుఁడు దుశ్చేష్టలవలన, దుష్టమనోరథముల నెఱవేర్చుకొన వక్రోపాయముల నవలంబించును. వాటివలన గలుగు దుఃఖము మరెవ్వరికిని గలుగదు.

బాలో బలవతా స్వేన మనోరథవిలాసినా
మనసా తప్యతే నిత్యం గ్రీష్మేణేవ వనస్థలీ. 24

గ్రీష్మమున వనభూమి తపించునట్లు, బాలుఁడు మనోరథముల వెంటనంటిపరుగిడు తనమనస్సు వలన, తపింపఁబడుచున్నాఁడు.

విద్యాగృహగతో బాలో పరామేతి కదర్థనాం
ఆలాన ఇవ నాగేంద్రో విషమైర్విషమ్యభీషణామ్. 25

పాఠశాల కఱిఁగిన బాలుఁడు కట్టుపడిన ఏనుఁగువలె, విషమములగు బాధల నందును.

నానామనోరథమయ్యా మిథ్యాకల్పితకల్పనా
దుఃఖాయాత్యంతదీర్ఘాయ బాలతా పేలవాశయా. 26

పలుకోర్కెలతోడను, మిథ్యాకల్పనలతోడను, సారహీనములగు ఆశయములతోడను గూడిన బాల్యము దీర్ఘదుఃఖము కొరకే.

సంప్రాప్తో భువనం భోక్తుమిందు మాదాతుమంబరాత్
వాంఛతే యేన మౌర్ఖ్యేణ తత్ సుఖాయ కథం భవేత్. 27

ప్రపంచమును భుజించు కోర్కెయు, ఆకాశమునుండి చంద్రునిగొనివచ్చు తలపునుగల బాల్యమెట్లు సుఖకరముకాగలదు?

అంతశ్చిత్తేరశక్తస్య శీతాతపనివారణే
కో విశేషో మహాబుద్ధే బాలస్యోర్వీరుహ స్తథా. 28

మహామతీ! బాలునకును వృక్షమునకును భేదమేమి? ఇరువురకు వాంఛ యున్నది— కాని శీతాతపముల వారింపఁగొను శక్తిలేదు.

ఉడ్డీతుమభివాంఛంతి పక్షాభ్యాం క్షుత్పరాయణాః
భయాహారపరా నిత్యం బాలా విహగధర్మిణః. 29

బాలుఁడు భీతి, ఆకలి కలిగినప్పుడు చేతులఁజాపి పక్షివలె పై కెగురగోరును.

శైశవే గురుతో భీతి ర్మాతృతః పితృత స్తథా
జనతో జ్యేష్ఠబాలాచ్చ శైశవం భయమందిరమ్. 30

శైశవమున గురువు, తల్లిదండ్రులు, అపరిచితులు, పెద్దపిల్లలవలన భయమపరిమితముగ గల్గును. (కాన) శైశవము భయమున కిల్లు.

సకలదోషదశావిహతాశయం
శరణమప్యవివేకవిలాసినః



ఇహ న కస్యచిదేవ మహామునే
భవతి బాల్యమలం పరితుష్టయే. 31

ఇత్యార్షే వాసిష్ఠ-మహారామాయణే వాల్మీకీయే వైరాగ్య ప్రకరణే
బాల్యజుగుప్సానామ ఏకోనవింశః సర్గః ॥ 19 ॥

మహామునీ! బాల్యమున వివిధదోషములవలన మనస్సు కలుషిత మగును; ఇది అవివేకమను విలాసపురుషున కాశ్రయము. ఇట్టి బాల్యము జగత్తున ఎవరికిని సంతోషమును గలిగింప జాలదు.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు వైరాగ్య-
ప్రకరణమున బాల్యజుగుప్సయను
ఏకోనవింశ సర్గము ॥ 19 ॥



## వింశః సర్గః.

---

శ్రీరామ ఉవాచః—

బాల్యానర్థమథ త్యక్త్వా పుమానభిహతాశయః
ఆరోహతి నిపాతాయ యౌవనం సంభ్రమేణ తు. 1

శ్రీరాముఁడు:—అనంతరము బాల్యానర్థమునుండి విడువడి, పెంపుగొను కోర్కెలతో యౌవనమును ప్రాపించును; దీని ఫలితము పతనమే.

తత్రానంత విలాసస్య లోలస్యాస్వస్య చేతసః
వృత్తీరనుభవన్ యాతి దుఃఖాద్దుఃఖాంతరం జడః. 2

జడుడగు యువకుఁడిచ్చట మనస్సుయొక్క చంచలములగు విలాసవృత్తులకు లోబడుచున్నాఁడు; ఒకదుఃఖమునుండి విడఁవడి మరొక దుఃఖము నందుచున్నాఁడు.

స్వచిత్తబిలసంస్థేన నానాసంభ్రమకారిణా
బలాత్ కామపిశాచేన వివశః పరిభూయతే. 3

హృదయమునందున్న కామపిశాచము వివిధములగు భయభ్రాంతులకు హేతువు, శక్తిహీనుఁడగు యువకుఁడు దీనికి వశమగుచున్నాఁడు.

చింతానాం లోలవృత్తీనాం లలనానామివావృతీః
అర్పయత్యవశం చేతో బాలానామంజనం యథా. 4

ఈ సమయమున చిత్తము యువతుల చిత్తముకంటె నెక్కుడు చంచలముగనుండును. దీనిని లోబఱచుకొన జాలము. ఇది సిద్ధాంజనమువలె, భోగవస్తువుల కనంబడ జేయును.

తేతే దోషా దురారంభా స్తత్ర తం తాదృశాశయమ్
తద్రూపం ప్రతిలుంపంతి దుష్టాస్తేనైవ యే మునే. 5

మునీ! యౌవనమున, నాశకారణములగు స్త్రీద్యూత కలహాది దోషములన్నియు, కామచింతావివశుఁడగు పురుషుని బాధచేయుచున్నవి.

మహానరకబీజేన సంతతభ్రమదాయినా
యౌవనేన న యే నష్టా నష్టా నాన్యేన తే జనాః. 6

నరకబీజమును, భ్రాంతిప్రదమును నగు యౌవనమున పాడవనివాడు, ఇతరములవలన పాడవడు.

నానారసమయీ చిత్రవృత్తాంతనిచయోంభితా
భీమా యౌవనభూ ర్యేన తీర్ణా ధీరః స ఉచ్యతే. 7

శృంగారాది రసములతోఁగూడినదియు, వివిధ విషయాభిలాషలతో నిండినదియు, భయంకరమును అగు యౌవనాటవిని దాటినవాడు ధీరుఁడనఁబడుచున్నాడు.

నిమేషభాసురాకాలమాలోలఘనగర్జితమ్
విద్యుత్ప్రకాశమశివం యౌవనం మే న రోచతే. 8

క్షణమాత్రము దీపిల్లు ఉజ్జ్వలప్రకాశమును, గర్జనమును గల మెఱుపుతీగనుఁ బోలు అశుభ యౌవనము నాకు రుచింపదు.

మధురం స్వాదు తిక్తంచ దూషణం దోషభూషణమ్
సురాకల్లోల సదృశం యౌవనం మే న రోచతే. 9

ఈ యౌవనము, భోగసమయమున మధురమైతోఁచుచు, కటుపరిణామముగల కల్లు వంటిది; దూష్యవస్తువు. దోషములమేటి. ఇది నాకు రుచించుట లేదు.

అసత్యం సత్యసంకాశ మచిరాద్విప్రలంభదమ్
స్వప్నాంగనాసంగసమం యౌవనం మే న రోచతే. 10

యౌవనమును, స్వప్నస్త్రీసంగమమును, సమానములు. ఈ రెండును అసత్యములే. కాని నిజమట్లు కనంబడి, వెను వెంటనే మోసగించును. ఇట్టిదగు యౌవనము నాకు రుచింపదు.

సర్వస్యాగ్రే సర్వపుంసః క్షణమాత్రమనోహరమ్
గంధర్వనగరప్రఖ్యం యౌవనం మే న రోచతే. 11

క్షణికములగు మనోహరవస్తువు లన్నిటిలో నగ్రగణియు, క్షణికమును, గంధర్వనగర సదృశమునునగు యౌవనము నాకు రుచింపదు.



ఇషుప్రపాతమాత్రం హి సుఖదం దుఃఖభాసురం
దాహదోషప్రదం నిత్యం యౌవనం మే న రోచతే. 12

సంధింపఁబడిన బాణమువలె, అల్పసుఖదాయకమును, దుఃఖాంతమును, హృదయతాపహేతువును నగు యౌవనము నాకు రుచించుట లేదు.

ఆపాత మాత్రరమణం సద్భావరహితాంతరమ్
వేశ్యాస్త్రీసంగమప్రఖ్యం యౌవనం మే న రోచతే. 13

వేశ్యాసంగమమువలె ఆపాతమనోహరమును, నీచమును నగు యౌవనము నాకు రుచింపదు.

యే కేచన సమారంభా స్తే సర్వే సర్వదుఃఖదాః
తారుణ్యే సన్నిధిం యాంతి మహోత్పాతా ఇవ క్షయే. 14

దుఃఖకారణములగు కార్యములన్నియు, ప్రళయ సమయమున ఉత్పాతము లరుదెంచునట్లు యౌవనముననే గూడును.

హార్దాంధకారకారిణ్యా భైరవాకారవానపి
యౌవనాజ్ఞానయామిన్యా బిభేతి భగవానపి. 15

హృదయము నంధకారమొనర్చు యౌవనమను అజ్ఞాన రాత్రియందు భైరవాకారమును దాల్చిన భగవంతుఁడు గూడ భయపడును.

సువిస్మృత శుభాచారం బుద్ధివైధుర్యదాయినమ్
దదాత్యతితరామేష భ్రమం యౌవన సంభ్రమః. 16

యౌవనమోహము మిక్కుటమగు భ్రమను గల్గించును; సదాచారముల మరచునట్లొనరించును; బుద్ధిని మందగింపఁ జేయును.

కాంతావియోగజాతేన హృది దుస్సహవహ్నినా
యౌవనే దహ్యతే జంతు స్తరుర్దావాగ్నినా యథా. 17

దావాగ్ని వృక్షమును దహించునట్లు, యౌవనమున మనుజుఁడు తరుణీవియోగమువలన నలిగిన దుఃసహదుఃఖమువలన దహింపఁబడును.

సునిర్మలాపి విస్తీర్ణా పావన్యపి హి యౌవనే
మతిః కలుషతామేతి ప్రావృషీవ తరంగిణీ. 18

సహజముగ బుద్ధి స్వచ్ఛమును, విశాలమును, పవిత్రమును అయినను, యౌవనమున వర్షాకాల నదివలె కలుషితమగును.

శక్యతే ఘనకల్లోలా భీమా లంఘయితుం నదీ
నతు తారుణ్యతరలా తృష్ణా తరలితాంతరా. 19

కెరటములతో భయమును గొల్పు నదిని దాటవచ్చునుగాని, చిత్తమును, యౌవనమును చంచలమొనరుచు తృష్ణను దాటలేము.

సా కాంతా తౌ స్తనౌ పీనౌ తే విలాసా స్తదాననం
తారుణ్యా ఇతి చింతాభి ర్యాతి జర్జరతాం జనః. 20

ఆ వనిత, ఆ పీనస్తనములు, ఆవిలాసము, ఆసోయగము—ఇట్టి చింతలతో పురుషుఁడు. యౌవనముననే శైథిల్యము నందును.

నరం తరళతృష్ణార్తిం యువానమిహ సాధవః
పూజయంతి నతు చ్ఛిన్నం జరత్తృణలవం యథా. 21

సాధుపురుషులు, చంచలమగు తృష్ణచే పీడితుఁడగు యువకుని, గడ్డిపరకట్లు చూచుటయే గాక, అవజ్ఞ కూడ నొనర్తురు.

నాశాయైవ మదార్తస్య దోషముక్తికధారిణః
అభిమానమహేభస్య నిత్యాలానం హి యౌవనం. 22

అభిమానమత్తుఁడగు పురుషుఁడు మదపుటేనుగ వంటివాఁడు; దోషములే వీనిముత్యములు. (ఏనుగ గండస్థలమున ముత్యములుండునను విషయము లోకప్రసిద్ధము) యౌవనమే వీనికి వినాశమును జేకూర్చును; ఇదియే వానిని నిరంతరము కట్టియుంచు స్తంభము.

మనోవిపులమూలానాం దోషాశీవిషధారిణాం
శోషరోదనవృక్షాణాం యౌవనం బత కాననమ్. 23

అహో! యౌవనము శుష్కరోదనములను వృక్షములుండు అడవి; మనస్సే దీని మొదలు, దోషములను సర్పములే దీన వాసమొనర్చు చున్నవి.

రసకేసరసంబాధం కువికల్పదలాకులం
దుశ్చింతా చంచరీకాణాం పుష్కరం విద్ధి యౌవనమ్ 24

దుశ్చింతలను తుమ్మెదలకు పద్మ మీ యౌవనము; సుఖలవమే దీని మధువు; అనురాగాదులే దీని కేసరములు; తుచ్ఛకల్పనలే దీని దళములు;

కృతాకృతకువక్షాణాం హృత్సర స్తీరచారిణాం
ఆధివ్యాధివిహంగానాం మాలయో నవయౌవనమ్. 25

యౌవనము, హృదయమను సరస్సుయొక్క తీరముల సంచరించునవియు, కృతాకృతములగు పాపపుణ్యములను చెడురెక్కలు గలిగినవియునగు చింతావ్యాధులను పక్షులకుగూడు.

జడానాం గతసంఖ్యానాం కల్లోలానాం విలాసినాం
అనపేక్షితమర్యాదో వారిధిర్నవయౌవనమ్. 26

నవయౌవనము, జరాదుఃఖములను చెలియలికట్ట గలిగి, వికల్పతరంగములతో గూడుకొనిన మహాసముద్రము; ఈ తరంగములు లెక్కకుమీరినవి, జడములు.

సర్వేషాం గుణసర్గాణాం పరిరూఢరజస్తమాః
అపనేతుం స్థితం దక్షో విషమో యౌవనానిలః. 27



దుమ్మును లేవనెత్తి, చీకటిని గ్రమ్మజేయు పెనుగాలి సాలెగూళ్లను పాడుచేయగలిగినట్లు; రజస్తమోగుణముల ప్రాబల్యహేతువగు యౌవనము, ప్రయత్నముతో సంపాదింపఁబడిన సద్గుణజాలముల నాశనమొనర్ప సమర్థమైయున్నది.

నయంతిపాండుతాం వక్త్రమాకులావకరోత్కటాః
ఆరోహంతి పరాం కోటిం రూక్షా యౌవనపాంసవః. 28

ఇంద్రియ చాంచల్యమున పైకెగసిన యౌవనమను ధూళి, మనుష్యుల వదనమును వెల్లబడ జేయుటలో శ్రేష్ఠతనందును.

ఉద్బోధయతి దోషాలిం నికృంతతి గుణావలిం
నరాణాం యౌవనోల్లాసో విలాసో దుష్కృతశ్రియామ్. 29

పాపముయొక్క విలాసమగు యౌవనోల్లాసము దోషములను పెంచును; గుణములను తెంచును.

శరీరపంకజరజశ్చంచలాం మతిషట్పదీం
నిబధ్నన్ మోహయత్యేష నవయౌవనచంద్రమాః. 30

యౌవనమను చంద్రుడు శరీరమను పద్మముయొక్క పుప్పొడిని బొందగోరు మనస్సను తుమ్మెదను బద్ధమొనర్చి మోహిత మొనర్చును. (పద్మమున ప్రవేశించి మధువునుత్రాగి మత్తిలు భ్రమరము, చంద్రోదయమైనంతనే పద్మము ముకుళించుకొనిపోవ, అందు బంధీకృతమై పరితపించునను విషయము కవిప్రసిద్ధము.)

శరీరఖండకోద్భూతా రమ్యా యౌవనవల్లరీ
లగ్నమేవ మనోభృంగం మదయత్యున్నతింగతా. 31

శరీరమను పొదరింట పుట్టిన యౌవనకుసుమములు, పొడచూపిన మాత్రముననే, మానసభ్రమరము మోహమునం బడును.

శరీరమరుతాపోత్థాం యువతామృగతృష్ణికాం
మనోమృగాః ప్రధావంతః పతంతి విషయావటే. 32

మనస్సులను లేళ్లు, శరీరమను మరుభూమియందు కామతాపమువలన గల్గినయౌవనమను ఎండమావులకై పరుగులిడి విషయములను గర్తమునం గూలుచున్నవి.

శరీరశర్వరీజ్యోత్స్నా చిత్తకేసరిణః సటా
లహరీ జీవితాంభోధే ర్యువతా మే న తుష్టయే. 33

యౌవనము, శరీరమను రాత్రియొక్క వెన్నెల; చిత్తమను సింహముయొక్కజూలు; జీవన సముద్రముయొక్క తరంగము — ఇదినాకు సంతోషమును గలిగింపజాలదు.

దినాని కతిచిద్ యేయం ఫలితా దేహజంగలే
యువతా శరదస్యాం హి న సమాశ్వాస మర్హథ. 34

ఈ యౌవనము శరత్కాలము దేహాటవియందు ఫలించునది అల్పకాలమే; అందువలన దీనిని విశ్వసించుట తగదు.

ఝటిత్యేవ ప్రయాత్యేవ శరీరాద్యువతా ఖగః
క్షణేనైవాల్పభాగ్యస్య హస్తాచ్చింతామణిర్యథా. 35

చింతామణి క్షణములో దురదృష్టవంతుని చేతినుండి జారిపోవునట్లు, యౌవనవిహంగము అల్పసమయములోనే దేహమునందుండి ఎగసిపోవును.

యదాయదా పరాంకోటి మధ్యారోహతి యౌవనమ్
వల్గంతి సజ్వరాః కామాస్తదా నాశాయ కేవలమ్. 36

నడియౌవనమున, కామము సంతాపమును గూర్చుచు ప్రాబల్యమునందును; ఇది వినాశనమును గూర్చుట కొఱకే.

తావదేవ వివల్గంతి రాగద్వేష పిశాచకాః
నాస్తమేతి సమస్తైషా యావద్యౌవనయామినీ. 37

యౌవనమను రాత్రి గడవనంతవఱకు రాగద్వేషాదులను పిశాచములు సంచరించుచునే యుండును.

నానావికారబహులే పరాకే క్షణనాశిని
కారుణ్యం కురు తారుణ్యే మ్రియమాణే సుతేయథా. 38

చనిపోవు పుత్రునెడల కరుణను జూపదగునట్లు, నానావిధ వికారములతోగూడి, క్షణభంగురమగు యౌవనము ఎడల దయజూపనగును.

హర్షమాయాతి యో మోహాత్ పురుషః క్షణభంగినా
యౌవనేన మహాముగ్ధః సవై నరమృగః స్మృతః. 39

ఏపురుషుడు క్షణభంగురమగు యౌవనము ఎడల ముగ్ధుడై, అజ్ఞానముతో సంతుష్టుడగునో అతడు నరపశువు.

మానమోహోన్మదోన్మత్తం యౌవనం యోఽభిలష్యతి
అచిరేణ సదుర్బుద్ధిః పశ్చాత్తాపేన యుజ్యతే. 40

ఏవ్యక్తి, అభిమానమోహమునఁ గప్పువడి, మదోన్మత్తమగు యౌవనము నభిలషించునో ఆ దుర్మతి అచిరముననే అనుతప్తుడగును.

తే పూజ్యాస్తే మహాత్మాన స్త ఏవ పురుషా భువి
యే సుఖేన సముత్తీర్ణాః సాధో యౌవనసంకటాత్. 41

సాధువర్యా! ఎవరు యౌవనసంకటమును సుఖముగ దాటిరో, వారేపూజ్యులు, వారే మహాత్ములు, వారే పురుషులు.



సుఖేన తీర్యతేఽంబోధి రుత్క్రుష్టమకరాకరః
న కల్లోల బలోల్లాసి సదోషం హత యౌవనమ్. 42

పెనుమొసళ్లతో నిండిన సముద్రమును అనాయాసముగ దాటగలముగాని, రాగాదిదోష తరంగములతోఁ గూడి, దోషమయమగు పాడు యౌవనమును దాటలేము.

వినయభూషిత మార్యజనాస్పదం
కరుణయోజ్జ్వల మావలితం గుణైః
ఇహహి దుర్లభమంగ సుయౌవనం
జగతి కాననమంబరగం యథా. 43

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే వైరాగ్యప్రకరణే
యౌవనగర్హా నామ వింశతితమః సర్గః ॥ 20 ॥

వినయముతో నలంకరింపఁబడినదియు, ఆర్యులశాంతిభూమియు, కరుణచే ప్రకాశించునదియు, సుగుణావృతమునునగు యౌవన మీ జగత్తున, ఆకాశకుసుమమువలె, దుర్లభము.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు వైరాగ్యప్రకరణమున
యౌవనగర్హమను వింశతితమ సర్గము ॥ 20 ॥



## ఏకోవింశః సర్గః.

శ్రీరామ ఉవాచ:—

మాంసపాంచాలికాయాస్తు యంత్రలోలేఽంగపంజరే
స్నాయ్వస్థిగ్రంథిశాలిన్యాః స్త్రియాః కిమివశోభనమ్. 1

శ్రీరాముడు:—నరములు, ఎముకల కూర్పులును, మాంసపు బొమ్మలును నగు స్త్రీల యంత్ర చంచలాంగముల శోభను గూర్చు వస్తువేమున్నది!

త్వఙ్మాంసరక్తబాష్పాంబు పృథక్ కృత్వా విలోచనమ్
సమాలోకయ రమ్యంచేత్ కిం ముధా పరిముహ్యసి. 2

వనితయొక్క లోచనములను, చర్మమును, మాంసమును, రక్తమును, కన్నీటిని విభజించి చూడుము;— బాగున్న, పలుకుము, వృథా ముగ్ధుడవప నేల?

ఇతః కేశా ఇతో రక్త మితీయం ప్రమదాతనుః
కిమేతయా నిందితయా కరోతి విపులాశయః. 3

ఇచ్చట కేశములు, ఇట రక్తము — వీటితో గూడినదేగదా స్త్రీయొక్క శరీరము! వివేకి దీనితో నేమొనర్చును?

వాసో విలేపనై ర్యాని లాలితాని పునఃపునః
తాన్యంగాన్యంగ లుంఠంతి క్రవ్యాదాః సర్వదేహినామ్. 4

ఆహా! వస్త్రములనలనను, లేపనములతోడను, మాటిమాటికి కోమలమొనర్పబడుచున్నవే, జీవుల అవయవములన్నియు! — వీటిని కుక్కలు నక్కలు పొట్టను పెట్టుకొనునే!

మేరుశృంగతటోల్లాసి గంగాజలరయోపమా
దృష్టా యస్మిన్ స్తనే ముక్తా హారస్యోల్లాసశాలితా. 5
శ్మశానేషు దిగంతేషు స ఏవ లలనా స్తనః
శ్వభిరాస్వాద్యతే కాలే లఘుపిండ ఇవాంధసః. 6

ఏ స్తనములు, మేరుశిఖరమున ప్రవహించు, మందాకినీ జలధారలవలె ముత్యాల హారముల శోభతో, కనుల పండువొనర్చు చుండునో, అవి కాలవశమున శ్మశానమందొక మూల, కుక్కలకు రుచికరమగు ఆహారమగుచున్నది.

రక్తమాంసాస్థిదిగ్ధాని కరభస్య యథా వనే
తథైవాంగాని కామిన్యా స్తాం ప్రత్యపి కో గ్రహః. 7

అరణ్యమున తిరుగులాడు లొట్టె అవయవములవంటివే, రక్తమాంసాస్థులతో నిర్మింపఁబడిన స్త్రీ అవయవములు; అగుచో వీటియందింత ఆశ ఎందులకు?

ఆపాతరమణీయత్వం కల్ప్యతే కేవలం స్త్రియాః
మన్యే తదపి నాస్త్యత్ర మునే మోహైకకారణమ్. 8

మునీ! పైపైమెరుగులను స్త్రీల కంటగట్టి అజ్ఞానవశమున అందగత్తెలని తలచుచున్నారు; కాని ఈరమణీయతకూడ సంపూర్ణభ్రమయని గ్రహించితిని.

విపులోల్లాసదాయిన్యా మదమన్మథపూర్వకమ్
కో విశేషో వికారిణ్యా మదిరాయాః స్త్రియా స్తథా. 9

స్త్రీ[illegible] కల్లునకును భేదమేమియు లేదు. ఈ రెండును మత్తునుగల్గించి, ఉల్లాసము నొసఁగి, చిత్త[illegible]మును గూర్చును.

లలనాలానసంలీనా మునే మానవదంతినః
ప్రబోధం నాధిగచ్ఛంతి దృఢైరపి శమాంకుశైః. 10

మునీంద్రా! లలనయను స్తంభమునకుఁ గట్టఁబడి మైమరచిన మానవులను ఏనుఁగులు శమయను గట్టిఅంకుశమున [illegible] విశేషము నందుటలేదు.



కేశకజ్జలధారిణ్యో దుఃస్పర్శా లోచనప్రియాః
దుష్కృతాగ్నిశిఖా నార్యో దహంతి తృణవన్నరమ్. 11

కాటుక కన్నులు, కురులు దాల్చి అందముగ కనంబడు నారీలు దుస్సహములగు అగ్నిజ్వాలలు. వీరు పురుషుల, గడ్డిపరకలుగ నొనర్చి దహించుచున్నారు.

జ్వలతామతిదూరేఽపి సరసా అపి నీరసాః
స్త్రియో హి నరకాగ్నీనా మింధనం చారు దారుణమ్. 12

అతిదూరమున ప్రజ్వరిల్లు నరకాగ్నికి స్త్రీలు, లావును చేవయు గల కట్టెలు; సరసములుగ కన్పడు నీరసభోగముల పరిణతియే ఈ నరకము.

వికీర్ణాకారకబరీ తరత్తారకలోచనా
పూర్ణేందుబింబవదనా కుసుమోత్కరహాసినీ. 13
లీలావిలోలపురుషా కార్యసంహారకారిణీ
పరం విమోహనం బుద్ధేః కామినీ దీర్ఘయామినీ. 14

యువతుల కేశపాశములే చీకట్లు; వీరి చంచల నేత్రములే కదలెడు నక్షత్రములు. వీరి వదనమో నిండుచందురుడు; వీరినవ్వు పువ్వుల బోలును. ఇట్టి యువతులు పురుషులను విలాసముల లోనికి దింపి, ధర్మవైరాగ్యాది కార్యములను మరిపింపజేసి, దీర్ఘరాత్రివలె ఆయువును నాశన మొనర్చుచున్నారు.

పుష్పాభిరామమధురా కరపల్లవశాలినీ
భ్రమరాక్షీవిలాసాఢ్యా స్తనస్తబకధారిణీ 15
పుష్పకేసరగౌరాంగీ నరమారణతత్పరా
దదాత్యున్మత్తవైవశ్యం కాంతా విషలతా యథా. 16

విషపుతీగె తన్ను సేవించు మూర్ఖుల కున్మాదము కలుగజేయునట్లు, స్త్రీలు తమదరిఁ జేరు పురుషులను కామోన్మాదమున వివశుల నొనర్చివైచుచున్నారు. వీరు పుష్పమధురులుగ కన్పడుదురు. వీరి చేతులు చిగురుటాకువంటివి; వీరికన్నులు తుమ్మెదలంబోలును. వీరి స్తనములు పూలగుత్తుల వంటివి. వీరి అవయవములు కేసరములవలె ధవళములు. అయినను, వీరు విషలతవలె, నరమారణ తత్పరలు.

సత్కారోచ్ఛ్వాసమాత్రేణ భుజంగదలనోత్కయా
కాంతయోద్ధ్రియతే జంతుః కరభ్యేవోరగో బిలాత్. 17

ఎలుగుగొడ్డు శ్వాసతో పాములను కన్నమునుండి పీల్చునట్లు, మాయమర్యాదల అభినయ మొనరించి, లలనలు విటుల సర్వస్వమును గైకొని, వారిని వశీకరించుకొను చున్నారు.

కామనామ్నా కిరాతేన వికీర్ణా ముగ్ధచేతసాం
నార్యో నరవిహంగానా మంగబంధనవాగురాః. 18

మన్మథుఁడను కిరాతునిచే మోహితచిత్తులగు జనులను పక్షులంబట్ట వనితయను వల పన్నబడినది.

లలనావిపులాలానే మనోమత్తమతంగజః
రతిశృంఖలయా బ్రహ్మన్ బద్ధస్తిష్ఠతి మూకవత్. 19

బ్రహ్మజ్ఞుడా! మనస్సను మదపు టేనుగ రమణి యను స్తంభమునకు రతియను శృంఖలము (సంకెళ్ళు)న బంధింపఁబడి మూగదానివలె నున్నది.

జన్మపల్వల మత్స్యానాం చిత్తకర్దమ చారిణాం
పుంసాం దుర్వాసనా రజ్జుర్నారీ బడిశపిండికా. 20

పురుషులు సంసారమను నీటిగుంట యందలి చేపలు; చిత్తమను బురద వీరు తిరుగు చోటు; చెడు కోర్కెలే ఈ చేపలను బట్టు కట్టఁగట్టిన దారము. నెలఁతయే దీనికి గ్రుచ్చబడిన ఎర.

మందురం చ తురంగాణామాలానమివ దంతినామ్
పుంసాం మంత్ర ఇవాహీనాం బంధనం వామలోచనా. 21

గుఱ్ఱములకు శాలయు, ఏనుగలకు స్తంభమును, పాములకు మంత్రమును బంధములయినట్లు పురుషునకు వామలోచన బంధము.

నానారసవతీ చిత్రా భోగభూమిరియం మునే
స్త్రియమాశ్రిత్య సంయాతా పరామిహ హి సంస్థితిమ్. 22

వివిధములగు శోకమోహాది రసములతో గూడిన విచిత్రమగు, ఈ బ్రహ్మాండ భోగభూమి, స్త్రీల్యనాశ్రయించియే స్థిరత్వమును దాల్చినది.

సర్వేషాం దోషరత్నానాం సుసముద్గికయానయా
దుఃఖశృంఖలయా నిత్య మలమస్తు మమ స్త్రియా. 23

రమణి దోషములకు రత్న పేటిక; దుఃఖముల బట్టియుంచు సంకెల. దీనితో నాకు పనిలేదు.

కిం స్తనేన కిమక్ష్ణా వా కిం నితంబేన కిం భ్రువా
మాంసమాత్రైకసారేణ కరోమ్యహ మవస్తునా. 24

స్తనములు, నేత్రములు, పిఱుదలు, కనుబొమ్మలు— వీటిసారము మాంసమేగదా? ఈ తుచ్ఛవస్తువుతో నేనేమి యొనర్తును?

ఇతోమాంస మితోరక్త మితోఽస్థీనీతి వాసరైః
బ్రహ్మన్ కతిపయై రేవ యాతి స్త్రీ విశరారుతాం 25

[illegible]! అస్థిమాంస రక్తముల ముద్దయగు రమణి కొన్నిదినములలోనే, విశీర్ణమై పోవుచున్నది.

యాస్తాత పురుషైః స్థూలైర్లలితా మనుజైః ప్రియాః
తా మునే ప్రవిభక్తాంగ్యః స్వపన్తి పితృభూమిషు. 26

మునీంద్రా! స్థూల బుద్ధులగు పురుషులకు ప్రియమై లాలింపఁబడిన తరుణుల శరీరాంగములు శ్మశానమున ఇటనట చెల్లాచెదరై పడియున్నవి; వారట దీర్ఘనిద్రఁబోవుచున్నారు.



యస్మిన్ ఘనతరస్నేహం ముఖే పత్రాంకురాస్త్రియః
కాంతేన రచితా బ్రహ్మన్ పీయతే తేన జంగలే. 27

ప్రియులు నెమ్మొముల రచించిన తిలకములు నేడు అరణ్యభూముల శుష్కించుచున్నవి.

కేశాః శ్మశానవృక్షేషు యాంతి చామరలేఖికామ్
అస్థీన్యుడువదాభాంతి దినై రవనిమండలే. 28

వారి కేశములు శ్మశానవృక్షములందలి చామరములట్లూగు చున్నవి; వారి అస్థులు భూమిపై బడి, నక్షత్రములవలె ఆభాసిల్లు చున్నవి.

పిబంతి పాంసవో రక్తం క్రవ్యాదాశ్చాప్యనేకశః
చర్మాణి చ శివా భుంక్తే ఖం యాంతి ప్రాణవాయవః. 29

వారి రక్తమున దుమ్ము పడుచున్నది; గ్రద్దలు మాంసమును దినుచున్నవి. వారి ప్రాణవాయు వాకాశమున లీనమగుచున్నది.

ఇత్యేషా లలనాంగానామచిరేణైవ భావినీ
స్థితిర్మయా వః కథితా కిం భ్రాంతి మనుధావథ. 30

తరుణియొక్క అవయవములస్థితి ఇట్లగుచుండ భ్రాంతి ఎందులకు?

భూతపంచక సంఘట్ట సంస్థానం లలనాభిదమ్
రసాదభిపతత్యేతత్ కథం నామ ధియాన్వితః. 31

పంచభూతముల సన్నివేశమగు లలనయను దానియందు, బుద్ధిమంతుడేల అనురాగమును దాల్చును?

శాఖాప్రతానగహనా కట్వామ్లఫలమాలినీ
సుతాలోత్తాలతామేతి చింతా కాంతానుసారిణీ. 32

చిత్తము స్త్రీలననుసరించిన, శాఖలతో దట్టమై, కట్వామ్లరుచి యుక్తములగు అపక్వఫలములతో గూడిన సుతాల లతవోలె, దట్టమై అలము కొనును.

కాందిగ్భూతతయా చేతో ఘనగర్ధాంధ మాకులమ్
పరం మోహ ముపాదత్తే యూథభ్రష్టమృగో యథా. 33

కస్తూరిమృగము వాసనవలన నాకర్షింపఁబడి, పరుగిడి పరుగిడి, మందను తప్పి పోవునట్లు కామపరవశమైన మనస్సు, లక్ష్యమునఁ దప్పి మోహమునఁగూలును.

శోచ్యతాం పరమాం యాతి తరుణస్తరుణీపరః
నిబద్ధః కరిణీలోలో వింధ్యఖాతే యథాగజః. 34

ఆడు ఏనుగును కలయనిచ్ఛించు కరి, వింధ్యపర్వత ప్రాంతమున ద్రవ్వబడిన అఖాతమున గూలునట్లు, తరుణీగత చిత్తుఁడగు మనుష్యుఁడు దుఃఖమునం గూలును.

యస్యస్త్రీ తస్యభోగేచ్ఛా నిఃస్త్రీకస్య క్వభోగభూః
స్త్రియం త్యక్త్వా జగత్త్యక్తం జగత్త్యక్త్వా సుఖీ భవేత్. 35

వనితయున్న వానికే భోగేచ్ఛ; వనితలేనిచో భోగమున కాస్కారమెచ్చటిది? అందువలన, కామినీత్యాగ మవశ్య మొనరింపనగును. రమణిని త్యజించుట యనిన జగత్తును త్యజించుటే, జగత్తును ద్యజించిన సుఖియగును.

ఆపాతమాత్రరమణేషు సుదుస్తరేషు
భోగేషు నాహమలిపక్షతి చంచలేషు
బ్రహ్మన్ రమే మరణరోగ జరాదిభీత్యా
శామ్యామ్యహం పరముపైమి పదం ప్రయత్నాత్. 36

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే వైరాగ్యప్రకరణే
స్త్రీజుగుప్సా నామ ఏకవింశతితమః సర్గః ॥ 21 ॥

బ్రహ్మజ్ఞుడా! ఆపాత రమణీయములును, భ్రమరపక్షములవలె చంచలములును, దురతిక్రమములునునగు భోగముల, జరామరణ భీతి జేసి, ఆసక్తుడనవను 'ఉపరతి' నవలంబించి పరమ పదము నందెదను.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు వైరాగ్యప్రకరణమున
స్త్రీజుగుప్సయను ఏకవింశతితమ సర్గము ॥ 21 ॥



## ద్వావింశః సర్గః.

---

శ్రీరామ ఉవాచ:—

అపర్యాప్తం హి బాలత్వం బలాత్ పిబతి యౌవనం
యౌవనంచ జరా పశ్చాత్ పశ్య కర్కశతాం మిథః. 1

శ్రీరాముడు:— యౌవనము కోర్కెలు నిండని బాల్యమును కబళించివైచును; పిదప, వార్ధక్యము యౌవనమును మ్రింగివైచును, చూడుడు, వీటి మోటుదనము.

హిమాశనిరివాంభోజం వాత్యేవ శరదంబుకమ్
దేహం జరా నాశయతి నదీతీరతరుం యథా. 2

మంచను వజ్రము పద్మములను, పెనుగాలి శరత్కాలమేఘములను, నది గట్టున నున్న చెట్టును నాశన మొనర్చునట్లు, దేహమును ముదిమి పాడొనర్చుచున్నది.



జర్జరీకృతసర్వాంగీ జరాజగరరూపిణీ
విరూపతాం నయత్యాశు దేహం విషలవో యథా. 3

విషపు బొట్టువలె, ముసలితనము అవయవములు బడగొట్టు చున్నది; శరీరమును పెనుభూత మట్లొనర్చుచు, తన ఆకృతినిఁదోపింపఁ జేయుచున్నది.

శిథిలా దీర్ఘ సర్వాంగం జరాజీర్ణకలేబరమ్
సమం పశ్యంతి కామిన్యః పురుషం కరభం యథా. 4

జరాజీర్ణ శిథిలాంగుఁడగు పురుషుని స్త్రీలు గార్దభ (తాక ఉష్ట్రము) మట్లు అసహ్య దృష్టితోఁబరికింతురు.

అనాయాస కదర్థిన్యా గృహీతే జరసా జనే
పలాయ్య గచ్ఛతి ప్రజ్ఞా సపత్న్యేవాహతాంగనా. 5

అవలీలగ దైన్యమునొసఁగగల జర, మనుజుని ఆక్రమించినంతటనే, బుద్ధి సవతివలనం దరుమఁబడిన యువతివలె వెడలిపోవును.

దాసాః పుత్రాః స్త్రియశ్చైవ బాంధవాః సుహృదస్తథా.
హసంత్యున్మత్తకమివ నరం వార్ధకకంపినమ్. 6

ముదుసలిని గాంచి, సేవకులు, పుత్రులు, భార్య, బంధువులు, స్నేహితులు, హీనుడగు పిచ్చివానిని జూచి నవ్వునట్లు, నవ్వుదురు.

దుష్ప్రేక్ష్యం జరఠం దీనం హీనం గుణపరాక్రమైః
గృధ్రో వృక్షమివాదీర్ఘం గర్ధోహ్యాభ్యేతి వృద్ధకమ్. 7

ముసలిమానును, గ్రద్ద ఆక్రమించుకొనునట్లు, లోభమువచ్చి చూడ నసహ్యముగొల్పు వృద్ధుని ఆక్రమించుకొనును; అప్పుడాతడు, గుణహీనుడు, శక్తిహీనుడు అయి దిగులుపడుచుండును.

దైన్యదోషమయీ దీర్ఘాహృది దాహప్రదాయినీ
సర్వాపదామేకసఖీ వార్ధకే వర్ధతే స్పృహా. 8

ఆపదలకు తోడగు కామము వార్ధక్యమున వర్ధిల్లుచుండును; ఈ కామము హృదయతాపము నిచ్చును; దీనత్వమును గలిగించును.

కర్తవ్యం కింమయా కష్టం పరత్రేత్యతిదారుణమ్
అప్రతీకారయోగ్యం హి వర్ధతే వార్ధకే భయమ్. 9

నేనేమియొనర్తును, పరలోకమున దారుణమగు పీడ ననుభవింపవలసి వచ్చునే! అను భయము ముసలితనమున పెరుగును.

కోఽహం వరాకః కిమివ కరోమి కథమేవచ
తిష్ఠామి మౌనమేవేతి దీనతోదేతి వార్ధకే. 10

తుచ్ఛుడను, నేనేమియొనర్పగలను, ఎట్లొనర్తును, నామాటవినువారెవ్వరు, మెదలక కూర్చొందును, అని వృద్ధుఁడు తలపోయుచుండును.

కథం కదా మే కిమివ స్వాదుస్వాద్వోభజనం జనాత్
ఇత్యజస్రం జరాచైషా చేతో దహతి వార్ధకే. 11

'ఎప్పుడు, ఎట్లు, ఎట్టిరుచికరపదార్థములు తినుటకు లభించును ?'-ఇట్టి చింత వార్ధక్యమున మనుష్యుని చిత్తమును దహించుచుండును.

గర్ధోఽభ్యుదేతి సోల్లాస ముపభోక్తుం న శక్యతే
హృదయం దహ్యతే నూనం శక్తిదౌస్థ్యేన వార్ధకే. 12

కోరిక కలుగునుగాని ఉల్లాసముతో భోగించుశక్తియుండదు—ఇట్టిశక్తిహీన వృద్ధావస్థయందు హృదయము నిశ్చయముగ దహించుకొని పోవును.

జరాజీర్ణబకీ యావత్ కాయక్లేశాపకారిణీ
రౌతి రోగోరగాకీర్ణా కాయద్రుమశిరః స్థితా. 13
తావదాగత ఏవాశు కుతోఽపి పరిదృశ్యతే
ఘనాంధ్యతిమిరాకాంక్షీ మునే మరణకౌశికః. 14

మునీ ! శరీరమను చెట్టుమీదనున్న పీడాకరమగు జరయను ముసలికొంగ; వ్యాధియను పాములవలన నాక్రమింపఁబడి మొరపెట్టుచున్నప్పు డెటనుండియో, మూర్ఛయను చీకటింగోరు మృత్యువను గుడ్లగూబ వచ్చిపడును.

సాయం సంధ్యాం ప్రజాతాం వై తమః సమనుధావతి
జరాంవపుషి దృష్ట్వైవ మృతిః సమనుధావతి. 15

సాయంసంధ్యనుఁ గాంచినతోడనే, చీకటి దానివెంటనట్లు, జరనుగాంచినతోడనే మృత్యువు దానివెంటబడును.

జరాకుసుమితం దేహద్రుమం దృష్ట్వైవ దూరతః
అధ్యాపతతి వేగేన మునే మరణమర్కటః. 16

మునీంద్రా ! మృత్యువనుకోతి, శరీరవృక్షమున జరయను పువ్వుపూచుటఁ జూచినతోడనే దానిపైబడును.

శూన్యం నగరమాభాతి భాతి చ్ఛిన్నలతో ద్రుమః
భాత్యనావృష్టిమాన్ దేశో న జరాజర్జరం వపుః 17

జనులులేనిపురి, లతలేని తరువు, అనావృష్టియున్న దేశము, శోభిల్లునుఁగాని జరాజీర్ణమగు శరీరము సొంపును బొందజాలదు.

క్షణాన్నిగరణాయైవ కాసక్వణితకారిణీ
గృధ్రీవామిషమాదత్తే తరసైవ నరం జరా. 18

కూయుచున్న గ్రద్దపెంగుటతే మాంసమును గ్రహించునట్లు, కాసడగ్గయే ధ్వనిగాగల జర మూడ కబళించుటకే మనుష్యునిఁ గైకొనును.



దృష్ట్వైవ సోత్సుకేవాశు ప్రగృహ్య శిరసి క్షణమ్
ప్రలునాతి జరా దేహం కుమారీ కైరవం యథా. 19

బాలిక కౌతుకముతో కలువపూవునుఁ గైకొని తలలోముడిచి, మరల వెంటనే సడలించి, త్రుంపిపారవేయునట్లు, జరయు, మనుష్యుని గ్రహించి నాశనమొనర్చుచున్నది.

సీత్కారకారిణీ పాంసు పరుషా పరిజర్జరం
శరీరం శాతయత్యేషా వాత్యేవ తరుపల్లవమ్. 20

చలిగాలి పెద్దగవీచిన శరీరము పులకించునట్లున్ను, ముసలిప్రానులు ధూళిసిక్తములై పడునట్లును, రూక్షమగు జరయరుదెంచిన శరీరము వడకును; శిథిలమై పడిపోవును.

జరసోపహతో దేహో ధత్తే జర్జరతాం గతః
తుషారనికరాకీర్ణ పరిమ్లానాంబుజశ్రియమ్. 21

జరాశీర్ణమగు శరీరము, మంచున, దడసి వాడిపోయిన తామరపూవువలె నగును.

జరాజ్యోత్స్నోదితైవేయం శిరఃశిఖరిపృష్ఠతః
వికాసయతి సంరబ్ధం వాతకాసకుముద్వతీ. 22

శిరమను శిఖరమున ముసిమియను వెన్నెల ఉదయించి, వాతకాసాదిరోగములను కలువల వికసింపఁజేయును.

పరిపక్వం సమాలోక్య జరాక్షార విధూసరం
శిరః కూష్మాండకం భుంక్తే పుంసాం కాలః కిలేశ్వరః. 23

తలయను గుమ్మడికాయను, జరయను బూడిద అలముకొన, కాలుడను ఒకానొకప్రభువు దానిని పరిపక్వమైన దానినిగ తెలిసికొని, భక్షించును.

జరాజహ్నుసుతోద్యుక్తా మూలాన్యస్య నికృంతతి
శరీరతీరవృక్షస్య చలత్యాయుషి సత్వరమ్. 24

జరయను గంగానది, వేగముగపరువిడు ఆయువను ప్రవాహమున, శరీరమను తీరవృక్షపు మొదలును, యత్నముతో పెకలించి పారవేయును.

జరామార్జారికా భుంక్తే యౌవనాఖుం తథోద్ధతా
పరముల్లాసమాయాతి శరీరామిషగర్ధినీ. 25

జరయను మార్జాలము, యౌవనమను మూషికమును భక్షించి, శరీరమను మాంసమును తినునిచ్ఛతో, ఉల్లాసమున వేచియుండును.

కాచిదస్తి జగత్యస్మిన్నామంగలకరీ తథా
యథా జరాక్రోశకరీ దేహజంగలజంబుకీ. 26

వికటశబ్దము నొనర్చు ముదిమియను నక్క, శరీరమను అరణ్యముననున్నది; దీని యీళను బోలు అపశకునము మరొకటి ఈ జగత్తునలేదు.

కాసశ్వాసససీత్కారా దుఃఖధూమతమోమయీ
జరాజ్వాలా జ్వలత్యేషా యస్యాసౌ దగ్ధ ఏవహి. 27

జరయను అగ్నిజ్వాల ఎవ్వనియందు ప్రజ్వలించుచుండునో, ఆతఁడు నిశ్చయముగ దగ్ధుడగును; కాసశ్వాసలు ఈ జ్వాలయొక్క చిటపట ధ్వనులు, దుఃఖమే దీనిధూమము.

జరసా వక్రతామేతి శుక్లావయవపల్లవా
తాత తన్వీ తనుర్నౄణాం లతా పుష్పానతా యథా. 28

మానవుల దేహము వృద్ధావస్థయందు, ధవళపుష్పముల భారముతో అవనతమైన లతవోలె, వంగిపోవును. (ముసలితనమున అంగములు పాలిపోయి, నడుము వంగిపోవుట ఇట సూచింపబడినది).

జరాకర్పూరధవలం దేహకర్పూరపాదపమ్
మునే మరణ మాతంగో నూనముద్ధరతి క్షణాత్. 29

ముదిమియను కర్పూరముతో వెల్లనైన శరీరమను కర్పూరవృక్షమును, మృత్యువను ఏనుఁగ, క్షణములో పెల్లగించివేయును.

మరణస్య మునే రాజ్ఞో జరాధవలచామరా
ఆగచ్ఛతోఽగ్రే నిర్యాతి స్వాధివ్యాధిపతాకినీ. 30

మునివర్యా! మృత్యువను రాజరుదెంచునప్పుడు ఆధివ్యాధులను సేన ముందుగవచ్చును; జర ఆరాజుయొక్క ధవళచామరము.

న జితాః శత్రుభిః సంఖ్యే ప్రవిష్టా యేఽద్రికోటరే
తే జరాజీర్ణరాక్షస్యా పశ్యాశు విజితా మునే. 31

మునీంద్రా! పర్వతగుహయందు ప్రవేశించిన వానిని శత్రువులు జయింపఁజాలరు. కాని చూడుడు! అట్టివానినిఁగూడ జరయనురాక్షసి జయించుచున్నది.

జరాతుషారవలితే శరీరసదనాంతరే
శక్నువంత్యక్షశిశవః స్పందితుం న మనాగపి. 32

జరయను పొగమంచుతో నిండిన శరీరమను గృహమధ్యముననున్న, ఇంద్రియములను శిశువులోకింతయు, కదులఁజాలరు.

దండ తృతీయపాదేన ప్రస్ఖలంతీ ముహుర్ముహుః
కాసాధోవాయుమురజా జరాయోషిత్ ప్రనృత్యతి. 33

జరయను నర్తకి దండమను * మూడవచరణము నాశ్రయించి లేచిపడుచు, నృత్యమొనరించును; కాసశ్వాసాదులే ఈ నాట్యమున నుపయోగింపఁబడు మద్దెలలు.

* దండమన కఱ్ఱ; మఱియు, దండమను సంగీత విశేషము, దీని మూడవ చరణమును హెచ్చుతగ్గు స్థాయిలతో పాడవలెను. కఱ్ఱనూతగగొనిన వృద్ధుఁడుగూడ లేచిపడుచు, నడుచునుకదా.



సంసారసంసృతేరస్య గంధకుట్యాం శిరోగతా
దేహయష్ట్యాం జరా నామ్నా చామరశ్రీ విరాజతే. 34

రాజు సుగంధానులేపనమొనర్చుకొను గృహమున శ్వేతచామరములు వ్రేలుచుండునట్లు, సంసారరాజున కుపయోగియగు విషయములతో నిండిన దేహగృహ శిరోభాగమున, జరయు వ్రేలుచుండును.

జరాచంద్రోదయసితే శరీరనగరే స్థితే
క్షణాద్వికాస మాయాతి మునే మరణకైరవమ్. 35

జరయను చంద్రోదయమున వెల్లబడిన శరీరనగరమున, క్షణములో మరణమను కలువ వికసించును.

జరాసుధాలేపసితే శరీరాంతః పురాంతరే
అశక్తిరార్తిరాపచ్చ తిష్ఠంతి సుఖమంగనాః. 36

ముదిమియను సున్నముతో వెల్లచేయఁబడిన, శరీరమను అంతఃపురమున, అశక్తి, ఆర్తి, ఆపదలను అంగనలు సుఖముగ వాసమొనర్తురు.

అభావోఽగ్రేసరీ యత్ర జరా జయతి జంతుషు
కస్తత్రేహ సమాశ్వాసో మమ మందమతేర్మునే. 37

మునీంద్రా! శరీరములన్నియు, జరపాలిటఁబడునవియు, మృత్యువుచే గబళింపఁబడునవియునైయున్నవి. శరీరస్థితి ఇట్టిదగుటచే, మందమతినగు నాకు దీనియందు విశ్వాసము గలుగకున్నది.

కింతేన దుర్జీవిత దుర్గ్రహేణ
జరాగతేనాపి హి జీవ్యతే యత్
జరాజగత్యామజితా జనానాం
సర్వైషణాస్తాత తిరస్కరోతి. 38

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే వైరాగ్య ప్రకరణే
జరాజుగుప్సానామ ద్వావింశతితమః సర్గః ॥ 22 ॥

మునీశ్వరా! ముదిమివచ్చినను, బ్రతుకవలెనను పేరాసఏల? జగత్తున జరను జయింపజాలినవారెరునులేరు; ఈ జర కోర్కెలనన్నిటిని అపూర్ణముగనే యుంచును.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు వైరాగ్య
ప్రకరణమున జరాజుగుప్సయను
ద్వావింశతితమః సర్గము ॥ 22 ॥

## త్రయోవింశః సర్గః.

**శ్రీరామ ఉవాచః—**

వికల్పకల్పనానల్ప జల్పితైరల్ప బుద్ధిభిః
భేదై రుద్ధురతాం నీతః సంసారకుహరే భ్రమః 1

శ్రీరాముఁడు:– ఇది నాభోగవస్తువు, దీని నీ ఉపాయమవలంబించి పొందెదను; అనిచెప్పుచు దేహాత్మబుద్ధులగు మూఢులు, శత్రుమిత్రులు, ఇష్టానిష్టములు, అగు వస్తువులవలన గలిగిన రాగద్వేషములతో, నచ్ఛేద్యమగు ఈ సంసారకుహరమునం బడుచున్నారు.

సతాం కథమివాస్థేహ జాయతే జాలపంజరే
బాలా ఏవాత్తుమిచ్ఛంతి ఫలం ముకురబింబితమ్. 2

ఈ విషయములయెడ సజ్జనుల కెట్లభినివేశము గల్గును? — బాలురే అద్దమున ప్రతిబింబితమగు ఫలమునుఁ దినఁగోరుదురు.

ఇహాపి విద్యతే యేషాం పేలవా సుఖభావనా
ఆఖు స్తంతుమివాశేషం కాలస్తామపి కృంతతి. 3

మూషికము సాలెగూటి నుత్తరించునట్లు, ఇట్టి జగత్తున సుఖభావన గొనియుండువారిని, కాలము ఉత్తరించును.

న తద స్తీహ యదయం కాలః సకలఘస్మరః
గ్రసతే తజ్జగజ్జాతం ప్రోత్థాబ్ధిమివ బాడబః. 4

గర్వితమగు సముద్రము బడబానలమునఁ బడునట్లు, సృష్టవస్తువులన్నియు కాలముచే గబళింపఁబడును. — ఈ స్థితినందని వస్తువు లీ జగత్తునలేవు.

సమ స్తసామాన్యతయా భీమః కాలో మహేశ్వరః
దృశ్యసత్తామిమాం సర్వాం కవలీకర్తుముద్యతః. 5

కాలుడు, భయంకరుఁడగు సంహారకాల రుద్రుఁడు. ఇది దృశ్యవస్తువుల అస్తిత్వమును రూపుమాప సమకట్టియున్నది.

మహతామపి నోదేవః ప్రతిపాలయతి క్షణమ్
కాలః కవలితానంతవిశ్వో విశ్వాత్మతాం గతః 6

విశ్వాత్ముఁడును, కబళితవిశ్వుఁడును, అగు కాలదేవుఁడు గొప్పవారినిఁగూడ లెక్కగొనఁడు; వారినిఁగూడ మ్రింగివేయును.

యుగవత్సరకల్పాఖ్యైః కించిత్ ప్రకటితాం గతః
రూపై రలక్ష్యరూపాత్మా సర్వమాక్రమ్య తిష్ఠతి. 7

కాలుని స్వరూపము ‘అగమ్యగోచరము’; కల్పములు, యుగములు, సంవత్సరములను ఉపాధిలో కొంచెము తనరూపునుఁ దోపింపఁజేయుచు, ఆతడు విశ్వమును వశపరుచుకొనుచున్నాడు.



యే రమ్యా యే శుభారంభాః సుమేరు గురవోపి యే
కాలేన వినిగీర్ణాస్తే గరుడేనేవ పన్నగాః. 8

సర్పములు గరుడునిచే మ్రింగబడునట్లు, రమ్యములును, శుభారంభములును, మేరు దృఢములును అగునవికూడ, కాలునిచే మ్రింగబడుచున్నవి.

నిర్దయః కఠినః క్రూరః కర్కశః కృపణోఽధమః
నతద స్తి యదద్యాపి న కాలో నిగిరత్యయం. 9

కాలుని కరాళవదనమునఁ బడనివారెరునులేరు; నిర్దయులు, కఠినులు, క్రూరులు, పరుషభాషులు, వీరు వారననేల, అందఱును కాలముచే గబళింపఁబడుచున్నారు.

కాలః కవలనై కాంత మతిర త్తి గిరన్నపి
అనంతై రపి లోకాఘైర్నాయం తృప్తో మహాశనః. 10

మ్రింగుటనిన కాలునకు కడుంగడు ఇష్టము; ఒకవస్తువును భుజించునప్పుడే, మరొకవస్తువును మ్రింగగలఁడు. అనంతములగు లోకముల గళగతమొనర్చుకొనినను, వీని పొట్టనిండదు.

హరత్యయం నాశయతి కరోత్య త్తి నిహంతిచ
కాలః సంసారనృ త్తం హి నానారూపం యథా నటః. 11

కాలుఁడు సంసారనృత్యము నొనరించు నటకుఁడు; ఇతఁడు హరించుచున్నాడు, సృష్టించుచున్నాడు, మ్రింగుచున్నాడు, సంహరించుచున్నాడు.

భిన త్తి ప్రవిభాగస్థ భూతబీజాన్యనారతమ్
జగత్యస త్తయా బంధాద్దాడిమాని యథా శుకః. 12

చిలుక దానిమ్మకాయను పగిల్చి గింజలనుఁదినునట్లు, కాలుఁడు సంహారమొనర్చి, జగత్తుననున్న నానావిధ ప్రాణిబీజముల నన్నిటిని నిర్మూలించుచున్నాడు.

శుభాశుభవిషాణాగ్ర విలూనజనపల్లవః
స్ఫూర్జతి స్ఫీతజనతా జీవరాజీవనీగజః. 13

అభిమానమున నుబ్బుజీవాత్మలను అరణ్యమున, కాలుఁడు మత్తగజమట్లు విజృంభించుచున్నాడు. శుభాశుభకర్మలే, ఈ కాలుఁడను మత్తగజముయొక్క దంతములు; జీవసమూహమే ఈ దంతముల విచ్ఛిన్నమొనర్పఁబడు చిగురుటాకులు.

విరించిమూల బ్రహ్మాండ బృహద్దేవ ఫలద్రుమమ్
బ్రహ్మకాననమాభోగి పరమావృత్య తిష్ఠతి. 14

బ్రహ్మాండ * మను ఈ మహావృక్షమునకు మూలము బ్రహ్మ; దేవతలే దీని ఫలములు, బ్రహ్మమను అరణ్యమే ఈ మాయావృక్షమునకు ఉనికి. యీ అరణ్యములు కాలుని అధికారముననున్నది.

---

* ఇట, బ్రహ్మమన సూక్ష్మభూతముల సమిష్టియగు హిరణ్యగర్భుడనియు, దేవతలన ఇంద్రియములనియు, బ్రహ్మమన పరబ్రహ్మమనియు గ్రహింపునది—అను.

యామినీ భ్రమరాపూర్ణా రచయన్ దినమంజరీః
వర్షకల్ప కలావల్లీర్నకదాచన ఖిద్యతే. 15

ఈ కాలుఁడు, అనవరతము రాత్రియను తుమ్మెదలతో నిండిన, పగళ్ళను పూలగుత్తులతో గూడిన, కల్పములు, వర్షములను లతను, నిర్మించుచు నేయుండును; కష్టమని విరమింపఁడు.

భిద్యతే నావభగ్నోఽపి దగ్ధోఽపి హి న దహ్యతే
దృశ్యతే నాపిదృశ్యోఽపి ధూర్తచూడామణిర్మునే. 16

మునీ! గడుసరియగు కాలుఁడు, ఒకరూపమున (కార్యరూపమున) భగ్నుఁడైనను, మరొక రూపమున (కారణరూపమున) భగ్నుఁడవఁడు. ఒకచోట దహింపఁబడియు మఱొకచోట దహింపఁబడఁడు. ఒకట్లు కనంబడుచు, మరొకట్లు కనంబడకున్నాఁడు.

ఏకేనైవ నిమేషేణ కించిదుత్థాపయత్యలమ్
కించిద్వినాశయత్యుచ్చై ర్మనోరాజ్యవదాతతః. 17

మనస్సు, నిముషములో ఒకవస్తువును సృజించి భంగించునట్లు, కాలుడుగూడ ఒనర్చుచున్నాఁడు.

దుర్విలాస విలాసిన్యా చేష్టయా కష్టపుష్టయా
ద్రవ్యైక రూపకృద్రూపం జనమావర్తయన్ స్థితః. 18

కాలుఁడు శరీరమను అవస్తువుతో నైక్యమందినజీవుని, కష్టమను దుష్టమును నగు యత్నముతో స్వర్గనరకములకు దీసికొనిపోవుచు, మరల కొనివచ్చుచున్నాఁడు.

తృణం పాంసుం మహేంద్రంచ సుమేరుం పూర్ణమర్ణవమ్
ఆత్మంభరితయా సర్వమాత్మసాత్ కర్తుముద్యతః. 19

కుక్షింభరుఁడగుట వలన, కాలుఁడు గడ్డిని, బూదిని, కొండను, ఆకును, సంద్రమునుగూడ కబళింప నున్నాఁడు.

క్రౌర్యమత్రైవ పర్యాప్తం లుబ్ధతాత్రైవ సంస్థితా
సర్వదౌర్భాగ్యమత్రైవ చాపలం వాపి దుఃసహమ్. 20

క్రౌర్యము; లోభము, దౌర్భాగ్యము, చాంచల్యము, ఈ కాలునియందే నిండుకొనియున్నవి.

ప్రేరయన్ లీలయార్కేందూ క్రీడతీవ నభస్థలే
నిక్షిప్తలీలాయుగలో నిజే బాల ఇవాంగణే. 21

బాలుడు, బంతిని తీయుచు వేయుచు, గృహాంగణమున నాడుకొనునట్లు, కాలుఁడు సూర్యచంద్రులతో ఆకాశమున నాడుకొనుచున్నాఁడు.

సర్వభూతాస్థిమాలాభి రాపాదవలితాకృతిః
విలసత్యేవ కల్పాంతే కాలః కలిత కల్పనః. 22

కాలుఁడు, ప్రళయసమయమున జీవుల నందరిని నాశనమొనర్చి, వారి పంచభూతమయాస్థులను ఆపాదమస్తకము ధరించి, క్రీడించును.



అస్యోడ్డామరవృత్తస్య కల్పాంతేఽంగవినిర్గతైః
ప్రస్ఫురత్యంబరే మేరు ర్భూర్జత్వగివ వాయుభిః. 23

కాలుని పనులనేరును అడ్డగింపజాలరు. వీని శరీరమునుండి వెలువడిన మహావాయువు మేరుపర్వతమును భూర్జరపత్రమువలె, పొడిచేసి వైచును.

రుద్రో భూత్వా భవత్యేష మహేంద్రోఽథ పితామహః
శక్రో వైశ్రవణశ్చాపి పునరేవ నకించన. 24

ఈ కాలుఁడే, ఒకప్పుడు రుద్రుఁడగును; మరొకప్పుడింద్రుడగును; ఇంకొకప్పుడు పితామహుఁడగును; అన్యసమయమున రూపమే యుండదు.

ధత్తేఽజస్రోద్ధితోద్ధ్వస్తాన్ సర్గానమితభాస్వరాన్
అన్యాన్ దధద్దివానక్తం వీచీరబ్ధిరివాత్మని. 25

ఒకేసమయమున పెక్కు అలలను గలిగించి, విరుచుచుండు సముద్రునివలె, కాలుఁడు సృష్టిసంహారముల నొనర్చుచుండును.

మహాకల్పాభిధానేభ్యో వృక్షేభ్యః పరిశాతయన్
దేవాసురగణాన్ పక్వాన్ ఫలభారానివ స్థితః. 26

కాలుఁడు మహాకల్పములను వృక్షములనుండి, దేవాసురులను పక్వఫలములం బడవేయుచున్నాఁడు.

కాలోఽయం భూతమశక ఘుంఘుమానాం ప్రపాతినామ్
బ్రహ్మాండోదుంబరౌఘానాం బృహత్పాదపతాం గతః. 27

కాలమను ఉదుంబరవృక్షమునుండి, లెక్కకుమిరిన బ్రహ్మాండములను కాయలు జారిపడుచున్నవి; వీటిమీద నివసించు మశకములే జీవులు.

సత్తామాత్రకుముద్వత్యా చిజ్జ్యోత్స్నా పరిపుల్లయా
వపుర్వినోదయత్యేకం క్రియాప్రియతమాన్వితః. 28

చిత్ జ్యోత్స్న వలన వికసించిన సత్తయను కలువ సాయమున అద్వితీయుడగు కాలుడు వినోదించుచున్నాఁడు; ప్రాణుల శుభాశుభక్రియలే ఇతని పత్ని.

అనంతాపార పర్యంత బద్ధపీఠం నిజం వపుః
మహాశైలవదుత్తుంగ మవలంబ్య వ్యవస్థితః. 29

తుదిమొదళ్లులేని పెద్దకొండవలె కాలుఁడు వెలయుచున్నాఁడు.

క్వచిచ్ఛ్యామతమః శ్యామం క్వచిత్ కాంతియుతం తతమ్
ద్వయేనాపి క్వచిద్రిక్తం స్వభావం భావయన్ స్థితః. 30

కాలుఁడొకచోట, కారునలుపుగలిగిన వస్తువులను, ఒకచోట కాంతిమంతములగు వస్తువులను, మఱొకచోట వర్ణశూన్యములగు పదార్థములను సృజించుచున్నాఁడు.

సంలీనాసంఖ్యసంసార సారయా స్వాత్మసత్తయా
ఊర్వ్యేవ భారఘనయా నిబద్ధపదతాం గతః. 31

కాలుఁడు, లోపించిన జీవుల సారమట్లు పృథివివలె భారమగు స్వకీయ సత్తతో నిలిచి యున్నాడు.

నఖిద్యతే నాద్రియతే నాయాతి నచ గచ్ఛతి
నాస్తమేతి నచోదేతి మహాకల్పశతైరపి. 32

మహాకల్పములు పెక్కులు గడచినను కాలుఁడు ఖేదింపఁడు, ఆదరింపఁడు. వీని స్థితిగతులకు ఉదయాస్తమయములు లేవు.

కేవలం జగదారంభలీలయా ఘనహేలయా
పాలయత్యాత్మనాత్మాన మనహంకారమాతతమ్. 33

కాలుఁడు అనాయాసముగ లభించిన జగత్సృష్టియను క్రీడయందు, నిరహంకారుఁడై తనను దన్నే పాలించుకొనుచున్నాడు.

యామినీపంకకలితాం దినకోకనదావలీమ్
మేఘభ్రమరికామాత్మసరస్యారోపయన్ స్థితః. 34

కాలుఁడు, సరోవరమునంబోలు తన స్వరూపమున, రాత్రియను పంకమును నించుకొని, మేఘములను భ్రమరములు చుంబించు పగళ్లను ఎఱ్ఱతామరపూవులను ధరించి యున్నాడు.

గృహీత్వా కృపణః కృష్ణాం రజనీం జీర్ణమార్జనీం
ఆలోకకనకక్షోదా నాహరత్యభితో గిరిమ్. 35

కాలుఁడను పిసినిగొట్టు రాత్రియను నల్లమ్మార్జని (చీపురుకట్ట)తో మేరుపర్వతముననున్న సూర్యకిరణములను బంగారమును ప్రోగుచేయుచున్నాడు.

సంచారయన్ క్రియాంగుల్యా కోణకేష్వర్కదీపికాం
జగత్సద్మని కార్పణ్యాత్ క్వాకిమస్తీతి వీక్షతే. 36

పిసినిగొట్టు వ్రేలితో దీపపువత్తినెగద్రోసి, ఇంటనే మూల ఏమున్నదాయని చూచునట్లు కాలుఁడు సూర్యకిరణములతో జగత్తున ఏ కోణమున నేమున్నదోయని చూచుచుండును.

ప్రేష్యోహార్నిమేషేణ సూర్యాత్మా పాకవన్త్యలం
లోకపాలఫలాన్యత్తి జగజ్జీర్ణవనాదయమ్. 37

కాలుని, నేత్రమే సూర్యుఁడు; పగలే కన్నులు తెఱచుట. ఇట్లు కన్నుందెఱచి జగత్తను జీర్ణారణ్యముననున్న లోకపాలకులను ఫలములు, కాలుఁడు భక్షించుచున్నాడు.

జగజ్జీర్ణకుటీకీర్ణా నర్పృత్యుగ్రకోటరే
క్రమేణ గుణవల్లోకమణీన్ మృత్యుసముద్గకే. 38



గుణైరాపూర్యతే మైవ లోకరత్నావలీ భృశం
భూషార్థమివ తామంగే కృత్వా భూయో నికృంతతి. 39

కాలుఁడు ప్రపంచమును జీర్ణకుటీరమునంబడియున్న, మణులను, గుణవంతులను, యత్నముతో మృత్యువను పెట్టెయందుంచును; రత్నమాలలవలె వారిని ధరించి; మరల, త్రెంపి పోగులు పెట్టుచుండును.

దినహంసానుసృతయా నిశేందీవరమాలయా
తారకేసరయాజస్రం చపలో వలయత్యలమ్. 40

చపలుఁడగు కాలుఁడు, పగళ్లను హంసలచే ననుసరింపఁబడినదియు, తారకలను కేసరములు గలదియునగు, రాత్రియను నల్లకలువల దండను, ధరించియున్నాడు.

శైలార్ణవధరాశృంగం జగదూర్ణాయుసానికః
ప్రత్యహం పిబతే ప్రేత్య తారారక్తకణానపి. 41

పర్వతములు, సముద్రము, స్వర్గము, పృథివి, అను నాలుగు కొమ్ములుగల జగత్తును మేషమును హింసించుచు, కాలుఁడు నక్షత్రములంబోలు దాని రక్తపుబొట్లనుఁజూచుచు, క్రోలుచున్నాడు.

తారుణ్యానలినీ సోమ ఆయుర్మాతంగ కేసరీ
నతదస్తి నయస్యాయం తుచ్ఛాతుచ్ఛస్య తస్కరః. 42

కాలుఁడు, యౌవనమను పద్మమునకు చంద్రుఁడు; ఆయువను ఏనుఁగకు సింగము, జగత్తున కాలుడు గ్రసింపని వస్తువేలేదు.

కల్పకేలీవిలాసేన పిష్టపాతిత జంతునా
అభావో భావభానేన రమతే స్వాత్మనాత్మని. 43

సంహారరూపుఁడగు కాలుడు, కల్పాంతకేళియందు, ప్రాణుల నన్నిటిని సంహరించి, అజ్ఞాన ప్రకాశకమును, తనయధిష్ఠానమునునగు బ్రహ్మము నవలంబించి నిలచియుండును.

కర్తాభోక్తాథ సంహర్తా స్మర్తా సర్వపదంగతః. 44

కాలుడే, విశ్వమునకంతటికి, కర్త, భోక్త, సంహర్త, స్మర్తయునై యున్నాడు.

సకలమవ్యకలాకలితాంతరం
సుభగదుర్భగరూపధరం వపుః
ప్రకటయన్ సహసైవచ గోపయన్
విలసతీహ హి కాలబలం నృషు. 45

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే వైరాగ్యప్రకరణే
కాలాపవాదోనామ త్రయోవింశతితమః సర్గః ॥ 23 ॥

కాలుడే మంచిగను చెడ్డగను ఎల్లయెడల వెలుగందుచున్నాడు; బుద్ధిబలమున కాలుని నెవ్వరు తెలిసికొనఁజాలరు. జీవులకంటే కాలుడే బలవంతుఁడు.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు వైరాగ్యప్రకరణమున
కాలాపవాదమను త్రయోవింశతితమ సర్గము ॥ 23॥

## చతుర్వింశతితమః సర్గః.

---

శ్రీ రామ ఉవాచ:—

ఆస్ఫోడ్డామరలీలస్య దూరాస్తనకలాపదః
సంసారే రాజపుత్రస్య కాలస్యాకలితౌజసః. 1

శ్రీరాముడు:—కాలునిలీల అద్భుతము; వాని పరాక్రమము అచింత్యము. పరబ్రహ్మము రాజానకు మాయయను పట్టమహిషి యందు జనించిన కాలుఁడను యువరాజు చరిత్ర వర్ణించెద వినుము.

అస్యైవాచరతో దీనై ర్ముగ్ధైర్భూతమృగవ్రజైః
ఆఖేటకం జర్జరితే జగజ్జంగలజాలకే. 2

ఈ యువరాజు జగత్తను జీర్ణారణ్యమున దీనులును, మోహితులును నగు ప్రాణులను మృగముల వేటాడుచున్నాడు.

ఏకదేశోల్లసచ్చారు వడవానలపంకజా
క్రీడాపుష్కరిణీ రమ్యా కల్పకాలమహార్ణవః. 3

ఈ ప్రపంచారణ్యమున నొకమూల, ప్రళయమను మహాసముద్రమున్నది; అది యీ రాజపుత్రుని క్రీడా సరోవరము. అందు, బడబాగ్నియను పద్మమున్నది.

కటుతిక్తామ్లభూతాద్యైః సదధిక్షీరసాగరైః
తైరేవ తైః పర్యుషితై ర్జగద్భిః కల్పవర్తనమ్. 4

దధిక్షీరసముద్రములవలన పర్యుషితమొనర్పఁబడిన (చలిదిగావింపఁబడిన) ఈ జగత్తును, ప్రాణులను పులుపు, తీపు, వగరు పదార్థముల, ఆసరవుతో కాలుడు కల్పాంతకాలమున, ప్రాతర్భోజన మొనర్చుచున్నాడు.

చండీచతురసంచారా సర్వమాతృగణాన్వితా
సంసారవన విన్యస్తా వ్యాఘ్రీభూతౌఘఘాతినీ. 5

ఈ కాలుని, ప్రణయిని (భార్య) చండి (కాళరాత్రి) సర్వభూతవినాశినియగు ఈమె, మాతృగణసహితయై, పెద్దపులివలె ఈజగద్వనమున సంచరించుచున్నది.

పృథ్వీ కరతలే పృథ్వీ పానపాత్రీ రసాన్వితా
మలోత్పల కల్హార లోలజాలక మాలితా. 6

[illegible]తో గూడినదియు, కమలాది పుష్పముల గంధముతో నిండినదియునగు ఈ పృథివి, కాలుని హ[illegible]మునసున్న పానపాత్ర.

[illegible]దాపి వికటాస్ఫోటో నృసింహో భుజపంజరే
పటావికటపీనాంసః కృతః క్రీడాశకుంతకః. 7

భయంకర[illegible] నృసింహమూర్తి క్షుద్రపక్షులంబోలు రాక్షసుల జంపు కేళినొనర్చు, కాలుని భుజపంజరమున క్రీడాశకుంత[illegible]



అలాబువీణామధురః శరద్వ్యోమలసచ్ఛవిః
దేవః కిల మహాకాలో లీలా కోకిల బాలకః. 8

వీణామధుర స్వరుఁడును, శరదాకాశ స్వచ్ఛకాంతియు, నగు భైరవుడు కూడ కాలుని క్రీడాకోకిల మైనాడు.

అజస్రస్ఫూర్జితాకారో వాంతదుఃఖశరావలిః
అభావనామ కోదండః పరిస్ఫురతి సర్వతః. 9

కాలుని ధనుస్సునుండి నిరంతరము అభావము (సంహారము) అనుధ్వని ఎల్లప్పుడును విన వచ్చుచునేయుండును. అద్దానినుండి, ఎడతెగకుండ దుఃఖములను బాణములు పడుచుండును.

అనుత్తమ స్త్వధికవిలాసపండితో
భ్రమచ్ఛలన్ పరివిలసన్ విదారయన్
జరజ్జగజ్జనిత విలోలమర్కటః
పరిస్ఫురద్వపురిహ కాల ఈహతే. 10

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే వైరాగ్య ప్రకరణే
కాలవిలాసోనామ చతుర్వింశతితమః సర్గః ॥ 24 ॥

అనుత్తముఁడును, విలాస పండితుఁడునునగు కాలుడను రాజకుమారుఁడు, జగత్తను కాననమున విహరించుచు, అమోఘములగు తనబాణములతో విషయలంపటులగు జీవులను చపల మర్కటములను వేటాడుచున్నాడు.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు వైరాగ్యప్రకరణమున
కాలవిలాసమను చతుర్వింశతితమ సర్గము ॥ 24 ॥



# పంచవింశః సర్గః.

శ్రీ రామ ఉవాచ:—

అత్రైక దుర్విలాసానాం చూడామణిరిహాపరః
కరోత్యత్తీతి లోకేఽస్మిన్ దైవం కాలశ్చ కథ్యతే. 1

శ్రీరాముఁడు:— కాలుఁడు దుర్విలాసచూడామణి. (ఈతఁడు వెనుకవర్ణింపఁడిన మహాకాలుఁడుకాదు—ఈతడు తదుపాధిభూతుఁడగు ఖండకాలుఁడు.) ఈతడు, ఈలోకముల సృజించి, సహరించుచున్నాడు. ఈతఁడు, దైవమనియు, కాలమనియు అవస్థాభేదములఁజేసి, వ్యవహరింపఁబడుచున్నాడు.

క్రియామాత్రాదృతే యస్య స్వపరిస్పంద రూపిణః
నాన్యదాలక్ష్యతే రూపం నకర్మ న సమీహితమ్. 2

ఈ కాలుని స్వరూపము క్రియ; ఇంకొక రూపములేదు. కర్మఫలోత్పాదనమే ఇతని ఏకమాత్రకర్తవ్యము.

తేనేయమఖిలా భూతసంతతిః పరిపేలవా
తాపేన హిమమాలేవ నీతా విధురతాం భృశమ్. 3

సూర్యకిరణముల మంచు మాయమగునట్లు, ఈ కాలునివలన పేలవములగు ప్రాణులన్నియు నశించుచున్నవి.

యదిదం దృశ్యతే కించిజ్జగదాభోగిమండలమ్
తత్తస్య నర్తనాగార మిహాసావతి నృత్యతి. 4

ఈ పరిదృశ్యమాన జగన్మండల మీ కాలుని నృత్యశాల; ఇందాతడు నిరంతరము నృత్యమొనరించుచున్నాడు.

తృతీయంచ కృతాంతేతి నామ బిభ్రత్ సుదారుణమ్
కాపాలిక వపుర్మత్తం దైవం జగతి నృత్యతి. 5

దైవమనునాతడు మూడవవాడు. (మొదటివాడు పూర్వసర్గోక్త మహాకాలుఁడు, రెండవవాడు క్రియాకాలుఁడు) ఈతడు భయంకరమగు కాపాలికవేషమున నృత్యము చేయుచున్నాడు.

నృత్యతో హి కృతాంతస్య నితాంతమివ రాగిణః
నిత్యం నియతికాంతాయాం మునే పరమకామితా. 6

! పరమ అనురాగివలె కన్పట్టు ఈ కృతాంతుఁడు తనభార్యయగు నియతియెడల విశేషా...డు.

శేషః శశికలాశుభ్రో గంగావాహశ్చ తౌ త్రిధా
ఉపవీతే అవీతేచ ఉభౌ సంసారవక్షసి. 7

చంద్రునివలె తెల్లనయిన శేషుఁడును, త్రిపథగామినియగు గంగయు, జగత్తను అతని వక్షస్థలమున వెలయుచున్న యజ్ఞో...



చంద్రార్క-మండలే హేమకటకౌ కరమూలయోః
లీలాసరసిజం హస్తే బ్రహ్మన్ బ్రహ్మాండకర్ణికా. 8

బ్రహ్మజ్ఞుడా! సూర్యచంద్రులాతని హస్తభూషణములు; మేరుపర్వతమాతని లీలాకమలము.

తారాబిందుచితం లోల పుష్కరావర్త పల్లవమ్
ఏకార్ణవపయోధౌతమేకమంబరమంబరమ్. 9

నక్షత్రములను చుక్కలతోను, పుష్కలావర్త మేఘములను అంచులతోను వెలయు అనంతాకాశము ఈ కాలుని వస్త్రము; అయ్యది ప్రళయకాల ఏకార్ణవమున సుతకబడుచున్నది.

ఏవంరూపస్య తస్యాగ్రే నియతిర్నిత్య కామినీ
అనస్తమిత సంరభ మారంభైః పరినృత్యతి. 10

ఇట్టి కాలునిముందు, అతని నిత్యసహచరియు, ప్రియపత్నియునగు నియతి విసుగులేకుండ ప్రాణుల భోగానుకూలకార్యముల సల్పుచు, నృత్యమొనరించుచున్నది.

తస్యా నర్తనలోలాయా జగన్మండప కోటరే
అరుద్ధస్పంద రూపాయా అగమాపాయ చంచురే. 11

ఇట్లు నృత్యమొనర్చు తనభార్యనుగాంచ, జగత్తు అను నర్తనశాలకు, కాలుఁడు నిత్యము వచ్చుచు పోవుచున్నాడు.

చారుభూషణమంగేషు దేవలోకాంతరావలీ
ఆపాతాలం నభోలంబం కబరీమండలం బృహత్. 12

దేవలోకములన్నియు, ఈ నియతియను స్త్రీయొక్క ఆభరణములు; నభోమండలమునుండి పాతాళము వఱకున్న ప్రదేశము వ్రేలెడు కేశరాశి.

నరకాలీచ మంజీరమాలా కలకలోజ్జ్వలా
ప్రోతా దుష్కృతసూత్రేణ పాతాలచరణేస్థితా. 13

పాతాళలోకము లాపె చరణములు; నరకములాపె పాదనూపురములు. ఆ నూపురములు దుష్కృత్యములను త్రాళ్ళచే కట్టబడియున్నవి; ఇవి నరకాగ్నివలనఁ బ్రకాశించుచున్నవి. రోదనములే ఈ అందియల ధ్వనులు.

కస్తూరికా తిలకకం క్రియాసఖ్యోపకల్పితం
చిత్రితం చిత్రగుప్తేన యమే వదనపట్టకే. 14

శుభక్రియలను సఖులు ఆపెకలంకరించిన చిత్రగుప్తుడను కస్తూరీతిలకము, యముఁడను ఆపె ముఖమండలమున వెలయుచున్నది.

కాలాస్యం సముపాదాయ కల్పాంతేషు కిలాకులా
నృత్యత్యేషా పునర్దేవీ స్ఫుటచ్ఛైల ఘనారవమ్. 15

ఈపె, ప్రళయకాలమున భర్తయొక్క కనుసన్నలను, సైగలనుగ్రహించి, అత్యంత చంచలభావమున నృత్యముసల్పును; అప్పుడు పర్వతములు బ్రద్దలవ వెలువడు ధ్వనులు, ఆపె పాదధ్వనులు.

పశ్చాత్ ప్రాలంబవిభ్రాంత కౌమారమృతబర్హిభిః
నేత్రత్రయ బృహద్రంధ్ర భూరిభాంకారభీషణైః. 16

లంబలోలజటాచంద్ర వికీర్ణహారమూర్ధభిః
ఉచ్చరచ్చారు మందారగౌరీకబర చామరైః. 17

ఉత్తాండవాచలాకార భైరవోదరతుంబకైః
రణత్ సహస్రరంధ్రేంద్ర దేహ భిక్షాకపాలకైః. 18

శుష్కశారీర ఖట్వాంగభారై రాపూరితాంబరమ్
భీషయత్యాత్మనాత్మానం సర్వసంహారకారిణీ. 19

ప్రళయకాలమున సర్వసంహార కారిణియగు నియతి నభోంతరమున భీషణాకారముతో నిండి తనకుదానే భయపడుచుండును. అప్పుడామె పశ్చాద్భాగమున కుమారుని మృతమయూరములు వ్రేలాడుచు నూగుచుండును. ఆమె, కంఠమున కపాలమాల శోభిల్లుచుండును, ఆ కపాలములు బొత్తులుపడిన మూడుకన్నులంగలిగి, (వాయువందు ప్రవేశింప) భయంకరమగు భాంకారశబ్దము నొనర్చుచుండును. అప్పుడు ఎఱ్ఱటి మందారములతో శోభిలు గౌరీదేవి కబరీభరమే, ఆమె చామరము. ఉద్దండ నృత్యమునల్పు, పర్వతాకారుడగు భైరవుని ఉదరమే ఆమె కమండలువు. వేయికన్నులతో వికటశబ్దమొనర్చు ఇంద్రునికంకాళమే ఆమె భిక్షాపాత్ర; వెన్నెముకయె ఆమె చేతనుండు దండము.

విశ్వరూపశిరశ్చక్ర చారుపుష్కరమాలయా
తాండవేషు వివల్గంత్యా మహాకల్పేషు రాజతే. 20

తాండవమువలన కదలు మస్తకములను పద్మములతోడను (వెనుకవర్ణించినట్లును) నియతి మహాకల్పసమయమున శోభిల్లుచుండు.

ప్రమత్తపుష్కరావర్త డమరోడ్డామరారవైః
తస్యాః కిల పలాయంతే కల్పాంతే తుంబురాదయః. 21

ప్రళయసమయ పుష్కలావర్త మేఘములను డమరువుల శబ్దములవిని, తుంబురాది గంధర్వులు తమప్రియులను వదలి పారిపోయెదరు.

నృత్యతోఽంతః కృతాంతస్య చంద్రమండల భాసినః
తారకాచంద్రికా చారువ్యోమ పిచ్ఛావచూలినః. 22

ఇట్టి నృత్యశాలయందుండి, చంద్ర మండలకుండలముతో భాసిల్లు, కృతాంతునకు, తారకలతోడను, చంద్రికలతోడను, శోభిల్లు ఆకాశమండలమే చూడామణియగు మయూరపింఛము.

ఏకస్మిఞ్ఛ్రవణే దీప్తా హిమవానస్థిముద్రికా
అపరేచ మహామేరుః కాంతాకాంచనకర్ణికా. 23

అతని, ఒక కర్ణమున, హిమాలయమను అస్థిమయకుండలమును, మఱియొక కర్ణమున, మేరుపర్వతమను సువర్ణమయకుండలమును శోభిల్లుచున్నవి.



అత్తైవకుండలే లోలే చంద్రార్కౌ గండమండలే
లోకాలోకాచలశ్రేణీ సర్వతః కటిమేఖలా. 24

సూర్యచంద్రులు కపోలమున వ్రేలు (మఱియొకమాదిరి) కుండలములు; చక్రవాళ పర్వతమాతని మొలనూలు.

ఇతశ్చేతశ్చ గచ్ఛంతీ విద్యుద్వలయకర్ణికా
అనిలాందోలితా భాతి నీరదాంశుకపట్టికా. 25

నానావర్ణముల శోభిల్లు మేఘమండల మాతని ఉత్తరీయము; ఇది వాయువశమున చలించుచు వెలయుచున్నది.

ముసలైః పట్టిశైః ప్రాసైః శూలైః తోమరముద్గరైః
తీక్ష్ణైః క్షీణజగద్వ్రాత కృతాంతైరివ సంభృతైః. 26

సంసారబంధనాదీర్ఘే పాశే కాలకరచ్యుతే
శేషభోగమహాసూత్ర ప్రోతే మాలాస్య శోభతే. 27

పూర్వపు సృష్టులు నాశనమవ వాటినుండి ఉద్భవిల్లిన మృత్యువులు, ముసరముద్గరశూలాది ఆయుధములై, జీవులను మృగములనుబట్టు పన్నిన శేషనాగ సూత్రమున బంధింపబడి, ఈ కాలుని గళమున హారమట్లు వెలయుచున్నవి.

జీవోల్లసన్మకరికా రత్నతేజోభిరుజ్జ్వలా
సప్తాబ్ధికంకణశ్రేణీ భుజయోరస్యభూషణమ్. 28

రత్నములతో ప్రకాశించుచు, జీవులను మొసళ్లతోనిండిన సప్తసాగరములను కంకణములు, ఈకాలుని భుజాభరణములు.

వ్యవహారమహావర్తా సుఖదుఃఖపరంపరా
రజఃపూర్ణతమఃశ్యామా రోమాలీ తస్య రాజతే. 29

లౌకిక వైదిక కర్మలే ఆతని శరీరమందున్న, నుళ్లు; ఈకర్మలవలనఁ గలిగిన రజస్తమోయుతములగు సుఖదుఃఖములే, రోమములు.

ఏవంప్రాయః స కల్పాంతే కృతాంతస్తాండవోద్భవాం
ఉపసంహృత్య నృత్యేహాం సృష్ట్వా సహ మహేశ్వరమ్. 30

పునర్లాస్యమయీం నృత్యలీలాం సర్గస్వరూపిణీమ్
తనోతీమాం జరాశోక దుఃఖాభిభవభూషితామ్. 31

ఇట్టి కాలుఁడు, కల్పాంతమున తాండవమును ముగించి, విశ్రాంతినందును. మరల, బ్రహ్మాదులతోఁగూడిన ఈజగత్తును సృష్టించి, జరామరణ దుఃఖములతోఁ గూడిన సృష్టియను లాస్యమయాభినయమును ఒనర్చును.

భూయఃకరోతి భువనాని వనాంతరాణి
లోకాంతరాణి జనజాలకకల్పనాంచ
ఆచారచారుకలనామచలాం చలాంచ
పంకాద్యథార్భకజనో రచనామఖిన్నః. 32

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే వైరాగ్య
ప్రకరణే కృతాంతవిలసితం నామ
పంచవింశతితమః సర్గః ॥ 25 ॥

బాలుడు, 'విసుగువిరామములేకుండ' మట్టితో బొమ్మల నొనరించునట్లు, కాలుఁడుగూడ, భువనములను, వనములను, వివిధములును, అసంఖ్యాకములును నగు, జీవులను, వారివారి శ్రౌతస్మార్తాది సత్కర్మలను, కృత, త్రేత, కలి, ద్వాపరయుగ ధర్మములను శ్రమయనక సృష్టించు చుండును.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు వైరాగ్య
ప్రకరణమున కృతాంతవిలాసమను
పంచవింశతితమ సర్గము ॥ 25 ॥

---

## షడ్వింశః సర్గః.

శ్రీరామ ఉవాచః—

వృత్తే స్మిన్నేవమేతేషాం కాలాదీనాం మహామునే
సంసారనామ్ని కైవాస్థా మాదృశానాం వదత్విహ. 1

శ్రీరాముఁడు:— మహామునీ! ఈ కాలాదులకు లీలారంగమగు సంసారమున మాబోంట్ల కాశ్వాసమేమున్నది? వచింపుడు!

విక్రీతా ఇవ తిష్ఠామ ఏతైర్దైవాదిభిర్వయమ్
మునే ప్రపంచరచనై ర్ముగ్ధా వనమృగా ఇవ. 2

మునీ! ప్రపంచరచనానిపుణులగు ఈ దైవాదులను గాంచి, మోహితులమై, వారి కమ్ముడు పోయి, వనమృగములవలె నున్నారము.

ఏషోఽనార్యసమాచారః కాలః కబలనోన్ముఖః
జగత్యవిరతం లోకం పాతయత్యాపదార్ణవే. 3

అనార్యచరితుడును, సంహారకార్యోన్ముఖుఁడును నగు కాలుఁడు లోకుల నిరంతరము ఆపదలపాలు గావించుచున్నాడు.



దహత్యంతర్దురాశాభిర్దేవో దారుణ చేష్టయా
లోకముష్ణ ప్రకాశాభి ర్జ్వాలాభిర్దహనో యథా. 4

అగ్ని, దారుణమై వేడిని గ్రక్కు జ్వాలలతో లోకముల దగ్ధమొనర్చునట్లు, కాలుఁడు మహాయత్నమున దురాశ రగుల్కొనజేసి లోకముల భస్మీపటల మొనర్చుచున్నాడు.

ధృతిం విధురయత్యేషా మర్యాదారూపవల్లభా
స్త్రీత్వాత్ స్వభావచపలా నియతిర్నియతోన్ముఖీ. 5

నియతి, ఈ కాలకృతాంతుని భార్య; ఈపె స్త్రీసహజమగు చాపల్యముతో, సమాధి పరాయణుఁడగు మునినిఁగూడ ధైర్యచ్యుతు నొనర్చుచున్నది.

గ్రసతేఽ విరతం భూతజాలం సర్ప ఇవానిలమ్
కృతాంతః కర్కశాచారో జరాం నీత్వాఽజరం వపుః. 6

పాము గాలిని మ్రింగునట్లు, క్రూరుఁడగు ఈ కృతాంతుఁడు, ప్రాణులను జరాపలితుల నొనర్చి మ్రింగుచున్నాడు.

యమో నిర్ఘృణరాజేంద్రో నార్తం నామానుకంపతే
సర్వభూతదయోదారో జనో దుర్లభతాం గతః. 7

ఆర్తులనుఁగూడ నృశంసుఁడగు ఈ రాజేంద్రుఁడు కరుణింపడు; సర్వభూతముల దయజూపు వారు దొరకరు కదా!

సర్వాఏవ మునే ఫల్గువిభవా భూతజాతయః
దుఃఖాయైవ దురన్తాయ దారుణా భోగభూమయః. 8

మునీంద్రా! యాదులు భోగముల కాకరములని తలంచునవన్నియు దుఃఖహేతువులు; ఆబ్రహ్మస్తంబ పర్యంతము ఉన్న లోకములన్నియు, దుఃఖభూములే. ఐశ్వర్యము లనుకొనంబడు నవన్నియు తుచ్ఛములు.

ఆయురత్యంతచపలం మృత్యు రేకాంతనిష్ఠురః
తారుణ్యం చాతితరలం బాల్యం జడతయా హృతమ్. 9

ఆయు వత్యంత చంచలము. మృత్యువు నిష్ఠురము. యౌవన మశాశ్వతము. బాల్య మజ్ఞానావృతము.

కలాకలంకితో లోకో బంధవో భవబంధనమ్
భోగా భవమహారోగా స్తృష్ణాశ్చ మృగతృష్ణికాః. 10

లోకములన్నియు విషయానుసంధానమున గళంకితములైనవి. బంధు మిత్రులు భవ బంధన రజ్జువులు; భోగములు సంసారరోగములు, సుఖములు మరు మరీచికలు.

శత్రవశ్చేంద్రియాణ్యేవ సత్యం యాతమసత్యతామ్
ప్రహరత్యాత్మనైవాత్మా మనసైవ మనోరిపుః. 11

ఇంద్రియములే పరమశత్రువులు. (వీటివలననే) సత్యమసత్య మట్లగపడుచున్నది. మనస్సు ఆత్మయొక్క పరమవిరోధి. దీని సాంగత్యమున ఆత్మ తనకుతానే కష్టమును గల్పించుకొనుచున్నది.

అహంకారః కలంకాయ బుద్ధయః పరిపేలవాః
క్రియా దుష్ఫలదాయిన్యో లీలాః స్త్రీనిష్ఠతాంగతాః. 12

అహంకార మాత్మకు గళంకము. మనోవృత్తులు శక్తిహీనములు. ప్రవృత్తులు కష్టదాయకములు. విలాసములు స్త్రీనిష్ఠతో ముగియుచున్నవి.

వాంఛావిషయశాలిన్యః సచ్చమత్కృతయః క్షతాః
నార్యో దోషపతాకిన్యో రసా నీరసతాంగతాః. 13

కోర్కెలు విషయములవైపు పరుగులిడుచున్నవి. ఆత్మస్ఫురణము దుర్లభమైపోయినది. ఆత్మానురాగము నీరసించినది.

వస్త్వావస్తుతయా జ్ఞాతం దత్తం చిత్తమహంకృతౌ
అభావవేధితా భావా భావాంతో నాధిగమ్యతే. 14

వస్తు వవస్తు వట్లగపడుచున్నది. చిత్తమహంకారమున శంకితమైనది. విషయము లన్నియు క్షణభంగురములు; ఆత్మ అలభ్యమైపోయినది.

తప్యతే కేవలం సాధో మతిరాకులితాంతరా
రాగరోగో విలసతి విరాగో నోపగచ్ఛతి. 15

సాధుపుంగవా ! అందఱును నిరంతరము దహింపఁబడుచున్నారు; అందరిబుద్ధి వ్యాకులితమైనది. అందరికిని రాగరోగము ప్రబలముగ నున్నది; అందువలన వైరాగ్యము దుర్లభమైనది.

రజోగుణహతా దృష్టిస్తమః సంపరివర్ధతే
న చాధిగమ్యతే సత్త్వం తత్త్వ మత్యంత దూరతః. 16

దృష్టి రజోగుణమున కప్పువడినది; తమోగుణ మెక్కుడగు చున్నది. సత్త్వగుణము దూరమైపోయినది. కాన, తత్త్వజ్ఞానము దుర్లభము.

స్థితిరస్థిరతాం యాతా మృతిరాగమనోన్ముఖీ
ధృతిర్వైధుర్యమాయాతా రతిర్నిత్యమవస్తుని. 17

జీవిత మస్థిరము, మృత్యువు దాపురించుచున్నది. రతి తుచ్ఛవస్తువుల యందు—ధైర్యము చెడినది.

మతిర్మాంద్యేన మలినా పాతైక పరమం వపుః
జ్వలతీవ జరా దేహే ప్రతిస్ఫురతి దుష్కృతమ్. 18

మతి మాంద్యమున మలినమైనది, శరీరము నశింపనున్నది, జర శరీరమున మండుచున్నట్లున్నది. పాపము లభివృద్ధి నందుచున్నవి.



యత్నేన యాతి యువతా దూరే సజ్జన సంగతిః
గతిర్నవిద్యతే కాచిత్ క్వచిన్నోదేతి సత్యతా. 19

యౌవనము ప్రయత్నించినను ఉండుటలేదు; సత్సంగము దూరమైనది; సత్యోదయ మగుటలేదు; ఇంక గతిలేదు.

మనోవిముహ్యతీవాంతర్ముదితా దూరతాం గతా
నోజ్జ్వలా కరుణోదేతి దూరాదాయాతి నీచతా. 20

అంతఃకరణము మోహాచ్ఛన్నమైనది; ఆనందము దూరమైపోయినది. కరుణ ఉదయించుటలేదు; నీచత్వమె దరి జేరుచున్నది.

ధీరతాఽధీరతామేతి పాతోత్పాతపరో జనః
సులభో దుర్జనాశ్లేషో దుర్లభః సత్సమాగమః. 21

ధైర్య మధైర్యమందినది. జనన మరణములంబడు దుర్జనుల సాంగత్యమే సులభము; సజ్జనసంగతి దుర్లభము.

ఆగమాపాయినో భావా భావనా భవబంధినీ
నీయతే కేవలం క్వాపి నిత్యం భూతపరంపరా. 22

దృశ్యవస్తువే, జననమరణముల అధీనము; విషయవాసనలు బంధన కారణములు. మృత్యువు నిత్యము ఈ జీవుల నెచ్చటికో కొనిపోవుచున్నది.

దిశోఽపి హి నదృశ్యంతే దేశోప్యన్యాపదేశభాక్
శైలా అపి విశీర్యంతే కైవాస్థా మాదృశే జనే. 23

దిక్కులు పిక్కటిల్లుచున్నవి; దేశములు తారుమారగుచున్నవి; పర్వతములు దుమ్మగుచున్నవి; మాగతి ఏమి?

అద్యతే సత్తయాపి ద్యౌ ర్భువనంచాపి భుజ్యతే
ధరాపి యాతి వైధుర్యం కైవాస్థా మాదృశే జనే. 24

సత్స్వరూపుఁడగు ఈశ్వరుడు భువనములను, ఆకాశమును మ్రింగుచున్నాడు. మామాట ఏమి?

శుష్యంత్యపి సముద్రాశ్చ శీర్యంతే తారకా అపి
సిద్ధా అపి వినశ్యంతి కైవాస్థా మాదృశే జనే. 25

సముద్రములు శుష్కించుచున్నవి; నక్షత్రములు జారిపోవుచున్నవి; సిద్ధులుగూడ వినష్టులగుచున్నారు. అగుచో, మా యునికి స్థిరమని యెట్లు విశ్వసింపగలము?

దానవా అపి దీర్యంతే ధ్రువోఽప్యధ్రువజీవితః
అమరా అపి మార్యంతే కైవాస్థా మాదృశే జనే. 26

దానవులుగూడ విదీర్ణులగుచున్నారు. ధ్రువుని జీవితముగూడ అధ్రువమే. అమరులుగూడ మరణించుచున్నారు. ఇఁక క్షేమా స్థిరముగ నుండునది?

శక్రోప్యాక్రమ్యతే వక్త్రైర్యమోఽపి హి నియమ్యతే
వాయురప్యేత్యవాయుత్వం కైవాస్థా మాదృశే జనే. 27

సోమోఽపి వ్యోమతాంయాతి మార్తాండోఽప్యేతి ఖండితాం
మగ్నతామగ్నిరప్యేతి కైవాస్థా మాదృశే జనే. 28

పరమేష్ఠ్యపి నిష్ఠావాన్ హ్రియతే హారిరప్యజః
భవోఽప్యభావమాయాతి కైవాస్థా మాదృశే జనే. 29

కాలః సంకాల్యతే యేన నియతిశ్చాపనీయతే
ఖమప్యాలీయతేఽనన్తం కైవాస్థా మాదృశే జనే. 30

ఇంద్రుఁడుగూడ మృత్యుముఖమునం బడుచున్నాడు, యముఁడు నియమింపఁబడుచున్నాడు, వాయువు ప్రాణవిహీనుఁడగుచున్నాడు; సోముఁడు వ్యోముడగుచున్నాడు; మార్తాండుడు ఖండింపఁబడుచున్నాడు, అగ్ని చల్లారి పోవుచున్నాడు. విరించి విరుగుచున్నాడు, హరి హరింపఁబడుచున్నాడు, భర్గుఁడు (శివుఁడు) భస్మమగుచున్నాడు. కాలుఁడు కాలుని బారిఁబడుచున్నాడు, నియతి విలయమందుచున్నది. ఆకాశము వినాశమగుచున్నది ...... ఇక మాకవలంబన మేమున్నది?

అశ్రావ్యావాచ్యమద్దృశ్యతత్త్వేనాజ్ఞాతమూర్తినా
భువనాని విడంబ్యంతే కేనచిద్భ్రమదాయినా. 31

అహంకారకలామేత్య సర్వత్రాంతరవాసినా
నసోఽస్తిత్రిషు లోకేషు యస్తేనేహ న బాధ్యతే. 32

శ్రవణేంద్రియ, వాగింద్రియముల కప్రాప్యమును, చక్షురాది ఇంద్రియముల కగోచరుఁడను, అజ్ఞాతమూర్తియును నగు వస్తువేది యున్నదో, అది, తనంతటదానే, తనయందు, తనమాయవలన; విశ్వమునుఁ గనపర్చుచున్నాడు. ముల్లోకముల నిద్దాని నతిక్రమించునది లేదు. ఇదియే, అహంకార రూపమున, సర్వత్ర వెలయుచున్నది.

శిలాశైలకవప్రేషు సాశ్వభూతో దివాకరః
వనపాషాణవన్నిత్యమవశః పరిచోద్యతే. 33

కొండనుండి నీటివడికి రాళ్లుజారి పడునట్లు, ఆపరమ వస్తువువలన నియమింపఁబడియే, అశ్వయుతుఁడగు సూర్యుఁడు దుర్గమములగు శైల వప్ర ప్రదేశముల సంచరించుచున్నాడు.

ధరాగోలక మంతస్థ సురాసురగణాస్పదం
వేష్ట్యతే ధిష్ణ్యచక్రేణ పక్వాక్షోటమివత్వచా. 34

అక్షోట (అక్రోట) ఫలము తోలువలన చుట్టబడియుండునట్లు, సురాసురగణముల కాశ్రయమగు ఈ భూగోళము ఆపరతత్వ ప్రభావమున, నిలంబడిన జ్యోతిశ్చక్రమువలన నావేష్టింపఁబడియున్నది.



దివిదేవా భువినరాః పాతాలేషుచ భోగినః
కల్పితాః కల్పమాత్రేణ నీయంతే జర్జరాం దశామ్. 35

స్వర్గమున దేవతలు, భూలోకమున మనుష్యులు, పాతాళమున పాములు ఆ పరమపురుషుని తలఁపులోనే, పుట్టి గిట్టుచురు.

కామశ్చ జగదీశాన రణలబ్ధపరాక్రమః
అక్రమేణైవ విక్రాంతో లోకమాక్రమ్యవల్గతి. 36

దురాచారియగు మన్మథుఁడా ప్రభుని అనుగ్రహమున బలిమిని సంపాదించి, లోకుల నేలుచు, తన పరాక్రమమునుఁ జూపించుచున్నాడు.

వసంతో మత్తమాతంగో మదైః కుసుమవర్షణైః
ఆమోదిత కకుప్చక్రశ్చేతో నయతి చాపలమ్. 37

మదపుటేనుగు మదధారల వర్షించునట్లు, వసంతుడు పువ్వుల గురిపించి, సువాసనలతో దిఙ్మండలమును నింపి మనస్సునుఁ జలింపఁజేయుచున్నాడు.

అనురక్తాంగనాలోల లోచనాలోకితాకృతి
స్వస్థీకర్తుం మనః శక్తో నవివేకో మహానపి. 38

వివేకులుగూడ ప్రియాంగనాపాంగముల, తమచిత్తముల స్థిరమొనర్పఁజాలరు.

పరోపకారకారిణ్యా పరార్తి పరితప్తయా
బుద్ధ ఏవ సుఖీమన్యే స్వాత్మ శీతలయా ధియా. 39

పరోపకార పరాయణులును, పరులకాపదలుగల్గినఁ జింతించువారును, బుద్ధిబలమున తత్త్వజ్ఞానము బడసినవారును ధన్యు (సుఖు) లని యెంతును.

ఉత్పన్న ధ్వంసినః కాల బడబానల పాతినః
సంఖ్యాతుం కేన శక్యంతే కల్లోలా జీవితాంబుధౌ. 40

లేచి విఱుగునట్టివియు కాలమను బడబానలము పాలఁబడునవియునగు తరంగములెన్ని యీ జీవితాంబునిధి యందున్నవో, లెక్కిడ నెవరితరము?

సర్వఏవ నరా మోహాద్దురాశాపాశపాశినః
దోషగుల్మక సారంగా విశీర్ణా జన్మజంగలే. 41

మనుష్యులందరును, మోహావశమున, జీవనమను అరణ్యమున, దురాశలను దోషంపుపాదతీగల బంధింపఁబడి లేళ్లవలె అనయుచున్నారు.

సంక్షీయతే జగతి జన్మపరంపరాసు
లోకస్య తైరిహ కుకర్మభి రాయురేతత్
ఆకాశపాదపలతాకృత పాశకల్పం
యేషాం ఫలం నహి విచారవిదోఽపి విద్మః. 42

జనులు మరలమరల పుట్టుచుఁ జచ్చుచు, కుకర్మల నొనరించుచు, తమ ఆయుర్దాయమును వ్యర్థపరచుచున్నారు. వారి కామ్యఫలములు, ఆకాశవృక్షముయొక్క లతలచే నొనర్పఁబడిన ఉరిత్రాళ్ల వంటివి; అనగా అలీకదుఃఖ ప్రదములు, వివేకుల కిట్టివి కనంబడదు. (జ్ఞానులకీ అవిద్యాజనిత కామకర్మలును, తత్ఫలములును తుచ్ఛములని ఫలితార్థము.)

అద్యోత్సవోఽయమృతురేష తథేహ యాత్రా
తే బంధవః సుఖమిదం సవిశేషభోగమ్
ఇత్థం ముధైవ కలయన్ సువికల్ప జాల
మాలోలపేలవమతిర్గలతీహ లోకః. 43

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే వైరాగ్యప్రకరణే
దేవదుర్విలాసవర్ణనం నామ షడ్వింశః సర్గః ॥ 26 ॥

మనుజులు, 'నేడీయుత్సవము, నేడీఋతువు, నేడీయాత్ర, ఇతడు నామిత్రుడు, ఇది సుఖము, ఇది విశేషభోగము' అను మిథ్యాకల్పనలతోడను, చపలబుద్ధియందు విజృంభించిన సుఖకల్పనలతోడను, రాత్రిందివములు వెచ్చబుచ్చుచున్నారు.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు వైరాగ్యప్రకరణమున
దేవదుర్విలాసవర్ణనమను షడ్వింశ సర్గము ॥ 26 ॥



## సప్తవింశః సర్గః.

శ్రీ రామ ఉవాచః—

అన్యచ్చ తాతాతితరామరమ్యే
మనోరమే చేహ జగత్స్వరూపే
నకించిదాయాతి తదర్థజాతం
యేనాతి విశ్రాంతిముపైతి చేతః. 1

శ్రీ రాముఁడు:- ఇంకనువినుడు — మనోహరమై కన్పట్టు యీ కుత్సిత ప్రపంచమున, మనశ్శాంతిని గలిగించు వస్తువొక్కటియులేదు.

బాల్యే గతే కల్పితకేలిలోలే
మనోమృగే దారదరీషు జీర్ణే
శరీరకే జర్జరతాం ప్రయాతే
విదూయతే కేవలమేవలోకః 2

బాల్యముగతింప, కల్పితక్రీడలలోలమై, పత్నియను గుహలోఁ బ్రవేశించి, మనస్సను మృగము కృశించును. తుచ్ఛశరీరమును ముదిమి ఆక్రమింప కష్టములుగాక మరేమి? ఇట్లు, జనులు వ్యర్థజీవనులగుచున్నారు.

జరాతుషారాభిహతాం శరీర
సరోజినీం దూరతరే విముచ్య
క్షణాద్గతే జీవిత చంచరీకే
జనస్య సంసారసరోఽవశుష్కమ్. 3

ముదిమియను మంచుపడ, వడలిపోయిన శరీరమను పద్మమును విడిచి, ప్రాణమను తుమ్మెద యెగిరిపోవును; అప్పుడిహలోకమను సరోవరము శూన్యమగును.

యదాయథాపాకముపైతి నూనం
తదాతదేయం రతిమాతనోతి
జరాభరాఽనల్పనవప్రసూనా
విజర్జరా కాయలతా నరాణామ్. 4

జరాతిశయమును బ్రకటించు, నవకుసుమిత, విచ్ఛిన్న దేహలత, ప్రాతబడుకొలది మృత్యువునకుఁ బ్రియమగుచుండును.

తృష్ణానదీ సారతర ప్రవాహా
గ్రస్తాఖిలానంత పదార్థజాతా
తటస్థసంతోష సువృక్షమూల
నికాషదక్షా వహతీహ లోకే. 5

గట్టుననున్న సంతోషమను వృక్షమూలములనుఁ బెకలించు నేర్పుగల, తృష్ణానది ప్రబలవేగమున, న[illegible]యమును [illegible] ప్రవహించుచున్నది.

శరీరనౌశ్చర్మ నిబంధ బద్ధా
భవాంబుధావాలులితా భ్రమంతీ
ప్రలోడ్యతే పంచభిరింద్రియాఖ్యై
రధోభవంతీ మకరై రధీరా. 6

శరీరమను నావ సంసారసాగరమున భ్రమించుచు మునుగనున్నది; పంచేంద్రియములను మొసళ్లు దానిని ఊగిసలాడించుచున్నవి. యీనావకు చుక్కాని — చర్మాచ్ఛాదనమున నిబద్ధమైన వివేకము.

తృష్ణాలతాకానన చారిణోఽమీ
శాఖాశతం కామమహీరుహేషు
పరిభ్రమంతః క్షపయంతి కాలమ్
మనోమృగా నో ఫలమాప్నువంతి. 7

తృష్ణయను అరణ్యమున సంచరించు మనస్సనెడు కోఁతి కామవృక్షముయొక్క శాఖలన్నిటి యందు పరిభ్రమించుచు, కాలమును వ్యర్థపరచుచున్నది; ఫలమేమియుఁ దొఱకకున్నది.

కృచ్ఛ్రేషు దూరా స్తవిషాదమోహాః
స్వాస్థ్యేషు నోత్సిక్తమనోభిరామాః
సుదుర్లభాః సంప్రతి సుందరీభి
రనాహతాంతఃకరణా మహాంతః. 8

ఆపదలు శోకించనివారును, సంపదల మత్తిల్లనివారును యువతులనిన చిత్తము వికలింపని వారును, అగునట్టి మహాత్ములు దుర్లభులు.

తరంతి మాతంగఘటాతరంగం
రణాంబుధిం యే మయి తే నశూరాః
శూరా స్త ఏవేహ మన స్తరంగం
దేహేంద్రియాంభోధి మిమం తరంతి. 9

గజసమూహముల తరంగములతో సంక్షుబ్ధమగు యుద్ధసాగరమును దాటినవారు శూరులు కారు; మనోవృత్తితరంగములతో విక్షుబ్ధమైన శరీరేంద్రియ సముద్రమును దాటినవారే శూరులు అని నేనెంతును.

అక్లిష్టపర్యంత ఫలాభిరామా
నదృశ్యతే కస్యచిదేవ కాచిత్
క్రియాదురాశాహతచిత్తవృత్తి
ర్యామేత్య విశ్రాంతి ముపైతి లోకః 10

దురాశాగ్రస్తుఁడగు మానవునకు శాంతినిచ్చు, అక్లేశకర కార్యము కన్పట్టదు.



కీర్త్యా జగద్దిక్కుహరం ప్రతాపైః
శ్రియా గృహం సత్త్వబలేన లక్ష్మీం
యే పూరయంత్యక్షతధైర్యబంధా
న తే జగత్యాం సులభా మహాన్తః. 11

ధైర్యమును విడువక కీర్తితో జగత్తును, ప్రతాపముతో దిక్కులను, సంపదలతో భవనమును నింపి, తొణకకుండు మహాత్ములరుదు.

అప్యంతరస్థం గిరిశైలభిత్తే
ర్వజ్రాలయాభ్యంతర సంస్థితం వా
సర్వం సమాయాంతి ససిద్ధవేగాః
సర్వాః శ్రియః సంతతమాపదశ్చ. 12

పర్వత గుహాయందున్నను, అభేద్యమైన వజ్రనిర్మిత గృహమునందున్నను, అదృష్టానుసారము సంపదలు, ఆపదలు కలుగుచునేయుండును.

పుత్రాశ్చ దారాశ్చ ధనంచ బుద్ధ్యా
ప్రకల్ప్యతే తాత రసాయనాభమ్
సర్వంతు తన్నోపకరోత్యథాంతే
యత్రాతిరమ్యా విషమూర్ఛనైవ. 13

మునీంద్రా! జనులు ధనదారా పుత్రాదులు, మధుర రసాయనములని భ్రాంతినందుచున్నారు. కాని, సంపదలు విషములై మూర్ఛను గల్పించు ఆ తుదినిముసమున భార్యాపుత్రులు సాయమొనర్పఁజాలరు.

విషాదయుక్తో విషమామవస్థా
ముపాగతః కాయవయోవసానే
భావాన్ స్మరన్ స్వానిహ ధర్మరిక్తాన్
జంతుర్జరావానిహ దహ్యతేఽంతః. 14

అవసానకాలమున, విషాదకరమగు అవస్థనుబొంది, విషణ్ణచిత్తుఁడై, తానొనర్చిన పాపపు బనులఁ దలంచుకొని, ముదుకని అంతరము దహింపఁబడును.

కామార్థధర్మాప్తి కృతాంతరాభిః
క్రియాభిరాదౌ దినసాని నీత్వా
చేతశ్చలద్బర్హిణ పిచ్ఛలోలం
విశ్రాంతిమాగచ్ఛతు కేన పుంసః. 15

జనులు ధర్మానుపయోగములగు అర్థకామములు, కాలమును వెచ్చబరచిన, నెమిలిపించెము వలె చంచలమగు మనస్సునెట్లు సమాధాయింపఁగలరు?

పురోగతైరప్యనవాప్తరూపై
స్తరంగిణీ తుంగతరంగకల్పైః
క్రియాఫలైర్దైవవశాదుపేతై
ర్విడంబ్యతే భిన్నరుచిర్విలోకః. 16

సత్కర్మల ఫలములుగూడ ఉత్తుంగ నదీతరంగములవలె, క్షణభంగురములు; సంచితములైనను వాటి ననుభవింప వీలులేదు. దైవవశాత్తు అవి ప్రారబ్ధకర్మలుగ పరిణమించిన, భోగములగును. అప్పుడు, దేహాత్మబుద్ధులగు మానవులు వాటిని లాభములని దలంచి పొంగిపోదురు.

ఇమాన్యమూనీతి విభావితాని
కార్యాణ్యపర్యంత మనోరమాణి
జనస్య జాయా జనరంజనేన
జవాజ్జరాంతం జరయంతి చేతః. 17

నేడిది యొనర్తును, మాపిది యొనర్తునని, సదాచింతించుచు మనుష్యుడొనరించు కర్మల పరిణామము దుఃఖము. ఇట్టియత్నము లొనర్పుటయందును, భార్యను, బంధువులను సంతోషపెట్టుటలోను కాలము వ్యర్థమైపోవును. ముదిమి దాపురించును; వివేకము నశించును.

పర్ణాని జీర్ణాని యథా తరూణాం
సమేత్య జన్మాశు లయం ప్రయాంతి
తథైవ లోకాః స్వవివేకహీనాః
సమేత్య గచ్ఛంతి కుతోఽప్యహోభిః. 18

ఆకులు చిగిర్చి, ఎండి, పడిపోవునట్లు, వివేక విహీనులగువారు జన్మించి, శీఘ్రముగనే మరణించుచున్నారు.

ఇతస్తతో దూరతరం విహృత్య
ప్రవిశ్య గేహం దివసావసానే
వివేకిలోకాశ్రయ సాధుకర్మ
రిక్తైహిన్నా రాత్రౌ క ఉపైతి నిద్రామ్. 19

[illegible], వివేకులనాశ్రయింపు సత్కర్మల నొనర్పక ఇటునటుతిరుగాడి, సాయంసమయమున [illegible]ంచిన ఏరీతి నిద్రపట్టును.

విద్రావితే శత్రుజనే సమస్తే
సమాగతాయామభితశ్చలక్ష్మ్యామ్
సేవ్యంత ఏతాని సుఖాని యావత్
తావత్ సమాయాతి కుతోఽపి మృత్యుః. 20

శత్రువుల నిర్జిం[illegible] [illegible] [illegible]ఖములన్ని [illegible]. సరిగ నిట్టిసమయ[illegible]నే మృత్యువ[illegible].



కుతోఽపి సంవర్ధిత తుచ్ఛరూపై
ర్భావైరమీభిః క్షణనష్టదృష్టైః
విలోడ్యమానా జనతా జగత్యాం
న వేత్త్యపాయాతమహానుపాతమ్. 21

విషయములు క్షణములో గన్పడి క్షణమున నశించును; ఇవి తుచ్ఛరూపమున వృద్ధినందును. అహా! వీటించిక్కికొనిన జనులు దాపుననున్న మృత్యువును గాంచలేరు.

ప్రియాసుభిః కాలముఖం క్రియంతే
జనైర్దశాస్తే హతకర్మబద్ధాః
యైః పీనతామేవ బలాదుపేత్య
శరీరబాధేన న తే భవంతి. 22

తత్త్వజ్ఞానులు, కర్మపాశబద్ధులై యజ్ఞమేషములంబోలు మూఢులను యమవదనమని భావింతురు; వీరు బంధములన్నిటినుంటి విడువడినారు. అందువలన, జన్మనెత్తవలసిన పనిలేదు.

అజస్రమాగచ్ఛతి సత్వరైవ
మనారతం గచ్ఛతి సత్వరైవ
కుతోఽపి లోలా జనతా జగత్యాం
తరంగమాలా క్షణభంగురేవ. 23

క్షణభంగురములగు కెరటములవలె, జనులెటనుండి వచ్చుచున్నారో, ఎటకరుగుచున్నారో, ఎవరెరుంగుదురు?

ప్రాణాపహారైకపరా నరాణాం
మనో మనోహారితయా హరంతి
రక్తచ్ఛదాశ్చంచల షట్పదాక్ష్యో
విషద్రుమాలోలలతాః స్త్రియశ్చ. 24

స్త్రీలు విషవృక్షమునకు ప్రేలు తీగలవంటివారు. వీరు సౌందర్యమున పురుషులనాకర్షించి, ప్రాణముల హరింతురు. వీరు భ్రమరనయనలు, రక్తాధరోష్ఠలు.

ఇతోఽన్యతశ్చోపగతా ముధైవ
సమాన సంకేత నిబద్ధభావా
యాత్రా సమాసంగసమా నరాణాం
కలత్రమిత్రవ్యవహారమాయా. 25

ఉత్సవ సమయములందలి జనసమాగమమువంటిదే, ఈ మాయాజనిత బంధుమిత్రకళత్ర సమాగమము. 'ఈ మూలనుండి, ఆమూలనుండి' ఆరుదెంచి అనుకొనినట్లు, కార్యముల నెరవేర్చుటకెంటికిని సమానములే. (జనులు, స్వర్గనరకములనుండి ఏగుదెంచి, అదృష్టానుసారము కార్యముల నెరవేర్చుచున్నారు కదా!)

ప్రదీపశాంతిష్వివ భుక్తభూరి
దశాస్వతిస్నేహ నిబంధనీషు
సంసారమాలాసు చలాచలాసు
న జ్ఞాయతే తత్త్వమతాత్త్వికేషు. 26

పూర్ణదశ, స్నేహము, అస్థిరత — వీటితోఁగూడి నిర్వాణోన్ముఖమగు దీపముఁబోలు, ఈ సంసారమందున్న సారమేమియో తెలియఁజాలము.

సంసారసంరంభ కుచక్రికేయం
ప్రావృట్పయోబుద్బుదభంగురాపి
అసావధానస్య జనస్య బుద్ధౌ
చిరస్థిరప్రత్యయ మాతనోతి. 27

సంసారప్రవృత్తియను చక్రము, వర్షాకాలజలబిందువలె క్షణభంగురమైనను, అజ్ఞాని మనస్సునకు శాశ్వతమైనట్లె తోఁచును.

శోభోజ్జ్వలా దైవవశాద్వినష్టా
గుణాః స్థితాః సంప్రతి జర్జరత్వే
ఆశ్వాసనా దూరతరం ప్రయాతా
జనస్య హేమంత ఇవాంబుజస్య. 28

మానవుఁడను పద్మమున, యౌవనమను శరత్కాలమునయున్న, సుగుణములశోభయను సుగంధము, ముదిమియను హేమంత ఋతువున నష్టమైపోవును — అప్పుడు చిత్తమును సంతోషపెట్టుట అసంభవము.

పునః పునర్దైవవశాదుపేత్య
స్వతేహ భారేణ కృతోపకారః
విలూయతే యత్ర తరుః కుఠారై
రాశ్వాసనే తత్ర హి కః ప్రసంగః. 29

అదృష్టవశమున జన్మించి, ఛాయాపుష్పఫలాదుల లోకులకు మాటిమాటికి ఉపకారమొనరించిన వృక్షము, గొడ్డలిపెట్టునఁ గ్రుంగుచున్నది — ఇట్టి జగతున మనస్సు నాశ్వాసించుకొను టెట్లు?

మనోరమస్యాప్యతిదోషవృత్తే
రంతర్వియాఘాతాయ సముత్థితస్య
విషద్రుమస్యేవ జనస్య సంగా
దాసాద్యతే సంప్రతి మూర్ఛనైవ. 30

జనసంసర్గము, మనోహరమైనను, అతిదుష్టస్వభావముగలిగి నాశనము గలిగించు విషవృక్షము వంటిది, దీనివలన మోహము [illegible]



కల్పాభిధాన క్షణజీవినోహి
కల్పౌఘ సంఖ్యాకలనే విరించ్యాః
అతః కలా శాలిని కాలజాలే
లఘుత్వ దీర్ఘత్వ ధియోఽప్యసత్యాః. 31

బ్రహ్మదేవుఁడు ఇత్యాదులగు దేవలోకవాసులు గూడ, కల్పక్షణమాత్రజీవులు. క్షణముహూర్త ఘటితమగు ఈ కాలచక్రమందలి హెచ్చుతగ్గులుకూడ మిథ్యలే.

కాస్తాదృశో యాసు న సంతి దోషాః
కాస్తా దిశో యాసు న దుఃఖదాహాః
కాస్తాః ప్రజా యాసు న భంగురత్వమ్
కాస్తాః క్రియా యాసు న నామ మాయా. 32

దోషదృష్టిలేనివారెవరు? దుఃఖతాపములేని దిక్కులేవి? నశింపని జీవులెవ్వరు? మాయ కాని క్రియలెవ్వి?

సర్వత్ర పాషాణమయా మహీధ్రా
మృదామహీ దారుభిరేవ వృక్షాః
మాంసైర్జనాః పౌరుషబద్ధభావా
నాపూర్వమస్తీహ వికారహీనమ్. 33

పర్వతములన్నియు పాషాణమయములు; భూమి మృణ్మయము; వృక్షములు దారుమయములు; మనుష్యులు మాంసమయులు; వాస్తవమున కీ వికారములన్నియు, కారణాతిరిక్తములుగావు; అందువలన మూలకారణమగు పరబ్రహ్మమున పర్యవసితములగు, ఈ వివిధ నామములు కేవల సంజ్ఞామాత్రకములు.

ఆలోక్యతే చేతనయానువిద్ధా
పయోనుబద్ధోఽస్తసయో నభఃస్థాః
పృథగ్ విభాగేన పదార్థలక్ష్మ్యా
ఏతజ్జగన్నేతరదస్తి కించిత్. 34

ఆహా! పదార్థలక్ష్మికి లీలాభూమియగు ఈ మిథ్యాజగత్తు అవివేకులకుమాత్రమే కన్పట్టుచున్నది. వివేకు లిద్దానిని పంచభూత వికారమని ఎఱుఁగుదురు.

చమత్కృతిశ్చేహ మనస్విలోక
చేతశ్చమత్కారకరీ నరాణాం
స్వప్నేఽపి సాధో విషయం కదాచిత్
కేషాంచిదభ్యేతి న చిత్రరూపా. 35

సాధుపుంగవా ! నరులు, స్వప్నమునగూడ కష్టసుఖాది భోగముల ననుభవించి, విస్మితులగుచున్నారు. అగుచో; బుద్ధిమంతులీ మాయాజనిత జగత్తునం దగులువడుట ఆశ్చర్యము కాదు.

అద్యాపి యాతేఽపి చ కల్పనాయా
ఆకాశవల్లీ ఫలవన్మహత్త్వే
ఉదేతి నో లోభలవా హతానా
ముదారవృత్తాంతమయీ కథైవ. 36

ఆకాశ లతాఫలములవలె, అలీకములగు భోగకల్పనలు అజ్ఞానవశమున ప్రబలమవ, సామాన్యవిషయముల దగుల్కొనియున్న మనుజులు, యౌవనము గతించినను, పరమాత్మమాట దలపెట్టరు.

ఆదాతుమిచ్ఛన్ పదముత్తమానాం
స్వచేతసైవాపహతోఽద్య లోకః
పతత్యశంకం పశురద్రికూటా
దానీలవల్లీ ఫలవాంఛయైవ. 37

మేకలు, పచ్చతీగెల పళ్లను దినునాసతో, కొండ కొమ్మననుండి, క్రిందఁబడునట్లు, మనుష్యులు మంచి భోగములననుభవించు నిచ్ఛతో, తమదోషములవలననే, అధఃపతితు లగుదురు.

అవాంతరస్యాస్తనిరర్థకాంశ
చ్ఛాయాలతా పత్రఫలప్రసూనాః
శరీర ఏవ క్షత సంపదశ్చ
శ్వభ్రద్రుమా అద్యతనా నరాశ్చ. 38

దుర్గమ స్థానముననున్న వృక్షములును, ఆధునికులును (అజ్ఞానులనుట) ఉపయోగములేని వారు, వీరిపని స్వాత్మరక్షణమే. ఇట్టి వృక్షముయొక్క, ఛాయా పత్రపుష్పఫలాదులును, ఇట్టి పురుషుని గుణములును, వ్యర్థము—అక్కరకు రావు.

క్వచిజ్జనా మార్దవ సుందరేషు
క్వచిత్ కఠోరేషు చ సంచరంతి
దేశాంతరాలేషు నిరంతరేషు
వనాంతఖండేష్వివ కృష్ణసారాః. 39

కృష్ణసారములు కొన్ని కోమలప్రదేశములయందునను, కొన్ని దుర్గమప్రదేశములను, సంచరించునట్లు, కొందఱు దయాదాక్షిణ్య విద్యావినోదాది చిత్త వృత్తులతోడను, కొందఱు క్రోధ లోభాదులగు నిష్ఠురచిత్త వృత్తులతోడను, సంచరించుచున్నారు.

ధాతుర్నవాని దివసం ప్రతి భీషణాని
రమ్యాణివా విలులితాంత తమాకులాని
కార్యాణి కష్టఫలపాక హతోదయాని
విస్మాపయంతి న శవస్య మనాంసి కేషామ్. 40

శవమువలె హృదయవిహీనుడగు విధాతయొక్క, ఆపాతరమణీయములును, భయంకర పరిణామదాయకములును, అగు నూతనకార్యములు దోషయుక్తములైనను, అవివేకులు మోహపడుచున్నారు. వివేకులీకార్యములగాంచి, ఆశ్చర్యపడకుండ నుండజాలరు.



జనః కామాసక్తో వివిధకుకలాచేష్టనపరః
సతు స్వప్నేఽప్యస్మిన్ జగతి సులభో నాద్య సుజనః
క్రియా దుఃఖాసంగా విధురవిధురా నూనమఖిలా
నజానే నేతవ్యా కథమివ దశా జీవితమయీ. 41

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే వైరాగ్యప్రకరణే
నిఃశ్రేయసవిరోధిభావానిత్యతాప్రతిపాదనంనామ
సప్తవింశతితమః సర్గః ॥ 27 ॥

జనులు నిరంతరము కుటిలయత్నముల నొనర్చుచు, కామాసక్తులైయున్నారు. వివేకులు స్వప్నమునంగూడ కనఁబడుటలేదు. ఈ భయంకర జీవితము నెట్లుగడుపుదునో, తెలియజాలకుంటిని !

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు వైరాగ్యప్రకరణమున
నిఃశ్రేయసవిరోధిభావానిత్యతాప్రతిపాదనమను
సప్తవింశతితమ సర్గము ॥ 27 ॥



## అష్టావింశః సర్గః.

శ్రీరామ ఉవాచః—

యచ్చేదం దృశ్యతే కించిజ్జగత్ స్థావర జంగమమ్
తత్సర్వమస్థిరం బ్రహ్మన్ స్వప్నసంగమ సన్నిభమ్. 1

శ్రీరాముఁడు : బ్రహ్మజ్ఞుఁడా ! ఈ కనఁబడు స్థావరజంగమాత్మకమగు జగత్తంతయు, స్వప్నసంగమమువలె నస్థిరము.

శుష్కసాగర సంకాశో నిఖాతో యోఽద్య దృశ్యతే
స ప్రాతరభ్రసంవీతో నగః సంపద్యతే మునే. 2

మునీంద్రా ! నేడు ఎండిపోయిన సముద్రమువలె కన్పడు అఖాతము, రేపు మేఘమాలాపరివృతమగు పర్వతముగ మారవచ్చును.

యో వనవ్యూహ విస్తీర్ణో విలీఢగగనో మహాన్
దినై రేవసయాత్యుర్వీ సమతాం కూపతాంచ వా. 3

ఆకాశమును ముట్టు మహారణ్యము కొన్ని దినములలో నేలమట్టమై పోవచ్చును లేక నూయిగ మారవచ్చును.

యదంగమద్య సంవీతం కౌశేయస్రగ్విలేపనైః
దిగంబరం తదేవశ్వో దూరే విశరితాఽవటే. 4

నేఁడే శరీరమున పట్టుపుట్టములు జుట్టఁబడి యున్నవో, మాలలు వేయబడినవో, ఆశరీరము మాపు వస్త్రవిహీనమై, దూరముననున్న గుంటలో పారవేయఁబడి, విశీర్ణమగును.

యత్రాద్య నగరం దృష్టం విచిత్రాచార చంచలమ్
తత్రై వోదేతి దివసైః సంశూన్యారణ్యధర్మతా. 5

నేఁడు విచిత్రాచారములతో నిండి కనుంబడుచున్న నగరమున్నచోట, అల్పదినములలో శూన్యారణ్యము వెలయును.

యః పుమానద్య తేజస్వీ మండలాన్యధితిష్ఠతి
స భస్మకూటతాం రాజన్ దివసై రధిగచ్ఛతి. 6

నేఁడు, తేజమున మండలాధిపతియై వెలయునాతఁడు, స్వల్పకాలముననే భస్మరాశిగ మారును.

అరణ్యాని మహాభీమా యా నభోమండలోపమా
పతాకాచ్ఛాదితాకాశా సైవ సంపద్యతే పురీ. 7

మహాభయంకరమును, గగనమువలె శూన్యమును, విశాలముననగు అరణ్యము, కాలవశమున ఆకాశమండలము నావరించు పతాకలతో గూడిన పురిగ మారగలదు.

యా లతావలితా భీమా భాత్యద్య విపినావలీ
దివసై రేవ సాయాతి పునర్మరుమహీపదమ్. 8

నేఁడు లతలచే నావరింపఁబడి, మహాభయంకరమై కన్పట్టునది, కొన్నిరోజులలో, మరుభూమియగును.

సలిలం స్థలతాం యాతి స్థలీ భవతి వారిభూః
విపర్యస్యతి సర్వం హి సకాష్ఠాంబుతృణం జగత్. 9

నీరు భూమియగును, భూమి నీరగును; జగత్తంతయు పరివర్తనము నందునదే.

అనిత్యం యౌవనం బాల్యం శరీరం ద్రవ్యసంచయాః
భావాద్భావాంతరం యాంతి తరంగవదనారతమ్. 10

బాల్యము, యౌవనము, శరీరము, ద్రవ్యములు — ఇవన్నియు అనిత్యములు; నిరంతరము తరంగములవలె స్థిత్యంతరము నందుచుండును.



వాతాంతర్దీపకశిఖాలోలం జగతి జీవితమ్
తడిత్ స్ఫురణ సంకాశా పదార్థశ్రీర్జగత్త్రయే. 11

గాలిలోనున్న దీపమువలె, జీవితము చంచలము; ముల్లోకములనున్న వస్తువులశోభ మెఱుపు వంటిది.

విపర్యాసమియం యాతి భూరిభూతపరంపరా
బీజరాశిరివాజస్రం పూర్యమాణః పునః పునః. 12

బీజములవలె, భూతములన్నియు, మాటిమాటికి మార్పునందుచున్నవి.

మనఃపవనపర్యస్త భూరిభూత రజఃపటా
పాతోత్పాత పరావర్త పరాభినయభూషితా. 13

ఆలక్ష్యతే స్థితిరియం జాగతీ జనితభ్రమా
నృత్తావేశ వివృత్తేవ సంసారారభటీనటీ. 14

ఆడంబరముతోఁ గూడిన ఈ సంసారరచన, నేర్పుగల నర్తకివలె కనుపించుచున్నది; ఇది మాటిమాటికి కౌశలముతో అంగవిన్యాసము నొనర్చుచు, భ్రమింపజేయుచున్నది. మనస్సను గాలిచే లేవనెత్తఁబడు ధూళియను జీవులు యీ నర్తకియొక్క వస్త్రస్వరూపులు. జీవుల స్వర్గ, నరక, భూలోక పతనమే, దాని అభినయము.

గంధర్వనగరాకార విపర్యాసవిధాయినీ
అపాంగ భంగురోదార వ్యవహార మనోరమా. 15

తడిత్తరలమాలోక మాతన్వానా పునఃపునః
సంసారరచనా రాజన్ నృత్తసక్తేవరాజతే. 16

లోకప్రసిద్ధములగు, క్షణభంగుర వ్యవహారములే, దీని చంచల కటాక్షములు; ఇది గంధర్వ నగరమునుఁ బోలు భ్రమనుఁ గల్గించును. ఇంద్రజాలికవలె, అవస్తువునందు వస్తుభ్రమను గల్గించుచున్నది. దీని దృష్టి మెఱుపుకంటెను చంచలము. ఇది ఈ నృత్యమునకు దగియే యున్నది.

దివసాస్తే మహాంతస్తే సంపదస్తాః క్రియాశ్చ తాః
సర్వంస్మృతిపథం యాతం యామో వయమపి క్షణాత్. 17

ఆరోజులు, ఆసంపదలు, ఆక్రియలు, ఆమహాపురుషులు, దృష్టిపథమును దాటిపోయినారు. స్మృతికి దూరులైనారు. మనముగూడ, క్షణములో ఇట్లేయగుదుము.

ప్రత్యహం క్షయమాయాతి ప్రత్యహం జాయతే పునః
అద్యాపి హతరూపాయా నాంతోఽస్యా దగ్ధసంసృతేః. 18

ప్రతిదినము క్షయమందుచు మరల నుత్పన్నమగుచున్నది; ఈ పాడు సంసారమున కంతము లేదు.

తిర్యక్త్వం పురుషాయాంతి తిర్యంచో నరతామపి
దేవాశ్చాదేవతాం యాంతి కిమివేహ విభో స్థిరమ్. 19

ప్రభూ ! మనుష్యులు పశువులగుచున్నారు. పశువులు మనుష్యజన్మ నెత్తుచున్నవి. దేవతలు దేవభావమును వీడుచున్నారు. ఈ జగత్తున స్థిరమైన దేమున్నది ?

రచయన్ రశ్మిజాలేన రాత్ర్యహాని పునః పునః
అతివాహ్య రవిః కాలో వినాశావధి మీక్షతే. 20

కాలాత్ముఁడగు సూర్యుడు, తనకిరణముల, రాత్రిం దివముల, మాటిమాటికి, గల్పించి గడపుచు, ప్రాణుల అవసానసమయాంతమును నిరీక్షించు చున్నాడు.

బ్రహ్మా విష్ణుశ్చ రుద్రశ్చ సర్వావా భూతజాతయః
నాశమేవానుధావంతి సలిలానీవ వాడవమ్. 21

నీరు బడబాగ్నియందు పడునట్లు, త్రిమూర్తులును తక్కుంగల జీవులును, వినాశనమునందు చున్నారు.

ద్యౌః క్ష్మా వాయురాకాశం పర్వతాః సరితో దిశః
వినాశవాడవస్యైతత్ సర్వం సంశుష్కమింధనమ్. 22

దిఙ్మండలము, స్వర్గము, భూమి, ఆకాశము, వాయువు, పర్వతములు, నదులు—ఇవన్నియు ధ్వంసమను బడబాగ్నికి ఎండుకట్టెలు.

ధనాని బాంధవా భృత్యా మిత్రాణి విభవాశ్చ యే
వినాశభయభీతస్య సర్వం నీరసతాం గతం. 23

మృత్యుభీతిగల మనుజునకు, ధనధాన్యములు, బంధుమిత్రులు, భృత్యులు, వైభవములు ప్రీతికరములు కాజాలవు.

స్వదంతే తావదేవైతే భావా జగతి ధీమతే
యావత్ స్మృతిపథం యాతి న వినాశకురాక్షసః. 24

మృత్యువను రాక్షసుఁడు గుర్తుతగలనంతవఱకు, ఈ భోగములన్నియు రుచించును.

క్షణమైశ్వర్యమాయాతి క్షణమేతి దరిద్రతామ్
క్షణం విగతరోగత్వం క్షణమాగతరోగతామ్. 25

నిముషములో ధనికుఁడు దరిద్రుఁడగును; ఆరోగ్యవంతుడు రోగియగును.

ప్రతిక్షణవిపర్యాసదాయినా నిహతాత్మనా
జగద్భ్రమేణ కే నామ ధీమంతో హి న మోహితాః. 26

అనుక్షణము భ్రాంతిని గల్పించునదియు, అశాశ్వతమునగుజగత్తున విమోహితుఁడుకాని విజ్ఞఁ డెవఁడు?



తమః పంకసమాలబ్ధం క్షణమాకాశమండలమ్
క్షణం కనకనిష్యంద కోమలాలోక సుందరమ్. 27

క్షణం జలదనీలాబ్జ మాలావలిత కోటరమ్
క్షణముద్దామరరవం క్షణం మూకమివస్థితమ్. 28

క్షణం తారావిరచితం క్షణమర్కేణ భూషితమ్
క్షణమిందుకృతాహ్లాదం క్షణం సర్వబహిష్కృతమ్. 29

ఆగమాపాయపరయా క్షణసంస్థితి నాశయా
న బిభేతి హి సంసారే ధీరోఽపి క ఇవానయా. 30

ఒకప్పుడాకాశము తమఃపంకపిండమున, బూయబడియుండును. మరొకప్పుడు కనక కాంతుల శోభిల్లుచుండును. ఇంకొకప్పుడు మేఘములను నీలపద్మములతో నిండియుండును. అన్య సమయమున ధ్వనులతో నిండియుండును. మఱొక నిముషమున మూగయై నిశ్శబ్దముగనుండును. ఇంకొకక్షణమున సూర్యునితో ప్రకాశించుచుండును. ఒకప్పుడు నక్షత్ర శోభితమై వెలయును. ఇంకొకప్పుడు చంద్రునితో రాజిల్లుచుండును. మరొకప్పుడు నేమియునుండవు. క్షణముండి క్షణములో పోవునట్టి ఈ జగత్తునిన భీతిల్లని వారెవరు?

ఆపదః క్షణమాయాంతి క్షణమాయాంతి సంపదః
క్షణం జన్మ క్షణం మృత్యుర్మునే కిమివ న క్షణమ్. 31

మునీ! క్షణములో ఆపదలు అరుదెందును; క్షణములో సంపదలువచ్చును; క్షణములో జన్మ, క్షణములో మృత్యువు. ఇక క్షణికము కానిదెయ్యది ?

ప్రాగాసీదన్య ఏవేహ జాతస్త్వన్యో నరో దినైః
సదైకరూపం భగవన్ కించిదస్తి న సుస్థిరమ్. 32

భగవంతుడా! ప్రపంచమునందున్న వస్తువులన్నియు (జన్మకు) పూర్వమొకట్లును, తరువాత మరొకట్లునుండును. కొన్నిరోజులలో ఇంకొకట్లుమారును. స్థిరమును, ఏకమునునగు స్వరూపము గలిగిన వస్తువొక్కటియులేదు.

ఘటస్య పటతా దృష్టా పటస్యాపి ఘటస్థితిః
న తదస్తి న యద్దృష్టం విపర్యస్యతి సంసృతౌ. 33

ఈ జగత్తున మార్పునందని వస్తువొక్కటియులేదు. ఘటము (కుండ) పటము (వస్త్రము) అగును. పటము ఘటమగును.

తనోత్యుత్పాదయత్యత్తి నిహంత్యాసృజతి క్రమాత్
సతతం రాత్ర్యహానీవ నివర్తంతే నరం ప్రతి. 34

వృద్ధి, పరివర్తన, అపక్షయము, వినాశము, పునర్జన్మ ఇవి దేహాభిమానియగు నరుని పట్ల రాత్రిందివములట్లు నిరంతరము మారుచున్నది.

అశూరేణ హతః శూర ఏకేనాపి హతం శతం
ప్రాకృతాః ప్రభుతాం యాతాః సర్వమావర్త్యతేజగత్. 35

బలహీనుడు బలవంతుని జంపుచున్నాడు; ఒకడు నూర్గురును మట్టుపెట్టుచున్నాడు. నీచులు ప్రభువులగుచున్నారు.—ఇట్లు జగత్తంతయు పరివర్తనము నందుచున్నది.

జనతేయం విపర్యాసమజస్రమనుగచ్ఛతి
జడస్పందపరామర్శాత్ తరంగాణామివావలీ. 36

జలసంస్పర్శవలన తరంగములు విపర్యాయమందునట్లు, జనులు అచేతనపదార్థముల సంస్పర్శ వలన మార్పులనందుచున్నారు.

బాల్యమల్పదినైరేవ యౌవనశ్రీస్తతో జరా
దేహేఽపి నైకరూపత్వం కాస్థా బాహ్యేషు వస్తుషు. 37

బాల్యము గతించును, యౌవనమరుదెంచును, అదిపోయి ముదిమివచ్చును—ఇది శరీరము యొక్కగతి. అగుచో, నిక బాహ్యవిషయముల మాటఏమి?

క్షణమానందితామేతి క్షణమేతి విషాదితాం
క్షణం సౌమ్యత్వమాయాతి సర్వస్మిన్నటవన్మనః. 38

మనస్సునటునివలె, అన్నివిషయముల క్షణములో ఆనందమును, క్షణములో విషాదమును క్షణములో సుముఖతను నందును.

ఇతశ్చాన్యదితశ్చాన్యదితశ్చాన్యదయం విధిః
రచయన్ వస్తు నాయాతి ఖేదం లీలాస్వివార్భకః. 39

క్రీడించుబాలునివలె విధాత విసుగులేక, ఎడతెగకుండ, హర్షవిషాద మోహముల గల్పించు వస్తువుల, నిటనట సృజించుచున్నాడు.

చినోత్యుత్పాదయత్యత్తి నిహంత్యాసృజతిక్రమాత్
సతతం రాత్ర్యహనీవ నివర్తంతే నరంప్రతి. 40

స్రష్ట, జీవులను సృష్టించి రక్షించి భక్షించుచున్నాడు. హర్షవిషాదమోహముల అహో రాత్రములవలె వారిముందర త్రిప్పుచున్నాడు.

ఆవిర్భావతిరోభావభాగినో భవభాగినః
జనస్యస్థిరతాం యాంతి నాపదో నచ సంపదః. 41

సంసార—భాగస్వాములగు జనులు పుట్టుచు చచ్చుచుందురు. వారికి శాశ్వతమైన స్థిరత్వములేదు. వారి సంపదలు, ఆపదలుకూడ అస్థిరములే.



కాలః క్రీడత్యయం ప్రాయః సర్వమాపది పాతయన్
హేలావిచలితాశేష చతురాచారచంచురః. 42

అవలీలగా చతురులగువారినిగూడ విచలితుల నొనర్పగలకాలము, అందరిని ఆపదలముంచి క్రీడించుచున్నది.

సమవిషమవిపాకతో విభిన్నా
స్త్రిభువనభూతపరంపరా ఫలౌఘాః
సమయపవన పాతితాః పతంతి
ప్రతిదినమాతతసంసృతిద్రుమేభ్యః. 43

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే వైరాగ్యప్రకరణే
సర్వభావాఽవిరతవిపర్యాసప్రతిపాదనంనామ
అష్టవింశః సర్గః ॥ 28 ॥

ఈ సంసారవృక్షమున వ్రేలు, త్రిలోకజీవులను ఫలములు—వీటిలోకొన్ని మిగులబండినవి, కొన్ని దోరపండినవి—కాలమను వాయువువలన నిరంతరము రాల్పబడుచున్నవి.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు వైరాగ్యప్రకరణమున
సర్వభావావిరతవిపర్యాసప్రతిపాదనమను
అష్టవింశ సర్గము ॥ 28 ॥



## ఏకోనత్రింశః సర్గః.

---

శ్రీరామ ఉవాచః—

ఇతి మే దోషదావాగ్నిదగ్ధే మహాతి చేతసి
ప్రస్ఫురంతి న భోగాశా మృగతృష్ణాః సరఃస్వివ. 1

శ్రీరాముఁడు:—ఇట్టిదోషములను దావాగ్నివలన దహింపడి, బలమును గూర్చుకొనిన నా చిత్తమున, సరస్సున ఎండమావులుదయించనట్లు, భోగాభిలాష ఉదయించుటలేదు.

ప్రత్యహం యాతి కటుతామేషా సంసారసంస్థితిః
కాలపాకవశాల్లోలా రసానింబలతా యథా. 2

రోజులు గడచినకొలది, యీ సంసారస్థితి, నాకంతకంతకు, వేపచెట్టునాశ్రయించియున్న లతలవలె, చేదగుచున్నది.

బుద్ధిమాయాతి దౌర్జన్యం సౌజన్యం యాతి తానవం
కరంజకర్కశే రాజన్ ప్రత్యహం జనచేతసి. 3

ముళ్లచెట్టువలె కర్కశులగు మానవుల హృదయములు, దినములు గడచినకొలఁది దుర్బలములగుచున్నవి. మంచి అడుగంటుచున్నది.

భజ్యతే భువి మర్యాదా ఝటిత్యేవ దినంప్రతి
శుష్కేవ మాష శింబీకా టంకారకరవం వినా. 4

ఈ జగత్తు ఎండిన మినపతీగెవలె, శబ్దమొనర్పకుండగనే, విరిగిపోవుచున్నది.

రాజ్యేభ్యో భోగపూగేభ్య శ్చింతావద్భ్యో మునీశ్వర
నిరస్తచింతాకలితా వరమేకాంతశీలతా. 5

మునీశ్వరా! రాజ్యములు, భోగములు, చింతలతో గూడినవి; అందువలన, ఇట్టి చింతలులేని ఏకాంతసేవ ఉత్తమము.

నానందాయ మమోద్యానం న సుఖాయ మమ స్త్రియః
న హర్షాయ మమార్థాశా శామ్యామి మనసా సహ. 6

ఉద్యానవనములు, స్త్రీలు, ధనాశ — నాకానందములు గొల్పజాలవు. మనస్సుతో శాంతి నందగోరెదను

అనిత్యాశ్చాసుఖో లోకస్తృష్ణా తాత దురుద్వహా
చాపలోపహతం చేతః కథం యాస్యామి నిర్వృతిమ్. 7

లోకతృష్ణ, సుఖములు—ఇవి అనిత్యములు, కాని వీటిని జయించుట కష్టము. చిత్తము చంచలము. నేనెట్లు శాంతినందగలను ?

నాభినందామి మరణం నాభినందామి జీవితమ్
యథా తిష్ఠామి తిష్ఠామి తథైవ విగతజ్వరమ్. 8

నేను జీవితమును గోరను, మృతిని వాంఛింపను. నిశ్చింతుడనై, ఎట్లుండవలెనో అట్లుండ గోరెదను.

కింమే రాజ్యేన కింభోగైః కిమర్థేన కిమీహితైః
అహంకారవశాదేతత్ స ఏవ గలితో మమ. 9

రాజ్యములతోడను, భోగములతోడను, ధనములతోడను, ప్రయత్నములతోడను నాకు పనిలేదు. వీటి అన్నిటికిని కారణ మహంకారమే; నాకిదిలేదు.



జన్మావలి వరత్రాయామింద్రియగ్రంథయో దృఢాః
యే బద్ధా స్తద్విమోక్షార్థం యతంతే యే త ఉత్తమాః. 10

జన్మపరంపరలను రజ్జువుతో, దృఢముగ ముడివేయబడిన ఇంద్రియగ్రంథులను విడదీయ యత్నించువారే ప్రశంసాపాత్రులు.

మథితం మానినీలోకైర్మనో మకర కేతునా
కోమలం ఖురనిష్పేషైః కమలం కరిణా యథా. 11

ఏనుగు కాళ్లతో తామరపువ్వులను రాచివేయునట్లు, మన్మథుడు స్త్రీలతో పురుషుల హృదయమును హింసించుచున్నాడు.

అద్యచేత్ స్వచ్ఛయా బుద్ధ్యా మునీంద్ర న చికిత్స్యతే
భూయశ్చిత్త చికిత్సాయా స్తత్ కిలావసరః కుతః. 12

మునీంద్రా! నిర్మలమగు బుద్ధియోగమున మనస్సునకు చికిత్సయొనర్పనిచో, ఇంక ముం దెప్పుడు వీలగును?

విషం విషయవైషమ్యం న విషం విషముచ్యతే
జన్మాంతరఘ్నా విషయా ఏకదేహహారం విషమ్. 13

విషము విషముకాదు; విషయములే విషము. విషము ఒక్కశరీరమునే హరించునుగాని విషయవిషము జన్మజన్మాంతరములంగూడి ముక్తికి అడ్డుదగిలి ప్రాణములఁదీయును.

న సుఖాని న దుఃఖాని న మిత్రాణి న బాంధవాః
న జీవితం న మరణం బంధాయ జ్ఞస్య చేతసః. 14

సుఖదుఃఖములు, బంధుమిత్రులు, జీవనమరణములు, జ్ఞానిని బంధింపఁజాలవు.

తద్బ్రవామి యథా బ్రహ్మన్ పూర్వాపరవిదాంవర
వీతశోక భయాయాసో జ్ఞస్తథోపదిశాశు మే. 15

కార్యకారణ తత్త్వజ్ఞుడవగు బ్రాహ్మణోత్తమా! తత్త్వజ్ఞానమునుఁబడసి, భయశోకాయాసములనుండి విడువడు మార్గమును శీఘ్రముగ నుపదేశింపుడు.

వాసనాజాలవలితా దుఃఖకంటక సంకులా
నిపాతోత్పాత బహులా భీమరూపా ఽజ్ఞతాటవీ. 16

భయంకరమగు అజ్ఞానారణ్యము — వాసనాసమూహములతో జటిలమై, దుఃఖ కంటకములతో సంకులమై, మిట్టపల్లములతో (సంపదలు, ఆపదలతో) గూడియున్నది.

క్రకచాగ్ర వినిష్పేషం సోఢుం శక్నోమ్యహం మునే
సంసార వ్యవహారోత్థం నాశా విషయవైశసమ్. 17

మునీ! అంపముయొక్క అంచుతో కోయఁబడిన సహింతునుగాని, సంసారమందలి యీ ఆశావిషయముల కోతను నేసహింపఁజాలను.

ఇదం నాస్తీదమస్తీతి వ్యవహారాంజనభ్రమః
ధునోతీదం చలం చేతో రజోరాశిమివానిలః. 18

గాలి దుమ్మును లేవనెత్తునట్లు, ఇదియున్నది, ఇదిలేదు_అను నీ రూపమగు అజ్ఞానాంజనము చిత్తమును, విచలిత మొనర్చును.

తృష్ణా తంతులవ ప్రోతం జీవ సంచయ మౌక్తికం
చిదచ్ఛాంగతయా నిత్యం వికసచ్చిత్తనాయకమ్. 19
సంసార హారమరతిః కాలవ్యాల విభూషణమ్
త్రోటయామ్యహమక్రూరం వాగురామివ కేసరీ. 20

సంసారమను హారము, తృష్ణయను దారమున, గ్రుచ్చబడియున్నది. జీవులిందలి ముత్యములు; సాక్షిస్వరూపమగు శుద్ధచిత్తమే ఇందలి మధ్యమణి. ఈ హారము కాలుఁడను లంపటుని అలంకారము. సింహము వలన ద్రెంపునట్లు, వైరాగ్యముతో —(కామ క్రోధాదులతో గాదు) — దీనిని త్రెంపగోరెదను.

నీహారం హృదయాటవ్యాం మనస్తిమిరమాశు మే
కేన విజ్ఞానదీపేన భింధి తత్త్వవిదాంవర. 21

తత్త్వజ్ఞశ్రేష్ఠుఁడా! నా హృదయారణ్యమందలి నీహార తిమిరమును, సుఖదాయకమగు జ్ఞానదీపమున, దూర మొనర్పుడు.

విద్యంత ఏవేహ నతే మహాత్మన్
దురాధయో న క్షమయాప్నువంతి
యే సంగమేనోత్తమ మానసానాం
నిశాతమాంసీవ నిశాకరేణ. 22

మహాత్మా! చంద్రోదయమైన నశింపని చీకట్లులేనట్లు, సత్సంగమున నశింపని మనః పీడలు లేవు.

ఆయుర్వాయువిఘట్టితాభ్రపటలీ లంబాంబువద్భంగురం
భోగా మేఘవితానమధ్యవిలసత్ సౌదామినీచంచలాః
లోలా యౌవన లాలనాజలరయశ్చేత్యాకలయ్య ద్రుతం
ముద్రైవాద్య దృఢార్పితా నను మయా చిత్తే చిరం శాంతయే. 23

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే వైరాగ్య ప్రకరణే
సకలపదార్థానాస్థాప్రతిపాదనంనామ ఏకోనత్రింశః సర్గః ॥ 29 ॥

ఆయువు, వాయువుచే గొట్టఁబడిన మబ్బులవ్రేలాడు నీటిబొట్టువలె, క్షణభంగురము. భోగములు, మేఘముల నడుమ వెలుఁగు మెఱుపులవలె చంచలములు, యౌవనవిలాసములు జలప్రవాహమువలె అస్థిరములు___అని విచారమొనర్చి, మనస్సున దృఢముగ ముద్రించితిని.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు వైరాగ్యప్రకరణమున
సకలపదార్థానాస్థాప్రతిపాదనమను ఏకోనత్రింశ సర్గము ॥ 29 ॥



## త్రింశత్తమః సర్గః.

శ్రీ రామ ఉవాచః—

ఏవమభ్యుత్థితానర్థ శతసంకటకోటరే
జగదాలోక్య నిర్మగ్నం మనోమననకర్దమే. 1
మనో మే భ్రమతీవేదం సంభ్రమశ్చోపజాయతే
గాత్రాణి పరికంపంతే పత్రాణీవ జరత్తరోః. 2

శ్రీరాముఁడు:_ ఇట్లులేచు అనర్థవృత్తుల పంకముచే నిండియున్న సంసారకోటరమునఁబడియున్న జనుల గాంచి, నామనస్సు భ్రమించుచున్నది, నాకు భయమగుచున్నది, ఎండుటాకులవలె నాయింద్రియములు కంపించుచున్నవి.

అనాప్తోత్తమ సంతోషధైర్యోత్సంగాకులా మతిః
శూన్యాస్పదా బిభేతీహ బాలేవాల్పబలేశ్వరా. 3

ధైర్యసంతోషముల క్రోడమునందక బుద్ధి, అల్పబలుఁడగు భర్తనుఁ బొందిన బాలికవలె, ఈ సంసారమున భయపడుచున్నది.

వికల్పేభ్యో లుఠంత్యేతాశ్చాంతఃకరణవృత్తయః
శ్వభ్రేభ్య ఇవ సారంగాస్తుచ్ఛాలంబవిడంబితాః. 4

గోతిని గప్పియున్న పచ్చికకై పరువిడి, లేళ్లందు పడునట్లు, తుచ్ఛవిషయములకై పరువిడి మనోవృత్తులు దుఃఖమునఁ గూలుచున్నవి.

అవివేకాస్పదా భ్రష్టాః కష్టే రూఢా న సత్పదే
అంధకూపమివాపన్నా వరాకాశ్చక్షురాదయః. 5

అవివేకి నాశ్రయించియున్న చక్షురాది ఇంద్రియములు, అంధకూపమునఁబడిన మనుజునివలె కష్టకరమగు స్థానమునవున్నవి — ఇవి సత్పురుషుని ఆశ్రయించలేదు.

నావస్థితిముపాయాతి నచయాతి యథేప్సితమ్
చింతా జీవేశ్వరాయత్తా కాంతేవ ప్రియసద్మని. 6

జీవుఁడను భర్తకధీనమైన చింతయను భార్య, క్రొత్తగ కాపురమొనర్పనరిగిన స్త్రీవలె తనచోట స్థిరముగనుండలేదు. కోరువస్తువులను బొందలేదు.

జర్జరీకృత్య వస్తూని త్యజంతీ బిభ్రతీ తథా
మార్గశీర్షాంతవల్లీవ ధృతిర్విధురతాం గతా. 7

సంతోషము, పుష్యమాసమందలి లతవలె, కొన్ని కొన్నివస్తువుల త్యజించుచు అవయుచున్నది.

అపహస్తితసర్వార్థ మనవస్థితి రాస్థితా
గృహీత్వోత్సృజ్య చాత్మానం భవస్థితి రవస్థితా. 8

చిత్తచాంచల్యమున నాకు సంసారసుఖము లేకుండపోయినది, పరమార్థిక సుఖమును దొఱుక లేదు. ఈ సంసారము నన్ను సగము గైకొనినది, సగము గైకొనలేదు. (అనగా, సంపూర్ణముగా ఆత్మనిష్ఠయు కుదురలేదు, సంసారవిషయముల కించిత్ విరక్తియు గల్గినని).

చలితా చలితేనాంత రవష్టంభేన మే మతిః
దరిద్రా ఛిన్నవృక్షస్య మూలేనేవ విడంబ్యతే. 9

కొమ్మలులేని చెట్టునుగాంచిన ఇంకొకవస్తువని భ్రమకలుగునట్లు, ఆత్మతత్త్వనిశ్చయము కుదురక నామనస్సునకు భ్రమకలుగుచున్నది.

చేతశ్చంచల మాభోగి భువనాంతర్విహారిచ
నసంభ్రమం జహాతీదం స్వవిమానమివామరాః. 10

చంచల చిత్తము, వివిధములగు భోగవాంఛలతో నిండియున్నది. మూఁడులోకముల నిది విహరించును. అమరులు వారివారి విమానముల వీడనట్లు, ఇదియు చంచలతను విడువకున్నది.

అతోఽతుచ్ఛ మనాయాస మనుపాధిగతభ్రమం
కింతత్ స్థితిపదం సాధో యత్ర శోకో న విద్యతే. 11

సాధువర్యా! ఉత్తమమును, ఆయాసరహితమును; ఉపాధివర్జితమును, భ్రాంతినాశకమును, దుఃఖహీనమును అగు పదమెయ్యది?

సర్వారంభ సమారూఢాః సుజనా జనకాదయః
వ్యవహారపరా ఏవ కథముత్తమతాం గతాః. 12

వ్యవహారపరులును, కర్మనిరతులును అయ్యు జనకాది మహాపురుషు లెట్లు శ్రేష్ఠులైరి ?

లగ్నేనాపి కిలాంగేషు బహుధా బహుమానద
కథం సంసారపంకేన పుమానిహ న లిప్యతే. 13

[illegible] ! సంసారపంకము నానావిధముల, అంగముల నంటినను, పురుషుఁడెట్లు దాని వలన లిప్తుడు [illegible] నుండగలడు ?

కాం దృష్టిం సముపాశ్రిత్య భవంతో వీతకల్మషాః
మహాంతో విచరంతీహ జీవన్ముక్తా మహాశయాః. 14

మిమ్ముబోలు [illegible] లెట్టి దృష్టితో, ఈ సంసారక్షేత్రమున సంచరించుచున్నారు.



లోభయంతో భయాయైవ విషయా భోగభోగినః
భంగురాకారవిభవాః కథమాయాంతి భవ్యతామ్. 15

కుటిలములును, భయదములును, నశ్వరములును, నరకకారణములును నగు విషయసర్పము లెట్లు శుభప్రదములు కాగలవు?

మోహమాతంగ మృదితా కలంకకలితాంబరా
పరంప్రసాదమాయాతి శేముషీసరసీ కథమ్. 16

మోహమను ఏనుఁగువలన కలకబడి, మకిలియైన బుద్ధియను సరోవరమెట్లు స్వచ్ఛమవగలదు?

సంసార ఏవ నివహే జనో వ్యవహరన్నపి
న బంధం కథమాప్నోతి పద్మపత్రే పయో యథా. 17

మనుజుడు సంసారవ్యవహారములందు పాల్గొనుచున్నను, తామరాకునందలి నీటి బొట్టువలె, నిర్లిప్తుడై యుండుటకుపాయమేమి?

ఆత్మవత్ తృణవచ్చేదం సకలం కలయన్ జనః
కథముత్తమతామేతి మనో మన్మథమస్పృశన్. 18

మనుష్యుడు కామాది దుర్వృత్తులను స్పృశింపక, జగత్తును బాహ్యదృష్టితో తృణమువలెను, అంతర్ దృష్టితో ఆత్మవలెను జూచుచు పరమపదమందగల ఉపాయమేమి?

కం మహాపురుషం పారముపయాతం మహోదధేః
ఆచారేణానుసంస్మృత్య జనో యాతి న దుఃఖతామ్. 19

అజ్ఞాన సముద్రమును దాటిన ఏ మహాపురుషుని ఆచరణ ననుసరించిన, జనులు దుఃఖము నుండి తప్పించుకొనఁగలరు.

కింతత్ స్యాదుచితం శ్రేయః కింతత్ స్యాదుచితంఫలమ్
వర్తితవ్యంచ సంసారే కథం నామాసమంజసే. 20

నేననుసరింపఁదగిన శ్రేయమెద్ది? దానిఫలమెట్టిది? అసమంజసముతో గూడిన ఈ జగత్తున నెట్లు సంచరింపవలెను?

తత్త్వం కథయ మే కించిద్యేనాస్య జగతః ప్రభో
వేద్మి పూర్వాపరం ధాతుశ్చేష్టితస్యానవస్థితేః. 21

ప్రభో! బ్రహ్మ సృజించిన ఈ అశాశ్వత జగత్తుయొక్క పూర్వాపరములఁ దెలియఁగల తత్త్వోపదేశము నొనర్పుడు.

హృదయాకాశ శశినశ్చేతసో మలమార్జనమ్
యథా మే జాయతే బ్రహ్మం స్తథా నిర్విఘ్నమాచర. 22

హృదయాకాశమునందున్న చైతన్యచంద్రుని మచ్చతొలఁగి పోవు ఉపదేశమును శీఘ్రముగ [illegible]నొనర్పుడు.

కిమిహస్యాదుపాదేయం కింవా హేయ మథేతరత్
కథం విశ్రాంతి మాయాతు చేతశ్చపల మద్రివత్. 23

ఈ ప్రపంచమున గ్రాహ్యమెద్ది? త్యాజ్యమెద్ది? ఈ రెండును కానిదెద్ది? చంచల చిత్తమును పర్వతమువలె స్థిరమొనర్పుటెట్లు?

కేన పావనమంత్రేణ దుఃసంసృతివిషూచికా
శామ్యతీయ మనాయాస మాయాసశతకారిణీ. 24

లెక్కకుమించిన, బాధల గలిగించు ఈ సంసార విషూచివ్యాధి ఏ పావన మంత్రమువలన సుపశమించును?

కథం శీతలతామంతరానందతరుమంజరీం
పూర్ణచంద్ర ఇవాక్షీణాం భృశమాసాదయామ్యహమ్. 25

పూర్ణచంద్రునివలె నశింపనదియు, హృదయానందముకుళమును నగు, శీతలత్వమునెట్లందగలను?

ప్రాప్యాంతః పూర్ణతాం పూర్ణో నశోచామి యథాపునః
సంతో భవంతస్తత్వజ్ఞాస్తథేహోపదిశంతు మామ్. 26

మీరు తత్వజ్ఞులు అగుటంజేసి, నేను పూర్ణత్వమునుం బొంది మరల దుఃఖమునందకుండు ఉపదేశము నొసంగుడు.

అనుత్తమానందపద ప్రధానవిశ్రాంతి
రిక్తం సతతం మహాత్మన్
కదర్థయంతీహ భృశం వికల్పాః
శ్వానో వనే దేహమివాల్పజీవమ్. 27

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే వైరాగ్యప్రకరణే
ప్రయోజనకథనంనామ త్రింశత్తమః సర్గః ॥ 30 ॥

మహాత్మా! సర్వశ్రేష్ఠమగు ఆత్యంతిక విశ్రాంతి (మోక్షము) నందని వానిని, వాని చిత్తవృత్తు[illegible]ముగ కుక్క అల్పజీవులను పీడించునట్లు, పీడించును.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు వైరాగ్యప్రకరణమున
ప్రయోజనకథనమను త్రింశత్తమ సర్గము ॥ 30 ॥

---



## ఏకత్రింశత్తమః సర్గః.

శ్రీరామ ఉవాచ:—

ప్రోచ్చవృక్షచలత్ పత్ర లంబాంబులవభంగురే
ఆయుషీశానశీతాంశు కలామృదునిదేహకే. 1
కేదారవిరటద్భేక కంఠత్వక్కోణభంగురే
వాగురావలయే జంతోః సుహృత్ స్వజనసంగమే. 2
వాసనావాతవలితే కదాశాతడితి స్ఫుటే
మోహోగ్రమిహికామేఘే ఘనం స్ఫూర్జతి గర్జతి. 3
నృత్యత్యుత్తాండవం చండే లోలే లోభకలాపిని
సువికాసిని సాస్ఫోటే హ్యనర్థకుటజద్రుమే. 4
క్రూరే కృతాంతమార్జారే సర్వభూతాఖుహారిణి
అశ్రాంతస్యందసంచారే కుతోఽప్యుపరిపాతిని. 5
క ఉపాయో గతిః కా వా కా చింతా కః సమాశ్రయః
కేనేయమశుభోదర్కా న భవేజ్జీవితాటవీ. 6

ఆయువు, ఎత్తైన చెట్టున కదలు ఆకుకొననున్న నీటిబొట్టువలె, పడనున్నది; శరీరమున, శివుని నెలవంకవోలె కన్పించదు; పొలాల, అరచుచు చరించు కప్పల కంఠనాళచర్మమువలె అస్థిరము. జీవులకు, బంధుమిత్రుల సమాగమము ఉరిత్రాడు. కోర్కెలను గాలులు చుట్టుముట్టియున్నవి. దురాశయను మెఱుపు మెఱయుచున్నది. మోహమను మేఘములు పిడుగుల విడచుచు గర్జించుచున్నవి; లోభమను నెమళ్లు తాండవమొనరించుచున్నవి. అనర్థమను పూపొద కొన్నికొన్ని మొగ్గల విడచుచున్నది. క్రూరుడగు కృతాంతుడను పిల్లి జీవులను ఎలుకలను భక్షింప తొందరపడుచున్నది. జలప్రవాహమువలె జీవు లెటనుండియో అరుదెంచుచున్నారు; ఇట పతనమునకు వీలున్నది—ఇట్టి స్థితియందు నా ఉపాయమేమి? గతి ఏమి? దేనిని చింతింతును? దేనిని ఆశ్రయింతును? ఈ జీవితారణ్యమెట్లు శుభప్రదము కాగలదు?

నతదస్తి పృథివ్యాం వా దివి దేవేషు వా క్వచిత్
సుధియస్తుచ్ఛమప్యేతద్యన్నయంతి న రమ్యతామ్. 7

ఇటగాని, ద్యులోకమునంగాని, స్వర్గమునంగాని మిమ్ముబోలు మహాత్ముల ఇచ్ఛవలన రమణీయముగమారు తుచ్ఛపదార్థములేదు.

అయం హి దగ్ధసంసారో నీరంధ్రకలనాకులః
కథం సుస్వాదుతామేతి నీరసో మూఢతాం వినా. 8

నిరంతరము, పీడనుగల్గించు ఈపాడు సంసారము, మోహరహితమై, రుచికరమెట్లు కాగలదు?

ఆశాప్రతివిపాకేన క్షీరస్నానేన రమ్యతాం
ఉపైతి పుష్పశుభ్రేణ మధునేవ వసుంధరా. 9

పుష్పధవళితమగు వసంతసమయ పృథివివలె, సంతృప్తియను క్షీరస్నానమున సంసారము సుందరము కాగలదు.

అపమృష్టమలోదేతి శీతలేనామృతద్యుతిః
మనశ్చంద్రమసః కేన తేన కామకలంకితాత్. 10

కామకళంకితుఁడగు నామనశ్చంద్రు డేయుపాయము నవలంబించిన అమృతమయకళలతోఁ బ్రకాశింపఁ గలఁడు?

దృష్టసంసారగతినా దృష్టాదృష్టవినాశినా
కేనేవ వ్యవహర్తవ్యం సంసారవనవీథిషు. 11

ఐహికాముష్మిక ఫలాశలను వర్జించి, సంసారగతినిఁ గనుంగొనిన ఏమహాపురుషుని ననుసరించి, ఈ సంసారారణ్యమున, చరింతును?

రాగద్వేషమహారోగా భోగపూగా విభూతయః
కథం జంతుం న బాధంతే సంసారార్ణవచారిణమ్. 12

సంసారమందున్న మనుజుఁడు, ఏ మొనరించిన, రాగద్వేషాత్మకములగు భోగసర్పసమూహములు పీడింపకుండును?

కథంచ ధీరవర్యాగ్నౌ పతతాపి న దహ్యతే
పావకే పారదేనేవ రసేన రసశాలినా. 13

రసమయమగు పాదరస మగ్నిలోఁబడినను దహింపఁబడనట్లు, మనుజు డేయుపాయమున, సంసారాగ్నింబడియు, తపింపబడకుండనుండగలఁడు?

యస్మాత్కిల జగత్యస్మిన్ వ్యవహారక్రియాం వినా
న స్థితిః సంభవత్యబ్ధౌ పతితస్యాజలా యథా. 14

సముద్రమునఁబడిన నీరంటకుండ ఉండఁడు; అట్లే సంసారమునఁబడిన వ్యవహారము లంటకుండనుండవు.

రాగద్వేషవినిర్ముక్తా సుఖదుఃఖవివర్జితా
కృశానోర్దాహహీనేవ శిఖా నాస్తీహ సత్క్రియా. 15

కాల్చని అగ్నిజ్వాల లేనట్లు, రాగద్వేషములును, సుఖదుఃఖములును లేని సత్క్రియ ఈ జగత్తునలేదు.



మనోమననశాలిన్యాః సత్తాయా భువనత్రయే
క్షయో యుక్తిం వినా నాస్తి బ్రూత తామలముత్తమామ్. 16

ఈ జగత్తుయొక్క అస్తిత్వము మలినమగు మనస్సుపైననే ఆధారపడియున్నది; ఇది తత్త్వబోధవలనఁగాని క్షయమవదు. అందువలన నాకు తత్త్వబోధమూలకములగు వాక్యముల నుపదేశింపుడు.

వ్యవహారవతో యుక్త్యా దుఃఖం నాయాతి మే యయా
అథవా వ్యవహారస్య బ్రూత తాం యుక్తిముత్తమామ్. 17

కర్మనొనర్చినను, లేక ఒనర్పకపోయినను, దుఃఖము గలుగని ఉత్తమమగు యోగము నాకుపదేశింపుడు.

తత్కథం కేన వా కింవా కృతముత్తమచేతసా
పూర్వం యేనైతి విశ్రామం పరమం పావనం మనః. 18

ఎద్దాని నాచరించిన, మనస్సు పవిత్రమగునో, పరమశాంతి లభించునో, అద్దానిని పూర్వమెట్లు, ఎవరు, ఎందుల కొనరించిరో నాకుఁజెప్పుడు.

యథా జానాసి భగవంస్తథా మోహనివృత్తయే
బ్రూహి మే సాధవో యేన నూనం నిర్దుఃఖతాం గతాః. 19

భగవంతుడా! సాధుపురుషులెట్లు దుఃఖమునుండి విడివడిరి? — మీకుఁ దెలిసినట్లు వివరింపుడు.

అథవా తాదృశీ యుక్తిర్యది బ్రహ్మన్ నవిద్యతే
న వక్తి మమ వా కశ్చిద్విద్యమానామపి స్ఫుటమ్. 20

స్వయంచైవ న చాప్నోమి తాం విశ్రాంతి మనుత్తమామ్
తదహం త్యక్తసర్వేహో నిరహంకారతాం గతః. 21

న భోక్ష్యే న పిబామ్యంబు నాహం పరిదధేఽంబరమ్
కరోమి నాహం వ్యాపారం స్నానదానాశనాదికమ్. 22

మహాత్మా! ఇట్టి ఉపదేశవాక్యములు లేకపోయినను, ఉండినను, నాకెవరును వివరముగ దెలుపకపోయినను, తెలిపినను, శాంతి లభింపకపోయినను — నేను అన్నికోర్కెలను, అహంకారమును పరిత్యజింతును. భుజింపను, త్రాగను, వస్త్రముల ధరింపను, స్నానాదికార్యముల నొనర్పను.

నచ తిష్ఠామి కార్యేషు సంపత్స్వాపద్దశాసుచ
న కించిదపి వాంఛామి దేహత్యాగాదృతే మునే. 23

మునీంద్రా! ఆపదలురానీ, సంపదలురానీ, కార్యముల నొనర్పను; శరీరత్యాగముకంటె ఇతర మొండు కోరను.

కేవలం విగతాశంకో నిర్మమో గతమత్సరః
మౌన ఏవేహ తిష్ఠామి లిపికర్మస్వివార్పితః. 24

అహంకారము, సందేహము, అసూయ — వీటిని పరిత్యజించి, మౌనమును వహించి బొమ్మవలె కూర్చుందును.

అథ క్రమేణ సంత్యజ్య ప్రశ్వాసోచ్ఛ్వాససంవిదః
సంనివేశం త్యజామీమమనర్థం దేహనామకమ్. 25

అనంతరము, క్రమముగ, శ్వాసలను జ్ఞానమును వదలి, ఈ అనర్థదేహమును త్యజింతును.

నాహమస్య నమే నాన్యః శామ్యామ్యస్నేహదీపవత్
సర్వమేవ పరిత్యజ్య త్యజామీదం కలేవరమ్. 26

ఈ దేహము నాదికాదు; నేను దేహమునుకాను. ఇతరదేహులు నావారుకారు. అన్నిటిని పరిత్యజించి, చమురులేని దీపమువలె ఆరిపోయెదను — ఈ శరీరమును త్యజింతును.

శ్రీ వాల్మీకి రువాచ:—

ఇత్యుక్తవానమల శీతకరాభిరామో
రామో మహత్తరవిచారవికాసిచేతాః
తూష్ణీం బభూవ పురతో మహతాం ఘనానాం
కేకారవం శ్రమవశాదివ నీలకంఠః. 27

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే వైరాగ్యప్రకరణే
రాఘవప్రశ్నోనామ ఏకత్రింశత్తమః సర్గః ॥ 31 ॥

వాల్మీకి:- నిర్మలచంద్రునివలె శోభిల్లు శ్రీరామచంద్రుడు, వివేకవికసితమనస్కుడై, పైవిధముగా మహాత్ములతో బల్కి, మేఘముల ఎదుట కేకలిడి అలసి విశ్రాంతినందగోరు మయూరమువలె, మౌనమును వహించెను.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు వైరాగ్యప్రకరణమున
రాఘవప్రశ్నయను ఏకత్రింశత్తమ సర్గము ॥ 31 ॥





## ద్వాత్రింశత్తమః సర్గః.

శ్రీ వాల్మీకిరువాచ:—

వదత్యేవం మనోమోహ వినివృత్తికరం వచః
రామే రాజీవపత్రాక్షే తస్మిన్ రాజకుమారకే. 1
సర్వే బభూవుస్తత్రస్థా విస్మయోత్ఫుల్లలోచనాః
భిన్నాంబరా దేహరుహైః గిరశ్శ్రోతుమివోద్ధురైః. 2

వాల్మీకి:- కమలలోచనుడగు రాముడిట్లు మనోమోహమును నశింపజేయు వాక్యముల బల్కుచుండగా, అటనున్నవారందరు ఆశ్చర్యోత్ఫుల్లనేత్రులైరి. ఆవాక్యముల నన్నిటిని విన, వారిరోమములు వస్త్రముల భిన్న మొనర్చినవో యనునట్లుండెను (అనగా, వారావాక్యములను విని, పులకిత శరీరులైరని భావార్థము.)

విరాగవాసనాపాస్త సమస్తభవవాసనాః
ముహూర్తమమృతాంభోధి వీచీవిలులితా ఇవ. 3

వైరాగ్యవాసనవలన వారి సంసారవాసనలు నశించెను; వారాముహూర్తమున అమృతసాగర వీచికలం దేలియాడిరి.

తా గిరో రామభద్రస్య తస్య చిత్రార్పితైరివ
సంశ్రుతాః శృణ్వద్భిరంత రానందపదపీవరైః. 4

శ్రవణ కుశలురగు వారందరును ఆనందమును గన్పరచుచు, బొమ్మలువోలె, శ్రీరాముని వాక్యముల నాకర్ణించిరి.

వసిష్ఠవిశ్వామిత్రాద్యైర్మునిభిః సంసది స్థితైః
జయంతధృష్టి ప్రముఖైర్మంత్రిభిర్మంత్రకోవిదైః. 5
నృపైర్దశరథప్రఖ్యైః పౌరైః పారశవాదిభిః.
సామంతై రాజపుత్రైశ్చ బ్రాహ్మణైర్బ్రహ్మవాదిభిః. 6
తథాభృత్యైరమాత్యైశ్చ పంజరస్థైశ్చ పక్షిభిః.
క్రీడామృగైర్గతస్పందైస్తురంగైస్త్యక్తచర్వణైః. 7
కౌసల్యాప్రముఖైశ్చైవ నిజవాతాయనస్థితైః
సంశాంతభూషణారావై రస్పందైర్వనితాగణైః 8
ఉద్యానవల్లీనిలయై ర్విటంకనిలయైరపి
అక్షుబ్ధపక్షతతిభిర్విహంగై ర్విరతారవైః. 9
సిద్ధైర్నభశ్చరైశ్చైవ తథా గంధర్వకిన్నరైః
నారదవ్యాసపులహ ప్రముఖైర్ముని పుంగవైః. 10

అన్యైశ్చ దేవదేవేశ విద్యాధర మహోరగైః
రామస్య తా విచిత్రార్థా మహోదారాగిరః శ్రుతాః. 11

సభయందున్న వసిష్ఠ విశ్వామిత్రాది మహర్షులును, మంత్రకుశలులగు జయంతాది మంత్రులును, దశరథుఁడును, పౌరశవాది పౌరులును, సామంతులును, రాజపుత్రులును, వేదవిదులగు బ్రాహ్మణులును, భృత్యులును, అమాత్యులును, పంజరముననున్న పక్షులును, శ్రీరాముని వాక్యముల నాకర్ణింప దొడంగిరి. క్రీడామృగములు నిస్తబ్ధములైయు, గుఱ్ఱములు నెమరుమానియు, కౌసల్యాది వనితలు అలంకారముల శబ్దముల నొనర్పకుండ తమతమ వాతాయనముల గూర్చొనియు శ్రీరాముని వాక్యముల వినదొడఁగిరి. పూపొదలందునను, సౌధాగ్రముననున్న పక్షులు కలరవమొనర్పకుండ రెక్కల నల్లార్పకుండ, శ్రీరాముని వాక్యముల వినసాగెను. సిద్ధగంధర్వకిన్నరాది ఆకాశచారులును, నారదవ్యాసపులహాది మునులును, తదితరులగు సురాసుర విద్యాధరగణములును; రాముని విచిత్రార్థపూర్ణఔదార్య వాక్యముల వినిరి.

అథతూష్ణీం స్థితవతి రామే రాజీవలోచనే
తస్మిన్ రఘుకులాకాశ శశాంకే శశిసుందరే. 12
సాధువాదగిరా సార్థం సిద్ధసార్థసమీరితా
వితానకసమా వ్యోమ్నః పౌష్పీవృష్టిః పపాతహ. 13

శశిసుందరుఁడును, రఘుకులాకాశ శశియు, పద్మనేత్రుఁడునునగు రామచంద్రుఁడు, ఊరకుండ సిద్ధపురుషులు పొగడి, పుష్పవర్షమును గురిపించిరి; అప్పుడాపుష్పములు వితానము (చాందినీ) వలె గన్పట్టెను.

మందారకోశ విశ్రాంత భ్రమరద్వంద్వనాదినీ
మధురామోద సౌందర్య ముదితోన్మదమానవా. 14
వ్యోమవాతవినున్నేవ తారకాణాం పరంపరా
పతితేవ ధరాపేఠే స్వర్గస్త్రీహసితచ్ఛటా 15
వృష్యమూక కచన్మేఘలవావలిరివ చ్యుతా
హైయంగవీన పిండానామీరితేవ పరంపరా. 16
హిమవృష్టిరివోదారా ముక్తాహారచయోపమా
ఐందవీరశ్మిమాలేవ క్షీరోర్మీణామివాతతిః. 17
కింజల్కాంభోజవలితా భ్రమద్భృంగకదంబకా
సీత్కారగాయదామోది మధురానిలలోలితా. 18
ప్రభ్రమత్ కేతకీవ్యూహా ప్రస్ఫురత్ కైరవోత్కరా
ప్రపతత్ కుందవలయా చలత్ కువలయాలయా, 19
ఆపూరితాంగణరసా గృహాచ్ఛాదనచత్వరా
ఉద్గ్రీవపురవాస్తవ్య నరనారీ విలోకితా. 20



నిరభ్రోత్పల సంకాశవ్యోమ వృష్టిరనాకులా
అదృష్టపూర్వాసర్వస్య జనస్య జనితస్మయా. 21
అదృశ్యాంబర సిద్ధౌఘ కరోత్కర సమీరితా
సా ముహూర్తచతుర్భాగం పుష్పవృష్టిః పపాతహ. 22

ఆకాశమున కనంబడకుండ నుండిన ఆసిద్ధులు అరగంటకాలము, పుష్పవర్షమును గురిపించిరి. అప్పుడు, మందారకుసుమముల నిద్రించు తుమ్మెదలజంట (క్రిందపడుటవలన) నాదమొనర్చెను; మానవులా మధురసౌరభమున ఆనందపరవశులైరి. వాయువు నక్షత్రమండలమును భూతలమున బడవేసినట్లును, దేవతాస్త్రీల హాసకాంతి క్రిందబడినట్లును, బంగారుముద్దలు వెదజల్లబడినట్లును, ముత్యములఁబోలు వడగళ్లుపడినట్లును, చంద్రకిరణములో లేక పాలకడలి, తరగలో విస్తరించినట్లును, ఆ పుష్పవర్షమును జూచినవారికి తోచెను. కేసరములతో గదలుచున్న పద్మములతోడను, వికసించు కలువలతోడను, పడుచున్న కుందము (మొల్ల) లతోడను, కదలుచున్న కైరవములతోడను, ఆపుష్పవృష్టి శోభిల్లెను. తుమ్మెదలు నలువైపుల తిరుగసాగెను, మధురవాయువు పూలను గదల్పసాగెను. నీలకమలకాంతిగల గగనమునుండి కురిసిన పూలవానతో, ముంగిలి, పైకప్పు, నిండిపోయెను. నగరవాసులగు స్త్రీపురుషులచ్చెరువుతో బరికింపసాగిరి; ఇట్టివిషయ మభూతమైనందు వలన విస్మితులుగాదొడంగిరి.

ఆపూరిత సభాలోకే శాంతే కుసుమవర్షణే
ఇమం సిద్ధగణాలాపం శుశ్రువుస్తే సభాగతాః. 23

సభాసదులును, మంటపమును, పూలతో కప్పఁబడిరి. పుష్పవృష్టి ఆగినపిమ్మట సిద్ధులిట్లను కొను చుండుట సభాసదులువినిరి.

ఆకల్పం సిద్ధసేనాసు భ్రమద్భిరభితో దివమ్
అపూర్వమిదమస్మాభిః శ్రుతం శ్రుతిరసాయనమ్. 24
యదనేన కిలోదార ముక్తం రఘుకులేందునా
వీతరాగతయా తద్ధి వాక్పతేరప్యగోచరమ్. 25
అహోబత మహత్ పుణ్యమద్యాస్మాభిరిదం శ్రుతమ్
వచోరామముఖోద్భూతం మహాహ్లాదకరంధియః. 26

కల్పారంభమునుండి స్వర్గమున, సిద్ధులమగు మనము తిరుగాడుచున్నాము, కానినేఁడు విన్న వాగమృతము నింతకు మునుపు వినలేదు. వైరాగ్యముతో, రఘుకులచంద్రుఁడు పల్కినమహావాక్యముల బృహస్పతికూడ ఎఱుంగఁడు. ఆహా! నేఁడుకదా, మనము హృదయానందకరములగు శ్రీరాముని వాక్యముల వింటిమి.

ఉపశమామృత సుందరమాదరా
దధిగతోత్తమతాపదమేవ యత్

కథితవానుచితం రఘునందనః
సపది తేన వయం ప్రతిబోధితాః. 27

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే వైరాగ్యప్రకరణే
నభశ్చరసాధువాదో నామ ద్వాత్రింశత్తమ సర్గః ॥ 32 ॥

శ్రీరాముడు పల్కిన, శాంత్యమృతదాయకములగు వాక్యములవలన మనము ద్బోధింపఁబడితిమి.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు వైరాగ్యప్రకరణమున
నభశ్చరసాధువాదమను ద్వాత్రింశత్తమ సర్గము ॥ 32 ॥



## త్రయస్త్రింశః సర్గః

---

**సిద్ధా ఊచుః__**

పావనస్యాస్య వచసః ప్రోక్తస్య రఘుకేతునా
నిర్ణయం శ్రోతుముచితం వక్ష్యమాణం మహర్షిభిః. 1

సిద్ధులు:_రాఘవుడు పల్కినపవిత్రవచనములకు మహర్షులేమి ప్రత్యుత్తరింతురో వినదలతుము.

నారదవ్యాస పులహప్రముఖా మునిపుంగవాః,
ఆగచ్ఛతాశ్వవిఘ్నేన సర్వఏవ మహర్షయః 2

నారదవ్యాస పులహాది మునిపుంగవులును, తదితరులును నిర్విఘ్నముగా రండు!

పతామః పరితః పుణ్యామేతాం దాశరథీం సభామ్
నీరంధ్రాం కనకోద్ద్యోతాం పద్మినీమివ షట్పదాః. 3

తుమ్మెదలు బంగారు వెలుగుల రంగారు కేసరముల దాపిల్లు, పద్మము నాశ్రయించునట్లు మనముకూడ, కనకదీప్తులనీను దశరథుని సభనాశ్రయింతము.

**శ్రీ వాల్మీకిరువాచ:__**

ఇత్యుక్త్వా సా సమస్తైవ వ్యోమవాసనివాసినీ
తాం పపాత సభాం తత్ర దివ్యా మునిపరంపరా. 4



అగ్రస్థితమనుత్సృష్ట రణద్వీణాం మునీశ్వరమ్
పయః పీనఘనశ్యామం వ్యాసమేవ కిలాంతరా. 5
భృగ్వంగిరః పులస్త్యాది మునినాయక మండితా
చ్యవనోద్దాలకోశీర శరలోమాది మాలితా. 6
పరస్పరపరామర్శ దుఃసంస్థానమృగాజినా
లోలాక్షమాలావలయా సుకమండలుధారిణీ. 7
తారావలిరివ వ్యోమ్ని తేజఃప్రసరపాటలా
సూర్యావలిరివాన్యోన్యం భాసితాననమండనా. 8
రత్నావలిరివాన్యోన్యం నానావర్ణకృతాంగికా
ముక్తావలిరివాన్యోన్యం కృతశోభాతిశాయినీ. 9
కౌముదీవృష్టిరన్యేవ ద్వితీయేవార్కమండలీ
సంభృతేవాతికాలేన పూర్ణచంద్రపరంపరా. 10
తారాజాల ఇవాంభోదో వ్యాసో యత్ర విరాజతే
తారౌఘ ఇవ శీతాంశు ర్నారదోఽత్ర విరాజతే. 11
దేవేష్వివ సురాధీశః పులస్త్యోఽత్ర విరాజతే
ఆదిత్యఇవ దేవానామంగిరాస్తు విరాజతే. 12

వినూనసులగు మునులిట్లుపలికి ఆసభకరుదెంచిరి. ఆమునిమండలి మొట్టమొదట వీణనుమీటు నారదుఁడుండెను. తరువాత, నీలమేఘశ్యాముడగు వ్యాసుడుండెను. మధ్య, భృగువు, అంగిరసుఁడు, పులస్త్యుఁడు, చ్యవనుఁడు, ఉద్దాలకుఁడు, ఉశీరుఁడు, శరలోముఁడు__ఇత్యాది ఋషులుండిరి. ఒకరినొకరు త్రోసికొనుటవలన వారి కృష్ణాజినములు చెదరెను. వారి జపమాలలు కదలుచుండెను. వారి హస్తముల ప్రశస్తములగు కమండలము లుండెను. తేజోతిశయమున వారాకాశమునందలి నక్షత్రములవలె మెరయుచుండిరి; ప్రకాశించు వదనములతో సూర్యులవలె గన్పట్టుచుండిరి. వారు, రత్నసమూహములవలె నానావర్ణములతోడనుండిరి. ముత్యములవలె శోభిల్లుచుండిరి. వారిరాకవలన ఇంకొక వెన్నెలవాన ఇంకొక సూర్యమండలము,వచ్చినట్లుండెను; ఒకేచోట అనేకములగు పూర్ణచంద్రమండలములు కూడినట్లుండెను. వ్యాసుడున్నచోటు, నక్షత్రమండల సమీపముననున్న మేఘమువలెను, నారదుడున్నచోటు నక్షత్రసమీపముననున్న చంద్రమండలమువలెనుఁ బ్రకాశించెను. మునులనడుమ, పులస్త్యుడు దేవతల నడుమనున్న ఇంద్రునివలెను, అంగిరసుఁడు దేవతలనడుమనున్న సూర్యునివలెను బ్రకాశించిరి.

అథాస్యాం సిద్ధసేనాయాం పతంత్యాం నభసో రసామ్
ఉత్తస్థౌ మునిసంపూర్ణా తదా దాశరథీ సభా. 13
మిశ్రీభూతా విరేజుస్తే నభశ్చరమహీచరాః
పరస్పరవృతాంగాభా భాసయంతో దిశో దశ. 14

అనంతరము, సిద్ధసమూహము భూమికిదిగుచుండ, దశరథుని సభయందున్న మునులు లేచి నిలంబడిరి. అప్పుడా ఖేచరభూచరులు కలసి, ఒండొరుల కప్పివెట్టు కాంతులతో దిఙ్మండలమును [illegible] చేసిరి

వేణుదండావృతకరా లీలాకమలధారిణః
దుర్వాంకురాక్రాంతశిఖాః సచూడామణిమూర్ధజాః. 15
జటాజూటైశ్చ కపిలా మాలిమాలిత మస్తకాః
ప్రకోష్ఠగాక్షవలయా మల్లికావలయాన్వితాః. 16
చీరవల్కల సంవీతాః ప్రసక్తా క్షౌమావగుంఠితాః
విలోలమేఖలాపాశా శ్చలన్ముక్తా కలాపినః. 17
వసిష్ఠవిశ్వామిత్రౌ తాన్ పూజయామాసతుః క్రమాత్
అర్ఘ్యైః పాద్యై ర్వచోభిశ్చ సర్వానేవ నభశ్చరాన్ 18

వారిహస్తముల వేణుదండములును, పద్మములునునుండెను. వారిశిఖల దూర్వాంకురములును, శిరముల చూడామణులును శోభిల్లుచుండెను. వారి జటాజూటములు కపిలములు; మస్తకముల మాలలుచుట్టబడియుండెను. అక్షమాలలను, మల్లికామాలలను ధరించియుండిరి. వారు నారబట్టలను గట్టుకొనియుండిరి. వారిమొలత్రాడులు, ముత్యాలమాలలు కదలుచుండెను. ఇట్టిసిద్ధులను వసిష్ఠ విశ్వామిత్రులు, అర్ఘ్యపాద్యములతోడను, మధురవాక్యములతోడను బూజించిరి.

వసిష్ఠవిశ్వామిత్రౌ తే పూజయామాసురాదరాత్
అర్ఘ్యైః పాద్యైర్వచోభిశ్చ నభశ్చరమహాగణాః. 19

సిద్ధులుగూడ, అర్ఘ్యపాద్యములతోడను, మధురవాక్యములతోడను, వసిష్ఠ విశ్వామిత్రుల పూజించిరి.

సర్వాదరేణ సిద్ధౌఘం పూజయామాస భూపతిః
సిద్ధౌఘో భూపతిం చైవ కుశలప్రశ్నవార్తయా. 20

దశరథుడుకూడ సిద్ధులను మిక్కుటమగు ఆదరముతో బూజించెను; సిద్ధులును దశరథుని కుశలప్రశ్నలతోడను; తత్కాలోచిత కార్యములతోడను, తృప్తినొనరించిరి.

తైస్తైః ప్రణయసంరంభై రన్యోన్యం ప్రాప్తసత్క్రియాః
ఉపావిశన్ విష్టరేషు నభశ్చరమహీచరాః. 21

ఇట్లు, వారందరు పరస్పరము సత్కరించుకొని ఆసనముల గూర్చుండిరి.

వచోభిః పుష్పవర్షేణ సాధువాదేన చాభితః
రామం తే పూజయామాసుః పురఃప్రణతమాస్థితమ్. 22

చేతులుజోడించి ఎదుటనిలంబడిన రాముని, మధురవాక్యములతోడను, పుష్పవర్షముతోడను, ప్రశంసతోడను, సిద్ధులు సన్మానించిరి.

ఆసాంచక్రేచ తత్రాసౌ రాజ్యలక్ష్మ్యా విరాజితః
విశ్వామిత్రో వసిష్ఠశ్చ వామదేవోఽథ మంత్రిణః. 23



నారదో దేవపుత్రశ్చ వ్యాసశ్చ మునిపుంగవః
మరీచిరథదుర్వాసా మునిరాంగిరసస్తథా. 24
క్రతుః పులస్త్యః పులహః శరలోమా మునీశ్వరః
వాత్స్యాయనో భరద్వాజో వాల్మీకిర్మునిపుంగవః. 25
ఉద్దాలకో ఋచీకశ్చ శర్యాతిశ్చ్యవనస్తథా. 26
ఏతే చాన్యేచ బహవో వేద వేదాంగపారగాః
జ్ఞాతజ్ఞేయా మహాత్మాన ఆస్థితాస్తత్ర నాయకాః. 27

రాజ్యలక్ష్మితో శోభిల్లు రాముడు వారి అనుమతితో గూర్చుండెను. విశ్వామిత్రుడు, వసిష్ఠుడు, వామదేవుడు, మంత్రులు, నారదుడు, దేవపుత్రులు, వ్యాసుడు, మరీచి, దుర్వాసుడు, అంగీరసుడు, క్రతువు, పులహుడు, శరలోముడు, వాత్స్యాయనుడు, భరద్వాజుడు, వాల్మీకి, ఉద్దాలకుడు, ఋచీకుడు, శర్యాతి, చ్యవనుడు, అను మునులును, వేదవేదాంగ పారగులగు తత్వజ్ఞశ్రేష్ఠులును నచ్చట ఉపవిష్టులైరి.

వసిష్ఠవిశ్వామిత్రాభ్యాం సహ తే నారదాదయః
ఇదమూచురనూచానా రామమానమితాననమ్. 28

నారదాదులును, వసిష్ఠ విశ్వామిత్రాదులును, నతశిరుడైన రామునుద్దేశించి యిట్లనిరి.

అహోబత కుమారేణ కల్యాణగుణశాలినీ
వాగుక్తా పరమోదారా వైరాగ్యరసగర్భిణీ. 29

కుమారుడగు రాముడు వైరాగ్యపూర్ణములును, ఉదారములును శుభప్రదములునునగు వాక్యలనుడివినాడు.

పరినిష్ఠితవక్తవ్యం సబోధముచితం స్ఫుటమ్
ఉదారం ప్రియమార్యార్హ మవిహ్వాలమపిస్ఫుటమ్. 30
అభివ్యక్తపదం స్పష్టమిష్టం స్పష్టంచ తుష్టిమత్
కరోతి రాఘవప్రోక్తం వచః కస్య న విస్మయమ్. 31

ఈ వాక్యములన్నియు, విచారయుతములును, జ్ఞానబోధములును, స్పష్టములును, ఉదారములును, ప్రియకరములును, ఆర్యోచితములును, స్థిరములును, సుబోధకములును, విశుద్ధములును, స్పష్టోచ్చరితములును, సంతోషదాయకములును, నైయున్నవి; వీటినివిని యొవరచ్చెరువందకుండ నుండగలరు.

శతాదేకతమస్యైవ సర్వోదారచమత్కృతిః
ఈప్సితార్థార్పణైకాంతదక్షా భవతి భారతీ. 32

నూటికొక్కని పలుకులు సర్వోత్కృష్టములును, సుందరములును, సువ్యక్తములునునై

కుమార త్వాం వినా కస్య వివేకఫలశాలినీ
వరం వికాసమాయాతి ప్రజ్ఞా శరలతాతతా. 33

కుమారా! ప్రజ్ఞారూపిణియు, వివేకఫలసమన్వితయునగు శరవల్లి (బాణపుతీగె) ఇంకవరి యందిట్లు వికసింపగలదు?

ప్రజ్ఞాదీపశిఖా యస్య రామస్యేవ హృది స్థితా
ప్రజ్వలత్యసమాలోకకారిణీ స పుమాన్ స్మృతః. 34

అసమానకాంతుల దీపిల్లు ప్రజ్ఞాదీపము, రాముని హృదయమున వెలుఁగునట్లెవనియందు ప్రకాశించుచుండునో అతఁడేపురుషుఁడు.

రక్తమాంసాస్థి యంత్రాణి బహూన్యతితరాణిచ
పదార్థానభికర్షంతి నాస్తి తేషు సచేతనః. 35

పెక్కండ్రు, రక్తమాంసాస్థిమయ యంత్రములు; విషయలోలురు. ప్రజ్ఞాదీప్తుఁడగు పురుషుఁడు వీరిలోలేడు. వీరి ఆత్మజడము; వీరు పురుషార్థముకొఱకు యత్నించుచుండుటలేదు.

జన్మమృత్యుజరాదుఃఖ మనుయాంతి పునఃపునః
విమృశంతి న సంసారం పశవః పరిమోహితాః. 36

ఈ పశువులందరును మరలమరల జన్మమరణ జరాదుఃఖముల, మాటిమాటికి కూలుచుందురు. మోహవశులై సంసారమున నేమియో విమర్శింపరు.

కథంచిత్ క్వచిదేవైకో దృశ్యతే విమలాశయః
పూర్వాపరవిచారార్హో యథాయమరిమర్దనః. 37

ఎక్కడనో, ఎట్లో, పూర్వాపరవిచారమును సల్పు నిర్మలాశయుఁడగు, పురుషుఁడొక డీరామునివలె గన్పట్టుచుండును.

అనుత్తమచమత్కారఫలాః సుభగమూర్తయః
భవ్యాహి విరలా లోకే సహకారద్రుమా ఇవ. 38

సుఫలములును, సుందరములునునగు రసాలతరువులరుదైనట్లు, తత్త్వసాక్షాత్కారమును బడయుపురుషులరుదు.

సమ్యగ్దృష్ట జగద్యాత్రా స్వవివేకచమత్కృతిః
అస్మిన్ మాన్యమతావంతరియముద్యైవ దృశ్యతే. 39

మాన్యుడును, మనీషియునగు శ్రీరాము డీచిఱుతవయస్సుననే ఆత్మవివేక మాధుర్యము ననుభవమునకుఁ దెచ్చుకొనినాడు; జగత్స్వరూపమునుగూడ చక్కగ దెలిసికొనినాడు.

సుభగాః సులభారోహాః ఫలపల్లవశాలినః
జాయంతే తరవో దేశే నతు చందనపాదపాః. 40

చూడ చక్కనగునవియు, ఏపుగా నెదిగి, ఆకులతోను, పూవులతోను, పండ్లతో నిండినవియు నగు చెట్లు ఎల్లయెడల గాంచనగును గాని, చందనతరువులు దొఱుకవు.



వృక్షాః ప్రతివనం సంతి నిత్యం సఫలపల్లవాః
నత్వపూర్వచమత్కారో లవంగః సులభః సదా. 41

ప్రతివనమునను, ఫలపల్లవయుతములగు చెట్లు, ఎల్లప్పుడును దొరకునుగాని, లవంగతీగె దొఱుకదు.

జ్యోత్స్నేవ శీతాశశినః సుతరోరివ మంజరీ
పుష్పాదామోదలేఖేవ దృష్టా రామాచ్చమత్కృతిః. 42

చంద్రుని చల్లని వెన్నెలవలె, ఉత్తమవృక్షముల పూలగుత్తివలె, పుష్పములనుండి సెత్తావి వలె, రామునినుండి మహద్వాణిని వింటిమి.

అస్మిన్నుద్దామదౌరాత్మ్య దైవనిర్మాణ నిర్మితే
ద్విజేంద్రా దగ్ధసంసారే సారోహ్యత్యంతదుర్లభః. 43

ద్విజేంద్రులారా! అతిక్రూరమగు దైవసృష్టియగు, ఈ పాడుసంసారమున సారములభింప జేసికొనుట, చాలకష్టము.

యతంతే సారసంప్రాప్త్యై యే యశోనిధయో ధియః
ధన్యా ధురి సతాం గణ్యాస్తఏవ పురుషోత్తమాః. 44

ఏయశోనిధులు సారమును (ఆత్మను) బొంద యత్నించుచున్నారో, వారు ధన్యులు; వారే గణ్యులగు పురుషోత్తములు.

న రామేణ సమోస్తీహ దృష్టో లోకేషు కశ్చన
వివేకవానుదారాత్మా న భావీ చేతి నో మతిః. 45

పరిదృశ్యమానములగు ఈ లోకముల రామునిబోలు వివేకి, ఉదారాత్మ లేడు, ఉండబోడు. ఇదిమానిశ్చయము.

సకలలోక చమత్కృతికారిణో
ఒప్యభిమతం యది రాఘవచేతసః
ఫలతి నో తదిమే వయమేవ హి
స్ఫుటతరం మునయో హతబుద్ధయః. 46

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే ద్వాత్రింశత్ సాహస్ర్యాం సంహితాయాం, వైరాగ్యప్రకరణే నభశ్చరమహీచర సమ్మేలనం నామ త్రయస్త్రింశః సర్గః ॥ 33 ॥

---

వైరాగ్యప్రకరణం సంపూర్ణం.

లోకములన్నిటిని ఆశ్చర్యపడజేయు రాముని అభిమతము సిద్ధింపనిచో, మునినామధారులమగు, మాబుద్ధివ్యర్థము! (అనగా, రామునికి అతడు కోరు తత్త్వమును దప్పక ఉపదేశింపవలయు నని భావార్థము).

ఇది శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య జగద్గురు శ్రీరామకృష్ణదేవ
ప్రశిష్య శ్రీశివానంద పురీపూజ్యపాదశిష్య, శ్రీపూర్ణానందకృత
శ్రీ (యోగ) వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయను ఆంధ్రాను
వాదమున వైరాగ్యప్రకరణమున నభశ్చర మహీచర
సమ్మేళనమను త్రయస్త్రింశ సర్గము. ‖ 33 ‖

————:0:————

వైరాగ్యప్రకరణము సంపూర్ణము.

———

యదక్షరపదభ్రష్టం మాత్రాహీనంతు యద్భవేత్
తత్సర్వం క్షమ్యతాం దేవ నారాయణ నమోస్తు తే.



# వాసిష్ఠ మహారామాయణమ్

———

## ముముక్షు వ్యవహార ప్రకరణమ్.

———

### ప్రథమః సర్గః.

శ్రీ వాల్మీకిరువాచః—

ఇతినాదేన మహతా వచస్యుక్తే సభాగతైః
రామమగ్రగతం ప్రీత్యా విశ్వామిత్రోఽభ్యభాషత. 1

వాల్మీకి:— సభకరుదెంచిన జనులందరు అట్లు (పూర్వప్రకరణమున వర్ణింపఁబడినట్లు) ఉచ్చస్వరమునఁబల్కఁగ, విశ్వామిత్రుఁడెట్టెదుటనున్న రామునితో నిట్లనియె.

న రాఘవ తవాస్త్యన్యజ్జ్ఞేయం జ్ఞానవతాంవర
స్వయైవ సూక్ష్మయా బుద్ధ్యా సర్వం విజ్ఞాతవానసి. 2

రాఘవా! జ్ఞానివరా! నీ వెఱుఁగదగిన దింకేమియు లేదు; సూక్ష్మబుద్ధియొక్క బలమువలననే ఎఱుంగవలసినదాని నంతటిని, కొదువలేకుండ ఎఱిఁగితివి.

కేవలం మార్జనామాత్రం మనాగేవోపయుజ్యతే
స్వభావవిమలే నిత్యం స్వబుద్ధిముకురే తవ. 3

కాని, సహజనిర్మలమగు నీబుద్ధిరూప దర్పణమున కొంచెం మెఱుగు కావలసియున్నది.

భగవద్వ్యాసపుత్రస్య శుకస్యేవ మతిస్తవ
విశ్రాంతిమాత్రమేవాంత ర్జ్ఞాతజ్ఞేయాప్యపేక్షతే. 4

వ్యాసపుత్రుడగు శుకునిబుద్ధివలె, నీ బుద్ధిగూడ జ్ఞాతవ్యవిషయమును గ్రహించియు, అంత శ్శాంతినిమాత్రమే గోరుచున్నది.

శ్రీ రామ ఉవాచః—

భగవద్వ్యాసపుత్రస్య శుకస్య భగవన్ కథమ్
జ్ఞేయేఽప్యాదౌ న విశ్రాంతం విశ్రాంతంచ ధియా పునః. 5

శ్రీరాముఁడు:— వేదవ్యాసపుత్రుడగు శుకుఁడు, విచారబుద్ధివలన జ్ఞానమునుఁబడసియు, తొలుమొదట శాంతినందక, పిదప ఎట్లు శాంతినిఁ బడయగలిగెను?

శ్రీ విశ్వామిత్ర ఉవాచ:—

ఆత్మోదంతసమం రామ కథ్యమానమిదం మయా
శృణు వ్యాసాత్మజోదంతం జన్మనామంతకారణమ్. 6

విశ్వామిత్రుడు:— రామా! శుకదేవుని వృత్తాంతమును చెప్పుచున్నాను వినుము. స్వవృత్తాంతమువలె, నిదియు మోక్షదాయకము.

యోఽయమంజనశైలాభో నివిష్టో హేమవిష్టరే
పార్శ్వే తవ పితుర్వ్యాసో భగవాన్ భాస్కరద్యుతిః. 7
అస్యాభూదిందువదన స్తనయో నయకోవిదః
శుకోనామ మహాప్రాజ్ఞో యజ్ఞోమూర్త్యేవ సుస్థితః. 8

నీ తండ్రిప్రక్కన బంగారు గద్దెయందున్న యతడే వ్యాసుఁడు; ఈతడంజనాచలమువంటి కాంతిగలిగియున్నాడు. సూర్యసమ తేజస్వి. చంద్రవదనుఁడును, శాస్త్రజ్ఞుడును, ప్రాజ్ఞుడునునగు శుకుఁడీతని పుత్రుడు; అతడు రూపుదాల్చిన యజ్ఞము.

ప్రవిచారయతో లోకయాత్రామల మిమాం హృది
తవేవ కిల తస్యాపి వివేక ఉదభూదయమ్. 9

సంసారగతిని, దాని మాలిన్యమును, చింతించుటవలన, ఆయనకు నీవలెనే మనస్సున వివేకముదయించెను.

తేనాసౌ స్వవివేకేన స్వయమేవ మహామనాః
ప్రవిచార్య చిరంచారు యత్ సత్యం తదవాప్తవాన్. 10

బుద్ధిమంతుఁడగు శుకదేవుఁడు, నిజబుద్ధిబలమున, చాలాకాలము విచారించి, ప్రకృతమును సుందరమును, సత్యమును, నగుదానిని బొందెను.

స్వయం ప్రాప్తే పరే వస్తున్యవిశ్రాంతమనాః స్థితః
ఇదం వస్త్వితి విశ్వాసం నాసావాత్మన్యుపాయయౌ. 11

తనంతటదానే సత్యవస్తువుఁబడసినను, ఆయనమనస్సు శాంతినందలేదు; 'ఇదియే సత్యవస్తువు'—అను విశ్వాసమును ఆతని హృదయము కలిగించుకొనలేక పోయెను.

కేవలం విరరామాస్య చేతో విగతచాపలమ్
భోగేభ్యో భూరిభంగేభ్యో ధారాభ్య ఇవ చాతకః. 12

చాతకము తరంగలోలమగు నదీజలములనుండి నివృత్తమగునట్లు, శుకుని సుస్థిరచిత్తము గూడ, క్షణభంగురములగు విషయములనుండి విరతినందెను.

ఏకదా సోఽమలప్రజ్ఞో మేరావేకాంతసుస్థితమ్
పప్రచ్ఛ [illegible] కృష్ణద్వైపాయనం మునిమ్. 13



సంసారాడంబరమిదం కథమభ్యుత్థితం మునే
కథంచ ప్రశమం యాతి కియత్ కస్య కదేతి వా. 14

ఒకప్పుడు, విమలమతియగు శుకదేవుఁడు, మేరుపర్వతమున ఏకాకియైయున్న, తండ్రియగు కృష్ణద్వైపాయనుని, భక్తితోనిట్లు ప్రశ్నించెను:— "ఈ సంసారాడంబరమెట్లు ఉదయించినది? ఇదెంతకాలము, ఎచ్చట, ఎట్లుండును? దీని అవసానమేమి? అది దేహేంద్రియాది సంఘాతమునకు సంబంధించినదా? లేక, తద్వ్యతిరిక్తమా?"

ఇతి పృష్టేన మునినా వ్యాసేనాఖిలమాత్మజే
యథావదమలం ప్రోక్తం వక్తవ్యం విదితాత్మనా. 15

పుత్రునిచే నిట్లు ప్రశ్నింపఁబడి, ఆత్మజ్ఞుడగు వేదవ్యాసముని నిర్మలభావమున, యథోచితముగ ప్రత్యుత్తరించెను.

అజ్ఞాసిషం పూర్వమేతదహమిత్యథ తత్పితుః
స శుకః శుభయా బుద్ధ్యా నవాక్యం బహ్వామన్యత. 16

"ఇదివఱకే ఈ విషయముల నన్నింటిని నేనెఱింగితిని" అనితలఁచి, శుకుఁడావాక్యముల అపూర్వతను ఆదరింపజాలక పోయెను.

వ్యాసోఽపి భగవాన్ బుద్ధ్వా పుత్రాభిప్రాయ మీదృశమ్
ప్రత్యువాచ పునః పుత్రం నాహం జానామి తత్త్వతః. 17
జనకోనామ భూపాలో విద్యతే వసుధాతలే
యథావద్వేత్త్యసౌ వేద్యం తస్మాత్ సర్వమవాప్స్యసి. 18

వేదవ్యాసుఁడు పుత్రుని మనోభావమును గ్రహించి, మరల ఇట్లుపల్కెను:— నేనింతకంటె ఎక్కుడు ఎఱుఁగను. జనకుడను రాజు భూమండలముననున్నాడు. ఆయనకడ ఎఱుంగదగిన దానినంతటిని ఎఱుంగగలవు.

పిత్రేత్యుక్తే శుకః ప్రాయాత్ సుమేరోర్వసుధాతలే
విదేహనగరీంప్రాప జనకేనాభిపాలితామ్. 19

తండ్రి ఇట్లుపల్కగా, శుకదేవుడు సుమేరుశైలమునువీడి, భూమండలమున కరుదెంచి, జనకునిచేఁ బాలింపఁబడు విదేహనగరమునుఁ బ్రవేశించెను.

ఆవేదితోఽసౌ యాష్టీకైర్జనకాయ మహాత్మనే
ద్వారి వ్యాససుతో రాజన్ శుకోఽత్ర స్థితవానితి. 20
జిజ్ఞాసార్థం శుకస్యాసావాస్తామేవేత్యవజ్ఞయా
ఉక్త్వా బభూవ జనక స్తూష్ణీం సప్తదినాన్యథ. 21

"వ్యాసపుత్రుఁడగు శుకదేవుఁడు ద్వారదేశమున నిలంబడియున్నాడు" అని ద్వారపాలకులు జనకునకు నివేదింప, "అగుగాక" అని జనకుడుపల్కి, తూష్ణీంభావమును వహించెను; శుకునిఁ బరీక్షింప ఏడురోజులు అల్లేయూరకుండెను.

తతః ప్రవేశయామాస జనకః శుకమంగణమ్
తత్రాహాని సప్తైవ తథైవావసదున్మనాః. 22

పిదప అంగణమును బ్రవేశింప జనకుడనుమతి నొసంగెను; తత్త్వజిజ్ఞాసువగు శుకదేవుడు అట మరల నేడుదినములుండెను.

అథ ప్రవేశయామాస జనకోఽంతఃపురం శుకమ్
రాజా న దృశ్యతే తావదితి సప్తదినానిచ. 23
తత్రోన్మదాభిః కాంతాభిర్భోజనైర్భోగసంచయైః
జనకో లాలయామాస శుకం శశిసమాననమ్. 24

అనంతరము, జనకుడు శుకుని అంతఃపురమునకు రానిచ్చి, మరల నింకొక వారమువఱకు రాజదర్శనము లభింపదని, తెలియపరచెను; తెలియబరచి మదమత్తలగు యువతులను భోజనవస్తువులను, విలాసద్రవ్యములను, బంపి చంద్రవదనుడగు శుకునకు బరిచర్యల నొనర్చెను.

తే భోగాస్తాని దుఃఖాని వ్యాసపుత్రస్య తన్మనః
నాజహ్రుర్మందపవనా బద్ధపీఠమివాచలమ్. 25

దుఃఖస్వరూపములగు ఆభోగవస్తువులు, మందమారుతము లావృమాకును గదల్పలేనట్లు, శుకుని సుస్థిర హృదయమును చంచలమొనర్ప జాలకపోయెను.

కేవలం సుసమః స్వస్థో మౌనీ ముదితమానసః
అతిష్ఠత్ స శుకస్తత్ర సంపూర్ణ ఇవ చంద్రమాః. 26

శుకుడు, పూర్ణచంద్రునివలె సుసముడును, స్వస్థుడును, ముదితచిత్తుడునునై, మౌనము నవలంబించి యూరకుండెను.

పరిజ్ఞాతస్వభావం తం శుకం స జనకో నృపః
ఆనీతం ముదితాత్మాన మవలోక్య ననామ హ. 27

ఇట్లు, జనకనృపతి శుకదేవుని స్వభావమును గ్రహించి రప్పించి, వందనమొనర్చెను.

నిఃశేషిత జగత్కార్య ప్రాప్తాఽఖిలమనోరథ
కిమీప్సితం తవేత్యాశు కృతస్వాగతమాహ తమ్. 28

పిదప, రాజు స్వాగతప్రశ్న నొనర్చి, ఇట్లు పల్కెను: జగత్తుననున్న కర్తవ్యమునంతటిని ఒనర్చితివి, నీవాంఛితములన్నియు సిద్ధించినవి. కృతకృత్యుడా! నీ అభీప్సితమేమి?

శ్రీ శుక ఉవాచః—

సంసారాడంబరమిదం కథమభ్యుత్థితం గురో
కథం ప్రశమమాయాతి యథావత్ కథయాశు మే. 29

శుకుడు:— గురూ! ఈ సంసారాడంబరమెట్లు ఉదయించినది? ఎట్లు ఉపశమించును? శీఘ్రముగ వచింపుడు.



శ్రీ విశ్వామిత్ర ఉవాచః—

జనకేనేతి పృష్టేన, శుకస్య కథితం తదా
తదేవ యత్ పురా ప్రోక్తం తస్యపిత్రా మహాత్మనా. 30

విశ్వామిత్రుడు:— శుకునిచేనిట్లు ప్రశ్నింపబడి, జనకుడు, మున్ను వ్యాసుడు ప్రత్యుత్తరించినట్లే ప్రత్యుత్తరించెను.

శ్రీ శుక ఉవాచః—

స్వయమేవ మయా పూర్వమేతత్ జ్ఞాతం వివేకతః
ఏతదేవచ పృష్టేన పిత్రా మే సముదాహృతమ్. 31
భవతాప్యేష ఏవార్థః కథితో వాగ్విదాంవర
ఏష ఏవచవాక్యార్థః శాస్త్రేషు పరిదృశ్యతే. 32

శుకుడు:— వాగ్మివరా! వివేకబలమున ఈ విషయమును నేనిదివఱకే గ్రహించితిని: ప్రశ్నింప నాజనకుడును ఇట్లే వచించెను. శాస్త్రములయందుగూడ ఈ యర్థమిట్లే వివరింపబడుచున్నది.

యథాయం స్వవికల్పోత్థః స్వవికల్పపరిక్షయాత్
క్షీయతే దగ్ధసంసారో నిఃసార ఇతి నిశ్చయః. 33

నిస్సారమగు ఈ పాడుసంసారము అజ్ఞానమునుండి వెలువడుచున్నది; అజ్ఞానము నాశనమైన ఇదియు నశించును. ఇది ముమ్మాటికి నిక్కము.

తత్ కిమేతన్మహాబాహో సత్యం బ్రూహి మమాచలమ్.
త్వత్తో విశ్రాంతిమాప్నోమి చేతసా భ్రమతా జగత్. 34

మహాబాహూ! అయితే, ఇయ్యది యథార్థమేనా? నాయీ సంశయమును దూరమగునట్లు, తత్త్వమునుపదేశింపుడు. తత్త్వసంశయమున భ్రమించుచున్న మనస్సును శాంతించునట్లొనర్పుము.

శ్రీ జనక ఉవాచః—

నాతః పరతరః కశ్చిన్నిశ్చయోఽస్త్యపరో మునే
స్వయమేవ త్వయా జ్ఞాతం గురుతశ్చ పునః శ్రుతమ్. 35

జనకుడు:— మునీ! నీవు స్వయముగ గ్రహించిన దానికంటెను, నీ తండ్రికడ వినినదానికంటెను, వేఱుగ తెలిసికొనదగినదింకొకటిలేదు.

అవిచ్ఛిన్న చిదాత్మైకః పుమాన స్తీహ నేతరత్
స్వసంకల్పవశాద్బద్ధో నిఃసంకల్పశ్చ ముచ్యతే. 36

అఖండ చైతన్యస్వరూపుడును, అద్వితీయుడునునగు పురుషునికొక్కనికే, ఈ జగత్తున అస్తిత్వమున్నది. తక్కినవన్నియు అస్తిత్వహీనములు. అజ్ఞానయుతములగు సంస్కారములవలన నాతడు బద్ధుడగును. అవి నశించినచో, ముక్తుడై స్వస్వరూపమును పొందును.

తేన త్వయా స్ఫుటం జ్ఞాతం జ్ఞేయం యస్య మహాత్మనః
భోగేభ్యో విరతిర్జాతా దృశ్యాత్ ప్రాక్సకలాదిహ. 37

మహాత్మా! భోగముల ననుభవింపకుండగనే సమస్త దృశ్యప్రపంచము నెడ నీకువిరక్తి కలిగినది. అందువలన నీవెఱుంగవలసిన దానిని చక్కగ గ్రహించితివి.

తవ బాల మహావీర మతిర్విరతిమాగతా
భోగేభ్యో దీర్ఘరోగేభ్యః కిమన్యచ్ఛ్రోతు మిచ్ఛసి. 38

చిఱుతతనముననే నీవు విషయముల నెడ విరక్తిని బ్రకటించి మహావీరుడవైతివి. రోగములగు భోగములనుండినీమతి విరతినందినది. ఇంక దేనిని వినదలతువు?

న తథా పూర్ణతా జాతా సర్వజ్ఞానమహానిధేః
తిష్ఠత స్తపసి స్ఫారే పితు స్తవ యథా తవ. 39

నీవందిన పూర్ణతను, సర్వజ్ఞాననిధియు, తపస్వియునగు వేదవ్యాసుఁడుగూడ పొందలేదు.

వ్యాసాదధిక ఏవాహం వ్యాసశిష్యోఽసి తత్సుతః
భోగేచ్ఛాత్యాగవేనేహ మత్తోఽప్యత్యధికో భవాన్. 40

నేను వ్యాసునికంటె శ్రేష్ఠుడను, నీవు వ్యాసపుత్రుఁడవు, శిష్యుఁడవుగూడ. భోగేచ్ఛను త్యజించి నీవు నాకంటె అధికుడవైతివి.

ప్రాప్తం ప్రాప్తవ్య మఖిలం భవతా పూర్ణచేతసా
న దృశ్యే పతసి బ్రహ్మన్ ముక్తస్త్వం భ్రాంతిముత్సృజ. 41

పొందదగినదాని నంతటిని బొందితివి. నీ మనోరథము సిద్ధించినది. బ్రహ్మజ్ఞా! నీ వింక ఈ దృశ్యప్రపంచమున దగుల్కొనవు. భ్రాంతిని పరిత్యజింపుము! నీవు ముక్తుడవైనావు.

అనుశిష్టః స ఇత్యేవం జనకేన మహాత్మనా
అతిష్ఠత్ స శుకస్తూష్ణీం స్వచ్ఛే పరమవస్తుని. 42

మహాత్ముడగు జనకునివలన నిట్లుపదేశింపఁబడి, శుకుఁడు తూష్ణీంభావమును వహించి, మలిన రహితమగు పరమవస్తువు నధిష్ఠించెను.

వీతశోకభయాయాసో నిరీహశ్ఛిన్నసంశయః
జగామ శిఖరం మేరోః సమాధ్యర్థమనిందితమ్. 43

పిదప, శుకదేవుఁడు, ఆయాసము, శోకము, భయములనువీడి, సంశయరహితుడును, నిష్కాముడునునై, సమాధికొఱకు సాత్త్వికవృత్తికి తావలమగు ప్రశాంత మేరుశిఖరమున కరిగెను.

తత్ర వర్షసహస్రాణి నిర్వికల్పసమాధినా
దశస్థిత్వా శశామాసావాత్మన్యస్నేహదీపవత్. 44

శుకుఁడట నిర్వికల్పసమాధియందు పదివేలఏండ్లుండి, తైలహీనమగు దీపమువలె, ఆత్మస్వరూపమున నిర్వాణమునందెను.



వ్యపగతకలనా కళంకశుద్ధః
స్వయమమలాత్మని పావనే పదేఽసౌ
సలిలకణ ఇవాంబుధౌ మహాత్మా
విగలితవాసనమేకతాం జగామ. 45

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే
ముముక్షువ్యవహార ప్రకరణే శుకనిర్వాణం నామ
ప్రథమః సర్గః ॥ 1 ॥

నీలమేఘసంబంధమును వీడి, జలబిందువు సాగరమున గలియునట్లు, దృశ్య సంబంధమున్ను, అజ్ఞానమున్ను క్షీణింపగ, నిర్మలుడై, సంస్కారక్షీణానంతరము శుకదేవుఁడు, సునిర్మల స్వరూపుఁడును, పరమపావనుఁడును నగు పరమాత్మయందు లీనుడయ్యెను.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయను ఆంధ్రానువాదమున,
ముముక్షు వ్యవహారప్రకరణమున శుకనిర్వాణమను
ప్రథమ సర్గము ॥ 1 ॥

---

## ద్వితీయః సర్గః.

శ్రీవిశ్వామిత్ర ఉవాచ:—

తస్య వ్యాసతనూజస్య మలమాత్రాపమార్జనమ్
యథోపయుక్తం తే రామ తావదేవోపయుజ్యతే. 1

విశ్వామిత్రుడు:— రామా! వ్యాసపుత్రుఁడగు శుకదేవున కట్లొకింత మార్జన మవసరమయ్యెనో, నీకుగూడ అట్లే ఒకింత అవసరము.

జ్ఞేయమేతేన విజ్ఞాతమశేషేణ మునీశ్వరాః
స్వదంతేఽస్మై న యద్భోగా రోగా ఇవ సుమేధసే. 2

ముని శ్రేష్ఠులారా! శ్రీరాముడు తెలిసికొనదగిన దానినంతటిని దెలిసికొనినాడు. ఏలయన, భోగములన్నియు రోగములవలె ఈ బుద్ధిమంతున కగుపడుచున్నవి.

జ్ఞాతజ్ఞేయస్య మనసో నూనమేతద్ధి లక్షణమ్
న స్వదంతే సమగ్రాణి భోగవృందాని యత్ పునః. 3
భోగభావనయా యాతి బంధో దార్ఢ్యమవస్తుజః
తదుపశాంతయా యాతి బంధో జగతి తానవమ్. 4

భోగజాలములయెడ అరుచియే తత్త్వజ్ఞుని లక్షణము. సంసారబంధనము వాస్తవము కాకపోయినను, భోగచింతవలన నిది దృఢమగుచుండును; భోగచింత క్షయమందిన నిదియు నశించును.

వాసనాతానవం రామ మోక్ష ఇత్యుచ్యతే బుధైః
పదార్థవాసనాదార్ఢ్యం బంధ ఇత్యభిధీయతే. 5

రామా! పండితులచే, వాసనాక్షయమే ముక్తియనియు, వాసనావృద్ధియే బంధమనియు, చెప్పఁబడుచున్నది.

స్వాత్మతత్త్వాభిగమనం భవతి ప్రాయశో నృణామ్
మునే విషయవైరస్యం కదర్థాదుపజాయతే. 6

ఆత్మతత్త్వవిషయికమగు అపాతజ్ఞానము అల్పశ్రమవలననే, అనగా, శ్రవణాదులవలన, నరులకు సామాన్యముగ కల్గును. కాని విషయవితృష్ణ కష్టించినగాని కలుగదు.

సమ్యక్ పశ్యతి యస్తజ్జ్ఞో జ్ఞాతజ్ఞేయః స పండితః
న స్వదంతే బలాదేవ తస్మై భోగా మహాత్మనే. 7

కామక్రోధాదులవలన నెవ్వని జ్ఞానశక్తి ప్రతిహతమవకుండ నుండునో, అతడే తత్త్వజ్ఞుడగు పండితుఁడు; తెలిసికొనదగినదాని నతఁడు తెలిసికొనినాఁడు. భోగములయెడ వీని కమితమగు అరుచి.

యశఃప్రభృతినా యస్మై హేతునైవ వినా పునః
భువి భోగా న రోచంతే స జీవన్ముక్త ఉచ్యతే. 8

యశస్సు, దంభములకొఱకుగాక, వాస్తవముగనే భోగములనుండి విరతి నందినవారే జీవన్ముక్తపురుషులని చెప్పఁబడుదురు.

జ్ఞేయం యావన్న విజ్ఞాతం తావత్తావన్న జాయతే
విషయేష్వరతిర్జంతోర్మరుభూమౌ లతా యథా. 9

జ్ఞేయమును గ్రహింపనంతవఱకు, మరుభూమియందు లతోత్పత్తివలె, విషయవితృష్ణ కలుగుట అసంభవము.

అతఏవహి విజ్ఞాతజ్ఞేయం విద్ధి రఘూద్వహమ్
యదేనం రంజయంత్యేతో న రమ్యా భోగభూమయః. 10

రమణీయములగు భోగభూములు శ్రీరాము నాకర్షింపజాలకున్నవి. కనుక, ఇతనిని తత్త్వజ్ఞునిగ గ్రహించునది.

రామో యదంతర్జానాతి తద్వస్త్విత్యేవ సన్ముఖాత్
ఆకర్ణ్య చిత్తవిశ్రాంతి మాప్నోత్యేవ మునీశ్వరాః. 11

మునులారా! రాముఁడంతరమున నెఱింగినది సత్యమే. (జ్ఞానియగు వసిష్ఠునికడ) ఈ విషయము నెఱింగిన నీతఁడు శాంతినిఁబడయఁగలఁడు.



కేవలం కేవలీభావవిశ్రాంతిం సముపేక్షతే
రామబుద్ధిః శరల్లక్ష్మీః ఖలు విశ్రమణం యథా. 12

శరల్లక్ష్మి మేఘశూన్యమగు నీల నిర్మలాంబరమును గోరునట్లు, శ్రీరాముని బుద్ధి కైవల్యశాంతినిఁ గోరుచున్నది.

అత్రాస్య చిత్తవిశ్రాంత్యై రాఘవస్య మహాత్మనః
యుక్తిం కథయతు శ్రీమాన్ వసిష్ఠో భగవానయమ్. 13

ఇప్పుడు, మహాత్ముఁడగు రాఘవుని చిత్తశాంతినిమిత్తము, శ్రీమంతుఁడగు వసిష్ఠభగవానుఁడు యుక్తి నుపదేశించుఁగాక!

రఘూణామేష సర్వేషాం ప్రభుః కులగురుః సదా
సర్వజ్ఞః సర్వసాక్షీచ త్రికాలామలదర్శనః. 14

పూర్వమునుండి, ఈయనయే రఘుకులప్రభువు; కులగురువు. మఱియు, సర్వజ్ఞుడు, సర్వసాక్షి, త్రికాలవేత్త.

వసిష్ఠ భగవన్ పూర్వం కశ్చిత్ స్మరసి యత్స్వయమ్
ఆవయోర్వైరశాంత్యర్థం శ్రేయసేచ మహాధియామ్. 15
నిషధాద్రేర్మునీనాంచ సానౌ సరలసంకులే
ఉపదిష్టం భగవతా జ్ఞానం పద్మభువా బహు. 16
యేన యుక్తిమతా బ్రహ్మన్ జ్ఞానేనేయంహి వాసనా
సంసారీ నూనమాయాతి శమం శ్యామేవ భాస్వతా. 17
తదేవ యుక్తిమజ్జ్ఞేయం రామాయాంతేనివాసినే
బ్రహ్మన్నుపదిశాశు త్వం యేన విశ్రాంతి మేష్యతి. 18

వసిష్ఠమహర్షీ! భగవంతుఁడగు బ్రహ్మదేవుఁడు పూర్వము తనవైరమును శాంతింపఁజేయుటకును, మహామతులగు ఋషుల మంగళము కొఱకును, సరళవృక్షపరివృతమగు నిషధాద్రియందు ఉపదేశించిన జ్ఞానము గుర్తునకు వచ్చుచున్నదా? ఆ యుక్తిపూర్ణజ్ఞానోపదేశమువలన, సంసారవాసనలు, సూర్యోదయమునఁ జీకట్లు నశించునట్లు నశించును. బ్రహ్మజ్ఞా! జ్ఞేయమగు ఆ తత్త్వమును, యుక్తులతో శిష్యుఁడగు శ్రీరామున కుపదేశింపుము. అతఁడిద్దానిని విని శాంతినందగలఁడు.

కదర్థనాచ నైవైషా రామో హి గతకల్మషః
నిర్మలే ముకురే వక్త్రమియత్నేనైవ బింబతి. 19

ఇట్టి యుపదేశము సార్థకము. ఏలయన, శ్రీరాముఁడు విశుద్ధమగు ఆధారము — ఉపదేశపాత్రుఁడు, మకిలిలేని అద్దమున మోము సులువుగ కనఁబడునుగదా!

తజ్జ్ఞానం నచ శాస్త్రార్థస్త్వద్యదగ్ర్యమనిందితమ్
సచ్ఛిష్యాయ విరక్తాయ సాధో యదుపదిశ్యతే. 20

వైరాగ్యవంతుడగు సచ్ఛిష్యున కుపదేశింపబడు శాస్త్రజ్ఞానమే సార్థకము. ఇట్టి ఉపదేశ మనిందితమై నెగడును.

అశిష్యాయావిరక్తాయ యత్కించిదుపదిశ్యతే
తత్ ప్రయాత్యపవిత్రత్వం గోక్షీరం శ్వదృతావివ. 21

అశిష్యుడును, అవిరక్తుడు నునగు అపాత్రున కుపదేశించిన శాస్త్రజ్ఞానము, కుక్కతోలు సంచియందుంచిన ఆవుపాలువలె, అపవిత్రమగును.

వీతరాగభయక్రోధా నిర్మానా గలితైనసః
వదంతి త్వాదృశా యత్ర తత్ర విశ్రామ్యతీహ ధీః. 22

వైరాగ్యసంపన్నులును, భయక్రోధవిహీనులును, నిర్మలస్వభావులునునగు సాధుజనులు — మీ బోంట్లు — ఏ విషయమునుగురించి ఉపదేశింతురో, ఆవిషయమునందుపదేశసమయముననే బుద్ధి విశ్రమించును.

ఇత్యుక్తే గాధిపుత్రేణ వ్యాసనారదపూర్వకాః
మునయస్తే తమేవార్థం సాధుసాధ్విత్యపూజయన్. 23

విశ్వామిత్రుం డిట్లు పల్కగ వ్యాసనారదాది ఋషి పుంగవులు, దానినామోదించి సాధువాదముల నొనర్చుచు ప్రశంసించిరి.

అథోవాచ మహాతేజా రాజ్ఞఃపార్శ్వే వ్యవస్థితః
బ్రహ్మేవ బ్రహ్మణఃపుత్రో వసిష్ఠో భగవాన్మునిః. 24

అనంతరము, రాజపార్శ్వమున నుపవిష్టుడైన బ్రహ్మనందనుండును, బ్రహ్మసమానుడును, మహాతేజస్వియునగు వసిష్ఠభగవానుం డిట్లు పల్కెను.

శ్రీవసిష్ఠ ఉవాచః—

మునే యదాదిశసి మే తదవిఘ్నం కరోమ్యహమ్
కః సమర్థః సమర్థోఽపి సతాం లంఘయితుం వచః. 25

శ్రీవసిష్ఠుడు:- మునీ! తమ ఆజ్ఞను నిర్విఘ్నముగ నిర్వర్తింప సంసిద్ధుడను, సజ్జనుల వాక్యమును, ఉల్లంఘింప శక్తిగలిగియున్నను, ఎవ రుల్లంఘింపనేర్తురు? (నేను అతిసామాన్యుడను- అవశ్యము తమ ఆదేశమును పాలింతును.)



అహంహి రాజపుత్రాణాం రామాదీనాం మనస్తమః
జ్ఞానేనాపనయామ్యాశు దీపేనేవ నిశాతమః. 26

దీపమువలన చీకటిని నశింపజేయునట్లు, రాజపుత్రులగు రామాదుల మనస్తమమును జ్ఞానోపదేశమున వెంటనే నశింపజేయుచున్నాను.

స్మరామ్యఖండితం సర్వం సంసారభ్రమశాంతయే
నిషధాద్రౌ పురాప్రోక్తం యజ్జ్ఞానం పద్మజన్మనా. 27

పూర్వము, నిషధాద్రియందు బ్రహ్మ ఉపదేశించిన అఖండ-ఆత్మజ్ఞానమునంతటిని, సంసారభ్రమశాంతినిమిత్తము స్మరించుచున్నాను.

శ్రీ వాల్మీకి రువాచః—

ఇతి నిగదితవానసౌ మహాత్మా
పరికరబంధగృహీతవక్తృతేజః
అకథయదిద మజ్ఞతోపశాంత్యై
పరమపదైకవిబోధనం వసిష్ఠః. 28

ఇతి శ్రీ వాసిష్ఠ-మహారామాయణే వాల్మీకీయే ముముక్షు
వ్యవహార ప్రకరణే విశ్వామిత్రవాక్యం నామ
ద్వితీయః సర్గః ॥ 2 ॥

వాల్మీకి:—మహాత్ముడగు ఆ వసిష్ఠుం డిట్లు ప్రతిజ్ఞనొనర్చి, దృష్టాంత, ఉపాఖ్యాన ప్రమాణాది పరికరములగూర్చుకొని, వక్తకుడగినశోభతో ప్రకాశించుచు, ఈ పరతత్త్వబోధక శాస్త్రమును అజ్ఞానశాంతికొఱకు వచించెను.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు ముముక్షు
వ్యవహార ప్రకరణమున విశ్వామిత్ర వాక్యమను
ద్వితీయ సర్గము. ॥ 2 ॥



## తృతీయః సర్గః

శ్రీ వసిష్ఠ ఉవాచః—

పూర్వముక్తం భగవతా యజ్ఞానం పద్మజన్మనా
సర్గాదౌ లోకశాంత్యర్థం తదిదం కథయామ్యహమ్. 1

శ్రీ వసిష్ఠుఁడు:- పూర్వము, సృష్టిప్రారంభమున, బ్రహ్మదేవుఁడు జగత్-శాంతికొఱకు వచించిన శాస్త్రమును, ఇప్పుడు మరల నుడువుచున్నాను.

శ్రీ రామ ఉవాచః—

కథయిష్యసి విస్తీర్ణాం భగవన్ మోక్షసంహితామ్
ఇమం తావత్ క్షణం జాతం సంశయం మే నివారయ. 2

శ్రీరాముఁడు:- భగవంతుఁడా! విపులమగు మోక్షశాస్త్రమును పిదప వచింపుదురు గాక!; ముమ్మొదట నాకుగలిఁగిన ఈ సందియమునుఁ దీర్చుఁడు.

పితా శుకస్య సర్వజ్ఞో గురుర్వ్యాసో మహామతిః
విదేహముక్తో నకథం కథంముక్తః సుతోఽస్య సః. 3

శుకదేవుని తండ్రియు, గురుఁడును, మహామతియును, సర్వజ్ఞుఁడునునగు వ్యాసమహర్షి ఏల విదేహముక్తినిఁబొందలేదు? శుకుఁడేల నిర్వాణముక్తి నందినాఁడు? (తత్త్వజ్ఞానఫలము విదేహముక్తి యని ప్రాజ్ఞనిగమనము; వ్యాసునిముక్తి అనుమానాస్పద మగుటవలన తత్త్వజ్ఞానముయొక్క అవ్యభిచారి ఫలము శంకితమైనది. వసిష్ఠుఁడు పై ప్రశ్నకు పరోక్షభావమునఁ బ్రత్యుత్తరించుచున్నాఁడు:—)

శ్రీ వసిష్ఠ ఉవాచః—

పరమార్కప్రకాశాంతస్త్రిజగత్త్రసరేణవః
ఉత్పత్యోత్పత్య లీనా యే న సంఖ్యాముపయాంతి తే. 4
వర్తమానాశ్చ యాః సంతి త్రైలోక్య గణకోటయః
శక్యంతే తాశ్చ సంఖ్యాతుం నైవకాశ్చన కేనచిత్. 5
భవిష్యంతి పరాంభోధౌ జగత్సర్గతరంగకాః
తాంశ్చైవ పరిసంఖ్యాతుం సా కథైవ న విద్యతే. 6

వసిష్ఠుఁడు:- సూర్యునివలె ప్రకాశించు పరమాత్మని చైతన్యశక్తియందు లేచి లీనమగు బ్రహ్మాండ - త్రసరేణువులు అసంఖ్యాకములు. ప్రస్తుతమున్న త్రిభువన - బ్రహ్మాండముల సంఖ్యనుఁ గూడ ఎవరును నిర్ణయింపఁజాలరు; అగుచో బ్రహ్మమను సముద్రమున లేవబోవు, త్రిభువన - సృష్టులను తరంగముల లెక్కయిడు టెక్కడ? (ఇట్టి జగద్రేణువులయందు జీవన్ముక్త పురుషులు నసంఖ్యాకముగా నుండుదురు; అందువలన, వీరును విదేహముక్తతుల్యులేయని ఆశయము.)



శ్రీ రామ ఉవాచః—

యాభూతా యా భవిష్యంతో జగత్సర్గ పరంపరాః
తాసాం విచారణా యుక్తా వర్తమానాస్తు కా ఇవ. 7

శ్రీ రాముఁడు:—(వసిష్ఠుని అభిప్రాయమును గ్రహించి నుడువుచున్నాఁడు.) గడచినవియు రాబోవునవియునగు సృష్టి ప్రవాహములు విచారవిషయములేకాని, వర్తమానసృష్టి (న్యూనమగుటవలన) వానిలో దేనితోడను సమానముకాదు. (దీనివలన బ్రహ్మతత్త్వమును నెఱుంగజాలము. కాని, మీ కృపవలన, ఆ అఖండ బ్రహ్మతత్త్వమును గ్రహింపఁగలిగితిని. రాబోవు, అసంఖ్యసృష్టుల కుపాదానమగు చిద్రూపము మీవలనఁ బ్రదర్శింపఁబడినది; నేను గ్రహించితిని.)

శ్రీ వసిష్ఠ ఉవాచః—

తిర్యక్ పురుష దేవాదేర్యోనామ స వినశ్యతి
యస్మిన్నేవ ప్రదేశేఽసౌ తత్రైవేదం ప్రపశ్యతి. 8
ఆతివాహికనామ్నాంతః స్వహృద్యేవ జగత్త్రయమ్
వ్యోమ్ని చిత్తశరీరేణ వ్యోమాత్మానుభవత్యజః. 9

వసిష్ఠుఁడు:—(తత్త్వ గ్రహణసమర్థమగు శ్రీ రాముని బుద్ధిసూక్ష్మతకు మెచ్చి, సూక్ష్మ శరీరముయొక్క మిథ్యాత్వమును వర్ణించుచున్నాఁడు:—) పశుపక్షిమనుష్యదేవతాది ప్రాణులయందే జీవియైనను, మృతించినప్పుడు, ఆజీవాత్మ "అతివాహిక" మగు సూక్ష్మశరీరమును ధరించి, హృదయాకాశమున వాసనామయములగు త్రిలోకముల, గాంచుచుండును. వాస్తవమున కీయాత్మ జన్మాదివికార రహితుఁడగు పరబ్రహ్మమే.

ఏవంమృతా మ్రియంతేచ మరిష్యంతిచ కోటయః
భూతానాం యాం జగంత్యాశా ముదితాని పృథక్ పృథక్. 10

ఇట్లు భూతజాలములన్నియు మృత్యుముఖమునఁ బడుచున్నవి—పడును. మరణసమయమున అదృష్టఫలము ననుసరించి మానసపటమున నిలఁబడు కోర్కెలలో నెద్ది యగ్రగణ్యమగునో, దానినే జీవుఁడనుభవించును.

సంకల్పనిర్మాణమివ మనోరాజ్యవిలాసవత్
ఇంద్రజాలామాల ఇవ కథార్థప్రతిభాసవత్. 11
దుర్వాతభూకంప ఇవ త్రస్తబాలపిశాచవత్
ముక్తావిహామలేవ్యోమ్ని నౌస్పందతరుయానవత్. 12
స్వప్నసంవిత్తిపురవత్ స్మృతిజాతఖపుష్పవత్
జగత్సంసరణం స్వాంతర్మృతోఽనుభవతి స్వయమ్. 13

మానసపూజ నొనర్చునప్పుడు సంకల్పించు గద్దెసింహాసనాదులవలెను, ఆకాశహర్మ్యముల వలెను, ఇంద్రజాలకునిచే గల్పింపఁబడు ముత్యాలమాలవలెను, కథలో జెప్పఁబడు విషయములు ఎట్ట

ఎదుట పొడగట్టుటవలెను, వాయురోగమువలనఁ బీడింపఁబడునపుడు తోఁచు భూకంపమువలెను, బాలుని భయపెట్టుటకుఁ గల్పింపఁబడిన పిశాచమువలెను, నిర్మలాకాశమున మసకకంటివానికగపడు ముత్యములవలెను, నావమీఁద పయనించువానికగపడు చెట్లకదలికవలెను స్వప్నమునఁగాంచు పత్తనమువలెను, మనోనిర్మిత ఆకాశపుష్పమువలెను, జగత్తు అలీకము (మిథ్య) — మరణసమయముననను, జననసమయమును ఈ విషయము హృదయాకాశమున అనుభూతమగును.

తత్రాతి పరిణామేన తదేవ ఘనతాం గతమ్
ఇహలోకో౽యమిత్యేవ జీవాకాశే విజృంభతే. 14

మృత్యుకాలమున అనుభూతమగు వాసనాప్రపంచమే, అజ్ఞానమువలన గలిగిన చిరపరిచయవలన, పంచీకరణమునంది, దృఢమై, జీవాకాశమున, "ఇహలోక" మను పేరఁ బ్రకాశితమగుచున్నది.

పునస్తత్రైవ జన్మేహా మరణాద్యనుభూతిమాన్
పరంలోకం కల్పయతి మృతస్తత్ర తథాపునః. 15

బ్రతుకునందలి ఆశ, పుట్టుక, చావు — నీకీ అనుభవములు ఈ కల్పిత—ఇహలోకముననే జరుగును. మృతించినపిమ్మట వచ్చు పరలోకముగూడ ఇట్టిదే; ఇటుగూడ జననమరణములు సంభవించును.

తదంతరే౽న్యే పురుషా స్తేషామన్తస్తథేతరే
సంసారఇతి భాంతీమే కదలదలపీఠవత్. 16

ఈ స్థూలదేహము నందింకొక శరీరమున్నది—అది సూక్ష్మశరీరము. మరల, దీని యందింకొక శరీరమున్నది—ఇది కారణశరీర మనంబడుచున్నది. అరటిసారవలె, ఒకదానియందింకొకటిగ నిమిడియున్న ఈ త్రివిధశరీరములే సంసార మనంబడుచున్నవి.

న పృథ్వ్యాదిమహాభూతగణా నచ జగత్క్రమాః
మృతానాం సంతి తత్రాపి తథా౽ప్యేషాం జగద్భ్రమాః. 17

మృతించినవారికి, పంచభూతసంబంధమును, తద్విషయికమగు నియమముల కట్టుబాటుయు లేకపోయినను, జగద్భ్రమ మాసిపోలేదు—నిలచియేయున్నది. (స్థూలదేహముగాక మరేమియులేనిచో సంసారము శాంతింపవలయును; కాని, అట్లుజరుగుటలేదు. ఈ భ్రమకుఁ గారణ మింకొకటి ఉన్నది. అది సూక్ష్మశరీరము—అని ఈ శ్లోకము ప్రతిపాదించుచున్నది.)

అవిద్యైవ హ్యనన్తేయం నానాప్రసవశాలినీ
జడానాం సరిదాదీర్ఘా తరత్సర్గతరంగిణీ. 18
పరమార్థాంబుధౌ స్ఫారే రామ సర్గ తరంగకాః
భూయో భూయో౽నువర్తంతే త ఏవాన్యేచ భూరిశః. 19

ప్రళయసమయమునఁ గూడ అవిద్య లయమునను—దీనినుండియే నానావిధములగు కార్యము లుత్పన్నము లగుచున్నవి; ఈ యవిద్య తరంగచంచలమగు నదివంటిది. నిద్రాసమయముననను, ప్రళయసమయముననను, దీనియందు లోఁగము లుండవు. సృష్టిసమయముననను, స్వప్నాదిసమయములలోను భ్రాంతులను తరంగములు లేచుచున్నవి. రామా! విశాలమగు బ్రహ్మసముద్రమున, పెద్దపెద్ద సృష్టులను తరంగసమూహములు, మాటిమాటికి లీలగా, నరుదెంచుచున్నవి. (దేహత్రియముల కనాదినుండియు బ్రహ్మముతో సంబంధమున్నదనియు, బ్రహ్మమే దీనికి గారణమనియు, బ్రహ్మమే దేహసంబంధ (ఉపాధి) వశమునఁజేసి జీవుడని చెప్పఁబడుచున్నదనియు, నిటసూచింపఁబడినది.)



సర్వతః సదృశాః కేచిత్ కులక్రమమనోగుణైః
కేచిదర్థేన సదృశాః కేచిచ్చాతివిలక్షణాః. 20

ఇవన్నియు, అనగా, మాటిమాటికి గైకొనంబడు ఈ శరీరములన్నియు, ఒక్కొక్కప్పుడు సమానములును, మఱొక్కొక్కప్పుడు విభిన్నములును నగుచున్నవి. ఒకప్పుడు పూర్వపు సంస్కారములన్నియు అట్లే నిలచుచున్నవి. మరొకప్పుడీ వంశమానసికగుణములు భేదించుచున్నవి.

ఇమం వ్యాసమునిం తత్ర ద్వాత్రింశం సంస్మరామ్యహమ్
యథాసంభవవిజ్ఞానదృశా సందృశ్యమానయా. 21

నాదృష్టి పోగలిగినంతవఱకు, తరచిచూడ, ఈ వ్యాసుఁడు నాకు ముప్పదిరెండవవాడుగ గన్పడుచున్నాడు; ఇట్టివ్యాసులు, పూర్వపు సృష్టులయందె ముప్పదియొక్కండ్రు, చనిరి.

ద్వాదశాల్పధియస్తత్ర కులాకారేహితైః సమాః
దశ సర్వే సమాకారాః శిష్టాః కులవిలక్షణాః. 22

అందు, మొదటిపన్నిద్దరు వ్యాసుల కులము, ఆకృతి చరితలు సమానములు; వీరందరును అల్పజ్ఞానులు. పదవవాని వంశము మాత్రము భిన్నము.

అద్యాప్యన్యే భవిష్యంతి వ్యాసవాల్మీకయస్తథా
భృగ్వాంగిరః పులస్త్యాశ్చ తథైవాప్యన్యథైవచ. 23

ఇంకను, ఎందరో వ్యాసవాల్మీక భృగ్వాంగిరపులస్త్యులును, తదితరులును, జన్మింపనున్నారు వీరిలో, కొందరి శరీరములు, మున్నుండినటులనే యుండును. మఱికొందఱి శరీరములు మారును.

నరాః సురర్షిదేవానాం గణాః సంభూయ భూరిశః
ఉత్పద్యంతే విలీయంతే కదాచిచ్చ పృథక్పృథక్. 24

ఎందరెందరో, మనుష్యులు, దేవతలు, దేవర్షులు పూర్వమట్లు ఒకేకాలమునజన్మించి, ఒకే సమయమున సమయుదురు. ఇంకొకప్పుడు వేర్వేరుగ జన్మించి విలీనమగుదురు.

బ్రాహ్మీమద్యాన ష్టతి స్త్రేతా ఆసీదస్తి భవిష్యతి
స ఏవాన్యశ్చ లోకాశ్చ త్వంచాహంచేతి వేద్మ్యహమ్. 25

ఇయ్యది బ్రహ్మయుగమున డెబ్బదిరెండవ త్రేతాయుగము. ఇట్టి విదివఱ కెన్నియో గడచినవి; ఇకముందెన్నియో గడవనున్నవి. పూర్వకల్పకాలమందున్నట్లు నీవును నేనును ఉన్నాము; మఱికొందరు క్రొత్తవారుగూడ నున్నారు.

క్రమేణాస్య మునేరిత్థం వ్యాసస్యాద్భుతకర్మణః
సంలక్ష్యతేఽవతారోఽయం దశమో దీర్ఘదర్శినః. 26

అద్భుత కర్ముఁడును, దీర్ఘదర్శియునునగు ఈవ్యాసుని పదవ అవతారము మదికి గన్పట్టు చున్నది.

అభూమ వ్యాసవాల్మీకియుక్తా వయమనేకశః
అభూమ వయమేవేమే బహుశశ్చ పృథక్పృథక్. 27

వ్యాసవాల్మీకులకు సమకాలికులమై మనమనేకమార్లు జన్మించియుంటిమి; మనలో చాల మంది మరల విడివిడిగగూడ జన్మించియుంటిమి.

అభూమ వయమేవేమే సదృశా ఇతరే విదః
అభూమ వయమేవేమే నానాకారాః సమాశయాః. 28

మనమును, వీరును, ఇతరులగు జ్ఞానులును ఇట్టివేయగు శరీరములతో పలుమార్లు జన్మించి యుంటిమి; ఇంకొకప్పుడు శరీరములు వేరైనను, ఒకేతిరగతికి చెందిన మనోభావము లుండినవి.

భావ్యమద్యాప్యనేనేహ నను వారాష్టకం పునః
భూయోఽపి భారతం నామ సేతిహాసం కరిష్యతి. 29

ఈవ్యాసుఁడింకను ఎనిమిదిమార్లు జన్మించి, భారత ఇతిహాసమును ఎనిమిదిమార్లు రచించ నున్నాడు.

కృత్వా వేదవిభాగంచ నీత్వానేన కులప్రథామ్
బ్రహ్మత్వంచ తథాకృత్వా భావ్యం వై దేహమోక్షణమ్. 30

ఈవ్యాసుఁడే వెనుకటియట్లు, మరల వేదముల విభజించి, భారతవంశమునకు కీర్తిదెచ్చి పిదప విదేహముక్తుడై బ్రహ్మభావమునందును.

వీతశోకభయః శాంతనిర్వాణో గతకల్పనః
జీవన్ముక్తో జితమనా వ్యాసోఽయమితి వర్ణితః. 31

ఈ వ్యాసుఁడిప్పుడు జీవన్ముక్తుఁడు, మనోనిగ్రహయుక్తుఁడు, శాంతుఁడు, మోహరహి తుడు; అహంకారమమకారములు లేకపోవుటవలన శోకభయములులేక వెలుగొందుచున్నాడు.

విత్తబంధువయః కర్మ విద్యావిజ్ఞాన చేష్టితైః
సమాని సంతిభూతాని కదాచిన్నతు తాని తు. 32

క్వచిత్సర్గశతైస్తాని భవంతి నభవంతి వా
కదాచిదపి మాయేయ మిత్థమంతర్వివర్జితా. 33

విత్తము, బంధువులు, ఆయుర్దాయము, ప్రయత్నము, విద్య, జ్ఞానములను సమముగ గైకొని ఈ జీవులందరు ఒకప్పుడిట్లేయుందురు. మరొకప్పుడుండరు. మరొకప్పుడివి సమానముగ నుండవు. ఇంకొకప్పుడు ప్రతిసృష్టియందున వీరుందురు. ఇదంతయు మాయ. దీనికంతము లేదని చెప్పనను చెప్పవచ్చును.



యచ్ఛతీయం విపర్యాసం భూరిభూతపరంపరా
బీజరాశిరివాజస్రం పూర్యమాణః పునఃపునః. 34

కొలుచుటకు రాశిగపోయఁబడిన ధాన్యపుగింజలు, కొలచినపిమ్మట అదేరీతిగ నుండనట్లు ప్రాణులందరును భిన్నభిన్న సృష్టులలో భిన్నభిన్నముగనుందురు.

తేనైవ సన్నివేశేన తథాన్యేన పునః పునః
సర్గాకారాః ప్రవర్తంతే తరంగాః కాలవారిధేః. 35

కాలమను సముద్రమునందలి తరంగములగు సృష్టిసమూహము లొకప్పుడు పూర్వమున్న యటులే ఉండును; మరొకప్పుడింకొక రూపమునుదాల్చి ప్రకటితమగుచుండును.

ఆశ్వస్తాంతఃకరణః శాంతవికల్పః స్వరూపసారమయః
పరమశమామృత తృప్తస్తిష్ఠతి విద్వాన్నిరావరణః. 36

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే ముముక్షువ్యవహార ప్రకరణే భూయోభూయః సర్గానువర్ణనంనామ తృతీయః సర్గః ‖ 3 ‖

కాని, తత్త్వజ్ఞానికి అజ్ఞాన జనితములగు వికల్పములు లేవు; ఈ సృష్టితరంగములవలన నతని అంతరంగము తల్లడిల్లదు. ఏలయన నాతడు పరమశాంత్యమృతమున సంతృప్తుఁడు. మాయావరణము తొలగ, అతడు బ్రహ్మస్వరూపమున వెలుగొందును. (కనుక జీవన్ముక్తిగూడ తత్త్వజ్ఞానఫలమే; తొలగ, అతడు బ్రహ్మస్వరూపమున వెలుగొందును. ఇట్లు పూర్వోక్తశంకానుసంశయము ప్రత్యు త్తరితమైనది.)

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు, ముముక్షువ్యవహార ప్రకరణమున భూయోభూయ సర్గానువర్ణనమను తృతీయ సర్గము ‖ 3 ‖

———:0:———

## చతుర్థః సర్గః.

శ్రీ వసిష్ఠ ఉవాచః—

సామాన్యాంబుత్వే తరంగత్వే సలిలస్యాంబుతాయథా
సమైవాబ్ధౌ తథాఽదేహా సదేహామునిముక్తతా. 1

వసిష్ఠుఁడు:— సముద్రమున తరంగములుండినను, లేకపోయినను, అందలినీరు నీరుగనే యుండును. అట్లే, మునులు సదేహముక్త (జీవన్ముక్తు) లయినను, విదేహముక్త (నిర్వాణముక్త) లయినను, ఒకటియే. ఈరెండుముక్తులు భిన్నములుకావు.

సదేహో వా స్త్వదేహో వా ముక్తతా విషయే నచ
అనాస్వాదితభోగస్య కుతో భోజ్యానుభూతయః. 2

ముక్తి - జీవన్ముక్తియే గానిమ్ము, లేక నిర్వాణముక్తియే గానిమ్ము - విషయాధీనము కాదు. విషయములను విషయములుగ గ్రహింపనివారికి, వాటి భోగ మెట్లు సిద్ధించును. జీవన్ముక్తిస్థితియందు విషయభోగము న్నచో, దానిని నిర్వాణముక్తికంటె తక్కువదగ నెంచుకోనవచ్చును; దీనియందు విషయ రసభోగ లేదు. కనుక, నిదియును నిర్వాణముక్తివంటిదే.

జీవన్ముక్తం మునిశ్రేష్ఠం కేవలం హి పదార్థవత్
పశ్యామః పురతో నాస్య పునర్విఘ్నో ఽ స్త్యరాశయమ్. 3

జీవన్ముక్తుడగు వ్యాసుని మన మితరములగు ఘటపటాది పదార్థములవలె గాంచుచున్నామే గాని, అతని అంతరమును మనమే మెఱుంగుదుము ?

సదేహాదేహముక్తానాం భేదః కో బోధరూపిణామ్
యదేవాంబు తరంగత్వే సౌమ్యత్వే ఽపి తదేవ తత్. 4

బోధస్వరూపులగు నిర్వాణముక్తులకును జీవన్ముక్తులకును భేదమే లేదని, ఇదివరకే చెప్పియుంటిని. అలలుగనున్నను నీరు నీరే, కదలకున్నను నీరు నీరే కదా !

సమనాగపి భేదో ఽ స్తి సదేహాదేహముక్తయోః
స స్పందో ఽ ప్యథవా ఽ స్పందో వాయురేవ యథా ఽ నిలః. 5

ఈ రెండుముక్తులకును అవంతైనను భేదా లేదు; గాలి, వీచుచున్నను వీవకపోయినను గాలియే కదా!

సదేహో వా విదేహో వా ముక్తతా న ప్రమాస్పదమ్
అస్మాకమపి తస్యాస్తి స్వైకతా స్త్వవిభాగినీ. 6

నాయొక్కయు, వ్యాసునియొక్కయు లక్ష్యములు సదేహవిదేహముక్తులు గావు; మా లక్ష్యము ద్వైతవిహీనమగు జీవాత్మపరమాత్మల అభేదము, ఐక్యము.

తస్మాత్ ప్రకృతమేవేదం శృణు శ్రవణభూషణమ్
మయోపదిశ్యమానం త్వం జ్ఞానమజ్ఞానధ్వాంతనాశనమ్. 7

ఇక, ప్రస్తుతవిషయమగు తత్త్వజ్ఞానము నుపదేశించుచున్నాను, వినుము. ఈ జ్ఞానము, అజ్ఞా[illegible]త్వమును బోగొట్టును; శ్రవణభూషణము.

సర్వమేవేహ హి సదా సంసారే రఘునందన
సమ్యక్ ప్రయుక్తాత్ సర్వేణ పౌరుషాత్ సమవాప్యతే. 8

రఘునందనా! ఈ జగత్తున యథోచితముగ పౌరుషము (పురుషకారము) నుపయోగించిననే, వాంఛితవస్తువు సిద్ధించును.



ఇహహీందోరివోదేతి శీతలాహ్లాదనంహృది
పరిస్పందఫలప్రాప్తౌ పౌరుషాదేవ నాన్యతః. 9

క్రియాస్వరూపుడగు కాలుని నియమము ననుసరించియే, చంద్రునినుండి శీతలమును, ఆనందకరమునునగు అమృతము లభించునట్లు, పురుష ప్రయత్నమువలననే జ్ఞానములభించుచున్నది. దీనివలన, కామాది తాపనాశనకరమగు జీవన్ముక్తి లభించుచున్నది.

పౌరుషం స్పందఫలవద్దృష్టం ప్రత్యక్షతో నయత్
కల్పితం మోహితైర్మందైర్దైవం కించిన్న విద్యతే. 10

పురుషకారముయొక్క ఫలమే కర్మ. ఇట్టి కర్మవలననే, (నడచిన) దేశాంతర ప్రాప్తియు, (భుజించిన) తృప్తియు గలుగుచున్నవి—ఇది ప్రత్యక్షానుభవ సిద్ధము. ఇక, దైవ (అదృష్ట) మన్ననో? మోహితులగు మూఢులు గల్పించినదియే. ఏలయన, ఇయ్యది పూర్వజన్మలయందొనర్పఁబడిన పురుషకారమే, తద్భిన్నము కాదు.

సాధూపదిష్ట మార్గేణ యన్మనోంగ విచేష్టితమ్
తత్ పౌరుషం తత్సఫల మన్యదున్మత్తచేష్టితమ్. 11

సాధుపురుషుల ఉపదేశానుసారముగ, మనోవాక్కాయములఁ జరింపజేయుటయే, పురుషకారము. ఇదియే ఫలప్రదము, తక్కినదంతయు, ఉన్మత్తచేష్ట.

యో ఽ యమర్థం ప్రార్థయతే తదర్థం చేహతే క్రమాత్
అవశ్యం స తమాప్నోతి న చేదర్ధాన్నివర్తతే. 12

శాస్త్రోపదేశము ననుసరించిన, ఎవడేవస్తువునుగోరునో, అతఁడద్దానినిఁ బడయును. ప్రత్యవాయము ఘటిల్లిన సగమునుండి వెనుకకు మరలిపోవలసియుండును. (కనుక, శాస్త్రవిధిని ఏకదేశముగ గాక సంపూర్ణముగ ఆచరింపవలయును. అట్లాచరించిననే ఫలము లభించును.)

పౌరుషేణ ప్రయత్నేన త్రైలోక్యైశ్వర్య సుందరామ్
కశ్చిత్ ప్రాణివిశేషో హి శక్రతాం సముపాగతః. 13

ఒకానొక జీవుడు ప్రబలమగు పురుషకారమునంజేసి, త్రిలోకాధిపత్యముతోనొప్పారు ఇంద్రపదవిని, బొందగలిగినాడు.

పౌరుషేణైవ యత్నేన సహసాంభోరుహాస్పదమ్
కశ్చిదేవ చిదుల్లాసో బ్రహ్మతా మధితిష్ఠతి. 14

ఒకానొక జీవుడు పురుషకారఫలముగ, పద్మాసనమున నాసీనుడై, బ్రహ్మయైనాడు.

సారేణ పురుషార్థేన స్వేనైవ గరుడధ్వజః
కశ్చిదేవ పుమానేవ పురుషోత్తమతాం గతః. 15

ఒకానొక పురుషుడు పౌరుషబలమునఁజేసి గరుడధ్వజుఁడగు విష్ణుడైనాడు.

పౌరుషేణైవ యత్నేన లలనావలితాకృతిః
శరీరీ కశ్చిదేవేహ గతశ్చంద్రార్ధచూడతామ్. 16

ఒకానొక మనుజుఁడు నిజయత్నమునఁజేసి అర్ధనారీశ్వరుఁడును, చంద్రశేఖరుఁడునునగు శివుడైనాడు. *

ప్రాక్తనం చైహికంచేతి ద్వివిధం విద్ధి పౌరుషమ్
ప్రాక్తనాద్యతనేనాశు పురుషార్థేన జీయతే. 17

ఈ పురుషకారము, ప్రాక్తనము (పూర్వపు జన్మలలోనిది.) అద్యతనము (ఈ జన్మయందొనర్చినది.) అని రెండు తెఱగులు. ప్రాక్తన పురుషకారము (దైవము, లేక అదృష్టము)ను ఈ అద్యతన పురుషకారమువలన జయింపగలము.

యత్నవద్భిర్దృఢాభ్యాసైః ప్రజ్ఞోత్సాహసమన్వితైః
మేరవోఽపి నిగీర్యంతే కైవ ప్రాక్పౌరుషే కథా. 18

ప్రయత్నవంతులును, దృఢాభ్యాస నిరతులును, ఉత్సాహవంతులును నగువారు, మేరువునే జీర్ణమొనరించుకొనగలరన్న, వారికి అదృష్టమొక లెక్కలోనిదా?

శాస్త్రనియంత్రితపౌరుషపరమా పురుషస్య పురుషతా యా స్యాత్
అభిమతఫలభరసిద్ధ్యై భవతి హి సైవాన్యథా త్వనర్థాయ. 19

శాస్త్రానుశాసితమగు కర్మల నాచరించుటయే, శుభఫలప్రదమగు పురుషకారము; తదితరములనర్థదాయకములు, వ్యర్థములు.

కస్యాంచిత్ స్వయమాత్మదుఃస్థితివశాత్ పుంసో దశాయాం శనై
రంగుల్యగ్రనిపీడితైక చులుకాదావాపబిందుర్బహుః
కస్యాంచి జ్జలరాశి పర్వతపురద్వీపాంతరాలీకృతా
భర్తవ్యోచిత సంవిభాగకరణే పృథ్వీ న పృథ్వీ భవేత్. 20

ఇత్యార్షే వాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే ముముక్షువ్యవహార ప్రకరణే
పౌరుష-ప్రకరణంనామ చతుర్థః సర్గః ॥ 4 ॥

ఒకానొకప్పుడు, శాస్త్రవిధి వ్యతిరిక్తమగు యథేష్టాచరణమువలన, వ్రేళ్లుకలపి ఔపోసన పట్టుటకూడ కష్టకరమగును; మరియు దాహశాంతికై అందలి నీటిబొట్టుకూడ అధికమేయనిపించును. (మందబుద్ధులును, దరిద్రులును, నగు ఇట్టివారు జ్ఞానులును, ధనికులు అగుటవలన —) శాస్త్రవిధి ననుసరించుటవలన మరొకప్పుడు చేకూరిన ధనమును దాయాదులకు పంచిపెట్టిపోగా, సాగరగిరి నగర ద్వీపసమన్వితమగు ధరణీమండలమంతయు తుచ్ఛమనిపించును.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు ముముక్షువ్యవహార
ప్రకరణమున పౌరుషప్రకరణమను చతుర్థ సర్గము ॥ 4 ॥

---

* 13, 14, 15, 16 వ శ్లోకములందేర్కొనఁబడినన్నియు పదవులు. ఈ పదవులు యోగసాపేక్షములు; ఆయా యోగముల నొనర్చిన ఆయా పదవులు లభించును. విష్ణుత్వ, శివత్వములన్నచోట, సారూప్యముక్తిని గ్రహించుట సమంజసము - అను.



పంచమః సర్గః.

---

శ్రీ వసిష్ఠ ఉవాచః—

ప్రవృత్తిరేవ ప్రథమం యథాశాస్త్రవిహారిణామ్ 1
ప్రభేవ వర్ణభేదానాం సాధనీ సర్వకర్మణామ్.

వెలుఁగే, తెలుపు, నలుపు, పసుపు మున్నగు భిన్నభిన్నవర్ణముల అభివ్యక్తికిఁ గారణమైనట్లు, ప్రవృత్తియే శాస్త్రవిధిననుసరించి చను వివిధ-అధికారుల ఫలసిద్ధికిఁ గారణమగుచున్నది.

మనసా వాంఛ్యతే యచ్చ యథాశాస్త్రం నకర్మణా 2
సాధ్యతే మత్తలీలాసా మోహనీ నార్థసాధనీ.

మనస్సునఁ గోరుకొనుట, శాస్త్రవిధి ననుసరింపక పోవుట, ఉన్మత్తక్రీడ; దీనివలన ప్రయోజనము సిద్ధింపదు; పైపెచ్చు, ఇది మోహకారణమగును.

యథా సంయతతే యేన తథా తేనానుభూయతే 3
స్వకర్మైవేతి చాస్తేఽన్యా వ్యతిరిక్తా నదైవకృత్

ఎవఁడెట్లు యత్నించునో, అతడట్టి కర్మనేపొందును; అదృష్టముకూడ ఏతద్వ్యతిరిక్తము గాదు.

ఉచ్ఛాస్త్రం శాస్త్రితంచేతి ద్వివిధం పౌరుషం స్మృతమ్
తత్రోచ్ఛాస్త్ర మనర్థాయ పరమార్థాయ శాస్త్రితమ్. 4

కర్మ, శాస్త్రోచితము, శాస్త్రవిరుద్ధము అని రెండు తెఱగులు, వీటిలో శాస్త్రోచితమగునది పరమార్థము కొఱకును, శాస్త్రవిరుద్ధమైనది అనర్థము కొఱకునైయున్నది.

ద్వావాహుడావివ యుధ్యేతే పురుషార్థౌ సమాసమౌ
ప్రాక్తనశ్చైహికశ్చైవ శామ్యత్యత్రాల్పవీర్యవాన్. 5

సమానబలము గలిగినట్టివియు, ఒకింత హెచ్చుతగ్గులు గలిగినట్టివియునగు ప్రాక్తన అద్యతన కర్మలు నిరంతరము మేకపోతులవలె ఒకదానితో నొకటి డీకొన సిద్ధపడుచుండును; వీటిలో బలహీనమైనది కూలును.

అతః పురుషయత్నేన యతితవ్యం యథాతథా
పుంసా తంత్రేణ సద్యోగాద్యేనాశ్వద్యతనో జయేత్. 6

అందువలన, శాస్త్రవిధి ననుసరించి పూర్వపుకర్మలను బలహీనమొనర్చు సత్కర్మల, నీ జన్మలో నొనర్పఁదగును.

ద్వౌహుడావివ యుధ్యేతే పురుషార్థౌ సమాసమౌ
ఆత్మీయశ్చాన్యదీయశ్చ జయత్యతిబలస్తయోః. 7

సమబలములును, న్యూనాధిక బలములునునగు స్వకర్మలును, ఇతరుల కర్మలును, మేకలవలె డీకొనుచుండును. (స్వకర్మలనగా, మనుజుఁడొనర్చు తపస్సుమున్నగు కర్మలు; ఇతరుల కర్మలనగా, దేవత లొనర్చు విఘ్నాదులు) వీటిలో బలవత్తరమైనది జయమొందును.

అనర్థః ప్రాప్యతే యత్ర శాస్త్రితాదపి పౌరుషాత్
అనర్థకర్తృ బలవత్తత్ర జ్ఞేయం స్వపౌరుషమ్. 8

శాస్త్రబోధిత సుకర్మల నొనర్చినను రోగాది అరిష్టములు సంభవించిన, స్వీయదుష్కర్మ ప్రబలముగ నున్నదని గ్రహింపదగును.

పరంపౌరుష మాశ్రిత్య దంతైర్దంతాన్ విచూర్ణయన్
శుభేనాశుభముద్యుక్తం ప్రాక్తనం పౌరుషం జయేత్. 9

దృఢముగ మంగళజనకములగు కర్మల నాశ్రయించిన ఫలోన్ముఖములగు ప్రాక్తన కర్మల నుఁగూడ, పళ్లతో పళ్లను నలుగగొట్టునట్లు, జయింపవచ్చును.

ప్రాక్తనః పురుషార్థోఽసౌ మాం నియోజయతీతి ధీః
బలాదధస్పదీకార్యా ప్రత్యక్షాదధికా న సా. 10

ప్రాక్తనకర్మయే నన్నిట్టిపనిని చేయించుచున్నదనుభావమును అణగద్రొక్కవలయును. ఇట్టితలఁపు ప్రత్యక్షకర్మలముందు నిలంబడజాలదు.

తావత్తావత్ ప్రయత్నేన యతితవ్యం సుపౌరుషమ్
ప్రాక్తనం పౌరుషమ్ యావదశుభం శామ్యతి స్వయమ్. 11

ప్రాక్తనదురదృష్టము జయింపబడనంతవఱకు, శాస్త్రోచిత సత్కర్మల నొనర్చుచునే యుండునది.

దోషః శామ్యత్యసందేహం ప్రాక్తనోఽద్యతనైర్గుణైః
దృష్టాంతోఽత్ర హ్యస్తనస్య దోషస్యాద్యగుణైః క్షయః. 12

పూర్వకర్మలు, ప్రస్తుత మొనర్పబడు కర్మలవలన పరాస్తములగునను విషయము నిశ్చితము. ప్రస్తుత కర్మలవలన, ఆగామిదోషములు నివారితమగుటయే దీనికి ఉదాహరణము.

అసద్దైవ మధఃకృత్వా నిత్యముద్రిక్తయా ధియా
సంసారోత్తరణం భూత్యై యతేతాఽధాతుమాత్మని. 13

ప్రయత్నశీలమగు బుద్ధిబలమున అశుభాదృష్టముల దూరమొనర్చి, సంసారమును తరించు ఉపకరణములగు శమదమాదులను బొంద యత్నింపవలెను.



నగంతవ్యమనుద్యోగైః సామ్యం పురుషగర్దభైః
ఉద్యోగస్తు యథాశాస్త్రం లోకద్వితయసిద్ధయే. 14

ప్రయత్నవిహీనుడు గర్దభమువంటివాడు; ఇతడు పరమపదమును చేరజాలడు. శాస్త్రానుసారము యత్నించువాడు ఇహపరముల రెంటినిఁ బడయును.

సంసారకుహరాదస్మాన్నిర్గంతవ్యం స్వయంబలాత్
పౌరుషం యత్నమాశ్రిత్య హరిణేవారిపంజరాత్. 15

సింహము మనుజులుంచిన పంజరమునుండి, వెలువడనట్లు, ఈ సంసార కుహరమునుండి, పౌరుషమునాశ్రయించి బలపూర్వకముగ వెలువడుట కర్తవ్యము.

ప్రత్యహం ప్రత్యవేక్షేత దేహం నశ్వరమాత్మనః
సంత్యజేత్ పశుభిస్తుల్యం శ్రయేత్ సత్పురుషోచితం. 16

శరీర మస్థిరమని ప్రతిదినము విచారింపవలెను. పశుతుల్యమగు మూఢత్వమును త్యజించునది. సాధుసాంగత్యమును, సచ్ఛాస్త్రపఠనాదులను ఒనర్చునది.

కించిత్ కాంతాన్నపానాది కలిలం కోమలం గృహే
వ్రణే కీట ఇవాస్వాద్య వయః కార్యం న భస్మసాత్. 17

ఈగ పురుపుమీద వ్రాలి రక్తము, చీము మున్నగువానిని త్రాగునట్లు, గృహము నందుండి అన్నపానాది భోగముల కాలమును దగుల పెట్టుట కూడనిపని.

శుభేన పౌరుషేణాశు శుభమాసాద్యతే ఫలమ్
అశుభేనాశుభం నిత్యం దైవంనామ న కించన. 18

శుభకర్మలవలన శుభము చేకూరును; అశుభకర్మలవలన అశుభములభించును. దైవము (అదృష్టము) అను స్వతంత్ర వస్తు వింకొకటి వేరుగ లేదు.

ప్రత్యక్షమాన ముత్సృజ్య యోఽనుమానముపైత్యసౌ
స్వభుజాభ్యామిమౌ సర్పావితి ప్రేక్ష్య పలాయతే 19

ప్రత్యక్ష ప్రమాణమును వీడి అనుమానప్రమాణమును గైకొనినచో, తనచేతులనుగాంచి పాములనుకొని పారిపోవలసియుండును.

దైవం సంప్రేరయతి మామితి దగ్ధధియాం ముఖమ్
అదృష్టశ్రేష్ఠ దృష్టీనాం దృష్ట్వా లక్ష్మీర్నివర్తతే. 20

అదృష్టమే నన్నిపని నొనర్పఁజేయుచున్నదని తలచువారి ముఖమును గాంచ, లక్ష్మి ఇష్టపడదు.

తస్మాత్ పురుషయత్నేన వివేకం పూర్వమాశ్రయేత్
ఆత్మజ్ఞాన మహార్థాని శాస్త్రాణి ప్రవిచారయేత్. 21

అందువలన, ముముక్షువగువాడు పురుషకారబలమున మొట్టమొదట సాధనచతుష్టయ సంపత్తిని ఆశ్రయింపవలెను. మఱియు, ఆత్మజ్ఞానోద్బోధకములగు శాస్త్రములనుఁ బఠింపవలెను.

చిత్తే చింతయతామర్థం యథాశాస్త్రం నిజేహితైః
అసంసాధయతామేవ మూఢానాం ధిగ్ దురీప్సితం. 22

మనస్సున కోరికలఁ గోరుకొని, శాస్త్రవిధిననుసరించి వానినిఁబొంద యత్నింపని మూఢుల భోగలిప్సకు ధిక్కారము.

పౌరుషంచ నవానంతం నయత్నమభివాంఛ్యతే
నయత్నేనాపి మహతా ప్రాప్యతే రత్నమశ్మతః. 23

శాస్త్రవిహితపురుషకారము ఫలప్రదమే; దీనికంతులేదని తలంపరాదు. కాని, రాతినుండి రత్నమును బడయజాలము; ఇట్టి యత్నము వ్యర్థము. శాస్త్రచోదితయత్న మెన్నటికిని వ్యర్థమవదు.

యథాఘటః పరిమితో యథా పరిమితః పటః
నియతః పరిమాణస్థః పురుషార్థ స్తథైవచ. 24

లోకమున ఘటపటాదులకు పరిమాణమున్నట్లే, పురుషార్థమునకును బరిణామమున్నది; ఒనర్చిన ప్రయత్నమునుబట్టియే ఫలముసిద్ధించును.

సచసచ్ఛాస్త్ర సత్సంగ సదాచారైర్నిజం ఫలమ్
దదాతీతి స్వభావోఽయ మన్యథా నార్థసిద్ధయే. 25

సత్ శాస్త్రవిధిననుసరించి, సత్సంగ మొనర్చి, సదాచారపూర్వకముగ ఒనర్చినకర్మయే సంపూర్ణఫలప్రదమగును; ఇట్లొనర్పకపోయిన ఫలమొసఁగదు. కర్మయొక్క స్వభావమే ఇట్టిది.

స్వరూపం పౌరుషస్యైత దేవం వ్యవహరన్నరః
యాతినిష్ఫలయత్నత్వం నకదాచన కశ్చన. 26

ఇత్యాది పౌరుషముయొక్క స్వరూపము. దీనినంతటిని గ్రహించి, చరించిన మనుజుఁ డెన్నడును విఫలయత్నుఁడుకాడు.

దైన్యదారిద్ర్య దుఃఖార్తా అప్యన్యే పురుషోత్తమాః
పౌరుషేణైవ యత్నేన యాతా దేవేంద్రతుల్యతామ్. 27

హరిశ్చంద్రాదులగు పురుషశ్రేష్ఠులు దారిద్ర్యదుఃఖమునఁ గలత చెందినవారయ్యు, పురుషకార ప్రభావమున ఇంద్రతుల్యులైరి.



ఆబాల్యాదలమభ్యస్తైః శాస్త్రసత్సంగమాదిభిః
గుణైః పురుషయత్నేన స్వార్థః సంప్రాప్యతే యతః. 28
ఇతిప్రత్యక్షతో దృష్ట మనుభూతం శ్రుతం కృతమ్
దైవాత్తమితి మన్యంతే యే హతాస్తే కుబుద్ధయః. 29

బాల్యమునుండి మిక్కుటముగ మాటిమాటికి అభ్యసింపఁబడిన శాస్త్రచర్చ, సత్సంగాదులవలన, కోరునది సిద్ధించుటయే పురుషకారముయొక్క ఫలము అగుటఁజేసి, ప్రత్యక్షములును, అనుభూతములును, దృష్టములును, శ్రుతములును, అనుష్ఠితములునునగు కార్యములను అదృష్టములుగ తలచు మూఢజనులు జీవన్మృతులు.

ఆలస్యం యది నభవేజ్జగత్యనర్థః
కోనస్యాద్బహుధనకో బహుశ్రుతో వా
ఆలస్యాదియమవనిః ససాగరాంతా
సంపూర్ణా నరపశుభిశ్చ నిర్ధనైశ్చ. 30

అనర్థహేతువగు సోమరితనమే లేకున్న, గొప్పధనికుడుగనో లేక దొడ్డపండితుడుగనో అవనివాఁ డెవడుండెడువాడు? ఈ సోమరితనమువలననే, సముద్రములతోఁగూడిన ఈ ధరామండలము మూర్ఖులతోడను, దరిద్రులతోడను నిండియున్నది.

బాల్యేగతేఽవిరతకల్పిత కేలిలోలే
దోర్దండమండితవయఃప్రభృతి ప్రయత్నాత్
సత్సంగమైః పదపదార్థవిశుద్ధబుద్ధిః
కుర్యాన్నరః స్వగుణదోషవిచారణాని. 31

కల్పితక్రీడలతో నిరంతరము చంచలమై తనరు బాల్యము గడచినతోడనే, నిత్యానిత్యవస్తువివేకమాదిగాఁగల సుగుణముల నలవరచుకొని, యౌవనమునుండియే, సత్సంగ మొనర్చుచు, స్వీయ గుణదోషములను బరీక్షించుకొనుచుండవలెను.

శ్రీవాల్మీకిరువాచ:—

ఇత్యుక్తవత్యథ మునౌ దివసో జగామ
సాయంతనాయ విధయేఽస్తమినో జగామ
స్నాతుం సభాకృతనమస్కరణా జగామ
శ్యామాక్షయే రవికరేణ సహాజగామ. 32

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే ముముక్షువ్యవహార
ప్రకరణే పౌరుషస్థాపనంనామ పంచమః సర్గః ॥ 5 ॥

ఇతి ప్రథమో దివసః

వాల్మీకి:— మునిశ్రేష్ఠుఁడగు వసిష్ఠుఁడిట్లు నుడువుచుండ, సూర్యాస్తమయమయ్యెను. రాజును, మునిమండలియు వసిష్ఠునకు నమస్కరించి, స్నానాది సాయంకృత్యముల నొనర్చుకొనఁ జనిరి. ♦

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు ముముక్షువ్యవహార ప్రకరణమున పౌరుషస్థాపనమను పంచమ సర్గము ॥ 5 ॥

ఇది ప్రథమదినము.

---

## షష్ఠః సర్గః.

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

తస్మాత్ ప్రాక్పౌరుషాద్దైవం నాన్యత్ తత్ ప్రోఝ్య దూరతః
సాధుసంగమ సచ్ఛాస్త్రైర్జీవముత్తారయేద్బలాత్. 1

వసిష్ఠుఁడు:— అందువలన, ప్రాక్తన కర్మకాక అదృష్టమను వస్తువింకొకటిలేదు. అదృష్టమనుదానిని దూరమొనర్చి, సాధుసంగమ సచ్ఛాస్త్రాలోచనల వలన తీవ్రముగ యత్నించి జీవుని ఉద్ధరింపవలెను.

యథాయథా ప్రయత్నః స్యాత్ భవేదాశు ఫలం తదా
ఇతిపౌరుషమేవాస్తి దైవమస్తు తదేవచ. 2

ఒనర్చు యత్నమును బట్టియే ఫలముండును; ఇట్లే అదృష్టముకూడ పౌరుషము ననుసరించును.

దుఃఖాద్యథా దుఃఖకాలే హా కష్టమితి కథ్యతే
హా కష్టశబ్దపర్యాయస్తథా హా దైవమిత్యపి. 3

దుఃఖమనుభవించు సమయమున లోకులు "అహా! కష్టము" అని నుడువునట్లే, పూర్వకర్మలను గురించి "అహా! అదృష్టము" అందురు. (ఇది పౌరుషముగాక వేరొండు కాదే!)

---

♦ ఇది ఈ శ్లోకమునకు లభించు సరళార్థము. టీకాకారుని అభిప్రాయమున, ఇట్లర్థమొనర్చిన భవిష్యత్సందర్భమున విరోధము సంభవించును. ఆయన ఒనర్చిన అర్థము:— దేవదూత:— వాల్మీకి భరద్వాజునితో నిట్లు ప్రసంగించుచుండ, సాయంకృత్యముల నాచరించుటకు మూలకారణమైన, సూర్యాస్తమయమయ్యెను. మునులుగూడ, వాల్మీకికి నమస్కరించి, స్నానమొనర్పఁ జనిరి. అనంతరము, రాత్రిగడచ సూర్యకిరణములు పొడసూపి, ప్రాతఃకాలమయ్యెను.



ప్రాక్స్వకర్మేతరాకారం దైవంనామ నవిద్యతే
బాలః ప్రబలపుంసేవ తజ్జేతుమిహ శక్యతే. 4

ప్రాక్తనకర్మలు గాక దైవ మనునది వేరొండులేదు. బలశాలియగు పురుషుఁడు బాలుని లోబర్చుకొనగలిగినట్లు, అనాయాసముగా ఈ అదృష్టమునుఁగూడ లోబర్చుకొనవచ్చును.

హ్యస్తనో దుష్ట ఆచార ఆచారేణాద్య చారుణా
యథాశు శుభతామేతి ప్రాక్తనం కర్మ తత్తథా. 5

ఈ జన్మయందొనర్చిన అశుభకర్మలను ప్రాయశ్చిత్తాది కార్యములవలన శుభములుగ మార్చునట్లు, పూర్వకర్మలనుగూడ పౌరుషమువలన శుభప్రదములుగ నొనర్పవచ్చును.

తజ్జయాయ యతంతే యే నలోభ లవలంపటాః
తే దీనాః ప్రాకృతా మూఢాః స్థితా దైవపరాయణాః. 6

అల్పవిషయలోభమునంబడి, దైవమును జయింపయత్నింపక దానికి లోబడియుండువారు దీనులును, హీనులునగు పరమమూఢులు.

పౌరుషేణ కృతంకర్మ దైవాత్ యదభినశ్యతి
తత్రనాశయితుర్జ్ఞేయం పౌరుషం బలవత్తరమ్. 7

పురుషప్రయత్నము విఫలమైన పూర్వజన్మమందలి పురుషకారము ప్రబలముగనున్నదని గ్రహింపవలెను.

యదేకవృంతఫలయోరథైకం శూన్యకోటరం
తత్ర ప్రయత్నః స్ఫురితస్తథా తద్రసనంవిదః 8

ఒకే గుత్తియందున్న రెండుపళ్లలో ఒకదానియందు రసములేకున్న, దానికి, కారణము ఫలభోక్త (తుమ్మెదలు మొదలుగాగల కీటకములు) యొక్క కర్మయేయని గ్రహింపవలెను.

యత్రప్రయాంతి జగద్భావాః సంసిద్ధా అపి సంక్షయమ్
క్షయకారకయత్నస్య హ్యత్రజ్ఞేయం మహద్బలమ్. 9

జగత్తునందున్న ప్రసిద్ధములగు పదార్థములుగూడ క్షయమందుచున్నవి. ఇయ్యెడ క్షయకర్త యొక్క బలమును గ్రహింపనగును.

ద్వావాహుడావివ యుధ్యేతే పురుషార్థౌ పరస్పరమ్
య ఏవ బలవాంస్తత్ర స ఏవ జయతి క్షణాత్. 10

ప్రాక్తనములును, ఐహికములును నగు పురుషకారములు రెండును మేకపోతులవలె, ఒకదానితోనొకటి యుద్ధమొనర్చును. వీటిలో, ఎద్దానిబలమధికమో, అయ్యదియే క్షణములో జయమందును.

భిక్షుకో మంగళేభేన నృపో యత్ క్రియతే బలాత్
తదమాత్యేభ పౌరాణాం ప్రయత్నస్య బలం మహత్. 11

రాజవంశము లోపించిన, అమాత్యాదులు గజమును మంగళాలంకారముల నలంకరించి, అది ఎన్నుకొనిన భిక్షుకుని రాజొనర్చుపట్ల, మంత్రులయొక్కయు, పౌరులయొక్కయు, ఏనుగుయొక్కయు ప్రయత్నబలమేయని గ్రహింపవలయును. ఇట అదృష్టమునకు తావులేదు.

పౌరుషేణాన్నమాక్రమ్య యథా దంతేన చూర్ణ్యతే
అన్యః పౌరుషమాశ్రిత్య తథా శూరేణ చూర్ణ్యతే. 12

పురుషుఁడు నిజయత్నమువలననే అన్నమును గైకొని నమలునట్లు, బలశాలి పౌరుష బలముననే ఇతరుని (బలహీనుని లేక అదృష్టమును) చూర్ణ మొనరించును.

అనుభూతా హి మహతాం లఘవో యత్నశాలినామ్
యథేష్టం వినియోజ్యంతే తేన కర్మసు లోష్టవత్. 13

అందువలననే, బలహీనులు బలవంతులకు (సేవకాది) భోగ్యవస్తువులగుచున్నారు; బలవంతులు వారిని తమ ఇచ్ఛవచ్చిన కార్యముల, ఎండినమట్టి ముద్దలవలె వినియోగించుచున్నారు.

శక్తస్య పౌరుషం దృశ్యమదృశ్యంవాపి యద్భవేత్
తద్దైవమిత్యశక్తేన బుద్ధమాత్మన్యబుద్ధినా. 14

సమర్థుఁడగు వ్యక్తియొక్క ప్రయత్నము దృష్టమేయగుగాక, అదృష్టమేయగుగాక; బలహీనుడును, మూఢుడునగు వ్యక్తి దానిని దైవమేయనును

భూతానాం బలవద్భూతం యన్న దైవ మితిస్థితమ్
తత్తేషామప్యధిష్ఠాతృ సతామేతత్ స్ఫుటం మిథః. 15

ఈసమర్థ వ్యక్తికంటె సమర్థుడగు వాడింకొక డున్నందువలన, అదృష్టమనునది లేదని స్పష్టమగుచున్నది.

శాస్త్రామాత్యేభపౌరాణా మవికల్పా స్వభావధీః
యా సా భిక్షుకరాజ్యస్య కర్త్రీ ధర్త్రీ ప్రజాస్థితేః. 16

శాస్త్రము, మంత్రులు, హస్తి, పౌరులు—వీరి సమానాభిప్రాయ బుద్ధియే భిక్షుకునకు రాజ్యమొసంగినది. ప్రజలను పాలించుచున్నది.

భిక్షుకో మంగళేభేన నృపో యత్క్రియతే క్వచిత్
ప్రాక్తనం పౌరుషం తత్ర బలవద్వాపి కారణమ్. 17

ఇంకొకపట్ల, భిక్షుకుని రాజుగనొనర్చుపట్ల వాని పూర్వప్రయత్నమే కారణము కావచ్చును.

ఐహికః ప్రాక్తనం హన్తి ప్రాక్తనోఽద్యతనం బలాత్
సర్వదా పురుషస్పంద స్తత్రానుద్వేగవాన్ జయీ. 18



ద్వయోరద్యతనస్యైవ ప్రత్యక్షాత్ బలితా భవేత్
దైవం జేతుం యతో యత్నై ర్బాలో యూనేవ శక్యతే. 19

ఈ జన్మయందొనర్చిన యత్నము, పూర్వపౌరుషమును నష్టపరచ, పూర్వపౌరుషము మరల ఈ జన్మయందలి పౌరుషమును నాశన మొనర్చినపట్ల, చలింపనివాడే జయమందును. ప్రాక్తనమును, ఐహికమునునగు పురుష కారములమధ్య, ఐహికమునే అధికబలముగ, ఎంచవలెను. అందువలన, బాలుని యువకుఁడనాయాసముగ జయించునట్లు, యత్నించిన ప్రాక్తనమును జయింపవచ్చును.

మేఘేన నీయతే యద్వద్వత్సరోపార్జితా కృషిః
మేఘస్య పురుషార్థోఽసౌ జయత్యధికయత్నవాన్. 20

సంవత్సరమంతయు కష్టపడి పండించినపంట ఒక్కరోజులో వానదెబ్బకు పాడైనపట్ల, అది మేఘుని పురుషార్థము (ప్రయత్నము) అని తెలియవలెను. — అధికముగ యత్నించువాడు జయించునుకదా.

క్రమేణోపార్జితేఽప్యర్థే నష్టే కార్యా న ఖేదితా
న బలం యత్ర మే శక్తం తత్ర కా పరివేదనా. 21

కష్టపడి ఆర్జించిన విత్తమంతయు నష్టమైన, (మరలపొందుటకు యత్నింపవలెనుగాని అట్లొనర్పక, ఊరక) దుఃఖించుట అనుచితము. అనువుగానిచోట శోకించిన లాభమేమి?

యన్న శక్నోమి తస్యార్థే యది దుఃఖం కరోమ్యహమ్
తదమారితమృత్యోర్మే యుక్తం ప్రత్యహరోదనమ్. 22

ఒనర్పలేనిదానికొఱకు దుఃఖించుటనుచితము. అట్లు దుఃఖింపవలసిన, జయింపవీలులేని మృత్యువును గురించి ప్రతిదినము దుఃఖించుచుండ వలసినదే కదా!

దేశకాలక్రియాద్రవ్యవశతో విస్ఫురంత్యమీ
సర్వ ఏవ జగద్భావా జయత్యధికయత్నవాన్. 23

ఈ జగత్తున పదార్థములన్నియు, దేశ, కాల, క్రియా, ద్రవ్యముల శక్తిననుసరించి ప్రకాశితములగుచున్నవి. వీటిలో, అధికయత్నశాలియగునది జయించును.

తస్మాత్ పౌరుషమాశ్రిత్య సచ్ఛాస్త్రైః సత్సమాగమైః
ప్రజ్ఞామమలతాం నీత్వా సంసారజలధిం తరేత్. 24

అందువలన, పౌరుషబలము నాశ్రయించి, సాధుసంగ, శాస్త్రవిచారములవలన చిత్తశుద్ధిని సంపాదించి, సంసార సాగరమును దాటవలెను.

ప్రాక్తనశ్చైహికశ్చేమే పురుషార్థౌ ఫలద్రుమౌ
సంజాతౌ పురుషారణ్యే జయత్యభ్యధికస్తయోః. 25

పురుషులను ఈ అరణ్యమందు ప్రాక్తన, ఐహిక పురుషకారములను రెండు ఫలవృక్షములున్నవి. వీటిలో నధికమైనది జయించును.

కర్మ యః ప్రాక్తనం తుచ్ఛం న నిహంతి శుభేహితైః
అజ్ఞో జంతురనీశోఽసావాత్మనః సుఖదుఃఖయోః. 26

ఏ పురుషుఁడు నిజప్రయత్నముఁజేసి ప్రాక్తనకర్మల నణఁగద్రొక్కఁడో, అతనికి సుఖ దుఃఖముల రెంటియందును స్వాతంత్ర్యము లేదు.

ఈశ్వరప్రేరితో గచ్ఛేత్ స్వర్గం నరకమేవ వా
స సదైవ పరాధీనః పశురేవ న సంశయః. 27

పశుతుల్యుఁడగు ఈ పురుషుఁడు ఈశ్వర ప్రేరితుఁడై స్వర్గనరకముల కరుగుచు వచ్చుచుండునే గాని, ఇతడు సర్వదా పరాధీనుడు; ఇతనికి మోక్షము లేదు.

యస్తూదారచమత్కారః సదాచార విహారవాన్
స నిర్యాతి జగన్మోహాత్ మృగేంద్రః పంజరాదివ. 28

సదాచార సంపన్నుడును, ప్రయత్నకుశలుఁడునునగు వ్యక్తి, సింహము పంజరమును భేదించి వెలువడునట్లు, ఈ జగన్మాయనుండి వెలువడును.

కశ్చిన్మాం ప్రేరయత్యేవ మిత్యనర్థకుకల్పనే
యః స్థితో దృష్టముత్సృజ్య త్యాజ్యోఽసౌ దూరతోఽధమః. 29

పురుషకారమును విడచి, "ఎవరో నన్ను ప్రయత్నింపజేయుచున్నారు." అని అనర్థకల్పనల నూగులాడు వ్యక్తిని దూరముగ పరిత్యజించుటయే మేలు.

వ్యవహార సహస్రాణి యాన్యుపాయాంతి యాంతిచ
యథాశాస్త్రం విహర్తవ్యం తేషు త్యక్త్వా సుఖాసుఖే. 30

వేనవేలుఁగ వ్యవహారములు మనముందరకు వచ్చుచు పోవుచున్నవి. వీటియందు రాగద్వేషము లుంచక శాస్త్రానుసార మాచరించుటయే ఉత్తమము.

యథా శాస్త్రమనుచ్ఛిన్నాం మర్యాదాం స్వామనుజ్ఝతః
ఉపతిష్ఠంతి సర్వాణి రత్నాన్యంబునిధావివ. 31

శాస్త్రానుసారము స్వీయమర్యాదను రక్షించుకొనువానికడకు, సముద్రమున రత్నములు చేరునట్లు, అభీష్టములన్నియు వచ్చిచేరును.

స్వార్థప్రాపక కార్యైకప్రయత్నపరతా బుధైః
ప్రోక్తా పౌరుషశబ్దేన సా సిద్ధ్యై శాస్త్రయంత్రితా. 32

సుఖదాయకమును, దుఃఖనివృత్తికరమునునగు యత్నమునే బుధులు పౌరుషమని నిర్ణయించిరి. శాస్త్రవిహితమగు ఇట్టియత్నమే పురుషార్థహేతువు.



క్రియయా స్పందధర్మిణ్యా స్వార్థసాధకతా స్వయమ్
సాధుసంగమసచ్ఛాస్త్రతీక్ష్ణయోన్నీయతే ధియా. 33

బుద్ధిమంతులగు పురుషులు, శుశ్రూష, స్వాధ్యాయము, సాధుసంగము, శ్రవణాదిక్రియలవలన చిత్తమును కలుషరహితమొనర్చి, ఆత్మోద్ధరణ మొనర్చుకొని, ఈప్సితసిద్ధిని బడయుచున్నారు.

అనంతం సమతానందం పరమార్థం విదుర్బుధాః
సయేభ్యః ప్రాప్యతే నిత్యం తే సేవ్యాః శాస్త్రసాధవః. 34

బుధులు, అజ్ఞానజనితమగు వైషమ్య (—ద్వైత) నివృత్తిపూర్వకమగు సమతానందమునే పరమపురుషార్థమని ఎఱుంగుదురు. ఇది లభించు శాస్త్రములను సాధువులను, సతతము సేవింపవలెను.

దేవలోకాదిహాగత్య లోకద్వయహితం భవేత్
ప్రాక్తనం పౌరుషం తద్వై దైవశబ్దేన కథ్యతే. 35

పరలోకమున ననుభవింపగ మిగిలి, మనతో ఈ లోకమునకు వచ్చిన ప్రాక్తనకర్మనే దైవ మందురు.

తద్వ్యుక్తమేతదేతస్మిన్నాస్తి నాపవదామహే
మూఢైః ప్రకల్పితం దైవం మన్యంతే యే క్షయంగతాః. 36

భ్రాంతమగు అదృష్టమును నిందించువారిని నిందింపము. పురుషకారమును త్యజించి, మూఢులచే కల్పింపఁబడిన, అదృష్టమును ఆశ్రయించినవారిని నిందింతుము. ఇట్టివారు నశింతురు.

నిత్యం స్వపౌరుషాదేవ లోకద్వయహితం భవేత్
హ్యస్తనీ దుష్క్రియాభ్యేతి శోభాం సత్క్రియయా యథా. 37
అద్యైవం ప్రాక్తనీ తస్మాద్యత్నాద్యః కార్యవాన్భవేత్
కరామలకవద్దృష్టం పౌరుషాదేవతత్ఫలం
మూఢః ప్రత్యక్షముత్సృజ్య దైవమోహే నిమజ్జతి. 38

నిజ పౌరుష బలముననే ఇహపరలోకముల రెంటను మంచిచేకూరును. ప్రాక్తన దుష్కర్మలు ప్రాయశ్చిత్తాది సత్కార్యముల శుభములుగమారి, శోభను గూర్చుకొనును. అందువలన పురుషుడు కార్యవంతుడవవలెను; పౌరుషబలమున ఫలము, అరచేతియందలి ఉసిరికాయవలె, లభించును. మూఢుడే ప్రత్యక్షమును బరిత్యజించి అదృష్టమోహమున నిమగ్నుడగును.

సకల కారణకార్యవివర్జితమ్
నిజ వికల్పబలాదుపకల్పితమ్
తదనపేక్ష్యహి దైవమసన్మయమ్
శ్రయ శుభాశయ పౌరుషమాత్మనః. 39

శుభాశయా! కార్యకారణములన్నిటినుండి విడివడిన చిత్తవృత్తిబలమున, కల్పితమును, మిథ్యయునగు దైవము నపేక్షింపక, పౌరుషము నాశ్రయింపుము.

శాస్త్రైః సదాచారవిజృంభిత దేశధర్మైః
యత్కల్పితం ఫలమతీవ చిరప్రరూఢమ్
తస్మిన్ హృది స్ఫురతి చోపనమేతి చిత్త
మంగావలీ తదను పౌరుషమేతదాహుః. 40

చిరప్రసిద్ధములగు చిత్తశుద్ధి, జ్ఞానము, అను ఫలములు వేదాది శాస్త్రములవలనను, సత్పురుషుల ఆచరణవలనను ప్రకాశితమైన దేశధర్మము (స్వధర్మము) వలన లభించును; ఈ ఫలములను హృదయమున స్ఫురింపఁజేయు ఉపాయము, వాటిని బొందవలెననెడు వాంఛయే. పిదప, యత్నము దానియంతట ఆదేకలుగును. — దీనినే పౌరుషమందురు.

బుద్ధ్యైవ పౌరుషఫలం పురుషత్వమేత
దాత్మప్రయత్నపరతైవ సదైవకార్యా
నేయాతతః సఫలతాం పరమామథాసౌ
సచ్ఛాస్త్ర సాధుజన పండితసేవనేన. 41

మొమొదట, బుద్ధిబలమున పురుషకారము నాశ్రయించి సతతము యత్నించుట ఉచితము. పిమ్మట, శాస్త్రములను, సాధువులను పండితులను సేవించి ఈ ప్రయత్నమును సఫలమొనర్చుట కర్తవ్యము.

దైవపౌరుష విచార చారుభి
శ్చేదమాచరిత మాత్మపౌరుషమ్
నిత్యమేవ జయతీతి భావితైః
కార్యఆర్యజనసేవయోద్యమః. 42

దైవపౌరుషముల బలమునిట్లు విచారించి, పౌరుషము నాశ్రయించియే, ఆర్యులు ఫలమునందుదురు. కనుక, ఆర్యజనసేవితమగు శ్రవణమననాదుల నాశ్రయించి, జ్ఞానమును బడయనగును.

జన్మప్రబంధమయమామయమేవ జీవో
బుద్ధ్యైహికం సహజపౌరుషమేవ సిద్ధ్యై
శాన్తిం నయత్వవితతేన వశౌషధేన
స్పృష్టేన తుష్టపరపండితసేవనేన. 43

ఇతి శ్రీ వాసిష్ఠ—మహారామాయణే వాల్మీకీయే ముముక్షు వ్యవహార
ప్రకరణే దైవనిరాకరణం నామ షష్ఠః సర్గః ॥ 6 ॥

జీవులు స్వాభావికమగు ఐహిక పౌరుషమునే కార్యసిద్ధికగు ఉపాయముగనెంచి, నిత్యసంతుష్టులగు గొప్పపండితుల సేవయనుఉత్తమ ఔషధమువలన జననమరణ రూపమగు రోగమును శాంతింపజేసుకొందురు గాక!

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు ముముక్షు వ్యవహార
ప్రకరణమున దైవనిరాకరణమను షష్ఠ సర్గము. ॥ 6 ॥

# సప్తమః సర్గః.

వసిష్ఠ ఉవాచః—

ప్రాప్య వ్యాధివినిర్ముక్తం దేహమల్పాధివేదనమ్
తథాత్మని సమాదధ్యాద్యథా భూయో నజాయతే. 1

వసిష్ఠుడు:- వ్యాధులులేనట్టిదియు, స్వల్పములగు మానసికవ్యాధులతో గూడినట్టిదియునగు శరీరమునుబడసి, జీవుడు, మరల జన్మనెత్తవలసిన అవసరము లేకుండునట్లు ఆత్మయందు సమాధానుడగుగాక!

దైవం పురుషకారేణ యో నివర్తితు మిచ్ఛతి
ఇహ వాముత్ర జగతి స సంపూర్ణాభివాంఛితః. 2

పురుషకారమువలన అదృష్టమును నివారింప యత్నించువానికి, ఇహలోకమునను, పరలోకమునను గూడ అభీష్టసిద్ధియగును.

యే సముద్యోగ ముత్సృజ్య స్థితా దైవపరాయణాః
తే ధర్మమర్థం కామంచ నాశయన్త్యాత్మవిద్విషః. 3

అదృష్టమును నమ్మి ప్రయత్నరహితులైయుండు ఆత్మశత్రువులు, ధర్మార్థకామముల నాశనమొనర్చుకొనుచున్నారు. ఇక మోక్షము వారి కసలే లేదని వేరుగ చెప్పవలెనా?

సంవిత్స్పందో మనఃస్పంద ఇంద్రియస్పందమేవచ
ఏతాని పురుషార్థస్య రూపాణ్యేభ్యః ఫలోదయః. 4

తత్త్వజ్ఞాన వికాసము, పురుషార్థమును సాధింప నిచ్ఛ, కర్మేంద్రియముల ప్రవృత్తి - ఇవి పౌరుషముయొక్క స్వరూపములు; వీటినుండియే ఫలము లభించును.

యథాసంవేదనం చేతస్తథా తత్స్పందమృచ్ఛతి
తథైవ కాయశ్చలతి తథైవ ఫలభోక్తృతా. 5

మనస్సున ఎట్టి విషయము స్ఫురించునో చిత్తముగూడ అట్టి ఆకారమునే దాల్చును. ఇంద్రియముల యత్నము దీనినుండియే కల్గును. క్రియ ననుసరించియే ఫలముండును.

ఆబాలమేతత్సంసిద్ధం యత్రయత్ర యథాయథా
దైవంతు నక్వచిద్దృష్టం మతో జగతి పౌరుషమ్. 6

బాల్యమునుండి ఏ ఏ విషయములగురించి, ఏ ఏ ప్రయత్నము లొనర్పఁబడునో, ఫలముగూడ అటులనే యుండును. దైవ మెచ్చటను కనంబడదు. అందువలన, తెలుసదేమన, పౌరుష మొక్కటియే జగత్తుననున్నది.

పురుషార్థేన దేవానాం గురురేవ బృహస్పతిః
శుక్రో దైత్యేంద్రగురుతాం పురుషార్థేన చాస్థితః. 7

పురుషకారము వలననే బృహస్పతి దేవగురుడైనాడు. శుక్రుడు రాక్షసులకాచార్యుడై వెలయుచున్నాడు.

దైన్యదారిద్ర్యదుఃఖార్తా అపి సాధో నరోత్తమాః
పౌరుషేణైవ యత్నేన యాతాదేవేంద్రతుల్యతామ్. 8

సాధూ! దైన్యదారిద్ర్య దుఃఖములవలన పీడింపఁబడియు, ప్రయత్నశీలురగు మనుజులనేకులు పురుషకారబలమున నింద్రసములైరి.

మహాంతో విభవాస్వాదైర్నానాశ్చర్యసమాశ్రయాః
పౌరుషేణైవ దోషేణ నరకాతిథితాం గతాః. 9

కనివిని యెఱుఁగనట్టి సంపదలు గలిగిన మహాపాదులుగూడ అనేక వైభవముల భోగించియు; తమ ప్రయత్నదోషము వలననే, నరకమున కతిథులైనారు.

భావాభావసహస్రేషు దశాసు వివిధాసుచ
స్వపౌరుషవశాదేవ నివృత్తా భూతజాతయః. 10

జీవులు, వేలకువేలుగ సంభవించు ఆపదలను, సంపదలను, ఇతరములగు దశలను తమ పౌరుష బలమువలననే అవలీలగ దాటినారు.

శాస్త్రతోగురుతశ్చైవ స్వతశ్చేతి త్రిసిద్ధయః
సర్వత్ర పురుషార్థస్య నదైవస్య కదాచన. 11

శాస్త్రాలోచన, గురూపదేశము, నిజప్రయత్నము; ఈ మూటి సాయమువలననే పురుషార్థము సర్వత్ర సిద్ధించుచున్నది. దీని కదృష్టముతో సంబంధము లేదు.

అశుభేషు సమావిష్టం శుభేష్వేవావతారయేత్
ప్రయత్నాచ్చిత్తమిత్యేష సర్వశాస్త్రార్థసంగ్రహః. 12

అశుభ మార్గమున నడుగు చిత్తమును శుభమార్గమునకు ప్రయత్నబలమున మరలింపవలెను - ఇదియే సకలశాస్త్రముల అర్థము.

యచ్ఛ్రేయో యదతుచ్ఛంచ యదపాయవివర్జితమ్
తత్తదాచార యత్నేన పుత్రేతి గురవః స్థితాః. 13

"వత్సా! శుభదాయకమును, పరమ సత్యమును, అపాయరహితమునగు కర్మను యత్నపూర్వకముగ ఆచరింపుమనది" అని గురుజను లుపదేశింతురు.

యథాయథా ప్రయత్నోమే ఫలమాశు తథాతథా
ఇత్యహం పౌరుషాదేవ ఫలభాఙ్నతు దైవతః. 14

నే నేరీతిని ప్రయత్నింతునో, ఫలముకూడ అట్టిదిగనే లభించును. - అందువలన, నేను పౌరుషమువలననే ఫలము ననుభవించుచున్నానను విషయము నిక్కము. దైవమువలన నాకు ఫలము చేకూరుట లేదు.



పౌరుషాద్దృశ్యతేసిద్ధిః పౌరుషాద్ధీమతాంక్రమః
దైవమాశ్వాసనామాత్రం దుఃఖే పేలవబుద్ధిషు. 15

పౌరుషబలముననే కార్యసిద్ధికలదు; బుద్ధిమంతులు పౌరుషబలము నాశ్రయించియే కార్యమొనర్తురు. కష్టములు సంభవించినప్పుడు బుద్ధిహీనులను ఓదార్చుటకే దైవశబ్దముపయోగింపఁ బడుచున్నది.

ప్రత్యక్షప్రముఖైర్నిత్యం ప్రమాణైః పౌరుషక్రమః
ఫలితోదృశ్యతే లోకే దేశాంతరగమాదికః. 16

ఈలోకమున దేశాంతరగమనాదులవలన, పురుషకారమే ఫలవంతమని ప్రత్యక్షమగుచున్నది.

భోక్తా తృప్యతి నాభోక్తా గంతా గచ్ఛతి నాగతిః
వక్తా వక్తి నచావక్తా పౌరుషం సఫలం నృణామ్. 17

భుజించినవానికే తృప్తి; భుజింపనివానికి తృప్తియెట్లు చేకూరగలదు? నడచుచున్నవాడే అరుగగలడు; నడువనివాడెట్లు చనగలడు? వక్తయే చెప్పగలడు; మౌని మాట్లాడగలడా? అందువలన, పౌరుషము నరులకు సిద్ధిదాయకమని స్పష్టమగుచున్నది.

పౌరుషేణ దురంతేభ్యః సంకటేభ్యః సుబుద్ధయః
సముత్తరంత్యయత్నేన నతు మోఘతయానయా. 18

బుద్ధిమంతులగువారు పౌరుషము నాశ్రయించియే అనాయాసముగ గొప్పసంకటములనుండి విడివడుచున్నారు. అదృష్టమునునమ్మి ఊరక గూర్చుండిన వారిపట్ల నిట్టిదిసంభవ మయ్యెడిదికాదు.

యోయో యథాప్రయతతే స స తత్తత్ఫలైకభాక్
న తు తూష్ణీం స్థితేనేహ కేనచిత్ ప్రాప్యతే ఫలం. 19

ఏ యే వ్యక్తి, ఎట్లు ఎద్దానిని గుఱించి యత్నించునో, అతడట్టి ఫలము నందును; తూష్ణీంభావమును వహించి ఊరకున్నవాని కేమియు సిద్ధింపదు.

శుభేన పురుషార్థేన శుభమాసాద్యతే ఫలం
అశుభేనాశుభం రామ యథేచ్ఛసి తథాకురు. 20

శుభపురుషకారమువలన శుభఫలము నందవచ్చును; అశుభప్రయత్నమువలన అమంగళమే లభించును. రామా! ఇక నీ వెద్దానిని ఇచ్ఛింతువో, అద్దానినే ఒనర్చునది.

పురుషార్థాత్ ఫలప్రాప్తిర్దేశకాలవశాదిహ
ప్రాప్తా చిరేణ శీఘ్రంవా యాసా దైవమితి స్మృతా. 21

వెనువెంటనే గానీ, ఆలస్యముననే గానీ, దేశకాలాధీనముగ పౌరుషబలమున లభించుఫలమునే దైవమందురు.

నదైవం దృశ్యతే దృష్ట్యా నచ లోకాంతరే స్థితం
ఉక్తం దైవాభిధానేన స్వర్లోకే కర్మణఃఫలం. 22

సర్వమున అనుభవించు దానినే దైవమందురు. దైవమను, కళ్లకు కనబడనిదని గాని, ఇంకొక లోకమునందున్నదనికాని, కాదు.

పురుషో జాయతే లోకే వర్ధతే జీర్యతే పునః
న తత్ర దృశ్యతే దైవం జరాయౌవనబాల్యవత్. 23

పురుషుడీ లోకముననే జన్మించుచున్నాడు, పెరుగుచున్నాడు, ముదుసలియగుచున్నాడు; కాని, జరాయౌవన బాల్యములు ప్రత్యక్షములగునట్లు ఇచ్చట "అదృష్టము" కనబడుటలేదే !

అర్థప్రాపకకార్యైకప్రయత్నపరతా బుధైః
ప్రోక్తా పౌరుషశబ్దేన సర్వమాసాద్యతేఽనయా. 24

పరమార్థమును సాధించు యత్నమునే బుధులు పౌరుషమందురు; దీనివలన అభీష్టము లన్నియు లభించును.

దేశాద్దేశాంతరప్రాప్తిర్హస్తస్య ద్రవ్యధారణం
వ్యాపారశ్చ తథాంగానాం పౌరుషేణ న దైవతః. 25

ఒకచోటనుండి ఇంకొకచోటి కరుగుట, చేతులతో వస్తువులను దీసికొనుట, ఇట్టివేయగు తక్కిన ఇంద్రియముల ప్రయత్నములు - ఇవి పౌరుషబలముననే జరుగుచున్నవి. దైవబలమువలనగాదు.

అనర్థప్రాప్తికార్యైకప్రయత్నపరతా తు యా
ప్రోక్తా ప్రోన్మత్తచేష్టేతి న కించిత్ ప్రాప్యతేఽనయా. 26

చెడ్డనుగూర్చి పనుల నొనర్చుట పిచ్చిపని; దీనివలన కలుగగలదేమియు లేదు;

క్రియయా స్పందధర్మిణ్యా స్వార్థసాధకతా స్వయమ్
సాధుసంగమసచ్ఛాస్త్రతీక్ష్ణయోన్నీయతే ధియా. 27

సత్సంగము, సచ్ఛాస్త్రపర్యాలోచనలవలన బుద్ధి నిశితమవ, అంగస్పందన వ్యాపారమున అనగా ప్రయత్నింప, కోరుకొనునది దొరకును.

అనంతసమతానందం పరమార్థం స్వకం విదుః
స ఏభ్యః ప్రాప్యతే యత్నాత్ సేవ్యాస్తే శాస్త్రసాధవః. 28

అజ్ఞానజనితమగు వైషమ్యనివృత్తి పూర్వకమగు అఖండానంద లాభప్రాప్తియే పరమపురుషార్థమని పండితులందురు. ఇట్టి పరమార్థము లభించు శాస్త్రములను, సత్పురుషులను సేవించుట ఉచితము.



సచ్ఛాస్త్రాదిగుణో మత్యా సచ్ఛాస్త్రాదిగుణాన్మతిః
వివర్ధేతే మిథోఽభ్యాసాత్ సరోఽబ్జావివ కాలతః. 29

యథాసమయమున సరోవరమున తామరలు తంపరలై వృద్ధినంది పరస్పరము శోభనిను మడింప జేసికొనునట్లు, సచ్ఛాస్త్ర సత్సంగములవలన బుద్ధియు, ఇట్టిబుద్ధివలన సచ్ఛాస్త్రసాధుసంగమములును వృద్ధినందును.

ఆబాల్యాదలమభ్యస్తైః శాస్త్రసత్సంగమాదిభిః
గుణైః పురుషయత్నేన స్వార్థః సంపద్యతే హితః. 30

బాల్యమునుండి సాధుసంగమ సచ్ఛాస్త్రముల నభ్యసించిన, వీటివలననే అనగా పురుషప్రయత్నమువలననే, హితకరమగు స్వార్థము ( = మోక్షము) సంపాదింపబడును.

పౌరుషేణ జితా దైత్యాః స్థాపితా భువనక్రియాః
రచితాని జగంతీహ విష్ణునా నచ దైవతః. 31

నిజప్రయత్నముననే విష్ణుమూర్తి రాక్షసులను జయించినాడు, జగత్తులను సృష్టించి రక్షించుచున్నాడు. అదృష్టబలమున కాదు.

జగతి పురుషకార కారణేఽస్మిన్
కురు రఘునాథ చిరం తథా ప్రయత్నమ్
వ్రజసి తరుసరీసృపాభిధానాం
సుభగ యథా న దశామశంక ఏవ. 32

ఇతి శ్రీ వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే ముముక్షువ్యవహార
ప్రకరణే పౌరుషప్రాధాన్య సమర్థనంనామ
సప్తమః సర్గః ॥7॥

రాఘవా! ఈ జగత్తున పురుష ప్రయత్నమే ఇష్టసిద్ధికి కారణము. శంకనువీడి, వృక్ష, సర్పాదులయొక్క స్థితి నందకుండునట్లు ఇటనే నీవు ప్రయత్నింపుము.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు, ముముక్షువ్యవహార
ప్రకరణమున పౌరుషప్రాధాన్య సమర్థనమను
సప్తమ సర్గము ॥7॥

## అష్టమః సర్గః.

శ్రీవసిష్ఠ ఉవాచః—

నాకృతిర్నచ కర్మాణి న స్పందో నపరాక్రమః
తన్మిథ్యాజ్ఞానవద్రూఢం దైవం నామ కిముచ్యతే. 1

వసిష్ఠుడు:— అదృష్టమనఁగేమియో చెప్పఁజాలము. ఇది మిథ్యాజ్ఞానమువలె రూఢము. దీనికి ఆకారములే, కర్మలేదు, చలనములేదు, పరాక్రమములేదు.

స్వకర్మఫలసంప్రాప్తావిదమిత్థమితీతి యాః
గిరస్తా దైవనామ్నైతాః ప్రసిద్ధిం సముపాగతాః. 2

ఒనర్చిన కర్మఫలము లభించిన "ఈ కర్మ కీఫలము గలిగినది" అని చెప్పుటయే దైవమను పేరిట ప్రసిద్ధిగాంచినది.

తతైవ మూఢమతిభిర్దైవమస్తీతి నిశ్చయః
ఆత్తో దురవబోధేన రజ్జ్వామివ భుజంగమః. 3

దీనివలననే (పైన జెప్పిన ప్రసిద్ధినిగాంచియే) మూఢవ్యక్తులు, భ్రాంతితో త్రాటియందు పాము నారోపించునట్లు దైవ మున్నదని నిశ్చయించుచున్నారు.

హ్యస్తనీ దుష్క్రియాభ్యేతి శోభాం సత్క్రియయా యథా
అద్యైవ్యం ప్రాక్తనీ తస్మాత్ యత్నాత్ సత్కార్యవాన్భవేత్. 4

అప్పటికప్పుడే ఒనర్చిన చెడ్డపని సత్కార్యములవలన మంచిగ మారునట్లు, ప్రాక్తనకర్మగూడ యత్నించిన శుభప్రదముకాగలదు. అందువలన మంచిపనుల నొనర్ప యత్నింపుచుండుము.

మూఢానుమానసంసిద్ధం దైవం యస్యాస్తి దుర్మతేః
దైవాద్దాహోఽస్తి నైవేతి గంతవ్యం తేన పావకే. 5

ఏ దుర్మతులు, మూఢులు అనుమానించి స్థాపించిన దైవమును నమ్ముదురో, వారు "దైవబలమున అగ్ని మమ్ముదహింపదు" అని నిశ్చయించి అగ్నిలోపడుట ఉచితము.

దైవయేవేహచేత్ కర్తృ పుంసః కిమివ చేష్టయా
స్నానదానాసనోచ్చారాన్ దైవమేవ కరిష్యతి. 6

ఈ ప్రపంచమున దైవమునకే కర్తృత్వమున్నయెడల, ఇక పురుషప్రయత్నమేల? దైవమే స్నాన, దాన, జపాదుల నొనర్చును.

కింవా శాస్త్రోపదేశేన మూఢోఽయం పురుషః కిల
సంచార్యతేతు దైవేన కిం కస్యేహోపదిశ్యతే. 7

మఱియు, శాస్త్రోపదేశముయొక్క ప్రయోజనమేమి? ఉపదేశించుట ఎందులకు? దైవమే అన్నిటిని ఒనర్చును — పురుషుఁడు ప్రయత్నమును వీడుగాక!



నచ నిస్పందతా లోకే దృష్టేహ శవతాం వినా
స్పందాచ్చ ఫలసంప్రాప్తిస్తస్మాద్దైవం నిరర్థకం. 8

శవముతప్ప, ఈ ప్రపంచమున యత్నింపని దింకొకటిలేదు. యత్నమువలననే ఫలము లభించును. అందువలన తేలునదేమన, దైవము (అదృష్టము) నిష్ప్రయోజనము.

నచామూర్తేన దైవేన మూర్తస్య సహకర్తృతా
పుంసః సందృశ్యతే కాచిత్ తస్మాద్దైవం నిరర్థకమ్. 9

ఆకృతిలేని దైవమును, ఆకృతికల్గిన మనుజుడును ఒనర్పుప్రయత్నములు సమానములుకావు; మిక్కుటమగు తారతమ్యమున్నది. అందువలన దైవము నిష్ప్రయోజనము.

మిథోంగాని సమాసాద్య ద్వయోరేకైకకర్తృతా
హస్తాదీనాం హతత్వే హ నదైవేన క్వచిత్కృతమ్. 10

కలమో లేక కత్తియో దొరకిన, రెండుచేతులలో నొకటి పనిచేయును; ఒకేసారిగ చేతులు రెంటితో వ్రాయవీలులేనందున, ఒక్కటియే పనినొనర్చును. కాలుసేతులు లేనివానిచే దైవమేమైన ఒనర్పింపగలదా?

మనోబుద్ధివదప్యేతద్దైవం నేహానుభూయతే
ఆగోపాలం కృతప్రజ్ఞైస్తేన దైవమసత్సదా. 11

ఈ జగత్తున మూఢుడగు గొల్లపిల్లవానినుండి మహామేధావియగు పండితునివఱకు, దైవమును మనో బుద్ధులవలె ప్రత్యక్షమొనర్చుకొనిన వారెవరులేరు; అందువలన దీనికి ఉనికిమనుటలేవు.

పృథక్చేత్ బుద్ధిరన్యోఽర్థః సైవచేత్ కాన్యతా తయోః
కల్పనాయాం ప్రమాణంచేత్ పౌరుషం కిం న కల్ప్యతే. 12

కర్మలనొనర్ప నుపయోగపడు బుద్ధి, దైవము—ఈరెండును వేరైన, దైవమును స్వీకరింపవలసిన అవసరములేదు. ఈ రెండును ఒకటియే, దైవమునననుసరించి బుద్ధి ప్రవర్తిల్లుచుండునందువా? మఱి, ఈ రెంటికిని భేదమేమున్నది? అందువలన, బుద్ధిగాక దైవమను వేరొక వస్తువున్నదని ఒప్పుకొనవక్కరలేదు. సమాన బుద్ధిబలముగల ఇర్వురు ఒకే ఫలమునంద యత్నింప, అందులో నొకడు కృతకృత్యుడై మఱొకడు ఫలమునందుట తటస్థింపనప్పుడు, దీనికింగారణము దైవమేయని చెప్పుటయేల? ప్రయత్నదోషమని నుడువరాదా— ఇట్లనిన దోషమేమి?

నామూర్తేనేన సంగోఽస్తి నభసేవ వపుష్మతః
మూర్తంచ దృశ్యతే లగ్నం తస్మాద్దైవం న విద్యతే. 13

ఆకాశమును శరీరము తాకజాలదు. అట్లే, రూపములేని దైవముతో కారణాంతరముయొక్క కలయిక అసంభవము. ఆకృతిగల రెండువస్తువులకే పరస్పర సంయోగము. అందువలన, దైవమనునది లేదని ఏర్పడుచున్నది.

వినియోక్త్రీహ భూతానామన్యస్యచ్చేజ్జగత్త్రయే
శేరతే భూతవృందాని దైవం సర్వం కరిష్యతి. 14

ఈ ప్రపంచమున నియోగకర్త దైవమేయైన, జీవుల నందరిని పరుండనిమ్ము. దైవమే వలసిన దానినంతటిని ఒనర్చును !

దైవేన త్వభియుక్తోఽహం తత్కరోమీదృశం స్థితమ్
సమాశ్వాసనవాగేషా న దైవం పరమార్థతః. 15

"నేను అదృష్టప్రేరితుడనై పనులనన్నిటిని ఒనర్చుచున్నాను, అదృష్టబలముననే అన్నియు ఇట్లు సిద్ధించుచున్నవి."— ఇది ఓదార్పుమాత్రమే. అసలునకు దైవము లేదు.

మూఢైః ప్రకల్పితం దైవం తత్పరాస్తే క్షయం గతాః
ప్రాజ్ఞాస్తు పౌరుషార్థేన పదముత్తమతాం గతాః. 16

మూఢులే అదృష్ట కల్పననొనర్చినారు; అదృష్టపరాయణులగువారు నశింతురు. బుద్ధిమంతులగువారు పురుషకారము వలననే గొప్పతనమందినారు.

యే శూరా యేచ విక్రాంతా యే ప్రాజ్ఞా యేచ పండితాః
తైస్తైః కిమివ లోకేఽస్మిన్ వద దైవం ప్రతీక్ష్యతే. 17

శూరులును, పరాక్రమయుతులును, బుద్ధిమంతులును, పండితులునునగువారేల దైవముకొఱకు వేచియుండవలెనో చెప్పుము.

కాలవిద్భిర్వినిర్ణీతా యస్యాతిచిరజీవితా
స చేజ్జీవతి సంఛిన్నశిరాస్తద్దైవముత్తమమ్. 18

దైవజ్ఞులు (జ్యోతిష్కులు) 'చిరంజీవి, చాలకాలము బ్రతుకును' అని చెప్పిన వాని తల ఊడినను జీవించియుండునో, దైవమే గొప్పదందును.

కాలవిద్భిర్వినిర్ణీతం పాండిత్యం యస్య రాఘవ
అనధ్యాపిత ఏవాసౌ తజ్జ్ఞశ్చేద్దైవముత్తమమ్. 19

రామా! దైవజ్ఞులచే పండితుడగునని నిర్ణయింపఁబడినవాడు, చదువకయే పండితుడైన అదృష్టమే గొప్పదందును.

విశ్వామిత్రేణ మునినా దైవముత్సృజ్య దూరతః
పౌరుషేణైవ సంప్రాప్తం బ్రాహ్మణ్యం రామ నాన్యథా. 20

రాఘవా! విశ్వామిత్రుడు అదృష్టమును దూరమున విడిచిపెట్టి పురుషకారమువలననే బ్రాహ్మణత్వమందినాడు. అదృష్టము నాశ్రయించికాదు.



అస్మాభిరపరైః రామ పురుషైర్మునితాంగతైః
పౌరుషేణైవ సంప్రాప్తా చిరం గగనగామితా. 21

రామా! మేముకూడ, పురుషకారము నాశ్రయించియే మునులమైతిమి; ఆకాశగమన శక్తిని సంపాదించితిమి.

ఉత్సాద్య దేవసంఘాతం చక్రస్త్రిభువనోదరే
పౌరుషేణైవ యత్నేన సామ్రాజ్యం దానవేశ్వరాః. 22

రాక్షసరాజులు పౌరుషము నాశ్రయించియే, దేవతలను నలుగగొట్టి, ముల్లోకముల తమ ఏలుబడిని సాగించిరి.

ఆలూనశీర్ణమాభోగి జగదాజహ్రురోజసా
పౌరుషేణైవ యత్నేన దానవేభ్యః సురేశ్వరాః. 23

దేవతలుగూడ పౌరషము నాశ్రయించియే, యుద్ధమున ఛిన్నమును జీర్ణమును ఒనర్పబడిన శత్రుసైన్యముగల (శత్రువుల హతమార్చి అనుట) ఈ జగత్తును హరించిరి.

రామ పౌరుషయుక్త్యాచ సలిలం ధార్యతేఽనయా
చిరం కిరణ్డకే చారు న దైవం తత్ర కారణమ్. 24

వెదుళ్ళతో నల్లిన బుట్టయందు నీరునిలుచుట పురుషప్రయత్నమువలననే; అదృష్టబలమునకాదు.

భరణాదాన సంరంభ విభ్రమభ్రమభూమిషు
శక్తతా దృశ్యతే రామ న దైవస్యామతేరివ. 25

రామా! కుటుంబపోషణము శత్రురాజ్యాపహరణము, భోగవిలాసములు, కోపమున నితరులనరికట్టుట— ఇత్యాదులగు పెక్కులు కష్టకార్యములు పురుషప్రయత్నమువలననే జరుగుచున్నవి. మణి, మంత్ర, ఔషధముల శక్తివలె, ఆశ్చర్యకరముగురీతిని అదృష్టము వీటినొనర్చుటలేదు; దీనిశక్తియే కనంబడుటలేదు.

సకలకారణకార్యవివర్జితమ్
నిజవికల్పవశాదుపకల్పితమ్
త్వమనపేక్ష్యహి దైవమసన్మయమ్
శ్రయ శుభాశయ పౌరుషముత్తమమ్. 26

ఇతి శ్రీ వాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే ముముక్షు వ్యవహార ప్రకరణే దైవనిరాకరణంనామ అష్టమః సర్గః ॥ 8 ॥

శుభాశయా; "చాలూమూలా" లేని భ్రాంతివలనఁ గల్పింపఁబడిన మిథ్యయగు దైవము నపేక్షింపక, ఉత్తమమగు పౌరుషము నాశ్రయింపుము.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు ముముక్షువ్యవహార ప్రకరణమున దైవనిరాకరణమను అష్టమ సర్గము ॥ 8 ॥

———— :o: ————

## నవమః సర్గః.

శ్రీరామ ఉవాచః—

భగవన్ సర్వధర్మజ్ఞ ప్రతిష్ఠాఫలమాగతమ్
యల్లోకే తద్వద బ్రహ్మన్ దైవం నామ కిముచ్యతే. 1

రాముఁడు:— సర్వధర్మజ్ఞా! విప్రవర్యా! భగవానుఁడా! ప్రపంచమున ప్రసిద్ధిగాంచిన ఈ దైవమను పదార్థము సత్యముగనున్నదా లేదా? చెప్పుడు. (వెనుక, దైవమను వస్తువసలే లేదని కొన్ని చోట్ల, పూర్వజన్మలయందలి కర్మయే దైవమని కొన్నిచోట్ల, చెప్పఁబడినది. అందువలన దైవమును గుఱించి చక్కఁగ తెలిసికొనుటకై ఈ ప్రశ్న యొనర్పబడినది.)

శ్రీ వసిష్ఠ ఉవాచః—

పౌరుషం సర్వకార్యాణాం కర్తృ రాఘవ నేతరత్
ఫలభోక్తృచ సర్వత్ర నదైవం తత్ర కారణమ్. 2

వసిష్ఠుఁడు:—పౌరుషమే పనులన్నిటిని ఒనర్చుచున్నది. ఫలితములన్నిటిని అదే యనుభవించుచున్నది. దైవము లేక మఱింకొక వస్తువు కర్తయునుకాదు, భోక్తయునుకాదు.

దైవం న కించిత్ కురుతే నభుంక్తే నచ విద్యతే
నదృశ్యతే నాద్రియతే కేవలం కల్పనేదృశీ. 3

దైవ మొనర్చున దేమియు లేదు; ఇది భోగించునదేమియులేదు. దీని నెవ్వరు గనుటలేదు. ఆదరించుటలేదు. ఇది కేవలము కల్పనామాత్రమే.

సిద్ధస్య పౌరుషేనేహ ఫలస్యఫలశాలినా
శుభాశుభార్థసంపత్తి ర్దైవశబ్దేన కథ్యతే. 4

ఫలప్రదమగు పౌరుషమువలన లభించు శుభాశుభ కర్మలను, లోకులు దైవమని వ్యవహరించుచున్నారు.



పౌరుషోపనతా నిత్యమిష్టానిష్టస్య వస్తునః
ప్రాప్తిరిష్టాప్యనిష్టావా దైవశబ్దేన కథ్యతే. 5

పౌరుషమువలన లభించు ఇష్టానిష్టములను అజ్ఞులగువారు దైవమనుచున్నారు.

భావీత్వవశ్యమేవార్థః పురుషార్థైకసాధనః
యః సోఽస్మిన్లోకసంఘాతే దైవశబ్దేన కథ్యతే. 6

ఒక్క పురుషార్థమువలననే ఈ లోకమున ఫల మవశ్యము లభించుచున్నది. దీనినే జనులు దైవమనుచున్నారు.

నను రాఘవ లోకస్య కస్యచిత్ కించిదేవ హి
దైవమాకాశరూపం హి కరోతి నకరోతిచ. 7

రాఘువా! దైవమునకు రూపములేదు. దైవమువలన ఎవరికైన, ఏదైన చేకూరినదనుట భ్రమయే. వాస్తవమునకు, దైవమొనర్చునదిగాని, ఒనర్పకుండునదిగాని ఏమియులేదు.

పురుషార్థస్య సిద్ధస్య శుభాశుభఫలోదయే
ఇదమిత్థం స్థితమితి యోక్తిస్తద్దైవ ముచ్యతే. 8

పురుషప్రయత్నము ననుసరించి శుభాశుభఫలములు లభించిన, జనులు మాటవరసకు "వీడి అదృష్ట మిట్లా ఉంది." అనినుడువుదురు. ఈ మాటయే దైవము. అసలునకు దైవములేదని భావము.

ఇత్థం మమాభవద్బుద్ధి రిత్థం మే నిశ్చయో హ్యభూత్
ఇతి కర్మఫలప్రాప్తౌ యోక్తిస్తద్దైవ ముచ్యతే. 9

కర్మఫలము లభింప "నాకిట్టి బుద్ధికలిగినది, ఇట్లు నిశ్చయించుకొంటిని, ఇట్టి ఫలము లభించినది" అందురు. ఈ మాటయే దైవకల్పనకు మూలము.

ఇష్టానిష్టఫలప్రాప్తావిదమిత్యస్య వాచకమ్
ఆశ్వాసనామాత్రవచో దైవమిత్యేవ కథ్యతే. 10

ఇష్టానిష్ట ఫలములు లభింప "పూర్వకర్మవలనే ఇట్టిఫలము కలిగినది." అని చెప్పబడు మాటయే దైవము.

శ్రీరామ ఉవాచః—

భగవన్ సర్వధర్మజ్ఞ యత్ప్రాక్కర్మోపసంచితమ్
తద్దైవం దైవమిత్యుక్త మపమృష్టం కథం త్వయా. 11

రాముడు:— సర్వధర్మజ్ఞా! భగవానుడా! పూర్వకర్మల సంచితమే దైవమని మరలమరల నుడువుచు, మరల లేదనుచున్నారు. ఇదేమి?

శ్రీ వసిష్ఠ ఉవాచః—

సాధు రాఘవ జానాసి శృణు వక్ష్యామి తేఽఖిలమ్
దైవం నాస్తీతి తే యేన స్థిరా బుద్ధిర్భవిష్యతి. 12

వసిష్ఠుఁడు:_ రాఘవా! నీకు వివరించి చెప్పిన, ఈ విషయమును చక్కఁగ తెలిసికొనఁగలవు చెప్పుచున్నాను, మంచిది, వినుము. దీనివలన "దైవములేదు." అను నిశ్చయము నీకు కలుగగలదు.

యా మనోవాసనా పూర్వం బభూవ కిల భూరిశః
సైవేయం కర్మభావేన నృణాం పరిణతిం గతా. 13

వెనుకటి జన్మలలోనివగు వాసనలు, ప్రబోధితములై, కర్మలుగమారును.

జంతుర్యద్వాసనో రామ తత్కర్తా భవతి క్షణాత్
అన్యకర్మాన్యభావశ్చేత్యేతన్నైవోపపద్యతే. 14

రామా! వాసనల ననుసరించియే జీవుఁడొనర్చు కర్మగూడ యుండును. కర్మలొకరీతిగను, మనోభావమింకొకట్లుగను నుండవు.

గ్రామగో గ్రామమాప్నోతి పత్తనార్థీ చ పత్తనమ్
యోయో యద్వాసనస్తత్ర స స ప్రయతతే సదా. 15

పల్లెకు పోఁగోరువాఁడు పల్లెనే చేరును. పట్టణమున కరుగఁగోరు నాతఁడు పట్టణమునకే ఏఁగును. (అట్లే) ఎవనికెట్టి వాసనలుండునో వాఁడు వాటి నిమిత్తమే ఎల్లప్పుడు యత్నించుచుండును.

యదేవ తీవ్రసంవేగా ద్దృఢం కర్మకృతం పురా
తదేవ దైవశబ్దేన పర్యాయేణేహ కథ్యతే. 16

ఫలమునుబొందఁ మిక్కుటమగు కోర్కతో తీవ్రముగ నొనర్పఁబడు కర్మయే దైవమనఁబడుచున్నది. దీనినే, దైవమనికూడ వ్యవహరించుచున్నారు.

ఏవం కర్మస్థకర్మాణి కర్మప్రౌఢా స్వవాసనా
వాసనా మనసో నాన్యా మనో హి పురుషః స్మృతః. 17

కర్తయొక్క కర్మలన్నియు నైరీతిగనే నిర్వహింపఁబడు చున్నది. బలమునుగూర్చుకొనిన వాసనలే కర్మలు. ఈ వాసనలు మనస్సుకంటె భిన్నములుకావు. మనస్సుగూడ ఆత్మకంటె వేరుకాదు.

యద్దైవం తాని కర్మాణి కర్మ సాధో మనో హి తత్
మనో హి పురుషస్తస్మాద్దైవం నాస్తీతి నిశ్చయః. 18

సాధూ! దైవమని చెప్పబడునదే కర్మ; ఈ కర్మయే మనస్సు; ఈ మనస్సే పురుషుఁడు. అందువలన, పురుషకారముకంటె వేరొకటిలేదని తేలుచున్నది. దైవము మిథ్య.



ఏష ఏవ మనో జంతుర్యద్యత్ప్రయతతే హితమ్
కృతం తత్తదవాప్నోతి స్వత ఏవ హి దైవతః. 19

ఈ జీవుఁడు మనోరూపమున నొనర్చు కార్యముల ఫలములను స్వస్వరూపుఁడగు దైవమునుండియే పడయును.

మనశ్చిత్తం వాసనా చ కర్మ దైవం చ నిశ్చయః
రామ దుర్నిశ్చయస్యైతాః సంజ్ఞాస్సద్భిరుదాహృతాః. 20

రామా! మనస్సు, చిత్తము, వాసన, కర్మ, దైవము — ఇవన్నియు చిజ్జడభేదభావనిశ్చయములేని మనస్సుగల పురుషుని పర్యాయపదములని మావలన (సాధువులవలన) చెప్పఁబడుచున్నవి.

ఏవం నామా హి పురుషో దృఢభావనయా యథా
నిత్యం ప్రయతతే రామ ఫలమాప్నోత్యలం తథా. 21

రామా! ఇట్టిపురుషుఁడు దృఢమగు భావనాబలమున నెట్లు యత్నించునో, ఫలములగూడ నట్లే పడయును.

ఏవం పురుషకారేణ సర్వమేవ రఘూద్వహ
ప్రాప్యతే నేతరేణేహ తస్మాత్స శుభదోఽస్తు తే. 22

రఘుపుంగవా! ఇట్లు, పురుషకారమొక్కదానివలననే అభీష్టములన్నియు సిద్ధించుచున్నవి; అదృష్టమువలన కాదు. అందువలన, ఈ పురుషకారము నీకు శుభదాయకమగుగాత!

శ్రీ రామ ఉవాచః—

ప్రాక్తనం వాసనాజాలం నియోజయతి మాం యథా
మునే తథైవ తిష్ఠామి కృపణః కిం కరోమ్యహమ్. 23

రాముడు:— మునీంద్రా! ప్రాక్తనవాసనాసమూహములు నన్నెట్లొనర్పింప జేయుచున్నవో, అట్లే ఒనర్చుచున్నాను. దీనుఁడనగు నేనేమి చేయఁగలను?

శ్రీ వసిష్ఠ ఉవాచః—

అత ఏవ హి రామ త్వం శ్రేయః ప్రాప్నోషి శాశ్వతమ్
స్వప్రయత్నోపనీతేన పౌరుషేణైవ నాన్యథా. 24

రామా! అందువలననే, ఇప్పుడు ప్రయత్నించిన పురుషకారము వలననే నీకు శాశ్వతమగు శ్రేయస్సు లభించును.

ద్వివిధో వాసనావ్యూహః శుభశ్చైవాశుభశ్చ తే
ప్రాక్తనో విద్యతే రామ ద్వయోరేకతరోఽథవా. 25

వసిష్ఠుఁడు రామా! శుభాశుభములగు ప్రాక్తనవాసనలు నీకున్నవి; లేక ఈ రెంటిలో నొకతెగకు చెందినవి నీకున్నవి.

వాసనౌఘేన శుద్ధేన తత్ర చేదద్య నీయసే
తత్క్రమేణ శుభేనైవ పదం ప్రాప్స్యసి శాశ్వతమ్. 26

వీటిలో, శుభములగు వాసనలవలన నీవు ప్రేరేపితుఁడవైనపట్ల, శుభ పురుషకారబలమున క్రమముగ శాశ్వతమగు ముక్తిని బొందగలవు.

అథ చేదశుభో భావస్త్వాం యోజయతి సంకటే
ప్రాక్తనస్తదసా యత్నాజ్జేతవ్యో భవతా బలాత్. 27

అట్లుగాక, అశుభవాసనలు ప్రబలములై నిన్ను కష్టముల ప్రవేశపెట్టుచో, వాటిని ప్రయత్నించి బలవంతముగ పెకల్చిపారవేయవలెను.

ప్రాజ్ఞశ్చేతనమాత్రస్త్వం న దేహస్త్వం జడాత్మకః
అన్యేన చేతసా తత్తే చేత్యత్వం క్వేవ విద్యతే. 28

నీవు ప్రాజ్ఞుడవగు చైతన్యస్వరూపుడవు; జడస్వరూపమగు దేహమవుకావు, నీవు చిన్మాత్రస్వరూపుడవు. అందువలన నీ వితరులకు లొంగియుండవలసిన అవసరములేదు.

అన్యస్త్వాం చేతయతిచేత్ తం చేతయతి కోఽపరః
క ఇమం చేతయేత్తస్మాదనవస్థా న వాస్తవీ. 29

నిన్నితరులు చేతిత మొనర్చుచున్నారనిన, వారిని మరల నెవ్వరు చేతిత మొనర్చుచున్నారు? ఈ చేతయితను చేతిత మొనర్చుచున్న దెవరు? ఇట్లు అనవస్థాదోషము సంభవించుచున్నది; ఇది వస్తుసిద్ధికి ప్రతిబంధకము. ఇట్టితలపు మిథ్య. నీవే చేతయితవు.

శుభాశుభాభ్యాం మార్గాభ్యాం వహంతీ వాసనాసరిత్
పౌరుషేణ ప్రయత్నేన యోజనీయా శుభే పథి. 30

ఈ వాసనానది శుభాశుభమార్గముల రెంటను ప్రవహించుచున్నది. పురుషప్రయత్నము వలన దీనిని మంచి మార్గమున పెట్టవలెను.

అశుభేషు సమావిష్టం శుభేష్వేవావతారయ
స్వం మనః పురుషార్థేన బలేన బలినాంవర. 31

బలిష్ఠశ్రేష్ఠా! మనస్సు చెడుత్రోవలో ప్రవేశించిన, నీ పురుషకారబలమున దానిని మంచిత్రోవకు మరల్చుము.

అశుభాచ్చాలితం యాతి శుభం తస్మాదపీతరత్
జంతోశ్చిత్తం తు శిశువత్ తస్మాత్ తచ్చాలయేద్బలాత్. 32

జీవుని చిత్తము శిశువువలె చంచలము. దానిని, చెడునుండి మంచికిత్రిప్పిన, మంచికే మరలును. మరల మంచినుండి మరల్చిన చెడ్డకు మొగ్గును. అందువలన, చిత్తమును బలపూర్వకముగ మంచికి మరల్చుము.



సమతా సాంత్వనేనాశు న ద్రాగితి శనైః శనైః
పౌరుషేణైవ యత్నేన పాలయేచ్చిత్తబాలకమ్. 33

ఇట్లు, చిత్తమను బాలుని వెంటనే – మృత్యువు దాపురించునుగాన – ఉపాయముతో రాగాదివిషయముల వర్జింపజేసి, స్వాభావికమగు సమత్వమందునట్లొనర్చునది. పిమ్మట, నెమ్మదిగ ఆత్మస్వరూపమున నిల్చునట్లు యత్నింపుము. హఠాత్తుగ, నిరోధమొనర్పవలదు; ఏలయన, సమాధానమున నిలుకడ కలుగక పోవచ్చును.

వాసనౌఘస్త్వయా పూర్వమభ్యాసేన ఘనీకృతః
శుభో వాప్యశుభో వాపి శుభమద్య ఘనీకురు. 34

ఇంతదనుక, నీవు శుభాశుభవాసనల రెంటిని గుదిగూర్చికొనినావు; కాని, ఇటనుండి శుభవాసనలను మాత్రమే గట్టిచేసికొనుము.

ప్రాగభ్యాసవశాద్యాతా యదా తే వాసనోదయమ్
తదాభ్యాసస్య సాఫల్యం విద్ధిత్వ మరిమర్దన. 35

శత్రుమర్దనా! అభ్యాసవశముననే వాసనలు ప్రబలములగుచున్నవని స్పష్టము; కనుక అభ్యాసము ఫలవంతమని గ్రహింపుము.

ఇదానీమపి తే యాంతి ఘనతాం వాసనానఘ
అభ్యాసవశతస్తస్మాచ్ఛుభాభ్యాస ముపాహర. 36

అనఘా! ఇప్పుడుకూడ అభ్యాసమువలననే నీ వాసనలు దట్టమగుచున్నవి; అందువలన, శుభవాసనలనే అలవరచుకొమ్ము.

పూర్వంచేద్ఘనతాం యాతా నాభ్యాసాత్తవ వాసనా
వర్ధిష్యతే తు నేదానీమపి తాత సుఖీభవ. 37

పూర్వపు చెడువాసనలు అభ్యాసమువలన దృఢమవలేదందువా? – అవి ఇప్పటి చెడ్డవాసనలవలన వృద్ధినందవు, కనుక, దుఃఖింపవలసిన అవసరములేదు; సుఖింపుము.

సందిగ్ధాయామపి భృశం శుభామేవ సమాహర
అస్యాంతు వాసనావృద్ధౌ శుభాద్దోషో న కశ్చన. 38

అభ్యాసమువలన వాసనలు వృద్ధినందునా? అను సందియము కలిగినను, శుభవాసనలనే సేవింపుము. శుభ-ఆచరణవలన మంచివాసనలు వృద్ధినందినను, కీడులేదు.

యద్యదభ్యస్యతే లోకే తన్మయేనైవ భూయతే
ఇత్యాకుమారం ప్రాజ్ఞేషు దృష్టం నందేహావర్జితమ్. 39

ఈ జగత్తున ఎట్లభ్యసించునో, అట్లేయగును. ఈ సంగతి "బుడుత" మొదలుగ "ముదుక"నివఱకు అందఱికిని తెల్లము; సంశయింప నక్కఱలేదు.

శుభవాసనయా యుక్తస్తదత్ర భవభూతయే
పరంపౌరుష మాశ్రిత్య విజిత్యేంద్రియపంచకమ్. 40

అందువలన, నీవు మంచికొఱకు, పౌరుషము నవలంబించి శుభవాసనల చేకూర్చుకొని, పంచేంద్రియముల జయింపుము.

అవ్యుత్పన్నమనా యావద్భవానజ్ఞాతతత్పదః
గురుశాస్త్రప్రమాణైస్తు నిర్ణీతం తావదాచర. 41

మనస్సుయొక్క స్థితిని గ్రహింప జాలనంతవఱకు, తత్త్వజ్ఞానము లభింపనంతవఱకు గురువు శాస్త్రము, యుక్తి, అనుభవములవలన నిర్ణయింపఁబడిన కర్మల నాచరింపుము.

తతః పక్వకషాయేణ నూనం విజ్ఞాతవస్తునా
శుభోఽప్యసౌ త్వయా త్యాజ్యో వాసనౌఘో నిరాధినా. 42

అనంతరము, రాగాదివాసనా కషాయములు శిథిలములవ, ఆత్మవస్తువు ప్రతిభాత మగును. అప్పుడు, నీ మనోవ్యాధులన్నియు నశించును; శుభవాసనలుగూడ నుండవు.

యదతిసుభగ మార్యసేవితం తత్
శుభమనుసృత్య మనోజ్ఞభావబుద్ధ్యా
అధిగమయ పదం సదా విశోకం
తదను తదప్యవముచ్య సాధు తిష్ఠ. 43

ఇతి శ్రీ వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే ముముక్షువ్యవహార
ప్రకరణే కర్మవిచారో నామ నవమః సర్గః. ॥ 9 ॥

అందువలన, నీవు ఆర్యులవలన సేవింపఁబడు ఆ అతిసుందర శుభపదమును, శుభవాసనా బుద్ధితో నిరంతరము అనుసరించుచు, శోకరహితమగు పరమార్థవస్తువును సాక్షాత్కరింపఁ జేసికొనుము. తదుపరి ఆ శుభవాసనల ననుసరించుటనుగూడ వదలి, సత్స్వరూపమున అవస్థితుడవు కమ్ము.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు ముముక్షువ్యవహార
ప్రకరణమున కర్మవిచారమను నవమసర్గము. ॥ 9 ॥





## దశమః సర్గః.

శ్రీవసిష్ఠ ఉవాచ:—

యథాస్థితం బ్రహ్మతత్త్వం సత్తానియతిరుచ్యతే
సా వినేతుర్వినేతృత్వం సా వినేయవినేయతా. 1

వసిష్ఠుఁడు:—బ్రహ్మతత్త్వము స్వయంప్రకాశము; ఇది సచ్చిదానందస్వరూపమున సర్వత్ర వెలయుచున్నది. దీని సత్తవలననే ఇతరములన్నియు వెలుఁగొందుచున్నవి. ఇదియే భవిష్యత్కాల వ్యవహారమున నియతియనబడుచున్నది. కార్యకారణ స్వరూపముగూడ నిదియే.

అతః పౌరుషమాశ్రిత్య శ్రేయసే నిత్యబాంధవమ్
ఏకాగ్రం కురు యచ్చిత్తం శృణు చోక్తమిదం మమ. 2

బ్రహ్మసత్తయే నియతి; అందువలన, ప్రతికూలశంకకు తావులేదు. నాపలుకుల నాలించి మంచికొఱకు, నిత్యబంధువగు చిత్తమును పౌరుషబలమున ఏకాగ్రమొనర్పుము.

అవాంతరనిపాతీని స్వరూఢాని మనోరథమ్
పౌరుషేణేంద్రియాణ్యాశు సంయమ్య సమతాం నయ. 3

ఇంద్రియములు మనోరథముల నారోహించిన ముక్తికి ప్రతిబంధకములగు ఐహిక లేక పారలౌకిక సుఖములఁగూలును. అగుటఁజేసి, దీనిని వాటియందు, పడకుండునట్లు పురుషకారబలమున నరికట్టి, సమత్వమును సాధింపుము.

ఇహాముత్రచ సిద్ధ్యర్థం పురుషార్థఫలప్రదామ్
మోక్షోపాయమయీం వక్ష్యే సంహితాం సారనిర్మితాం. 4

జ్ఞానదాయకమును, పురుషార్థప్రదమును, సారయుతమునునగు సంహితను వచింపుచున్నాను. ఇది స్వర్గవాసులకును, భూలోకవాసులకును, అధికారభేదము ననుసరించి, ఉపయోగపడగలదు.

అపునర్గ్రహణాయాంతస్త్యక్త్వా సంసారవాసనామ్
సంపూర్ణా శమసంతోషావాదాయోదారయా ధియా. 5
సపూర్వాపరవాక్యార్థవిచారవిషయాహతమ్
మనః సమరసం కృత్వా సానుసంధానమాత్మని. 6
సుఖదుఃఖక్షయకరం మహానందైక కారణమ్
మోక్షోపాయమిమం రామ వక్ష్యమాణం మయా శృణు 7

రామా! దేనికొఱకు సంసారవాసనలను త్యజించి ఉదారబుద్ధితో సంపూర్ణముగ శమ సంతోషములను గూర్చుకొనవలయునో, దేని నిమిత్తము కర్మకాండ జ్ఞానకాండల అర్థవిచారమును సల్పి, మనస్సును సమరసత్త్వమున నిల్పి ఆత్మానుసంధానము నొనర్పవలెనో, ఎద్ది సుఖదుఃఖాది ద్వంద్వనాశన హేతువో, అట్టి యీ మోక్షోపాయమును—మరల జన్మనెత్తవలసిన అవసరము లేకుండుటకుగాను – వచింపుచున్నాను, వినుము.

ఇమాం మోక్షకథాం శ్రుత్వా సహ సర్వైర్వివేకిభిః
వరం యాస్యసి నిర్దుఃఖం నాశోయత్ర న విద్యతే. 8

ఈ మోక్షకథను వివేకులతోగూడి వినిన, అక్షయమును, దుఃఖరహితమునునగు పదము నందెదవు.

ఇదముక్తం పురాకల్పే బ్రహ్మణా పరమేష్ఠినా
సర్వదుఃఖక్షయకరం పరమాశ్వాసనం ధియః. 9

దుఃఖములనన్నిటిని నాశనమొనర్చునదియు, మనశ్శాంతికరమునునగు, ఈ మోక్షకథను కల్పాదియందు, పరమేష్ఠియగు బ్రహ్మ వచించినాడు.

కేనోక్తం కారణేనేదం బ్రహ్మన్ పూర్వం స్వయంభువా
కథంచ భవతా ప్రాప్తమేతత్ కథయ మే ప్రభో. 10

రాముడు:—బ్రహ్మజ్ఞా! పూర్వము బ్రహ్మ ఇద్దానిని, ఎవరికి, ఎందులకు, చెప్పినాడో వచింపుడు, ప్రభూ! దీనిని మీరెట్లు పొందినారు.

శ్రీవసిష్ఠ ఉవాచః—

అస్త్యనంతవిలాసాత్మా సర్వగః సర్వసంశ్రయః
చిదాకాశోఽవినాశాత్మా ప్రదీపస్సర్వజంతుషు. 11

వసిష్ఠుడు:—అనంత మాయావిలాసమునకు కారణమును, సర్వాంతర్యామియును, సర్వాధారమును, చిదాకాశమును, ప్రత్యక్-చిద్రూపమును, అవినశ్వరమునునగు ఆత్మతత్త్వమొక్కటి యున్నది.

స్పందాస్పందసమాకారాత్ తతో విష్ణురజాయత
స్పందమానరసాపూరాత్ తరంగః సాగరాదివ. 12

చలనముండినను లేకున్నను, నీరుగనేయుండు సముద్రమునుండి తరంగములు లేచునట్లు, మాయ, కార్యమొనర్చుచుండినను ఒనర్పకున్నను ఒకేరీతిగానుండు ఆ నిర్వికార ఆత్మతత్త్వమునుండి విష్ణువుదయించెను.

సుమేరుకర్ణికాత్తస్య దిగ్దళాడ్యహృదయాంబుజాత్
తారకాకేసరవతః పరమేష్ఠీ వ్యజాయత. 13

ఆ విష్ణుని నాభికమలమునుండి బ్రహ్మ జన్మించెను. ఆనాభికమలమునకు కర్ణిక మేరుపర్వతము; దిక్కులే దానిదళములు; నక్షత్రములే కేసరములు.

వేదవేదార్థవిద్దేవమునిమండలమండితః
సోఽసృజత్ సకలం సర్గం వికల్పౌఘం యథా మనః. 14

వేదవేదార్థవేత్తయగు ఆ బ్రహ్మ దేవతలచేతను మునులవలనను పరివేష్టితుడై, మనస్సు వికల్పములను సృష్టించునట్లు, ప్రాణులనన్నిటిని సృష్టించెను.



జంబూద్వీపస్య కోణేఽస్మిన్ వర్షే భారతనామని
ససర్జ జనసర్గౌఘం హ్యాధివ్యాధిపరిప్లుతమ్. 15

అతడు జంబూద్వీపమునందొక మూలనున్న ఈ భారతవర్షమున, ఆధివ్యాధులతోగూడియున్న ప్రాణిసమూహమును సృష్టించెను.

భావాభావావిపన్నాంగ ముత్పాత ధ్వంస తత్పరమ్
సర్గేఽస్మిన్ భూతజాతీనాం నానావ్యసన సంకులమ్. 16
జనస్యైతస్య దుఃఖం తద్దృష్ట్వా సకలలోకకృత్
జగామ కరుణామీశః పుత్రదుఃఖాత్ పితా యథా. 17

ఈ ప్రాణుల మనస్సులు లాభాలాభములు గల్గిన తల్లడిల్లుచుండెను. వీరు అల్పాయుష్కులును, విషయభోగరతులగుటవలన దుఃఖితులును నైయుండిరి. వీరిదగు యీ కష్టదశను గాంచి, పుత్రుని కష్టదశను గాంచిన తండ్రివలె, సకలలోకకర్తయగు బ్రహ్మ కరుణను బొందెను.

క ఏతేషాం హతాశానాం దుఃఖస్యాంతో హతాయుషామ్
స్యాదితి క్షణమేకాగ్రం చింతయామాస భూతయే. 18

హతాశులును, అల్పాయుష్కులునునగు ఈ జనుల దుఃఖమెట్లు తీరును. అని ఆయన వారి మంచికొఱకు స్థిరచిత్తుడై ఒకింత చింతించెను.

ఇతి సంచింత్య భగవాన్ ససర్జ స్వయమీశ్వరః
తపోధర్మంచ దానంచ సత్యం తీర్థాని చైవహి. 19

ఇట్లు చింతించి, దుఃఖనివారణ సమర్థుడగు బ్రహ్మదేవుడు తపస్సు, ధర్మము, దానము, సత్యము, తీర్థములు, అను శుద్ధిసాధనములను సృష్టించెను.

ఏతత్సృష్ట్వా పునర్దేవశ్చింతయామాస భూతకృత్
పుంసాం నానేన సర్గస్య దుఃఖస్యాంత ఇతి స్వయమ్. 20
నిర్వాణం నామ పరమం సుఖం యేన పునర్జనః
న జాయతే న మ్రియతే తజ్జ్ఞానాదేవ లభ్యతే. 21

సంసారోత్తరణే జంతోరుపాయో జ్ఞానమేవ హి
తపోదానం తథాతీర్థమనుపాయాః ప్రకీర్తితాః. 22
తత్తావద్దుఃఖమోక్షార్థం జనస్యాస్య హతాత్మనః
ప్రత్యగ్రం తరణోపాయమాశు ప్రకటయామ్యహమ్. 23

భూతగణస్రష్టయగు ఆయన వీటిని నిర్మించి ఇట్లు చింతించెను. "కేవలము వీటివలన జనుల దుఃఖము పోదు. జన్మమరణరహితమగు ఆ నిర్వాణ - పరమపదము జీవులకు ఒక్క జ్ఞానమువలననే లభించును. ఈ సంసారమునుండి జీవుల నుద్ధరించు ఏకమాత్రోపాయము, జ్ఞానమే; తపోదాన తీర్థములుకావు. అందువలన జీవులనుద్ధరించు నూతన దృఢోపాయమును సత్వరము వెల్లడింతును."

ఇతి సంచింత్య భగవాన్ బ్రహ్మా కమలసంస్థితః
మనసా పరిసంకల్ప్య మాముత్పాదితవానిమమ్. 24

ఇట్లు, కమలాసనుఁడగు బ్రహ్మ ఆలోచించి, సంకల్పమాత్రమున మనస్సువలన నన్ను సృష్టించెను.

కుతోఽప్యుత్పన్న ఏవాశు తతోఽహం సముపస్థితః
పితు స్తస్య పునః శ్రీమదూర్మిరూర్మేరివానఘ. 25

అనఘా! ఎటనో పుట్టిన తరంగము, తరంగమునే చేరునట్లు, అనిర్వచనీయ మాయవలన జన్మించిన నేనును తండ్రియగు బ్రహ్మదరిజేరితిని.

కమండలుధరో నాథః సకమండలునా మయా
సాక్షమాలః సాక్షమాలం స ప్రణమ్యాభివాదితః. 26

జపమాల కమండల సహితుఁడనగు నేను, జపమాలా కమండల శోభితుఁడగు బ్రహ్మ కభివందన మాచరించితిని.

ఏహి పుత్రేతి మాముక్త్వా స స్వాబ్జస్యోత్తరేదలే
శుక్లాభ్ర ఇవ శీతాంశుం యోజయామాస పాణినా. 27

ఆయన "రమ్ము! పుత్రా!" అని వచించి తన పద్మాసన - ఉత్తరదళమున, శుక్ల మేఘముల చంద్రునివలె, నన్ను స్వయముగ గూర్చుండజేసెను.

మృగకృత్తిపరీధానో మృగకృత్తి నిజాంబరం
మామువాచ పితా బ్రహ్మా సుహంసః సారసం యథా. 28

హంస సారసమునకు తనయభిప్రాయమును దెల్పునట్లు, కృష్ణాజినధారినగు నాతో కృష్ణాజిన ధరుఁడగు బ్రహ్మ ఇట్లనెను.

ముహూర్తమాత్రం తే పుత్ర చేతో వానరచంచలం
అజ్ఞానమభ్యావిశతు శశః శశధరం యథా. 29

"కోతివలె చంచలమగు నీ మనస్సున, చంద్రునియందు కుందేలువలె, ఒకింతతడవు అజ్ఞానము ప్రవేశించును గాక!"

ఇతి తేనాశు శప్తః సన్ విచారణమనంతరం
అహం విస్మృతవాన్ సర్వం స్వరూపమమలం కిల. 30

ఇట్లాతనివలన శపింపఁబడి వెంటనే నా నిర్మల స్వరూపమును మఱచితిని.

అథాహం దీనతాం యాతః స్థితోఽసంబుద్ధయా ధియా
దుఃఖశోకాభిసంతప్తో జాతో జన ఇవాధనః. 31

పిమ్మట, నా బుద్ధి జడత్వమునంద, దీనుఁడనై నిరుపేదవలె దుఃఖశోకముల వనరసాగితిని.



కష్టం సంసారనామాయం దోషః కథమిహాగతః
ఇతి చింతితవానంతస్తూష్ణీమేవ వ్యవస్థితః. 32

మనస్సున, "ఆహా! ఈ సంసారదోష మెందులకు ఆరుదెంచినది" అని చింతించి తూష్ణీం భావమును వహించుచుండెడువాఁడను.

అథాభ్యధాత్ స మాం తాతః పుత్ర కిం దుఃఖవానసి
దుఃఖోపఘాతం మాం పృచ్ఛ సుఖీ నిత్యం భవిష్యసి. 33

పిమ్మట, నా జనకుఁడు, "పుత్రా! నీ వెందులకు దుఃఖించుచున్నావు? దుఃఖనివారణో పాయమును ప్రశ్నింపుము; సుఖింపుము" అని పల్కెను.

తతః పృష్టః స భగవాన్ మయా సకలలోకకృత్
హేమపద్మదలస్థేన సంసారవ్యాధిభేషజమ్. 34

అనంతరము, సువర్ణ పద్మదళస్థితుఁడనగు నేను, సర్వలోక కర్తయగు ఆయనను సంసార వ్యాధిని పొమ్మడంపజేయు ఔషధము నడిగితిని.

కథంనాథ మహాదుఃఖమయః సంసార ఆగతః
కథంచ క్షీయతే జంతోరితిపృష్టేన తేన మే.
తజ్జ్ఞానం సుబహుప్రోక్తం యజ్జ్ఞాత్వా పావనం పరమ్ 35
అహం పితురభిప్రాయః కిలాధిక ఇవ స్థితః. 36

"ప్రభూ! ఈ దుఃఖమయ సంసారము జీవుఁడెట్లు తగుల్వడినాఁడు? దీనినుండి ఎట్లు విడివడును?" అని ప్రశ్నింపబడి ఆయన విస్తారముగ తత్త్వజ్ఞానము నుపదేశించెను. నేను పరమ పవిత్రమగు ఆ తత్త్వజ్ఞానమును గ్రహించి తండ్రికంటె నధికనిర్మలుఁగు పరిపూర్ణ స్వభావ తత్త్వ జ్ఞానమున అవస్థితుఁడనయిన వానివలె నుంటిని.

తతో విదితవేద్యం మాం నిజాం ప్రకృతిమాస్థితమ్
స ఉవాచ జగత్కర్తా వక్తా సకలకారణమ్. 37

విదితవేద్యుఁడను, స్వస్వరూపప్రాప్తుఁడనునగు నాతో సకలకారణకర్తయగు ఆ జగత్కర్త ఇట్లనెను.

శాపేనాజ్ఞపదం నీత్వా పృచ్ఛక స్త్వం మయా కృతః
పుత్రాస్య జ్ఞానసారస్య సమస్తజనసిద్ధయే. 38

పుత్రా! అన్ని తరగతులవారికి యీ జ్ఞానముపయోగపడునిమిత్తమే నేను నిన్ను శపించి మూఢుఁడవగు నట్లొనర్చి ప్రశ్నింపఁజేసితిని.

ఇదానీం శాంతశాప స్త్వం పరంబోధముపాగతః
సంస్థితోఽహమివైకాత్మాఽకనకం కనకాదివత్. 39

"ఇప్పుడు నీ తాపము తీరినది; నీవు పరమజ్ఞానము నందినావు. "మకిలి - బంగారము" శుద్ధి నంది బంగారమగునట్లు; నీవును నావలెనే ఏకాత్ముఁడవై తివి.

గచ్ఛేదానీం మహీపృష్ఠే జంబుద్వీపాంతరస్థితమ్
సాధో భారతవర్షం త్వం లోకానుగ్రహహేతునా. 40

సాధూ! ఇప్పుడు నీవు జనుల ననుగ్రహింప, భూమధ్యమున జంబూద్వీపమున వెలయు భారతవర్షమున కఱుగుము.

తత్ర క్రియాకాండ పరాస్త్వయా పుత్ర మహాధియా
ఉపదేశ్యాః క్రియాకాండక్రమేణ క్రమశాలినా. 41
విరక్తచిత్తాశ్చ తథా మహాప్రాజ్ఞా విచారిణః
ఉపదేశాస్త్వయా సాధో జ్ఞానేనానందదాయినా. 42

"పుత్రా! మేధావీ! నీవటకఱిగి కర్మరతులకు క్రియాకాండను క్రమముగ నుపదేశింపుము. సాధూ! ఆనంద దాయకమగు జ్ఞానమును విరక్తచిత్తులగు ప్రాజ్ఞుల కుపదేశింపుము."

ఇతి తేన నియుక్తోఽహం పిత్రా కమలయోనినా
ఇహ రాఘవ తిష్ఠామి యావద్భూతపరంపరా. 43

రాఘవా! ఇట్లు తండ్రియగు బ్రహ్మదేవునిచే నాజ్ఞాపింపఁబడితిని; అధికారులగువా రుండు దనుక, ఉందును.

కర్తవ్యమస్తి న మమేహ హి కించిదేవ
స్థాతవ్యమిత్యతిమనా భువి సంస్థితోఽస్మి
సంశాంతయా సతతసుప్తధియేహ వృత్త్యా
కార్యం కరోమి నచ కించిదహం కరోమి. 44

ఇతి శ్రీ వాసిష్ఠ—మహారామాయణే వాల్మీకీయే ముముక్షువ్యవహార
ప్రకరణే జ్ఞానావతరణంనామ దశమః సర్గః ॥ 10 ॥

నాకు వేఱొకకర్తవ్యము లేదు. నేను నిర్మనస్కుఁడనై యీ పృథివి యందున్నాఁడను, అభిమానరహితమగు చిత్తముతో, యథాప్రాప్తకార్యముల నొనర్చుచున్నాఁడను; అహంకారమునకు లోబడి ఎట్టికార్యమును ఒనర్చుచుండుట లేదు.

ఇది శ్రీ వాసిష్ఠ—తాత్పర్య ప్రకాశికయందు, ముముక్షువ్యవహార
ప్రకరణమున జ్ఞానావతరణమను దశమ సర్గము ॥ 10 ॥





ఏకాదశః సర్గః.

---

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

ఏతత్తే కథితం సర్వం జ్ఞానావతరణం భువి
మయా స్వమీహితంచైవ కమలోద్భవచేష్టితమ్. 1

వసిష్ఠుడు:- రామా! భూలోకమునకు జ్ఞానమరుదెంచిన రీతిని, నా జన్మ వృత్తాంతమును నా యొక్కయు బ్రహ్మదేవుని యొక్కయు ప్రయత్నములను, నీకు జెప్పితిని.

తదిదం పరమం జ్ఞానం శ్రోతుమద్య తవానఘ
భృశముత్కంఠితం చేతో మహతః సుకృతోదయాత్. 2

అనఘా! గొప్పదగు సుకృతమునంజేసి, ఈ పరమజ్ఞానమును విన నీ చిత్తము తత్తరపడు చున్నది.

శ్రీ రామ ఉవాచ:—

కథం బ్రహ్మన్ భగవతో లోకే జ్ఞానావతారణే
సర్గాదనంతరం బుద్ధిః ప్రవృత్తా పరమేష్ఠినః. 3

రాముఁడు:- బ్రహ్మజ్ఞా! లోకముల సృష్టించిన పిమ్మట, ఈ లోకమున జ్ఞానమును ప్రవర్తింప జేయు బుద్ధి, బ్రహ్మకేల పొడమినది?

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

పరమే బ్రహ్మణి బ్రహ్మ స్వభావవశతః స్వయమ్
జాతః స్పందమయో నిత్య మూర్మిరంబునిధావివ. 4

వసిష్ఠుఁడు:- సముద్రమున తరంగముదయించునట్లు, బ్రహ్మ పరబ్రహ్మమున స్వభావానుసారము క్రియాశక్తియుతుడయి జన్మించెను.

దృష్ట్వైవమాతురం సర్గం సర్గస్య సకలాం గతిమ్
భూతభవ్యభవిష్యస్థాం దదర్శ పరమేశ్వరః. 5

పరమేశ్వరుఁడగు ఈ బ్రహ్మ తనవలన సృష్టింపఁబడిన జీవరాశి జరామరణగ్రస్తమగుట గాంచి, భూతభవిష్యద్వర్తమానములను పర్యాలోచించెను.

సక్రియాక్రమకాలస్య కృతాదేః క్షయ ఆగతే
మోహమాలోచ్య లోకానాం కారుణ్యమగమత్ ప్రభుః. 6

స్వర్గము, మోక్షము — ఇట్టిపదవులను జేర్చు సాధనలకుఁదగిన త్రేతాదియుగములుగడవ జన్మించుజీవుల మోహమునుగాంచి, ఆయన కరుణాపరవశుఁడాయెను.

తతో మామీశ్వరః సృష్ట్వా జ్ఞానేనాయోజ్య చాసకృత్
విససర్జ మహీపీఠం లోకస్యాజ్ఞానశాంతయే. 7

పిమ్మట, బ్రహ్మ నన్ను సృష్టించి, మిక్కుటముగ నుపదేశించి, జ్ఞానిగనొనర్చి, లోకుల అజ్ఞానమును బాప భూతలమునకుఁ బంపెను.

యథాహం ప్రహితస్తేన తథాన్యేచ మహర్షయః
సనత్కుమారప్రముఖా నారదాద్యశ్చ భూరిశః. 8
క్రియాక్రమేణ పుణ్యేన తథా జ్ఞానక్రమేణచ
మనోమోహామయోన్నద్ధముద్ధర్తుం లోకమీరితాః. 9

ఇట్లే, మనోమోహామను రోగమునకుందు జీవులను, క్రియా, పుణ్యా, జ్ఞానములవలన నుద్ధరింప, సనత్కుమార నారదాది మహర్షులంగూడ బనిచెను.

మహర్షిభిస్తతస్తైస్తైః క్షీణే కృతయుగే పురా
క్రమాత్ క్రియాక్రమే శుద్ధే పృథివ్యాం తనుతాం గతే. 10
క్రియాక్రమవిధానార్థం మర్యాదానియమాయచ
పృథగ్దేశవిభాగేన భూపాలాః పరికల్పితాః. 11

త్రేతాయుగము గడువ విశుద్ధములగు యజ్ఞాది క్రియలుగూడ అంతరింపజొచ్చెను. అప్పుడీ మహర్షులు కర్మకాండనుద్ధరించు నిమిత్తము, శాస్త్రమర్యాదను రక్షించుటకును వేర్వేరుదేశముల విభజించి, రాజులను కల్పించిరి.

బహూని స్మృతిశాస్త్రాణి యజ్ఞశాస్త్రాణి చావనౌ
ధర్మకామార్థసిద్ధ్యర్థం కల్పితాన్యుచితాన్యథ. 12

అనంతరము ధర్మార్థ కామప్రయోజనముల సిద్ధింపజేయు స్మృతిశాస్త్రములు, యజ్ఞశాస్త్రములు రచింపఁబడెను.

కాలచక్రే వహత్యస్మింస్తతో విగలితే క్రమే
ప్రత్యహం భోజనపరే జనే శాల్యర్జనోన్ముఖే. 13
ద్వంద్వాని సంప్రవృత్తాని విషయార్థం మహీభుజామ్
దండ్యతాం సంప్రయాతాని భూతాని భువి భూరిశః. 14
తతో యుద్ధం వినా భూపా మహీం పాలయితుం క్షమాః
న సమర్థాస్తదా యాతాః ప్రజాభిః సహ దైన్యతామ్. 15

ఇట్లు, కాలచక్రము పరివర్తనమందుచుండ జనులు ధనసంగ్రహపరులును, భోజనవ్యగ్రులును గాదొడంగిరి. సంపదలను గుఱించి రాజులు వివాదపడదొడంగిరి. జనులు, (నేరములనొనర్చి) దండార్హులు కాదొడంగిరి. రాజులు యుద్ధములులేకుండ భూమిని పాలింపకపోయిరి. ప్రజలును రాజులునుగూడ దీనతనుబొందిరి.



తేషాం దైన్యాపనోదార్థం సమ్యగ్దృష్టిక్రమాయచ
తతోఽస్మదాదిభిః ప్రోక్తా మహత్యో జ్ఞానదృష్టయః. 16

అప్పుడు మాకు అనగా జ్ఞానదృష్టిగల మహాత్ములకు—వారి దైన్యమును బోగొట్టుటకుగాను ఆత్మతత్త్వమును ప్రచారమొనర్పవలసివచ్చెను.

అధ్యాత్మవిద్యా తేనేయం పూర్వం రాజసు వర్ణితా
తదను ప్రసృతా లోకే రాజవిద్యేత్యుదాహృతా. 17

అందువలన యీ అధ్యాత్మవిద్య మొట్టమొదట రాజులకుజెప్పఁబడెను; పిదప లోకమునఁ బ్రచురింపఁబడినది. కనుక, యీ అధ్యాత్మవిద్యను రాజవిద్యయనిగూడ అందురు.

రాజవిద్యా రాజగుహ్య మధ్యాత్మజ్ఞానముత్తమమ్
జ్ఞాత్వా రాఘవ రాజానః పరాం నిర్దుఃఖతాం గతాః. 18

రాఘవా! రహస్యమగు యీ ఉత్తమ రాజవిద్యను దెలిసికొని, రాజులు దుఃఖమునుండి విడిపడిరి.

అథ రాజస్వతీతేషు బహుష్వమలకీర్తిషు
అస్మాద్దశరథాద్రామ జాతోఽద్య త్వమిహావనౌ. 19

పిమ్మట, నిర్మలకీర్తులగు రాజులనేకులు గతించిరి. ఇప్పుడు, నీవు భూమండలమున దశరథునకు పుత్రుడవై జన్మించితివి.

తవ చాతిప్రసన్నేఽస్మిన్ జాతం మనసి పావనమ్
నిర్నిమిత్తమిదం చారు వైరాగ్యమరిమర్దన. 20

శత్రునాశకా! ప్రశాంతమగు నీ మనమున, కారణములేకుండగనే సుందరమును పవిత్రమునగు ఈ వైరాగ్యము కలిగినది.

సర్వస్యైవహి సర్వస్య సాధోరపి వివేకినః
నిమిత్తపూర్వం వైరాగ్యం జాయతే రామ రాజసమ్. 21

రామా! వివేకులని ప్రసిద్ధిగాంచిన వారందఱికిని, ప్రప్రథమమున నిర్వేదాది కారణములవలననే వైరాగ్యము జనించినది. ఈ వైరాగ్యము రాజసమనంబడును.

ఇదం త్వపూర్వ ముత్పన్నం చమత్కారకరం సతామ్
తవానిమిత్తం వైరాగ్యం సాత్త్వికం స్వవివేకజమ్. 22

నీకు ఎట్టికారణములేకుండగనే అపూర్వమగు వివేకమువలన వైరాగ్యము కలిగినది. ఇట్టి వైరాగ్యమును సాత్త్వికవైరాగ్యమందురు. దీనినిగాంచి, సాధుపురుషులుగూడ అచ్చెరువందుచున్నారు.

బీభత్సం విషయం దృష్ట్వా కోనామ న విరజ్యతే
సతాముత్తమవైరాగ్యం వివేకాదేవ జాయతే. 23

బీభత్స విషయములఁగాంచిన విరాగమేరికి కలుగకుండును? కాని, సాధుపుంగవులకు కలుగు వైరాగ్యమిట్టిదికాదు; వారికి వివేకమునుండియే కలుఁగును.

తే మహాంతో మహాప్రాజ్ఞా నిమిత్తేన వినైవహి
వైరాగ్యం జాయతే యేషాం తేషాం హ్యమలమానసమ్. 24

నిర్నిమిత్తముగ వైరాగ్యమునందువారే గొప్పవారు, మహాప్రాజ్ఞులు. వారిమనస్సు నిర్మలము.

స్వవివేకచమత్కారపరామర్శవిరక్తయా
రాజతే హి ధియా జంతుర్యువేవ పరమాలయా. 25

యువకుఁడు శ్రేష్ఠమగు మాలవలన శోభితుఁడగునట్లు, వివేకజనిత వైరాగ్యమువలన జనులు శోభను బొందుదురు.

పరామృశ్య వివేకేన సంసారరచనామిమామ్
వైరాగ్యం యేఽధిగచ్ఛంతి తఏవ పురుషోత్తమాః. 26

వివేకముతో ఈ సంసారరచననుగూర్చి విచారించి వైరాగ్యము నవలంబించువారే పురుషశ్రేష్ఠులు.

స్వవివేకవశాదేవ విచార్యేదం పునః పునః
ఇంద్రజాలం పరిత్యాజ్యం సబాహ్యాభ్యంతరం బలాత్. 27

వివేకముతో లెస్సగ విచారించి, ఇంద్రజాలమగు ఈ మాయామయ దృశ్య ప్రపంచమును దేహేంద్రియ మనోబుద్ధులను, అవిద్యయగు అభ్యంతరజగత్తును, పరిత్యజింపవలెను.

శ్మశానమాపదం దైన్యం దృష్ట్వా కో న విరజ్యతే
తద్వైరాగ్యం పరం శ్రేయః స్వతో యదభిజాయతే. 28

శ్మశానము, ఆపదలు, దైన్యము — వీనిని గాంచి విరాగికానివాఁడెవఁడు? కాని స్వతః కలుగు వైరాగ్యమే చాలమంచిది.

అకృత్రిమవిరాగత్వం మహత్త్వమలమాగతః
యోగ్యోఽసి జ్ఞానసారస్య బీజస్యేవ మృదుస్థలమ్. 29

నీవు అకృత్రిమ వైరాగ్యమును, అతిశయ మహత్త్వమును బొందితివి. మెత్తటినేల విత్తుటకు దగినట్లు, జ్ఞానముయొక్క సారోపదేశమునకు నీవు పాత్రుఁడవు.

ప్రసాదాత్ పరమేశస్య నాథస్య పరమాత్మనః
త్వాదృశస్య శుభా బుద్ధిర్వివేకమనుధావతి. 30

పరమాత్మయును, జగత్ప్రభుఁడునునగు పరమేశ్వరుని అనుగ్రహమువలననే, నీబోంట్ల శుభబుద్ధి వివేకమునందుచున్నది.



క్రియాక్రమేణ మహతా తపసా నియమేనచ
దానేన తీర్థయాత్రాభిశ్చిరకాలం వివేకతః. 31
దుష్కృతే క్షయమాపన్నే పరమార్థవిచారణే
కాకతాలయయోగేన బుద్ధిర్జంతోః ప్రవర్తతే. 32

యజ్ఞదానాదిక్రియలను, గొప్పదగు తపమును, సల్పుటవలనను, చిరకాలము తీర్థములను సేవించుటవలనను, నియమములను అవలంబించుటవలనను, వివేకముదయించును; పాపము నశించును. అప్పుడు కాకతాళీయముగ మనుజులకు తత్త్వచింతయందు ఆసక్తికలుగును.

క్రియాపరాస్తావదలం చక్రావర్తిభిరావృతాః
భ్రమంతీహ జనా యావన్న పశ్యంతి పరంపదమ్. 33

పరమపదమును దర్శింపనంతవరకు జనులు, చక్రమువలె తిరుగాడు రాగాదులవలన చుట్టబడి, ఐహికాముష్మికఫలప్రదములగు క్రియల నాచరించుచుందురు.

యథాభూతమిదం దృష్ట్వా సంసారం తన్మయీం ధియమ్
పరిత్యజ్య పరం యాంతి నిరాలానా గజా ఇవ. 34

ఈ సంసారము నసారమని వివేకమువలన గ్రహించినప్పుడే, బంధములను త్రెంపిపోరిపోవు ఏనుఁగువలె, సంసారబుద్ధిని త్యజించి పరమపదము నందుచున్నారు.

విషమేయమనంతేహ రామ సంసారసంసృతిః
దేహాయుక్తో మహాజంతుర్వినా జ్ఞానం న పశ్యతి. 35

రామా ! ఈ సంసారముయొక్క గతి, అతికుటిలము; దీని కంతములేదు. దేహబంధమున నున్న మహాజంతువగు మనుష్యుఁడు జ్ఞానమువినా దీని అంతమును గనుగొనజాలఁడు.

జ్ఞానయుక్తిప్లవేనైవ సంసారాబ్ధిం సుదుస్తరమ్
మహాధియః సముత్తీర్ణా నిమేషేణ రఘూద్వహ. 36

రఘూద్వహా ! వివేకులు జ్ఞానయుక్తి రూపకమగు తెప్పవలననే, దుస్తరమగు ఈ సంసారసాగరమును తరింతురు.

తామిమాం జ్ఞానయుక్తిం త్వం సంసారాంభోధితారిణీమ్
శృణుష్వావహితో బుద్ధ్యా నిత్యావహితయా తయా. 37

అందువలన, నీవు సంసార సముద్రమును దాటించు ఈ జ్ఞానవిచారమును, విచారబుద్ధితో ఏకాగ్రమనస్కుఁడవై వినుము.

యస్మాదనంతసంరంభా జాగత్యో దుఃఖభీతయః
చిరాయాంతర్దహంత్యేతా వినా యుక్తిమనిందితామ్. 38

ఏలయన, అనిందితమగు ఈజ్ఞానమును గూర్చుకొనిసచో, కామక్రోధాదులకు లెక్కకు మీరిన వేగములతోనిండిన ఈ జగత్తున దుఃఖభయములు నిరంతరము నీ అంతరమును దహించుచుండును.

శీతవాతాతపాదీని ద్వంద్వదుఃఖాని రాఘవ
జ్ఞానయుక్తిం వినా కేన సహ్యతాం యాంతి సాధుషు. 39

రాఘవా! జ్ఞానయుక్తి బలమునగాక, మఱెద్దానివలన సాధుపురుషులు శీతవాతాతపాది దుఃఖములను సహింపగలుగుచున్నారు?

ఆపతంతి ప్రతిపదం యథాకాలం దహంతిచ
దుఃఖచింతా నరం మూఢం తృణమగ్నిశిఖా ఇవ. 40

ఈ దుఃఖ చింతలన్నియు అనుక్షణము మూఢమానవుల దరిజేరి, ఎండుగడ్డిని అగ్నిదహించునట్లు, దహించుచున్నవి.

ప్రాజ్ఞం విజ్ఞాతవిజ్ఞేయం సమ్యగ్దర్శనమాధయః
న దహంతి వనం వర్షాసిక్త మగ్నిశిఖా ఇవ. 41

వానచే దడసిన అడవిని నిప్పు దహింపజాలనట్లు అధ్యాత్మశాస్త్రమును విచారపూర్వకముగ గ్రహించి, ఆత్మతత్త్వమును సాక్షాత్కరింప జేసికొనినవానిని, మానసవ్యాధులు దహింపజాలవు.

ఆధివ్యాధిపరావర్తే సంసారమరుమారుతే
క్షుభితేఽపి న తత్త్వజ్ఞో భజ్యతే కల్పవృక్షవత్. 42

ఈ సంసార మరుభూమియందు నిరంతరము ఆధివ్యాధులను సుడిగాలులు లేచుచున్నను, తత్త్వజ్ఞుడగువాడు, కల్పవృక్షమువలె చలనములేకుండ నుండును.

తత్త్వం జ్ఞాతుమతో యత్నాద్ధీమానేవ హి ధీమతా
ప్రామాణికః ప్రబుద్ధాత్మా ప్రష్టవ్యః ప్రణయాన్వితమ్. 43

అందువలన వివేకియగువాడు, తత్త్వజ్ఞానమును గ్రహింప ప్రమాణజ్ఞుడును, ప్రబుద్ధాత్ముడును, బుద్ధిమంతుడునునగు వ్యక్తికి యత్నముతో నమస్కారాది సపర్యలనొనర్చి, ప్రేమపూర్వకముగ ప్రశ్నింపవలెను.

ప్రామాణికస్య పృష్టస్య వక్తురుత్తమచేతసః
యత్నేన వచనం గ్రాహ్యం మంశుకేనేవ కుంకుమమ్. 44

కుంకుమరంగునందు వస్త్రమును ముంచి దానికి రంగంటజేయునట్లు, మంచివాడును, పెద్దయునగువానిని ప్రశ్నించి అతడు చెప్పుదానిని యత్నముతో గ్రహింపవలెను.

అతత్త్వజ్ఞ మనాదేయవచనం వాగ్విదాం వర
యః పృచ్ఛతి నరం తస్మాన్నాస్తి మూఢతరోఽధమః. 45

వాగ్మివరా! తత్త్వజ్ఞుడు కానివాడును, ఉపదేశము నొనర్పలేని వాడునునగువానిని యీ విషయమును గుఱించి ప్రశ్నించువానికంటె, మూఢుడు మఱొకడుండడు.



ప్రామాణికస్య తజ్జ్ఞస్య వక్తుః పృష్టస్య యత్నతః
నానుతిష్ఠతి యో వాక్యం నాన్యస్తస్మాన్నరాధమః. 46

రఘునందనా! ప్రమాణికుడగు తత్త్వవేత్తను యత్నముతో ప్రశ్నించి తదనుసార మాచరింపనివానికంటె, నరాధముడు మఱొకడుండడు.

అజ్ఞతాతజ్జ్ఞతే పూర్వం వక్తుర్నిర్ణీయ కార్యతః
యః కరోతి నరః ప్రశ్నం పృచ్ఛకః స మహామతిః. 47

ఎవడు, ప్రశ్నింపకముందే వక్తయొక్క జ్ఞానాజ్ఞానముల నిర్ణయించుకొని వ్యవహార రీత్యా ప్రశ్నించునో, అతడే మహామతి.

అనిర్ణీయ ప్రవక్తారం బాలః ప్రశ్నం కరోతి యః
అధమః పృచ్ఛకః స స్యాన్న మహార్థస్య భాజనమ్. 48

"వక్త సరియైనవాడగునా? కాదా" — అని నిర్ణయించుకొనకుండగనే ప్రశ్నించువాడు మూఢుండు; ఈ మూఢుడు పరమార్థజ్ఞానము నెన్నటికిని బడయజాలడు.

పూర్వాపర సమాధాన క్షమబుద్ధావనిందితే
పృష్టం ప్రాజ్ఞేన వక్తవ్యం నాధమే పశుధర్మిణి. 49

ప్రాజ్ఞుడగు వక్త, పూర్వాపరవిచారమును సల్పి, అవధారణా సమర్థుడగు అనిందితవ్యక్తికి, అడిగిన విషయమును జెప్పవలెను. పశుస్వభావుడగు అధమునకేమియు వచింపరాదు.

ప్రామాణికార్థయోగ్యత్వం పృచ్ఛకస్యావిచార్యచ
యో వక్తి తమిహ ప్రాజ్ఞాః ప్రాహుర్మూఢతరం నరమ్. 50

పృచ్ఛకుని సామర్థ్యమును విచారింపకయే ఉపదేశమునిచ్చు వ్యక్తిని, ప్రాజ్ఞులు మూఢుడందురు.

త్వమతీవ గుణశ్లాఘీ పృచ్ఛకో రఘునందన
అహంచ వక్తుం జానామి సమో యోగోఽయమావయోః. 51

రఘునందనా! నీవు మిక్కుటముగ గుణముల నాదరింతువు; గుణవత్పాత్రివగు నీవు ప్రశ్నించుచున్నావు. నేను సద్వక్తను. మనకిర్వురకును యీ గురుశిష్యభావము తగియేయున్నది.

యదహం వచ్మి తద్యత్నాత్ త్వయా శబ్దార్థకోవిద
ఏతద్వస్త్వితి నిర్ణీయ హృది కార్యమఖండితమ్. 52

శబ్దార్థజ్ఞాననిపుణా! నేనువచించుదానిని తత్త్వమని గ్రహించి నిస్సందేహముగ ఆచరింపుము.

మహానసి విరక్తోఽసి తత్త్వజ్ఞోఽసి జనస్థితౌ
త్వయి చోక్తం లగత్యంతః కుంకుమాంబు యథాంశుకే. 53

కులమునుబట్టియు, గుణములజేసియు, ఆచారముల ననుసరించియు, నీవు గొప్పవాడవు. వైరాగ్యవంతుడవు. జీవులగతిని గ్రహించితివి. కాన, నీకు చెప్పబడునదంతయు, వస్త్రమున కుంకుమ రంగువలె, నీయందంకితము కాగలదు.

ఉక్తావధానపరమా పరమార్థవివేచినీ
విశత్యర్థం తవ ప్రజ్ఞా జలమధ్యమివార్కభాః. 54

సూర్యునికాంతి నీటియందు ప్రవేశించునట్లు, ఏకాగ్రభావమున ఉపదేశమును గ్రహించుటయందును, పరమార్థవిచారమును సల్పుటయందు సమర్థమగు నీబుద్ధి, చెప్పబోవు తత్త్వార్థమున ప్రవేశింపగలదు.

యద్యద్వచ్మి తదాదేయం హృది కార్యం ప్రయత్నతః
నోచేత్ ప్రష్టవ్య ఏవాహం న త్వయేహ నిరర్థకమ్. 55

నేను చెప్పబోవు దానినంతటిని యత్నపూర్వకముగ హృదయమున గ్రహింపుము; తదనుసార మాచరింపుము. వ్యర్థముగ ప్రశ్నింపకుము.

మనో హి చపలం రామ సంసారవనమర్కటమ్
సంశోధ్య హృది యత్నేన శ్రోతవ్యా పరమార్థగీః. 56

రామా! చంచలమగు ఈ మనస్సు సంసారమను వనమందుతిరుగాడు కోతి. దీనిని శుద్ధమొనర్చి యత్నపూర్వకముగ పరమార్థ తత్త్వమును వినుము.

అవివేకిన మజ్ఞాన మసజ్జనరతిం జనమ్
చిరం దూరతరే కృత్వా పూజనీయా హి సాధవః. 57

అవివేకియును, అజ్ఞుడును, అసత్ - సంసర్గియునగువాని సంపర్కము నెల్లప్పటికిని వీడి సాధువులను పూజింపుము.

నిత్యం సజ్జనసంపర్కాద్వివేక ఉపజాయతే
వివేకపాదపస్యైవ భోగమోక్షౌ ఫలే స్మృతే. 58

నిరంతరము సాధుసంగమ మొనర్ప వివేకముదయించును. భోగమోక్షములు రెండునుఁగూడ ఈ వివేకవృక్షముయొక్క ఫలములని చెప్పంబడుచున్నవి.

మోక్షద్వారే ద్వారపాలాశ్చత్వారః పరికీర్తితాః
శమో విచారః సంతోషశ్చతుర్థః సాధుసంగమః. 59

శమము, విచారణ, సంతోషము, సాధుసంగమము — ఈ నాలుగును మోక్షద్వారము యొక్క ద్వారపాలకులని చెప్పఁబడుచున్నవి.



ఏతే సేవ్యాః ప్రయత్నేన చత్వారో ద్వౌత్రయోఽథవా
ద్వారముద్ఘాటయంత్యేతే మోక్షరాజగృహే తథా. 60

ఈ నాల్గింటిని యత్నపూర్వకముగ అభ్యసింపవలెను. అన్నిటిని అలవరచుకొనజాలనిచో మూడింటినిగాని లేక రెండింటినిగాని అభ్యసించునది. ఏలయన, వీటివలననే మోక్షద్వారము తెఱువఁబడును.

ఏకంవా సర్వయత్నేన ప్రాణాంస్త్యక్త్వా సమాశ్రయేత్
ఏకస్మిన్ వశగే యాంతి చత్వారోఽపి వశం యతః. 61

అట్లుగాకున్న, ఏయొక్కదానినైనను అలవరచుకొన ప్రాణములు తెగించియైనను యత్నించునది. ఏలయన, ఒక్కటి వశమైన తక్కినవన్నియు లోబడును.

సవివేకో హి శాస్త్రస్య జ్ఞానస్య తపసః శ్రుతేః
భాజనం భూషణాకారో భాస్కరస్తేజసామివ. 62

శాస్త్రము, జ్ఞానము, తపస్సు, శ్రుతి—వీటికి వివేకియే యోగ్యుడగుచున్నాడు. సూర్యుడు తేజోపదార్థములకెల్ల శ్రేష్ఠుడైనట్లు వివేకియు జనులలో శ్రేష్ఠుడు.

ఘనతాముపయాతం హి ప్రజ్ఞామాంద్యమచేతసామ్
యాతి స్థావరతామంబు జాడ్యాత్ పాషాణతామివ. 63

శైత్యాధిక్యతవలన నీరు రాతివలె గడ్డకట్టునట్లు, జడులగువారి బుద్ధిమాంద్యము క్రమముగ హెచ్చి దుర్భేద్యమగును.

త్వంతు రాఘవ సౌజన్యగుణశాస్త్రార్థదృష్టిభిః
వికాసితాంతఃకరణః స్థితః పద్మ ఇవోదయే. 64

కాని రాఘవా! నీవు సౌజన్యము, సుగుణములు, శాస్త్రదృష్టులవలన, సూర్యోదయ సమయమునందలి పద్మమువలె; వికసితాంతఃకరణుఁడవైతివి.

ఇమాం జ్ఞానగిరం శ్రోతుమవబోద్ధుంచ సన్మతే
అర్హస్యుద్ధతకర్ణస్త్వం జంతుర్వీణాస్వనం యథా. 65

సాధుమతీ! చెవులు నిక్కపొడుచుకొనినలేళ్లు వీణాధ్వనిని వినగలిగినట్లు, నీవుగూడ యీ జ్ఞానవాక్యములను విని, తెలిసికొనఁగలవు.

వైరాగ్యాభ్యాసయోగేన సమసౌజన్యసంపదామ్
అర్జనాం కురుతాం రామ యత్ర నాశో న విద్యతే. 66

రామా! నాశనములేనట్టి సౌజన్యసంపదను అభ్యాస, వైరాగ్యములవలన సంపాదింపుము.

శాస్త్రసజ్జనసంసర్గపూర్వకైః సతపోదమైః
ఆదౌ సంసారముక్త్యర్థం ప్రజ్ఞామేవాభివర్ధయేత్. 67

సంసారమునుండి విడివడు నిమిత్తము, మొట్టమొదట శాస్త్రసజ్జన సంగమములను గ్రహించి తపమాచరింపుము: దమమును గూర్చుకొనుము. దీనివలన, ప్రజ్ఞాశక్తి వర్ధిల్లును.

ఏతదేవాస్య మౌర్ఖ్యస్య పరమం విద్ధి నాశనమ్
యదిదం ప్రేక్ష్యతే శాస్త్రం కించిత్ సంస్కృతయా ధియా. 68
సంసారవిషవృక్షోఽయ మేకమాస్పదమాపదామ్
అజ్ఞం సమ్మోహయేన్నిత్యం మౌర్ఖ్యం యత్నేన నాశయేత్. 69

శుద్ధమగు చిత్తముతో యీ శాస్త్రమునుపఠించిన, మూర్ఖత సంపూర్ణముగ సమయును. ఈ సంసార—విషవృక్షము ఆపదలకు తావు; ఇది అజ్ఞులనెల్లప్పుడు మోసపుచ్చుచున్నది. అందు వలన ప్రయత్నముతో మూర్ఖత్వమును నశింపజేయుము.

దురాశాసర్పగత్యేన మౌర్ఖ్యేణ హృది వల్గతా
చేతః సంకోచమాయాతి చర్మాగ్నావివ యోజితమ్. 70

సర్పమువలె వక్రగామియగు మూర్ఖత, దురాశతో హృదయము నంటిపెట్టికొనియున్న, అనలసంలగ్న చర్మమువలె, హృదయము సంకుచితమగును.

ప్రాజ్ఞే యథార్థభూతేయం వస్తుదృష్టిః ప్రసీదతి
దృగివేందో నిరంభోదే సకలామలమండలే. 71

ఈ యథార్థ తత్త్వదృష్టి, మేఘములులేని ఆకాశమున చంద్రమండల మగుపడునట్లు, ప్రాజ్ఞులయందే ప్రసన్నభావమున పరిస్ఫురితమగును.

పూర్వాపరవిచారార్థ చారుచాతుర్యశాలినీ
సవికాసా మతిర్యస్య స పుమానిహ కథ్యతే. 72

ఎవనిబుద్ధి పూర్వాపరవిచారమును సల్పి, అర్థజ్ఞానమును గ్రహింపజాలునో, అతడే పురుషుడని చెప్పబడుచున్నాడు.

వికసితేన సితేన తమోముచా
వరవిచారణశీతల రోచిషా
గుణవతాహృదయేన విరాజసా
త్వాపమలేన నభః శశినా యథా. 73



ఇతి శ్రీ వాసిష్ఠ మహారామాయణే ముముక్షువ్యవహార
ప్రకరణే వక్తృపృచ్ఛకలక్షణంనామ ఏకాదశః సర్గః ॥ 11 ॥

చీకటినిఁ బోగొట్టి తెలిచందురునివలన ఆకాశము శోభించునట్లు, తమోరహితమును స్వచ్ఛమును, శాంత్యాది గుణయుక్తములునగు హృదయముతో నీవు శోభిల్లుచున్నావు.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు ముముక్షు వ్యవహార
ప్రకరణమున వక్తృపృచ్ఛకలక్షణమను ఏకాదశసర్గము. ॥ 11 ॥



## ద్వాదశః సర్గః.

శ్రీవసిష్ఠ ఉవాచః—
పరిపూర్ణమనామాన్యః ప్రష్టుం జానాసి రాఘవ
వేత్సి చోక్తంచ తేనాహం ప్రవృత్తో వక్తుమాదరాత్. 1

వసిష్ఠుఁడు:— రాఘవా! నీ మనస్సు (చెప్పబోవు) సుగుణములతో నిండియున్నది. నీవు ప్రశ్నింపగలవు; చెప్పిన గ్రహింపగలవు. అందువలన నేను నీకాదరముతో యీ తత్త్వజ్ఞానమును చెప్పబూనుచున్నాను.

రజస్తమోభ్యాం రహితాం శుద్ధసత్త్వానుపాతినీమ్
మతిమాత్మని సంస్థాప్య జ్ఞానం శ్రోతుం స్థిరో భవ. 2

మనస్సును రజస్తమోగుణ శూన్యమగునట్లొనర్చి దానిని ఆత్మయందు నిలిపి జ్ఞానమును విన స్థిరుఁడవు కమ్ము.

విద్యతే త్వయి సర్వైవ పృచ్ఛకస్య గుణావలీ
వక్తుర్గుణాలీచ మయి రత్నశ్రీర్జలధౌ యథా. 3

నీ యందు ప్రశ్నకర్త కుండవలసిన గుణములన్నియు, నున్నవి. నాయందు వక్త కుండదగిన లక్షణములన్నియు, సముద్రమున రత్నములవలె, నున్నవి.

ఆప్తవానసి వైరాగ్యం వివేకాసంగజం సుత
చంద్రకాంత ఇవార్ద్రీత్వం లగ్నచంద్రకరోత్కరః. 4

వత్సా! వివేకము, అనాసక్తులవలన కలిగిన వైరాగ్యమును నీవుపొందితివి. అందువలన, నీ చిత్తము చంద్రకిరణ స్పర్శతగిలిన చంద్రకాంతమణివలె ఆర్ద్రమైనది.

చిరమాశైశవాదేవ తవాభ్యాసోఽస్తి సద్గుణైః
శుద్ధైః శుద్ధస్య దీర్ఘైశ్చ పద్మస్యేవాతిసంతతైః. 5

పద్మము సౌరభాదిగుణములతో గూడియుండునట్లు, శైశవమునుండియు నీకుఁగూడ శుద్ధము లగు సద్గుణముల అభ్యాసమున్నది.

అతః శృణు కథాం వక్ష్యే త్వమేవాస్యా హి భాజనమ్
నహి చంద్రం వినా శుద్ధా సవికాసా కుముద్వతీ. 6

అందువలన నేను చెప్పఁబోవుదానిని వినుము. నీవు ఉపదేశపాత్రుడవు. చంద్రుడు లేనిచో కలువలు వికసింపవు కదా!

యే కేచన సమారంభా యాశ్చ కాశ్చన దృష్టయః
తేచ తాశ్చ పదేదృష్టే నిఃశేషం యాంతి వై శమమ్. 7

ఈ బాహ్యాడంబరములు, దృష్టులు, ఆ పరమపదము కనంబడిన అంతరించును.

యది విజ్ఞానవిశ్రాంతిర్న భవేద్భవ్యచేతసః
తదస్యాం సంసృతౌ సాధుశ్చింతామాంధ్యం సహేత కః. 8

సాధువ్యక్తులకు జ్ఞానమువలన పరమశాంతి లభింపకున్న, యీ చింతామాంధ్యము నెవరు సహింప గల్గెడివారు?

పరంప్రాప్య విలీయంతే సర్వా మననవృత్తయః
కల్పాంతార్కగణాసంగాత్ కులశైలశిలా ఇవ. 9

ప్రళయాంతమున కులగిరులన్నియు; సూర్యసంపర్కమున విలీనమైపోవునట్లు, పరమపదము లభించిన మనోవృత్తులన్నియు నశించును.

దుఃసహా రామ సంసారవిషావేశవిషూచికా
యోగగారుడమంత్రేణ పావనేన ప్రశామ్యతి. 10

రామా! దుస్సహమగు సంసార విషయముతోగూడిన యీ విషూచివ్యాధి పావనమగు యోగ గారుడ మంత్రమువలన నుపశమించును.

సచ యోగః సజ్జనేన సహ శాస్త్రవిచారణాత్
వేకమార్గజ్ఞానమంత్రో నూనం లభ్యేత ఏవచ. 11

జ్ఞానము సజ్జనులతోగూడి శాస్త్రచర్చ సల్పుటవలననే లభించును.

అవశ్యం తోహి విచారే కృతే సకలదుఃఖపరిక్షయో భవతీతి మంతవ్యం ప్రాతో విచారదక్షైర్మోఽవహేలయా ద్రష్టవ్యాః. 12

జ్ఞానవిచారమువలన దుఃఖములన్నియు నశించును అని నిశ్చయముగ తెలియునది. అందు వలన విచారపరులగువారు హేళన దృష్టితో చూడదగదు.



విచారవతా పురుషేణ సకలమిదమాధిపంజరం సర్పేణ త్వచమివ పరివక్వాం సంత్యజ్య విగతజ్వరేణ శీతలాంతఃకరణేన వినోదాదింద్రజాలమివ జగదఖిలమాలోక్యతే సమ్యగ్దర్శనవతా అసమ్యగ్దర్శనవతో హి పరందుఃఖమిదం. 13

పాము కుబుసమును వీడునట్లు, వివేకులగువారు మొట్టమొదట యీ ఆధిపంజరమును త్యజింపవలెను. పిమ్మట తత్త్వదర్శన మొనరించి, విగతజ్వరుఁడును, శీతలాంతఃకరణుఁడును నై యీ జగత్తునంతటిని ఇంద్రజాలమువలె గాంచనగును. సమ్యగ్దర్శనము నొనరింపనివారు కేవలము దుఃఖమునే అనుభవింతురు.

విషమో హ్యతితరాం సంసారరాగో భోగీవ దశతి అసిరివ ఛినత్తి కుంత ఇవ వేధయతి రజ్జురివావేష్టయతి పావక ఇవ దహతి రాత్రిరివాంధయతి అశంకిత పరిపతిత పురుషాన్ పాషాణ ఇవ వివశీకరోతి హరతి ప్రజ్ఞాం నాశయతి స్థితిం పాతయతి మోహాంధకూపే తృష్ణా జర్జరీకరోతి నతదస్తి కించిద్దుఃఖం సంసారీ యన్నప్రాప్నోతి. 14

ఈ సంసారాసక్తి అతిభయంకరమైనది. ఇది అనర్థశంకలేని మోహగ్రస్త పురుషులను పామువలె కరచును, కత్తివలె నఱుకును, కుంతాస్త్రమువలె వేధించును, త్రాడువలె కట్టును, అగ్నివలె దహించును, రాత్రివలె చూపును బోగొట్టును, రాతివలె మూర్ఛనందించును, బుద్ధిస్థితిని స్థితిని పాడుపరచును, మోహాంధ కూపమునఁ బడగొట్టును, వేయేల? సంసారాసక్తుడగువా డనుభవించని దుఃఖమే లేదు.

దురంతేయం కిల విషయవిషూచికా యది న చికిత్స్యతే తన్నితరాం నరకనగరనికరఫలానుబంధినీ తత్తత్కరోతి. 15

ఈ దురంతవిషయ – విషూచి వ్యాధికి తగు చికిత్స నొనర్పనిచో, మలమూత్రములతో గూడిన నరకములగు తనయొక్కయు బంధుమిత్రాదుల యొక్కయు శరీరముల మమతను గల్గించి, నరకయాతన ననుభవింపఁజేయును.

యత్ర శిలాశితాసిశాతః పాత ఉపలతాడనమగ్నిదాహో హిమావసేకోఽంగావకర్తనం చందనచర్చాతరువనాని ఘుణవృంత్తాంతఃపరివేషోఽంగ పరిమార్జనమనవరతానలవిచలిత సమరనారాచనిపాతో నిదాఘవినోదనం ధారాగృహాసీకర వర్షణం శిరశ్ఛేదః సుఖనిద్రామూకీకరణ మాననముద్రా బాంధుర్యం మహానుపచయః. 16

రాళ్లను దినుట, కత్తితో కోయబడుట; కొండనుండి దొర్లింపబడుట; రాళ్లతో మోదబడుట, నిప్పుచే కాల్చబడుట, మంచుతో తడపబడుట, అవయవములు కత్తిరింపబడుట, గంధపుచెక్కవలె అరుగదీయబడుట, రెండుకొయ్యల మధ్య బిగింపబడుట, కాలుచున్న సంకెళ్ళతో బంధింపబడుట, ముళ్ళతో గీయబడుట, అగ్నిబాణముల వర్షమున దడియుట, నీడలేకుండ మండు వేసవిని గడుపుట, నీటిధారలయందు శీతకాలమున నిలంబడుట, తల నరకబడుట, నిద్రలేకుండుట, మోము కప్పఁబడుట, అవయవముల నెగుడు దిగుడొనరించుట, కొండంత లావున శరీరము పెరుగుట – ఇట్టివగు కష్టముల పెక్కింటిని యీ నరకములయందు ననుభవింపవలెను.

తదేవంవిధకష్టచేష్టాసహస్రదారుణే సంసారచలయంత్రేఽస్మిన్ రాఘవ నావహేలనా కర్తవ్యా అవశ్యమేవం విచారణీయమేవం చావబోద్ధవ్యం యథాకిల శాస్త్రవిచారాచ్ఛ్రేయో భవతీతి. 17

అందువలన నోరాఘవా! పలుకష్టములతో గూడుకొనియున్న యీ సంసారయంత్ర మతి దారుణము. దీనిని లక్షింపకుండుట ఉచితముకాదు. శాస్త్రవిచారమువలన శ్రేయస్సు లభించును. దానిని ఆలోచించి తెలిసికొనుము.

అన్యచ్చ రఘుకులేందో యదిచైతే మహామునయో మహర్షయశ్చ విప్రాశ్చ రాజానశ్చ జ్ఞానకవచేనావగుంఠితశరీరాస్తే కథమదుఃఖక్షమా అపి దుఃఖకరీం తాం తాం వృత్తిపూర్వికాం సంసారకదర్థనామనుభవంతః సతతమేవ ముదితమనస స్తిష్ఠంతి. 18

రఘుకులచంద్రా! మఱియు, జ్ఞానకవచమును దొడగికొనిన మునులు, ఋషులు, బ్రాహ్మణులు, రాజులును, దుఃఖానర్హులయ్యు, దుఃఖియగు మనస్సుతో యీ సంసారపీడ ననుభవించుచున్నను, వీరు నిరంతరము హృష్టచిత్తులై యున్నారు.

ఇహహి,

వికౌతుకా విగతవికల్పవిప్లవా
యథాస్థితా హరిహరపద్మజాదయః
నరోత్తమాః సమధిగతాత్మదీపకా
స్తథా స్థితా జగతి విశుద్ధబుద్ధయః. 19

ఎట్లన - విశుద్ధచిత్తులగు మానవులు ఆత్మదీపమును బొంది, హరిహర బ్రహ్మాదులగు దేవత లీ సంసారమున కౌతుక, విక్షేప హీనులై యున్నట్లు, వెలయుదురు.

పరిక్షీణే మోహే విగలతి ఘనే జ్ఞానజలదే
పరిజ్ఞాతే తత్త్వే సమధిగత ఆత్మన్యతితతే
విచార్యార్యైః సార్ధం చలితవపుషో వై సదృశతో
ధియా దృష్టే తత్త్వే రమణమటనం జాగతమిదమ్. 20

మోహము క్షీణించి, గొప్పవగు జ్ఞానమేఘము లుదయించిన, విచ్ఛిన్నమైన ఆత్మతత్త్వము నంపవచ్చును. అప్పుడు జీవునకు జగద్వ్యాపారము లీలగాదోచును, పీడ అనిపించదు.

అన్యచ్చ రాఘవ,

ప్రసన్నే చిత్తత్త్వే హృది శమభవే వల్గతి పరే
శమాభోగీభూతాస్వఖిలకలనాదృష్టిషు పురః
సమం యాతి స్వాంతః కరణఘటనాస్వాదితరసం
ధియా దృష్టే తత్త్వే రమణమటనం జాగతమిదమ్. 21



మఱియు - రాఘవా! చైతన్యమాత్రమగు ఆత్మ ప్రసన్నమైన, పరమశాంతి లభించును. బుద్ధివృత్తులన్నియు శాంతి - రసమున మునుగును. అప్పుడు బ్రహ్మరసాస్వాదనమున అంతఃకరణ వ్యాపారము సమభావాపన్న మగును. ఈ స్థితియందు జ్ఞానులకు జగద్భ్రమణము క్రీడగనే తోచును.

అన్యచ్చ,

రథః స్థాణుర్దేహ స్తురగరచనా చేంద్రియగతిః
పరిస్పందో వాతో వహనకలితానందవిషయః
పరోఽణుర్వా దేహీ జగతి విహరామీత్యనఘయా
ధియా దృష్టే తత్త్వే రమణమటనం జాగతమిదమ్. 22

ఇతి శ్రీవాసిష్ఠమహారామాయణే ముముక్షు వ్యవహార ప్రకరణే
తత్త్వమాహాత్మ్యవర్ణనం నామ ద్వాదశః సర్గః ॥ 12 ॥

మఱియు - ఛిన్నతరువువలె అచేతనమగు యీ తనువును రథముతో బోల్పవగును. ఇంద్రియముల చలనమే దీని కదలిక; ప్రాణవాయువువలన నీ రథము కదలుచున్నది. మనస్సు దీని పగ్గము. ఆనందము దీని గమ్యస్థానము. ఈ దేహరథమును నారోహించిన జీవుడు క్షుద్రుడైనను సమాధి సమయమున శుద్ధచిత్త సహాయ్యమున ఆత్మతత్త్వ దర్శనమైన యీ జగద్విహరణము సుఖక్రీడయే.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు ముముక్షువ్యవహార ప్రకరణమున
తత్త్వమాహాత్మ్యవర్ణనమను ద్వాదశ సర్గము ॥ 12 ॥



## త్రయోదశః సర్గః.

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

ఏతాం దృష్టిమవష్టభ్య దృష్టాత్మానః సుబుద్ధయః
విచరంతీహ సంసారే మహాంతోఽభ్యుదితా ఇవ. 1

వసిష్ఠుడు:- రాఘవా! ఈ సంసారమున బుద్ధిమంతులు అనగా వివేకులు ఈ జ్ఞానదృష్టిని బొంది, ఆత్మసాక్షాత్కార మొనరించుకొని, రాజ్యమును బొందినవారివలె గొప్పవారై చరింతురు.

నశోచంతి నవాంఛంతి నయాచంతే శుభాశుభమ్
సర్వమేవచ కుర్వంతి నకుర్వంతీహ కించన. 2

వీరు శోకింపరు, ఎద్దానినిఁగోరరు. శుభాశుభముల నర్థింపరు. శాస్త్రసమర్థితములగు కర్మల నొనర్తురు; శాస్త్రవిరుద్ధములగు కర్మలనొనర్పరు.

స్వచ్ఛమేవావతిష్ఠంతి స్వచ్ఛం కుర్వంతి యాంతి హి
హేయోపాదేయతాపక్షరహితాః స్వాత్మని స్థితాః. 3

వీరు పవిత్రతయందే వసింతురు. వీరొనర్చునదంతయు మంచికొఱకే, అది సన్మార్గమునకే మరలుచున్నది. "ఇది హేయము. ఆది ఉపాదేయము" — అను భిన్నజ్ఞానమును వర్జించి ఆత్మనిష్ఠులై నెగడుచున్నారు.

ఆయాంతిచ నచాయాంతి ప్రాయాంతిచ నయాంతిచ
కుర్వంత్యతి నకుర్వంతి నవదంతి వదంతిచ. 4

వీరి రాకపోకలుగూడ బుద్ధిపూర్వకములుగావు; వీరొనర్చునది, పల్కునదంతయుగూడ నిష్కామమే.

యేకేచన సమారంభా యాశ్చకాశ్చన దృష్టయః
హేయోపాదేయతస్తాస్తాః క్షీయంతేఽధిగతే పదే. 5

పరమపదము లభించిన సమస్తకార్యములును దృష్టులును, హేయోపాయ విమర్శనాశూన్యములై నశించును.

పరిత్యక్తసమస్తేహం మనో మధురవృత్తిమత్
సర్వతః సుఖమభ్యేతి చంద్రబింబ ఇవ స్థితమ్. 6

వీరు వివిధ ఇచ్ఛలను కార్యములను బరిత్యజించిన, మధురమనోవృత్తి (శాంతరసమయి బ్రహ్మకారవృత్తి)తో గూడినవారై, చంద్రమండలమందున్న దేవతలవలె సుఖము ననుభవింతురు.

అపి నిర్మననారంభ మప్యస్తాఖిలకౌతుకమ్
ఆత్మన్యేవ న మాత్యంతరిందావివ రసాయనమ్. 7

చంద్రబింబ మందమృతమున్నదో లేదో తెలియజాలనట్లు, ఇప్పుడు మనమున్న స్థితియందు, విషయాభిలాషా శూన్యమును, కౌతుకవిహీనమును అనగా ఏకాగ్రమగు మనస్సుయొక్క సుఖమెట్టిదో తెలియజాలము.

న కరోతీంద్రజాలాని నానుధావతి వాసనామ్
బాలచాపలముత్సృజ్య పూర్వమేవ విరాజతే. 8

ఆత్మవేత్త మాయయను ఇంద్రజాలమును గాంచడు; దీనికిఁగారణమగు వాసనల ననుసరింపడు. ఆతడు బాలచాపల్యమునువీడి, పూర్వమే లభించియున్న పరమాత్మసుఖమున రాజిల్లును. *

* వేదాంతులందురు — ముక్తి నిత్యవస్తువు; అది సిద్ధించియేయున్నది. మఱి మనము యత్నించునది దేనికి? అనిన ముక్తికొఱకుగాదు. ముక్తిని గప్పియుంచిన మాయాబంధ నిర్మూలనమునకు, మాయసళ్ళిన ముక్తికరతలామలకము. ఎట్లన, ఒకని మెడలో హారమున్నది. అతడు దానిని పోయినదానిగ దలచి, ఊరంతయు వెదకినాడు; కనబడలేదు. చివరకు, దానిని మెడలోనే యున్నట్లు గ్రహించి వెదకుట మానినాడు. ఇది ప్రాప్యవస్తు ప్రాప్తి. ఆత్మ నిత్యశుద్ధబుద్ధ స్వభావమగుకతన, ఇది సదాముక్తము. మాయను తొలగించుటయే మన మొనర్చుపని. కనుక, "పూర్వమే లభించియున్న ఆత్మసుఖ" మని ప్రయోగింపఁబడినది.



ఏవంవిధాహి వృత్తయ ఆత్మతత్త్వావలోకనాల్లభ్యంతే నాన్యథా. 9

ఇట్టి జీవన్ముక్తస్థితి, ఆత్మదర్శనమువలననే లభించును; అన్యోపాయమువలన నిది లభింపదు.

తస్మాద్విచారేణాత్మైవాన్వేష్టవ్య ఉపాసనీయో జ్ఞాతవ్యో యావజ్జీవం
పురుషేణ నేతరదితి. 10

అందువలన మనుజుడు విచారబుద్ధితో యావజ్జీవము ఆత్మాన్వేషణము సల్పుచు, దానిని నుపాసించుచు, జ్ఞానమునుబొందవలెను; తదితరమునుకాదు.

స్వానుభూతేశ్చ శాస్త్రస్య గురోశ్చైవైకవాక్యతా
యస్యాభ్యాసేన తేనాత్మా సంతతేనావలోక్యతే. 11

అభ్యాసమువలన ననుభవమును సంపాదించి, శాస్త్రానుశీలనమొనర్చి, గురువుయొక్క ఉపదేశమును గ్రహింప యత్నించువాడే ఆత్మదర్శనమును బొందగలడు.

అవహేలితశాస్త్రార్థై రవజ్ఞాతమహాజనైః
కష్టామప్యాపదం ప్రాప్తో నమూర్ఖైః సమతామియాత్. 12

ఇట్టివాడు, శాస్త్రార్థముల నిరసించుచు, మహాత్ముల నవమానించు మూఢునివలె, కష్టమును బొందడు.

నవ్యాధిర్నవిషం నాపత్తథా నాధిశ్చ భూతలే
ఖేదాయ స్వశరీరస్థం మౌర్ఖ్యమేకం యథా నృణామ్. 13

మనుజుని వాని అజ్ఞానము కష్టముల బాలుచేయునంతగా భూతలమున వ్యాధులు, మానసిక చింతలు, ఆపదలు, దుఃఖమును గలిగింపజాలవు.

కించిత్ సంస్కృతబుద్ధీనాం శ్రుతం శాస్త్రమిదం యథా
మౌర్ఖ్యాపహం తథా శాస్త్రమన్యదస్తి నకించన. 14

ఒకింత చిత్తశుద్ధిగల వారీశాస్త్రమును బఠించిన వారి అజ్ఞానము తొలగిపోవును; వారికీశాస్త్రము తోడ్పడునట్లితరములు తోడ్పడజాలవు.

ఇదం శ్రావ్యం సుఖకరం యథా దృష్టాంతసుందరమ్
అవిరుద్ధమశేషేణ శాస్త్రం వాక్యార్థబంధునా. 15

"పరమాత్మయే మాప్రియుడు" — అనివచించువారు అనగా ఆత్మవస్తువునందగోరువారు శ్రవణమధురమును, యథోచితదృష్టాంత శోభితమును, ఆత్మసుఖప్రసాదియును, శ్రుతిస్మృతి సంగతమునునగు ఈ శాస్త్రమును సంపూర్ణముగ వినవలెను.

ఆపదో యాదురుత్తారా యాశ్చ తుచ్ఛాః కుయోనయః
శాస్త్రా మౌర్ఖ్యాత్ ప్రసూయంతే ఖదిరాదివ కంటకాః. 16

కవిరిచెట్టునుండి ముళ్లులేచునట్లు, అనివార్యములును, తుచ్ఛములును, కుకారణములునగు ఆపదలు మూర్ఖతనుండియే వెలువడుచున్నవి.

వరం శరావహస్తస్య చాండాలాగారవీథిషు
భిక్షార్థమటనం రామ న మౌర్ఖ్యహతజీవితమ్. 17

రామా! మూఢునివలె జీవితమును గడుపుటకంటె మూకుడు చేతఁగొని మాలపల్లెలో తిరిపె మెత్తుట మేలు.

వరం ఘోరాంధకూపేషు కోటరేష్వేవ భూరుహామ్
అంధకీటత్వమేకాంతే న మౌర్ఖ్యమతిదుఃఖదమ్. 18

అతిదుఃఖకరమగు మూర్ఖతాజీవితముకంటె చీకటినూతులలోనో, చెట్టుతొఱ్ఱలలోనో, ఒంటరిపురుగువలె జీవితమును గడుపుట మేలు.

ఇమమాలోకమాసాద్య మోక్షోపాయమయం జనః
అంధతామేతి న పునః కశ్చిన్మోహతమస్యపి. 19

జనులు మోక్షోపాయమగు ఈ జ్ఞానకాంతిని బడసినచో, మోహాంధకారమున కన్నులు మసకలు క్రమ్మవు.

తావన్నయతి సంకోచం తృష్ణా వై మానవాంబుజమ్
యావద్వివేకసూర్యస్య నోదితా విమలా ప్రభా. 20

వివేకసూర్యుని పవిత్రజ్యోతి ప్రకాశిత మవనంతవఱకు, తృష్ణ మానవులను పద్మములను ముడుచుకొనియుండు నట్లొనర్చును.

సంసారదుఃఖమోక్షార్థం మాదృశైః సహబంధుభిః
స్వరూపమాత్మనో జ్ఞాత్వా గురుశాస్త్రప్రమాణతః. 21
జీవన్ముక్తాశ్చరంతీహ యథా హరిహరాదయః
యథా బ్రహ్మర్షయశ్చాన్యే తథా విహర రాఘవ. 22

రాఘవా! సంసారబంధముల ద్రెంప మావంటి హితులతోఁగూడి, గురువు, శాస్త్రము అను ప్రమాణములనుండి ఆత్మస్వరూపము నెఱిఁగి, హరిహరాదులను తదితరులగు మహర్షులును జీవన్ముక్తులై చరించునట్లు, నీవుకూడ చరింపుము.

అనంతానీహ దుఃఖాని సుఖం తృణలవోపమమ్
నాతః సుఖేషు బధ్నీయాద్దృష్టిం దుఃఖానుబంధిషు. 23

ఈ సంసారము అంతములేని దుఃఖములకు తావు; సుఖము తృణమాత్రమే. అందువలన, దుఃఖముతోఁగూడిన ఈ సంసారసుఖములపై పునకు నీ దృష్టిని మరల్పకుము.

యదనంత మనాయాసం తత్పదం సారసిద్ధయే
సాధనీయం ప్రయత్నేన పురుషేణ విజానతా. 24

అనంతమును, క్లేశహీనమునునగు, మోక్షపదమును పొందుటకొఱకే వివేకియగు మనుజుఁడు ప్రయత్నింపవలెను.



తఏవ పురుషార్థస్య భాజనం పురుషోత్తమాః
అనుత్తమపదాలంబి మనో యేషాం గతజ్వరమ్. 25

ఎవరిమనస్సు సర్వోత్తమమగు ఆ మోక్షపదము నాలంబన మొనర్చుకొని, కామాదిజ్వరశూన్యమైనదో, ఆ పురుషోత్తములే పురుషార్థసిద్ధినందుదురు.

సంభోగాశనమాత్రేణ రాజ్యాదిషు సుఖేషు యే
సంతుష్టా దుష్టమనసో విద్ధి తానంధదర్దురాన్. 26

రాజ్యాదివిషయ సుఖములతోడను, అన్నపానాదులగు భోగములతోడను సంతుష్టులగువారు గ్రుడ్డి కప్పలని ఎఱుంగునది.

యే శఠేషు దురంతేషు దుష్కృతారంభశాలిషు
ద్విషత్సు మిత్రరూపేషు భక్త్వావై భోగభోగిషు. 27
తే యాంతి దుర్గమాద్దుర్గం దుఃఖాద్దుఃఖం భయాద్భయమ్
నరకాన్నరకం మూఢా మోహమంథరబుద్ధయః. 28

ప్రబలవంచకులును, విషయలాలసులునునగు మిత్రరూప శత్రువులయెడ నాసక్తులగు మోహాంధబుద్ధులు తతోధికములగు కష్టములను, దుఃఖములను, భయములను, నరకములను బొందెదరు.

పరస్పరవినాశోక్తైః శ్రేయఃస్థో న కదాచన
సుఖదుఃఖదశే రామ తడిత్ప్రసరభంగురే. 29

సుఖదుఃఖములు పరస్పర నాశకారణములగు మెఱుపువెలుఁగులవంటివి; క్షణభంగురములు, కనుకనివి, ఆత్యంతికశ్రేయస్సు అగు మోక్షమును గూర్పజాలవు;

యే విరక్తా మహాత్మానః సువివిక్తా భవాదృశాః
పురుషాన్ విద్ధి తాన్ వంద్యాన్ భోగమోక్షైకభాజనాన్. 30

నీవలె విరక్తులును వివేకులునగు పురుషులే భోగమోక్షముల నందుదురు. ఇట్టివారే వందనీయులు.

వివేకం పరమాశ్రిత్య వైరాగ్యాభ్యాసయోగతః
సంసారసరితం ఘోరమిమామాపదముత్తరేత్. 31

పరమవివేకము నాశ్రయించి, వైరాగ్యాభ్యాసముల నాచరించిన, సంసారనదియగు ఘోరాపదను దాటవచ్చును.

న స్వప్తవ్యంచ సంసారమాయాస్విహ విజానతా
విషమూర్ఛనసమ్మోహదాయినీషు వివేకినా. 32

విషమూర్ఛితునివలె, వివేకియు, జ్ఞానియునగు నాతడు మోహదాయినియగు యీ సంసారమాయయందు నిద్రించుట (అనగా మోక్షమునందు ప్రయత్నింపకుండుట) ఉచితముకాదు.

సంసారమిమ మాసాద్య యస్తిష్ఠత్యవహేలయా
జ్వలితస్య గృహస్యోచ్చైః శేతే తార్ణస్య సంస్తరే. 33

ఈ సంసృతియందుబడి, మోచనకై యత్నింపనివాడు, తగులబడు ఇంట తృణశయ్యయందు పరుండినాడన్నమాట.

యత్ప్రాప్య ననివర్తంతే యదాసాద్య నశోచతే
తత్పదం శేముషీలభ్య మస్త్యేవాత్ర నసంశయః. 34

పునరావృత్తి రహితమును, శోకశూన్యమునునగు పదము కేవలము జ్ఞానమువలననే లభించును. ఆవంతయు సంశయములేదు.

నాస్తిచేత్ తద్విచారేణ దోషః కోభవతాం భవేత్
అస్తిచేత్ తత్సముత్తీర్ణా భవిష్యథ భవార్ణవాత్. 35

బ్రహ్మము లేదందువా? — అయినను విచారమొనర్చిన దోషమేమి? ఉన్నచో సంసారసాగరమును తరింతువు.

ప్రవృత్తిః పురుషస్యేహ మోక్షోపాయవిచారణే
యదా భవత్యాశు తదా మోక్షభాగీ స ఉచ్యతే. 36

ఈశ్వరానుగ్రహమున, సచ్ఛాస్త్రమును సద్గురువును బడసి, మోక్షోపాయమును విచారించునప్పుడే పురుషుడు మోక్షభాగి యనంబడును.

అనపాయి నిరాశంకం స్వాస్థ్యం విగతవిభ్రమమ్
న వినా కేవలీభావాద్విద్యతే భువనత్రయే. 37

ముల్లోకముల మోక్షముకంటె నిరపాయమును, భ్రమశంకా రహితమునగు సుఖము మఱొక్కటిలేదు. ఇంద్రియ సుఖములును స్వర్గాది సుఖములును దీనితో సరిరావు.

తత్రాప్తౌ వృత్తమప్రాప్తౌ నక్లేశ ఉపజాయతే
నధనాన్యుపకుర్వంతి నమిత్రాణి నబాంధవాః. 38

నహస్తపాదచలనం నదేశాంతరసంగమః
నకాయక్లేశవైధుర్యం నతీర్థాయతనాశ్రయః. 39

పురుషార్థైకసాధ్యేన వాసనైకార్థకర్మణా
కేవలం తన్మనోమాత్ర జయేనాసాద్యతే పదమ్. 40

మోక్షోపాయము నెఱుంగ ప్రవృత్తిగల్గినచో మోక్షమును బొందుట కట్టి ఆటంకమునులేదు. ధనము, బంధుమిత్రులు, హస్తపాదచలనము (కర్మలు) తీర్థయాత్రలు, తన్నివాసము, కాయక్లేశకరములగు ఉపవాసాదులు, దీని కింతమాత్రము తోడ్పడజాలవు. కేవలము శ్రవణమనన నిదిధ్యాస రూపకమగు పురుషప్రయత్నమువలన ద్వైతరూపకమగు మనస్సును జయించి, బ్రహ్మరసాకారిత నొనర్చుటవలననే అట్టి మోక్షము లభించును.

వివేకమాత్రసాధ్యం తద్విచారైకాంతనిశ్చయమ్
త్యజతా దుఃఖజాలాని నరేణైతదవాప్యతే. 41



ఈ బ్రహ్మపదమును కేవలము విచారమువలనే నిశ్చయింపనగును; దేహేంద్రియాదులకంటె అది ఇతరమను వివేకమవసరము. దీని నందగోరువాడు దుఃఖజాలములగు విషయములను బరిత్యజింపవలెను.

సుఖసేవ్యాసనస్థేన తద్విచారయతా స్వయమ్
నశోచ్యతే పదం ప్రాప్య నస భూయోహి జాయతే. 42

సమమును సుఖకరమునునగు ఆసనమునగూర్చుండి స్వయముగ విచారించి శోకరహితమగు ఆ పదము బొందువాడు మరల జన్మింపడు.

తత్సమస్త సుఖాసారసీమాంతం సాధవో విదుః
తదనుత్తమనిష్పందం పరమాహురసాయనమ్. 43

సాధువులు ఈ పరమపదమును సమస్త సుఖముల పరమావధియనియు, ఎనలేనిదనియు, నాశములేని అమృతమనియు ఎఱుంగుదురు.

క్షయిత్వాత్ సర్వభావానాం స్వర్గమానుష్యయోర్ద్వయోః
సుఖం నాస్త్యేవ సలిలం మృగతృష్ణాస్వివైతయోః. 44

పదార్థములన్నియు నశించునవే; స్వర్గమర్త్యలోకముల, ఎండమావిలో నీరులేనట్లు, సుఖములేదు.

అతో మనోజయశ్చింత్యః శమసంతోషసాధనః
అనంతసమసంయోగస్తస్మాదానంద ఆప్యతే. 45

అందువలన, శాంతి సంతోషముల ద్వారా సాధింపదగు మనోజయమును గుఱించి చింతించుటయే లగ్గు; ఈ మనోజయమునుండియే ఏకరస స్వరూపమగు ఆనందము లభించును.

తిష్ఠతా గచ్ఛతా చైవ పతతా భ్రమతా తథా
రక్షసా దానవేనాపి దేవేన పురుషేణవా. 46

మనఃప్రశమనోద్భూతం తత్ప్రాప్యం పరమం సుఖమ్
వికాసిశమపుష్పస్య వివేకోచ్చతరోః ఫలమ్. 47

శాంతియగు వికసిత పుష్పములతోగూడిన వివేకమను గొప్పవృక్షముయొక్క ఫలమును, మనశ్శాంతి జనితమునునగు ఆ పరమసుఖమును దేవదానవ మనుష్యాది జీవులకందఱికిని లభించును; దీనికి శరీర పరిశ్రమ అక్కరలేదు.

మనఃప్రశాంతమత్యచ్ఛం విశ్రాంతం విగతభ్రమమ్
అనీహం విగతాభీష్టం నాభివాంఛతి నోజ్ఝతి. 48

వ్యవహారపరేణాపి కార్యవృందమవిందతా
భానునేవాంబరస్థేన నోజ్ఝతే నచ వాంఛ్యతే. 49

ఈ ముక్తిసుఖమునందినవాని మనస్సు ప్రశాంతము, నిర్మలము, విగతభ్రమము, యత్నశూన్యము, వాంఛాశూన్యమును అగును. అందువలన వత డేదానిని గోరడు, లేక పరిత్యజింపడు.

మఱియు, కర్మల నాచరించినను వాటి ఫలములను బొందడు. ఆకాశమునందలి సూర్యునివలె ఎద్దానిని గోరడు, త్యజింపడు.

మోక్షద్వారే ద్వారపాలానిమాన్ శృణు యథాక్రమమ్
యేషామేకతమాసక్త్యా మోక్షద్వారం ప్రవిశ్యతే. 50

నేను మోక్షద్వార ద్వారపాలకులను గుఱించి, క్రమముగ చెప్పుచున్నాను, వినుము. దీనిలో నేయొక్కదాని నాశ్రయించినను మోక్షద్వారమును బ్రవేశింపవచ్చును.

సుఖదోషదశాదీర్ఘా సంసారమరుమండలీ
జంతోః శీతలతామేతి శీతరశ్మేః సమప్రభా. 51

సుఖాశయను దాహదోషముతో దీర్ఘమై దాటరానిదై యున్న ఈ సంసారము, మరుభూమి చంద్రకిరణముల జల్లపడునట్లు శమమువలన జల్లపడును.

శమేనాసాద్యతే శ్రేయః శమోహి పరమంపదమ్
శమః శివః శమః శాంతిః శమో భ్రాంతినివారణమ్. 52

శమమువలన శ్రేయస్సు లభించును; శమమే ముక్తి, శమమే శుభము, శాంతి. ఇదియే భ్రాంతినివారకము గూడనై యున్నది.

పుంసః ప్రశమతృప్తస్య శీతలాచ్ఛతరాత్మనః
శమభూషితచిత్తస్య శత్రురప్యేతి మిత్రతామ్. 53

శమాలంకృత చిత్తుడును, తృప్తుడును, శాంతుడును నిర్మలుడును నగును. శత్రువులుగూడ ఇట్టివానికి మిత్రులగుదురు.

శమచంద్రమసా యేషామాశయః సమలంకృతః
క్షీరోదానామివోదేతి తేషాం పరమశుద్ధతా. 54

శమమను చంద్రునివలన నలంకరింపఁబడిన చిత్తముగలవారు, క్షీరసముద్రమున స్నానమొనర్చిన వారివలె పవిత్రులగుదురు.

హృత్కుశేశయకోశేషు యేషాం శమకుశేశయమ్
సతాం వికసితం తేహి ద్విహృత్పద్మాః సమా హరేః. 55

ఎవరి హృదయ పద్మకోశమున శమమను పద్మము వికసించినదో, అట్టి పద్మద్వయశోభితులు విష్ణువువలె శోభిల్లుదురు.

శమశ్రీః శోభతే యేషాం ముఖేందావకలంకితే
తే కులీనేందవో వంద్యాః సౌందర్యవిజితేందవః. 56

ఎవరి అకళంకిత ముఖచంద్రునియందు శమసంపద శోభిల్లుచుండునో, ఆ కులశేఖరులు వంద్యులు. వారి సౌందర్యము చంద్రునిగూడ మించును.



త్రైలోక్యోదరవర్తిన్యో నానందాయ తథాశ్రియః
సామ్రాజ్యసంపత్ప్రతిమా యథా శమవిభూతయః. 57

రాజ్యసంపదలతో సమానములగు శమైశ్వర్యములిచ్చు ఆనందమును ముల్లోకములనున్న సంపదలుగూడ ఒసగజాలవు.

యాని దుఃఖాని యా తృష్ణా దుస్సహా యే దురాధయః
తత్సర్వం శాంతచేతఃసు తమోఽర్కేష్వివ నశ్యతి. 58

దుఃఖములు, తృష్ణలు, దుస్సహములగు మనోవ్యాధులు — ఇవన్నియు శాంతచిత్తుని గనమ్మన, సూర్యోదయమున తమస్సువలె, నశించును.

మనోహి సర్వభూతానాం ప్రసాదమధిగచ్ఛతి
న తథేందోర్యథా శాంతే జనే జనితకౌతుకమ్. 59

అందఱి మనస్సులును విషయములకు సంబంధించిన ఆనందమునందునుగాని, శాంతచిత్తుడు అనుభవించు ఆనందమునకును దీనికిని ఆకాశపాతాళముల భేదమున్నది. ఈ ఆనందమునందు చంద్రుని చల్లదనముకూడ నిలబడజాలదు.

శమశాలిని సౌహార్దవతి సర్వేషు జంతుషు
సుజనే పరమం తత్త్వం స్వయమేవ ప్రసీదతి. 60

శమయుతుడును, సర్వజీవులయెడ స్నేహబుద్ధిగలవాడునునగు సజ్జనునియందు పరతత్త్వము దానియంతట అదే ప్రతిఫలించును.

మాతరీవ పరం యాంతి విషమాణి మృదూనిచ
విశ్వాసమిహ భూతాని సర్వాణి శమశాలిని. 61

కఠినులును, దయార్ద్రులునునగు జీవులందరు, శమసంపన్నుని తల్లినివలె లెస్సగ విశ్వసింతురు.

న రసాయనపానేన న లక్ష్మ్యాలింగనేనచ
తథా సుఖమవాప్నోతి శమేనాంతర్యథా మనః. 62

శమవలన లభించు సుఖముబోలు సుఖము, ఇంద్రపదవియందుగాని, విష్ణుపదవియందుగాని, లభింపదు.

సర్వాధివ్యాధిచలితం క్రాంతం తృష్ణావరత్రయా
మనః శమామృతాసేకైః సమాశ్వాసయ రాఘవ. 63

రాఘవా! పలువిధములగు ఆధివ్యాధులవలన కలచబడినదియు, తృష్ణయను చర్మపాశముచే లాగబడునదియునగు మనస్సును శాంత్యమృతసేచనమున నెమ్మదిపఱచుము.

యత్కరోషి యదశ్నాసి శమశీతలయా ధియా
తత్రాతిస్వదతే స్వాదు నేతరత్ తాత మానసే. 64

వత్సా! శమవలన చల్లపడిన బుద్ధితో ఆచరించునది, గ్రహించునది, మధురముగనుండును; తదితరములిట్లుండవు.

శమామృతరసాచ్ఛన్నం మనో యామేతి నిర్వృతిమ్
ఛిన్నాన్యపితయాంగాని మన్యే రోహంతి రాఘవ. 65

రాఘవా! మనస్సు శాంత్యమృతరసముచే గప్పబడి ఏ యానందమునందునో, ఆ ఆనందము యొక్క అంశలు తునిగిపోయినను మరలచిగుర్చునని నేను తలంతును (శాంత్యానందము తఱుగు లేనిది, శాశ్వతమైనది — అని అభిప్రాయము)

న పిశాచా న రక్షాంసి న దైత్యా నచ శత్రవః
నచ వ్యాఘ్రభుజంగావా ద్విషంతి శమశాలినమ్. 66

శమశాలియగు పురుషుని పిశాచములు, రాక్షసులు, దైత్యులు, విరోధులు పాములు, పులులుగూడ ద్వేషింపవు.

సుసన్నద్ధసమస్తాంగం ప్రశమామృతవర్మణా
వేదయంతి నదుఃఖాని శరా వజ్రశిలామివ. 67

బాణము వజ్రమును భేదింపజాలనట్లు, శాంతిసుధయను కవచమున ఎవరి అంగములన్నియు కప్పబడియున్నవో, వారిని దుఃఖములు పీడింపజాలవు.

నతథా శోభతే రాజా అప్యంతఃపురసంస్థితః
సమయా స్వచ్ఛయా బుద్ధ్యా యథోపశమశీలయా. 68

సమమును, స్వచ్ఛమును, ఉపశమితమునునగు బుద్ధివలన పురుషుఁడు శోభిల్లునట్లు. అంతఃపురమునందలి రాజుగూడ శోభిల్లడు.

ప్రాణాత్ ప్రియతరం దృష్ట్వా తుష్టిమేతి నవై జనః
యామాయాతి జనః శాంతిమవలోక్య శమాశయమ్. 69

ప్రాణాధికుడగు స్నేహితుని గాంచిన గలుగు శాంత్యానందములకంటె అధికమగు శాంత్యానందమును, శమయుతుడగు జనుని గాంచి నరులు పొందెదరు.

సమయా శమశాలిన్యా వృత్త్యా యః సాధు వర్తతే
అభినందితయా లోకే జీవతీహ స నేతరః. 70

ఏవ్యక్తి, సమమును, శమయుతమును, లోక ప్రశంసితమునునగు ఆచరణతో సాధుభావమున మెలగునో, అతని జీవితమే సఫలము; ఇతరుల జీవితము వ్యర్థము.

అనుద్ధతమనాః శాంతః సాధుః కర్మ కరోతి యత్
తత్సర్వమభినందంతి తస్యేమా భూతజాతయః. 71

నిగర్వియు, శాంతుడునునగు వాడాచరించు కర్మలన్నిటిని, జీవులందరు పొగడుదురు.



శ్రుత్వా స్పృష్ట్వాచ దృష్ట్వాచ భుక్త్వా స్నాత్వా శుభాశుభమ్
న హృష్యతి గ్లాయతి యః స శాంత ఇతి కథ్యతే. 72

ఏ వ్యక్తి, శుభాశుభ దర్శన, స్పర్శన, శ్రవణ, స్నానముల నొనర్చియు హర్ష విషాదముల నందకుండునో, అతడే శాంతుడని చెప్పబడుచున్నాడు.

యః సమః సర్వభూతేషు భావికాంక్షతి నోజ్ఝతి
జిత్వేంద్రియాణి యత్నేన స శాంత ఇతి కథ్యతే. 73

సర్వభూతములను సమముగ గాంచువాడును, యత్నముతో నింద్రియముల జయించినవాడును, భావిసుఖముల గోరనివాడును, ప్రాప్తవిషయముల బరిత్యజింపనివాడును, శాంతుడనంబడుచున్నాడు.

స్పృష్ట్వావదాతయా బుద్ధ్యా యథైవాంత స్తథా బహిః
దృశ్యంతే యత్ర కార్యాణి స శాంత ఇతి కథ్యతే. 74

పరుల కౌటిల్యాది దుర్గుణముల నెఱింగియు, బహిరంతరముల శుద్ధుడై, మోక్షము నిమిత్తమై కర్మల నాచరించువాడు శాంతుడనంబడు చున్నాడు.

స్థితోఽపి నస్థిత ఇవ నహృష్యతి నకుప్యతి
యః సుషుప్తసమః స్వస్థః స శాంత ఇతి కథ్యతే. 75

నిద్రించువానివలె స్వస్థుడయ్యు స్వస్థుడు కానివాడును, హర్షక్రోధ శూన్యుడునునగు వాడు శాంతు డనంబడుచున్నాడు.

తుషారకరబింబాభం మనో యస్య నిరాకులమ్
మరణోత్సవయుద్ధేషు స శాంత ఇతి కథ్యతే. 76

మరణోత్సవ యుద్ధ సమయములగూడ నెవనిమనస్సు భయరాగక్రోధముల తల్లడిల్లక, చంద్ర బింబమువలె నిర్మలముగనుండునో. అతడే శాంతుడని చెప్పబడుచున్నాడు.

అమృతస్యందసుభగా యస్య సర్వజనంప్రతి
దృష్టిః ప్రసరతి ప్రీతా స శాంత ఇతి కథ్యతే. 77

అమృత ప్రవాహమువలె ఎవ్వనిదృష్టి సకలజీవులయెడ సమానప్రీతితో ప్రసరిత మగునో, అతడే శాంతుడని చెప్పఁబడుచున్నాడు.

యోఽంతఃశీతలతాం యాతో యో భావేషు న మజ్జతి
వ్యవహారీ న సంమూఢః స శాంత ఇతి కథ్యతే. 78

శీతలాంతః కరణుడును, విషయముల జరించినను మూఢునివలె నసంగుడును నగువాడు శాంతుడని చెప్పఁబడుచున్నాడు.

అప్యాపత్సు దురంతాసు కల్పాంతేషు మహత్స్వపి
తుచ్ఛేఽహం న మనో యస్య స శాంత ఇతి కథ్యతే. 79

కలకాలముండునట్టి ఆపదలందేనగాని, లేక ప్రత్యేక సమయమునగాని, నశ్వరదేహమున నభిమానము వహింపనివానిని శాంతు డందురు.

ఆకాశసదృశీ యస్య పుంసః సంవ్యవహారిణః
కలంకమేతి న మతిః స శాంత ఇతి కథ్యతే. 80

సంసారవిషయముల చరించుచున్నను ఎవనిమనస్సు, రాగాది వికారములవలన మలినమవక, ఆకాశమువలె స్వచ్ఛమై యుండునో, అతడు శాంతుడనంబడుచున్నాడు.

తపస్విషు బహుజ్ఞేషు యాజకేషు నృపేషుచ
బలవత్సు గుణాఢ్యేషు శమవానేవ రాజతే. 81

తపస్వి, బహుదర్శి, యాజకుడు, రాజు, బలవంతుడు, గుణవంతుడు — వీరందరిలో శాంతుడే శోభిల్లును.

శమసంసక్తమనసాం మహాత్మాం గుణశాలినామ్
ఉదేతి నిర్వృతిశ్చిత్తాజ్జ్యోత్స్నేవ సితరోచిషః. 82

చంద్రునినుండి వెన్నెల వెలువడునట్లు, శమాదియుక్తుడును, గుణవంతుడునునగు మహద్వ్యక్తినుండి పరమానందము వెలువడుచుండును.

సీమంతో గుణపూగానాం పౌరుషైకాంతభూషణమ్
సంకటేషు భయస్థానే శమః శ్రీమాన్ విరాజతే. 83

సుగుణముల కెల్లయగు పౌరుషమునకు ప్రధానాలంకారమగు శాంతియే సంకటసమయములందునను, భయస్థానములను వెలయుచుండును.

శమమమృత మహార్యమార్యగుప్తమ్
పరమవలంబ్య పరంపదం ప్రయాతాః
రఘుతనయ యథా మహానుభావాః
క్రమమనుపాలయ సిద్ధయే తమేవ. 84

ఇతి శ్రీ వాసిష్ఠ—మహారామాయణే ముముక్షువ్యవహారప్రకరణే
శమనిరూపణంనామ త్రయోదశః సర్గః ॥ 13 ॥

రామా ! ఈ శమామృతమును ఇతరులు పొందజాలరు, దీనిని ఆర్యులు రహస్యముగ [illegible] నవలంబించి వారు పరమపదము ననగా మోక్షము నందినట్లే, నీవుగూడ దీని [illegible]ందుము.

ఇది శ్రీ వాసిష్ఠ—తాత్పర్య ప్రకాశికయందు, ముముక్షువ్యవహార ప్రకరణమున శమనిరూపణమను త్రయోదశసర్గము ॥ 13 ॥



## చతుర్దశః సర్గః.

శ్రీ వసిష్ఠ ఉవాచః—

శాస్త్రావబోధామలయా ధియా పరమపూతయా
కర్తవ్యః కారణజ్ఞేన విచారోఽనిశమాత్మనః. 1

వసిష్ఠుడు:—కారణజ్ఞుడగు వ్యక్తి, శాస్త్రజ్ఞానము ననుసరించిన నిర్మల పవిత్రబుద్ధిలో, నిరంతర మాత్మవిచార మొనర్చుచుండవలెను.

విచారాత్ తీక్ష్ణతామేత్య ధీః పశ్యతి పరంపదమ్
దీర్ఘసంసారరోగస్య విచారోహి మహౌషధమ్. 2

బుద్ధి ఇట్టి విచారమువలననే నిశితమై, పరమపదమును గాంచును. దీర్ఘసంసారమను ఈ రోగమునకు విచారమే మహౌషధము.

ఆపద్వనమనంతేహా పరిపల్లవితాకృతి
విచారక్రకచచ్ఛిన్నం నైవ భూయః ప్రరోహతి. 3

కొండతెరపిలేని రాగాదిప్రవృత్తులను చివుళ్లతో వెలయు ఈ ఆపదల అడవిని విచారమను శస్త్రముతో ఛిన్న మొనర్చిన మరల చివుర్పదు.

మోహేన బంధునాశేషు సంకటేషు శమేషుచ
సర్వం వ్యాప్తం మహాప్రాజ్ఞ విచారోహి సతాం గతిః. 4

మహాప్రాజ్ఞా! బంధువులమృతి — ఇత్యాదులగు కష్టసమయముల మోహము దాపరించుచుండును. ఇట్టితావుల సాధుపురుషులకు విచారమేగతి.

న విచారం వినా కశ్చిదుపాయోఽస్తి విపశ్చితామ్.
విచారాదశుభం త్యక్త్వా శుభమాయాతి ధీః సతామ్. 5

పండితులకు విచారముగాక మరొక ఉపాయములేదు. సత్పురుషులబుద్ధి విచారబలముననే, అశుభమును బరిత్యజించి శుభము నాశ్రయించుచుండును.

బలం బుద్ధిశ్చ తేజశ్చ ప్రతిపత్తిః క్రియాఫలమ్
ఫలంత్యేతాని సర్వాణి విచారేణైవ ధీమతామ్. 6

విచారమువలననే బుద్ధిమంతులకు బలము, బుద్ధి, తేజము, సమయోచితమగు స్ఫురణ, క్రియానుష్ఠానము; తత్ఫలము లభించుచుండును.

యుక్తాయుక్తమహాదీప మభివాంఛితసాధకమ్
స్ఫారం విచారమాశ్రిత్య సంసారజలధిం తరేత్. 7

ఉచితానుచితముల ప్రకాశింపజేయు దీపమును, అభీష్టసాధకమును, గొప్పదియునగు విచారము నాశ్రయించిన సంసారసముద్రమును దాటగలము.

అలూన హృదయాంభోజాన్ మహామోహమతంగజాన్
విదారయతి శుద్ధాత్మా విచారో నామ కేసరీ. 8

పవిత్ర విచారమను సింహము, జనుల హృదయములనున్న, వివేకమను పద్మముల పాడు చేయు మహామోహమను ఏనుగను, చీల్చివేయును.

మూఢాః కాలవశేనేహ యద్గతాః పరమం పదమ్
తద్విచార ప్రదీపస్య విజృంభిత మనుత్తమమ్. 9

మూఢులు సంసారసముద్రమును దాటుటనుపాయమును గనుగొనజాలక తుదకనేక జన్మలు గడచినపిమ్మట ముక్తినందుచున్నారు. దీనికిగూడ కారణము విచారమే.

రాజ్యాని సంపదః స్ఫారా భోగా మోక్షశ్చ శాశ్వతః
విచారకల్పవృక్షస్య ఫలాన్యేతాని రాఘవ. 10

రాఘవా! రాజ్యములు, సంపదలు, భోగములు, శాశ్వతమగు మోక్షము — ఇవన్నియు విచారమను కల్పవృక్షముయొక్క ఫలములే.

యా వివేకవికాసిన్యో మతయో మహతామిహ
నతా విపది మజ్జంతి తుంబకానీవ వారిణి. 11

ఎండిన సొరకాయబుఱ్ఱలు, నీటిలో మునగనట్లు, వివేకమువలన వికసితమైన మహాత్ముల బుద్ధిగూడ ఆపదల మునుగదు.

విచారోదయకారిణ్యా ధియా వ్యవహరంతి యే
ఫలానామత్యుదారాణాం భాజనంహి భవంతి తే. 12

విచారబుద్ధితో వ్యవహరించువారు శ్రేష్ఠఫలముల నందుదురు. (విచారమువలన వివేకము దయించు, ముక్తిలభించునని అభిప్రాయము.)

మూర్ఖహృత్కాననస్థానా మాశాప్రథమరోధినాం
అవిచారకరంజానాం మంజర్యో దుఃఖరీతయః. 13

గచ్ఛతీగెలు నలువైపుల అలముకొని దారిని కప్పువడజేయునట్లు, దుఃఖవ్యవహారములు మూర్ఖులహృదయములను అడవుల వ్యాపించి ముముక్షుత్వమును నశింపజేయును.

కజ్జలక్షోదమలినా మదిరామదధర్మిణీ
అవిచారమయీ నిద్రా యాతు తే రాఘవ క్షయమ్. 14

...! కాటుకవలె మలినమును, కల్లువోలె మత్తుగొల్పునదియు, విచారరహితమునునగు ... మోహ... ను గాక!

మహాపదతిదీర్ఘేషు సద్విచారపరో నరః
న నిమజ్జతి మోహేషు తేజోరాశి స్తమస్స్వివ. 15

తేజోరాశియగు సూర్యుడు చీకటియందు మునుగనట్లు; సద్విచారతత్పరుడగు మనుజుడు విషయములను ఆపదల ... దీర్ఘమోహముల నిమగ్నుడవడు.



మానసే సరసి స్వచ్ఛే విచారకమలోత్కరః
నూనంవికసితో యస్య హిమవానివ భాతి సః. 16

ఎవ్వని మనస్సు అను సరోవరమున విచారమను పద్మములు వికసించినవో, అతడు హిమాలయమువలె శోభిల్లుచుండును.

విచారవికలా యస్య మతి ర్మాంద్యముపేయుషః
కస్యోదేత్యశనిశ్చంద్రాన్ముగ్ధా యక్షః శిశోరివ. 17

ఏ మూఢునిబుద్ధి విచారవిహీనమై యుండునో, అతనికడ బాలునిముందు బేతాళావిర్భావమువలె మోహమువలన, చంద్రుని నుండియే పిడుగుపడును.

దుఃఖఖండక మస్థూలం విపన్నవలతామధుః
రామ దూరే పరిత్యాజ్యో నిర్వివేకో నరాధమః. 18

రామా! వివేకహీనుడు ఆపదలను కొంగ్రొత్తలిగకు వసంతఋతువు. మఱియు గొప్పవియగు దుఃఖబీజముల నుంచుపాత్ర. కావున ఇట్టివానిని దూరముగ త్యజించునది.

యే కేచన దురారంభా దురాచారా దురాధయః
అవిచారేణ తే భాంతి బేతాలా స్తమసా యథా. 19

చీకటియందు దయ్యములుపించునట్లు, చెడుపనులు, చెడ్డచేతలు, మానసికవ్యాధులు, విచారణలేకుండుటవలననే సంభవించుచున్నవి.

అవిచారిణమేకాంత వనద్రుమ సధర్మకం
అక్షమం సాధుకార్యేషు దూరేకురు రఘూద్వహ. 20

రఘూద్వహా! నిర్జనప్రదేశమునందున్న చెట్టువలె సత్కార్యముల కుపకరించని వివేకహీనుని పరిత్యజింపుము.

వివిక్తం హి మనో జంతో రాశావై వశ్యవర్జితమ్
పరాం నిర్వృతి మభ్యేతి పూర్ణచంద్ర ఇవాత్మని. 21

పూర్ణచంద్రునిగాంచి మనస్సు ఉల్లాసపడునట్లు; వాంఛాశూన్యమై విచారయుక్తమైన మనస్సు పరమానందము నందును.

వివేకితోదితా దేహే సర్వం శీతలయత్యలమ్
అలంకరోతి చాత్యంతం జ్యోత్స్నేవ భువనం యథా. 22

వెన్నెల భూమండలమును చల్లపరచుచు అలంకరించునట్లు, వివేకము అందరిని చల్లపరచి అలంకారమై వెలయుచున్నది.

పరమార్థపతాకాయా ధియో ధవలచామరమ్
విచారో రాజతే జంతో రజన్యామివ చంద్రమాః. 23

రాత్రియందు చంద్రుడు శోభిల్లునట్లు, పరమార్థపతాకయును, శుభబుద్ధినలంకరించు ధవళచామరమునునగు విచారము జీవునియందు శోభిల్లును.

విచారచారవో జీవా భాసయంతో దిశోదశ
భాంతి భాస్కరవన్నూనం భూయో భవభయాపహాః. 24

విచారసమర్థులును, భవభయనివారణ కారులునునగు జీవులు, సూర్యునివలె, దశదిశల వెలిగించుచు శోభిల్లుదురు.

బాలస్య స్వమనోమోహాకల్పితః ప్రాణహారకః
రాత్రౌ నభసి వేతాలో విచారేణ విలీయతే. 25

రాత్రి ఆకాశమున బాలునివలన గల్పింపఁబడిన భూతము వాని ప్రాణములఁగూడ గైకొనఁగలుగుచున్నది. కాని, విచారమువలన ఆ భూతము మాయమైపోవుచున్నది. కనుక విచారమే సంసారభయమును నివారింపగలదు.

సర్వ ఏవ జగద్భావా అవిచారేణ చారవః
అవిద్యమానసద్భావా విచారవిశరారవః. 26

ఈ జగత్తునను న్న పదార్థములన్నియు విచారించిచూడ నంతవఱకు, మనోహరములై కన్పట్టును. విచారించిచూచిన శిలాస్ఫాలితలోష్టములవలె అసారములై కన్పట్టును.

పుంసో నిజమనోమోహాకల్పితోఽనల్పదుఃఖదః
సంసారచిర వేతాలో విచారేణ విలీయతే. 27

సంసారమను ఈ భూతము మనుజుని మనోమోహమువలన కల్పింపఁబడి, మిక్కుటమగు దుఃఖమును గలిగించుచున్నది; ఈ భూతము విచారమువలన లయమైపోవును.

సమం సుఖం నిరాబాధమనంతమనపాశ్రయమ్
విద్ధీమం కేవలీభావం విచారోచ్చతరోః ఫలమ్. 28

వైషమ్యశూన్యమును, సుఖప్రదమును, బాధారహితమును, అనంతమునునగు ఈ కైవల్యము విచారమను మహావృక్షముయొక్క ఫలమని యెఱుంగునది.

అచలస్థితితోదారా ప్రకటా భోగతేజసా
తేన నిష్కామతోదేతి శీతతేవేందునోదితా. 29

చంద్రోదయమైన చల్లదనము వచ్చునట్లు, విచారమువలన మోక్షోదయమైన, నిశ్చలమును, ఉదారమును, ఆనందరసస్వరూపమునునగు నిష్కామత కలుగును.

స్వవిచారమహౌషధ్యా సాధుశ్చిత్తనిషణ్ణయా
తయోత్తమత్వప్రదయా నాభివాంఛతి నోజ్ఝతి. 30

పురుషుడు తనచిత్తమందున్న శ్రేష్ఠత్వప్రదాయినియగు విచారమను ఔషధమువలన సిద్ధుడైన దేనిని గోఱడు, పరిత్యజింపడు.

తత్పదాలంబనం చేతః స్ఫారమాభాసమాగతమ్
నాస్తమేతి నచోదేతి ఖమివాతితతాంతరమ్. 31



చిత్తము బ్రహ్మభావము నాశ్రయించిన, వాసనలన్నియు నశించును; బ్రహ్మభావము విస్తరింప, ఆకాశమువలె ఉదయాస్తమయము లెవ్వియు లేకుండ నుండును.

నదదాతి నచాదత్త నచోన్నమతి శామ్యతి
కేవలం సాక్షివత్ పశ్యన్ జగదాభోగి తిష్ఠతి. 32

అప్పుడు పురుషుఁడు ఈ విశాలజగత్తును, కేవలము సాక్షివలె గనుచుండును; దేనిని గ్రహింపడు, భోగింపడు, శాంతుడై యుండును.

నచ శామ్యతి నాప్యంతర్నాపి బాహ్యేఽవతిష్ఠతి.
నచ నైష్కర్మ్యమాదత్తే నచ కర్మణి మజ్జతి. 33

అప్పుడాతడు లోపలగాని, వెలుపలగాని వసింపడు. ఏ విధమైన దుఃఖమును బొందడు. కర్మల నాచరింపడు, నైష్కర్మ్యసిద్ధికై యత్నింపడు.

ఉపేక్షతే గతం వస్తు సంప్రాప్త మనువర్తతే
నక్షుబ్ధో నచవాక్షుబ్ధో భాతిపూర్ణ ఇవార్ణవః. 34

పోయినదానిని గుఱించి చింతింపడు; వచ్చినదాని ననుసరించును. దుఃఖింపడు, సంతసింపడు. నిండు సముద్రునివలె పొంగు క్షోభ లేకుండ నుండును.

ఏవం పూర్ణేన మనసా మహాత్మానో మహాశయాః
జీవన్ముక్తా జగత్యస్మిన్ విహరంతీహ యోగినః. 35

ఇట్లు, మహాత్ములును, మహాశయులునునగు యోగులు నిండుమనంబున జీవన్ముక్తులై, ఈ జగత్తున సంచరించుచుందురు.

ఉషిత్వా సుచిరం కాలం ధీరాస్తే యావదీప్సితమ్
తే తమంతే పరిత్యజ్య యాంతి కేవలతాం తతామ్. 36

ధీరులగు ఈ జీవన్ముక్త పురుషులు ఇచ్ఛానుసారము చాలకాలము వసించి, పిదప ఉపాధిలేశమునుగూడ పరిత్యజించి అపరిచ్ఛిన్నమగు విదేహముక్తి నందుదురు.

కోఽహం కస్యచ సంసార ఇత్యాపద్యపి ధీమతా
చింతనీయం ప్రయత్నేన సప్రతీకారమాత్మనా. 37

బుద్ధిమంతుడగువాడు ఆపత్సమయములందు గూడ, 'నే నెవడను? ఈ సంసారమెవరిది?' అని చింతించుచు యత్నముతో ప్రతీకారమును సల్పవలెను.

కార్యసంకటసందేహం రాజా జానాతి రాఘవ
నిష్ఫలం సఫలంవాపి విచారేణైవ నాన్యథా. 38

రాఘవా! చక్రవర్తిగూడ కష్టకార్యముల యందలి సందేహమును దీర్చుకొనవలసి వచ్చినప్పుడు, 'ఇది సఫలమగునా? నిష్ఫలమగునా?' అని విచారించియే, తెలిసికొనును; వేరొండు ఉపాయమువలన గాదు.

వేదవేదాంతసిద్ధాంతస్థితయః స్థితికారణమ్
నిర్ణీయంతే విచారేణ దీపేనచ భువో నిశి. 39

రాత్రివేళ దీపసహాయ్యమున నేలను గాంచగల్గునట్లు, విచారమువలననే పురుషుడు, కర్మకాండ జ్ఞానకాండలయందు నిర్ణయింపబడిన ధర్మ (కర్మ,) బ్రహ్మ, తత్త్వముల నరయగల్గును.

అనష్ట మంధకారేషు బహుతేజః స్వజిహ్మితమ్
పశ్యత్యపి వ్యవహితం విచారశ్చారులోచనం. 40

విచారమను సుందరనయనము చీకటియందు వినష్టమవదు; అమితతేజస్సునుగాంచి చెదరదు. దూరముననున్న విషయములఁగూడ గ్రహింపగలదు. సాధారణ నేత్రములకున్న లోపములు దీనికిలేవు.

వివేకాంధోహి జాత్యంధః శోచ్యః సర్వస్య దుర్మతిః
దివ్యచక్షుర్వివేకాత్మా జయత్యఖిలవస్తుషు. 41

వివేకాంధుడే, పుట్టుగ్రుడ్డి; అంధుఁడుకాదు; వీని స్థితి శోచనీయము, వివేకాత్ముడే అన్నింట జయమందును; ఆపదల నెగద్రోసి ముక్తినిఁ బడయును.

పరమాత్మమయీ మాన్యా మహానందైకసాధినీ
క్షణమేకం పరిత్యాజ్యా న విచారచమత్కృతిః. 42

విచారము సుందరమగు వస్తువు; పరమాత్మయను మహదానందము దీనివలననే సాధింపఁబడును. అందువలన, దీనిని గౌరవింపనగును; ఒక్క నిముసమైన వీడకూడదు.

విచారచారుపురుషో మహతామపి రోచతే
పరిపక్వచమత్కారం సహకారఫలం యథా. 43

విచారనిపుణుడగు మానవుడు, మామిడిపండువలె జ్ఞానులకుగూడ రుచ్యమై వెలయును.

విచారకాంతమతయో నానేకేషు పునః పునః
లుఠంతి దుఃఖశ్వభ్రేషు జ్ఞాతాధ్వగతయో నరాః. 44

వివేకము నాశ్రయించి దారినెరింగినవారు దుఃఖములను గుంటలలో మాటిమాటికి గూలరు.

నచ శౌతి తథారోగీ నానర్థశతజర్జరః
అవిచారవినష్టాత్మా యథాఽజ్ఞః పరిరోదితి. 45

విచారహీనుడగుట వలన, ఆత్మఘాతియగు మూర్ఖుడు జన్మజన్మాంతరముల ననుభవించు బాధ, విష శస్త్రిఘాతమువలన శిథిలాంగుడైన రోగి పడు బాధకంటె; అధికము.

వరం కర్దమభేకత్వం మలకీటకతా వరం
వరమంధగుహాహిత్వం న నరస్యావిచారతా. 46

విచారహీనుడగు మనుజుడై జన్మించుటకంటె, బురదయందుండు కప్పగనో, మలకీటకమయ్యో, అంధకార గుహయందు పాముగనో, జన్మించుట మేలు.



సర్వానర్థనిజావాసం సర్వసాధుతిరస్కృతమ్
సర్వదాస్థిత్యసీమాంతమవిచారం పరిత్యజేత్. 47

సకలానర్థములకు నివాసభూమియు, సాధుపురుషులచే గర్హింపఁబడునదియు, దుఃఖముల తుదికానయునగు, విచారహీనతను పరిత్యజింపనగును.

నిత్యం విచారయుక్తేన భవితవ్యం మహాత్మనా
తథాంధకూపే పతతాం విచారోఽహ్యావలంబనమ్. 48

మహాత్ముడగువాడు నిరంతరము విచారము నాశ్రయించుకొని యుండవలెను. రాగద్వేషాది రూపకమైన అంధకూపమునఁబడినవానికి ఈ విచారణయే గతి.

స్వయమేవాత్మనాత్మాన మవష్టభ్య విచారతః
సంసారమోహజలధేస్తారయేత్ స్వమనోమృగమ్. 49

విచారబలమునంజేసి, ఆత్మను స్థిరమొనరించి మనస్సనులేడిని, సంసారమను మోహసముద్రమును, దాటింపనగును.

కోఽహం కథమయం దోషః సంసారాఖ్య ఉపాగతః
న్యాయేనేతి పరామర్శో విచార ఇతి కథ్యతే. 50

"నేనెవ్వడను ? ఈ సంసారదోష మెట్లు వచ్చినది?" అని శ్రుతి స్మృత్యాదుల ననుసరించి ఒనర్చు విమర్శనే విచారమందురు.

అంధాంధమోహసుఘనం చిరం దుఃఖాయ కేవలమ్
కృతం శిలాయా హృదయం దుర్మతేశ్చావిచారిణః. 51

విచార విహీనుడగు దుర్మతిహృదయము రాతివంటిది; గ్రుడ్డికంటె గ్రుడ్డిది. మోహమువలన మఱింత కట్టిబడి దుఃఖములనే కూర్చుచుండును.

భావాభావగ్రహోత్సర్గ దృశామిహ హి రాఘవ
న విచారాదృతే తత్త్వం జ్ఞాయతే సాధు కించన. 52

రాఘవా! సత్యమును గ్రహించి అసత్యవిషయముల బరిత్యజింపగోరు వారుగూడ, తత్త్వమును పరిపూర్ణముగ నెఱుంగుటకుగాను, విచారము నాశ్రయించుచున్నారు: వేరొండు ఉపాయము లేదు.

విచారాజ్జాయతే తత్త్వం తత్త్వాద్విశ్రాంతిరాత్మని
అతో మనసి శాంతత్వం సర్వదుఃఖపరిక్షయః. 53

విచారమునుండి తత్త్వజ్ఞానము లభించును. తత్త్వజ్ఞానమునుండి ఆత్మవిశ్రాంతియు, దీనినుండి మనశ్శాంతియు లభించుచున్నవి. ఈ శాంతివలననే దుఃఖములన్నియు నశించును.

సఫలతాం ఫలతే భువి కర్మణాం
ప్రకటతాం కిల గచ్ఛతి ఉత్తమామ్
స్ఫుటవిచారదృశైవ విచారితా
శమవతే భవతే చ విరోచతామ్. 54

ఇతి శ్రీ వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే ముముక్షు వ్యవహార ప్రకరణే
విచారనిరూపణం నామ చతుర్దశః సర్గః ॥ 14 ॥

జనులందరు విచారదృష్టివలననే లౌకిక వైదికకర్మల ఫలములంబడయు చున్నారు. అందు వలన నో రాఘవా ! శమయుతుడవగు నీకుగూడ ఈ విచారము ప్రీతికరమగు గాక !

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు ముముక్షువ్యవహార ప్రకరణమున
విచారనిరూపణమను చతుర్దశ సర్గము ॥ 14 ॥

---

## పంచదశః సర్గః.

---

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

సంతోషో హి పరం శ్రేయః సంతోషః సుఖముచ్యతే
సంతుష్టః పరమభ్యేతి విశ్రామమరిసూదన. 1

వసిష్ఠుడు:— సంతోషమే పరమశ్రేయస్సు; సంతోషమే సుఖము, సంతుష్టుడగువాడే పరమ విశ్రాంతిని అనగా, మోక్షమును బడయును.

సంతోషైశ్వర్యసుఖినాం చిరవిశ్రాంతచేతసామ్
సామ్రాజ్యమపి శాంతానాం జరత్తృణలవాయతే. 2

సంతోషమను ఐశ్వర్య సుఖమునందిన వారిచిత్తము చిరవిశ్రాంతి నందినది. ఇట్టిశాంతవ్యక్తులకు రాజ్యములుగూడ ఎండు గడ్డిపరకవలె తుచ్ఛములగు చున్నవి.

సంతోషశాలినీ బుద్ధీ రామ సంసారవృత్తిషు
విషమాస్వప్యనుద్విగ్నా నకదాచన హీయతే. 3

రామా ! సంతోషయుతమగు బుద్ధి సంసార దుఃఖములు సంభవించిన తల్లడిల్లదు; సుఖములు సంభవించిన తబ్బిబ్బవదు.

సంతోషామృతపానేన యే శాంతాస్తృప్తిమాగతాః
భోగశ్రీరతులా తేషామేషా ప్రతివిషాయతే. 4

సంతోషామృతము ద్రావి తృప్తులైన శాంతులకు, భోగసంపదలు విషమట్లు ప్రతికూలములగు చున్నవి.



నతథా సుఖయంత్యేతాః పీయూషరసవీచయః
యథాతిమధురాస్వాదః సంతోషో దోషనాశనః. 5

ఆశాదైన్యాది దోషముల నశింపజేయగల మధుర సంతోషరసము గూర్చు ఆనందమును, అమృతరస — తరంగములుగూడ గూర్పజాలవు.

అప్రాప్తవాంఛాముత్సృజ్య సంప్రాప్తే సమతాం గతః
అదృష్టఖేదాఖేదో యః స సంతుష్ట ఇహోచ్యతే. 6

అప్రాప్తవిషయములను గోరక, పొందినవానిని గూర్చి తబ్బిబ్బవక, సుఖదుఃఖముల ననుభవింపకుండనుండువాడే సంతుష్టుడనంబడుచున్నాడు.

ఆత్మనాత్మని సంతోషం యావద్యాతి న మానసమ్
ఉద్భవంత్యాపదస్తావల్లతా ఇవ మనోబిలాత్. 7

మనస్సు విషయాంతరమును గోరక, దానియందదియే ఆనందము నందనంతవఱకు, ఈ మనోబిలమునుండి ఆపదలను లతలు పుట్టుచుండును.

సంతోషశీతలం చేతః శుద్ధవిజ్ఞానదృష్టిభిః
భృశం వికాసమాయాతి సూర్యాంశుభిరివాంబుజమ్. 8

సంతోషమువలన చల్లబడిన చిత్తము, సూర్యకిరణముల పద్మము వికసించునట్లు, విశుద్ధవిజ్ఞానమున, మిక్కుటముగ వికసించును.

అజ్ఞానఘనయామిన్యా సంకోచం న నరాంబుజమ్
యాత్యసావుదితో యస్య నిత్యం సంతోషభాస్కరః. 9

సంతోషమను సూర్యుడు ప్రకాశించుచున్న, మనుజులను పద్మములు, అజ్ఞానమను చీకటి రాత్రుల ముకుళింపవు.

ఆశావైవశ్యవివశే చిత్తే సంతోషవర్జితే
మ్లానే వక్త్రమివాదర్శే న జ్ఞానం ప్రతిబింబతి. 10

ఆశావివశమును, సంతోషరహితమునునగు చిత్తమున, మలినదర్పణమున ముఖము ప్రతిబింబించనట్లు, జ్ఞానము ప్రతిబింబించదు.

అకించనోఽప్యసౌ జంతుః సామ్రాజ్యసుఖమశ్నుతే
ఆధివ్యాధివినిర్ముక్తం సంతుష్టం యస్య మానసమ్. 11

సంతుష్టమనస్కునకు మనోవ్యాధులుగాని, వ్యాధులుగాని కలుగవు, ఇట్టివాడు నిరుపేదయైనను సామ్రాజ్యసుఖము ననుభవించును.

నాభివాంఛత్యసంప్రాప్తం ప్రాప్తం భుంక్తే యథాక్రమమ్
యః సుసౌమ్యసమాచారః సంతుష్ట ఇతి కథ్యతే. 12

అప్రాప్తవిషయములఁ గోరనివాడును, యథాక్రమముగ వచ్చిన సుఖదుఃఖముల ననుభవించువాడును, సౌమ్యాచరణయుతుడగువాడును నగు మనుజుడు సంతుష్టుడనంబడును.

సంతుష్టిపరితృప్తస్య మహతః పూర్ణచేతసః
క్షీరాబ్ధేరివ శుద్ధస్య ముఖే లక్ష్మీర్విరాజతే. 13

సంతోషమువలన పరిపూర్ణముగ తృప్తినందిన విశుద్ధచిత్తముగల మహాత్ముని వదనమున, క్షీరసముద్రమువలె, లక్ష్మీవసించును. (అనగా, ఇట్టి పురుషుని మోముప్రసన్నమై యుండునని భావము.)

పూర్ణతామలమాశ్రిత్య స్వాత్మన్యేవాత్మనా స్వయమ్
పౌరుషేణ ప్రయత్నేన తృష్ణాం సర్వత్ర వర్జయేత్. 14

నిరతిశయమును, ఆనందరూపమునునగు పూర్ణత్వము నవలంబించి, పౌరుషబలమున తృష్ణను సర్వత్ర వర్జింపవలెను.

సంతోషామృతపూర్ణస్య శాంతశీతలయా ధియా
స్వయం స్థైర్యం మనో యాతి శీతాంశోరివ శాశ్వతమ్. 15

చంద్రునివలె, సంతోషామృతమున నిండుకొనియున్న వానిచిత్తము, దానియంతటనదే, శాంతశీతలమగు బుద్ధివలన, స్థైర్యమునందును.

సంతోషపుష్టమనసం భృత్యా ఇవ మహర్ధయః
రాజానముపతిష్ఠంతి కింకరత్వముపాగతాః. 16

రాజును సేవకులనుసరించువట్లు, సంతోషపరిపుష్టచిత్తుని, సంపదలన్నియు భృత్యునివలె ననుసరించును.

ఆత్మనైవాత్మని స్వస్థే సంతుష్టే పురుషే స్థితే
ప్రశామ్యంత్యాధయః సర్వే ప్రావృషీవాశు పాంసవః. 17

వర్షాకాలమున దుమ్ము అణగిపోవునట్లు, తనయందుతానే సంతుష్టుడగు వ్యక్తియందు అధివ్యాధులన్నియు అణగిపోవును.

నిత్యం శీతలయా రామ కలంకపరిభిన్నయా
పురుషః శుద్ధయా వృత్త్యా భాతి పూర్ణతయేందువత్. 18

రామా! కళంకరహితమును, శీతలమును, విశుద్ధమునునగు చిత్తవృత్తివలన నలంకరింపబడిన పురుషుడు, పూర్ణచంద్రునివలె ప్రకాశించును.

సమతాసుందరం వక్త్రం పురుషస్యావలోకయన్
తోషమేతి యథా లోకో న తథా ధనసంచయైః. 19

సంతోషమువలన సమబుద్ధియైన పురుషుని సుందరవదనమును గాంచిన గలుగు ఆనందము, ధనరాసులను గాంచినను గలుగదు.



సమతయా మతయా గుణశాలినాం
పురుషరాడిహ యః సమలంకృతః
తమమలం ప్రణమన్తి నభశ్చరా
అపి మహామునయో రఘునందన. 20

ఇతి శ్రీ వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే ముముక్షువ్యవహార ప్రకరణే
సంతోష నిరూపణంనామ పంచదశః సర్గః ॥ 15 ॥

రఘునందనా! గుణశాలురు గోను సమబుద్ధివలన నలంకృతుడగు నిర్మలపురుషుని, దేవతలు మహామునులుకూడ నమస్కరింతురు.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు ముముక్షు వ్యవహార ప్రకరణమున
సంతోష నిరూపణమను పంచదశ సర్గము. ॥ 15 ॥



## షోడశః సర్గః.

---

శ్రీ వసిష్ఠ ఉవాచః—

విశేషేణ మహాబుద్ధే సంసారోత్తరణే నృణామ్
సర్వత్రోపకరోతీహ సాధుః సాధుసమాగమః. 1

వసిష్ఠుడు:— మహామతీ! సాధుసంగమముకూడ అన్ని వేళల నరులకు సంసారమునుదాటు మిక్కుటముగ తోడ్పడుచుండును.

సాధుసంగతరోర్జాతం వివేకకుసుమం సితం
రక్షంతి యే మహాత్మానో భాజనం తే ఫలశ్రియః. 2

ఏ మహాత్ములు, సాధుసంగమమను ఈ వృక్షమున వికసించిన వివేకమను పుష్పమును కాపాడుచుందురో, వారే మోక్షఫలమను సంపదను పొందుదురు.

శూన్యమాకీర్ణతామేతి మృతిరప్యుత్సవాయతే
ఆపత్సంపదివాభాతి విద్వజ్జనసమాగమే. 3

విద్వజ్జనుల సమాగమమువలన శూన్యప్రదేశము జనాకీర్ణమగును. మృత్యువు ఉత్సవమట్లు తోచును. ఆపదలు సంపదలగును.

హిమమాపత్సరోజిన్యా మోహనీహారమారుతః
జయత్యేకో జగత్యస్మిన్ సాధుః సాధుసమాగమః. 4

ఆపదలను పద్మములకు మంచును, మోహమను మంచునకు మారుతమును, జగత్తులన్నింటికంటె ప్రసిద్ధమునునగు సాధుసమాగమమునకు జయమగుగాక!

పరం వివర్ధనం బుద్ధేరజ్ఞానతరుశాతనమ్
సముత్సారణ మాధీనాం విద్ధి సాధుసమాగమమ్. 5

ఈ సాధుసంగమమువలన బుద్ధివర్ధిల్లును, అజ్ఞానమను చెట్టు ఛేదింపబడును. మనోవ్యాధులు నశించునని తెలియునది.

వివేకః పరమో దీపో జాయతే సాధుసంగమాత్
మనోహరోజ్జ్వలో నూనమాసేకాదివ గుచ్ఛకః. 6

తోటలో నీరుచల్లుటవలన పూలగుత్తులు పూచునట్లు, సాధుసంగమమువలన మనోహరోజ్జ్వల ప్రకాశయుతమగు వివేకము జన్మించును.

నిరపాయాం నిరాబాధాం నిర్వృతిం నిత్యపీవరమ్
అనుత్తమాం ప్రయచ్ఛంతి సాధుసంగవిభూతయః. 7

సాధుసంగమమను సంపదలు, అపాయరహితమును, బాధాహీనమును, నిత్యప్రవర్ధమానమునునగు ఆనందమును నిరంతర మొసగుచుండును.

అపి కష్టతరాం ప్రాప్తైర్దశాం వివశతాం గతైః
మనాగపి న సంత్యాజ్యా మానవైః సాధుసంగతిః. 8

మనుజుడు కష్టములలోబడి వివశతనందినను సాధుసంగమమును ఒక్కక్షణమైన విడువ గూడదు.

సాధుసంగతయో లోకే సన్మార్గస్య చ దీపికాః
హార్దాంధకారహారిణ్యో భాసో జ్ఞానవివస్వతః. 9

ఈ సాధుసంగమము, జగత్తున అజ్ఞానమను చీకటియుండు నంతదనుక అందఱికిని సదాచార దీపమై తోడ్పడి, హృదయాంధకారమును బాపుచుండును; పిదప, జ్ఞానసూర్యుని కిరణముగ మారును.

యః స్నాతః శీతసితయా సాధుసంగతి గంగయా
కిం తస్య దానైః కింతీర్థైః కింతపోభిః కిమధ్వరైః. 10

చిత్తశుద్ధి దాయకము (స్వచ్ఛము)ను, మనశ్శాంతిప్రదము (శీతలము)నునగు సాధుసంగమమను గంగయందు స్నానమొనర్చినవానికి యజ్ఞతపోదానతీర్థములతో బనియేమి?

నీరాగాశ్ఛిన్నసందేహా గలితగ్రంథయోఽనఘ
సాధవో యది విద్యంతే కిం తపస్తీర్థసంగ్రహైః. 11

అనఘా! రాగశూన్యులును, గ్రంథిహీనులును, సందేహరహితులునునగు సాధుపురుషులు వెలయుచో, తీర్థయాత్రలతోడను, తపస్సుతోడను; అవసరమేమి?



విశ్రాంతమనసో ధన్యాః ప్రయత్నేన పరేణ హి
దరిద్రేణేవ మణయః ప్రేక్షణీయా హి సాధవః. 12

దరిద్రుడు మణులను గాంచునట్లు పరమయత్నమున, శాంతచిత్తులును, ధన్యులునునగు సాధువులను జూడదగును.

సత్సమాగమసౌందర్యశాలినీ ధీమతాం మతిః
కమలేవాప్సరోవృందే సర్వదైవ విరాజతే. 13

విష్ణునితోగూడి లక్ష్మి అప్సరలలోనెల్ల శ్రేష్ఠురాలుగ శోభించునట్లు, మహాత్ములబుద్ధి సత్సంగమమువలన సౌందర్యవృద్ధినంది సర్వదా దీపిల్లును.

తేనామలవిచారస్య పదస్యాగ్రావచూలితా
ప్రథితా యేన ధన్యేన న త్యక్తా సాధుసంగతిః. 14

సాధుసంగమమును త్యజింపని ధన్యవ్యక్తి, నిర్మలవిచార లభ్యమగు బ్రహ్మపదమును శిరోభూషణ మొనర్చుకొని పేర్గాంచును.

విచ్ఛిన్నగ్రంథయస్తజ్జ్ఞాః సాధవః సర్వసంమతాః
సర్వోపాయేన సంసేవ్యాస్తే హ్యుపాయా భవాంబుధౌ. 15

బంధహీనులును, తత్త్వజ్ఞులును, సర్వసమ్మతులునునగు సాధుపురుషులను దానమానసేవనాది సర్వప్రయత్నముల సేవింపవలెను. ఏలయన, భవసముద్రమును దాటుటకు వీరే ఉపాయస్వరూపులు.

తపతే నరకాగ్నీనాం సంశుష్కేంధనతాం గతాః
యైర్దృష్టా హేలయా సంతో నరకానలవారిదాః. 16

నరకాగ్ని జ్వాలలనార్పు మేఘములగు సాధుపురుషులను అనాదరణతో గాంచువారు ఆ నరకాగ్నికి ఇంధనములగుదురు.

దారిద్ర్యం మరణం దుఃఖమిత్యాదివిషయో భ్రమః
సంప్రశామ్యత్యశేషేణ సాధుసంగమభేషజైః. 17

దారిద్ర్యము, మరణము, దుఃఖము మొదలుగాగల విషయరోగములన్నియు, సాధుసంగమమను ఔషధమువలన సంపూర్ణముగ శాంతిల్లును.

సంతోషః సాధుసంగశ్చ విచారోఽథ శమస్తథా
ఏత ఏవ భవాంభోధావుపాయాస్తరణే నృణామ్. 18

సంతోషము, సాధుసంగమము, విచారము, శమము – ఇవియే నరులకు సంసారసముద్రమును తరించుట కుపాయములు.

సంతోషః పరమో లాభః సత్సంగః పరమా గతిః
విచారః పరమం జ్ఞానం శమో హి పరమం సుఖమ్. 19

సంతోషమే పరమలాభము, సత్సంగమమే పరమగతి, విచారమే పరమజ్ఞానము, శమమే పరమ సుఖము.

చత్వార ఏతే విమలా ఉపాయా భవభేదనే
యైరభ్యస్తాస్త ఉత్తీర్ణా మోహవారిభవార్ణవాత్. 20

సంసారమును భేదింప ఎవరీ పవిత్రచతుర్విధోపాయముల నభ్యసించిరో వారే, ఈసంసారమును మోహజలసముద్రమును దాటుచున్నారు.

ఏకస్మిన్నేవవా తేషామభ్యస్తే విమలోదయే
చత్వారోఽపి కిలాభ్యస్తా భవంతి సుధియాంవర. 21

సుధీవరా! ఈ నాల్గింటిలో నేయొక్కదాని నభ్యసించినను, తక్కిన వాటి నభ్యసించినట్లగును.

ఏకోఽప్యేకోఽపి సర్వేషామేషాం ప్రసవభూరిహ
సర్వసంసిద్ధయే తస్మాత్ యత్నేనైకం సమాశ్రయేత్. 22

ఈ నాల్గింటిలో ఒక్కొక్కదానినుండి మిగిలినవి కలుగును; అందువలన, సర్వసంసిద్ధికొఱకు ఏదియొక్కదానినైన నభ్యసింపుము.

సత్సమాగమసంతోషవిచారాః సువిచారితమ్
ప్రవర్తంతే శమస్వచ్ఛే వాహనానీవ సాగరే. 23

సరకులతోగూడిన ఓడలు సముద్రమునుబోయి చేరునట్లు, సంతోష విచార, సాధుసంగమములు సావధానముగ శమమువలన నిర్మలుడైన పురుషునికడ కరుదెంచును.

విచారసంతోషశమసత్సమాగమశాలిని
ప్రవర్తంతే శ్రియో జంతౌ కల్పవృక్షాశ్రితే యథా. 24

కల్పవృక్షము నాశ్రయించినవానికడకు సంపదలరుదెంచునట్లు, సంతోషవిచార సాధుసంగమములున్నవానికడకు జ్ఞానసంపద అరుదెంచును.

విచారశమ సత్సంగ సంతోషవతి మానవే
ప్రవర్తంతే ప్రపూర్ణేందౌ సౌందర్యాద్యా గుణా ఇవ. 25

పూర్ణచంద్రుని సౌందర్యాది గుణములు స్వతః ఆశ్రయించునట్లు, శమము విచారము, సాధుసంగమము, సంతోషములతో బూర్ణుడైన వ్యక్తిని ప్రసాదాదిగుణము లాశ్రయించును.

సత్సంగ సంతోషశమవిచారవతి సన్మతౌ
ప్రవర్తంతే మంత్రివరే రాజనీవ జయశ్రియః. 26

ఆలోచింపబడిన విషయముల రహస్యముగనుంచు రాజును జయలక్ష్మి వరించునట్లు, శమాది పూర్వోక్తగుణములు గల్గిన వ్యక్తికడకు జయలక్ష్మి అరుదెంచును.

తస్మాదేకతమం నిత్యమేతేషాం రఘునందన
పౌరుషేణ మనో జిత్వా యత్నేనాభ్యాహరేద్గుణమ్. 27

రఘునందనా! అందువలన పౌరుషబలమున మనస్సును జయించి, వీటిలో నేయొక్కదానినైన యత్నపూర్వకముగ నిరంతర మవలంబింపుము.



పరం పౌరుషమాశ్రిత్య జిత్వా చిత్తమతంగజమ్
యావదేకో గుణో నాంతస్తావన్నాస్త్యుత్తమా గతిః. 28

చిత్తమను ఏనుగును పరమపురుషకారమున జయించి, వీటిలో నేయొక్కదానినైన పొందనంతవరకు, ఉత్తమగతిలేదు.

పౌరుషేణ ప్రయత్నేన దంతైర్దంతాన్ విచూర్ణయేత్
యావన్నాభినివిష్టం తే మనో రామ గుణార్జనే. 29

రామా! నీమనస్సు ఈగుణముల నార్జింప యత్నింపనంతవఱకు, పౌరుషమున పండ్లను పటపటలాడించుము, (గట్టిగా ప్రయత్నింపుము అనిభావము).

దేవో భవాథ యక్షోవా పురుషః పాదపోఽథవా
తావత్తవ మహాబాహో నోపాయోస్తీహ కశ్చన. 30

మహాబాహూ! నీవు దేవతవేకమ్ము, యక్షుడవేఁగుదువుగాక. మనుజుడవేకాని, చెట్టేయగుము—ఈ గుణముల నార్జింపకున్న గతిలేదు.

ఏకస్మిన్నేవ ఫలదే గుణే బలముపాగతే
క్షీయంతే సర్వఏవాశు దోషా వివశచేతసః. 31

వీటిలో, ఏదియొక్కటియైన బలమునుగూర్చుకొని ఫలించిన, చంచలచిత్తముయొక్క దోషములన్నియు వెంటనే క్షీణించును.

గుణే వివృద్ధే వర్ధంతే గుణా దోషజయప్రదాః
దోషే వివృద్ధే వర్ధంతే దోషా గుణవినాశనాః. 32

సుగుణములు వృద్ధినందిన దోషముల జయింపజాలు సుగుణములన్నియు వృద్ధినందును. దోషములు వృద్ధినందిన సుగుణములనశింపజేయు ఇతరదోషములన్నియు వృద్ధినందును.

మనోమోహవనే హ్యస్మిన్ వేగినీ వాసనాసరిత్
శుభాశుభబృహత్కూలా నిత్యం వహతి జంతుషు. 33

మనస్సను మోహారణ్యమున వాసనయనునది వేగముగ జీవులందు నిరంతరము ప్రవహించుచున్నది. దీనికి శుభాశుభములను రెండు పెద్ద గట్లున్నవి.

సాహి స్వేన ప్రయత్నేన యస్మిన్నేవ నిపాత్యతే
కూలే తేనైవ వహతి యథేచ్ఛసి తథాకురు. 34

నీవు యత్నముతో ఈప్రవాహము నేతీరమునకు బట్టుదువో, ఆతీరమునకే మళ్లును; ఇట్లెటిఁగి ఇక నీ ఇచ్ఛవచ్చినట్లొనర్పుము.

పురుషయత్నజవేన మనోవనే
శుభతటానుగతాం క్రమశః కురు
వరమతే నిజభావమహానదీ
మహహా తేన మనాగపి నోహ్యసే. 35

ఇతి శ్రీ వాసిష్ఠ—మహారామాయణే వాల్మీకీయే ముముక్షువ్యవహార
ప్రకరణే సదాచారనిరూపణం నామ షోడశ సర్గః. ॥ 16 ॥

రామా! ఈ చిత్తారణ్యమున పౌరుషబలము నాశ్రయించి, వాసనానదిని శుభతీరాభిముఖముగు నట్లొనర్పుము. ఇట్లొనర్చిన, శుద్ధమతీ! అశుభప్రవాహమునంబడవు.

ఇది శ్రీ వాసిష్ఠ—తాత్పర్య ప్రకాశికయందు, ముముక్షువ్యవహార
ప్రకరణమున సదాచార నిరూపణమను షోడశసర్గము ॥ 16 ॥



## సప్తదశః సర్గః.

శ్రీ వసిష్ఠ ఉవాచః—

ఏవమంతర్వివేకో యః స మహానిహ రాఘవ
యోగ్యో జ్ఞానగిరః శ్రోతుం రాజేవ నయభారతీమ్. 1

వసిష్ఠుడు:- రాఘవా! అంతరమున (వెనుక వర్ణింపబడినట్టి) వివేకముదయించిన పురుషుండే,-నీతిశాస్త్రమును విన రాజర్హుడైనట్లు ఈ జ్ఞానగర్భవాక్యములను విననర్హుడు.

అవదాతోఽవదాతస్య విచారస్య మహాశయః
జడసంగోజ్ఝితో యోగ్యః శరదిందోర్యథా నభః. 2

మేఘములులేని ఆకాశమండలము శరత్-చంద్రునకు దగునట్లు, మూర్ఖసంగ రహితుడును, నిర్మలుడును, మహాశయుడునునగు వ్యక్తి విచారము నొనర్పనర్హుడు.

త్వమేతయా ఖండితయా గుణలక్ష్మ్యా సమాశ్రితః
మనోమోహహరం వాక్యం వక్ష్యమాణ మిదం శృణు. 3

నీకిట్టి [illegible]సంపదగలదు. అందువలన, నేనునీకు మనోమోహమును బాపు వాక్యములను జెప్పుచున్నాను, వినుము.

పుణ్యాకల్పద్రుమో యస్య ఫలభారానతః స్థితః
ముక్తయే జాయతే జంతో స్తస్యేదం శ్రోతుముద్యమః. 4

[illegible] పుణ్యరాశియను కల్పవృక్షము ఫలములతోనిండి వ్రాలియున్నదో, అట్టివ్యక్తికే ముక్తినిమిత్తమీ విషయమును వినవాంఛగల్గును.

పావనానాముదారాణాం పరబోధైకదాయినామ్
వచసాం భాజనం భూత్యై భవ్యో భవతి నాధమః. 5



ఇట్టిగుణములు గలిగినవాడే, ఉన్నతికొఱకు పరమపవిత్రమగు ఈ జ్ఞానోపదేశమును విననర్హుడు, అధములగు ఇతరజనులుగారు.

మోక్షోపాయాభిధానేయం సంహితా సారసంమితా
త్రింశద్ద్వేచ సహస్రాణి జ్ఞాతా నిర్వాణదాయినీ. 6

సారయుక్తమగు ఈ సంహితయందు మోక్షోపాయము వర్ణింపబడియున్నది. దీనిని గ్రహించిన ముక్తి లభించును. దీని శ్లోకసంఖ్య ముప్పదిరెండు వేలు.

దీపే యథా వినిద్రస్య జ్వలితే సంప్రవర్తతే
ఆలోకోఽనిచ్ఛతోప్యేవం నిర్వాణమనయా భవేత్. 7

వెలుగుచున్న దీపము ముందరనున్న మేలుకొనినవాడు కోరకున్నను వెలుతురు బడయునట్లు; దీనిని బఠించిన అనాయాసముగ ముక్తి లభించును.

స్వయం జ్ఞాతా శ్రుతావాపి భ్రాంతిశాంత్యైకసౌఖ్యదా
ఆప్రేక్ష్య వర్ణితా సద్యో యథా స్వర్గతరంగిణీ. 8

ఈ సంహితను చక్కగ పరిశీలించి స్వయముగ గ్రహించినను లేక, వర్ణింపబడిన దానిని వినినను, భ్రాంతిని దూరమొనర్చి, గంగవలె అనిర్వచనీయ సుఖమునొసంగును.

యథా రజ్జ్వామహిభ్రాంతి ర్వినశ్యత్యవలోకనాత్
తథైతత్ప్రేక్షణాత్ శాంతిమేతి సంసారదుఃఖితా. 9

త్రాటిని త్రాడుగ నెఱింగిన పామను భ్రమతొలగి పోవునట్లు, ఈ శాస్త్రము నర్థముచేసికొనిన సంసారదుఃఖము శాంతించును.

యుక్తియుక్తార్థవాక్యాని కల్పితాని పృథక్ పృథక్
దృష్టాంత సారసూక్తాని చాస్యాం ప్రకరణాని షట్. 10

ఈ శాస్త్రమున ఆరు ప్రకరణము లున్నవి. దీనియందు యుక్తియుక్తమును, అర్థవంతములునగు వాక్యములును, ఉత్తమములగు దృష్టాంతములును, కథలును ఉన్నవి.

వైరాగ్యాఖ్యం ప్రకరణం ప్రథమం పరికీర్తితమ్
విరాగో వర్ధతే యేన సేకేనేవ మరౌ తరుః. 11
(అనుబంధేన సహితం దిష్టతత్త్వ నిరూపణం)
సార్ధం సహస్రం గ్రంథస్య యస్మిన్ హృది విచారితే
ప్రకాశాచ్ఛుద్ధతోదేతి మణావివ సుమార్జితే. 12

ఇందలి మొదటిప్రకరణము "వైరాగ్య" మనంబడుచున్నది. దీనిని బఠించిన, నీరుపోసిన మరుభూమి యందుగూడ మొక్క మొలచునట్లు, వైరాగ్యము వర్ధిల్లును. (ఇది అనుబంధముతో గూడుకొనియున్నది; దీనియందు కాలతత్త్వము నిరూపింపబడినది) ఈప్రకరణ శ్లోకసంఖ్యపదునైదు వందలు. మెరుగుపెట్టిన, మణియందున్న మకిలి పోవునట్లు, దీనిని విచారించిన అజ్ఞానజనితమగు బుద్ధిమాలిన్యము తొలగిపోవును.

ముముక్షువ్యవహారాఖ్యం తతః ప్రకరణం కృతమ్
సహస్రమాత్రం గ్రంథస్య యుక్తిగ్రంథేన సుందరమ్. 13
స్వభావో హి ముముక్షూణాం నరాణాం యత్ర వర్ణ్యతే

తరువాతది ముముక్షువ్యవహార - ప్రకరణము. దీనియందు వేయిశ్లోకము లున్నవి. యుక్తిపూర్ణములగు ఉపదేశముతో గూడి ఇది సుందరమై తనరుచున్నది. ఇందు ముముక్షువుల స్వభావము వర్ణింపబడినది.

అథోత్పత్తిప్రకరణం దృష్టాంతాఖ్యాయికామయమ్. 14
సప్తగ్రంథసహస్రాణి విజ్ఞానప్రతిపాదకమ్
జాగతీ ద్రష్టృదృశ్యశ్రీరహంత్వమితిరూపిణీ 15
అనుత్పన్నైవోత్థితేవ యత్రేతి పరివర్ణ్యతే
యస్మిన్ శ్రుతే జగదిదం శ్రోతాంతర్బుధ్యతేఽఖిలమ్. 16
సాస్మద్యుష్మత్సవిస్తారం సలోకాకాశపర్వతమ్
పిండగ్రహవినిర్ముక్తం నిర్భిత్తికమపర్వతమ్. 17
పృథ్వ్యాదిభూతరహితం సంకల్ప ఇవ పత్తనమ్
స్వప్నోపలంభభావాభం మనోరాజ్యవదాతతమ్. 18
గంధర్వనగరప్రఖ్య మర్థశూన్యోపలంభనాత్
ద్విచంద్రవిభ్రమాభాసం మృగతృష్ణాంబువర్తనమ్. 19
నౌయానలోలశైలాభం సత్యలాభవివర్జితమ్
చిత్తభ్రమ పిశాచాభం నిర్బీజమపి భాసురమ్. 20
కథార్థప్రతిభాసాభం వ్యోమముక్తావలీనిభమ్
కటకత్వం యథా హేమ్ని తరంగత్వం యథాంభసి. 21
యథా నభసి నీలత్వమసదేవోత్థితం సదా
అభిత్తిరంగరహిత ముపలబ్ధిమనోహరమ్. 22
స్వప్నేవా వ్యోమ్నివా చిత్రమకర్తృ చిరభాసురమ్
అవహ్నిరేవ వహ్నిత్వం ధత్తే చిత్రానలో యథా. 23
దథాత్యేవం జగచ్ఛబ్దరూపార్థ మసదాత్మకమ్
తరంగోత్పలమాలాభం దృష్టనృత్యమివోత్థితమ్. 24
చక్రచీత్కారపూర్ణస్య జలరాశిమివోద్యతమ్
శీర్ణపత్రం భ్రష్టనష్టం గ్రీష్మే వనమివారసమ్. 25
మరణవ్యగ్రచిత్తాభం శిలాగృహగుహాస్పదం
అంధకారగుహైకైకనృత్త మున్మత్తచేష్టితమ్. 26
ప్రశాంతాజ్ఞాననీహారం విజ్ఞానశరదంబరమ్



సముత్కీర్ణమివ స్తంభే చిత్రం భిత్తావివోదితమ్. 27
పంకాదివాభిరచితం సచేతనమచేతనమ్

తరువాతది మూడవదియగు ఉత్పత్తి - ప్రకరణము. దీనియందు నానావిధములగు దృష్టాంతములును, ఆఖ్యాయికలును ఉన్నవి. జ్ఞాన ప్రతిపాదకమగు ఈ గ్రంథభాగమున ఏడువేల శ్లోకములున్నవి. ఇందు లౌకికములగు నీవు నేను, ఇత్యాదిరూపకమగు ద్రష్టృదృశ్య భేదము వర్ణింపబడినది. ఈ ద్రష్టృదృశ్య భేదము అనుత్పన్నమయ్యు, ఉత్పన్నమైన దానివలె నగుపించును — అని ఇందు చెప్పబడినది. దీనిని వినిన, శ్రోతహృదయమున నీవు, నేను, బ్రహ్మాండములు, లోకములు, ఆకాశము పర్వతములతో గూడిన స్థావర జంగమాత్మకమగు జగత్తు రూపవిహీనమనియు, అమూలకమనియు పర్వతరహితమనియు భూతవిహీనమనియు తోచును; మఱియు, ఈ ప్రకరణమును వినిన సంసారము స్వకల్పనా రాజ్యము వంటిదని తెల్లమగును; స్వప్నమున గాంచిన వస్తువువలె అలీకమనియు, నామ మాత్రము అనగా వస్తుశూన్యమనియు, ఎండమావివలె భ్రమజనితమనియు, గంధర్వనగరమువలె తుచ్ఛమనియు, జబ్బుకంటివాని కగపడు ద్విచంద్రత్వమువలె భ్రమమయమనియు, పిశాచమువలె మోహకల్పితమనియు, అవగతమగును. నావ కదలుచుండ గట్టుననున్న గుట్టలు కదలుచున్న ట్లగపడు చక్కి, భ్రమకల్పిత రాక్షసునివలె, మాయవలనజేసి ఒకానొక సమయమున ప్రతిభాతమగు ఈ సంసార మప్పుడు తుచ్ఛమని బోధపడును. వర్ణనాప్రభావమున ప్రత్యక్షముగ గోచరించు పదార్థములవలెను, ఆకాశమున గనంబడు ముత్యములవలెను, సంసారము మిథ్యయని అప్పుడు ఏర్పడును; ఏలయన, సంసారమున వాస్తవమగు సారములేదని అర్థమగును.

ఆభరణములు, తరంగములు — ఇవి బంగారము, జలములనుండి వేరుగానట్లు, జగత్తుకూడ మిథ్యయే; ఇది ఆకాశమునందలి నీలిమమువలె, లేకున్నను ఉన్నట్లుతోచుచున్నది. మూలము, రంగు, కర్త — ఇవిలేకుండ ఆకసముననో స్వప్నముననో దోచు చిత్రపటమువంటిది. చిత్రపటమునందలి అగ్ని అగ్నివలె కన్పడుచున్నను, వాస్తవమున కగ్నికానట్లు, ఈ జగత్తు అసత్తుఅయ్యు జగత్తనియే వ్యవహరింపబడుచున్నది. జలతరంగములగాంచి కలువలగుంపనుకొనునట్లు, పూర్వముగాంచిన నృత్యమును స్మరించి మనోనయనముల మరల వీక్షించునట్లు, చక్రవాకముల ఎనుగులతో నిండియున్న ఆకాశసరోవరమును గల్పించునట్లు ఈ సంసారకల్పనగూడ తుచ్ఛమేయని ఉత్పత్తి—ప్రకరణమును జదివినఁ దేటపడును.

ఈ సంసారము మృత్యుముఖమునబడిన మనుజునిచిత్తమువలె, భ్రాంతిసంకులము, అస్థిరము; పర్వతగుహవలె అంధకారాచ్ఛన్నము, శూన్యము, భీషణము; అంధకారగుహయందు ఒంటిగ నాట్యమునల్పు పిచ్చివాని వంటిది, అని అప్పుడుతోచును. స్తంభముమీదనో లేక గోడమీదనో వ్రాయబడిన జీవితుని ప్రతిమవలె దీనికి స్వతంత్రసత్తలేదు, అని తెలియగలదు. ఈ పరమార్థదర్శనమున సంసారము అజ్ఞాననీహార శూన్యమును, విజ్ఞానమయమునునగు శరదాకాశము (అనగా బ్రహ్మ) గాక వేరొండుకాదని గ్రహింతుము.

తతః స్థితిప్రకరణం చతుర్థం పరికల్పితమ్. 28
త్రీణి గ్రంథసహస్రాణి వ్యాఖ్యానాఖ్యాయికామయమ్
ఇత్థం జగదహంభావరూప స్థితి ముపాగతమ్. 29

ద్రష్టృదృశ్యక్రమం ప్రోథమిత్యత్ర పరికీర్తితమ్
దశదిఙ్మండలాభోగ భాసురోఽయం జగద్భ్రమః. 30
ఇత్థమభ్యాగతో వృద్ధిమితి తత్రోచ్యతే చిరమ్

తరువాతది నాల్గవదియగు స్థితిప్రకరణము; దీని శ్లోకసంఖ్య మూడువేలు. దీనియందు పరమార్థతత్త్వము విశదముగ వ్యాఖ్యాతమైనది; నానావిధములగు కథలున్నవి. ఈ జగత్తు, అహంభావరూపమున స్థితిని గనుచున్నదని నుడువబడి యున్నది. ద్రష్టృదృశ్యముల రీతి ఇందు వర్ణింపబడినది. దశదిక్కుల విస్తరించి ప్రకాశించుచున్న ఈ భ్రాంతిమయ జగత్తు, ఎట్లు వృద్ధినందినదో ఇందు వర్ణింపబడినది.

ఉపశాంతిప్రకరణం తతః పంచసహస్రకమ్. 31
పంచమం పావనం ప్రోక్తం యుక్తిసంతతి సుందరమ్
ఇదం జగదహం త్వంచ సఇతి భ్రాంతిరుత్థితా. 32
ఇత్థం సంశామ్యతీత్యస్మిన్ కథ్యతే శ్లోకసంగ్రహైః
ఉపశాంతిప్రకరణే శ్రుతే శామ్యతి సంసృతిః. 33
ప్రభ్రష్టచిత్రసేనేన కించిల్లభ్యోపలంభనా
శతాంశశిష్టా భవతి సంశాంతభ్రాంతరూపిణీ. 34
అన్యసంకల్పచిత్తస్థా నగరశ్రీరివాసతీ
అలభ్యవస్తుపార్శ్వస్థ స్వప్నయుద్ధచిరారవా. 35
శాంతసంకల్పమత్తాభ భీమనాశనిశబ్దవత్
విస్మృతస్వప్నసంకల్పనిర్మాణనగరోపమా. 36
భవిష్యనగరోద్యానప్రసూవంధ్యాఽమలాంగికా
తస్యా జిహ్వోచ్యమానోగ్రకథార్థానుభవోపమా. 37
అనుల్లిఖితచిత్రస్య చిత్రవ్యాప్తేవ భిత్తిభూః
పరివిస్మర్యమాణార్థకల్పనానగరీనిభా. 38
సర్వర్తుమదనుత్పన్న వనస్పందాస్ఫుటాకృతిః
భావిపుష్పవనాకార వసంతరసరంజనా. 39
అంతర్లీనతరంగౌఘసౌమ్యవారిసరిత్సమా

ఐదవది ఉపశమప్రకరణము; దీని శ్లోకసంఖ్య ఐదువేలు. ఇది అతి పవిత్రమైనది; నానావిధములగు యుక్తులతోఁగూడి సుందరమై తనరుచున్నది. ఈ జగత్తు, నీవు, నేను, వాడు — అను భ్రాంతు లెట్లుపశమించునది, ఇందు వర్ణింపబడినది. దీనిని వినిన, సంసారము, చినుగుచున్న పటమునందలి సేనవలె, మాయుచు ఒకింత కనంబడుచుండును. అప్పుడు భ్రాంతి నూటికొకపాలు మిగులు పడియుండును.

ఒకానొకడు మనస్సున రాజ్యమును గల్పించుకొని చింతించుచున్నాడు. వాని ప్రక్క నింకొకడు కలలో రాజ్యమును గెల్వ యుద్ధమొనర్చుచు కేకలు పెట్టుచున్నాడు. స్వప్నరాజ్యము



చింతారాజ్యముకంటె ఒకింత స్పష్టమేయైనను లాభమేమియు లేదు. అట్లే, యీ జగత్తు ఒకని కొకింత అస్పష్టమును, మరొకని కొకింత స్పష్టము అయినను, వాస్తవమున కియ్యది అసత్యమే. కల్పితయుద్ధముల రవములు, కల్పననుండి తేరుకొనిన పిమ్మట నశించునట్లు, యీ జగత్తు స్వకల్పితమే గానిమ్ము స్వప్నకల్పితమే గానిమ్ము, నశించును.

అప్పుడీసంసారము, నిర్మింపఁబోవు నగరోద్యానమునందలి గొడ్డురాలికొడుకువలె, అలీకమగును; మూగవాడు వర్ణించిన వంధ్యాపుత్రుని వీరత్వవర్ణనము లేక వంధ్యయొక్క ప్రసవవేదనా వర్ణనముయొక్క అర్థానుభవమువలె అసత్యమై గన్పట్టును. సంపూర్ణముగ జగద్భ్రమ నశింపనివానికి సంసారము, మగియని చిత్రపటమునందలి భిత్తివలెనో లేక, కల్పననుండి తొలగి పోవుచున్న నగరమువలెనో, అస్పష్టముగ గన్పడును. ఋతువు లన్నిటియందు సమానముగనె యుండు భవిష్యదరణ్యము యొక్క కదలికవలెను, కల్పనామాత్రముననే పూదోటలోనికి వసంతము వచ్చునట్లు, సంసారము కల్పితము. కొందఱి కియ్యది, అంతర్నిహిత తరంగములతో మనోహరమైన నదివలె, ప్రశస్తమైననదిగ గన్పట్టును.

నిర్వాణాఖ్యం ప్రకరణం తతః షష్ఠముదాహృతమ్. 40
శిష్టోగ్రంథః పరిమాణం తస్య జ్ఞానమహార్థదః
బుద్ధే తస్మిన్ భవేచ్ఛ్రేయో నిర్వాణం శాంతకల్పనమ్. 41
అచేత్యచిత్ప్రకాశాత్మా విజ్ఞానాత్మా నిరామయః
పరమాకాశకోశాచ్ఛః శాంతసర్వభవభ్రమః. 42
నిర్వాపిత జగద్యాత్రః కృతకర్తవ్య సుస్థితః
సమస్తజనతారంభ వ్రజస్తంభో నభోనిభః. 43
వినిగీర్ణ యథాసంఖ్య జగజ్జాలాతి తృప్తిమాన్
ఆకాశీభూతనిఃశేషరూపాలోకమనస్కృతిః. 44
కార్యకారణ కర్తృత్వ హేయాదేయ దృశోజ్ఝితః
సదేహ ఇవ నిర్దేహః ససంసారోఽప్యసంసృతిః. 45
చిన్మయో ఘనపాషాణజఠరాపీవరోపమః
చిదాదిత్య స్తపంల్లోకానంధకారోపరోపమమ్. 46
పరప్రకాశరూపోఽపి పరమాంధ్యమివాగతః
రుద్ధసంసృతి దుర్లీలః ప్రక్షీణాశావిషూచికః. 47
నష్టాహంకార బేతాలో దేహవానకలేవరః
కస్మింశ్చిద్రోమకోట్యగ్రే తస్యేయమవతిష్ఠతే
జగల్లక్ష్మీర్మహామేరోః పుష్పే క్వచిదివాలినీ. 48
పరమాణౌ పరమాణౌ చిదాకాశః స్వకోటరే
జగల్లక్ష్మీసహస్రాణి ధత్తే కృత్వాథ పశ్యతి. 49

తరువాత ఆరవదియగు నిర్వాణప్రకరణము; దీని శ్లోకసంఖ్య పదునాలుగువేల ఐదువందలు. ఇది జ్ఞానమను గొప్పసంపద నొసంగును. ఈ ప్రకరణము నెఱింగిన కల్పనలన్నియు సమసిపోవును. నిర్వాణమను పరమశ్రేయస్సు లభించును.

అప్పుడు జ్ఞాని నిర్విషయమును, చిత్ప్రకాశకమును, విజ్ఞానమయమును, నిరామయమునునగు ఆత్మరూపమున ప్రతిష్ఠితుడగును. అప్పు డాతని సంసార భ్రమలన్నియు తొలంగిపోవును. అతడు పరమాకాశమువలె స్వచ్ఛుడగును. అతని జగద్యాత్ర నిర్వాణమునందును, పరిపూర్ణ మగును. కృతకృత్యుడగుటవలన నాతడు స్థిరుఁడగును. వజ్రనిర్మిత స్తంభము తనయందు ప్రతిబింబించులోకములకును, కార్యములకును, నాశ్రయమగునట్లు, అతడుగూడ పూర్ణుడైనందువలన, సమస్తలోకములకును, కార్యములకును, ఆశ్రయమై (బ్రహ్మమై) ప్రకాశించును. సమస్తలోకముల భక్షించుటవలనా యన్నట్లాతడు, తృప్తుడగును. అతని బాహ్యేంద్రియ భోగములు, చిత్తము, చిదాకాశముగ మారును. అప్పుడాతనికి కార్యకారణ కర్తృత్వముల యెడ నిరసనగాని, ఆదరణగానియుండదు. అప్పుడాతడు దేహియైనను విదేహియగును. సంసారియయ్యు అసంసారియగును.

అతడు కఠినపాషాణమువలె ఛిద్రరహితుడగును. అనగా, పరిపూర్ణమగు చిన్మయావస్థను బొందును. అప్పుడాతడు, లోకప్రకాశకుడగు పరమజ్యోతిర్మయ చిదాదిత్యుడు. దృశ్యములన్నియు అదృశ్యములై పోవుటవలన, నల్లరాయివలె, దుర్భేద్యమగు అంధత్వమును బొందినాడు. అతనికి, సంసార లీలయను కుత్సితవిషూచి వ్యాధి నశించినది. అహంకారమను దయ్యము వదలిపోయినది. శరీరమున్నను దేహాత్మజ్ఞానములేదు.

మేరుపర్వతమునందలి ఒకానొక పుష్పమున తుమ్మెదయుండునట్లు, స్వరోమాగ్రమువలె పరిచ్ఛిన్నమగు అవిద్యయొక్క ఒకానొక అంశవలన యీ జగత్తు నిలచియున్నది. తనహృదయ - చిదాకాశమునందు, ప్రత్యేకపరమాణువున సహస్ర సహస్ర జగల్లక్షలను గల్పించి అతడు దర్శింపగలడు.

వితతతా హృదయస్య మహామతే
ర్హరిహరాబ్జజలక్షశతైరపి
తులనమేతి న ముక్తిమతో యతః
ప్రవితతాస్తి నిరుత్తమవస్తునః. 50

ఇతి శ్రీ వాసిష్ఠ-మహారామాయణే వాల్మీకీయే ముముక్షువ్యవహార
ప్రకరణే గ్రంథసంఖ్యాది వర్ణనంనామ సప్తదశఃసర్గః ॥ 17 ॥

మహాత్ముడగు జీవన్ముక్తుని హృదయము పరమాత్మ; కోటి కోటి హరిహర బ్రహ్మాదులు కలసినను యీతనిఁబోలరు. ఏలయన, సత్తయొక్కయు, ఆనందముయొక్కయు, విస్తారమున నితడు సర్వోత్తముడు. ఆత్మయొక్క సర్వోత్కృష్టవిస్తృతి యీతని హృదయమున నున్నది.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు, ముముక్షువ్యవహార
ప్రకరణమున గ్రంథసంఖ్యావర్ణనమను సప్తదశ సర్గము. ॥ 17 ॥



# అష్టాదశః సర్గః.

శ్రీ వసిష్ఠ ఉవాచః—

అస్యాం వాచితమాత్రాయాం ప్రబోధః సంప్రవర్తతే
బీజాదివ సతో వ్యుప్తాదవశ్యంభావి సత్ఫలమ్. 1

వసిష్ఠుఁడు :— మంచిచేలయందు యథాసమయమున గింజనుపాతిన, తప్పకుండ మంచి ఫలము లభించునట్లు, ఈ మోక్షోపాయ సంహితను పఠించినను, పఠింపజేసినను, జ్ఞానము లభించును.

అపి పౌరుషమాదేయం శాస్త్రంచేద్యుక్తిబోధకమ్
అన్యత్త్వార్షమపి త్యాజ్యం భావ్యం న్యాయ్యైకసేవినా. 2

ఏ శాస్త్రము యుక్తివలన తత్త్వనిర్ణయ మొనర్చుట కనుకూలమై యుండునో, అది మనుష్య రచితమైనను గ్రాహ్యము; అట్లుగానిచో, వేదాంతర్గతమైనను త్యాజ్యము. అందువలన, న్యాయసమ్మతమైన మార్గమును అనుసరించుట మంచిది. (అనగా, కామ్యకర్మాది బోధకములగు వేదవాక్యములను త్యజించి, జ్ఞానోపదేశక భాగమును గ్రహింపవలెనని భావము. వీటిని వదలకున్న జిజ్ఞాసాధికారము లభింపదు.)

యుక్తియుక్తముపాదేయం వచనం బాలకాదపి
అన్యత్తృణమివ త్యాజ్యమప్యుక్తం పద్మజన్మనా. 3

యుక్తియుక్తములగు వాక్యములను బాలుడు చెప్పినను గ్రహింపనగును. యుక్తిరహితములగు వాక్యములను బ్రహ్మదేవుడు చెప్పినను తృణమువలె త్యజింపనగును.

యోఽస్మత్తాతస్య కూపోఽయమితి కౌపం పిబత్యపః
త్యక్త్వా గాంగం పురస్థం తం కోనాశాస్త్యతిరాగిణమ్. 4

ఎట్టయెదుటనున్న గంగాజలమునువీడి "ఇది నాతండ్రి త్రవ్విన నూయి" అని నూతినీరు త్రాగువానికెవ రుపదేశింతురు?

యథోషసి ప్రవృత్తాయామాలోకోఽవశ్యమేష్యతి
అస్యాం వాచితమాత్రాయాం సువివేకస్తథైష్యతి. 5

ఉషఃకాలమైన, తప్పక వెలుతురు వచ్చునట్లు, ఈగ్రంథమును బఠించిన వివేకమవశ్యముగల్గును.

శ్రుతాయాం ప్రాజ్ఞవదనాత్ బుద్ధ్వాంతం స్వయమేవ చ
శనైః శనైర్విచారేణ బుద్ధౌ సంస్కార ఆగతే. 6
పూర్వం తావదుదేత్యంతర్భృశం సంస్కృతవాక్యతా
శుద్ధయుక్తా లతేవోచ్చైర్యా సభాస్థానభూషణమ్. 7

సాంతముగ ఈ గ్రంథమును ప్రాజ్ఞునికడవిని, గ్రహింపగల్గిన, బుద్ధి విచారబలమున క్రమముగ దృఢ సంస్కారమును గూర్చుకొనును. పిదప, సభాస్థాన అలంకారమగు అంతరిక సంస్కార సహితమగువాణి లభించును; ఈవాణి సభనలంకరించు చక్కని లత వంటిది.

పరా నాగరతోదేతి మహత్వగుణశాలినీ
సా యయా స్నేహమాయాంతి రాజానో హ్యమరా అపి. 8

పిదప మహత్తరమగు చాతుర్యము లభించును; దీనివలన రాజులయొక్కయు, పండితులయొక్కయు, స్నేహము లభించును.

పూర్వాపరజ్ఞః సర్వత్ర నరో భవతి బుద్ధిమాన్
పదార్థానాం యథాదీపహస్తో నిశి సులోచనః. 9

చూడ్కిగలవాడు రాత్రి దీపమును జేతబుచ్చుకొని వస్తువుల నన్నిటిని గాంచగలునట్లు, బుద్ధిమంతుడు మాయామయ ప్రపంచమున ఈ శాస్త్రమును బఠించి, పూర్వాపరములను, సమస్త పదార్థముల తత్త్వములను గ్రహింపగలుగును.

లోభమోహోదయో దోషాస్తానవం యాన్త్యలం శనైః
ధియో దిశః సమాసన్నశరదో మిహికా యథా. 10

శరదృతువు ఆరంభమైన తోడనే నలుప్రక్కలనున్న మంచు చెదరిపోవునట్లు, ఈ శాస్త్ర ప్రభావమువలన లోభమోహాది మానసిక దోషములు మెల్లగ వీడిపోవును.

కేవలం సమవేక్ష్యంతే వివేకాభ్యాసనం ధియః
నకించన ఫలం దత్తే స్వాభ్యాసేన వినా క్రియా. 11

ఇప్పుడు నీబుద్ధికి వివేకాభ్యాస మొక్కటియే అవసరము; ఏలయన, అభ్యాస రహితమైన ఏ క్రియయు ఫలము నొసంగజాలదు.

మనః ప్రసాదమాయాతి శరదీవ మహత్సరః
పరం సామ్యముపాదత్తే నిర్మందర ఇవార్ణవః. 12

ఈ శాస్త్రమును బఠించిన, మనస్సు; శరత్కాల సరోవరమువలెను, మందరపర్వత రహితమగు సముద్రమువలెను, నిర్మలమును నిర్వికారమును నగును.

నిరస్తకాలిమారత్నశిఖేవాస్తతమఃపటా
ప్రతిజ్వలత్యలం ప్రజ్ఞా పదార్థప్రవిభాగినీ. 13

మసిలేకుండ వెలుగుచు, చీకటిని బోగొట్టి, వస్తువులను గన్పర్చు రత్నదీపశిఖవలె, ఈ శాస్త్రమును బఠించిన బుద్ధి ప్రకాశించును; మోహము, అజ్ఞానములనుబాపి బ్రహ్మపదార్థమును, తదితర పదార్థములను జక్కగ తోపింపజేయును.

దైన్యదారిద్ర్యదోషాఢ్యా దృష్టయో దర్శితాంతరాః
న నికృంతంతి మర్మాణి సనన్నాహమివేషవః. 14

కవచధారిని బాణములు కొట్టజాలనట్లు; దైన్యదారిద్ర దోషములతో నిండిన సంసారదృష్టి. ఈ శాస్త్రవేత్తను భేదింపజాలదు;



హృదయం నావలుంపంతి భీమాః సంసృతిభీతయః
పురస్థితమపి ప్రాజ్ఞం మహోపలమివేషవః. 15

బాణములు రాతిని భేదింపజాలనట్లు, భయమునుగొల్పు సంసారదృష్టి ఎట్టయెదుటనుండినను, ఈ శాస్త్రము నెఱింగినవాని హృదయమును గ్రుచ్చజాలదు.

కథం స్యాదాదితా జన్మకర్మణాం దైవపుంస్త్వయోః
ఇత్యాది సంశయగణః శామ్యత్యహ్ని యథా తమః. 16

జన్మముందా? లేక కర్మముందా? దైవము ముందరా? లేక పురుషకారము ముందా? — ఇట్టివగు సంశయములు, పగటిపూట రాత్రివలె, తత్త్వజ్ఞానినుండి దూరమగును.

సర్వదా సర్వభావేషు సంశాంతిరుపజాయతే
యామిన్యామివ శాంతాయాం ప్రజ్ఞాలోక ఉపాగతే. 17

సూర్యుడరుదెంచిన రాత్రి తొలంగునట్లు, ఈ శాస్త్రపఠనమునజేసి ప్రజ్ఞాలోక ముదయించిన, సమస్తపదార్థముల యెడ రాగద్వేషభావములు తొలగిపోవును.

సముద్రస్యేవ గాంభీర్యం స్థైర్యం మేరోరివ స్థితమ్
అంతఃశీతలతా చేందోరివోదేతి విచారిణః. 18

ఈ శాస్త్రమును విచారించువాడు సముద్రునివలె గంభీరుడగును, మేరువువలె ధీరుడగును, చంద్రునివలె శీతలాంతఃకరణుడునగును.

సా జీవన్ముక్తతా తస్య శనైః పరిణతిం గతా
శాంతాశేషవిశేషస్య భవత్యవిషయో గిరామ్. 19

ఈ వ్యక్తి క్రమముగ భూమికల నారోహించుచు జీవన్ముక్తుడగును, అజ్ఞానకల్పితములగు భేదములన్నియు నశించును. అప్పటి అతనిస్థితి వర్ణనకతీతము.

సర్వార్థశీతలా శుద్ధా పరమాలోకదాస్య ధీః
పరం ప్రకాశమాయాతి జ్యోత్స్నేవ శరదైందవీ. 20

శరత్కాలమందలి వెన్నెలవలె, ఈగ్రంథపాఠకునిబుద్ధి శీతలమును, శుద్ధమునునై, పరమాత్మ దర్శనమునొనరింపజేయగలుగును.

హృద్వ్యాకాశే వివేకార్కే శమాలోకిని నిర్మలే
అనర్థసార్థకర్తారో నోద్యంతి కిల కేతవః. 21

అతని హృదయాకాశమున వివేకమను సూర్యుడు శమయను వెలుగుతో ప్రకాశించుచున్నాడు; ఇందు అనర్థకములగు కామాదులను తోకచుక్క లుదయింపవు.

శామ్యంతి శుద్ధిమాయాంతి సౌమ్యస్తిష్ఠంతి సూన్నతే
అచంచలే జలే తృష్ణాః శరదీవాభ్రమాలికాః. 22

మంచి నీటివలన దాహము తీరునట్లు, శరత్కాల మేఘములు ప్రశాంతములగునట్లు, ఈ జీవన్ముక్తపురుషులు సర్వోన్నతమును, సుస్థిరమునునగు ఆత్మపదమున ప్రశాంతులై, శుద్ధమును ప్రశాంతమునునగు భావమున నుందురు.

యత్కించనకరీ క్రూరా గ్రామ్యతా వినివర్తతే
దీనాననా పిశాచానాం లీలేవ దివసాగమే. 23

పగటిపూట దీనములగు పిశాచముల లీల అణగిపోవునట్లు, పరులను చిన్నబుచ్చజేయు చెండుపల్కులు ఈ శాస్త్రమును బఠించువారి నోట వెల్వడవు.

ధర్మభిత్తౌ భృశం లగ్నాం ధియం ధైర్యధురం గతామ్
ఆధయో న విధున్వంతి వాతాశ్చిత్రలతామివ. 24

పరమాత్మను దృఢముగ నాధారపరుచుకొని, దాని తవుల్కొనియున్న వారి బుద్ధిని, చిత్రపటమునందలి లతను గాలి కదల్పలేనట్లు, మనోవ్యాధులు చలింపజేయజాలవు.

న పతత్యవటేజ్ఞస్తు విషయాసంగరూపిణి
కశ్చిల జ్ఞాతసరణిః శ్వభ్రం సమనుధావతి. 25

ఈజీవన్ముక్త పురుషుడు విషయములను గుంటలలోపడడు; ఎఱిగిఎఱిగి, గుంటలో కూలుటకై ఎవడుపరిగిడును?

సచ్ఛాస్త్రసాధువృత్తానా మవిరోధిని కర్మణి
రమతే ధీర్యథా ప్రాప్తే సాధ్వీవాంతఃపురాజిరే. 26

అతడు తన ఇచ్ఛవచ్చినట్లొనర్పడు. అతని బుద్ధి అంతఃపురమందు స్త్రీవలె, సచ్ఛాస్త్రసదాచారముల కనుకూలమగు కర్మలయందే ఆసక్తిని బూనియుండును.

జగతాం కోటిలక్షేషు యావంతః పరమాణవః
తేషామేకైకశోఽన్తఃస్థాన్ సర్గాన్ పశ్యత్యసంగధీః. 27

అసంగబుద్ధియగు పురుషుడు అసంఖ్యాకములగు బ్రహ్మాండములనున్న ఒక్కొక్క పరమాణువునందును అనేక బ్రహ్మాండములను గాంచును.

మోక్షోపాయావబోధేన శుద్ధాంతఃకరణం జనమ్
న ఖేదయతి భోగౌఘో న చానందయతి క్వచిత్. 28

మోక్షోపాయము నెఱిగి చిత్తశుద్ధిని బొందినవానికి, భోగసమూహములు దుఃఖమునొసంగజాలవు లేక సుఖమును గూర్పజాలవు.

పరమాణౌ పరమాణౌ సర్గవర్గా నిరర్గలా
యే పతంత్యుత్పతంత్యంబువీచివత్ తాన్స పశ్యతి. 29

ప్రత్యేక పరమాణువునందు అసంకీర్ణములై అనేకములగు బ్రహ్మాండము లున్నవి; ఇవన్నియు, సముద్రమునందలి తరంగములవలె, లేచిపడుచున్నవి. వీటిని జీవన్ముక్తపురుషుడు గాంచగలుగు.



న ద్వేష్టి సంప్రవృత్తాని న నివృత్తాని కాంక్షతి
కార్యాణ్యేవ ప్రబుద్ధోఽపి నిష్ప్రబుద్ధ ఇవ ద్రుమః. 30

కార్యములను, తత్ఫలములను ఇష్టానిష్టములను, గ్రహించియు జీవన్ముక్తపురుషుడు వాటిని కాంక్షింపడు. నిరసింపడు. జడమగు వృక్షమువలె అజ్ఞానిచందమున ప్రవర్తించును.

దృశ్యతే లోకసామాన్యో యథాప్రాప్తానువృత్తిమాన్
ఇష్టానిష్టఫలప్రాప్తౌ హృదయేనాపరాజితః. 31

ఇష్టానిష్టము లరుదెంచిన, సామాన్యునివలెనే జీవన్ముక్తుడు వాటిని భోగించును. కలవరపడడు.

బుద్ధ్వేదమఖిలం శాస్త్రం వాచయిత్వా వివిచ్య తామ్
అనుభూయత ఏవైతన్న తూక్తం వరశాపవత్. 32

అందువలన, ఈ శాస్త్రమును సంపూర్ణముగ పఠించి, దీని అర్థమును రూచింపుము. వరము, శాపములు, ప్రత్యక్షఫలముల నొసంగ గలిగినట్లు, ఈ శాస్త్రముగూడ ప్రత్యక్షఫలము నొసంగును.

శాస్త్రం సుబోధమేవేదం సాలంకారవిభూషితమ్
కావ్యం రసమయం చారుదృష్టాంతైః ప్రతిపాదితమ్. 33

ఈ శాస్త్రమును తేలికగ అర్థముచేసికొనవచ్చును. మాధుర్యము, ఉపమ, ఇత్యాదులగు శబ్దార్థాలంకారములిందున్నవి; మనోహరములగు దృష్టాంతములు దీనసున్నవి. ఇదిరసమయమగు కావ్యము.

బుధ్యతే స్వయమేవేదం కించిత్పదపదార్థవిత్
స్వయం వస్తు నవేత్తీదం శ్రోతవ్యం తేన పండితాత్. 34

పదములను, వాటి అర్థములను ఒకింత గ్రహింపగలిగినవాడు, దీనిని తనయంతటతానే అర్థము జేసికొనగలడు. అట్లు వీలుపడనిచో, పండితునికడ విని అర్థమును గ్రహించునది.

యస్మిన్ శ్రుతే మతే జ్ఞాతే తపోధ్యానజపాదికమ్
మోక్షప్రాప్తౌ నరస్యేహ నకించి దుపయుజ్యతే. 35

ఈ గ్రంథమును విని, మననపూర్వకముగ అర్థమును గ్రహింప గల్గినచో, మోక్షవిషయమున ధ్యానజపాదులుపయోగపడవు. (ఏలయన, వీటిఫలము ఏతదంతర్గతము.)

ఏతచ్ఛాస్త్రఘనాభ్యాసాత్ పౌనఃపున్యేన వీక్షణాత్
పాండిత్యం స్యాదపూర్వం హి చిత్తసంస్కారపూర్వకమ్. 36

ఈ శాస్త్రమును మాటిమాటికి పరికించుచు దృఢముగ నభ్యసించిన చిత్తసంస్కారముతో గూడిన అపూర్వపాండిత్యము లభించును. (తదితర గ్రంథములనుండి పాండిత్యము లభించిన లభింపవచ్చునుగాని, అందు చిత్తసంస్కారము కొఱవడును.)

అహం జగదితి ప్రౌఢో ద్రష్టృదృశ్యపిశాచకః
పిశాచోఽర్కోదయేనేవ స్వయం శామ్యత్యయత్నతః. 37

సూర్యోదయమైన దయ్యము మాయమగునట్లు, ఈ శాస్త్రాధ్యయన మొనర్చిన, అనాయాసముగ నేను, ప్రపంచము అను ద్రష్టు - దృశ్య - భేద పిశాచము వదలిపోవును.

భ్రమో జగదహంచేతి స్థిత ఏవోపశామ్యతి
స్వప్నమోహాః పరిజ్ఞాత ఇవ నో భ్రమయత్యలమ్. 38

నేను, జగత్తు, అను భ్రమయున్నను, యీ శాస్త్రమును బఠించిన ఉపశమించును. కల తేలిపోయిన, అందగపడినవి కలవరపెట్టజాలనట్లు, యీ జగద్భ్రమయుం అప్పుడు కలవరపెట్టజాలదు.

యథాసంకల్పనగరే పుంసో హర్ష విషాదితా
న బాధతే తథైవాస్మిన్ పరిజ్ఞాతే జగద్భ్రమే. 39
చిత్రసర్పః పరిజ్ఞాతో న సర్పభయదో యథా
దృశ్యసర్పః పరిజ్ఞాతస్తథా న సుఖదుఃఖదః. 40

మనః కల్పితనగరమును కల్పితమేయని గ్రహించిన సుఖదుఃఖముల నొసఁగజాలనట్లు, చిత్రింపబడిన పామును బొమ్మయని గ్రహించిన భయమును గలిగింపజాలనట్లు, యీ జగద్భ్రమను, యీ దృశ్యసర్పమును, మాయయని గ్రహించిన సుఖదుఃఖముల నొసంగజాలదు.

పరిజ్ఞానేన సర్పత్వం చిత్రసర్పస్య నశ్యతి
యథా తథైవ సంసారః స్థిత ఏవోపశామ్యతి. 41

చిత్రింపబడిన పాము నట్టిదానిగనే గ్రహించిన దానిసర్పత్వము నశించునట్లు, (జ్ఞానఫలముగ) యీ సంసారముగూడ అధిష్ఠానరూపమున (బ్రహ్మమున) లీనమైపోవును.

సుమనః పల్లవామర్దే కించిద్వ్యతికరో భవేత్
పరమార్థపదప్రాప్తౌ నతు వ్యతికరోఽల్పకః. 42

పూవును, చిగురుటాకును, చించుటకొకింత ప్రయత్న మొనర్పవలయును. కాని, పరమార్థలాభమున కామాత్రముకూడ ప్రయత్నింపవలసిన అవసరములేదు. (జ్ఞానప్రభావమున మాయామయమగు సంసారము తేలికగ లీనమైపోవును.)

గచ్ఛత్యవయవః స్పందం సుమనః పత్రమర్దనే
ఇహ ధీమాత్రరోధస్తు నాంగావయవచాలనమ్. 43

పూవును, చిగురుటాకును చింప అవయవములను గదల్పవలయును. పరమార్థలాభమునకో బుద్ధిని నిరోధించిన చాలును. అవయవములను కదల్పనక్కరయేలేదు.

సుఖాసనోపవిష్టేన యథా సంభవమశ్నతా
భోగజాలం సదాచారవిరుద్ధేషు న తిష్ఠతా. 44
యథాక్షణం యథాదేశం ప్రవిచారయతా సుఖమ్
యథాసంభవసత్సంగమిదం శాస్త్రమథేతరత్. 45
ఆసాద్యతే మహాజ్ఞానబోధః సంసారశాంతిదః
న భూయో జాయతే యేన యోనియంత్రప్రపీడనమ్. 46



సంసార తాపశాంతి నొసగుజ్ఞానమును బొందగోరునెడల, సుఖాసనమున గూర్చుండుట, లభించిన దానిని భోగించుట, సదాచార విరుద్ధములగు కార్యముల నొనర్పకుండుట, ఆయా యెడల లభించినట్లు సత్సంగ మొనర్చుట, యీ శాస్త్రమునుగాని, ఉపనిషత్తులు, మోక్షధర్మము ఇత్యాదులగు ఇతర శాస్త్రములనుగాని పఠించుట అవసరములు. ఇట్లొనర్చిన గొప్పదగు జ్ఞానము లభించును. పునర్జన్మ తొలగును. మరల, యోనియంత్రమునఁబడి బాధపడ నక్కరలేదు.

ఏతావత్యపి యే భీతాః పాపా భోగరసే స్థితాః
స్వమాతృవిష్ఠాకృమయః కీర్తనీయా న తేఽధమాః. 47

ఆయాసరహితమగు ఇట్టి శాస్త్రమును బఠింప భయపడువారును, భోగరస స్థితులునునగు పాపులు మాతృమల - కీటకములు; వీరి పేరైన దలచరాదు.

శృణు తావదిదానీం త్వం కథ్యమానమిదం మయా
రాఘవ జ్ఞానవిస్తారం బుద్ధిసారతరాంతరమ్. 48

రాఘవా ! నే జెప్పు జ్ఞానశాస్త్రమును వినుము. ఇది వివేకబుద్ధిచే గ్రహింపదగిన జ్ఞానము యొక్కతుది. (అనగా, ఆత్మతత్త్వము.)

యచ్ఛేదం శ్రూయతే శాస్త్రం తామాపాతనికాం శృణు
విచార్యతే యథార్థోఽయం యథాచ పరిభాషయా. 49

ఈ శాస్త్రశ్రవణమునకును, అర్థమును లెస్సగా తెలిసికొనుటకును, దోడ్పడు ఉపక్రమోపసంహారముల అవతారికను వినుము.

యేనేహానుభూతేఽర్థే దృష్టేనార్థేన బోధనం
బోధోపకారఫలదం తం దృష్టాంతం విదుర్బుధాః. 50

కాంచిన విషయము, సాదృశ్యమువలన కాంచనట్టి విషయమును గ్రహింప తోడ్పడును. ఇట్టిచోట్ల, నూతన విషయమును గ్రహింపదోడ్పడు విషయమును దృష్టాంత మందురు.

దృష్టాంతేన వినా రామ నాపూర్వార్థోఽవబుధ్యతే
యథా దీపం వినా రాత్రౌ భాండోపస్కరణం గృహే. 51

రామా ! రాత్రికాలమున ఇంటియందున్న వస్తువులను దీపములేనిచో గ్రహింపజాలనట్లు, దృష్టాంతముయొక్క సాయములేనిచో అపూర్వార్థము (అంతకు మున్నెరుంగని విషయము) బోధపడదు.

యైర్యైః కాకుత్స్థ దృష్టాంతైస్త్వం మయేహావబోధ్యసే
సర్వే సకారణాస్తే హి ప్రాప్యంతు సదకారణమ్. 52

కాకుత్స్థా ! నే నే దృష్టాంతముల సాయమునుగొని నీకు బోధింప నుంటినో, అవన్నియు కారణములతో గూడుకొని యున్నవి. జ్ఞేయమగు అసద్వస్తు వొక్కటియే కారణరహితము, అనగా, నిత్యము.

ఉపమానోపమేయానాం కార్యకారణతోదితా
వర్జయిత్వా పరం బ్రహ్మ సర్వేషామేవ విద్యతే. 53

పరబ్రహ్మము నొక్కదానిని విడచిన, తక్కిన ఉపమానోపమేయ పదార్థములన్నిటియందు కార్య కారణభావ మున్నది.

బ్రహ్మోపదేశే దృష్టాంతో య స్తవేహ హి కథ్యతే
ఏకదేశసధర్మత్వం తత్రాంతః పరిగృహ్యతే. 54

ఈ బ్రహ్మోపదేశ సందర్భమున, నేను నీకు జూపు దృష్టాంతముల, పరబ్రహ్మముయొక్క ఆంశిక సాధర్మ్యము మాత్రమే గ్రహింపబడును. *

యోయో నామేహ దృష్టాంతో బ్రహ్మతత్త్వావబోధనే
దీయతే నన బోద్ధవ్యః స్వప్నజాతో జగద్గతః. 55

బ్రహ్మావబోధనిమిత్తము గ్రహింపబడు ఉపమానములన్నియు, స్వప్నమునగాంచిన వస్తువలె, మిథ్యయగు జగత్తునకు జెందినవేయని గ్రహించునది.

ఏవం సతి నిరాకారే బ్రహ్మణ్యాకారవాన్ కథమ్
దృష్టాంత ఇతి నోద్యంతి మూర్ఖవైకల్పికో క్తయః. 56

అందువలన, "నిరాకారమగు బ్రహ్మమున సాకార దృష్టాంతములెట్లు సంగతములగును?" అను మూర్ఖుల వికల్పములకు తావులేదు.

అన్యాసిద్ధవిరుద్ధాది దృగ్దృష్టాంతప్రదూషణైః
స్వప్నోపమత్వాజ్జగతః సముదేతి నకించిన. 57

తార్కికులు చూపు హేత్వాభాసలను దోషము, జగత్తునకున్న పరమార్థములే స్వప్న పదార్థమువలె మిథ్యలగుటవలన, ఆ పరమవస్తువును బాధింపజాలవు.

అవస్తుపూర్వాపరయోర్వర్తమానే విచారితమ్
యథా జాగ్రత్తథా స్వప్నః సిద్ధమాబాలమాగతమ్. 58

ఒకింత విచారించిచూచిన జాగ్రదవస్థయందు గాంచు వస్తువులకును, స్వప్నావస్థయందు గాంచు వస్తువులకును భేదమేలేదు. ఈ రెండును మిథ్యలేయని తెలియగలదు. ఈ జగత్తు, భూత భవిష్యద్వర్తమాన కాలములలేనట్టి అవస్తువు; బాల్యమునుండి మనల నావహించియున్న ఈ జగద్భ్రమ మిథ్య.

స్వప్నసంకల్పనాధ్యానవరశాపౌషధాదిభిః
యథార్థా ఇహ దృష్టాంతా స్తద్రూపత్వా జ్జగత్స్థితేః. 59

* త్రాటియందు పామువలె, జగత్తు బ్రహ్మముయొక్క వివర్తము; అన్నచట్ల, జగత్తున బ్రహ్మమునందున్న నిత్యనిరతిశయ సుఖాదులున్నవని కాదు. ఈ యుండుట రజ్జు - సర్పమున విష ముండుట సంభవించి నప్పుడే. అందువలన, వివర్తాంశము మాత్రమే గ్రహింపబడు చున్నది. కనుక స్వసాధర్మ్యము ఆంశికమని పైశ్లోకమున నుడువంబడినది — అను.



స్వప్నము, సంకల్పము, ధ్యానము, వరము, శాపము, ఔషధము - ఇత్యాదులగు విషయముల గురించి చింతించిన "జగత్తు స్వప్నమువంటిది" అని చెప్పిన దృష్టాంతము బోధపడగలదు. ♦

మోక్షోపాయకృతా గ్రంథకారేణాన్యేఽపి యే కృతాః
గ్రంథా స్తేష్వియమేవైకా వ్యవస్థా బోధ్యబోధనే. 60

ఈ మోక్షోపాయ రచయిత, రచించిన గ్రంథములందెల్లయెడల, ఇదే నియమము పాటింపబడినది. దృష్టాంతములందు సంభవమైన అంశము మాత్రమే గ్రహింపబడినది.

స్వప్నాభత్వంచ జగతః శ్రుతే శాస్త్రేఽవబోధ్యతే
శీఘ్రం న పార్యతే వక్తుం వాక్యైల క్రమవద్దిసీ. 61

జగత్తు స్వప్నతుల్యమను జ్ఞానము ఈ శాస్త్రమును బఠించినతోడనే కలుగునని చెప్పజాలము; వాక్యబోధయగుట సంస్కారము ననుసరించి క్రమముగ జరుగవలసిన పని.

స్వప్నసంకల్పనాధ్యాన నగరాద్యుపమం జగత్
యత స్త ఏవ దృష్టాంత స్తస్మాత్ సంతీహ నేతరే. 62

స్వప్న, సంకల్ప, ధ్యానములందు కల్పింపబడిన నగరమువంటి దీ జగత్తు; అగుట వలన, స్వప్నాదులే యీ గ్రంథమున దృష్టాంతములుగ గ్రహింపబడినవి. ఇతరములు గ్రహింపబడలేదు.

అకారణే కారణతా యదోపోధాయోపమీయతే
నతత్ర సర్వసాధర్మ్యం సంభవత్యుపమాశ్రమైః. 63
ఉపమేయస్యోపమానాదేకాంశేన సధర్మతా
అంగీకార్యావబోధాయ ధీమతా నిర్వివాదినా. 64

సువర్ణము కుండలవలయాది ఆభరణములకు కారణమయినట్లు, బ్రహ్మముగూడ జగత్తునకు కారణము. ఈ ఉపమ, బ్రహ్మపదార్థమును దెల్పప్రయోగింపబడినది. ఇట సువర్ణము వికృతి నందునట్లు, బ్రహ్మముగూడ వికారమునందునని దలపరాదు. ఏలయన, సువర్ణమునందున్న ధర్మము లన్నియు గ్రహింపబడలేదు; ఆంశికముగమాత్రమే గ్రహింపబడినవి. బుద్ధిమంతుడగువాడు, తత్త్వమును గ్రహింప ఉపమానమునందలి ఏకాంశమునే నిర్వివాదముగ గ్రహించును.

అర్థావలోకనే దీపాదాభామాత్రాదృతేకిల
న స్థానతైలవర్త్యాది కించిదప్యుపయుజ్యతే. 65

వస్తువులను గాంచ, దీపమునగు వెలుగుమాత్రమే తోడ్పడును; నెమ్మె, నూనె, వత్తి మొదలగునవి ఉపయోగపడవుగదా!

♦ నిద్రించునప్పుడు కలగందుము. యీ కలలో విషయములను చింతించుట, అసంభవముకాదు. మఱియు, ఇష్టమూర్తిని ధ్యానించి వరమునుబడసి, శాపాది ఉపాయముల శత్రువులను జయించుటకూడ యీ కలలందు గందుము. ఇవి జాగ్రదవస్థలోగూడ ఫలించుచున్నవి. స్వప్నమున ఒకానొకనిచే నొసంగబడిన ఔషధప్రభావమున, జాగ్రదవస్థయందలి రోగములు నయమగుచున్నవి. కనుక, స్వప్నజాగరములకు భేదమే లేదనుట సమీచీనము - అను.

ఏకదేశసమర్థత్వా దుపమేయావబోధనమ్
ఉపమానం కరోత్యంగ దీపోఽర్థప్రభయా యథా 66

వస్తువులను గాంచ దీపపుకాంతి యొక్కటియే ప్రయోజనమైనట్లు, ఉపమ తన ఏకదేశశక్తి వలననే ఉపమేయమును గ్రహింపజేయగలదు.

దృష్టాంతస్యాంశమాత్రేణ బోధ్యబోధోదయే సతి
ఉపాదేయతయా గ్రాహ్యోమహావాక్యార్థనిశ్చయః. 67

దృష్టాంతమునందలి ఒకానొక అంశమాత్రమే గ్రహింపగలము. కనుక, మహావాక్యార్థ బోధలవలన నిశ్చయముగ బ్రహ్మజ్ఞానము లభింపగలదు.

న కుతార్కికతామేత్య నాశనీయా ప్రబుద్ధతా
అనుభూత్యపలాపాన్తైరపవిత్రై ర్వికల్పితైః. 68

అనుభవ వ్యతిరేకము, అని అపవిత్ర కుతర్కమొనరించి, తత్త్వజ్ఞానమును పాడు చేయుట పాడికాదు.

విచారణాదనుభవకారివైరిణోఽపి
వాఙ్మయం త్వనుగతమస్మదాదిషు
స్త్రియోక్తమప్యపరమార్థవైదికమ్
వచో వచః ప్రలపనమేవ నాగమః. 69

విచారించి చూచినచో, మనము శత్రువులని తలచు ఋషుల వాక్యములు బ్రహ్మజ్ఞానము నొసంగుచున్నవి; వీరు సంసారదోష దర్శకులు. వీరి వాక్యముల నవశ్యము గ్రహింతమగునని తేలుచున్నది. పరమార్థతత్త్వము నెఱింగింపనట్టి వాక్యము స్త్రీయుగాని వచించినను ప్రలాపమే, ఆప్తవాక్యము (ఆగమము) కాజాలదు.

అస్మాకమస్తి మతిరంగ తయేతి సర్వ
శాస్త్రైకవాక్యకరణం ఫలితం యతో యః
ప్రాతీతికార్థమపశాస్త్రనిజాంగపుష్టాత్
సంవేదనాదితరదస్తితతః ప్రమాణమ్ 70

ఇతి శ్రీ వాసిష్ఠ-మహారామాయణే వాల్మీకీయే ముముక్షు వ్యవహార ప్రకరణే
దృష్టాంతనిరూపణం నామ అష్టాదశః సర్గః ॥ 18 ॥

బ్రహ్మసాక్షాత్కారము నొనరించుటకొనగల శక్తితోకూడిన బుద్ధి మనకున్నది; దీనివలన, * సూక్తిరూపమున సమస్తశాస్త్రముల ఏకవాక్యత (అనగా, అఖండమగు బ్రహ్మ

* 'ప్రజ్ఞానం బ్రహ్మ, అయమాత్మా బ్రహ్మ, తత్త్వమసి, అహంబ్రహ్మాస్మి' అను నీ మహావాక్యములు జీవబ్రహ్మైక్య బోధపరములు; చతుర్వేదసారములు. వీటిని గురుముఖతః విని, అర్థము గ్రహించి, ధ్యానమొనర్చిన బ్రహ్మజ్ఞానము లభించును.



తత్త్వమనునే తాత్పర్యము) నిర్ణయించితిమి. దీనిని గ్రహించిన పరమపురుషార్థము లభించును. వేదాంత విరోధములగు శాస్త్రములు శ్రుతివ్యతిరేకములగు తర్కములతో నిండియున్నవి. "తత్త్వమసి" ఇత్యాదులగు మహావాక్యములు వారిమతమును సమర్థింపజాలవు. ఈ మతము వేదానుకూలముగ నున్నవి. అందువలన, ఇదియే వేదానుగత మతమని గ్రహింపుము.

ఇది శ్రీ వాసిష్ఠ-తాత్పర్య ప్రకాశికయందు ముముక్షు వ్యవహార ప్రకరణమున
దృష్టాంతనిరూపణమను అష్టాదశ సర్గము ॥ 18 ॥



## ఏకోనవింశః సర్గః

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

విశిష్టాంశ సమర్థత్వముపమానేషు గృహ్యతే
కో భేదః సర్వసాదృశ్యే తూపమానోపమేయయోః. 1

వసిష్ఠుడు:— విశేషాంశముయొక్క సమానధర్మమే ఉపమయందు గ్రహింపబడును. అట్లు గాక, అంశములన్నిటి సమానధర్మములున్న ఉపమానోపమేయముల భేదమేమి?

దృష్టాంతబుద్ధావేకాత్మ్యజ్ఞాన శాస్త్రార్థవేదనాత్
మహావాక్యార్థసంసిద్ధా శాంతిర్నిర్వాణముచ్యతే. 2

జీవబ్రహ్మముల స్వరూపమును గ్రహింప నుపయోగపడు. దృష్టాంతమును నెఱిగిన, అఖండాకార చిత్తవృత్తి ఉదయించును. మహావాక్యార్థ బోధవలన ఆత్మతత్త్వము స్ఫురించును. ఈ స్ఫురణ వలన అజ్ఞానము, దాని కార్యము నశించిపోవును; ఇదియే నిర్వాణము. ఇది దృష్టాంత జ్ఞానమువలననే లభించుచున్నది.

తస్మాద్దృష్టాంత దార్ష్టాంత వికల్పోల్లసితైరలమ్
యయా కయాచిద్యుక్త్యాతు మహావాక్యార్థ మాశ్రయేత్. 3

దృష్టాంత దార్ష్టాంతికము (ఉపమానోపమేయములను గురించి తర్కింపవలసిన అక్కర లేదు. దీనివలన నేమియు సిద్ధింపదు. ఏ యుక్తి ననుసరించిననుసరే, మహావాక్యార్థము నాశ్రయించుటయే ముఖ్యము.

శాంతిః శ్రేయః పరం విద్ధి తత్ప్రాప్తౌ యత్నవాన్ భవ
భోక్తవ్యమోదనం ప్రాప్తం కిం తత్సిద్ధా వికల్పితైః. 4

'శాంతియే పరమశ్రేయస్సు' అని గ్రహింపుము; ఈ శాంతిని బడయ ప్రయత్నింపుము. అన్నము లభించిన తినవలెనుగాని, అది యెట్లు వండబడినది? అని వితర్కించుట [illegible]

అకారణైః కారణిభిర్బోధార్థముపమీయతే
ఉపమానైస్తూపమేయైః సదృశైరేకదేశతః. 5

కారణరహితమును, కారణయుతమును నగు ఉపమానోపమేయముల ఒకింత భేదమున్నను, ఒకింత పోలికయున్నందువలన ప్రయోగింపబడి సాదృశ్యజ్ఞానమును గలిగించుచున్నవి.

స్థాతవ్యం నేహ భోగేషు వివేకరహితాత్మనా
ఉపలోదరసంజాత పరిపీనాంధభేకవత్. 6

రాతియందు పుట్టిన గ్రుడ్డి బోదురుకప్పవలె, వివేకహీనుడై భోగములయందాసక్తుడై యుండుట మనుజునకు తగదు.

దృష్టాంతైర్యత్నమాశ్రిత్య జేతవ్యం పరమం పదమ్
విచారణవతా భావ్యం శాంతిశాస్త్రార్థశాలినా. 7

వివేకముతో శాంతిమయములగు శాస్త్రార్థములను గ్రహించి, దృష్టాంత ప్రతిపాదితమగు పరమపదమును బొంద యత్నింపవలెను.

శాస్త్రోపదేశ సౌజన్య ప్రజ్ఞా తజ్జ్ఞసమాగమైః
అంతఃకాంతర సంపన్న ధర్మార్థోపార్జనక్రియః. 8
తావద్విచారయేత్ ప్రాజ్ఞో యావద్విశ్రాంతిమాత్మని
సంప్రయాత్యపునర్నాశాం శాంతిం తుర్యపదాభిధామ్. 9

ఆత్మవిశ్రాంతి లభింపనంతవరకు, శాస్త్రోపదేశము, సౌజన్యస్వభావము, సాధుసంగముముల, నాశ్రయించి ధర్మార్థములను పురుషార్థములను సంపాదింపవలెను; పిదప, శాస్త్రముల అపూర్వార్థమును గ్రహించి విచారపరాయణుడవగును. ఇట్లొనర్చిన తురీయపదమని చెప్పబడు శాంతి లభించును.

తుర్యవిశ్రాంతియుక్తస్య ప్రతీపస్య భవార్ణవాత్
జీవతోఽజీవతశ్చైవ గృహస్థస్య తథా యతేః. 10
న కృతేనాకృతేనార్థో న శ్రుతిస్మృతివిభ్రమైః
నిర్మందర ఇవాంభోధిః స తిష్ఠతి యథా స్థితమ్. 11

భవసముద్రమును దాటి ఏ వ్యక్తి యీ తురీయపదమున విశ్రమించినాడో, అతడు గృహి [illegible] తిరియో గాని; శ్రవణమననాదుల నొనర్పని ఒనర్పకపోనీ, ఐహికాముష్మిక ఫలము [illegible] పు. అతడు నిర్మందరుడగు సముద్రునివలె, నిశ్చలుడైయుండును. ♦

♦ నిర్మందరుడగు సముద్రుడు; ఇట్టిదెయగు ప్రయోగము ౧౫ వ సర్గ ౧౨ వ శ్లోకమున గూడ నున్నది. అభిప్రాయమిది; దేవతలు రాక్షసులు, మందరపర్వతమును కవ్వ [illegible] ర్చి, పాలసముద్రమును చిల్కినప్పుడది కల్లోలమైనదికదా! మందరపర్వతమును దీసివైచినప్పుడు ప్రశాం[illegible], కనుక, శాంతుడగు సముద్రుడను అర్థము లభించుచున్నది.



ఏకాంశేనోపమానానాముపమేయసధర్మతా
బోద్ధవ్యం బోధ్యబోధాయ న స్థేయం బోధచంచునా. 12

బోధింపబడు వస్తువుల తత్త్వమును గ్రహించు నిమిత్తము, ఉపమాన-ఉపమేయముల ఏకాంశసాధర్మ్యతను మాత్రమే గ్రహింపవలెను. అర్థమును నాలుకపై నుంచుకొనిన లాభము లేదు; మది కెక్కించుకొనవలయును.

యయా కయాచిద్యుక్త్యాతు బోద్ధవ్యం బోధ్యమేవ తే
యుక్తాయుక్తం న పశ్యంతి వ్యాకులా బోధచంచవః. 13

ఏ యుక్తి ననుసరించినను సరే, బోధార్థమును గ్రహింపవలెను. బోధచంచులగువారు భ్రమయందుపడి యుక్తాయుక్తములను గాంచజాలరు.

హృదయే సంవిదాకాశే విశ్రాంతేఽనుభవాత్మని
వస్తున్యనర్థం యః ప్రాహ బోధచంచుః స ఉచ్యతే. 14

హృదయదేశమున బుద్ధిగుహాయందు విశ్రమించియున్న అనుభవస్వరూపియగు బ్రహ్మవస్తువునందనర్థకల్పనల నొనరించువాడు, బోధచంచు వనంబడుచున్నాడు.

అభిమానవికల్పాంశైరజ్ఞో జ్ఞప్తిం వికల్పయేత్
బోధం మలినయత్యంతః స్వం ఖమబ్ద ఇవామలమ్. 15

మేఘుడు నిర్మలాకాశమును మలిన మొనర్చునట్లు, అజ్ఞుడగు బోధచంచువు అభిమానవికల్పముల బ్రహ్మభావవృత్తియందు వికల్పములను గల్పించి బోధను మలిన మొనర్చును.

సర్వప్రమాణసత్తానాం పదమబ్ధిరపామివ
ప్రమాణమేకమేవేహ ప్రత్యక్షం తదతః శృణు. 16

జలములన్నిటికి సముద్ర మునికియైనట్లు, ప్రమాణములన్నిటికి ప్రత్యక్షమే ఆధారమ్ము. దీనిని గురించి చెప్పుచున్నాను వినుము.

సర్వాక్షసారమధ్యక్షం వేదనం విదురుత్తమాః
నూనం తత్ప్రతిపత్సిద్ధం తత్ ప్రత్యక్షముదాహృతమ్. 17

ప్రత్యక్ష జ్ఞానములన్నిటికి మిన్నయగునదియే అపరోక్షానుభూతి; ఇది జ్ఞాతృ, జ్ఞాన, జ్ఞేయములను త్రిపుటులతో గూడియున్నది. ఇదిగూడ ప్రత్యక్షమేయని ఉత్తములగువారందురు.

అనుభూతేర్వేదనస్య ప్రతిపత్తేర్యథాభిధమ్
ప్రత్యక్షమితి నామేహ కృతం జీవః స ఏవ సః. 18

అనుభవము, వేదన, ప్రతిపత్తి - యీ మూడింటితో గూడిన సాక్షిచైతన్యము. ప్రత్యక్షపదముయొక్క యోగార్థము. మా మతమున ఇదియే జీవుడు.

స ఏవ సంవిత్ స పుమానహంతా ప్రత్యయాత్మకః
స యయోదేతి సంవిత్త్యా సా పదార్థ ఇతి స్మృతా. 19

ఈ సాక్షియే "వృత్తి"-ఉపాధితో గూడికొని నప్పుడు "సంవిత్" అని చెప్పబడుచున్నాడు. "అహం" ప్రత్యయముతో గూడుకొనినప్పుడు "ప్రమాత, పురుషుడు" అని చెప్పబడుచున్నాడు. విషయాకార వృత్తిని జాల్చి బాహ్యావరణములను జీల్చి, ఆవిర్భవించినప్పుడు, "విషయము, జ్ఞేయము" అని చెప్పబడుచున్నాడు.

స సంకల్పవికల్పాద్యైః కృతినానాక్రమభ్రమైః
జగత్తయా స్ఫురత్యంబు తరంగాదితయా యథా. 20

నీరు తరంగాది వివిధరూపముల ప్రకాశితమగునట్లు, యీ చైతన్యమే సంకల్ప వికల్పాది నానావిధ భ్రాంతులతో జగద్రూపమున ప్రతిభాసితమగుచున్నది.

ప్రాగకారణమేవాసు సర్గాదౌ సర్గలీలయా
స్ఫురిత్వా కారణం భూతం ప్రత్యక్షం స్వయమాత్మని. 21

ఈ సాక్షి చైతన్యమే పూర్వము సృష్టికి కారణముగాకుండియు. సృష్టిలీలయందు తానే కారణమైనట్లు ప్రకాశించుచున్నది.

కారణం త్వవిచారోత్థజీవస్యా సదపి స్థితమ్
సదివాస్యాం జగద్రూపం ప్రకృతౌ వ్యక్తి మాగతమ్. 22
స్వయమేవ విచారస్తు స్వతఉత్థం స్వకం వపుః
నాశయిత్వా కరోత్యాశు ప్రత్యక్షం పరమం మహత్. 23

విచారశూన్యతనుండి గల్గిన జీవుని అజ్ఞాన మసత్యమయ్యు. కారణమట్లు ప్రతిపన్నమగుచు, సత్యము ప్రతీయమానమగుచున్నది. ఆ విచారముతో గూడిన ఈ ఆత్మప్రకృతియందు, జగత్తు సత్యమట్లు స్ఫురించుచున్నది. ఒకింత విచారించి చూచిన, చైతన్య మీ జగత్తును వినష్టమొనర్చి పరమ మహత్-రూపమున ప్రకాశింపగలదు.

విచారవాన్విచారోఽపి ఆత్మాన మవగచ్ఛతి
యదా తదా నిరుల్లేఖం పరమేవావశిష్యతే. 24

విచారపరుడు ఆత్మను గ్రహింప గల్గినచో, విచారమునకును, శబ్దమునకును అతీతుడగు పరబ్రహ్మమున పర్యవసించును.

మనస్యనీహితే శాంతే స్వబుద్ధీంద్రియకర్మభిః
నహి కశ్చిత్ కృతైరర్థో నాకృతైరవ్యభావనాత్. 25

ఇట్లు ప్రపంచము బాధితమైన, మనస్సు శూన్యమై శాంతించును. అప్పుడు జ్ఞానేంద్రియములు తమ తమ కార్యముల నెరవేర్చుచున్నను కర్మఫలముండదు; నెరవేర్పక పోయినను భయములేదు. ఏలయన, ఇట్టి కార్యములనుండి సంస్కారము జనింపదు.

మనస్యనీహితే శాంతే న ప్రవర్తంత ఏవ తే
కర్మేంద్రియాణి కర్మదావసంచారితయంత్రవత్. 26



యంత్రమును నడపనిచో నడవనట్లు, మనస్సు యత్నశూన్యమై శాంతించిన, కర్మేంద్రియములు కర్మల నొనర్ప ప్రయత్నింపవు.

మనోయంత్రస్య చలనే కారణం వేదనం విదుః
ప్రణాలీ దారుమేషస్య రజ్జురంతర్గతా యథా. 27

కొయ్య-యంత్రమువనున్న మేక-బొమ్మలను డీకొల్పవలెనన్న, దాని క్రిందనున్న దారమును లాగవలెను. అట్లే మనోయంత్రమును గదల్పవలెనన్న విషయ-వాసనలను త్రాడు కావలెను. (విషయవాసనలు లేనిచో మనస్సు శాంతించును.)

రూపాలోకమనస్కార పదార్థవ్యాకులం జగత్
విద్యతే వేదనస్యాంతర్వాతాంతః స్పదనం యథా. 28

గాలియందు చలనశక్తి అంతర్నిహితమై యున్నట్లు, బాహ్యభోగములకును చింతలకును, ఆకరమగు జగత్తు, విషయవాసనలయందు సంస్కారరూపమున నున్నది.

సర్వాత్మవేదనం శుద్ధం యథోదేతి తదాత్మకం
భాతి ప్రసృతదిక్కాల బాహ్యాంతా రూపదేహకమ్. 29

ప్రాణుల కర్మఫల భోగార్థ మీశ్వరునియందు సత్త్వగుణప్రధానమగు వాసన ఉదయించును. వెంటనే ఆ వాసన విశాలదిఙ్మండల రూపమునను కాలముగను, బాహ్యాంతర పదార్థముల రూపునను ప్రకాశించును.

దృష్ట్వైవ దృశ్యతాభాసం స్వరూపం ధారయన్ స్థితః
స్వం యథా యత్ర యద్రూపం ప్రతిభాతి తథైవ తత్. 30

పిదప ఈశ్వరుడే నానావిధములగు మలినోపాధుల సంసర్గమున, దేహాదిదృశ్యపదార్థములనే నిజస్వరూపమని యెంచి, జీవభావమును వహించియుండును. వస్తుస్వరూపము నిజాభిప్రాయానుసారముగనే ప్రకాశించును.

స సర్వాత్మా యథా యత్ర సముల్లసముపాగతః
తిష్ఠత్యాశు తథా తత్ర తద్రూప ఇవరాజతే. 31

యీ సర్వాత్ముడెట వికాసము రాజిల్లుచుండునో, అట నా రూపమును దాల్చియుండును.

సర్వాత్మకతయా ద్రష్టుర్దృశ్యత్వమివ యుజ్యతే
దృశ్యత్వం ద్రష్టృసద్భావే దృశ్యతాపి న వాస్తవీ. 32

సర్వదర్శియగు ఆ పరమాత్మ సర్వస్వరూపుడగుటవలననే యనునట్లు, దృశ్యము గూడ నగును. ద్రష్టయుండినగదా దృశ్యమగుట ? వాస్తవమునకు, దృశ్యత్వముగూడ సత్యముకాదు.

అకారణకమేవాతో బ్రహ్మసిద్ధమిదం స్థితమ్
ప్రత్యక్షమేవ నిర్మాతృ తస్యాం శాస్త్రానుమాదయః. 33

జన్యవస్తువు మాత్రమే మిథ్య. అందువలన, సత్యస్వరూపమగు బ్రహ్మము కారణరహితము. ప్రత్యక్షతత్త్వము నాలోచించిన, ఈ అద్వితీయబ్రహ్మము సిద్ధించుచున్నది. ఇంక అనుమానాదులు ప్రత్యక్షము యొక్క అంశికభేదములే కనుక, బ్రహ్మమే సర్వప్రమాణతత్త్వము.

స్వయత్నమాత్రే యదుపాసకో య
స్తద్దేవశబ్దార్థమపాస్యదూరే
శూరేణ సాధో పదముత్తమం తత్
స్వపౌరుషేణైవ హి లభ్యతేఽంతః. 34

స్వీయప్రాక్తన ప్రయత్నము గాక, దైవమనునది వేరొండులేదు. ఉపాసకుడు ఇంద్రియాదులను జయించి, శూరుడని పేర్గాంచి, దైవమును దూరముగ పరిత్యజించి, పౌరుష ప్రభావమున నిజ హృదయమునందే బ్రహ్మసాక్షాత్కారము నందును.

విచారయాచార్యపరంపరాణాం
మతేన సత్యేన సితేన తావత్
యావద్విశుద్ధం స్వయమేవ బుద్ధ్యా
హ్యనంతరూపం పరమభ్యుపైషి. 35

ఇతి శ్రీ వాసిష్ఠ-మహారామాయణే వాల్మీకీయే ముముక్షువ్యవహార
ప్రకరణే ప్రమాణనిరూపణం నామ ఏకోనవింశః సర్గః ॥ 19 ॥

ఓ రామా! స్వీయబుద్ధిబలమున అనంతబ్రహ్మమును సాక్షాత్కరింప జేసికొనజాలనంతవఱకు ఆచార్యుల ప్రమాణసిద్ధ సత్యమతము ననుసరించుచు, తత్త్వవిచారము నొనర్పుము.

ఇది శ్రీ వాసిష్ఠ-తాత్పర్య ప్రకాశికయందు; ముముక్షువ్యవహార
ప్రకరణమున ప్రమాణ నిరూపణమను ఏకోనవింశ సర్గము ॥ 19 ॥



## వింశః సర్గః

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

ఆర్యసంగమయుక్త్యాదౌ ప్రజ్ఞాం వృద్ధిం నయేద్బలాత్
తతో మహాపురుషతాం మహాపురుషలక్షణైః. 1

శ్రీవసిష్ఠుడు:— ముముక్షువు మొట్టమొదట సాధుసంగమ మొనర్చి వారి ఉపదేశములను గ్రహించి, తదనుసార మాచరింపవలెను. ఇట్లు, గట్టిగ ప్రయత్నించి బుద్ధిని వికసింపజేయవలెను. పిదప, మహాపురుష లక్షణముల ననుసరించి, తనయందు మహాపురుషత్వమును సంపాదింపవలెను.



యో యో యేన గుణేనేహ పురుషః ప్రవిరాజతే
శిష్యతే తం తమేవాశు తస్మాద్బుద్ధిం వివర్ధయేత్. 2

మహాపురుష లక్షణములన్నియు ఒక్కనియందే లభింపకపోయిన, ఎవనియందేలక్షణమున్నదో దానినే గ్రహించి, బుద్ధిని పెంపొంద జేయవలెను.

మహాపురుషతా హ్యేషా శమాదిగుణశాలినీ
సమ్యగ్జ్ఞానం వినా రామ సిద్ధిమేతి న కాంచన. 3

రామా! శమాది గుణములతో గూడిన ప్రజ్ఞయే మహాపురుష లక్షణము; సమ్యక్ జ్ఞానము లేకున్న నిది సిద్ధింపదు.

జ్ఞానాచ్ఛమాదయో యాంతి వృద్ధిం సత్పురుషక్రమాః
శ్లాఘనీయాః ఫలేనాంతర్వృష్టేరివ నవాంకురాః 4

నూతన-అంకురములు వర్షధారలచే వృద్ధినంది ప్రశస్తములై ఫలముల నొసంగునట్లు, శమదమాదులు జ్ఞానప్రభావమున వృద్ధినంది, ఆత్మ సుఖమునొసగి ప్రశంసనీయములగుచున్నవి.

శమాదిభ్యో గుణేభ్యశ్చ వర్ధతే జ్ఞానముత్తమమ్
అన్నాత్మకేభ్యో యజ్ఞేభ్యః శాలివృష్టిరివోత్తమా. 5

అన్నముతో యజ్ఞము నాచరించిన వర్షము కురియును; వర్షము కురిసిన పంటలు పండును. ఇట్లే, జ్ఞానమువలన శమదమాదులు వృద్ధినందును; శమదమాదులవలన జ్ఞానము వృద్ధిగాంచును.

గుణాః శమాదయో జ్ఞానాచ్ఛమాదిభ్యస్తథా జ్ఞతా
పరస్పరం వివర్ధంతే తే అబ్జసరసీ ఇవ. 6

పద్మము, సరస్సు-ఇవి పరస్పరము తమ అందమును ఇనుమడింప జేసుకొనునట్లు, జ్ఞానము శమాదులుగూడ పరస్పర వృద్ధికరము అగుచున్నవి.

జ్ఞానం సత్పురుషాచారా జ్ఞానాత్ సత్పురుషక్రమః
పరస్పరం గతౌ వృద్ధిం జ్ఞాన సత్పురుషక్రమౌ. 7

ఇట్లే, జ్ఞాన, సదాచారములుగూడ పరస్పర వర్ధకములై యెగడుచున్నవి.

శమప్రజ్ఞాదినిపుణపురుషార్థక్రమేణ చ
అభ్యసేత్ పురుషో ధీమాన్ జ్ఞానసత్పురుషక్రమౌ. 8

శమప్రజ్ఞాదుల నిపుణులగు మహాపురుషుల చరిత్రముల నాదర్శముగ నుంచుకొని, ముముక్షువు జ్ఞానసదాచారముల నభ్యసింపనగును.

న యావత్ సమమభ్యస్తౌ జ్ఞానసత్పురుషక్రమౌ
ఏకోఽపినైతయోస్తాత పురుషస్యేహ సిద్ధ్యతి. 9

వత్సా! జ్ఞాన, సదాచారముల రెంటిని ఒకేమారు అభ్యసింపనియెడల, ఈ రెంటిలో నొద్దియు పట్టుపడదు.

యథాకలమరక్షిణ్యా గీత్యా వితతతాలయా
ఖగోత్సాదేన సహితః గీతానందః ప్రసాధ్యతే. 10

జ్ఞానసత్పురుషేహాభ్యామకర్త్రా కర్తృరూపిణా
తథాపుంసా నిరిచ్ఛేన సమమాసాద్యతే పదమ్. 11

ధాన్యక్షేత్రమును రక్షించువనిత చప్పట్లు చరచుచు పాటలుపాడుచు, పక్షులను తరుముచుండును. ఇట పక్షులను తరుముట, పాటలను పాడుట అను రెండుపనులు ఒకేతడవ జరుగునట్లు, నిస్పృహుడును, కర్తృత్వరహితుడునునగు ముముక్షుపురుషుడు, జ్ఞానసదాచార అనుష్ఠానమున భ్రమప్రమాదాది విఘ్నముల నాశనమొనర్చి, పరమపదమునందును.

సదాచారక్రమః ప్రోక్తోమయైవం రఘునందన
తథోపదిశ్యతే సమ్యగేవం జ్ఞానక్రమోధునా. 12

రఘునందనా! సదాచారక్రమమును నీకు జెప్పితిని. ఇక జ్ఞానక్రమముగూడ సంపూర్ణముగ నుపదేశింపబడుచున్నది.

ఇదం యశస్యమాయుష్యం పురుషార్థఫలప్రదమ్
తజ్జ్ఞాదాప్తాచ్చ సచ్ఛాస్త్రం శ్రోతవ్యం కిల ధీమతా. 13

ఇది మనోదాయకమును, ఆయుష్కరమును, మోక్షప్రదమునునగు, సచ్ఛాస్త్రము. దీనిని శాస్త్రజ్ఞుడును, ఆప్తుడునునగువానికడ వివేకియగు ముముక్షువు విననగును.

శ్రుత్వా త్వం బుద్ధినైర్మల్యాద్బలాద్యాస్యసి తత్పదమ్
యథా కతకసంశ్లేషాత్ ప్రసాదం కలుషం పయః. 14

మడ్డినీరు ఇందుప (చిల్ల) గింజవలన తేరుకొనునట్లుఁ (నిర్మలమగునట్లు,) దీనిని వినినవెంటనే నీవు పరమపద ప్రాప్తిహేతు చిత్తశుద్ధిని, బొందెదవు.

విదితవేద్యమిదం హి మనో మునే
ర్వివశమేవహి యాతి పరంపదమ్
యదవబుద్ధమఖండితముత్తమమ్
తదవబోధవశాన్న జహాతి హి. 15



ఇత్యార్షే శ్రీ వాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే ముముక్షువ్యవహార ప్రకరణే సదాచారనిరూపణం నామ వింశః సర్గః ॥ 20 ॥

ముముక్షు వ్యవహార ప్రకరణం సంపూర్ణమ్.

ఈ సాధనవలన మననశీలుడగు ముముక్షుని అంతఃకరణము తత్వజ్ఞానమునందును; అప్పుడాతడు వాంఛింపకున్నను పరమపదమునఁ బ్రవేశించును. ప్రవేశించుటయేకాదు, అజ్ఞానమును నశింపజేసి ప్రకాశించిన ఆపరమపదమును అంతఃకరణము వీడజాలదు.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు ముముక్షువ్యవహార ప్రకరణమున సదాచార నిరూపణమను వింశ సర్గము. ॥ 20 ॥

ముముక్షు వ్యవహార ప్రకరణము సంపూర్ణము.

ఓమ్

# వాసిష్ఠ మహారామాయణమ్

## ఉత్పత్తి ప్రకరణమ్

### ప్రథమః సర్గః

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

వాగ్భాభిర్బ్రహ్మ విద్బ్రహ్మ భాతి స్వప్న ఇవాత్మని
యదిదం తత్ స్వశబ్దోత్థైర్యో యద్వేత్తి స వేత్తి తత్. 1

వసిష్ఠుడు:- బ్రహ్మమే మహావాక్య ప్రభావమున బ్రహ్మవేత్తయగును. అనగా, జీవుడుగ తోచునాతడు మహావాక్యముల నభ్యసించిన కలుగు అఖండాకారమనోవృత్తివలన తన్ను ఆశ్రయించియుండు అజ్ఞానమును నాశనమొనర్చి బ్రహ్మభావమున బ్రకాశితుడగును. అట్టి ఆత్మప్రకాశమునే బ్రహ్మజ్ఞానము, స్వతత్త్వసాక్షాత్కారము అనిగూడ పేర్కొనుచున్నారు. జీవుని బ్రహ్మజ్ఞానమును గప్పియుంచి, దృశ్యప్రపంచమును దోపింపజేయు మాయ స్వప్నమువంటిది. ఇది ప్రత్యగాత్మయందు అనగా జీవ చైతన్యమునందే తోచుచున్నది, అందువలన. "ఇదంతయు బ్రహ్మమే" అని చెప్పు స్వబోధక మహావాక్యములవలన, పైనజెప్పినట్లు, స్వాత్మరహస్యమును గ్రహించువాడే బ్రహ్మజ్ఞుడనంబడుచున్నాడు.

న్యాయేనానేన లోకేఽస్మిన్ సర్గే బ్రహ్మాంబరే సతి
కిమిదం కస్య కుత్రేతి చోద్యమాచే నిరాకృతమ్. 2

అందువలన తేలునదేమన, జగత్తు బ్రహ్మమున త్రాటియందు పామువలె ఆరోపితము. కనుక, ఇది ఎవ్వరి సృష్టి? ఎవ్వరి యందున్నది? — అని నీవు పూర్వము ప్రశ్నించిన ప్రశ్నలు ప్రత్యుత్తరింప బడినవి.

అహం తావద్యథాజ్ఞానం యథావస్తు యథాక్రమమ్
యథాస్వభావం తత్సర్వం వచ్మిదం శ్రూయతాం బుధ. 3

బుధా! నేను నీవు దీనినిగురించి యథార్థజ్ఞానమును, క్రమముగ ఉన్నదున్నట్లు, చెప్పుచున్నాను, వినుము.

స్వప్నవత్ పశ్యతి జగచ్ఛిన్నభేదేహవిత్ స్వయమ్
స్వప్నసంసార దృష్టాంత ఏవాహంత్వంసమన్వితమ్. 4

ఆత్మయొక్క స్వరూపము, ఆకాశమువలె నిరాకారము, చైతన్యమాత్రము; అది జీవరూపమునుదాల్చి; జగత్తును గాంచుచున్నది. యీ జగత్తు స్వప్నతుల్యము. నీవు నేను, మొదలగు రూపములదోచు జగద్దర్శనమును; స్వప్నమునగాంచు వస్తువులతో బోల్పనగును. జగత్తును గాంచుట సత్యమేయైనను. జగత్తు మిథ్య. స్వప్నమును గాంచుట సత్యమేయైనను, అందగపడు వస్తువులు మిథ్యయే కదా!

ముముక్షువ్యవహారోక్తిమస్మాత్ ప్రకరణాత్ పరమ్
అథోత్పత్తిప్రకరణం మయేదం పరికథ్యతే. 5

ముముక్షు వ్యవహారప్రకరణమును జెప్పితిని. ఇక ఉత్పత్తిప్రకరణమును జెప్పుచున్నాను.

బంధోఽయం దృశ్యసద్భావాద్దృశ్యాభావే న బంధనమ్
న సంభవతి దృశ్యంతు యథేదం తచ్ఛృణు క్రమాత్. 6

దృశ్య ప్రపంచముయొక్క అనుభవమున్నందువలననే, ఈ బంధము; దృశ్యము నశించిన బంధముగూడ నశించును. దృశ్యము తొలగిపోవు రీతిని జెప్పుచున్నాను - వినుము.

ఉత్పద్యతే యో జగతి సఏవ కిల వర్ధతే
సఏవ మోక్షమాప్నోతి స్వర్గంవా నరకంచ వా. 7

ఈ జగత్తున జన్మించునదే వృద్ధినందుచున్నది. స్వర్గనరకముల కరుగుచున్నది. ముక్తి నందుచున్నది.

అతస్తే స్వావబోధార్థం తత్తావత్ కథయామ్యహమ్
ఉత్పత్తిః సంసృతావేతి పూర్వమేవహి యో యథా. 8

స్వరూపజ్ఞానము లేకుండుటవలననే నీవు బద్ధుడవగుచున్నావు. ఆత్మ పూర్వమున్నట్లుండియే ఎట్లుత్పత్తి - సంబంధమును గలిగించుకొనుచున్నదో, నీకు జెప్పెదను. దీనిని విన్న ఆత్మ స్వరూప జ్ఞానము లభించును.

ఇదం ప్రకరణార్థం త్వం సంక్షేపాచ్ఛృణు రాఘవ
తతః సంకథయిష్యామి విస్తరం తే యథేప్సితమ్ 9

రాఘవా! యీ ప్రకరణప్రతిపాద్య విషయమగు సంసారోత్పత్తిని ప్రప్రథమమున సంగ్రహముగ చెప్పెదను వినుము. పిదప, నీవు కోరినట్లు వివరింతును.

యదిదం దృశ్యతే సర్వం జగత్ స్థావరజంగమమ్
తత్ సుషుప్తావివ స్వప్నః కల్పాంతే ప్రవినశ్యతి. 10

స్వప్నము సుషుప్తియందు లీనమగునట్లు స్థావరజంగమాత్మకమగు ఈ జగత్తు ప్రళయమున లీనమైపోవును.

తతస్తిమితగంభీరం న తేజో న సమస్తతమ్
అనాఖ్యమనభివ్యక్తంసత్ కించిదవశిష్యతే. 11

అప్పుడు మిగిలియుండు సత్పదార్థమునకు నామరూపములుండవు; అభివ్యక్తి యుండదు. అది తేజముకాదు. లేక అంధకారమును గాదు. అది నిష్క్రియము, అపరిచ్ఛిన్నము.

ఋతమాత్మా పరంబ్రహ్మ సత్యమిత్యాదికా బుధైః
కల్పితా వ్యవహారార్థం తస్య సంజ్ఞా మహాత్మనః. 12



కాని, పండితులు లోకవ్యవహార నిమిత్తము ఆ పరమాత్మకు ఋతము, ఆత్మ, పరబ్రహ్మము సత్యము మున్నగు నామములను గల్పించిరి.

స తథాభూత ఏవాత్మా స్వయమన్య ఇవోల్లసన్
జీవతాముపయాతీవ భావినామ్నా కదర్థితామ్. 13

ఇయ్యది శుద్ధచిత్స్వభావకమయ్యు. స్వమాయవలన తనయంతటదానే జడరూపమున వివర్తమునంది, జీవభావము నాశ్రయించిన దానివలె గన్పట్టుచున్నది.

తతః స జీవశబ్దార్థకలనాకులతాం గతః
మనో భవతి భూతాత్మా మననాన్మంథరీభవన్. 14
మనః సంపద్యతే తేన మహతః పరమాత్మనః
సుస్థిరాదస్థిరాకార స్తరంగ ఇవ వారిధేః 15

అనంతరమీ చైతన్యమను వస్తువు సంకల్పవికల్ప కారణమగు జడము అనగా మనస్సుగామారును; పిదప అది ప్రాణము యొక్కయు, పంచభూతముల యొక్కయు ఆకృతిని గైకొనును. (మనోభావమును బొందుటకు గారణముగు తన) పరమార్థరూపమును మరచుటవలన, నిశ్చలసముద్రమున, లేచు తరంగమువలె, ఆ చైతన్యము నుండియే సంకల్ప వికల్పములతో గూడుకొనిన మనోధర్మము ప్రకటితమగును.

తత్స్వయం స్వైరమేవాశు సంకల్పయతి నిత్యశః
తేనేత్థ మింద్రజాలశ్రీర్వితతేయం వితన్యతే. 16

సమిష్టి మనోభావమును బొందిన హిరణ్యగర్భుడను ఆ చైతన్యమే పూర్వ సంస్కారముల ననుసరించి, విరాట్_భావమును అనగా, చతుర్విధ భూతములతో గూడిన భువన భావమును, సత్య సంకల్పుడగుట వలన సంకల్పించును.

యథాకటకశబ్దార్థః పృథక్త్వార్హో న కాంచనాత్
న హేమకటకాత్తద్వజ్జగచ్ఛబ్దార్థతా పరే. 17
బ్రహ్మణ్యేవా స్త్యనంతాత్మ యథాస్థితమిదం జగత్
నజగచ్ఛబ్దకార్థేఽస్తి హేమ్నీవ కటకాత్మతా. 18

సువర్ణవలయము సువర్ణమునుండి వేరుకానట్లు, సువర్ణముగూడ వలయమునుండి వేరుకానట్లు బ్రహ్మసత్తవలన నిలిచియున్న ఈ జగత్తు బ్రహ్మమునుండి వేరుకాదు, బ్రహ్మముకూడ జగత్తునుండి వేరుకాదు. (అందువలన, వస్తువొక్కటియే సిద్ధించుచున్నది. అది కారణమగు బ్రహ్మము. ఈ జగత్తు యొక్క అస్తిత్వము (ఉనికి) బ్రహ్మమునందే పర్యవసిత మగుచున్నది. జగద్భావమున గాదు.)

సతీవాప్యసతీ తాపనద్యేవ లహరీ చలా
మనసేహేంద్రజాలశ్రీర్జాగతీ ప్రవితన్యతే 19

మరుమరీచికలయందు నదీతరంగములు అసత్యములయ్యు సత్యములట్లు దోచురీతి, ఇంద్ర జాలమయమగు యీ జగత్తు అసత్యమయ్యు, మనస్సుయొక్క ప్రభావమున సత్యముగనున్నట్లే [illegible]మగుచున్నది.

అవిద్యా సంసృతిర్బంధో మాయా మోహో మహత్తమః
కల్పితానీతి నామాని యస్యాః సకలవేదిభిః. 20

అందువలన; తత్త్వజ్ఞులగు పండితులు జగత్తునకు అవిద్య, సంసృతి, బంధము, మాయ, మోహము, మహత్తు, తమస్సు, అను నామముల నొసంగినారు.♦

బంధస్య తావద్రూపం త్వం కథ్యమానమిదం శృణు
తతః స్వరూపం మోక్షస్య జ్ఞాస్యసీందునిభానన. 21

శశివదనా! నేను మొట్టమొదట నీకు బంధస్వరూపమును గుఱించి చెప్పెదను, వినుము. పిదప మోక్షస్వరూపమును వర్ణింతును.

ద్రష్టుర్దృశ్యస్య సత్తాంగ బంధ ఇత్యభిధీయతే
ద్రష్టా దృశ్యబలాద్బద్ధో దృశ్యాభావే విముచ్యతే. 22

వత్సా! ద్రష్టయొక్క ప్రతిబింబ చైతన్యమునకును, దృశ్యపదార్థమునకును గల సంబంధమే బంధమని చెప్పబడుచున్నది. దృశ్యభావమున ద్రష్ట బంధింపఁబడుచున్నాడు. దృశ్యము తొలగి పోయిన, బంధము నశించును.

జగత్త్వమహమిత్యాదిర్మిథ్యాత్మా దృశ్యముచ్యతే
యావదేతత్ సంభవతి తావన్మోక్షో నవిద్యతే. 23

నీవు, నేను మున్నగు మిథ్యాకల్పనలతో గూడిన జగత్తే దృశ్యమనంబడుచున్నది. ఇట్టి జగత్తురూపు మాయనంతవఱకు, ముక్తి లభింపదు.

నేదం నేదమితి వ్యర్థప్రలాపైర్నోపశామ్యతి
సంకల్పజనకైర్దృశ్యవ్యాధిః ప్రత్యుత వర్ధతే. 24

"ఇది లేదు. ఇది అంతయు అలీకము" అని ప్రయోజనరహితములగు ప్రలాపవాక్యముల బల్కిన దృశ్యబోధయను వ్యాధి నశింపదు. ప్రత్యుత, వృద్ధినందును. (ఏలయన, ఈ వాక్యములన్నియు చిత్తవిక్షేపమును గల్పించును.)

నచ తర్కభరక్షోదైర్న తీర్థనియమాదిభిః
సతో దృశ్యస్య జగతో యస్మాదేతి విచారకాః 25

ఎక్కుడుగ తర్కమునర్చుట వలనగాని, తీర్థయాత్రలను సేవించుటవలనగాని, సత్యమువలె దోచు ఈ జగత్తును నాశనమొనర్పజాలమని విచారకులు చెప్పుచున్నారు.

జగద్దృశ్యంతు యద్యస్తి న శామ్యత్యేవ కస్యచిత్
నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః. 26

♦"విద్యవలన అనగా, జ్ఞానమువలన ఖండింపబడునది గాన, అవిద్య; ఊర్ధ్వాధో దేశములగు స్వర్గనరకములకు గొనిపోవును గాన, సంసృతి; ఆత్మస్వాతంత్ర్యమును బంధించును గాన, బంధము; మిథ్యయగుటవలన మాయ; భ్రమహేతువగుటవలన మోహము; దాట కష్టము నొసంగును, గనుక మహత్తు; స్వస్వరూపమును గప్పిపుచ్చును గనుక తమస్సు." అని యోచింప వలెను — అను.



ఈ దృశ్యజగత్తు వాస్తవముగనున్న పక్షమున, ఇది ఎన్నటికిని శమింపదు. కారణము:- అసత్తుయొక్క సత్త, సత్తుయొక్క అభావము అసంభవములు.

అచేత్యచిత్స్వరూపాత్మా యత్రయత్రైవ తిష్ఠతి
ద్రష్టా తత్రాస్య దృశ్యశ్రీః సముదేత్యప్యణావరే. 27

అపరిజ్ఞేయమును, చైతన్యస్వరూపమునునగు ఆత్మ, దృశ్యవినివృత్తి అగునంతవఱకు ఎటనెటనుండునో అటనటుసకు పరమాణువునగూడ దృశ్యమును గనుచునే యుండును.

తస్మాదస్తి జగద్దృశ్యం తత్ప్రమృష్టమిదం మయా
త్యక్తం తపోధ్యానజపైరితి కాంజికతృప్తివత్. 28

అందువలననే నేను, సురాపానమున దృప్తిగలుగునను అభిప్రాయమును బరిత్యజించునట్లు, దృశ్యజగత్తునకస్తిత్వమున్నదను భ్రమను, తపోధ్యానజపాది సాధనములవలన చిత్తశుద్ధిని సంపాదించి పరిత్యజించితిని, ఇప్పుడు దాని మచ్చగూడ కనంబడుటలేదు.

యది రామ జగద్దృశ్యమస్తి తత్ ప్రతిబింబతి
పరమాణాదరేష్వస్మిం శ్చిదాదర్శే తథైవ హి. 29

రామా! జగత్తు కనంబడుచున్నంతవఱకు, పరమాణువున డాగియున్నను, చిత్స్వరూప దర్పణమున ప్రతిబింబము పడియే తీరును.

యత్రతత్ర స్థితే యద్వద్దర్పణే ప్రతిబింబతి
అద్ర్యబ్ధ్యుర్వీనదీవారి చిదాదర్శే తథైవ హి. 30

అద్దము విశాలప్రదేశమున నున్నను, ఇరుకుచోటుననున్నను, ఆయా తావులనున్న కొండలయొక్కయు, వాగులయొక్కయు, నేలయొక్కయు, నీటియొక్కయునీడపడును గదా! అట్లే, చిత్స్వరూపదర్పణమున గూడ నని గ్రహించునది.

తతస్తత్ర పునర్దుఃఖం జరామరణజన్మనీ
భావాభావగ్రహోత్సర్గః స్థూలసూక్ష్మచలాచలః. 31

ఇట్లు ప్రతిబింబించుచుండుటవలననే, చిత్స్వరూపమగు ఆత్మకు మాటిమాటికి నారు జరామరణ దుఃఖములును, జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలును గలుగుచున్నవి.

ఇదం ప్రమార్జితం దృశ్యం మయా చాత్రాహమాస్థితః
ఏతదేవాక్షయం బీజం సమాధౌ సంసృతిస్మృతేః. 32

సతి త్వస్మిన్ కుతో దృశ్యే నిర్వికల్పసమాధితా
సమాధౌ చేతసత్వం తు తుర్యం చాప్యుపపద్యతే. 33

సమాధిసమయమునగూడ. "నేను దృశ్యమును గాంచుటలేదు. దానిని తుడిచివైచితిని" అను సంస్కారముండును. ఈ సంస్కారము, సంసృతిస్మరణకనువగు అక్షయబీజము,

అనగా, ఇట్టి చిత్తవృత్తి నిలిచియున్న మరలమరల సంసార ముద్భవించుచుండును. కనుక, సవికల్ప సమాధి దృశ్యనాశహేతువుకాదు. నిర్వికల్పసమాధి లభించిన చైతన్యరూపమునను, నిర్వాణమునుగూడ బడయ గలము, కాని, దృశ్యమున్న నిర్వికల్ప సమాధి ఎట్లు సిద్ధింపగలదు?

వ్యుత్థానే హి సమాధానాత్ సుషుప్తాంత ఇవాఖిలమ్
జగద్దుఃఖమిదం భాతి యథాస్థిత మఖండితమ్ 34

నిద్రనుండి మేల్కొనిన పూర్వపు జ్ఞానమంతయు గుర్తునకు దగులునట్లు, సమాధి నుండి లేచిన మనుపటియట్లే, అఖండ దుఃఖ పరిపూర్ణమగు జగత్తు ప్రభాతమగును.

ప్రాప్తం భవతి హేరామ తత్కిం నామ సమాధిభిః
భూయోఽనర్థనిపాతే హి క్షణసామ్యే హి కిం సుఖమ్. 35

రామా! మరల దుఃఖమున బడవలసియున్నచో, ఇట్టి క్షణిక సమత్వసుఖమున గలుగు లాభ మేమి?

యదివాపి సమాధానే నిర్వికల్పే స్థితింవ్రజేత్
తదక్షయ సుషుప్తాభం తన్మన్యేతామలంపదమ్. 36

ప్రాప్యతే సతి దృశ్యేఽస్మిన్ నచ కింనామ కేనచిత్
యత్రయత్రకిలాయాతి చిత్తతాస్య జగద్భ్రమః. 37

ఎన్నటికిని నిర్వికల్పసమాధి భంగమవకున్న, అనంతసుషుప్తి సమమగు పవిత్ర బ్రహ్మపదమును బొందవచ్చు నను కొందువా ? మనస్సును మూలదృశ్యమున్నంత వఱకు యత్నపరులగు యోగులుకూడ దృశ్యమును సంపూర్ణముగ రూపుమాపలేరు. ఈ చిత్తము ఏ యే విషయముల నివిష్టమగునో, ఆయా విషయముల జగద్భ్రమ కల్గును.

ద్రష్టాథ యది పాషాణరూపతాం భావయన్ బలాత్
కిలాస్తే తత్తదు తేఽపి భూయోఽస్యోదేతి దృశ్యతా. 38

ద్రష్ట బలపూర్వకముగ తన్ను పాషాణమని భావించి ఊరకున్నను ఈ కల్పననుండి తేరుకొనిన పిమ్మట దృశ్య దర్శనమయియే తీరును.

నచ పాషాణతాతుల్యా నిర్వికల్పసమాధయః
కేషాంచిత్ స్థితిమాయాంతి సర్వైర్నిత్యమనుభూయతే. 39

మఱియు; ఇంతవరకు ఏ యోగియొక్క సమాధియు పాషాణతుల్యమును, అనంతమును నై ... ఇది మా అనుభవము,

నచ పాషాణతాతుల్యా నిర్వికల్ప సమాధయః
భవంత్యగ్రపదం శాంతం చిద్రూపమజమక్షయమ్. 40

పాషాణస్వరూప పరిణామమగు నిర్వికల్పసమాధి-అనుకు దొరకటుండి, అది అనంత కాలము స్థిరముగనుండినను, అయ్యది అనాదియు, అనంతమును, శాంతమును, శ్రేష్ఠమును, జ్ఞాన స్వరూపమునునగు ముక్తి కాజాలదు.



తస్మాద్యదిదం సద్దృశ్యం తన్న శామ్యేత్ కదాచన
శామ్యేత్ తపోజపధ్యానైర్దృశ్యమిత్యజ్ఞకల్పనా. 41

కనుక, దృశ్యమే సత్యమైనయెడల అది ఎన్నటికిని నశింపదు. తపోజపధ్యానాదుల వలన నశించునని తలపోయువారు మూఢులు. (దృశ్యమసలునకు లేదు; ఉన్నచో అది నశింపదు. కనుక, దృశ్యము మిథ్యయనియు, తపోజపధ్యానాదులు చిత్తశుద్ధిని గలిగించి తోడ్పడుచున్నను మోక్షమునకు సాక్షాత్ — కారణములు గావనియు, అభిప్రాయము.)

అలీనవల్లరీరూపం యథా పద్మాక్షకోటరే
ఆస్తే కమలినీ బీజం తథా ద్రష్టరి దృశ్యధీః. 42

తామరపూవునందు మొలవబోవు తీగయొక్క గింజలుండునట్లు, ద్రష్టయందు దృశ్యము గూడ సూక్ష్మరూపమున అనగా, సంస్కారరూపమున అణగియుండును.

యథా రసః పదార్థేషు యథా తైలం తిలాదిషు
కుసుమేషు యథాఽమోద స్తథా ద్రష్టరి దృశ్యధీః. 43

వస్తువులయందు రసమును, నువ్వులయందు చమురును, పువ్వులయందు వాసనయు, దాగియుండునట్లు, ద్రష్టయందు దృశ్య మిమిడియున్నది.

యత్రతత్ర స్థితస్యాపి కర్పూరాదేః సుగంధితా
యథోదేతి తథా దృశ్యం చిద్ధాతోరుదరే జగత్. 44

కర్పూరాది పదార్థములు ఎచ్చటనున్నను, సుగంధము వెలువరించుచుండునట్లు జీవభావమును వహించిన చిదాత్మ ఎటనున్నను దాని ఉదరమున దృశ్యజగత్తు ఉద్భవించుచునే యుండును.

యథా చాత్ర తవ స్వప్నః సంకల్పశ్చిత్తరాజ్యధీః
స్వానుభూత్యైవ దృష్టాంత స్తథా హృద్యస్తి దృశ్యభూః. 45

స్వప్నసంకల్ప మనోరాజ్యములను అట్టివానిగ నీవు నీ హృదయమున గ్రహింపగలిగిన యట్లే దృశ్య పదార్థములుగూడ హృదయమునను న్నవని స్వానుభవ బలమున గ్రహింపగలవు.

తస్మాచ్చిత్తవికల్పస్థ పిశాచో బాలకం యథా
వినిహంత్యేవ మేషైతం ద్రష్టారం దృశ్యరూపికా. 46

తలపోతల జనించినదయ్యము బాలుని జంపునట్లు, ఈ దృశ్య — పిశాచిగూడ ద్రష్టను జంపుచున్నది.

యథాంకురోఽంతర్బీజస్య సంస్థితో దేశకాలతః
కరోతి భాసురం దేహం తథైవం హి దృశ్యధీః. 47

గింజయందున్న మొలక తగిన నేలను, ఋతువును, బొందిన చెట్టగునట్లు, చిత్తుతో గూడుకొనియున్న చిత్తమున సంస్కారరూపముననున్న దృశ్య జ్ఞానముగూడ దేశకాలపరిస్థితుల ననుసరించి వృద్ధినందుచుండును.

ద్రవ్యస్య స్వాద్వేవ చమత్కృతిర్యథా
సదోదితా స్త్వస్తమితో జ్ఝితోదరే
ద్రవ్యస్య చిన్మాత్రశరీరిణ స్తథా
స్వభావభూతాస్త్వుదరే జగత్ స్థితిః. 48

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే ఉత్పత్తిప్రకరణే
బంధహేతు వర్ణనంనామ ప్రథమః సర్గః ॥ 1 ॥

విత్తనములనడుమ చెట్టును వెలువరించుశక్తి ఎల్లప్పుడును ఇమిడియుండును. గాని, ఒకొక్కప్పు డాశక్తిలోపించిపోయినట్లును, మరొకప్పుడు త్యజింప బడినట్లును, గాన వచ్చును. అట్లే, చిన్మాత్రశరీరియగు జీవుని అంతరమునగూడ వానిస్వభావమగు జగత్తు సర్వ కాలములనున్నది. సమయభేదమునను సరించి అణగిపోయినట్లో, విడచిపోయినట్లో, అగపడును.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు ఉత్పత్తి ప్రకరణమున
బంధహేతు వర్ణనము ప్రథమ సర్గము. ॥ 1 ॥

---

## ద్వితీయః సర్గః

శ్రీవసిష్ఠ ఉవాచ:—

ఇదమాకాశజాఖ్యానం శృణు శ్రవణభూషణమ్
ఉత్పత్త్యాఖ్యం ప్రకరణం యేన రాఘవ బుధ్యసే. 1

వసిష్ఠుడు:— రాఘవా! చెవులకింపగు హిరణ్యగర్భుని (బ్రహ్మ) కథ వినుము. ఇత డాకాశము (పరబ్రహ్మము) నను జన్మించినాడు. (అందువలన, ఆకాశజుడనంబడుచున్నాడు.) దీనిని వినిన, ఉత్పత్తి ప్రకరణమును జక్కగ గ్రహింపగలుగుదువు.

అస్తి హ్యాకాశజో నామ ద్విజః పరమధార్మికః
ధ్యానైకనిష్ఠః సతతం ప్రజానాంచ హితే రతః. 2

ఆకాశజుడను బ్రాహ్మణుడొకడుండెను. అతడు ధ్యానపరాయణుడును, సతతపర హితరతుడును, అత్యంతధార్మికుడునునై వెలయుచుండెను.

స చిరంజీవతి యదా తదా మృత్యురచింతయత్
సర్వాణ్యేవ క్రమేణాహం భూతాన్యద్మి కిలాక్షయః. 3

అతడు కలకాలము బ్రతుకుచుండుటగాంచి మృత్యువిట్లు తలపోసెను. "నాకు నాశనములేదు. నేను క్రమముగ జీవులనందరిని పొట్టబెట్టుకొనుచున్నాను.



ఏనమాకాశజం విప్రం న కస్మాద్భక్షయామ్యహమ్
అత్ర మే కుంఠితా శక్తిః ఖడ్గధారా ఇవోపలే. 4

"కాని, ఇతనిని భక్షింపలేకుంటిని. ఇదేమి? రాతిని కత్తిఛేదింపనట్లు, నాశక్తి ఇతని పట్ల వ్యర్థమగుచున్నదే!

ఇతి సంచింత్య తం హంతుమగచ్ఛత్ తత్పురం తదా
త్యజంత్యుద్యమముద్యుక్తా నస్వకర్మాణి కేచన. 5

ఇట్లు చింతించి మృత్యువు అతనిపురమునకు (మేరుపర్వత మధ్యముననున్న సత్యలోకమునకు) అరిగెను. సమర్థులగువారు ఫలించునంతవఱకు తమపనులను వీడరుగదా!

తత స్తత్సదనం యావన్మృత్యుః ప్రవిశతి స్వయమ్
తావదేనం దహత్యగ్నిః కల్పాంతజ్వలనోపమః. 6

పిదప. మృత్యువా బ్రాహ్మణుని గృహము ప్రవేశించెను. అప్పుడు ప్రళయకాలాగ్ని బోలు అగ్ని అతనిని దహింపసాగెను. (ఈ అగ్నిని బ్రాహ్మణుడు ధ్యానసమయమున విఘ్నములు కలుగకుండుటకు గాను; దగ్గరనుంచుకొనెను.)

అగ్నిజ్వాలా మహామాలాం విదార్యాంతర్గతోఽప్యసౌ
ద్విజం దృష్ట్వా సమాధాతుం హస్తే నైచ్ఛత్ ప్రయత్నతః 7

మృత్యువు అగ్నిజ్వాలావలయమును ఛేదించి లోనికిప్రవేశించి, బ్రాహ్మణుని అతియత్నమున చేతులతో బట్టుకొనగోరెను.

నచాశకత్ పురో దృష్టమపి హస్తశతైర్ద్విజమ్
బలవానప్యవష్టబ్ధుం సంకల్పపురుషం యథా. 8

మృత్యువు అతిబలశాలియేయైనను, సంకల్పకల్పిత పురుషుని బట్టుకొనజాలనట్లు, బ్రాహ్మణుడెట్టయెదుటనున్నను, వెయ్యిచేతులగల్గియు పట్టుకొనజాలకపోయెను.

అథాగత్య యమం మృత్యురపృచ్ఛత్ సంశయచ్ఛిదమ్
కిమిత్యహం నశక్నోమి భోక్తుమాకాశజం విభో. 9

అనంతరము మృత్యువు యముని కడకరుదెంచి "ప్రభూ! నేనేల ఆకాశజ - విప్రుని భక్షింపలేకున్నాను? అని ప్రశ్నించెను. యముడు సందేహములను దీర్పగలడు.

యమ ఉవాచ :—

మృత్యో న కించిచ్ఛక్త స్త్వమేకో మారయితుం బలాత్
మారణీయస్య కర్మాణి తత్కర్తౄణీతి నేతరత్. 10

యముడు:— మృత్యువా! నీవొక్కడవే నీబలమునఁజేసి జంపలేవు; ఆయావ్యక్తుల పురాతన కర్మలే వారిమరణమునకు గారణములు, (ఈ బ్రాహ్మణున కట్టి కర్మలులేవు. అందు వలన నీవాతనిని జంపలేకున్నావు) ఇదిగాక, వేరొక గారణములేదు.

తస్మాదేతస్య విప్రస్య మారణీయస్య యత్నతః
కర్మాణ్యన్విష్య తేషాం త్వం సాహాయ్యేనైనమత్స్యసి. 11

అందువలన, నీవీతనికి మిగిలియున్న కర్మలను వెదకుము, అట్టివే వెనుకున్న నీవీతని జంపగలవు.

తతః స మృత్యుర్బభ్రామ తత్కర్మాన్వేషణాదృతః
మండలాని దిగంతాశ్చ సరాంసి సరితో దిశః. 12

వన జంగలజాలాని శైలానబ్ధితటానిచ
ద్వీపాంతరాణ్యరణ్యాని నగరాణి పురాణిచ. 13

గ్రామాణ్యఖిలరాష్ట్రాణి దేశాంతర్గహనానిచ
ఏవం భూమండలం భ్రాంత్వా న కుతశ్చిత్సకానిచిత్ 14

తాన్యాకాశజకర్మాణి లబ్ధవాన్ మృత్యురుద్యతః
వంధ్యాపుత్రమివ ప్రాజ్ఞః సంకల్పాద్రిమివాపరః. 15

పిదప మృత్యువాతని కర్మలను వెదకుచు నాలుగు దిక్కులను, నదులను సరోవరములను, వనములను, అరణ్యములను, పర్వతములను, దేశదేశాంతరస్థ ఆరణ్యములను, ద్వీపాంతరములను, గ్రామములను, నిఖిలరాష్ట్రములను. నగరములను, తిరుగాడసాగెను. ఇట్లు భూమండలమంతయు తిరిగి గాలించియు, మృత్యువాతని కర్మలను, వంధ్యాపుత్రుని, అన్యసంకల్పిత పర్వతమును గనజాలనట్లు, ఎచ్చటను కనుగొన జాలక పోయెను.

సమపృచ్ఛదథాగత్య యమం సర్వార్థకోవిదమ్
పరాయణం హి ప్రభవః సందేహేష్వనుజీవినామ్. 16

పిదప మృత్యువు సర్వార్థకోవిదుడగు యమునికడ కరుదెంచి (ఆకాశజుని కర్మలెటనున్నవి? అని) ప్రశ్నించెను. సేవకులకేవైన సంశయములు గలిగిన ప్రభువులే వాటిని దీర్పగలరు.

మృత్యురువాచ;—

ఆకాశజస్య కర్మాణి క్వ స్థితాని వద ప్రభో
ధర్మరాజోఽథ సంచింత్య సుచిరం ప్రోక్తవానిదమ్. 17

మృత్యువు:— ప్రభూ! ఆకాశజుని కర్మలెటనున్నవో వచింపుము, అప్పుడు ధర్మరాజు చాలగ చింతించి ఇట్లు పల్కెను;

ఆకాశజస్య కర్మాణి మృత్యో సంతి న కానిచిత్
ఏష ఆకాశజో విప్రో జాతః ఖాదేవ కేవలాత్. 18

మృత్యువా! ఆకాశజునకట్టి కర్మలును లేవు; ఇతడు కేవల మాకాశము నుండియే జన్మించినాడు.

ఆకాశాదేవ యో జాతః స వ్యోమైవామలం భవేత్
సహకారీణి నో సంతి న కర్మాణ్యస్య కానిచిత్. 19



ఆకాశమునుండి జన్మించిన వన్నియు, నిర్మల ఆకాశస్వరూపులే యగును. మృత్యు సాహాయ్యకములగు (అభియాన రాగాదులగు) కర్మలీతనికి లేవు.

సంబంధః ప్రాక్తనేనాస్య న మనాగపి కర్మణా
అస్తి వంధ్యాసుతస్యేవ తథాఽజాతాకృతేరివ. 20

ప్రాక్తన కర్మలతో ఇతని కావంతయు సంబంధములేదు. వంధ్యాపుత్రునితోడను, నిరాకార వస్తువుతోడను సంబంధ మెట్లుండగలదు?

కారణానామభావేన తస్మాదాకాశమేవ సః
నైతస్య పూర్వకర్మాస్తి నభసీవ మహాద్రుమః. 21

ఆకాశము గాక వేరొక కారణము లేకుండుటవలన, అతడాకాశమే. ఆకాశమున పెను వ్రాకుండనట్లు, యీతనియందు కర్మలు లేవు.

నైతదస్యావశం చిత్తమభావాత్ పూర్వకర్మణామ్
అద్య తావదనేనాద్యం న కించిత్ కర్మసంచితమ్. 22

పూర్వకర్మలు (సంచితము) లేకుండుటవలన ఇతని చిత్తము స్థిరమైనది ఇతనికి (యీ శరీరమున ఫలితమునకు వచ్చు) ప్రారబ్ధకర్మలుంగూడ లేవు.

ఏవమాకాశకోశాత్మా విశదాకాశరూపిణీ
స్వకారణే స్థితో నిత్యః కారణాని న కానిచిత్. 23

అందువలన నీ విప్రుడు ఆకాశకోశుడును, విశదాకాశ రూపుడునునగు స్వకారణమునందే నిలచియున్నాడు. ఇతడు నిత్యుడు. ఇతని కింకొక కారణములేదు.

ప్రాక్తనాని న సంత్యస్య కర్మాణ్యద్య కరోతి నో
కించిదప్యేవ మేషోఽత్ర విజ్ఞానాకాశమాత్రకః 24

ఇతనికి ప్రాక్తన కర్మలెవ్వియులేవు. నూతన కర్మలను ఇతడు కూర్చుకొనుటలేదు. ఇతడు కేవలము, విజ్ఞాన-ఆకాశ స్వరూపుడు.

ప్రాణస్పందోఽస్య యత్ కర్మ లక్ష్యతే చాస్మదాదిభిః
దృశ్యతేఽస్మాభిరేవం తన్నత్వస్యాస్త్యత్ర కర్మధీః. 25

మన మీతనియందు గాంచు, ప్రాణముయొక్కయు, దేహేంద్రియాదుల యొక్కయు చలనము, మన అవిద్యయొక్క భ్రమమాత్రమే. వాస్తవమున కీతని కద్దానియందు కర్మయను బుద్ధిలేదు.

సంస్థితా భావయంతీవ చిద్రూపైవ పరాత్పదాత్
భిన్నమాకారమాత్మీయం చిత్తాంభే సాలభంజికా. 26

తథైవ పరమార్థాత్ స ఖాత్మభూతః స్థితో ద్విజః
యథా ద్రవత్వం పయసి శూన్యత్వంచ యథాంబరే. 27

స్పందత్వంచ యథా వాయో స్తథైష పరమేపదే
కర్మాణ్యద్యతినాన్యస్య సంచితాని న సంతి హి. 28

"స్తంభముమీద చెక్కబడినబొమ్మ స్తంభమునుండి వేరుగాకున్నను వేరైనట్లు గన్పించురీతి, చిన్మయబ్రహ్మముననున్న ఈ ప్రపంచరచనగూడ తనఆకారమగు బ్రహ్మముకంటె భిన్నమైనట్లు, గన్పించుచున్నది,అందువలన ఆకాశమునుండి గల్గిన ఈ బ్రాహ్మణుని ఆకాశాత్ముని గనే గ్రహింపుము. నీటియందు ద్రవత్వము, ఆకాశమున శూన్యత్వము, వాయువున స్పందములు సహజముగ నుండునట్లు, ఈ విప్రుడు పరమపదముననున్నాడు. ఇతనికి సంచితప్రారబ్ధములగు కర్మలేమియును లేవు.

న పూర్వాణ్యేష తేనేహ న సంసారవశం గతః
సహకారికారణానామభావే యః ప్రజాయతే. 29
నాసౌ స్వకారణాద్భిన్నో భవతీత్యనుభూయతే
కారణానామభావేన తస్మాదేష స్వయంభవః. 30

"పూర్వకర్మలెవ్వియు లేకుండుటవలన, ఇతడు సంసారవశుడగుటలేదు, సహకారికారణము లేకుండ జనించునది, కారణముకంటె వేరుకాదను తథ్యమనుభవప్రసిద్ధము. ఇతనికి వేరొకకారణము లేకుండుటవలన" స్వయంభు వనంబడుచున్నాడు.

కర్తా నపూర్వం నాప్యద్య కథమాక్రమ్యతే వద
యదైష కల్పనాం బుద్ధ్యా మృతినామిమాం కరిష్యతి. 31
పృథ్వ్యాదిమానయమహమితి యస్యచ నిశ్చయః
సపార్థివో భవద్యాశు గ్రహీతుం సచ శక్యతే. 32

"ఇతనికి పూర్వాపరములగు కర్మలులేవు. అగుచో, ఇతని నెట్లాక్రమింపగలవు? సత్యసంకల్పుడగు జీవుడు, తన్ను పంచభూతవికారముగ నిశ్చయించుకొనినప్పుడే, అతడు పార్థివమగుచున్నాడు. అప్పుడే నీవు జీవుని గ్రహింప (జయింప) గలవు.

పృథ్వ్యాదికలనాభావా దేష విప్రో న రూపవాన్
దృఢరజ్జ్వేవ గగనం గ్రహీతుం నైవ యుజ్యతే. 33

"పృథ్వ్యాది భూతములతో నీతనికెట్టి సంబంధమును లేదు. అందువలన ఇతడు రూపహీనుడు. గట్టిగనున్న త్రాటితోనైనను ఆకాశమును గట్టజాలనట్లు, నీవీతనిని గ్రహింపజాలవు."

మృత్యురువాచ:—

భగవన్ జాయతే శూన్యాత్ కథంనామ వదేతి మే
పృథ్వ్యాదయః కథం సంతి నసంతి వదనా కథమ్. 34

మృత్యువు:- భగవానుడా! ఆకాశము శూన్యము. ఇందుండీవిప్రుడెట్లు జన్మించినాడు? పృథ్వ్యాదు లొకప్పుడుండి మరొకప్పుడుండకపోవుటకు కారణమేమి? వచింపుము?



యమ ఉవాచ:—

న కదాచన జాతోఽసౌ నచ నాస్తి కదాచన
ద్విజః కేవలవిజ్ఞానభామాత్రం తత్తథా స్థితః 35

యముడు:- ఈ విప్రుడేకాలముననుజన్మించియేయుండలేదు; ఇతడు జన్మరహితుడు. నిత్యుడు విజ్ఞానస్వరూపుడు.

మహాప్రలయసంపత్తౌ న కించిదవశిష్యతే
బ్రహ్మాస్తే శాంతమజరమనంతాత్మైవ కేవలమ్. 36
శూన్యం నిత్యోదితం సూక్ష్మం నిరుపాధిపరం స్థితమ్.
తదా తదను యేనాస్య నికటేఽద్రినిభం మహః 37
సంవిన్మాత్రస్వభావత్వాద్దేహోఽహమితి చేతతి
కాకతాలీయవద్భ్రాంతమాకారం తేన పశ్యతి. 38

మహాప్రళయ కాలమున మరేమియు మిగులుపడదు. కేవలము ఏకమాత్రమును, శాంతమును, శూన్యమును, నిత్యమును, ప్రకాశమును, సూక్ష్మమును నిరుపాధికమును, అనంతమును, అజరమునునగు పరబ్రహ్మము మాత్రమె మిగిలియుండును. (ఈ బ్రహ్మమే అతనిస్వరూపము) పిదప, సృష్ట్యాదియందు జ్ఞానమాత్ర స్వభావకము ఈ పరబ్రహ్మము చెంగట, 'నే నే దేహము' అనురూపమున తేజోమయమగు విరాట్పురుషుని పర్వతాకార శరీరము కొంచముగ ఆవిర్భవించును. అప్పుడు బ్రహ్మమున ఈ మిథ్యామయ ఆకారము కాకతాళీయముగ మనబోంట్లకు గోచరించుచున్నది. ♦

సఏష బ్రాహ్మణ స్తస్మిన్ సర్గాదావంబరోదరే
నిర్వికల్పశ్చిదాకాశరూపమాస్థాయ సంస్థితః. 39

ఈ బ్రాహ్మణుడే ఆవిరాట్పురుషుడు. ఇతడే సృష్టిప్రారంభమున, పరమాకాశమున నిర్విశేష చిదాకాశరూపమున సంస్థితుడై యుండును.

నాస్య దేహో న కర్మాణి నకర్తృత్వం నవాసనా
ఏష శుద్ధ చిదాకాశో విజ్ఞానఘన ఆతతః 40

ఇతనికి శరీరములేదు. కర్మలేదు. కర్తృబోధలేదు, వాసనలులేవు, మతి, ఇతడు విశుద్ధాకాశ స్వరూపుడును, కేవలుడును, జ్ఞానఘనుడునునై వెలయుచున్నాడు.

ప్రాక్తనం వాసనాజాలం కించిదస్య న విద్యతే
కేవలం వ్యోమరూపస్య భారూపస్యైవ తేజసః 41

---

♦ ఎట్లన, బ్రహ్మమును ఆకాశముతో బోల్చెదము. హిరణ్యగర్భుని ఉపాధియగు అజ్ఞానము జలాశయము, బ్రహ్మముయొక్క ప్రతిబింబమందు పడును. అప్పుడు, చెఱువునీటనున్న కదలిక మున్నగునవి ఆకాశమున నున్నట్లు, తోచునట్లు, ఉపాధిదోషములు బ్రహ్మమున నున్నట్లు, అగపడును. ఈ ఉపాధి విరాట్ అనంబడుచున్నది. చెఱువునందున్న కొద్దినీరు వ్యష్టిఅనంబడును. మొత్తముమీద నీరంతయు అనగా, చెఱువు సమిష్టి, అట్లే హిరణ్యగర్భుడు సమిష్టి, జీవుడు వ్యష్టి.

ఇతనికి ప్రాక్తనవాసన లెవ్వియును లేవు. తేజస్సుయొక్క దీప్తియే రూపమైనట్లు, ఆకాశరూపుడగు ఈ బ్రాహ్మణునకు ఆకాశముగాక వేరొక రూపమేమియులేదు.

వేదనామాత్రసంశాంతావీదృశోఽపి నదృశ్యతే
తస్మాత్ యథా చిదాకాశ స్తథా తత్రప్రతిపత్తయః 42

బహిర్ముఖములగు చిత్తవృత్తులు నశించిన ఈతనికి ప్రాతిభాసిక రూపముగూడ ఉండదు. చిదాకాశ స్వరూపమును గ్రహించుటవలననే ఈ బహిర్ముఖ చిత్తవృత్తులుగూడ నశించిపోవును.

కుతః కిలాత్ర పృథ్వ్యాదేః కీదృశః సంభవః కథమ్
ఏతదాక్రమణే మృత్యో తస్మాన్మా యత్నవాన్ భవ. 43
గ్రహీతుం యుజ్యతే వ్యోమ నకదాచన కేనచిత్
శ్రుత్వైతద్విస్మితో మృత్యుర్జగామ నిజమందిరమ్ 44

మృత్యువా! అందువలన నితనికి పృథ్వ్యాదులతో, సంబంధములేదు. ఇతనిని గ్రహింప వ్యర్థముగ యత్నింపవలదు. ఆకాశమును ఎవ్వరును గ్రహింపజాలరు.

ఈ మాటలనువిని మృత్యు వాశ్చర్యపడి నిజమందిరమున కఱిగెను.

శ్రీరామ ఉవాచ:—

బ్రహ్మైష కథితో దేవ స్త్వయా మే ప్రపితామహః
స్వయంభూరజ ఏకాత్మా విజ్ఞానాత్మేతి మే మతిః 45

శ్రీరాముడు:— భగవానుడా! మీరు స్వయంభువును, అజుడును, ఏకాత్ముడును విజ్ఞానమయుడునునగు నా ముత్తాతను గుఱించియే చెప్పినారనుకొందును.

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

ఏవమేతన్మయా రామ బ్రహ్మైష కథిత స్తవ
వివాదమకరో న్మృత్యుర్యమేనైతత్ కృతే పురా. 46
మన్వంతరే సర్వభక్షో యదా మృత్యుర్హరన్ ప్రజాః
బలమేత్యబ్జజాక్రాంతా వారంభమకరోత్ స్వయం. 47
తదైవ ధర్మరాజేన యమేనాశ్వనుశాసితః
యదేవ క్రియతే నిత్యం రతిస్తత్రైవ జాయతే. 48

వసిష్ఠుడు:— అవును. నీకా బ్రహ్మనుగుఱించియే చెప్పితిని. పూర్వము మృత్యువీతని గ్రహించునిమిత్తమే, యమునితో సంభాషించెను. మన్వంతర సమయమున జీవులనందరిని భక్షించి బ్రహ్మ నాక్రమింపదలచినప్పుడు, యముడిట్లు ఉపదేశించెను. ఎవడేకార్యము నాచరించుచుండునో, అతనికావిషయమున అతిసహజముగనే ప్రవృత్తి జనించుచుండును, కనుకనే మృత్యువు బ్రహ్మను భక్షింప బ్రయత్నించెను.



బ్రహ్మాకిల పరాకాశవపురాక్రమ్యతే కథమ్
మనోమాత్రంచ సంకల్పః పృథ్వ్యాదిరహితాకృతిః 49
యశ్చిద్వ్యోమచమత్కారః కిలాకారానుమూర్తిమాన్
స చిద్వ్యోమైవ నో తస్య కారణత్వం న కార్యతా. 50

ఈ బ్రహ్మ ఆకాశశరీరి. మృత్యు వీతని నెట్లాక్రమింపగలదు. ఈతడు మనోమాత్రుడు; పృథ్వ్యాది ఆకారములేనట్టి సంకల్పమాత్రుడు. చిదాకాశరూపుడనని భావించువాడు. చిదాకాశమేయగును. ఇట్టివాడు, కారణవిహీనుడును, అనుత్పాద్యుడునునగును.

ఆకాశస్ఫురదాకారః సంకల్పపురుషోయథా
పృథ్వ్యాదిరహితో భాతి స్వయంభూర్భాసతే తథా. 51

మనస్సున సంకల్పింపఁబడిన పురుషుడగపడునట్లు, ఇంద్రనీలకటకహారుడును, పృథ్వ్యాది భూతసంబంధరహితుడును, స్వయంభువునగు ఈ బ్రహ్మ ప్రకాశించుచున్నాడు.

నిర్మలే వ్యోమ్ని ముక్తాలీ సంకల్పస్వప్నయోః పురమ్
అపృథ్వ్యాది యథా భాతి స్వయంభూర్భాసతే తథా. 52

భూతపంచక సంబంధములేకున్నను నిర్మలాకాశమున ముత్యములున్నట్లు, భ్రమకలుగునట్లును స్వప్నముననను, చింతాసమయముననను నగరము గన్పించునట్లు, ఈ స్వయంభువు శరీరమగపడుచున్నది.

న దృశ్యమస్తి న ద్రష్టా పరమాత్మని కేవలే
స్వయం చితా తథాప్యేష స్వయంభూరితి భాసతే. 53

ఈయన కేవలము పరమాత్ముడు. అందువలన ఈయనయందు దృశ్యత్వ, ద్రష్టృత్వము లేవియులేవు. చిన్మాత్ర స్వభావుడయ్యు, స్వయంభువుగ ప్రకాశించుచున్నాడు.

సంకల్పమాత్ర మేవైతన్మనో బ్రహ్మేతి కథ్యతే
సంకల్పాకాశపురుషో నాస్య పృథ్వ్యాది విద్యతే. 54

సంకల్పమే (భావించుట) మనస్సుయొక్క రూపము; ఈ మనస్సనే అనగా మనోభావమును దాల్చిన చైతన్యమునే బ్రహ్మమందురు. ఈ సంకల్పాకాశ పురుషునియందు పృథ్వ్యాది భూతములులేవు.

యథా చిత్రకృదంతఃస్థా నిర్దేహా భాతి పుత్రికా
తథైవ భాసతే బ్రహ్మా చిదాకాశాచ్ఛరంజనమ్. 55

చిత్రకారుని మనస్సున మున్ముందట దేహహీనమగు చిత్రముదయించునట్లు, ఈ బ్రహ్మ, చిదాకాశమున ప్రతిబింబ గ్రాహకమును, శుద్ధమునునగు మనస్స్వరూపమున ఉదయించి, ప్రకాశించును.

చిద్వ్యోమకేవల మనంత మనాదిమధ్యమ్
బ్రహ్మేతి భాతి నిజచిత్తవశాత్ స్వయంభూః
ఆకారవానివ పుమానివ వస్తుతస్తు
వంధ్యాతనూజ ఇవ తస్యతు నాస్తిదేహః. 56

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే ఉత్పత్తి ప్రకరణే
ఆద్యసృష్టి కర్తృవర్ణనం నామ ద్వితీయః సర్గః ॥ 2 ॥

ఆదిమధ్యాంతరహితమును, కేవలమునునగు చిదాకాశమే ఈ బ్రహ్మ. ఈయన స్వయంభువయ్యు, చిత్తమువలన ఆకారయుతుడగు పురుషునివలె ప్రకాశించుచున్నాడు. కాని, వాస్తవమునకు, వంధ్యాపుత్రునకు శరీరములేనట్లు, ఇతనికిని శరీరములేదు.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు ఉత్పత్తి ప్రకరణమున
ఆద్యసృష్టి వర్ణనమను ద్వితీయ సర్గము ॥ 2 ॥

---

## తృతీయః సర్గః

శ్రీ రామ ఉవాచ:—

ఏవమేవ మనః శుద్ధం పృథ్వ్యాదిరహితం త్వయా
మనో బ్రహ్మేతి కథితం సత్యం పృథ్వ్యాది వర్జితమ్. 1
తదత్ర ప్రాక్తనీ బ్రహ్మన్ స్మృతిః కస్మాన్న కారణమ్
యథా మమ తవాన్యస్య భూతానాం చేతి మే వద. 2

శ్రీరాముడు:— బ్రహ్మజ్ఞా! మీరుమనస్సును శుద్ధమనియు, పృథ్వ్యాది భూతరహితమనియు వర్ణించియున్నారు. ఈ మనస్సే బ్రహ్మయనిగూడ నుడివినారు. సరియే. కాని, మీకును, నాకును, తదితరులకును శరీరమునుదాల్చుటకు ప్రాక్తనస్మృతి కారణమైనట్లు, బ్రహ్మకుగూడ కారణమనిన దోషమేమి? వచింపుడు! ♦

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

పూర్వదేహోఽస్తి యస్యాద్య పూర్వకర్మసమన్వితః
తస్య స్మృతిః సంభవతి కారణం సంసృతిస్థితేః. 3
బ్రహ్మణః ప్రాక్తనం కర్మ యదా కించిన్న విద్యతే
ప్రాక్తనీ సంస్మృతిస్తస్య తదోదేతి కుతః కథమ్. 4
తస్మాదకారణం భాతి వాస్వచిత్తైకకారణమ్
స్వకారణాదనన్యాత్మా స్వయంభూః స్వయమాత్మవాన్. 5

---

♦ వాసనాజాలమే మనస్సని వసిష్ఠుడు పూర్వము చెప్పియున్నాడు. అగుచో, మనోరూపుడగు బ్రహ్మకు ప్రాక్తనవాసనలేవియు లేవనుటకు ఎట్లు వీలుపడును? అందువలన, యీ ప్రశ్న ఉత్థాపితమైనది.



ఆతివాహిక ఏవాసౌ దేహోఽస్త్యస్య స్వయంభువః
న త్వాధిభౌతికో రామ దేహోఽజస్యోపపద్యతే. 6

వసిష్ఠుడు:— పూర్వకర్మలతోగూడిన లింగదేహమున్నవారికే ప్రాక్తనస్మృతి శరీరమును దాల్చుటకు కారణమగును. బ్రహ్మకు ప్రాక్తనకర్మలేలేవు; మరింక, అతనికిప్రాక్తనస్మృతి ఎట్లుండును? అది ఎట్లు జన్మకు కారణమగును? అందువలన, అతని శరీరము దానియంతట నదే ఉత్పన్నమైనదని జెప్పబడుచున్నది. లేక, చిత్స్వరూపమగు మనస్సే అతని శరీరమునకు కారణమనినను అనవచ్చును. ఈ చిత్పదార్థమునుండి అతడు భిన్నుడుగాడు. అందువలననే, ఇతనిని స్వయముగ జన్మించినాడంటిమి, స్వయంభువని పేర్కొంటిమి. రామా! ఈతని దేహమాతివాహికము. ♦ జన్మరహితుడగు యీతనికి సామాన్యములగు పంచభూతములతో నిర్మింపబడిన శరీరములేదు.

శ్రీ రామ ఉవాచ:—

ఆతి వాహిక ఏకోఽస్తి దేహోఽన్యస్త్వాధిభౌతికః
సర్వాసాం భూతజాతీనాం బ్రహ్మణోఽస్త్యేక ఏవకిమ్. 7

శ్రీరాముడు:— ప్రాణులందరికిని ఆతివాహిక, ఆధిభౌతిక శరీరములు రెండును ఉన్నవి. బ్రహ్మకొక్క ఆతివాహిక శరీరమే యుండుటకు కారణమేమి? వచింపుడు.

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

సర్వేషామేవ దేహౌ ద్వౌ భూతానాం కారణాత్మనామ్
అజస్య కారణాభావాదేక ఏవాతివాహికః. 8
సర్వాసాం భూతజాతీనామేకోఽజః కారణం పరమ్
అజస్య కారణం నాస్తి తేనాసావేక దేహవాన్. 9

వసిష్ఠుడు:— పంచభూతాది కారణములతోగూడిన ప్రాణులందరకును, రెండు శరీరములున్నవి. కాని జన్మరహితుడగు బ్రహ్మకు కారణమేమియు లేకుండుటవలన, శరీరమొక్కటిమాత్రమే యున్నది. జన్మరహితుడగు ఈ బ్రహ్మయే భూతములన్నిటికిని పరమకారణము. ఇతనికింకొక కారణము లేకుండుటవలన, ఆతివాహిక శరీరమొక్కటిమాత్రమేయున్నది.

నాస్త్యేవ భౌతికో దేహః ప్రథమస్య ప్రజాపతేః
ఆకాశాత్మాచ భాత్యేవ ఆతివాహికదేహవాన్. 10

ప్రథముడగు ఈ ప్రజాపతికి భౌతిక శరీరము లేదు; ఈతడాతివాహిక దేహధారి, చిదాకాశరూపమున ప్రకాశించుచున్నాడు.

చిత్తమాత్ర శరీరోఽసౌ న పృథ్వ్యాదిక్రమాత్మకః
ఆద్యః ప్రజాపతిర్వ్యోమవపుః ప్రతనుతే ప్రజాః. 11

---

♦ అర్చిరాది మార్గముల ననుసరించి పుణ్యలోకముల కరుగు సూక్ష్మదేహము "ఆతివాహిక" మనంబడుచున్నది. పృథివ్యాది పంచభూతములతో నిర్మింపబడినది "ఆధిభౌతిక" మనంబడును.—అను.

ఈ బ్రహ్మ సంకల్పమాత్ర శరీరుడు, పృథ్వ్యాది భూతముల క్రమసంబంధ మీతనికి లేదు. ప్రథముడగు ఈ ప్రజాపతి ఆకాశశరీరమునుదాల్చి ప్రజాసమూహమును సృష్టించినాడు.

తాశ్చ చిద్వ్యోమరూపిణ్యో వినాన్యైః కారణాంతరైః
యద్యత స్తత్తదేవేతి సర్వైరేవాను భూయతే. 12

ఈ ప్రజలందరునుగూడ ఆకాశస్వరూపులే కారణాంతర సహాయ్యములేకుండ జన్మించిన వస్తువు, అది ఎద్దానినుండి జన్మించినదో దానినుండి వేరుకాదనువిషయ మందఱికిని తెలిసినదే.

నిర్వాణమాత్రం పురుషః పరోభోధః స ఏవచ
చిత్తమాత్రం తదేవాస్తే నాయాతి వసుధాదితామ్. 13

పరమబోధస్వరూపుడగు పురుషుడు భ్రాంతివలన చిత్తమాత్రుడైనను, వాస్తవమున కాతడు చిదాకాశస్వరూపుడే. అతడు భౌతిక పురుషుడు గమారడు

సర్వేషాం భూతజాతానాం సంసారవ్యవహారిణామ్
ప్రథమోఽసౌ ప్రతిస్పంద శ్చిత్తదేహః స్వతోదయః. 14

సంసారమున జరించుజీవు లందరికిని యీతడే మొదటి కారణము; అహంకార మీతని నుండియే జన్మించినది.

అస్మాత్ పూర్వాత్ ప్రతిస్పందా దనన్యైతత్స్వరూపిణీ
ఇయం ప్రవిసృతా సృష్టిః స్పందసృష్టిరివానిలాత్. 15

వాయువునుండి చలనము గలుగునట్లు, మొదటి కదలికయగు యీ బ్రహ్మనుండి అట్టివారేయగు ప్రజలువిస్తరిల్లిరి.

ప్రతిభానాకృతేరస్మాత్ ప్రతిభామాత్రరూపధృక్
విభాత్యేవమయం సర్గః సత్యానుభవవాన్ స్థితః. 16

ఈ జీవ సమూహము పరమార్థ చిన్మాత్రాకారుడగు బ్రహ్మనుండి జన్మించినది. అందువలన నియ్యదియు చిన్మాత్రాకారమే; కాని జడాకారమున ప్రకాశించుచున్నది. ఇదియే సత్యమని జీవుడు తలపోయుచున్నాడు.

దృష్టాంతోఽత్ర భవత్స్వప్నపురస్త్రీ సురతం యథా
అసదప్యర్థసంపత్త్యా సత్యానుభవభాసురమ్. 17

అసద్వస్తువు సత్యమట్లు కార్య మొనర్చుననుటకు దృష్టాంతము- స్వప్నస్త్రీసంగమము అలీకమయ్యు (ధాతుక్షయాది) కార్యకారి యగుటవలన, సత్యమట్లే కన్పించుచున్నది.

అపృథ్వ్యాదిమయో భాతి వ్యోమాకృతిరదేహకః
సద్దేహ ఇవ భూతేశః స్వాత్మభూః పురుషాకృతిః 18

భూతేశ్వరుడును, నిరాకారుడును, నగు స్వయంభువు భూతరహితుడును, దేహహీనుడునయ్యు దేహివలె ప్రకాశించుచున్నాడు.



సంవిత్సంకల్పరూపత్వాన్నోదేతి సముదేతిచ
స్వాయత్తత్వాత్ స్వభావస్య నోదేతి నచ శామ్యతి. 19

సంకల్పరూపియును స్వస్థితుడును నగు ఈ స్వయంభువు ఉదయించునట్లగపడుట, యని భ్రాంతివలననే; పారమార్థికముగ నితడుదయించుటలేదు.

బ్రహ్మా సంకల్పపురుషః పృథ్వ్యాదిరహితాకృతిః
కేవలం చిత్తమాత్రాత్మా కారణం త్రిజగత్ స్థితేః 20

పృథ్వ్యాది వివర్జిత చిత్తమాత్ర శరీరుడును; సంకల్ప పురుషుడునునగు ఈ బ్రహ్మ, ముల్లోకముల స్థితికి గారణ మగుచున్నాడు.

సంకల్ప ఏవ కచతి యథా నామ స్వయంభువః
వ్యోమాత్మైవ తథా భాతి భవత్ సంకల్పశైలవత్. 21

ప్రాణుల కర్మల ననుసరించి సంకల్ప మెట్టిరూపమును దాల్చునో, అట్టిరూపమునే వ్యోమాత్ముడగు ఈ స్వయంభువు దాల్చును, ఒకానొక పర్వతమును నీ వెట్లు తలతువో, అది ఆ రూపముననే నీచిత్తవృత్తియందు ప్రతిఫలించునుగదా!

ఆతివాహికమేవాంతర్విస్మృత్యా దృఢరూపయా
ఆధిభౌతికబోధేన ముధా భాతి పిశాచవత్. 22

జీవులు అంతరమును విస్మరించి, తమ నిరాకారరూపమును మరచి, పిశాచమువలె పాంచభౌతిక శరీరమున ప్రకాశించుచున్నారు.

ఇదం ప్రథమతోద్యోగసంప్రబుద్ధం మహాచితేః
నోదేతి శుద్ధసంవిత్త్వాదాతివాహిక విస్మృతిః. 23

మాయతోగూడి లోకముల సృజించిన మూలకారణము సూక్ష్మభూతాత్మకము; దీని సంకల్పబలముననే ప్రత్యక్షజగత్తు ఆవిర్భవించుచున్నది. ఇది తమోరహితమగు శుద్ధసంవిత్స్వరూపము; అందువలన నిది అతివాహిక భావమును గోల్పోవదు.

ఆధిభౌతిక జాతేన నాస్యోదేతి పిశాచికా
అసత్యా మృగతృష్ణేవ మిథ్యా జాడ్యభ్రమప్రదా. 24

నెంనెప్పుడట పాంచభౌతికశరీరము లుత్పన్నములగుటలేదు. అందువలన నప్పుడు ఎండమావివలె మిథ్యయును, భ్రమదాయకమునునగు పిశాచము పీడింపజాలదు,

మనోమాత్రం యదా బ్రహ్మా న పృథ్వ్యాదిమయాత్మకః
మనోమాత్ర మతోవిశ్వం యద్యజ్జాతం తదేవ హి. 25

బ్రహ్మమనోమయుడు: పృథ్వ్యాది స్వరూపుడు గాడు, అందువలన యీ విశ్వము మనోమయమునియు, భూతసంబంధరహితమనియు, [illegible] కార్యము [illegible] కారణమునుండి భిన్నము కాదు.

అజస్య సహకారీణి కారణాని న సంతియత్
తజ్జస్యాపి న సంత్యేవ తాని తస్మాత్తు కానిచిత్. 26

జన్మరహితుడగు బ్రహ్మకెట్టిసహకారి కారణములును లేవు. అందువలన, ఆ బ్రహ్మనుండి జనించిన జగత్తునకుగూడ ఎట్టి సహకారి కారణములును లేవు.

కారణాత్ కార్య వైచిత్ర్యం తేన నాత్రాస్తి కించన
యాదృశం కారణం శుద్ధం కార్యం తాదృగితి స్థితమ్. 27

కార్యకారణముల కేమాత్రమును భేదములేదు కాన, కారణమెట్టిదో, కార్యముగూడ అట్టిదే యగునని తెలుచున్నది.

కార్యకారణతా హ్యత్ర న కించిదుపపద్యతే
యాదృగేవ పరంబ్రహ్మ తాదృగేవ జగత్త్రియమ్. 28

కార్యకారణముల కెట్టి భేదమును లేనందువలన, పరబ్రహ్మమెట్టిదో జగత్త్రియముగూడ అట్టిదేయను విషయమున సందేహములేదు.

మనస్తామివ యాతేన బ్రహ్మణా తన్యతే జగత్
అనన్యదాత్మనః శుద్ధాద్ద్రవత్వమివ వారిణః. 29

బ్రహ్మ మనోభావాపన్నుడై, యీ జగత్తును సృష్టించినాడు. నీటినుండు ద్రవత్వము వేరుగానట్లు, యీజగత్తుకూడ విశుద్ధమగు ఆత్మతత్త్వమునుండి వేరుకాదు.

మనసా తన్యతే సర్వమసదేవేదమాతతమ్
యథా సంకల్పనగరం యథా గంధర్వపత్తనమ్. 30

మనస్సే, సంకల్పనగర, గంధర్వపురములవలె మిథ్యయగు యీ విశాల ప్రపంచమును గల్పించుచున్నది.

ఆధిభౌతికతా నాస్తి రజ్జ్వామివ భుజంగతా
బ్రహ్మాదయః ప్రబుద్ధాస్తు కథం తిష్ఠంతి తత్ర తే. 31

త్రాటియందు సర్పత్వములేనట్లు, వాస్తవమునకు భూతత్త్వమీ జగత్తున లేదు. బ్రహ్మాదులు తత్త్వజ్ఞులు, ఇక వారియందా భూతత్త్వముండునది?

ఆతివాహిక ఏవాస్తి న ప్రబుద్ధమతేః కిల
ఆధిభౌతిక దేహస్య వాచోవాత్ర కుతః కథమ్. 32

తత్త్వజ్ఞుల కాతివాహిక దేహమేయుండదు. ఇక వారికి యీభౌతికశరీర మెట్లుండును?

మనోనామ్నో మనుష్యస్య విరించ్యాకార ధారిణః
మనోరాజ్యం జగదిదం సత్యరూపమివ స్థితమ్. 33

ఈ జగత్తు, విరించిరూపమునుదాల్చిన మనస్సను మనుజుని మనోరాజ్యమేయైనను, మూఢులకిది సత్యమువలెనే కన్పట్టుచున్నది.



మనఏవ విరించిత్వం తద్ధి సంకల్పనాత్మకమ్
స్వవపుః స్ఫారతాం నీత్వా మనసేదం వితన్యతే. 34

మనస్సే బ్రహ్మ (విరించి) యొక్క శరీరము; యీ మనస్సు సంకల్పాత్మకము. సంకల్పాత్మకమనోరూపియగు యీ విరించియే నిజశరీరమును అనగా, సంకల్పములను విస్తరింపజేసి యీ జగత్తును సృష్టించుచున్నాడు.

విరించో మనసో రూపం విరించస్య మనో వపుః
పృథ్వ్యాది విద్యతే నాత్ర తేన పృథ్వ్యాది కల్పితమ్. 35

బ్రహ్మ, మనస్సుయొక్క రూపము; విరించి శరీరమే మనస్సు, పృథ్వ్యాది భూతములిందు లేవు. కాని, మనస్సువలననే పృథ్వ్యాదిభూతములు గల్పింపబడుచున్నవి.

పద్మాక్షే పద్మినీవాంతర్మనో హ్యస్త్యేవ దృశ్యతా
మనోదృశ్యదృశౌ భిన్నే న కదాచన కేనచిత్. 36

పద్మబీజమున పద్మలత ఇమిడియుండునట్లు మనస్సున యీ దృశ్యసమూహము ఇమిడియున్నవి. మనస్సు, దృశ్యములు వేరని ఎవ్వరును ఏనాడును జెప్పజాలరు. (మనస్సుండుటవలననే దృశ్యమగపడుచున్నది. మనస్సు లయమైన దృశ్యముగూడ లయమైపోవునని భావము.)

యథాచాత్ర తవ స్వప్నః సంకల్పశ్చిత్రరాజ్యధీః
స్వానుభూత్యైవ దృష్టాంతే స్వస్మాద్ధృద్యస్తి దృశ్యభూః. 37

నీవు మనస్సున స్వప్నసంకల్ప మనోరాజ్యములను గాంచునట్లు, దృశ్యమునుగూడ హృదయముననే గాంచుచున్నావు.

తస్మాచ్చిత్తవికల్పస్థపిశాచో బాలకం యథా
వినిహంత్యేవ మేషాంతర్ద్రష్టారం దృశ్యరూపికా. 38
యథాంకురోఽంతర్బీజస్య సంస్థితో దేశకాలతః
కరోతి భాసురం దేహం తనోత్యేవం హి దృశ్యధీః. 39

బాలుని చిత్తమున గల్పింపబడిన పిశాచము బాలుని భయపెట్టి చంపునట్లు, యీదృశ్యపిశాచముగూడ మనుజుల జంపుచున్నది. బీజమున నిమిడియున్న అంకురము తగినదేశకాలములు లభించిన పెద్దచెట్టగునట్లు, మనస్సున నిమిడియున్న యీ దృశ్యముగూడ ఉపయుక్తదేశకాలములు దొరకిన సంకల్పరూపమున ప్రకాశించుచున్నది.

సచ్చేన్న శామ్యతి కదాచన దృశ్యదుఃఖమ్
దృశ్యత్వశామ్యతి న బోదరి కేవలత్వమ్
దృశ్యత్వసంభవతి బోదరి బోద్ధృభావః
శామ్యేత్ స్థితోఽపి హి తదస్య విమోక్షమాహుః. 40

ఇతి ద్వితీయో దశః.

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే ఉత్పత్తి ప్రకరణే
బంధహేతు వర్ణనంనామ తృతీయః సర్గః ॥ 3 ॥

దృశ్యము వాస్తవమైనయెడల (ఇదియెన్నటికిని రూపుమాసిపోదుగాన) దుఃఖశాంతి యెన్నటికిని చేకూరదు; యీదృశ్యముపశమింపని పక్షమున, బోధకైవల్యమును బడయజాలము. దృశ్యము లేకున్న బోధయందు బోద్ధృభావముండదు. యీ బోధ్య-బోద్ధృ (దృశ్య-ద్రష్టృ) భావశాంతియగు కేవలత్వముకే పండితులు మోక్షమనుచున్నారు.

ఇది రెండవ రోజు.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు ఉత్పత్తిప్రకరణమున
బంధహేతు వర్ణనమను తృతీయ సర్గము. ॥ 3 ॥

చతుర్థః సర్గః.

శ్రీ వాల్మీకి రువాచ:—

కథయత్యేవ ముద్దామ వచనే మునినాయకే
శ్రోతుమేకరసే జాతే జనే మౌనముపస్థితే. 1

శాంతేషు కింకిణీజాలర వేషుస్పందనం వినా
పంజరాంతర హారీత శుకేష్వప్యస్తకేలిషు. 2

సువిస్మృతవిలాసాసు స్థితాసు లలనాస్వపి
చిత్రభిత్తావివ న్యస్తే సమస్తే రాజసద్మని. 3

ముహూర్తశేష మభవద్దివసం మధురాతపమ్
వ్యవహారా రవికరైః సహా తానవమాయయుః. 4

వాల్మీకి:- మహాముని వసిష్ఠుఁడు శ్రీరామునకిట్లు పరమోత్కృష్టముగ నుపదేశించుచుండ అటనున్న జనులందరు వినవాసక్తులై నిశ్శబ్దముగానుండి ఏకాగ్రమనస్కులైరి. కింకిణీజాలములు [illegible]తములయ్యెను. పంజరములనున్న శుకహారీతములు తమతమ క్రీడలను విరమించెను. స్త్రీలు తమ విలాసకృత్యములను మరచిరి. అటనున్నవారు చిత్రపటములవలెనిశ్చలముగూర్చొనియుండిరి. ఇట్టిసమయమున సాయంకాలమయ్యెను. ఎండ లేతబడెను. సూర్యకిరణములతోపాటు జనులకార్యములుగూడ పలుచబడెను.

వవురుత్ఫుల్లకమల ప్రకరామోద మాంసలాః
వాయవో మధురస్పందాః శ్రవణార్థ మివాగతాః. 5



పిల్లతెమ్మెరలు వికసితపద్మముల సుగంధముతో నిండి మెల్లగవీచుచు, అతఁడు వాక్యముల వినగోరి అరుదెంచెనా యనునట్లుండెను.

శ్రుతం చింతయితుం భానురివాహోరచనాభ్రమమ్
త్యక్త్వా జగామ శాంత మగమచ్ఛాస్యమస్తగిరే స్తటమ్. 6

దినరచన నొనర్చు సూర్యుఁడు వసిష్ఠోపదేశమును జింతింప అస్తగిరియందలి ఏకాంత ప్రదేశమున కరుగుచున్నాఁడా యనునట్లు తనభ్రమణమును నిల్పెను.

ఉత్తస్థుర్మిహికారంభ సమతా వనభూమిషు
విజ్ఞానశ్రవణాదంతఃశీతలాః శాంతతా ఇవ. 7

జ్ఞానోపదేశ శ్రవణమున లభించిన ఏకరస మనశ్శాంతివలె, తుషారపాతమున ఏకాకారము వనభూమి నాశ్రయించెను.

బభూవురల్పసంచారా జనా దశసు దిక్ష్వపి
సావధానతయా శ్రోతుమివ సంత్యక్తచేష్టితాః. 8

జనులందరును, తమతమ పనులను విడిచి వసిష్ఠోపదేశమును విన నట గుమిగూడినందువలన సాధారణముగ ఆసమయమున నుండవలసిన జనసంచారము లేకుండెను.

ఛాయాదీర్ఘత్వమాజగ్ము ర్వాసిష్ఠం వచనక్రమమ్
ఇవ శ్రోతుమశేషాణాం వస్తూనాం దీర్ఘకంధరాః. 9

అప్పుడు వస్తువుల నీడలన్నియు పొడుగై, వసిష్ఠవాక్యములనువిన నుద్గ్రీవములయ్యెనా, అనిపించుచుండెను.

ప్రతీహారః పురః ప్రహ్వో భూత్వాహ వసుధాధిపమ్
దేవ స్నానద్విజార్చాసు కాలో వ్యతిగతో భృశమ్. 10

అప్పుడు ద్వారపాలకుఁడరుదెంచి, "దేవా! స్నాన, దేవార్చనల కాలము దాటుచున్నది" అని పల్కెను.

తతో వసిష్ఠో భగవాన్ సంహృత్య మధురాం గిరమ్
అద్య తావన్మహారాజ శ్రుతమేతావదస్తు వః. 11

ప్రాతరన్యద్వదిష్యామి ఇత్యుక్త్వా మౌనవానభూత్
ఇత్యాకర్ణ్యైవ మస్త్విత్యుక్త్వా భూపతిర్యాతివృద్ధయే. 12

పుష్పపాద్యార్ఘ్యసన్మాన దక్షిణాదానపూజయా
సదేవర్షి మునీన్ విప్రాన్ పూజయామాస సాదరమ్. 13

ఆ పల్కులనాలించి, వసిష్ఠుఁడు తాను చెప్పుదానిని నిల్పి, "నేఁడింతవఱకు వింటిరి, రేపు మిగిలినదానిని జెప్పెదను" అనిపల్కి యూరకుండెను. రాజు దీని కంగీకరించి, శుభముకొఱకు, దేవ, ఋషి, ముని, విప్రులను అర్ఘ్యపాద్యములతోడను, పుష్పములతోడను, దక్షిణలతోడను, దానములతోడను, సమ్మాన మొనర్చి పూజించెను.

ఋషయో భూమిపాలాశ్చ మునయో బ్రాహ్మణాస్తథా
చేతసీవ విచిత్రార్థాః స్వాస్పదేషు విశశ్రముః. 29

ఋషులును, మునులును బ్రాహ్మణులును, రాజులును మొదలుగాగల వారందరును, వసిష్ఠుని విచిత్రజ్ఞానోపదేశములు హృదయమున విశ్రాంతినందుచున్నట్లు, తమతమ ఆశ్రమముల విశ్రమింప సాగిరి.

యమకాయోపమాశ్యామా యయౌ తిమిరమాంసలా
ఆయయౌ మిహికా స్ఫారా తత్ర తేషాముషః శనైః. 30

యమునివలె భయంకరాకారయగు అంధకార రాత్రి క్రమముగా తొలగిపోవుచుండ హిమములో గూడిన ఉషాదేవి మెల్లగ అరుదెంచుచుండెను.

అంతర్ధానముపాజగ్ముస్తారా నభసి భాసురాః
ప్రభాతపవనేనేవ హృతాః కుసుమవృష్టయః. 31

మలయవాయువుల రాలిన పుష్పములవలె, ఆకసమునుండి నక్షత్రములు మాయమయ్యెను.

దృశ్యతామాజగామార్కః ప్రభోన్మీలితలోచనః
వివేకవృత్తిర్మహతాం మనసీవ సమోదితా. 32

నిద్రించు జనుల లోచనములను విప్పుచు; మహాత్ముల మనస్సున క్రొత్తగ నుదయించిన వివేక వృత్తివలె సూర్యుడగపడెను. (అనగా ఉదయించెను.)

భానోర్భాసా భూషితైస్తైర్మేఘలేశైః
కించిత్ కించిత్ కుంకుమచ్ఛాయయేవ
పూర్వాత్మాభృత్ పీతవాసాః సమేఘై
స్తారాహారః శ్రీయుతః ఖం సమేతః. 33

అప్పుడు, పూర్వాద్రి కుంకుమరంగునుబోలు సూర్యకిరణముల రంజితమైన మేఘశకలముల దాల్చెను. మేఘములను పీతవసనమును, తారలను హారమునుదాల్చి విష్ణునివలె ఆకసమునదోచెను.

సభాం పునరుపాజగ్ముర్నభశ్చరమహీచరాః
వ్యస్తనేన క్రమేణైవ కృతప్రాతస్తనక్రమాః. 34
పూర్వవత్ సన్నివేశేన వివేశ సకలా సభా
బభూవాస్పందితాకారా వాతముక్తేవ పద్మినీ. 35

ఖేచరభూచరలు తమతమ ప్రాతః కృత్యముల నెరవేర్చి అరుదెంచిరి. ముని మొనుకటి యట్లే సభగూడెను. ఆ సభ నిస్పంద పద్మ సరోవరమువలె శోభిల్లెను.

అథ ప్రసంగమాసాద్య రామో మధురయా గిరా
ఉవాచ మునిశార్దూలం వసిష్ఠం వదతాం వరం. 36



అంతట శ్రీ రామచంద్రుడు ప్రసంగమునందుకొని, మునిశ్రేష్ఠుడును, వాగ్మివరుడును నగు వసిష్ఠునితో మధురముగ నిట్లుపల్కెను.

శ్రీ రామ ఉవాచ :—

భగవన్ మనసో రూపం కీదృశం వద మే స్ఫుటం
యస్మాత్ తేనేయమఖిలా తన్యతే లోకమంజరీ. 37

శ్రీ రాముడు:— భగవానుడా! దేనినుండి వెలువడి ఈ జగత్తంతయు ప్రకాశించుచున్నదో, ఆ మనస్సుయొక్క రూపెట్టిదో వివరించి నాకు చక్కగ జెప్పుడు.

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

రామాస్య మనసో రూపం నకించిదపి దృశ్యతే
నామమాత్రాదృతే వ్యోమ్నో యథా శూన్యజడాకృతేః. 38
న బాహ్యే నాపి హృదయే సద్రూపం విద్యతే మనః
సర్వత్రైవ స్థితం చైతద్విద్ధి రామ యథా నభః. 39

వసిష్ఠుడు:— రామా! శూన్యమగు ఆకాశమునకు పేరుగాక వేరొకరూపము లేనట్లు, శూన్యాత్మకమగు మనస్సు కెట్టిరూపమును లేదు. దీనికి లోపలగాని, వెలుపలగాని ఎట్టిరూపము లేదు. అయిన్ను, ఆకాశమువలె సర్వత్ర వెలయుచున్నది.

ఇదమస్మాత్ సముత్పన్నం మృగతృష్ణాంబుసన్నిభమ్
రూపం తు క్షణసంకల్పాద్ద్వితీయేందుభ్రమోపమమ్. 40

ఈ మనస్సునుండియే, మృగతృష్ణనుండి నీరువలె జగత్తు జనించినది. కనుక, దీని యొక్క రూపకల్పనగూడ, నశ్వరసంకల్పజనిత ద్విచంద్ర దర్శనమువలె, భ్రమపూర్ణము.

మధ్యే యదేతదర్థస్య ప్రతిభానం ప్రథాం గతమ్
సతో వాప్యసతో వాపి తన్మనో విద్ధి నేతరత్. 41

సదసద్వస్తువుల ఆకృతిని ప్రకాశించునదే మనస్సని గ్రహింపుము. ఇదిగాక, వేరొండు ఆకృతి దీనికిలేదు.

యదర్థప్రతిభానం తన్మన ఇత్యభిధీయతే
అన్యన్న కించిదప్యస్తి మనో నామ కదాచన. 42

నిరాకారమగు చిత్తు అర్థాకారమున అధ్యవసితమైన, దానినే మనస్సనుచున్నారు. ఇదిగాక, దీని కింకొక రూపములేదు.

సంకల్పనం మనో విద్ధి సంకల్పాత్తన్న భిద్యతే
యథా ద్రవత్వాత్ సలిలం తథా స్పందో యథానిలాత్. 43

సంకల్పమే మనస్సు; ద్రవత్వమునుండి నీరును, చలనమునుండి వాయువును వేరుగానట్లు మనస్సుగూడ సంకల్పముకంటె భిన్నముకాదు.

శ్రీరాముడు:- బ్రహ్మజ్ఞా! సత్తునకు వినాశములేదు. అసత్తున కుత్పత్తిలేదు. ఎడతెగని దోషములతో నిండి సద్వస్తువువలె ప్రకాశించు ఈ దృశ్యమును అసత్తని గ్రహింపలేకున్నాను. కనుక, శ్రమను, దుఃఖమును గలిగించు ఈ దృశ్య - విషూచిక ఎట్లు, శాంతించునో వచింపుడు.

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

అస్య దృశ్యపిశాచస్య శాంత్యై మంత్రమిమం శృణు
రామాత్యంతమయం యేన స్మృతిమేష్యతి నంక్ష్యతి. 61

వసిష్ఠుడు:- రామా! ఈ దృశ్యపిశాచము శాంతించు మంత్రమును జెప్పుచున్నాను, వినుము. దీనిని వినిన దృశ్యముపశమించును. చేతనమువలె గన్పడు దేహములు మృతించుచున్న (దేహాత్మభ్రాంతి తొలగుచున్న) అచేతన వస్తువులు రూపుమాసిపోవునని వేరుగ చెప్పవలెనా?

యదస్తి తస్య నాశోఽస్తి నకదాచన రాఘవ
తస్మాత్తన్నష్టమప్యంత ర్బీజభూతం భవేద్ధృది. 62

రాఘవా! ఉన్న దానికి (సద్వస్తువునకు) నాశన మెప్పటికిని సంభవింపదు. (తరువాత అరు దెంచు అవస్థలవలన) పూర్వావస్థ మార్పుకలిగిన, మార్పునందవచ్చును. అవస్తువుయొక్క బీజము (సంస్కారము) సుషుప్తి కాలమున బుద్ధియందును, ప్రళయకాలమున ప్రకృతియందును అణగియుండును.

స్మృతిబీజాచ్చిదాకాశే పునరుద్భూయ దృశ్యధీః
లోకశైలాంబరాకారం దోషం వితనుతేఽతనుమ్. 63

ఈ సంస్కారరూప జగత్తు మరల (సుషుప్త్యనంతరము, లేక ప్రళయానంతరము) చిదాకాశమున లోక పర్వతాది ద్రష్టృ - దృశ్యరూపమున ప్రకాశితమగును.

ఇత్యనిర్మోక్షదోషః స్యాన్నచ తస్యేహ సంభవః
యస్మాద్దేవర్షి మునయో దృశ్యంతే ముక్తిభాజనమ్. 64

ఇట్లనిన ముక్తి అసంభవ మగునంటువా? అనవీలుపడదు. ఏలయన, దేవ, ఋషిమునులు పల్వురు జీవన్ముక్తులగపడుచున్నారు.

యది స్యాజ్జగదాదీదం తస్మాన్మోక్షో నకస్యచిత్
బాహ్యస్థమస్తు హృత్స్థంవా దృశ్యం నాశాయ కేవలమ్. 65

దృశ్యము బయటనుండిన నుండు గాక! దీనివలన గలుగు నష్ట మేమియును లేదు. అదిలోపల హృదయమునున్న, నాశకారణ మగును. ముక్తి లభింపదు.

తస్మాదిమాం ప్రతిజ్ఞాం త్వం శృణు రామాతిభీషణామ్
యాముత్తరేణ గ్రంథేన నూనం త్వమవబుద్ధ్యసే. 66

ఓ, రామా! నాయొక్క భయంకర ప్రతిజ్ఞను వినుము. దీనిని ముందు వివరించి నీకు దెలియబరతును.

అయమాకాశభూతాది రూపోఽహంచేతి లక్షితః
జగచ్ఛబ్దస్య నామార్థో ననునాస్త్యేవ కశ్చన. 67



యదిదం దృశ్యతే కించిద్దృశ్యజాతం పురోగతమ్
పరబ్రహ్మైవ తత్సర్వమజరామరమవ్యయమ్. 68

పూర్ణే పూర్ణం ప్రసరతి శాంతే శాంతం వ్యవస్థితమ్
వ్యోమన్యేవోదితం వ్యోమ బ్రహ్మణి బ్రహ్మతిష్ఠతి. 69

నదృశ్యమస్తి సద్రూపం నద్రష్టా నచదర్శనమ్
నశూన్యం నజడం నో చిచ్ఛాంతమేవేదమాతతమ్. 70

ఎట్టయెదుట గనంబడు ఆకాశాది భూతములును, లోని 'అహం' ప్రభృతులును వ్యవహార దశయందు మాత్రమే జగత్తనంబడును; కాని, పరమార్థదశయందు అజరామరావ్యయమగు బ్రహ్మమే; బ్రహ్మముగాక, జగత్తను వేరొక పదార్థములేదు. పూర్ణమున పూర్ణుని ప్రకాశమూ, శాంతమున శాంతుని ఉనికి, ఆకాశమున ఆకాశము, బ్రహ్మమున బ్రహ్మమును ఉన్నవి. వాస్తవమునకు, దృశ్య, ద్రష్టృ దర్శనములులేవు. ఇవి శూన్యములుకావు, లేక జడములునుకావు; కేవలము శాంతిమయములు.

శ్రీరామ ఉవాచ:—

వంధ్యాపుత్రేణ పిష్టోఽద్రిః శశశృంగం ప్రగాయతి
ప్రసార్య భుజసంపాతం శిలా నృత్యతి తాండవమ్. 71

స్రవంతి సికతాస్తైలం పఠంత్యుపలపుత్రికాః
గర్జంతి చిత్రజలదా ఇతీవేదం వచః ప్రభో. 72

జరామరణదుఃఖాది శైలాకాశమయం జగత్
నాస్తీతి కిమిదం నామ భవతాఽపి మమోచ్యతే. 73

యథేదం నస్థితం విశ్వం నోత్పన్నం నచవిద్యతే
తథా కథయ మే బ్రహ్మన్ యేనైతన్నిశ్చితం భవేత్. 74

శ్రీరాముడు:- ప్రభూ! వంధ్యాపుత్రుడు పర్వతమును చితుకగొట్టుచున్నాడు, కుందేటి కొమ్ము గానమొనర్చుచున్నది, చేతులుజాపి రాయితాండవ మొనర్చుచున్నది, ఇసుక చమురును కార్చుచున్నది, రాతిబొమ్మ చదువుచున్నది, చిత్రమేఘములు గర్జించుచున్నవి - ఈ వాక్యములవంటిదే మీ మాటకూడ. జరామరణ దుఃఖసంకులమై, పర్వతాకాశమయమగు సంసారమే లేకున్న, నేను గాంచునదేమి? ఈవిశ్వము, పూర్వము లేదు. ఉత్పన్నమవలేదు, ఇప్పుడును లేదు. దీని అర్థమేమి? నాకు వివరించి చెప్పుడు.

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

నాసమన్వితవాగస్మి శృణు రాఘవ కథ్యతే
యథేదమసదాభాతి వంధ్యాపుత్ర ఇవాఽరవీ. 75

ఇదమాదావనుత్పన్నం సర్గాదౌ తేన నాస్త్యలమ్
ఇదంహి మనసో భాతి స్వప్నాదౌ పత్తనం యథా. 76

యస్మాద్విష్ణ్వాదయో దేవాః సూర్యాదివ మరీచయః
యస్మాజ్జగంత్యనన్తాని బుద్బుదా జలధేరివ. 9
యం యాంతి దృశ్యవృందాని పయాంసీవ మహార్ణవం
య ఆత్మానం పదార్థంచ ప్రకాశయతి దీపవత్. 10
య ఆకాశే శరీరేచ దృషత్స్వప్సు లతాసుచ
పాంసుష్వద్రిషు వాతేషు పాతాలేషుచ సంస్థితః. 11
యః ప్లావయతి సంరబ్ధం పుర్యష్టకమితస్తతః
యేన మూకీకృతా మూఢాః శిలా ధ్యానమివాస్థితాః. 12
వ్యోమ యేన కృతం శూన్యం శైలా యేన ఘనీకృతాః
ఆపో ద్రుతాః కృతా యేన దీప్తో యస్య వశో రవిః. 13

సూర్యునినుండి కిరణములు వెలువడునట్లు దీనినుండియే బ్రహ్మ, విష్ణువు మొదలగు దేవతలు వెలువడుచున్నారు; సముద్రమునుండి బుడగలు వచ్చునట్లు, జగత్తులు దీనినుండియే వచ్చుచున్నవి. నదులు సముద్రాభిముఖములగునట్లు, దృశ్యములన్నియు దీనిపై పునకే చనుచున్నవి. ఇది దీపమువలె, తన్ను ఇతరపదార్థములను ప్రకాశింపజేయుచున్నది. ఇదియే ఆకాశమున, మనశరీరమున, శిలలయందు, పర్వతముల, వాయువున, పాతాళమున, వెలయుచున్నది. ఇదియే కర్మేంద్రియములను, జ్ఞానేంద్రియములను, తమతమపనుల నొనర్చునట్లు జేయుచున్నది. దీనివలననే మూఢులు మూగలగుచున్నారు. ఇదియే శిలలను నిశ్చలములుగను, ఆకాశమును శూన్యముగను, పర్వతములను కఠినములుగను, జలమును పలుచగను నొనర్చినది. దీప్తుడగు రవి దీని ప్రశాసనముననే ప్రకాశించుచున్నాడు.

ప్రసరంతి యతశ్చిత్రాః సంసారాసారవృష్టయః
అక్షయామృతసంపూర్ణాదంభోదాదివ వృష్టయః. 14
ఆవిర్భావతిరోభావమయాస్త్రిభువనోర్మయః.
స్ఫురంత్యతితతే యస్మిన్ మరావివ మరీచయః. 15
నాశరూపోఽవినాశాత్మా యోఽంతస్థః సర్వజంతుషు
గుప్తోయోఽవ్యతిరిక్తోఽపి సర్వభావేషు సంస్థితః. 16
ప్రకృతివ్రతతిర్వ్యోమ్ని జాతా బ్రహ్మాండ సత్ఫలా
చిత్తమూలేంద్రియదలా యేన నృత్యతి వాయునా. 17
యశ్చిన్మణిః ప్రకచతి ప్రతిదేహసముద్గకే
యస్మిన్నిందా స్ఫురంత్యేతా జగజ్జాలమరీచయః. 18

నిండుమేఘములనుండి ఎడతెగని వర్షము కురియునట్లు, అక్షయసుఖముతో నిండిన ఈ పరమవస్తువునుండియే సంసారమను ఈ అసారవృష్టి కురియుచున్నది. మరుభూమియందు మరీచికలవలె, త్రిభువన తరంగములు దీనినుండియే వెలువడుచు, పోవుచున్నవి. ఇదియే సర్వభూతముల మధ్యనుండి శాశ్వతమయ్యు అశాశ్వతమువలె గన్పట్టుచున్నది. మహాత్తరమయ్యు అందరయందున సమానభావమున వెలయుచున్నది. ఇదియే వాయువువలె, చిదాకాశమున ఇంద్రియదళములతోడను, బ్రహ్మాండ ఫలముల



తోడను, చిత్-మూలముతోడను గూడియున్న ప్రకృతియను లతను నాట్యమాడింపజేయుచున్నది. ఇదియే దేహములను పెట్టెలలో చిన్మయమగు మనస్సునుంచినది. చంద్రునినుండి కిరణములు వెలువడునట్లు దీనినుండియే సృష్టులు వెలువడుచున్నవి.

ప్రశాంతే చిద్ఘనే యస్మిన్ స్ఫురంత్యమృతవర్షిణి
ధారాజలాని భూతాని సృష్టయస్తడితః స్ఫుటాః. 19
చమత్కుర్వంతి వస్తూని యదాలోకతయా మిథః
అసజ్జాతమసద్యేన యేన సత్ సత్త్వమాగతమ్. 20
చలతీదమనిచ్ఛస్య కాయో యో యస్య సన్నిధౌ
జడం పరమరక్తస్య శాంతమాత్మని తిష్ఠతః. 21
నియతిర్దేశకాలౌచ చలనం స్పందనం క్రియా
ఇతి యేన గతాః సత్తాం సర్వసత్తాతిగామినా. 22
శుద్ధసంవిన్మయత్వాద్యః ఖం భవేద్వ్యోమచింతయా
పదార్థచింతయార్థత్వమివ తిష్ఠత్యధిష్ఠితః. 23

ఈ చిదాకాశముననే సృష్టియను విద్యుత్తు ప్రకాశించుచున్నది. ప్రాణమను వర్షము గురియుచున్నది. దీని ప్రభావము వలననే వస్తువులన్నియు ప్రకాశించుచున్నవి. ఇదియే అసద్వస్తువులను గల్పించినది. దీనివలననే సద్వస్తువులకు సత్త ఏర్పడినది. దీనిసన్నిధిని ఉండుటవలననే జడమగు శరీరము చలించుచున్నది. నియతి, దేశకాలములు, చలనస్పందనాదిక్రియలును, అన్ని సత్తలనుదాటిపోవు దీని సత్తవలననే జరుగుచున్నవి. శుద్ధచిన్మయమగు ఈ పరమవస్తువే, ఆకాశమును, పదార్థములను చింతించి ఆయారూపములను దాల్చుచున్నది.

కుర్వన్నపీహ జగతాం మహతామనంత
వృందం నకించన కరోతి నకాశ్చనాపి
స్వాత్మన్యనస్తమయసంవిది నిర్వికారే
త్యక్తోదయస్థితిమతి స్థిత ఏక ఏవ. 24

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే ఉత్పత్తిప్రకరణే మూలకారణ
దేవస్వరూప వర్ణనంనామ పంచమః సర్గః ॥ 5 ॥

ఆపరమవస్తువే ఈ విశాలబ్రహ్మాండమును సృష్టించియు, ఏమియును ఒనర్పనట్లగపడుచున్నది. ఇది నిర్వికల్పము. ఉదయాస్తమయములు, స్థితిగతులు దీనికిలేవు. ఇది, అప్పుడు, నిర్వికార-అద్వైత-ఆత్మయందు నిలిచియుండెను; ఇదిగాక ఆసమయమున వేరొక వస్తువు లేకుండెను.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు, ఉత్పత్తిప్రకరణమున
మూలకారణ దేవస్వరూపవర్ణనమను పంచమ సర్గము. ॥ 5 ॥

## షష్ఠః సర్గః.

[illegible]

(శ్రీ) వసిష్ఠ ఉవాచః—

అస్య [illegible] దేవాదిదేవస్య పరస్య పరమాత్మనః
జ్ఞానాదేవ పరా సిద్ధిర్న త్వనుష్ఠానదుఃఖతః. 1

వసిష్ఠుడు:– దేవదేవుడగు ఆ పరమాత్మనితో ఏకత్వము జ్ఞానయోగమువలననే లభించును. ఇతరములును, క్లేశకరములును [illegible] అనుష్ఠానములవలన సిద్ధిలభింపదు. [illegible]

అత్ర జ్ఞానమనుష్ఠానం నత్వన్యదుపయుజ్యతే
మృగతృష్ణాజలభ్రాన్తి శాన్తౌ చేదం నిరూపితమ్. 2

ఈసంసారభ్రమ మృగతృష్ణయందు జలభ్రమవంటిది; ఈభ్రమను శాంతింపజేయు ఉపాయము తత్త్వజ్ఞానమొక్కటియే యని [illegible], క్షత్రములు [illegible] సాయపడజాలవు.

నహ్యేష దూరే నాభ్యాశే నాలభ్యో విషమే న చ
స్వానందాభాసరూపోఽసౌ స్వదేహాదేవ లభ్యతే. 3

[illegible] ఈ పరమాత్మ దూరస్థుడుకాడు, సమీపస్థుడునుగాడు, అలభ్యుడుకాడు, దుర్లభుడునుకాదు; స్వానందప్రకాశరూపుడగు [illegible] స్వదేహమునందే లభింపజేసికొనవచ్చును. [illegible]

కించిన్నోపకరోత్యత్ర తపోదానవ్రతాదికమ్
స్వభావమాత్రే విశ్రాంతిమృతే నాత్రాస్తి సాధనమ్. 4

[illegible] తపోదాన వ్రతాదులలో నేవొక్కటియు తత్త్వజ్ఞానమునుగూర్చి సాయపడజాలదు; స్వస్వరూపమున నిల్చుటగాక వేరొక ఉపాయములేదు.

సాధుసంగమసచ్ఛాస్త్రపరతైవాత్ర కారణమ్
సాధనం బాధనం మోహజాలస్య యదకృత్రిమమ్. 5

సాధుసంగమ సచ్ఛాస్త్రములే మోహజాలముల నాశన మొనర్పుటకును నైన ఉపాయములు. వీనివలననే స్వాభావికమగు తత్త్వజ్ఞానము లభించును.

[illegible] దేవ [illegible] త్వేవ [illegible] పరిజ్ఞానమాత్రతః
జన్మనో [illegible] దుఃఖం జీవన్ముక్తత్వమేతి [illegible] 6

[illegible] దేవదేవుడగు పరమాత్మ [illegible] అనుజ్ఞానము లభించిన, దుఃఖముల ననుభవింప వలసియుండదు [illegible] జ్ఞానము [illegible] జీవన్ముక్తుడగును.

(శ్రీ) రామ ఉవాచః— [illegible]

స్వపరిజ్ఞానమాత్రేణ [illegible] నేనాత్మనాత్మనా [illegible]
పునర్దోషా న బాధంతే మరణాద్యాః కదాచన. 7
దేవదేవో మహానేష కుతో దూరాదవాప్యతే
తపసా కేన తీవ్రేణ క్లేశేన కియతాథవా. 8



శ్రీ రాముడు:– ఆత్మయోగమున ఆ పరమాత్మని దెలిసికొనిన జననమరణాది దోషములు తొలగిపోవునని మీమాటలవలన గ్రహించితిని. కాని, ఈ దేవదేవుని ఏ కఠోరతపోనుష్ఠానముల నాచరించిన శీఘ్రముగ బడయగలమో, వచింపుడు.

(శ్రీ) వసిష్ఠ ఉవాచః—

స్వపౌరుషప్రయత్నేన వివేకేన వికాసినా
స దేవో జ్ఞాయతే రామ న తపఃస్నానకర్మభిః. 9

వసిష్ఠుడు:– రామా! పురుషుడు తనపౌరుష బలమున వివేకమను ఉపాయము నాశ్రయించి బ్రహ్మసాక్షాత్కార మొనర్చుకొనుచున్నాడు. తపోస్నానాది అనుష్ఠానములతో పనిలేదు.

రాగద్వేషతమఃక్రోధమదమాత్సర్యవర్జనం
వినా రామ తపోదానం క్లేశ ఏవ న వాస్తవమ్. 10

రామా! కామ, క్రోధ, మోహ, మద, మాత్సర్యములను పరిత్యజించుటయే ముఖ్యము. తపోదానాదులు క్లేశకరములు మాత్రమే, ఫలదాయకములుగావు.

రాగాద్యుపహతే చిత్తే వంచయిత్వా పరం ధనమ్
యదర్జ్యతే తస్య దానాద్యస్యార్థాస్తస్య తత్ఫలమ్. 11

రాగద్వేషములకు లోబడి, పరులను వంచించి ఆర్జించినదానిని దాన మొనర్చిన, అసలాధన మెవ్వరిదో ఆతడేదాని ఫలమునందును.

రాగాద్యుపహతే చిత్తే వ్రతాది క్రియతే చ యత్.
తద్దంభః ప్రోచ్యతే తస్య ఫలమస్తి మనాఙ్న చ. 12

రాగద్వేషములకు లోబడి ఆచరించు వ్రతాది సత్కార్యములు దాంభికము లనంబడుచున్నవి. ఇట్టికార్యములకు ఫలమిసుమంతయు నుండదు.

తస్మాత్ పురుషయత్నేన ముఖ్యమౌషధమాహరేత్
సచ్ఛాస్త్రసజ్జనాసంగౌ సంసృతివ్యాధినాశినౌ. 13

అందువలన మిక్కిలిగ యత్నించి సంసారవ్యాధికి మహౌషధములగు సాధుసంగమ సచ్ఛాస్త్రములను సంపాదింపుము.

అత్రైకం పౌరుషం యత్నం వర్జయిత్వేతరా గతిః
సర్వదుఃఖక్షయప్రాప్తౌ న కాచిదుపపద్యతే. 14

దుఃఖముల నన్నింటిని రూపుమాపగోరువాడు, అనగా మోక్షమునందగోరువాడు రాగాదుల నుపశమింప జేయగోరుచో, పురుషకారముగాక వేరొక ఉపాయములేదు.

శృణు తత్పౌరుషం కీదృగాత్మజ్ఞానస్య లబ్ధయే
యేన శామ్యత్యశేషేణ రాగద్వేషవిషూచికా. 15

రామా! పౌరుషమున తత్త్వజ్ఞానము లభించురీతిని వినుము. దీనివలన రాగద్వేషాది విషూచివ్యాధి ఉపశమించును.

యథాసంభవయా వృత్త్యా లోకశాస్త్రావిరుద్ధయా
సంతోషసంతుష్టమనా భోగగంధం పరిత్యజేత్. 16

తత్త్వజ్ఞానము నందగోరువాడు, మొట్టమొదట వీలైనంతవఱకు లోకశాస్త్ర విరుద్ధముగాని జీవిక నవలంబించి సంతుష్టుడవనగును. మఱియు, భోగవాసనలను బరిత్యజింపవలెను.

యథాసంభవముద్యోగాదనుద్విగ్నతయా స్వయా
సాధుసంగమసచ్ఛాస్త్రపరతాం ప్రథమం శ్రయేత్. 17

అనుద్విగ్న చిత్తముతోడ వీలుపడినట్లు యత్నించుచు సాధుసంగ, సచ్ఛాస్త్రాలోచనలను సల్పవలెను.

యథాప్రాప్తార్థసంతుష్టో యో గర్హితముపేక్షతే
సాధుసంగమసచ్ఛాస్త్రపరః శీఘ్రం స ముచ్యతే. 18

దొరకినదానితో సంతసించుచు నిషిద్ధకర్మలనువీడి, సాధుసంగమ, సచ్ఛాస్త్రానుశీలన నొనర్చువాడు శీఘ్రముగ ముక్తినందును.

విచారేణ పరిజ్ఞాతస్వభావస్య మహామతేః
అనుకంప్యా భవంత్యేతే బ్రహ్మవిష్ణ్వింద్రశంకరాః. 19

ఏ బుద్ధిమంతుడు విచారమువలన బ్రహ్మస్వరూపమును గ్రహించునో, అతని యెడల బ్రహ్మ, విష్ణు, మహేశ్వర, ఇంద్రాది దేవతలు దయజూపుదురు.

దేశే యం సుజనప్రాయా లోకాః సాధుం ప్రచక్షతే
స విశిష్టః స సాధుః స్యాత్ తం ప్రయత్నేన సంశ్రయేత్. 20

పదిమంది మంచివారు, అనగా శ్రుతిస్మృతి నిష్ఠాపరులు ఎవనిని సాధుపురుషుడని పేర్కొందురో, అతడే జ్ఞానవైరాగ్యాది విశిష్టగుణములతోగూడిన సాధుపురుషుడు. ఇట్టివానిని పరమయత్నముతో నాశ్రయింపనగును.

అధ్యాత్మవిద్యా విద్యానాం ప్రధానం తత్కథాశ్రమమ్
శాస్త్రం సచ్ఛాస్త్ర మిత్యాహుర్ముచ్యతే తద్విచారణాత్. 21

అధ్యాత్మవిద్య విద్యలన్నిటిలో శ్రేష్ఠమైనది. ఇట్టి ఆత్మవిద్యను నుడువుశాస్త్రమే, సచ్ఛాస్త్రము. ఇట్టి శాస్త్రమును బఠించిన ముక్తి లభించును.

సచ్ఛాస్త్ర సత్సంగమజైర్వివేకై-
స్తథా వినశ్యంతి బలాదవిద్యాః
యథా జలానాం కతకానుషంగా-
త్తథా జనానాం మతయోఽపి యోగాత్. 22

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే ఉత్పత్తిప్రకరణే
ముముక్షుప్రయత్నోపదేశో నామ షష్ఠః సర్గః ॥ 6 ॥



ఇందు (చిల్ల) గింజవలన జలములమకిలి తొలగునట్లు, యోగము నభ్యసించిన జనుల మనస్సునను గలదు వృత్తులు తొలగును. అట్లే, సాధుసంగము సచ్ఛాస్త్రములవలన లభించిన వైరాగ్యమున, అవిద్య అనగా సంసారముగూడ నశించును.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు, ఉత్పత్తిప్రకరణమున
ముముక్షుప్రయత్నోపదేశమను షష్ఠసర్గము ॥ 6 ॥

---

## సప్తమః సర్గః.

---

శ్రీరామ ఉవాచ:—

య ఏష దేవః కథితో యస్మిన్ జ్ఞాతే విముచ్యతే
వద క్వాసౌ స్థితో బ్రహ్మన్ కథమేనమహం లభే. 1

శ్రీరాముడు:_మీరు ఎవ్వనిని గుఱించి నుడువుచున్నారో, ఎవని నెఱిగిన ముక్తి లభించునో, అతడెటనున్నాడు? అతని నెట్లు తెలిసికొనగలను? వచింపుడు.

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

య ఏష దేవః కథితో నైష దూరేఽవతిష్ఠతే
శరీరే సంస్థితో నిత్యం చిన్మాత్రమితి విశ్రుతః. 2
ఏష సర్వమిదం విశ్వం నవిశ్వం చైష సర్వగః
విద్యతే హ్యేష ఏవైకో నతు విశ్వాభిధాస్తి దృక్. 3
చిన్మాత్రమేష శశిభృచ్చిన్మాత్రం గరుడేశ్వరః
చిన్మాత్రమేవ తపనశ్చిన్మాత్రం కమలోద్భవః. 4

వసిష్ఠుడు:_ నే జెప్పునాతడెటనో దూరమునలేడు. అతడు చైతన్యరూపమున మనశరీరముల నివసించియున్నాడు. ఈ విశ్వమే అతడు; కాని, ఇతడు విశ్వమునుకాదు. ఏలయన, ఉన్నది అతడొకడే, విశ్వమను వేరొక వస్తువులేదు. ఈ చిన్మయ బ్రహ్మమే, బ్రహ్మ, విష్ణువు, మహేశ్వరుడు, సూర్యుడని గ్రహింపుము.

శ్రీరామ ఉవాచ:—

బాలా అపి వదంత్యేతద్యది చేతనమాత్రకమ్
జగదిత్యేవ కైవాత్ర నామ స్యాదుపదేశతా. 5

శ్రీ రాముడు:_ ఈ విశ్వము చైతన్యస్వరూపమేయైన, అందరును ఈపాటి కద్దానిని గ్రహించియేయుందురు. వేఱుగ ఉపదేశ మీయవలసిన అగత్యమేమి?

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

చిన్మాత్రం చేతనం విశ్వమితి యజ్జ్ఞాతవానసి
న కించదేవ విజ్ఞాతం భవతా భవనాశనమ్. 6

వసిష్ఠుడు:– నీవు విశ్వమును చిన్మాత్రము, అనగా చేతనము అని గ్రహించియున్నచో, నీకు సంసారనాశోపాయ మొకింతయు తెలియలేదు.

చేతనం రామ సంసారో జీవ ఏష పశుః స్మృతః
ఏతస్మాదేవ నిర్యాంతి జరామరణభీతయః. 7

రామా! సంసారమును సారముగ తలపోయు పశువులగు చేతన – జీవులే సంసార మనంబడుచున్నారు. దీనినుండియే జననమరణాది ఫలములు గలుగుచున్నవి.

పశురజ్ఞో హ్యమూర్తోఽపి దుఃఖస్యైవైష భాజనమ్
చేతనత్వాచ్చేతనీయం మనోఽనర్థః స్వయం స్థితః. 8
చేత్యనిర్ముక్తతా యాస్యాదచేత్యోన్ముఖతాఽథవా
అస్య సా భరితావస్థా తాం జ్ఞాత్వా నానుశోచతి. 9

ఈ జీవు డజ్ఞుడై దుఃఖము ననుభవించుచున్నాడు. తన్ను శరీరిగ తలపజాలకున్నాడు. అంతఃకరణ – చైతన్యమున బడి వ్యర్థముగ అనర్థముల ననుభవించుచున్నాడు. పూర్ణస్వభావమును, నిత్యచేతనమును అగు ఆత్మయొక్క చేత్య – దర్శనము నివృత్తమైన బహిర్ముఖ – చిత్తవృత్తులు నశించి అంతర్ముఖీనములైన ఏ పూర్ణత్వము ప్రకాశించునో, దానినే తత్త్వసాక్షాత్కార మందురు. దీనిని బొందినచో, శోకమోహాదుల నందనక్కరలేదు.

భిద్యతే హృదయగ్రంథి శ్ఛిద్యంతే సర్వసంశయాః
క్షీయంతే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే. 10

పరాత్పరుడగు బ్రహ్మమును ఎఱిగినవాని హృదయగ్రంథులు విచ్ఛిన్నము లగును. సందేహములన్నియు, తొలగిపోవును. సంచిత కర్మలు లయమై పోవును.

తస్య చేత్యోన్ముఖత్వంతు చేత్యాసంభవనం వినా
రోద్ధుం నశక్యతే దృశ్యం చేత్యం శామ్యతి వై కథమ్. 11
అచేత్యచిత్స్వరూపం యత్తత్త్వాసంభవనం వినా
[illegible] స్వరూపోన్ముఖత్వం హి కేవలం చేత్యరోధతః. 12

[illegible] విరోధించిన దృశ్యదర్శన మాగిపోదు. దృశ్యములన్నియు మిథ్యాభ్రాంతివలననే [illegible]గుచున్నవి. [illegible] జ్ఞానము లేకున్న బహిర్ముఖములగు చిత్తవృత్తులను నిరోధింపజాలము. అందువలన దృశ్యదర్శనము [illegible]చుట అసంభవము. దృశ్యవస్తువు మిథ్య. అను జ్ఞానము లేకున్న దృశ్యాతీతమగు చిత్స్వరూ[illegible] [illegible]. యోగమువలన దృశ్యదర్శనమును నిరోధించిన లాభములేదు, దీనివలన జగత్స్వరూప మవగతి[illegible]



శ్రీరామ ఉవాచ:—

యస్మిన్ జీవే హి విజ్ఞాతే నవినశ్యతి సంసృతిః
వ్యోమరూపీ పశుస్తజ్జ్ఞః సబ్రహ్మన్ కుత్ర కీదృశః. 13
సాధుసంగమసచ్ఛాస్త్రైః సంసారార్ణవతారకః
దృశ్యతే పరమాత్మా యః సబ్రహ్మన్ వద కీదృశః. 14

శ్రీరాముడు:– ఎవనిని జీవుడనుకొనుటవలన ఈసంసారము నశించుటలేదో, ఎవ డాకాశరూపియో, అత డేయాధారమున ఎట్లు వసించుచున్నాడు? సాధుసంగమ సచ్ఛాస్త్రములవలన లభ్యుడగు పరమాత్ముని స్వరూప మెట్టిది? వచింపుడు.

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

యదేతచ్చేతనం జీవో విశీర్ణో జన్మజంగలే
ఏతమాత్మానమిచ్ఛంతి యే తేఽజ్ఞాః పండితా అపి. 15
జీవ ఏవహి సంసారశ్చేతనా దుఃఖసంతతిః
అస్మిన్ జ్ఞాతే న విజ్ఞాతం కించిద్భవతి కుత్రచిత్. 16
జ్ఞాయతే పరమాత్మా చేద్రామ దుఃఖస్య సంతతిః
క్షయమేతి విషావేశ శాంతావివ విషూచికా. 17

వసిష్ఠుడు:– జన్మయను అరణ్యమున విశీర్ణుడగుచున్న చేతన–జీవునియందు పరమాత్మబుద్ధి ఉంచువారు, పండితులైనను మూర్ఖులే. ఏలయన, జీవభ్రాంతియే ఈ సంసారమునకును, తదంతర్గత దుఃఖములకును గారణ మగుచున్నది. ఈతని నెఱిగిన లాభమేమియు లేదు. జీవుని జీవత్వమును విడచి పరమాత్మభావమును గ్రహించిన, విషవేగము శాంతిల్ల విషూచిక ఉపశమించునట్లు, దుఃఖములన్నియు ఉపశమించును.

శ్రీరామ ఉవాచ:—

రూపం కథయ మే బ్రహ్మన్ యథావత్ పరమాత్మనః
యస్మిన్ దృష్టే మనోమోహాన్ సమగ్రాన్ సంతరిష్యతి. 18

శ్రీరాముడు:–బ్రహ్మజ్ఞా! ఆపరమాత్ముని రూపమును ఉన్నదియున్నట్లుగ వర్ణింపుడు; దీనిని గాంచిన మనోమోహమునుండి సంపూర్ణముగ విడివడగలము.

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

దేశాద్దేశాంతరం దూరం ప్రాప్తాయాః సంవిదో వపుః
నిమిషేణైవ యన్మధ్యే తద్రూపం పరమాత్మనః. 19

వసిష్ఠుడు:– ఏజ్ఞానస్వరూపము నిముషములో ఒకచోటనుండి మరొకచోట కరుగుచున్నదో, ఆజ్ఞానమే పరమాత్మయొక్క స్వరూపము.

అత్యంతాభావ ఏవాస్తి సంసారస్య యథాస్థితేః
యస్మిన్ బోధమహాబోధా తద్రూపం పరమాత్మనః. 20

ద్రష్టృదృశ్యక్రమో యత్ర స్థితోఽప్యస్తమయం గతః
యదనాకాశమాకాశం తద్రూపం పరమాత్మనః. 21

అశూన్యమివ యచ్ఛూన్యం యస్మిన్ శూన్యం జగత్స్థితమ్
సర్గౌఘే సతి యచ్ఛూన్యం తద్రూపం పరమాత్మనః. 22

యన్మహా చిన్మయమపి బృహత్పాషాణవత్స్థితమ్
జడం వాఽజడమేవాంతస్తద్రూపం పరమాత్మనః. 23

సబాహ్యాభ్యంతరం యేన సర్వం సంప్రాప్య సంగమమ్
స్వరూపసత్తామాప్నోతి తద్రూపం పరమాత్మనః. 24

ప్రకాశస్య యథాలోకః శూన్యత్వం నభసో యథా
తథేదం సంస్థితం యత్ర తద్రూపం పరమాత్మనః. 25

ఏబోధరూపసముద్రమున త్రైకాలిక మిథ్యయగు జగత్తు తేలియాడుచున్నదో, అదియే పరమాత్మయొక్క స్వరూపము. ఎద్దానియందు ద్రష్టృ, దృశ్య, దర్శనములు లేకుండియు ఉన్నట్లగపడుచున్నవో, ఎయ్యది ఆకాశము గాకుండియు విపులత్వమున ఆకాశముతో బోల్పబడుచున్నదో, అయ్యదియే పరమాత్మయొక్క స్వరూపము. ఈప్రపంచ మసత్తయ్యు దేనియందు సద్రూపముననున్నదో, సృష్టి ప్రవాహమనాదియయ్యు దేనియందు మిథ్యారూపమున అవభాసించుచున్నదో, అదియే పరమాత్మయొక్క స్వరూపము. ఎయ్యది చిన్మాత్రమయ్యు పెద్దరాతిబండవలె నిశ్చేష్టితమైయున్నదో, ఎయ్యది జడమయ్యు జడముకాదో, అయ్యదియే పరమాత్మయొక్క స్వరూపము. ఎయ్యది బాహ్యాభ్యంతర వస్తువులతో గూడి వ్యవహార యోగ్యమగుచున్నదో, అయ్యదియే పరమాత్మయొక్క స్వరూపము. ప్రకాశక పదార్థములకు వెలుతురును, ఆకాశమునకు శూన్యత్వమును రూపములైనట్లు, ఇయ్యది దేనియందుండునో, అదియే దీనిరూపమని గ్రహింపుము.

శ్రీరామ ఉవాచ:—

సద్రూపం పరమాత్మేతి కథం నామ హి బుధ్యతే
ఇయతోఽస్య జగన్నామ్నో దృశ్యస్యాసంభవః కథమ్. 26

శ్రీరాముడు:— పరమాత్మయొక్కటియే సద్రూపము, ఈదృశ్యజగత్తంతయు అనిత్యము, మిథ్య, అని ఎట్లు తెలియగలదో వచింపుడు.

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

భ్రమస్య జాగతస్యాస్య జాతస్యాకాశవర్ణవత్
అత్యంతాభావసంబోధే యది రూఢిరలంభవేత్. 27

తజ్జాతం బ్రహ్మణో రూపం భవేన్నాన్యేన కర్మణా
దృశ్యాత్యంతాభావతస్తు ఋతే నాన్యా శుభాగతిః. 28

శ్రీవసిష్ఠుడు:— రూపహీనమగు ఆకాశమున నీలాదివర్ణములగపడునట్లు, చిన్మయబ్రహ్మమున ఈభ్రాంతిమయ జగత్తు కనంబడుచున్నది. — అనుజ్ఞానముదయించిన బ్రహ్మస్వరూపము బోధపడును. ఈదృశ్యముయొక్క మిథ్యాత్వజ్ఞానము గాక, బ్రహ్మము నెఱుగుట కింకొక ఉపాయములేదు.



అత్యంతాభావ సంపత్తౌ దృశ్యస్యాస్య యథాస్థితేః
శిష్యతే పరమార్థోఽసౌ బుధ్యతే జాయతే తతః 29

ప్రళయకాలమున ఈ దృశ్యసమూహము లన్నియు నశించును; ఆ పరమపురుషుడొక్కడే మిగిలియుండును. అతడు బోధస్వరూపుడు. అతనినుండియే ఇవన్నియు జనించినవి.

న విదః ప్రతిబింబోఽస్తి దృశ్యాభావాదృతే క్వచిత్
క్వచిన్నాప్రతిబింబేన కిలాదర్శోఽవతిష్ఠతే. 30

దృశ్య అభావములేకున్న ఆబ్రహ్మముయొక్క ప్రతిబింబముకూడ అగుపడదు; ప్రతిబింబము పడని అద్దముండదుకదా!

జగన్నామ్నోఽస్య దృశ్యస్య స్వసత్తాసంభవం వినా
బుధ్యతే పరమం తత్త్వం న కదాచన కేనచిత్. 31

దృశ్యముయొక్క మిథ్యాత్వజ్ఞాన ముపలబ్ధముగాకున్న, పరతత్త్వము నెవ్వరును ఎఱుంగజాలరు. ఇట్లెవ్వరును ఏ యుగమునను గ్రహించియుండలేదు.

శ్రీ రామ ఉవాచ:—

ఇయతో దృశ్యజాతస్య బ్రహ్మాండస్య జగత్స్థితేః
మునే కథమసత్తాస్తి క్వ మేరుః సర్షపోదరే. 32

శ్రీ రాముడు:— మునీ! దృశ్యమానమగు ఈ ప్రపంచముయొక్క మిథ్యాత్వమెట్టిది? సూక్ష్మమగు బ్రహ్మమున ఈ ప్రపంచమెట్లు ఇమిడియున్నది? ఆవగింజయందు మేరుపర్వతముండగలదా? వచింపుడు.

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

దినాని కతిచిద్రామ యది తిష్ఠస్యఖిన్నధీః
సాధుసంగమసచ్ఛాస్త్రపరమస్తదహం క్షణాత్. 33

ప్రమార్జయామి తే దృశ్యం బోధే మృగజలం యథా
దృశ్యాభావే ద్రష్టృతా చ శామ్యేద్బోధోఽవశిష్యతే. 34

వసిష్ఠుడు:— రామా! నీవుకొన్నిదినముల దాక ఏకాగ్రచిత్తముతో సాధుసంగమ సచ్ఛాస్త్రములను సేవించిన నీచిత్తమునంటియున్న మరీచికవంటి దృశ్యభ్రాంతిని దొలగింతును. దృశ్యజ్ఞానము దొలగిన ద్రష్టృత్వజ్ఞానముగూడ నశించును. అప్పుడు చైతన్యము మాత్రమే మిగిలియుండును.

ద్రష్టృత్వం సతి దృశ్యేఽస్మిన్ దృశ్యత్వం సత్యథేక్షకే
ఏకత్వం సతి హి ద్విత్వే ద్విత్వం చైకత్వయోజనే. 35

ఏకాభావే ద్వయోరేవ సిద్ధిర్భవతి నాత్ర హి
ద్విత్వైక్యద్రష్టృదృశ్యత్వక్షయే సదవశిష్యతే. 36

---

దృశ్యముండిన ద్రష్టృత్వము సిద్ధించును. ద్రష్టయుండిన దృశ్యము సిద్ధించును. ఎట్లన, ద్విత్వముండిన ఏకత్వమును, ఏకత్వయోజనమున ద్విత్వమును సిద్ధించునట్లు, ఈజగత్తున 'ఒకటి' లేకున్న

'రెండు' లభింపదు. ద్విత్వ, ఏకత్వ ద్రష్టృత్వ, దృశ్యత్వములు క్షయమందిన, ద్వైతైక్య వివర్జితమగు సద్వస్తువుమాత్రమే మిగిలియుండును.

అహంతాది జగద్దృశ్యం సర్వం తే మార్జయామ్యహమ్
అత్యంతాభావసంవిత్త్యా మనోముకురతో మలమ్. 37

జగత్తుమిథ్యయను బోధనుగలిగించి నేను నీచిత్తదర్పణము నంటిపెట్టికొనియున్న అహంకారాది దృశ్యమలములను దొలగింతును.

నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః
యత్తునాస్తి స్వభావేన కః క్లేశస్తస్య మార్జనే. 38

అసత్తున కెన్నడును సత్తలేదు; సత్తకెన్నటికిని నాశనములేదు. స్వాభావికముగ మిథ్యయగు దానిని తొలగించుట కష్టముకాదు.

జగదాదావనుత్పన్నం యచ్చేదం దృశ్యతే తతమ్
తత్స్వాత్మన్యేవ విమలే బ్రహ్మచిత్త్వాత్ స్వబృంహితమ్. 39

ఈకనపడు విశాలబ్రహ్మాండ మెన్నడును ఉత్పన్నమేయవలేదు. ఇది ఆనిర్మల బ్రహ్మచైతన్యముననే కల్పితమైనది. కనుక, దీనిస్వరూపము బ్రహ్మమే.

జగన్నామ్నా నచోత్పన్నం నచాస్తి నచ దృశ్యతే
హేమ్నీవ కటకాదిత్వం కిమేతన్మార్జనే శ్రమః. 40

బంగారము గాక నగలను వేరువస్తువులు మిథ్యలైనట్లు, ఈజగత్తుగూడ మిథ్యయే. జగత్తను వస్తువు సృష్టింపబడలేదు, కనుకనది లేదు, కనబడుటలేదు. ఇట్టి తుచ్ఛ జగత్తును మనస్సునుండి తొలగింపవలెనన్న శ్రమ ఏముండును?

తథైతద్విస్తరేణాహం వక్ష్యామి బహుయుక్తిభిః
అబాధితం యథా తత్త్వం స్వయమేవానుభూయతే. 41

ఇక నీకా బ్రహ్మతత్త్వము సహజముగ స్ఫురించునట్లు, విస్తారముగ యుక్తులతో వర్ణించి చెప్పుచున్నాను.

ఆదావేవహి నోత్పన్నం యత్తస్యేహాస్తితా కుతః
కుతో మరౌ జలసరిద్ద్వితీయేందౌ కుతో గ్రహః. 42

మరుభూమియందు సరోవరమును, చంద్రునియందు ద్విత్వమును అసంభవములైనట్లు ఉత్పత్తియేలేని ఈజగత్తుకుగూడ అస్తిత్వము అసంభవమే. దీని ఉనికి ఎచ్చట?

యథా వంధ్యాసుతో నాస్తి యథా నాస్తి మరౌ జలం
యథా నాస్తి నభోవృక్షస్తథా నాస్తి జగద్భ్రమః. 43

వంధ్యకు పుత్రుడును, మరుభూమియందు జలములును, ఆకాశమున వృక్షమును లేనట్లు, జగత్తుకూడలేదు — ఇదిభ్రమమాత్రమే.



యదిదం దృశ్యతే రామ తద్బ్రహ్మైవ నిరామయమ్
ఏతత్ పురస్తాద్వక్ష్యామి యుక్తితో న గిరైవ చ. 44

రామా! నీవు గాంచున దంతయు బ్రహ్మమే; ఈ విషయమును గురించి నీకు తరువాత యుక్తి వలన జెప్పెదను.

యన్నామ యుక్తిభిరిహ ప్రవదంతి తజ్జ్ఞా
స్తత్రావహేలనమయుక్తముదారబుద్ధే
యోయుక్తియుక్తమవమత్య విమూఢబుద్ధిః
కష్టాగ్రహో భవతి తం విదురజ్ఞమేవ. 45

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే ఉత్పత్తి ప్రకరణే
జగదాది దృశ్యాసత్తాప్రతిజ్ఞానామ సప్తమః సర్గః ॥ 7 ॥

ఉదారమతీ! తత్త్వజ్ఞులొసగు యుక్తిపూర్ణ - ఉపదేశముల నీసడించుట తగదు. ఆవాక్యములను తిరస్కరించి, యుక్తిరహితములగు వాక్యముల నాదరించు మూఢబుద్ధిని అజ్ఞుడని ప్రాజ్ఞులందురు.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు ఉత్పత్తిప్రకరణమున
దృశ్యాసత్తాప్రతిజ్ఞ యను సప్తమ సర్గము ॥ 7 ॥

———:0:———

## అష్టమః సర్గః.

శ్రీరామ ఉవాచ:—

కథమేతజ్జ్ఞాయతే యుక్త్యా కథమేతత్ ప్రసిధ్యతి
న్యాయానుభూత ఏతస్మిన్నజ్ఞేయమవశిష్యతే. 1

శ్రీరాముడు:—బ్రహ్మజ్ఞానముయొక్క స్వరూపమెట్టిది? దీని నేయుక్తివలన ఎఱుంగగలము? ఈవిషయమును గురించి మీరు నాకు జెప్పినజాలును. ఇంతకంటె నేనెఱుంగదగిన దింకొకటిలేదు.

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

బహుకాలమియం రూఢా మిథ్యాజ్ఞానవిషూచికా
జగన్నామ్న్యవిచారాఖ్యా వినా జ్ఞానం న శామ్యతి. 2

వసిష్ఠుడు,— ఈజగత్తును మిథ్యాజ్ఞానమను రోగముపట్టుకొని చాలకాలమునుండి పీడించుచున్నది. తత్త్వజ్ఞానముగాక, వేరొక ఉపాయమువలననిది ఉపశమింపదు.

వదామ్యాఖ్యాయికా రామ యా ఇమా బోధసిద్ధయే
తాశ్చేచ్ఛృణోషి తత్సాధో ముక్త ఏవాసి బుద్ధిమాన్. 3

సాధూ! జ్ఞానసిద్ధికై నేను వచించు కథలను వినిన నీవు ముక్తుడవగుదువు.

నోచేదుద్వేగశీలత్వా దర్ధాదుత్థాయ గచ్ఛసి
తత్తిర్యగ్ధర్మిణ స్తేఽద్య నకించిదపి సేత్స్యతి. 4

అట్లుగాక, ఉద్వేగమున సగమువిని లేచిపోయిన, నీవు పశుతుల్యుడవై, శాస్త్రశ్రవణమున కయోగ్యుడ వగుదువు. నీకేమియు లభింపదు.

యో యమర్థం ప్రార్థయతే తదర్థం యతతే తథా
సోఽవశ్యం తదవాప్నోతి నచేచ్ఛ్రాంతో నివర్తతే. 5

ఎవ డెద్దానిని గోరునో దానికి దగినట్లు యత్నించిననే ఫలముదక్కును. అట్లొనర్పక, శ్రమయని విసిగి యత్నింపనిచో ఫలముసిద్ధింపదు.

సాధుసంగమసచ్ఛాస్త్రపరో భవసి రామచేత్
తద్దినై రేవనో మాసైః ప్రాప్నోషి పరమంపదమ్. 6

రామా! నీవు సాధుసేవ నొనర్చుచు, సచ్ఛాస్త్రమును బఠించినచో, అల్పసమయముననే పరమపదము నందుదువు.

శ్రీరామ ఉవాచ:—

ఆత్మజ్ఞానప్రబోధాయ శాస్త్రం శాస్త్రవిదాంవర
కింనామ తత్ప్రధానం స్యాత్ యస్మిన్ జ్ఞాతే నశోచ్యతే. 7

శ్రీరాముడు:- శాస్త్రవేత్తా! ఆత్మజ్ఞానమును బోధించు శాస్త్రములన్నిటిలో, ముఖ్యమైన దేది? ఎద్దానిని బఠించిన జీవుడు శోకము నందడు?

శ్రీ వసిష్ఠ ఉవాచ:

ఆత్మజ్ఞానప్రదానానామిదమేవ మహామతే
శాస్త్రాణాం పరమం శాస్త్రం మహారామాయణం శుభమ్. 8
ఇతిహాసోత్తమాదస్మాచ్ఛ్రుతాద్బోధః ప్రవర్తతే
సర్వేషామితిహాసానామయం సార ఉదాహృతః. 9

వసిష్ఠుడు:- మహామతీ! ఆత్మజ్ఞాన ప్రబోధకములగు శాస్త్రములన్నింట, ఈమహారామాయణమే ఉత్తమము. ఇదియే ఇతిహాసములలోనెల్ల శ్రేష్ఠము. దీనిని వినినంతనే తత్త్వజ్ఞానము లభించును.

శ్రుతేఽస్మిన్ వాఙ్మయే యస్మాజ్జీవన్ముక్తత్వమక్షయమ్
ఉదేతి స్వయమేవాత ఇదమేవాతిపావనమ్. 10

వాక్యసందర్భములతోగూడిన ఈ రామాయణమును వినిన అక్షయమగు జీవన్ముక్తి లభించును. అందువలన, నిది అతిపవిత్రమగు శాస్త్రగ్రంథము.

స్థితమేవాస్తమాయాతి జగద్దృశ్యం విచారణాత్
యథాస్వప్నే పరిజ్ఞాతే స్వప్నాదావేవ భావనా. 11



కలనుగాంచి నిద్రనుండి తేరుకొనినపిమ్మట అద్దానిని కలయని గ్రహించిన, దానిసత్యత్వ ముండనట్లు శాస్త్రప్రమాణము ననుసరించి విచారించిన, జగత్తుకనంబడుచున్నను మిథ్యయేయని ప్రమాణితమగును.

యదిహాస్తి తదన్యత్ర యన్నేహాస్తి నతత్క్వచిత్
ఇమం సమస్తవిజ్ఞానశాస్త్రకోశం విదుర్బుధాః. 12

ఈశాస్త్రముననున్న విషయములే ఇతరశాస్త్రములనున్నవి; ఇందులేని విషయములు మరెచ్చటను లేవు. అందువలన, పండితు లిద్దానిని శాస్త్రకోశ మందురు.

య ఇదం శృణుయాన్నిత్యం తస్యోదారచమత్కృతే
బోధస్యాపి పరంబోధం బుద్ధిరేతి నసంశయః. 13

ఈశాస్త్రమును నిత్యమును విను మహామతియొక్క బుద్ధి అన్యశాస్త్రజనిత జ్ఞానముకంటె పరమోత్కృష్టమగు జ్ఞానమును బొందును—సంశయమువలదు.

యస్మైనేదం త్వరుచయే రోచతే దుష్కృతోదయాత్
విచారయతు యత్కించిత్ సచ్ఛాస్త్రం జ్ఞానవాఙ్మయం. 14

దురదృష్టవశమున ఈశాస్త్రము రుచింపనియెడల, ఇతర సచ్ఛాస్త్రములను (గీతామోక్షధర్మాదులను) పఠింపదగును; మాకు వాటియెడల ద్వేషబుద్ధిలేదు.

జీవన్ముక్తత్వమస్మింస్తు శ్రుతే సమనుభూయతే
స్వయమేవ యథా పీతే నీరోగత్వం వరౌషధే. 15

మంచిమందు పుచ్చుకొనిన రోగి రోగములనుండి విడివడునట్లు, ఈశాస్త్రమును పఠించిన జీవన్ముక్తిలభించును.

శ్రూయమాణేహి శాస్త్రేఽస్మిఞ్ఛ్రోతా వేత్త్యేతదాత్మనా
యథావదిదమస్మాభి ర్నసూక్తం వరశాపవత్. 16

ఈశాస్త్రమును వినిన, శ్రోత, మేము చెప్పినట్లు వర, శాపములవలె ప్రత్యక్షఫలము లభించుచున్నదని తెలిసికొనగలడు.

నశ్యతి సంసృతిదుఃఖమిదం తే స్వాత్మవిచారణయా కథయైవ
నో ధనదానతపఃశ్రుతవేదై స్తత్కథనోదిత యత్నశతేన. 17

ఇత్యార్షే శ్రీ వాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే ఉత్పత్తిప్రకరణే
సచ్ఛాస్త్రనిరూపణం నామ అష్టమః సర్గః ॥ 8 ॥

ఆత్మవిచారము, ఆత్మవిషయవర్ణనములతో నిండియున్న ఈ శాస్త్రమువలననే సంసృతిదుఃఖమునశించును. ధనదాన తపములవలనగాని, ద్వైతతత్త్వబోధకగు కర్మకాండను బఠించుటవలనగాని, చదువబడిన యాగహోమాది యత్నశతములచే గాని, ఈదుఃఖము నశింపదు.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు ఉత్పత్తి ప్రకరణమున సచ్ఛాస్త్రనిరూపణమను అష్టమ సర్గము. ॥ 8 ॥

## నవమః సర్గః.

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

తచ్చిత్తా స్తద్గతప్రాణా బోధయంతః పరస్పరమ్
కథయంతశ్చ తన్నిత్యం తుష్యంతిచ రమంతిచ. 1

తేషాం జ్ఞానైకనిష్ఠానామాత్మజ్ఞానవిచారిణామ్
సా జీవన్ముక్తతోదేతి విదేహాన్ముక్తతైవ యా. 2

వసిష్ఠుడు:– బ్రహ్మమున చిత్తమును నిల్పి, బ్రహ్మగతప్రాణులై, ఒండొరులు బ్రహ్మమును గుఱించిమాట్లాడుకొనువారు సంతుష్టులై, ఆనందింతురు. బ్రహ్మవిచారపరులగు ఇట్టిజ్ఞాననిష్ఠులకు జీవన్ముక్తిలభించును. సాధారణులగు మహాత్ముల కియ్యది మరణానంతరము లభించును.

శ్రీరామ ఉవాచ:—

బ్రహ్మన్ విదేహముక్తస్య జీవన్ముక్తస్య లక్షణమ్
బ్రూహి యేన తథైవాహం యతే శాస్త్రదృశా ధియా. 3

శ్రీరాముడు:–బ్రహ్మజ్ఞా! జీవన్ముక్త, విదేహముక్తుల లక్షణములను నాకుజెప్పుడు. శాస్త్రదృష్టితోడను, బుద్ధితోడను దీనికై యత్నింతును.

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

యథాస్థితమిదం యస్య వ్యవహారవతోఽపి చ
అస్తంగతం స్థితం వ్యోమ జీవన్ముక్తః స ఉచ్యతే. 4

వసిష్ఠుడు:– శాస్త్రవిధి ననుసరించుచు, ఈ విశ్వమును ఆకాశమువలె శూన్యముగ జూచువాడు జీవన్ముక్తు డనంబడుచున్నాడు.

బోధైకనిష్ఠతాం యాతో జాగ్రత్యేవ సుషుప్తవత్
య ఆస్తే వ్యవహర్తైవ జీవన్ముక్తః స ఉచ్యతే. 5

పనిపాటల నొనర్చుచున్నను, జ్ఞానపరతంత్రుడై, జాగ్రదవస్థయందుగూడ నిద్రితునిమాడ్కి నిర్వికారుడై మెలగువాడు జీవన్ముక్తు డనంబడుచున్నాడు.

నోదేతి నాస్తమాయాతి సుఖేదుఃఖే ముఖప్రభా
యథాప్రాప్తస్థితేర్యస్య జీవన్ముక్తః స ఉచ్యతే. 6



ఎవ్వని ముఖము సుఖము లభించిన వికసింపక, దుఃఖములభించిన ముకుళింపక అన్నిసమయములు ఒకేరీతిగ నుండునో, ఎవడు ఎప్పుడేది లభించినదాని నవలంబించు చుండునో, అతడు జీవన్ముక్తు డనంబడును.

యో జాగర్తి సుషుప్తస్థో యస్య జాగ్రన్న విద్యతే
యస్య నిర్వాసనో బోధః స జీవన్ముక్త ఉచ్యతే. 7

మేల్కొనియు, నిర్వికార-ఆత్మతత్త్వమున సుషుప్తునివలె నుండువాడును, సుషుప్తుడయ్యు అవిద్యయను నిద్ర నశించుటవలన ఆత్మయందు జాగరిల్లియుండువాడును, దేహేంద్రియములకు సాధారణమగు జాగ్రదవస్థ లేనివాడును, జాగ్రద్వాసనలవలన గలుగు స్వప్నస్థితి నశించినవాడును నగు పురుషుడు జీవన్ముక్తు డనంబడును.

రాగద్వేషభయాదీనా మనురూపం చరన్నపి
యోఽంతర్వ్యోమవదచ్ఛస్థః స జీవన్ముక్త ఉచ్యతే. 8

బయటకు రాగద్వేషభయాదులను నటించుచున్నను అంతరమున ఆకాశమువలె స్వచ్ఛుడై వెలయునాతని జీవన్ముక్తు డందురు.

యస్య నాహంకృతో భావో యస్య బుద్ధిర్న లిప్యతే.
కుర్వతోఽకుర్వతో వాపి స జీవన్ముక్త ఉచ్యతే. 9

'అహం' జ్ఞానమువలన ఎట్టి అభావమును బొందనివాడును, కార్యముల నొనర్చుచున్నను, ఒనర్పకపోయినను కర్తృత్వాభిమానములు (లేక పుణ్యములు) అంటకుండువాడును నగు పురుషుని జీవన్ముక్తు డందురు.

యస్యోన్మేషనిమేషార్ధాద్విదః ప్రలయసంభవౌ
పశ్యేత్త్రిలోక్యాః స్వసమః స జీవన్ముక్త ఉచ్యతే. 10

ఎవ్వని చిదాత్మ ఆవరణము తొలగిన ప్రళయమును, ఆవరణము పడిన సృష్టిని గల్పించుచుండునో అతడు జీవన్ముక్తుడు.

యస్మాన్నోద్విజతే లోకో లోకాన్నోద్విజతేచ యః
హర్షామర్షభయోన్ముక్తః స జీవన్ముక్త ఉచ్యతే. 11

లోకమునకు భీతిగొల్పనివాడును, లోకమునుండి భీతినందనివాడును, సుఖదుఃఖముల ననుభవింపనివాడును నగు పురుషుని జీవన్ముక్తుడందురు.

శాంతసంసారకలనః కలావానపి నిష్కలః
యః సచిత్తోఽపి నిశ్చిత్తః స జీవన్ముక్త ఉచ్యతే. 12

సంసారాసక్తి లేనివాడును, దేహియయ్యు నిరాకారుడును, చిత్తసహితుడయ్యు అమనస్కుడును నగువాడు జీవన్ముక్తు డనంబడును.

యః సమస్తార్థజాతేషు వ్యవహార్యపి శీతలః
పదార్థేష్వపి పూర్ణాత్మా స జీవన్ముక్త ఉచ్యతే. 13

జగద్వ్యాపారమున చరించుచున్నను కామాదుల వేగమునకు లొంగనివాడును, పదార్థముల న్నింట ఆత్మయొక్క పూర్ణత్వమును గాంచువాడును నగు మనుజుడు జీవన్ముక్తుడనంబడుచున్నాడు.

జీవన్ముక్త పదం త్యక్త్వా దేహే కాలవశీకృతే
విశత్యదేహముక్తత్వం పవనో స్పందతామివ. 14
విదేహముక్తో నోదేతి నాస్తమేతి న శామ్యతి
న సన్నాసన్న దూరస్థో నచాహం నచ నేతరః. 15

ఇట్టి జీవన్ముక్తపురుషుడీ దేహమును వదలినపిమ్మట, విదేహముక్తుడగును. వాయువు స్పందమునువీడి నిశ్చలమగునట్లు, విదేహముక్తుడు మరల జన్మింపడు, మరణింపడు. వ్యక్తముగాడు; దూరమునగాని, దగ్గరగాని యుండడు, "నేను - ఇతరులు" అను భేదదృష్టి అతని కుండదు.

సూర్యో భూత్వా ప్రతపతి విష్ణుః పాతి జగత్త్రియమ్
రుద్రః సర్వాన్ సంహరతి సర్గాన్ సృజతి పద్మజః. 16
ఖం భూత్వా పవనస్కంధం ధత్తే సర్షి సురాసురమ్
కులాచలగతో భూత్వా లోకపాలపురాస్పదః. 17
భూమిర్భూత్వా బిభర్తీమాం లోకస్థితిమఖండితామ్
తృణగుల్మలతా భూత్వా దదాతి ఫలసంతతిమ్. 18
బిభ్రజ్జలానలాకారం జ్వలతి ద్రవతి ద్రుతమ్
చంద్రోఽమృతంప్రస్రవతి మృతం హాలాహలం విషమ్. 19

సర్వాత్మకమగు బ్రహ్మమగుటవలన నతడు సూర్యరూపమున తాపమును, బ్రహ్మయై జగత్సృష్టిని, విష్ణువై రక్షణమును, శివుడై సంహారమును, ఒనర్చును. ఆకాశమై పవనస్కంధమును వాయువీయుస్తమును గ్రహించుచున్నాడు. మేరుపర్వతమై సురాసుర లోకపాలకులకును ఋషులకును నివాసమగుచున్నాడు. భూమియై యీ సృష్టినంతటిని వహించుచున్నాడు. తృణగుల్మలతాదులై ఫలముల నొసంగుచున్నాడు. జలరూపమున ద్రవత్వమును అగ్నిరూపమున దాహకత్వమును ధరించుచున్నాడు. చంద్రుడై అమృతమును గురిపించుచున్నాడు. హాలాహలమై మృత్యువును విధించుచున్నాడు.

తేజః ప్రకటయత్యాశాస్తనోత్యాంధ్యం తమో భవత్
శూన్యం సద్వ్యోమతామేతి గిరిః సన్ రోధయత్యలమ్. 20
కరోతి జంగమం చిత్తః స్థావరం స్థావరాకృతిః
భూత్వార్ణవో వలయతి భూస్త్రియం వలయో యథా. 21
పరమార్కవపుర్భూత్వా ప్రకాశాంతం విసారయన్
త్రిజగత్త్రిసరేణ్వోఘం శాంతమేవావతిష్ఠతే. 22
యత్కించిదిదమాభాతి భాతం భానముపైష్యతి
కాలత్రయగతం దృశ్యం తదసౌ సర్వమేవచ. 23

ఈ ముక్తపురుషుడే దిగ్రూపమున వెలుతురును, చీకటిని, విస్తరింపజేయుచున్నాడు. శూన్యరూపియై ఆకాశమును, పర్వతమై స్థలమును ఆక్రమించుచున్నాడు. వికసిత చైతన్యమై జంగమ పదార్థములను సృష్టించుచున్నాడు. సముద్రమై భూమియను రమణికి వలయమట్లు వెలయుచున్నాడు. అసావృత చిదాత్మరూపమున ఈ విశాలవిశ్వమును ప్రకాశితమొనర్చి శాంతరూపమున నవస్థితుడైయున్నాడు. భూతభవిష్యద్వర్తమానకాలముల ప్రకాశితమైనది, ప్రకాశింప బోవునది, ప్రకాశించుచున్నదియు నగు దృశ్యసమూహముగూడ నతడేయైయున్నాడు.



శ్రీ రామ ఉవాచః—

కథమేవం వద బ్రహ్మన్ భూయతే విషమా హి మే
దృష్టిరేషాథ దుష్ప్రాప్యా దురాక్రమ్యేతి నిశ్చయః. 24

శ్రీరాముడు:- బ్రహ్మజ్ఞా! సమదృష్టిని బడయుట చాలకష్టముగాన, ఇట్టి ముక్తి దుష్ప్రాప్యముగుచున్నవి. చిత్తము చంచలముగాన ఏ యుపాయమును సరిపడునట్లు తోచుటలేదు. యేమిచేయవలెనో వచింపుడు.

శ్రీ వసిష్ఠ ఉవాచః—

ముక్తిరేషోచ్యతే రామ బ్రహ్మైతత్సముదాహృతమ్
నిర్వాణమేతత్ కథితం శృణు తత్ప్రాప్యతే కథమ్. 25
యదిదం దృశ్యతే దృశ్యమహంత్వంతాదిసంయుతమ్
సతోఽప్యస్యాత్యనుత్పత్త్యా బుధ్యయై తదవాప్యతే. 26

వసిష్ఠుడు:- రామా! ముక్తియని చెప్పబడునదే బ్రహ్మము. నిర్వాణముగూడ నైయున్నది. దీనిని బడయగల ఉపాయమును జెప్పెదను వినుము - 'అహంబుద్ధితోగూడి కన్పడు దృశ్యజగత్తంతయు వంధ్యాపుత్రునివలె అలీకము' అను జ్ఞానమువలననే ఈ ముక్తి లభించును.

శ్రీరామ ఉవాచః—

విదేహముక్తాస్త్రైలోక్యం సంపద్యంతే యదా తదా
మన్యే తే సర్గతామేన గతా వేద్యవిదాంవర. 27

శ్రీ రాముడు:- వేదజ్ఞా! విదేహముక్తులే అన్నియు (త్రిలోకములు) నై వెలయుచున్నారంటిరికదా! అందువలన, వారే ఈ సృష్టిగమాగినారని తలంచుచున్నాను.

శ్రీ వసిష్ఠ ఉవాచః—

విద్యతేచేత్ త్రిభువనంతత్తాం సంప్రయాంతు తే
యత్ర త్రైలోక్యశబ్దార్థో న సంభవతి కశ్చన. 28

వసిష్ఠుడు:- త్రిలోకములను పేరిట నొకటియున్న, వారే అట్లు మారిరని అనిన అనవచ్చును. కాని త్రిలోకములను పదార్థమేలేదు.

ఏకత్త్రిలోకతాం యాతం బ్రహ్మేత్యుక్తార్థధీః కుతః
తస్మాన్నో సంభవత్యేషా జగచ్ఛబ్దార్థకల్పనా. 29

'ఆ బ్రహ్మమే చిత్ -శక్తివలన సంసారముగ మారెను' అనుబోధకూడ భ్రమయే; అందువలన జగత్ - శబ్దముకూడ కేవలము కల్పనయేయని తేలుచున్నది.

అనన్యచ్ఛాంతమాభాసమాత్ర మాకాశనిర్మలమ్
బ్రహ్మైవ జగదిత్యేతత్ సర్వం సత్త్వావబోధతః. 30

ఆకాశమువలె నిర్మలమును, శాంతమును, చిద్రూపమునునగు బ్రహ్మముగాక జగత్తనునది వేఱొక్కటిలేదు. ఈ సత్యము సద్వస్తువును గ్రహించిన బోధపడగలదు.

అహం హి హేమకటకే విచార్యాపి న దృష్టవాన్
కటకత్వం క్వచిన్నామ ఋతే నిర్మలహాటకాత్. 31
జలాదృతే పయో వీచౌ నాహంపశ్యామి కించన
వీచిత్వం తాదృశం దృష్టం యత్ర నాస్త్యేవ తత్ర హి. 32
స్పందత్వం పవనాదన్యన్న కదాచన కుత్రచిత్
స్పంద ఏవ సదా వాయుర్జగత్తస్మాన్న భిద్యతే. 33
యథా శూన్యత్వమాకాశే తాప ఏవ మరౌ జలం
తేజ ఏవ సదాలోకే బ్రహ్మైవ త్రిజగత్తథా. 34

విచారించిజూచినను నాకు హేమకటకము బంగారముగాక "కటక"మను వేఱొకవస్తువు కనంబడుటలేదు. జలప్రవాహమున నీరుగాక ప్రవాహమను వస్తువు గానవచ్చుటలేదు. మఱియు కదలిక గాలికంటెవేరుగాదు. ఆకాశముయొక్క శూన్యత్వము, మరుభూమియొక్క తాపము, ఆలోకముయొక్క వెలుతురును వాటినుండి భిన్నములుగానట్లు, జగత్తుగూడ బ్రహ్మమునుండి వేరుగాదు. ఇదంతయు బ్రహ్మమే.

శ్రీరామ ఉవాచః—

అత్యంతాభావసంపత్త్యా జగద్దృశ్యస్య ముక్తతా
యయోదేతి మునే యుక్త్యా తాం మమోపదిశోత్తమామ్. 35
మిథః సంపన్నయోర్ద్రష్టృదృశ్యయోరేకసంఖ్యయోః
ద్వయాభావే స్థితిం యాతే నిర్వాణమవశిష్యతే. 36
దృశ్యస్య జగతస్తస్మాదత్యంతాసంభవో యథా
బ్రహ్మైవేత్థం స్వభావస్థం బుధ్యతే వదమే తథా. 37
కయైతజ్జ్ఞాయతే యుక్త్యా కథమేతత్ ప్రసిద్ధ్యతి
ఏతస్మింస్తు మునే సిద్ధే న సాధ్యమవశిష్యతే. 38

శ్రీ రాముడు:— మునీ! ఏ అత్యంతాభావజ్ఞానమున దృశ్యజగత్తంతర్ధానమగునో, ఏయుపదేశమున అజ్ఞానము నశించునో, అద్దానిని నాకుజెప్పుడు. పరస్పర సాపేక్షములగు ద్రష్టృ, దృశ్యములంతరించిన మిగిలియుండు నిర్వాణమును, జగత్తుయొక్క అత్యంతాభావమునజేసి మిగిలియుండు స్వభావస్థితి బ్రహ్మమును వర్ణింపుడు. మునీంద్రా! మఱియు, ఏ యుక్తివలన బ్రహ్మజ్ఞానము లభించునో, దేనిని బడసిన మఱిసాధనలతో పనియుండదో, అట్టిదానిని నాకు జెప్పుడు.



శ్రీ వసిష్ఠ ఉవాచః—

బహుకాలమియం రూఢా మిథ్యాజ్ఞానవిషూచికా
నూనం విచారమంత్రేణ నిర్మూలముపశామ్యతి. 39

వసిష్ఠుడు:— మనుష్యునకు 'జగత్తు' అనుజ్ఞానము చాలకాలమునుండి పాతుకొనిపోయియున్నది. కాని, చక్కగ విచారించిన, మిథ్యాజ్ఞానమను ఈవిషూచివ్యాధి నయమవగలదు.

న శక్యతే ఝటిత్యేషా సముత్సాదయితుం క్షణాత్
సమప్రపతనే వ్యాద్రౌ సమరోహావరోహణే. 40

కాని, సమోన్నతమగు పర్వతమును ఎక్కుట, దిగుట, కష్టమైనట్లు ఈజ్ఞానము సహజముగ నశించదు.

తస్మాదభ్యాసయోగేన యుక్త్యా న్యాయోపపత్తిభిః
జగద్భ్రాంతిర్యథా శామ్యేత్తథేదం కథ్యతే శృణు. 41

అయినను, అభ్యాసమువలనను, యుక్తివలనను, న్యాయసంగతోపదేశమువలనను ఈజగద్భ్రాంతి ఉపశమించురీతి నీకుజెప్పబడుచున్నది. వినుము.

వక్ష్యమ్యాఖ్యాయికాం రామ యామిమాం బోధసిద్ధయే
తాంచేచ్ఛృణోషి తత్సాధో ముక్త ఏవాసి బోధవాన్. 42

రామా! నేనుజెప్పబోవు కథనువినిన నీకు బోధస్వరూపమగు ముక్తి లభింపగలదు.

అథోత్పత్తిప్రకరణం మయేదం తవ కథ్యతే
యత్కిలోత్పద్యతే రామ తేన ముక్తేన భూయతే. 43

రామా! ఇప్పుడునీకు ఉత్పత్తిప్రకరణమును జెప్పబోవుచున్నాను. ఈ ఉత్పత్తి విధానమును వినిన ముక్తిలభించును.

ఇయమిత్థం జగద్భ్రాంతిర్భాత్యజాతైవ ఖాత్మికా
ఇత్యుత్పత్తిప్రకరణే కథ్యతేఽస్మిన్ మయాధునా. 44

'ఈజగద్భ్రాంతి, జన్మరహితమగు ఆకాశమువలె, ప్రతిభాసితమగుచున్నది' అని ఈ ఉత్పత్తిప్రకరణమున బ్రతిపాదింపబోవుచున్నాను.

యదిదం దృశ్యతే కించిజ్జగత్స్థావరజంగమమ్
సర్వం సర్వప్రకారాఢ్యం ససురాసురకిన్నరమ్. 45
తన్మహాప్రలయే ప్రాప్తే రుద్రాదిపరిణామిని
భవత్యసదదృశ్యాత్మ క్వాపి యాతి వినశ్యతి. 46

దేవదానవ కిన్నరులతో గూడినదియు, నానావిధ పదార్థములతో నిండినదియు, నగు స్థావరజంగమాత్మక దృశ్యజగత్తంతయు మహాప్రళయసమయమున, అసత్తగుటవలన అదృశ్యమైపోవును—వినష్టమగును; రుద్రాది దేవతాగణముకూడ అదృశ్యమగును.

తత స్తిమితగంభీరం న తేజో న తమ స్తతమ్
అనాఖ్యమనభివ్యక్తం సత్ కించిదవశిష్యతే. 47

అప్పుడు తేజముగాని, అంధకారముగాని ఉండదు. కేవలమొకానొక సత్తామాత్రమే మిగిలియుండును. అది ఇట్టిదని గాని, దాని పేరిదియని గాని చెప్పవీలుపడదు.

నశూన్యం నాపిచాకారం నదృశ్యం నచదర్శనమ్
నచ భూతపదార్థౌఘో యదనంతతయా స్థితమ్. 48

అదిశూన్యముగాదు, నిరాకారమునుగాదు. దృశ్యముకాదు, దర్శనమునుగాదు. పంచభూతములలో నేయొక్కటియుగాదు. లేక మఱియే ఇతరపదార్థమును గాదు.

కిమప్యవ్యపదేశాత్మ పూర్ణాత్ పూర్ణతరాకృతి
నసన్నాసన్న సదసన్న భావో భవనం నచ. 49

దానిని 'ఇది' యని చెప్పవీలుపడదు. అది పూర్ణతకంటె పూర్ణము. సత్తుగాదు, భావపదార్థముగాదు. అభావపదార్థమును గాదు.

చిన్మాత్రం చేత్యరహితమనంతమజరం శివమ్
అనాదిమధ్యపర్యంతం యదనాదినిరామయమ్. 50

అది కేవల చిన్మాత్రము, అనంతము, ఆదిమధ్యశూన్యము, అజరము, నిరామయము, మంగళస్వరూపము.

యస్మిన్ జగత్ ప్రస్ఫురతి దృష్టమౌక్తికహంసవత్
యశ్చేదం యశ్చనైవేదం దేవః సదసదాత్మకః. 51

సదసద్రూపియగు ఆపరమవస్తువు సర్వస్వరూపమయ్యు, ఏదియును గాకున్నది. ముత్యములతో చేయబడిన హంసయందు, హంసయొక్క రూపము అగపడునట్లు; ఆపరమవస్తువునం దీజగత్తు కనంబడుచున్నది.

అకర్ణజిహ్వానాసాత్వగ్నేత్రః సర్వత్ర సర్వదా
శృణోత్యాస్వాదయతి యో జిఘ్రేత్ స్పృశతి పశ్యతి. 52

అద్దానికి కళ్లు, చెవులు, ముక్కు, నాలుక, చర్మములు లేకున్నను, అది అన్నితావుల, ఎల్లవేళల కనుచున్నది, వినుచున్నది, వాసనచూచుచున్నది, రుచిచూచుచున్నది, స్పర్శించుచున్నది.

సవీవ సదసద్రూపం యేనాలోకేన లక్ష్యతే
సర్గచిత్రమనాద్యంతం స్వరూపం చాప్య రంజనమ్. 53

[illegible]వస్తువుయొక్క ప్రకాశమువలననే సదసద్రూపములు వీక్షింపబడుచున్నవి; అనా[illegible]యు, [illegible]ను అగుసృష్టి చిత్రింపబడుచున్నది

అర్ధోన్మీలితదృశ్యభ్రూమధ్యే తారకవజ్జగత్
వ్యోమాత్మైవసదాభాసం స్వరూపం యోఽభిపశ్యతి. 54

[illegible] సంకుచిత భ్రూమధ్యదేశమున అనగా ఖేచరీముద్రయందు సదాభాసమగు జగత్తుయొక్క స్వరూపమును గాంచు[illegible] నితఁడే.



యస్మాన్యదస్తి నవిభోః కారణం శశశృంగవత్
యస్యేదంచ జగత్ కార్యం తరంగౌఘ ఇవాంభసః. 55
జ్వలతః సర్వతోఽజస్రం చిత్తస్థానేషు తిష్ఠతః
యస్య చిన్మాత్రదీపస్య భాసా భాతి జగత్త్రయమ్. 56
యం వినాఽర్కాదయోఽప్యేతే ప్రకాశా స్తిమిరోపమాః
సతి యస్మిన్ ప్రవర్తంతే త్రిజగన్మృగతృష్ణికాః. 57
సస్పందే సముదేతీవ నిఃస్పందాంతర్గతే నచ
ఇయం యస్మిన్ జగల్లక్ష్మీరలాత ఇవ చక్రతా. 58
జగన్నిర్మాణవిలయవిలాసో వ్యాపకో మహాన్
స్పందాస్పందాత్మకో యస్య స్వభావో నిర్మలోఽక్షయః. 59
స్పందాస్పందమయీ యస్య పవనస్యేవ సర్వగా
సత్తానామ్నైవ భిన్నేవ వ్యవహారాన్న వస్తుతః. 60
సర్వదైవ ప్రబుద్ధో యః సుప్తో యః సర్వదైవచ
నసుప్తో నప్రబుద్ధశ్చ యః సర్వత్రైవ సర్వదా. 61
యదస్పందం శివం శాంతం యత్ స్పందం త్రిజగత్స్థితిః
స్పందాస్పందవిలాసాత్మా య ఏకో భరితాకృతిః. 62
ఆమోద ఇవ పుష్పేషు న నశ్యతి వినాశిషు
ప్రత్యక్షస్థోఽప్యథాగ్రాహ్యః శౌక్ల్యం శుక్లపటే యథా. 63
మూకోపమోఽపి యోఽమూకో మంతా యోఽప్యుపలోపమః
యో భోక్తా నిత్యతృప్తోఽపి కర్తా యశ్చాప్యకించనః 64
యోఽనంగోఽపి సమస్తాంగః సహస్రకరలోచనః
నకించిత్ సంస్థితేనాపి యేన వ్యాప్తమిదం జగత్. 65
నిరింద్రియబలస్యాపి యస్యాశేషేంద్రియక్రియాః
యస్య నిర్మననస్యైతా మనోనిర్మాణరీతయః. 66
యదనాలోకనాద్భ్రాంతి సంసారోరగభీతయః
యస్మిన్దృష్టే పలాయంతే సర్వాశాః సర్వభీతయః. 67
సాక్షిణి స్ఫార ఆభాసే ధ్రువే దీప ఇవ క్రియాః
సతి యస్మిన్ ప్రవర్తంతే చిత్తేహాః స్పందపూర్వికాః. 68
యస్మాద్ఘటపటాకార పదార్థ శతపంక్తయః
తరంగగణకల్లోల వీచయో వారిధేరివ. 69
స ఏవాన్యతయోదేతి యత్ పదార్థశతభ్రమైః
కటకాంగదకేయూర నూపురైరివ కాంచనమ్. 70

కుందేలునకు కొమ్ములుండనట్లు, సర్వవ్యాపియగు ఈ బ్రహ్మమునకు వేరొకకారణములేదు. నీటియందు తరంగము లేచునట్లు ఈబ్రహ్మమునందే సృష్టి ఉదయించుచున్నది. ఇదియే చిన్మాత్ర దీపమై నిరంతరము చిత్తదేశమున వసించుచు తేజమున ముల్లోకములను ప్రకాశింపజేయుచున్నది. ఈ పరమవస్తువుయొక్క ప్రకాశములేకపోయిన, సూర్యాది తేజోపదార్థములుగూడ చీకటి కోణము లగును. దీని సత్తయందే ముల్లోకములు ఎండమావులవలె ప్రకాశించుచున్నది. ఇది ఇచ్ఛించినచే జగత్తులు అగ్నివిస్ఫులింగమువలె వెల్వడి, ఇచ్ఛింపకున్న సమయుచున్నవి. ఈమహద్వస్తువుయొక్క నిర్మలాత్మయ స్వభావముయొక్క స్పందాస్పందములవలననే సృష్టి స్థితి సంహారములు చక్రబాణములవలె సంభవించు చున్నది. ఈ పరమవస్తువుయొక్క సత్త, వాయువువలె సర్వగతము, స్పందాస్పందమయము; ఇది సద్రూపపూర్ణత్వములనుండి భిన్నమైనట్లు గాన్పించుచున్నను, వాస్తవమునకు భిన్నముగాదు. ఈ బ్రహ్మము సర్వదానిద్రితము, సర్వదా జాగరితము; సర్వదా సర్వత్ర జాగరితమునుగాదు, నిద్రితమును గాదు. దీని స్పందమున శాంతము, శివము ముల్లోకములు నిమిడియున్నవి. ఇది ఏకాత్మకము, పూర్ణము. ఇయ్యది నశ్వరపదార్థములందుండియు, పుష్పగంధమువలె, నశింపదు. తెల్లటిబట్టయొక్క తెల్లదనమువలె, నయ్యది ప్రత్యక్షమగుచున్నది.

మూగయైనను దీనికి వాక్-శక్తియున్నది. * ఇయ్యది రాతివలె నిర్వికారమగనున్నను, దీనికి మననశక్తియున్నది; నిత్యపరితృప్తమైనను (జీవరూపమున,) భోక్త, క్రియాతీతమయ్యు కర్త; ఆకారరహితమయ్యు అసంఖ్యాకములగు హస్తపాదాది అవయవములతో విశ్వమునంతటిని వ్యాపించి యున్నది; ఇంద్రియశక్తిలేకున్నను ఇంద్రియవ్యాపారముల నొనర్చుచున్నది; మనస్సులేకున్నను, మనస్సుయొక్క పనుల నన్నిటిని జేయుచున్నది. ఈ పరమవస్తువును గాంచకపోవుటవలననే జీవునకు భ్రమయు, సంసార సర్పభయమును గలుగుచున్నవి; దీనిని గాంచిన వాసనలు, భీతులు, పారిపోవుచున్నవి. దీపమున్న నాట్యాది కార్యములు నిర్వహింపబడునట్లు, అపరిచ్ఛిన్న ప్రకాశరూపమున నియ్యది సాక్షియై వెలయుచుండుటవలన చిత్తవృత్తులు తమతమ కార్యముల నొనర్చుచున్నవి. సముద్రమునుండి బుద్బుదాది వికారములు వెలువడునట్లు ఘటపటాది బహువిధకార్యము లిద్దానినుండియే వెలువడుచున్నవి.

ఒకేసువర్ణము కటకాంగదకేయూరాది భేదముల గనంబడునట్లు, యీ బ్రహ్మపదార్థమే నానావిధరూపముల వేర్వేరుగ కనంబడుచున్నది.

యస్త్వమేషోఽవభాసాత్మా యోఽహమేతే జనాశ్చ యే.
యశ్చ న త్వమబుద్ధాత్మా నాహం నైతే జనాశ్చ యః. 71
అన్యేవాప్యతిరిక్తేవ సైవానేవ చ భంగురా
పయసీవ తరంగాలీ యస్మాత్ స్ఫురతి దృశ్యభూః. 72

[illegible] ఆచిన్మయస్వరూపుడు ప్రకాశించిన యోవస్తువుతోడను నీకు భేదము లేదని గ్ర[illegible]దవు. కావి, [illegible]ము లభింపనిచో 'వీరు వారు, నేను' అను భేదబోధ తొలగదు. నీటియందు అలలు లేచినట్లు యీబ్రహ్మవస్తువునుండియే యీదృశ్యజగత్తు ప్రభవించినది.

యతః కాలస్య కలనా యతో దృశ్యస్య దృశ్యతా
మానసీ కలనా యేన యస్య భాసా విభాసనమ్. 73

*వాగింద్రియము లేకపోవుటవలన మూగ; వాక్ప్రవృత్తి గారణమైనందువలన మూగకాదు.



క్రియాం రూపం రసం గంధం శబ్దం స్పర్శంచ చేతనం
యద్వేత్సి తదసౌ దేవో యేన వేత్సి తదప్యసౌ. 74

ఇద్దానినుండియే దృశ్యజగత్తు ఉదయించి, అనుభూతమగుచున్నది, కాల ముత్పన్నమగు చున్నది, తేజము ప్రకాశించుచున్నది, మానసికసృష్టి జరుగుచున్నది. రూప, రస, గంధ, శబ్ద, స్పర్శలను, క్రియలను, చేతనపదార్థములను దీనివలననే గ్రహించుచున్నావు. మఱియు, ఇవన్నియుగూడ నిదియే. ఆటి జ్ఞానముగూడ నిద్దానివలననే గలుగుచున్నది.

ద్రష్టృదర్శనదృశ్యానాం మధ్యే యద్దర్శనం స్థితం
సాధో తదవధానేన స్వాత్మానమవబుధ్యసే. 75

సాధూ! నీ వేకాగ్ర చిత్తుడవైన ద్రష్టృ దృశ్యదర్శనముల మధ్య సాక్షియైయున్న యీ ఆత్మస్వరూపుని గ్రహింపగలవు, దీనివలననే నీకు జ్ఞానములభించును.

అజమజరమనాద్యం శాశ్వతం బ్రహ్మ నిత్యం
శివమమలమమోఘం వంద్యముచ్చైరనింద్యమ్
సకలకలనశూన్యం కారణం కారణానా
మనుభవనమవేద్యం వేదనం విశ్వమంతః. 76

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే ఉత్పత్తిప్రకరణే
పరమకారణవర్ణనం నామ నవమః సర్గః ॥ 9 ॥

ఈ బ్రహ్మమున కుత్పత్తిలేదు, క్షయములేదు, మొదలులేదు; ఇది శాశ్వతము, నిత్యము, మంగళస్వరూపము, పవిత్రము, అమోఘము, వందనీయము, అనింద్యము, ఆగంతుకధర్మ రహితము, కారణకారణము, అజ్ఞేయము, స్వానుభవసంవేద్యము, ఏకమాత్రజ్ఞేయమునై వెలయుచున్నది.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు, ఉత్పత్తిప్రకరణమున
పరమకారణవర్ణనమను నవమసర్గము ॥ 9 ॥

---

## దశమః సర్గః

---

శ్రీరామ ఉవాచ:—

మహాప్రలయసంపత్తౌ యదేతదవశిష్యతే
భవత్యేతదనాకారం నామ నాస్త్యత్ర సంశయః. 1
నశూన్యం కథమేతత్ స్యాన్న ప్రకాశః కథం భవేత్
కథంవా న తమోరూపం కథంవా నైవ భాస్వరమ్. 2

కథంవా నైవ చిద్రూపం జీవోవా సకథం భవేత్
కథం నబుద్ధితత్త్వంస్యాత్ కథంవా నమనో భవేత్. 3

కథంవా నైవ కించిత్ స్యాత్ కథంవా సర్వమిత్యపి
అనయైవ వచోభంగ్యా మమ మోహ ఇవోదితః. 4

శ్రీరాముడు:- మహాప్రళయ సమయమున మిగిలియుండు సద్వస్తువు నామరూపవిహీనమను విషయమున నాకెట్టి సందియమునులేదు. అదిశూన్యముకాదు; ప్రకాశముగాదు, అంధకారముగాదు. తమోరూపమును గాదు, చిత్స్వరూపమును గాదు, జీవుడుకాదు, బుద్ధితత్త్వముగాదు, మనస్సును గాదు; ఏమియును గాదు, అన్నియునగియే!- ఈ మీవాక్యముల రీతినిగ్రహింపలేకున్నాను, దీనిని వివరింపుడు.

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

విషమోఽయమతిప్రశ్నో భవతా సముదాహృతః
భేత్తాస్మ్యహం త్వయత్నేన నైశం తమ ఇవాంశుమాన్. 5

వసిష్ఠుడు:- ఈప్రశ్న చాలకఠినమైనది. అయినను, సూర్యుడనాయాసముగ చీకటిఁబోగొట్టునట్లు నీసందేమును దూరమొనర్చెదను.

మహాకల్పాంతసంపత్తౌ యత్తత్సదవశిష్యతే
తద్రామ న యథాశూన్యం తదిదం శృణు కథ్యతే. 6

రామా! మహాప్రళయ సమయమున మిగిలియుండు సద్వస్తువు శూన్యముకాదు: ఈవిషయమును వివరించి చెప్పుచున్నాను. వినుము.

అనుత్కీర్ణా యథా స్తంభే సంస్థితా శాలభంజికా
తథా విశ్వం స్థితం తత్ర తేన శూన్యం న తత్పదమ్. 7

బొమ్మను చెక్కకమునుపుగూడ అది స్తంభమున—దాని స్తంభసత్తావ్యతిరిక్త సత్తలేనందువలన—ఉండునట్లు, ఈజగత్తు సృష్టికిపూర్వమున బ్రహ్మముననుండును. అందువలన, బ్రహ్మము శూన్యముకాదు.

అయమిత్థం మహాభోగో జగదాఖ్యోఽవభాసతే
సత్యో భవత్వసత్యోవా యత్రతత్ర త్వశూన్యతా. 8

జీవుని భోగనిమిత్తము కల్పింపబడిన ఈవిశాల బ్రహ్మాండము, వాస్తవమే యగుగాక లేక శూన్యమేయగుగాక, ఎటనెటనో ఉండుగాక. అదిప్రకాశించు అధిష్ఠానము మాత్రము శూన్యముకాదు; శూన్యమున ఆరోపాధిష్ఠానాది కార్యములు సంభవములుకావు.

యథా న పుత్రికాశూన్యః స్తంభోఽనుత్కీర్ణ పుత్రికః
తథా భాతం జగద్బ్రహ్మ తేన శూన్యం న తత్పదమ్. 9

ఉత్పత్తికి పూర్వమున స్తంభమున బొమ్మయుండినట్లు, జగత్తుకూడ బ్రహ్మమున ప్రాగుత్పత్తిసమయమున ఉండును. కనుక, బ్రహ్మమును జగత్తును అభిన్నములు. ఫలతః, బ్రహ్మము శూన్యముగాదని తేలుచున్నది.



సౌమ్యాంభసి యథావీచి ర్నచాస్తినచ నాస్తిచ
తథా జగత్ బ్రహ్మణీదం శూన్యాశూన్యం పదంగతం. 10

కదలికలేని నీటియందు తరంగములున్నవనిగాని, లేవనిగాని చెప్పజాలము (పిలయన, తరంగములులేవని స్పష్టముగ జూచుచున్నాము. కాని, అంతర్లీనములై తరంగములున్నవి,) అట్లే, జగత్తుగూడ. ఇదిబ్రహ్మమున శూన్యాశూన్యరూపముల అనగా, అనిర్వచనీయ స్థితియందు నిలచియున్నది.

దేశకాలాదిశాంతత్వాత్ పుత్రికారచనం ద్రుమే
సంభవత్యయథాఽత్రోవై తేనానంతే విముహ్యతే. 11

దేశకాలాదులున్నను శిల్పియొక్క ఇచ్ఛలేనిదే బొమ్మతయారవనట్లు; కల్పాంతసమయమున బ్రహ్మ ఇచ్ఛించినగాని ఈజగత్తు, సృష్టింపబడదు.

తత్సంభపుత్రికాద్యేతత్ పరమార్థే జగత్ స్థితేః
ఏకదేశేన సదృశ ముపమానం న సర్వథా. 12

స్తంభమున జెక్కబడుబొమ్మతో జగత్సృష్టి పోల్పబడినది. ఇచ్చట ఉపమానమును ఆంశికముగ గ్రహింపనగును. సర్వాంశముల పోలికలేదు. ఈ రెంటికిని సామాన్యమగు సత్తయను ఏకదేశాంశము మాత్రమే గ్రహింపబడినది.

న కదాచిదుదేతీదం పరస్మాన్నచ శామ్యతి
ఇత్థం స్థితం కేవలం సత్ బ్రహ్మ స్వాత్మని సంస్థితమ్. 13

వాస్తవమునకు ఈ జగత్తు బ్రహ్మమునుండి ఎన్నడును ఉదయింపలేదు, అస్తమించుటయును లేదు. మఱి, ఇదిబ్రహ్మముకంటె వేరుగాకపోవుటవలన ఆ సత్స్వరూప బ్రహ్మముననే నిలచియున్నది.

అశూన్యాపేక్షయా శూన్యశబ్దార్థపరికల్పనా
అశూన్యత్వాత్ సంభవతః శూన్యతాశూన్యతే కుతః. 14

శూన్యకల్పన అశూన్యము నపేక్షించుచు వచింపబడినవి. కావున్న, అశూన్యమునుండి శూన్యాశూన్యములెట్లు సంభవములగును?

బ్రహ్మణ్యయం ప్రకాశోహి నసంభవతి భూతజః
సూర్యానలేందుతారాదిః కుతస్తత్ర కిలావ్యయే. 15

సూర్యాగ్నిచంద్రతారాది తేజోపదార్థములు బ్రహ్మమును ప్రకాశింపజేయజాలవు. కాన అవ్యయమగు పరమాత్మకెట్టి తేజోపదార్థములతో సంబంధములేదు.

మహాభూతప్రకాశానా మభావస్తమ ఉచ్యతే
మహాభూతాభావజం తు తేనాత్ర నతమః క్వచిత్. 16

భౌతిక తేజముయొక్క అభావమునే "తమస్సు" అందురు. బ్రహ్మమున ఇట్టిభౌతిక తేజము లేకపోయినను, అది స్వప్రకాశక మగుటవలన అది తమస్సుగాదు.

స్వానుభూతిప్రకాశోఽస్య కేవలం వ్యోమరూపిణః
యోఽంతరస్తి స తేనైవ సత్వస్యేనానుభూయతే. 17

ప్రకాశ స్వరూపమగు ఈ బ్రహ్మము స్వయంప్రకాశకమై బుద్ధిగుహయందుండి దానిని బ్రకాశింపజేయుచున్నది. దీని నెవ్వరును బ్రకాశిత మొనర్పజాలరు.

ముక్తం తమఃప్రకాశాభ్యా మిత్యేతదజరం పదం
ఆకాశకోశమేవేదం విద్ధి కోశం జగత్స్థితేః. 18

అందువలన, బ్రహ్మము తమస్సు, ప్రకాశములకంటె నతిరిక్తమని గ్రహింపుము. అది, అజరము, అవ్యయము. ఆకాశమువలె దీనికి సీమలేదు. జగత్ స్థితికి తావలము.

బిల్వస్య బిల్వమధ్యస్య యథా భేదో నకశ్చన
తథాస్తి బ్రహ్మజగతో ర్న మనాగపి భిన్నతా. 19

మారేడు పర్ధునకును లోపలిగుంజునకును భేదము లేనట్లు, బ్రహ్మమునకును జగత్తునకును ఒకింతయును భేదములేదు.

సలిలాంతర్యథా వీచి ర్మృదంతర్ఘటకో యథా
తథా యత్ర జగత్సత్తా తత్కథం ఖాత్మకం భవేత్. 20

నీటియందు అలలును మట్టియందు కుండయు నుండునట్లు బ్రహ్మమున ఈ జగత్తున్నది. ఇట్టి బ్రహ్మపదార్థము శూన్యమెట్లు కాగలదు?

భూజలాద్యుపమానశ్రీః సాకారాంతా సమానసా
బ్రహ్మ త్వాకాశవిశదం తస్యాంతస్థం తథైవ తత్. 31

కాని, ఈ జలభూముల దృష్టాంతము సరియైనది కాదు. ఏలయన, బ్రహ్మము నిరాకారము, అందున్న జగత్తుకూడ నిరాకారమేయగును.

తస్మాద్వ్యాదృక్ చిదాకాశమాకాశాదపి నిర్మలమ్
తదంతస్థం తాదృగేవ జగచ్ఛబ్దార్థభాగపి. 22

ఆకాశరూపమగు చిన్మయబ్రహ్మము ఆకాశముకంటె స్వచ్ఛము. కాన, అందున్న జగచ్ఛబ్దవాచ్యమగు వస్తువుగూడ అట్టిదే.

మరీచేఽంతర్యథా తైక్ష్ణ్యమృతే భోక్తుర్న లక్ష్యతే
చిన్మాత్రత్వం చిదాకాశే తథా చేత్యకలాం వినా. 23

సూర్యకిరణముల వేడిగాక మరొకటి అనుభవము గానట్లు, చిదాకాశమున చిన్మయుని దర్శనము మాత్రమే లభించును.

తస్మాచ్చిదప్యచిద్రూపం చేత్యరిక్తం తదాత్మని
జగత్తా తాదృగేవేయం తావన్మాత్రాత్మతావశాత్. 24

చిత్తు, అచిత్తులు రెండును పరమాత్మయందే యున్నవి. దృశ్యదర్శనములుగ, జూపట్టునదదియే. కాని, వాస్తవమగు దృశ్యత్వము లేనట్లే, జగత్తుకూడలేదు.

రూపాలోకమనస్కారా స్తన్మయా ఏవ నేతరత్
యథాస్థితమతో విశ్వం సుషుప్తం తుర్యమేవ వా. 25



రూపాది బహిర్విషయములును, అంతర్విజ్ఞానమునుగూడ నదియే. విశ్వమెట్లుండిననుసరే తుదకది సుషుప్తిగ మారును.

తేన యోగీ సుషుప్తాత్మా వ్యవహార్యపి శాంతధీః
ఆస్తే బ్రహ్మ నిరాభాసం సర్వాభాససముద్గకః. 26

అందువలన సుషుప్తిభూమికయందున్న యోగి వ్యవహరించుచున్నను, శాంతచిత్తుడై సర్వప్రకాశకమును అప్రకాశ్యమునునగు బ్రహ్మమునను నుండును.

ఆకారిణి యథా సౌమ్యే స్థితాస్తోయే మహోర్మయః
అనాకృతౌ తథా విశ్వం స్థితం తత్సదృశం పరే. 27

ప్రశాంతసలిలముల నానావిధాకారములగు తరంగము లణగియుండునట్లు, నిరాకారబ్రహ్మమున తత్తుల్యమగు యీజగత్తు నిలిచియున్నది.

పూర్ణాత్ పూర్ణం ప్రసరతి యత్తత్పూర్ణం నిరాకృతి
బ్రహ్మణో విశ్వమాభాతం తద్ధి స్వార్థం విచక్షితమ్. 28

పూర్ణబ్రహ్మమునుండి వెలువడు ఔపాధిక భేదము లన్నియు అసలునకు నిరాకారములు. పూర్ణబ్రహ్మమునుండి వెలువడిన యీ జగత్తుకూడ, అధికారిశరీర ప్రాప్తినిగలిగించి, స్వస్వరూపలాభప్రయోజనసిద్ధి కొఱకే ఉపయోగపడుచున్నదని ఎంచబడుచున్నది.

పూర్ణాత్ పూర్ణం ప్రసరతి సంస్థితం పూర్ణమేవ తత్
అతో విశ్వమనుత్పన్నం యచ్చోత్పన్నం తదేవ తత్. 29

పూర్ణమునుండి వెలువడునదిగూడ పూర్ణమే. అందువలన, విశ్వముత్పన్నమయ్యు అనుత్పన్నమేయగుచున్నది.

చేత్యాసంభవతస్తస్మిన్ యదేకా జగదర్థతా
ఆస్వాదకాసంభవతో మరీచేష్వైవ తీక్ష్ణతా. 30

జ్ఞానులకు దృశ్యదర్శనముల భేదమే యగుపడదు. కనుక, వారికి బ్రహ్మమనినను, జగత్తనినను ఒక్కటియే. అనుభవించువాడు లేకున్న సూర్యకిరణముల వేడి తగులనట్లు, ఈ యర్థ మజ్ఞానులకు బోధపడదు.

సత్యేవేయ మసత్యైవ చిత్త చేత్యాదితా పరే
తదభావాత్ ప్రతిబింబస్య ప్రతిబింబార్హతా కుతః. 31

సత్యములవలె గన్పట్టు దృశ్యపదార్థములును, చిత్తమును మిథ్యలు. ఇక ప్రతిబింబార్హత అనగా, జీవభావ మెచ్చట నిలంబడగలదు?

పరమాణోరపి పరం తదణీయో హ్యణీయసః
శుద్ధం సూక్ష్మం పరం శాంతం తదాకాశోదరాదపి. 32
దిక్కాలాద్యనవచ్ఛిన్నరూపత్వాదతివిస్తృతమ్
తదనాద్యంతమాభాసం భాసనీయవివర్జితమ్. 33

చిద్రూపమేవ నోఽయత్ర లభ్యతే తత్ర జీవతా
కథంస్యాత్ చిత్తతాకారా వాసనా నిత్యరూపిణీ. 34
చిద్రూపానూదయాదేవ తత్ర నాస్త్యేవ జీవతా
న బుద్ధితా చిత్తతా వా నేంద్రియత్వం న వాసనా. 35
ఏవమిత్థం మహారంభపూర్ణమవ్యజరం పదమ్
అస్మదృష్ట్యా స్థితం శాంతం శూన్యమాకాశతోఽధికమ్. 36

ఆ బ్రహ్మము అణువుకంటె అణువు, ఆకాశముకంటె గొప్పది, శుద్ధము, సూక్ష్మము, ఆకాశ మధ్యదేశముకంటె ప్రశాంతము. దీనికట్టి రూపమునులేదు. దిక్కాలాదులవలన బంధింపబడని దగుట వలన అతివిస్తృతము, అనాది, స్వప్రకాశము. ఈ చిద్రూపములేనిచోట, వాసనలు, బుద్ధి, చిత్తము, ఇంద్రియములు, జీవమును లేవు. ఇట్లు, ఆ పూర్ణ, అజర, నిరాకార, ప్రశాంత, పరమపదము మనకు గోచరించుచున్నది.

శ్రీ రామ ఉవాచ:—

పరమార్థస్య కిం రూపం తస్యానంతచిదాకృతేః
పునరేతన్మమాచక్ష్వ నిపుణం బోధవృద్ధయే. 37

శ్రీరాముడు:- చిదాకృతియగు పరమార్థతత్త్వముయొక్క రూపమెట్టిదో, మరలనాకు సూక్ష్మభావమున జెప్పుడు; దీనివలన, జ్ఞానము వృద్ధిపొందును.

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

మహాప్రలయసంపత్తౌ సర్వకారణకారణమ్
శిష్యతే పరమం బ్రహ్మ తదిదం వర్ణ్యతే శృణు. 38

వసిష్ఠుడు:- మహాప్రళయ సమయమున మిగిలియుండు కారణకారణమగు పరబ్రహ్మము వర్ణింపబడుచున్నది, వినుము.

నాశయిత్వా స్వమాత్మానం మనసో వృత్తిసంక్షయే
సద్రూపం యదనాఖ్యేయం తద్రూపం తస్య వస్తునః. 39

చిత్తవృత్తులను నిరోధించి, మనస్సును గూడ లయమొనర్చిన, మిగిలియుండు అవర్ణనీయ సాక్షిచైతన్యమే అయ్యది.

నాస్తిదృశ్యం జగద్దీప్తా దృశ్యాభావాద్విలీనవత్
భాతీతి భాసనం యత్స్యాత్ తద్రూపం తస్య వస్తునః. 40

దృశ్యజగత్తునశింప, దృశ్యము లేకుండుటవలన, ద్రష్టకూడ లోపించినట్లగపడును; ఈ త్రిపుటీలయ భాసనమే ఆవస్తువుయొక్క స్వరూపము.

చితేర్జీవస్వభావాయా యదచేత్యోన్ముఖం వపుః
చిన్మాత్రం విమలం శాంతం తద్రూపం పరమాత్మనః. 41

జీవచైతన్యముయొక్క చేత్యభావము లోపించిపోయిన మిగులు, ప్రశాంత చిన్మాత్రమే పరమాత్మ స్వరూపము.



అంగలగ్నేఽపి వాతాదౌ స్పర్శాద్యనుభవం వినా
జీవతశ్చేతసో రూపం యత్తద్వై పరమాత్మనః. 42

జీవించియున్న శరీరమునకు వాతాది స్పర్శలు తగిలినను, చిత్తమునకు స్పర్శజనిత వికారము గలుగని పట్ల, చిత్తముండు స్థితియే ఆపరమాత్మయొక్క స్వరూపము.

అస్వప్నాయా అనంతాయా అజడాయా మనఃస్థితేః
యద్రూపం చిరనిద్రాయా స్తత్తదానఘ శిష్యతే. 43

అనఘా! మనస్సు స్వప్నరహితమును, జాడ్యహీనమును, అపరిచ్ఛిన్నమునునైన కలుగు సుషుప్తిస్థితియొక్క రూపమే, ప్రళయసమయమున మిగులు పరమాత్మయొక్క రూపము.

యద్వ్యోమ్నో హృదయం యద్వా శిలాయాః పవనస్య చ
తస్యాచేత్యస్య చిద్వ్యోమ్న స్తద్రూపం పరమాత్మనః. 44

ఆకాశముయొక్కయు, వాయువుయొక్కయు, శిలయొక్కయు హృదయములును, అదృష్టయొక్క భావమును, ఆ చిన్మయ బ్రహ్మముయొక్క స్వరూపములు.*

అచేత్యస్యామనస్కస్య జీవతో యా స్వభావతః
స్యాత్ స్థితిః సా పరా శాంతా సత్తా తస్యాద్యవస్తునః. 45

జీవుని చేత్యభావమును, చిత్తభావమును తొలగిపోయిన మిగులు, శాంతిరూపసత్తయే ఆ ఆది వస్తువుయొక్క స్వరూపము.

చిత్ప్రకాశస్య యన్మధ్యం ప్రకాశస్యాపి ఖస్య వా
దర్శనస్యచ యన్మధ్యం తద్రూపం బ్రహ్మణో విదుః. 46

చిత్ప్రకాశముయొక్కయు, ఆకాశప్రకాశముయొక్కయు, ఇంద్రియవృత్తియొక్కయు, అంతరమున వికసించునదే బ్రహ్మముయొక్క స్వరూపము.

వేదనస్య ప్రకాశస్య దృశ్యస్య తమసస్తథా
వేదనం యదనాద్యంతం తద్రూపం పరమాత్మనః. 47

ఏఅనాది అనంత, చిచ్ఛక్తివలన దృశ్యములగు, ఘటపటాదులును, అంధకారమును దెలియబడుచున్నవో, అయ్యదియే పరమాత్మ.

యతో జగదుదేతీవ నిత్యానుదితరూప్యపి
విభిన్నవదివాభిన్నం తద్రూపం పరమార్థకమ్. 48

ఏదానినుండి ఈజగత్తు ఉదయించి దానినుండి అభిన్నమయ్యు వేరైనట్లు గన్పడుచున్నదో అయ్యదియే పరమాత్మయొక్క స్వరూపము.

వ్యవహారపరస్యాపి యత్ పాషాణవదాసనమ్
అవ్యోమ్న ఏవ వ్యోమత్వం తద్రూపం పరమాత్మనః. 49

*ఆకాశముయొక్క హృదయము శూన్యత్వము, వాయువుయొక్క హృదయము పూర్ణత్వము, శిలయొక్క హృదయము ఘనత్వము. కనుక, బ్రహ్మము నిర్ధర్మకము, పూర్ణము, సర్వవ్యాపియుని తేలుచున్నది - అను.

ఎయ్యది వ్యవహారపరమయ్యు, శిలవలె, నిశ్చేష్టితమైయున్నదో, ఎయ్యది ఆకాశము గాకుండియు ఆకాశస్వరూపమో, అయ్యదియే పరమాత్మయొక్క స్వరూపము.

వేద్యవేదనవేత్తృత్వ రూపత్రయమిదం పురః
యత్రోదేత్యస్తమాయాతి తత్తత్ పరమదుర్లభమ్. 50

ఎద్దానినుండి, జ్ఞాత, జ్ఞాన, జ్ఞేయములు ఉదయించి అస్తమించుచున్నవో, అదియే పరమదుర్లభమగు పరమాత్మయొక్క స్వరూపము.

వేద్యవేదన వేత్తృత్వం యత్రేదం ప్రతిబింబతి
అబుద్ధ్యాదౌ మహాదర్శే తద్రూపం పరమం స్మృతమ్. 51

పెద్దఅద్దమున మామూలు వస్తువుల నీడపడునట్లు, ఎద్దానియందు జ్ఞాత, జ్ఞాన, జ్ఞేయములు ప్రతిబింబితములగుచున్నవో, అయ్యదియే పరమాత్మయొక్క స్వరూపము.

మనః స్వప్నేంద్రియైర్ముక్తం యద్రూపం స్యాన్మహాచితేః
జంగమే స్థావరే వాపి తత్సర్వాంతేఽవశిష్యతే. 52

మనస్సు జాగ్రత్స్వప్నములనుండి విడివడిన మహాచైతన్యమే సుషుప్తిదశయందునో, చరాచర విశ్వము లయమైన అట్టిస్థితియందు పరమాత్మయుండును.

స్థావరాణాం హి యద్రూపం తచ్చేద్బోధమయం భవేత్
మనోబుద్ధ్యాదినిర్ముక్తం తత్పరేణోపమీయతే. 53

అచల స్వభావములగు స్థావరపదార్థములకు మనోబుద్ధ్యాది ఇంద్రియములులేక, చైతన్యమొక్కటియే యుండిన, వాటిని పరమాత్మతో బోల్చనగును.

బ్రహ్మార్కవిష్ణుహరశక్ర సదాశివాది
శాంతౌ శివం పరమమేతదిహైకమాస్తే
సర్వోపధివ్యయవశాదవికల్పరూపం
చైతన్యమాత్రమయముజ్ఝిత విశ్వసంగమ్. 54

ఇత్యార్షే శ్రీ వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే ఉత్పత్తి ప్రకరణే
మహాకల్పాంతావశిష్ట పరమభావ వర్ణనంనామ దశమః సర్గః ॥ 10 ॥

బ్రహ్మ, సూర్య, విష్ణు, హర, శక్ర, సదాశివాదిదేవతలు లయమైన, పరమశివమగు ఈ సద్వస్తు వొక్కటియే మిగిలియుండును. అప్పుడిద్దాని కెట్టి ఉపాధియు ఉండనందువలన నిది నిర్వికల్పస్వరూపమగును. విశ్వసంజ్ఞను బరిత్యజించి చైతన్యమయ-బ్రహ్మమగును

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు ఉత్పత్తిప్రకరణమున
మహాకల్పాంతావశిష్ట పరమభావ వర్ణనమను దశమ సర్గము ॥ 10 ॥

---

# ఏకాదశః సర్గః.

శ్రీరామ ఉవాచః—

ఇదంరూపమిదం దృశ్యం జగన్నాస్తీతి భాసురమ్
మహాప్రలయసంప్రాప్తౌ భో బ్రహ్మన్ క్వైవ తిష్ఠతి. 1

శ్రీ రాముడు:- బ్రహ్మజ్ఞా! అతిస్పష్టముగ కనంబడుచున్న ఈ స్థావర జంగమాత్మక-జగత్తు ప్రళయసమయమున నెటనుండును?

శ్రీ వసిష్ఠ ఉవాచః—

కుత ఆయాతి కీదృగ్వా వంధ్యా పుత్రః క్వ గచ్ఛతి
క్వ యాతి కుత ఆయాతి వద వా వ్యోమకాననమ్. 2

వసిష్ఠుడు:- వంధ్యాపుత్రుడు, ఎట్లు ఎటనుండి అరుదెంచి ఎట కేగుచున్నాడు? లేక, ఆకాశ-అరణ్యమెటనుండి వచ్చుచున్నది. ఎటకు బోవుచున్నది?— వచింపుము.

శ్రీరామ ఉవాచః—

వంధ్యాపుత్రో వ్యోమవనం నైవాస్తి న భవిష్యతి
కీదృశీ దృశ్యతా తస్య కీదృశీ తస్య నాస్తితా. 3

శ్రీరాముడు:- వంధ్యాపుత్రుడు, ఆకాశ - అరణ్యములను వస్తువులు రెండును ఏకాలమునను లేవు, జన్మింపను జన్మింపవు. కనుక, వాని అస్తిత్వముగాని అభావముగాని సంభవింపవు.

శ్రీ వసిష్ఠ ఉవాచః—

వంధ్యాపుత్రవ్యోమవనే యథా న స్తః కదాచన
జగదాద్యఖిలం దృశ్యం తథా నాస్తి కదాచన. 4
నచోత్పన్నం న చ ధ్వంసి యత్కిలాదౌ న విద్యతే
ఉత్పత్తిః కీదృశీ తస్య నాశ శబ్దస్య కా కథా. 5

వసిష్ఠుడు:- వంధ్యాపుత్రుడును, ఆకాశకాననమును, అభావపదార్థములైనట్లు ఈ జగత్తు కూడ అభావపదార్థమే - దీనికస్తిత్వమే లేదు. మరి, ఎట్లు ఉత్పన్నమవగలదు? ప్రాగభావ సమన్వితమగు ఈ జగత్తునకస్తిత్వముగాని, ఉత్పత్తిగాని, వినాశముగాని లేదు.

శ్రీ రామ ఉవాచః—

వంధ్యాపుత్ర నభోవృక్ష కల్పనా తావదస్తిహి
సా యథా నాశజన్మాఢ్యా తథైవేదం న కిం భవేత్. 6

శ్రీరాముడు:- వంధ్యాపుత్ర, ఆకాశవృక్షముల కల్పనయున్నది. దీని ఉత్పత్తి క్షయములు గూడ అగుపడుచున్నవి; అట్లే, ఈ జగత్తునకుగూడ ఉన్నవనిన దోషమేమి?

శ్రీ వసిష్ఠ ఉవాచః—

తుల్యస్యాతులదుఃస్థస్య భావస్యైః కిల తోలనమ్
నిరన్వయా యథైవోక్తి ర్జగత్సత్తా తథైవహి. 7

యథా సౌవర్ణకటకే దృశ్యమానమిదంస్ఫుటం
కటకత్వంతు నైవాస్తి జగత్త్వం న తథా పరే. 8
ఆకాశేచ యథా నాస్తి శూన్యత్వం వ్యతిరేకవత్
జగత్త్వం బ్రహ్మణి తథా నాస్త్యేవాప్యుపలబ్ధిమత్. 9
కజ్జలాన్న యథాకార్ష్ణ్యంశైత్యం చ న యథా హిమాత్
పృథగేవం భవేద్బుద్ధం జగన్నాస్తిపరేపదే. 10
యథాశైత్యం న శశినో న హిమాద్వ్యతిరిచ్యతే
బ్రహ్మణో నతథా సర్గో విద్యతే వ్యతిరేకవాన్. 11

వసిష్ఠుడు:- ఒకానొకవస్తువునుబోలు మరొకవస్తువు లేకున్న, పండితులు, దానిని దానితోడనే పోల్తురు. అట్లే, వంధ్యాపుత్ర జగత్తులకు బోలికయున్నది, సువర్ణవలయము విడిగా కన్పడుచున్నను దాన వలయత్వమను పదార్థమొకటి విడిగాలేదు. అదిసువర్ణమే; ఆకాశమున ఆకాశత్వముగాక శూన్యమను వస్తువొకటి విడిగాలేదు. అట్లే, ఈ జగత్తు బ్రహ్మముననున్నను, దీనికి వేరురూపములేదు. కాటుకకును, నలుపునకును, మంచునకు, చల్లదనమునకును భేదములేనట్లు, బ్రహ్మమునకును జగత్తుకును భేదములేదు. చంద్రుడు, మంచు, - వీటికిని చల్లదనమునకును ఒకింతయు భేదములేనట్లు, బ్రహ్మమునకును జగత్తుకును ఏ అంశమునను భేదములేదు.

మరునద్యాం యథా తోయం ద్వితీయేందౌ యథేందుతా
నాస్త్యేవేహ జగన్నామ దృష్టమప్యమలాత్మని. 12

ఎండమావియందలి నీటికిని, ద్వితీయచంద్రునియందలి చంద్రత్వమునకును అత్యంతాభావమున్నట్లు, (ఎన్నడును అస్తిత్వములేకపోవుట అత్యంతాభావము) ఈ జగత్తు కనంబడుచున్నను శుద్ధసత్త్వస్వరూపమగు బ్రహ్మమున దీని అత్యంతాభావము నిశ్చితమయియే యున్నది.

ఆదావేవహి యన్నాస్తి కారణాసంభవాత్స్వయమ్
వర్తమానేఽపి తన్నాస్తి నాశః స్యాత్తత్ర కీదృశః. 13

కారణాభావమునజేసి యెవ్వెదట నుండనిది (ప్రాగభావగ్రస్తము) యు, ఇప్పుడు లేనట్టిదియునగుదానికి వినాశమెక్కడ? దాని కత్యంతాభావము సిద్ధించియేయున్నది.

క్వాసంభవద్భూతజాడ్యం పృథ్వ్యాదేర్జడవస్తునః
కారణం భవితుం శక్తం ఛాయాయాశ్చాతపో యథా. 14
కారణాభావతః కార్యం నేదం తత్కించనోదితమ్
యత్తత్కారణమేవాస్తి తదేవేత్థమవస్థితమ్ 15
అజ్ఞానమేవ యద్భాతి సంవిదాభానమేవ తత్
యజ్జగద్దృశ్యతే స్వప్నే సంవిత్స్వాచనమేవ తత్. 16
సంవిత్స్వాచన మేవాంత ర్యథా స్వప్నే జగద్భ్రమః
సర్గాదౌ బ్రహ్మణి తథా జగత్స్వాచనమాత్రకమ్. 17



పృథ్వ్యాది జడవస్తువులకు గారణము జడవస్తువేకావచ్చును. కాని, బ్రహ్మము జడముకాదు ఎండ నీడకు గారణముగానట్లు, విరుద్ధధర్మకమగు బ్రహ్మము జగత్కారణము గాజాలదు. కారణము లేక ఏ కార్యమును సిద్ధింపదు. కాని, ఆదికారణమగు ఆ బ్రహ్మవస్తువే విశ్వమట్లు, గోచరించుచున్నది. ఈ ఆభాసకు కారణము అజ్ఞానము. కాని, ఇది సృష్టించుచుండుట లేదు. అందువలన, ఈ జగద్దృశ్యము స్వప్నమున గనంబడు వస్తువువంటిదేయని గ్రహింపనగును. స్వప్నమున వస్తువులు గనంబడుచున్నను వాస్తవమున కవి వస్తువులుగావు. అట్లే బ్రహ్మమున జగత్తను వస్తువు లేకపోయినను అజ్ఞానమువలన గోచరించుచున్నది.

యదిదం దృశ్యతే కించిత్సదైవాత్మని సంస్థితమ్
నాస్తమేతి నచోదేతి జగత్కించిత్కదాచన. 18

కనబడు ఈ జగత్తంతయు పరమాత్మయందెల్లప్పుడును నిలచియున్నది. ఇది ఒకప్పుడుదయించి, మరొకప్పుడస్తమించుచుండుటలేదు.

యథా ద్రవత్వం సలిలం స్పందనం పవనో యథా
యథా ప్రకాశ ఆభాసో బ్రహ్మైవ త్రిజగత్తథా. 19

నీరు ద్రవభావమును, వాయువు స్పందరూపమును, ప్రకాశము కాంతి ఆకారమునుదాల్చి ఉండునట్లు, బ్రహ్మము జగదాకారమును వహించియున్నది.

యథా పురమివాస్తేఽంతర్వ్యోదేవ స్వప్నసంవిదః
తథా జగదివాభాతి స్వాత్మైవ పరమాత్మని. 20

స్వప్నద్రష్టయొక్క చైతన్యమే అంతరమున నగరాదిరూపమున మారునట్లు, స్వీయ ఆత్మయే బ్రహ్మమున జగదాకారమున ఆభాసించుచున్నది.

శ్రీరామ ఉవాచః—

ఏవం చేత్తత్కథం బ్రహ్మన్స్ఫుటప్రత్యయం వద
ఇదం దృశ్యవిషం జాత మసత్స్వప్నానుభూతివత్. 21

శ్రీ రాముడు:- బ్రహ్మజ్ఞా! విషమగు ఈ దృశ్యజగత్తు స్వప్నానుభూతివలె మిథ్యయే యైనయెడల, దీనియందు మనుజుల కనాదికాలమునుండి విశ్వాసమెట్లేర్పడియున్నది?

సతి దృశ్యే కిల ద్రష్టా సతి ద్రష్టరి దృశ్యతా
ఏకసత్త్వే ద్వయోర్బంధో ముక్తిరేకక్షయే ద్వయోః. 22
అత్యంతాసంభవో యావద్బుద్ధో దృశ్యస్య న క్షయః
తావద్ద్రష్టరి దృశ్యత్వం నసంభవతి మోక్షధీః. 23

దృశ్యముండిన ద్రష్టయుండును, ద్రష్టయుండిన దృశ్యముండును. ఒకటుండిన ఈ రెంటికిని బంధముండును; ఈ రెంటిలో ఏ యొక్కటి లేకున్నను, రెంటికిని ముక్తిగలుగుచున్నది. దృశ్యబుద్ధి సంపూర్ణముగ నశింపనంతవరకు, దృశ్యమగుపడుచునేయుండును, జ్ఞానములభింపదు.

దృశ్యం చేత్సంభవత్యాదౌ పశ్చాత్తత్క్షయముపాలభేత్
[illegible] నాశ్యతి. 24

మొమొదట దృశ్యజ్ఞానముకలిగి పిదప అది నశించుచున్నను, సంసారరూపమున మరలనది యుద్భవించును. కనుక, అనర్థమగు బంధము నశించునని చెప్ప వీలుపడకున్నది

యత్ర క్వచన సంస్థస్య స్యాదర్శస్యేవ చిద్గతేః
ప్రతిబింబోఽలగత్యేవ సర్వస్మృతిమయో హ్యలమ్. 25

అద్దమెటనున్నను నీడను గ్రహింపగలిగినట్లు, చిదాదర్శమే యేస్థితులలోనున్నను, అందు స్మృతినుండి కలుగు సంసారసంస్కారము ప్రతిబింబితమగుచున్నది.

ఆదావేవహి నోత్పన్నం దృశ్యం నాస్త్యేవ చేత్స్వయమ్
ద్రష్టుర్దృశ్యస్వభావత్వాత్తత్సంభవతి ముక్తతా. 26

దృశ్యమసలు ఉత్పన్నమేయగుటలేదనినను, వాస్తమునకు లేదనినను, అనుభూతమగుచుండుటవలన, ముక్తి అసంభవమగుచున్నది.

తస్మాదసంభవన్ముక్తేర్మమ ప్రోత్సార్య యుక్తిభిః
అత్యంతాసంభవో యావత్కథయాత్మవిదాంవర. 27

ఆత్మవిద్వరా! అందువలన ముక్తినరికట్టు దృశ్యజ్ఞానము తొలగిపోవు సుయుక్తుల నుపదేశింపుడు.

శ్రీ వసిష్ఠ ఉవాచః—

అసదేవ సదాభాతి జగత్సర్వాత్మకం యథా
శృణ్వాహం కథయా రామ దీర్ఘయా కథయామితే. 28

వసిష్ఠుడు:— రామా! సర్వాత్మకమగు యీ జగత్తు అసత్యమయ్యు సత్యమట్లు ప్రతిభాసించు విధమును, దీర్ఘములగు కథలవలన నీకు తెలియపరతును. వినుము.

వ్యవసాయకథావాక్యైర్యావత్త్రతానువర్ణితమ్
న విశ్రామ్యతి తే తావద్ధృది పాంసుర్యథా హ్రదే. 29

పూర్వవర్ణితములగు యీ కథలను నేను నీకు జెప్పునంతవఱకు, సరోవరమునుండి ధూళి లేవనట్లు, దృశ్యబుద్ధి నీనుండి తొలగిపోదు.

అత్యంతాభావమస్యాస్త్వం జగత్సర్గభ్రమస్థితేః
బుద్ధైకధ్యాననిష్ఠాత్మా వ్యవహారం కరిష్యసి. 30

భావాభావగ్రహోత్సర్గ స్థూలసూక్ష్మచలాచలాః
దృశస్త్వాం వేధయిష్యంతి న మహాద్రిమివేషవః. 31

నీవీ జగత్-స్థితిని సంపూర్ణముగ భ్రమాత్మకమని వివేచించి, బ్రహ్మవస్తువు నొకదానినే చింతించుచు వ్యవహరింపుము. అట్లైన మహాపర్వతమును ఏ బాణమును ఛేదింపజాలనట్లు, భావాభావ, స్థూలసూక్ష్మాది అభిప్రాయములును స్థిరాస్థిరబోధలును, వ్యవహారదర్శనములును నిన్ను వేధింపజాలవు.

న ఏషోఽస్త్యేక ఏవాత్మా న ద్వితీయాస్తి కల్పనా
జగద్యత యథోత్పన్నం తత్తే వక్ష్యామి రాఘవ. 32



రాఘవా! ఆ ఆత్మవస్తు వొక్కటిమాత్రమేయున్నది, దానిదొండెట్టి వికల్పములును లేవు. దానియందు యీ జగత్తు ఎట్లు ఉత్పన్నమైనది వచింపుచున్నాను.

తస్మాదిమాని సకలాని విజృంభితాని
సోఽపీదమంగ సకలా సకలం మహాత్మా
రూపావలోకనమనోమననప్రకారా
కారాస్పదం స్వయముదేతి విలీయతేచ. 33

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే ఉత్పత్తిప్రకరణే
పరమార్థవర్ణనం నామ ఏకాదశః సర్గః ॥ 11 ॥

దానినుండియే స్థావరజంగమాత్మకమగు యీ జగత్తు విజృంభించినది. వత్సా! ఆ మహాత్మరయే చక్షురాది ఇంద్రియగ్రాహ్యమగు రూపాదిదర్శనముగను, అంతరింద్రియ గ్రాహ్యమగు మననాది పదార్థరూపముగను ప్రకాశించుచున్నది. మరల నదియే విలీనమగుచున్నది.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు, ఉత్పత్తిప్రకరణమున
పరమార్థవర్ణనమను ఏకాదశసర్గము ॥ 11 ॥

—:o:—

## ద్వాదశః సర్గః

శ్రీ వసిష్ఠ ఉవాచః—

ఏతస్మాత్పరమాచ్ఛాంతాత్పదాత్పరమపావనాత్
యథేదముత్థితం విశ్వం తచ్ఛృణూత్తమయా ధియా. 1

వసిష్ఠుడు:— పరమపవిత్రమును, పరమశాంతమునునగు బ్రహ్మపదమునుండి యీ దృశ్యజగత్తు ఉత్పన్నమైన విధమును జెప్పుచున్నాను. వినుము.

సుషుప్తం స్వప్నవద్భాతి భాతి బ్రహ్మైవ సర్గవత్
సర్వాత్మకంచ తత్థ్సానం తత్ర తావత్క్రమం శృణు. 2

సుషుప్తియే స్వప్నావస్థగ కనుబడునట్లు, సర్వస్వరూపమగు బ్రహ్మముగూడ సృష్టితోగూడి ప్రతిభాసించు విధమును జెప్పుచున్నాను, వినుము.

తస్యానంతప్రకాశాత్మ రూపస్యానంతచిన్మణేః
సత్తామాత్రాత్మకం విశ్వ యదజస్రం స్వభావతః. 3

తదాత్మని స్వయం కించి చ్చేత్యతామివగచ్ఛతి
అగృహీతాత్మకం సంవిదహంమర్శనపూర్వకమ్. 4

భావినామార్థకలనైః కించిదూహితరూపకమ్

ఆకాశాదణుశుద్ధంచ సర్వస్మిన్ భాతి బోధనమ్. 5

ఈ విశ్వము అనంతప్రకాశ స్వరూపమును, అనంతచిన్మయమునగు పరమాత్మయొక్క స్వాభావికసత్తగాక వేఱొకటి గాదు. ఈ పరమాత్మ ఆకాశముకంటె, సూక్ష్మము. నిర్మలము. చేత్య భావమువలె ప్రకాశించు చేత్యజ్ఞానము. ప్రథమమున దీనియందు "అహం" జ్ఞానముతో గూడుకొని యుండును; దీనినుండియే జ్ఞానసంస్కారములన్నియు లేచుచున్నవి. ఇవియే ఇతర సంస్కారములతో గూడుకొని మనచిత్తము నుద్బోధించుచున్నవి.

తతః సా పరమాసత్తా సచేతశ్చేతనోన్ముఖీ

చిన్నామయోగ్యా భవతి కించిల్లభ్యతయా తథా. 6

అనంతరము, చిత్తవృత్తులనుబోలు వృత్తులతో గూడుకొనిన చేతనాత్మక బ్రహ్మసత్తయే 'చిత్' అను పేరిట వ్యవహరింపబడుచున్నది.

ఘనసంవేదనా పశ్చాద్భావిజీవాదినామికా

సంభవత్యాత్తకలనా యదోజ్ఝతి పరంపదమ్. 7

పిదప, ఆ పరమవస్తువు, అనాదికాలమునుండి అనుసరించి అరుదెంచి వచ్చుచున్న ఈ క్షణ సంవేదనమువలన జ్ఞానఘనుడై, ఆత్మభావమును విస్మరించి, పరమపదమును త్యజించి, మరల సంసారోపాధితోగూడిన జీవభావమును బొందును.

సత్త్రైవ భావనామాత్ర సారాసంసరణోన్ముఖీ

తదా వస్తుస్వభావేన త్వనుత్తిష్ఠతి తామిమామ్. 8

జీవభావమునందినను అద్దాని బ్రహ్మభావము తొలగిపోదు. కారణమేమన, బ్రహ్మసత్తయే విశేషభావనవలన జీవునియట్లు మారినది, వికారమునందలేదు.

సమనంతరమేవాస్యాః ఖసత్తోదేతి శూన్యతా

శబ్దాదిగుణబీజం సా భవిష్యదభిధార్థదా. 9

ఈ జీవసత్త ప్రకాశించిన పిమ్మట శూన్యస్వరూపమగు ఆకాశసత్త ఆవిర్భవించును. ఇదియే శబ్దగుణమునకును, ఆకాశమను భవిష్యద్వ్యవహారమునకును, ఆస్పద మగుచున్నది.

అహంతోదేతి తదను సహాసై కాలసత్తయా

భవిష్యదభిధార్థేన బీజం ముఖ్యజగత్థితేః. 10

పిమ్మట, కాలసత్తయును దానితోగూడ జీవుని అహంకారాది అభిమానములును, జన్మించుచున్నవి. [illegible] సృష్టికిని, జగత్-స్థితికిని మూలములు.

[illegible]ః శక్తేః పరాయాస్తు స్వసంవేదనమాత్రకమ్

[illegible]జ్జాలమసద్రూపం సదివోదేతి విస్ఫురత్. 11

ఆకాశ, [illegible]ంకార; కాలరూపమగు ఈ సృష్టి హిరణ్యగర్భుని సత్తవలన నిలిచియుండుట లేదు; పరమ[illegible] సత్తవలననే నిలచియున్నది. పరమాత్మనుండియే ఆత్మసంవేద్యమగు ఈ అసద్రూప జగత్తు ఉత్ప[illegible] రూపమున ప్రకాశించుచున్నది.



ఏవంప్రాయాత్మికా సంవిద్బీజం సంకల్పశాఖినః

భవత్యహంకారకణస్తతః స్పందతయా మరుత్. 12

చిదహం తావతీ వ్యోమ శబ్దతన్మాత్రభావనాత్

ఖతో ఘనీభూయ శనైః ఖతన్మాత్రం భవత్యలమ్. 13

అహంకారాది తత్త్వములగూడుకొనిన సంవిత్తే సంకల్పమను వృక్షమునకు బీజము. దీని [illegible]మువలననే స్పందనధర్మియగు వాయు వుత్పన్నమగుచున్నది. అహంభావముతో గూడుకొనిన ఆకాశరూపమగు సత్తను శబ్ద తన్మాత్ర అందురు. దీనినుండియే క్రమముగ ఆకాశ తన్మాత్ర ఉదయించును.

భావినామార్థరూపం తద్బీజం శబ్దౌఘశాఖినః

పదవాక్యప్రమాణాఖ్యం వేదవృందం వికాసితమ్. 14

శబ్దమయమగు వృక్షమునకు గారణభూతమైన దీశబ్దతన్మాత్రమే; ఈ వృక్షమునుండియే పద వాక్యప్రమాణములతోగూడిన వేదములు వికసించినవి.

తస్మాదుదేష్యత్యఖిలా జగచ్ఛ్రీః పరమాత్మనః

శబ్దౌఘనిర్మితార్థౌఘపరిణామవిసారిణః. 15

అర్థములతోగూడిన శబ్దములుగ పరిణమించిన వేదస్వరూప బ్రహ్మమునుండియే ఈ జగ ల్లక్ష్మి ఉదయించుచున్నవి.

చిదేవంపరివారా సా జీవశబ్దేన కథ్యతే

భావిశబ్దార్థజాలేన బీజం రూపౌఘశాఖినః. 16

చతుర్దశవిధం భూతజాలమావలితాంతరం

జగజ్జఠరగర్తౌఘం ప్రసరిష్యతి వై తతః 17

భావిజీవుడని చెప్పబడిన ప్రాణతత్త్వమే ఇంద్రియగ్రాహ్యములగు రూపాదులకు గారణము. ఈ మహావాయువునుండియే, చతుర్దశభువనములు, జరాయుజాది చతుర్విధ ప్రాణిసమూహములును జన్మించినవి.

అసంప్రాప్తాభిధాచారా చిజ్జవాత్ప్రస్ఫురద్వపుః

సాచైవ స్పర్శతన్మాత్రం భావనాద్భవతి క్షణాత్. 18

పవనస్కంధవిస్తారం బీజం స్పర్శౌఘశాఖినః

సర్వభూతక్రియాస్పంద స్తస్మాత్సంప్రసరిష్యతి. 19

ఈప్రాణతత్త్వాభిమానియొక్క చిత్స్ఫురణవలన దేహముత్పన్నమగుచున్నది. దీనినే స్పర్శ తన్మాత్రయందురు. ఈ స్పర్శతన్మాత్రయను వృక్షమునుండియే నలుబదితొమ్మిది వాయుశాఖలు బెలువడుచున్నవి. మఱియు, సర్వభూతముల స్పందనకార్యము నిర్వహింపబడుచున్నది.

తత్రైవ చిద్విలాసేన ప్రకాశోఽనుభవాద్భవేత్

తేజస్తన్మాత్రకం తత్తు భవిష్యదభిధార్థకమ్. 20

తతస్సూర్యాగ్నివిజృంభాది బీజమాలోకశాఖినః
తస్మాద్రూపవిభేదేన సంసారః ప్రసరిష్యతి. 21

ప్రకాశాత్మకత్వభావనవలన, దీనినుండియే తేజోతన్మాత్ర ఉత్పన్నమగుచున్నది. ఈ తేజోవృక్షమునుండియే, సూర్యుడు, అగ్ని, విద్యుత్తు మొదలుగాగల తేజోపదార్థము లుత్పన్నములగుచున్నవి; రూపవిభజన జరిగి, సంసారము విస్తరిల్లుచున్నది.

భావయంస్తనుతామేవ రసస్కంధ ఇవాంభసః
స్వదనం తస్య సంఘస్య రసతన్మాత్రముచ్యతే. 22
భావివారివిలాసాత్మా తద్బీజం రసశాఖినః
అన్యోన్యస్వదనే తస్మాత్సంసారః ప్రసరిష్యతి. 23

ఈ పరమవస్తువే సంకల్పమాత్రమున జలమయశరీరమును గ్రహించును. దీని ఆస్వాదననే రసతన్మాత్రయందురు. ఇదియే ద్రవపదార్థములన్నింటికిని గారణము. ఈ రస-వృక్షము ఇంద్రియగ్రాహ్యమై సంసార విస్తృతికి దోడ్పడుచున్నవి.

భవిష్యద్రూపసంకల్పనామాసా కల్పనాత్మకః
సంకల్పాత్మగుణైర్గంధ తన్మాత్రత్వం ప్రపశ్యతి 24
భావిభూగోలకత్వేన బీజమాకృతిశాఖినః
సర్వాధారాత్మనస్తస్మాత్సంసారః ప్రసరిష్యతి. 25

కల్పనామయమగు ఆత్మయే తన కల్పనా ప్రభావమున గంధతన్మాత్రను వీక్షించును. మనుష్యాది ఆకృతి-వృక్షమును, అన్నింటికిని ఆధారమును, గంధతన్మాత్రామయమును, భవిష్యద్భూగోళ సంజ్ఞకమునునగు పృథివినుండి సంసారము విస్తరిల్లుచున్నది.

చితా విభావ్యమానాని తన్మాత్రాణి పరస్పరమ్
స్వయం పరిణతాన్యంతరంబునీవ నిరంతరమ్. 26

చిత్-శక్తియొక్క భావనవలన గలిగిన తన్మాత్రలే ఒండొంటితోగలసి, బుడగలు నీరుగ మారునట్లు, బ్రహ్మాండమగుచున్నవి.

తథైతాని విమిశ్రాణి వివిక్తాని పునర్యథా
స శుద్ధాస్త్యుపలభ్యంతే సర్వనాశాంతమేవ హి. 27

ఇవి కొంతకాలము కూడియుండును, మరల విడిపోవును. మహాప్రళయమైై ఇవన్నియు సర్వాంతమున వీటివి విశుద్ధ చిత్-శక్తి సంపన్నములని తెలియుజాలము.

శక్తిమాత్రరూపాణి స్థితాని గగనోదరే
సంతి వటజాలాని యథా బీజకణాంతరే. 28

చిన్న బీజయందు చాలచెట్లు ఇమిడియున్నట్లు, యీతన్మాత్రలన్నియు, ఆకాశమున నే వెలయుచున్నవి. మరల వీటినుండియే ఆకాశాదులు ప్రకాశించుచున్నవి.

ప్రపటం పరిపశ్యంతి శతశాఖం స్ఫురంతిచ
పరమాణ్వంతరే కాంతి క్షణాత్కల్పీభవంతిచ. 29



అంకురమునుండి వెలుపడుట, శతశాఖలతో బ్రకాశించుట, క్షణములో ఫలములనొసంగుట-ఇయ్యవి సూక్ష్మపరమాణువున గన్పడుచున్నను, మాయయని గ్రహింపవలెను. స్వప్నమున అతిసూక్ష్మమగు నాడియందుగూడి పెద్దపెద్దవస్తువులు గన్పడుటలేదా! ఇవి వాస్తవములుగావు.

వివర్తమేవ ధావంతి నిర్వివర్తాని సంతిచ
చిద్వేధితాని సర్వాణి క్షణాత్పిండీభవంతిచ 30
తన్మాత్రగణమేతత్స్యాత్సా సంకల్పాత్మికా చితిః
వేదనాత్త్రసరేణ్వాభ మనాకారైవ పశ్యతి. 31

ఈ స్థూలభావములన్నియు ఒకప్పుడు వివర్తము నందుచున్నవి. మరొకప్పుడు వివర్తశూన్యములగుచున్నవి. ఇంకొకప్పుడు చిదాధారమున సూక్ష్మములగుచున్నవి. మరొకప్పుడు స్థూలములగుచున్నవి. సంకల్పాత్మకమగు చిత్-శక్తివలననే తన్మాత్రలై త్రసరేణువులగుచున్నవి. ఇంకొకప్పుడాకారరహితము లగుచున్నవి.

బీజం జగత్సు నను పంచకమాత్రమేవ
బీజం పరా వ్యవహిత స్థితిశక్తిరాద్యా
బీజం తదేవ భవతీతి సదానుభూతం
చిన్మాత్రమేవ మజమాద్యమతో జగచ్ఛ్రీః. 32

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే ఉత్పత్తిప్రకరణే
జగదుత్పత్తివర్ణనం నామ ద్వాదశః సర్గః ॥ 12 ॥

పంచతన్మాత్రలే యీ దృశ్యజగత్తునకు గారణములు. వీటికి పరమాత్మతో నిత్యసంబంధమున్నది. మాయాశక్తియే యీ పంచతన్మాత్రలకు సాక్షాత్కారణమును, పరబ్రహ్మము పరమకారణమునునగుచున్నవి. అనుభూతిగ్రాహ్యమును, ఆదిభావమును, అజమును, చిత్స్వరూపమునునగు పరమాత్మయే యీ ఆదిశక్తికి అనగా మాయాశక్తికి గారణము. ఈ కారణములజేసి, జగల్లక్ష్మి క్రమముగ వికసించుచున్నది.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు ఉత్పత్తి ప్రకరణమున
జగదుత్పత్తివర్ణనము ద్వాదశ సర్గము. ॥ 12 ॥

---

## త్రయోదశః సర్గః.

---

శ్రీ వసిష్ఠ ఉవాచః—

పరమే బ్రహ్మణి స్ఫారే సమే రామ సమస్థితే
అనుత్పన్ననభస్తేజస్తమఃసత్తా చిదాత్మని. 1

వసిష్ఠుడు:- రామా! ఆకాశము, తేజస్సు, తమస్సు — ఇవన్నియు అనుత్పన్నములు. ఇవి చిదాత్మయగు పరబ్రహ్మముయొక్క సత్తవలననే నిలచియున్నవి. వీటికి స్వతంత్రసత్తలేదు.

పూర్వం చేత్యత్వకలనం సతశ్చేత్యాంశచేతనాత్
ఉదేతి చిత్తకలనం చితిశక్త్యా చేతనాత్. 2
తతో జీవత్వకలనం చేత్యసంయోగ చేతనాత్
తతోఽస్య మాయాకలనం చైత్యైకపరతావశాత్. 3

ఈ చిదాత్మయే మొదట చేత్యవిషయమగు కల్పనను, తరువాత దానితోగలసిన జీవభావమును, అహంజ్ఞానమును గల్పించుచున్నది.

తతోబుద్ధిత్వకలన మహంతాపరిణామతః
ఏతదేవ మనస్తాది శబ్దతన్మాత్రకాదిమత్. 4

అహంభావముయొక్క పరిణామమువలన బుద్ధి వికసించుచున్నది. ఈ బుద్ధియే శబ్దాది తన్మాత్రలతోగూడి మననధర్మియగు మనస్సుగ మారుచున్నది.

ఉచ్ఛూనాదన్యతన్మాత్ర భావనాద్భూతరూపిణః
అయమిత్థం మహాగుల్మో జగబాదిర్విలోక్యతే. 5

ఈ మనస్సే తన్మాత్రపంచకముతో గలసి, మహాభూతములుగమారి, జగత్తను గుల్మము (పొద)గ కనంబడుచున్నది.

ఝటిత్యేవం క్రమేణేతి స్వప్నే పురమివాకృతమ్
మహాకాశమహాటవ్యాముద్భూయోద్భూయ నశ్యతి. 6

స్వప్నమున అకృతవస్తువు హఠాత్తుగ కనంబడునట్లు, చిదాత్మ మనస్సుతోగలసి యీ జగత్తును గాంచుచున్నది. ఇట్లగపడు యీ జగత్తు చిన్మయ ఆకాశమున మాటిమాటికి ఉత్పన్నమై నశించుచున్నది.

జగత్కరంజకుంజానాం బీజమేతదవాపజమ్
నాపేక్షతే కించిదపి క్షితివార్యనలాదికమ్. 7

చిదాత్మయే జగత్తను కరంజకుంజముయొక్క బీజము. దీనిని పాత నవసరములేదు. నీరు, నేల వెలుతురుల అవసరము లేకుండగనే, దానియంతట అదే అంకురించుచున్నది.

ఏతచ్చిదాత్మకం పశ్చాత్కాలోర్వ్యాది కరిష్యతి
స్వంస్వప్నవిత్పురమివ చిన్మాత్రాత్మకమేవ యత్. 8
జగదాద్యంకురం యత్ర తత్రస్థమపి ముంచతి
జగతః పంచకం బీజం పంచకస్య చిదవ్యయా. 9
యద్బీజం తత్ఫలం విద్ధి తస్మాద్బ్రహ్మమయం జగత్

కేవల చిద్రూపమగు పరమవస్తువు స్వప్నసృష్టివలె, పృథ్వ్యాదులను సృష్టించుచున్నది. ఈ విశుద్ధచైతన్య మెటునుండినను జగదంకురాతిరిక్తమేయని గ్రహింపనగును. ఇయ్యది అసంగ



స్వభావము. స్థూల జగత్తుయొక్క బీజము పంచతన్మాత్రలు, పంచతన్మాత్రల బీజము అక్షయమును అవ్యయమునునగు చైతన్యము. ఇట్లు జగత్తంతయు బ్రహ్మమయమగుచున్నది.

ఏవమేష మహాకాశే సర్గాదౌ పంచకో గణః. 10
చిచ్ఛక్త్యా స్వాంగభూతాత్మా కల్పితోఽస్తి నవాస్తవః
అనేనోచ్ఛూనతామేత్య యదపీదం వితన్యతే 11
తదప్యాకాశరూపాత్మ కల్పనాత్మని సన్మయమ్
క్వచిన్ననామ తత్సిద్ధం యదసిద్ధేన సాధ్యతే. 12
స్వరూపం యద్వికల్పాత్మ కథం తత్సత్యతామియాత్

ఇట్లు, సృష్టికి పూర్వమున మహాకాశమున తన్మాత్రపంచకములుండును; చైతన్యమే స్వసామర్థ్యమున పంచతన్మాత్రలను గల్పించుచున్నది, ఇవి వాస్తవములుగావు. ఈ పంచతన్మాత్రలు వర్ధిల్లి, స్థూలజగత్తుగ మారుచున్నవి. కనుక, సత్తును, కల్పనాధిష్ఠానమునునగు దానియందు, స్వప్నకల్పనవలె యీ జగత్తు అవస్థితమైయున్నదని తేలుచున్నది. అందువలన, యీ సమస్తమును తత్స్వరూపమనియు, తదతిరిక్తము కాదనియు స్పష్టమగుచున్నది.

అథచేత్పంచకం బ్రహ్మ బ్రహ్మాత్మకతయా ధియా. 13
తత్పంచకం విద్ధి ప్రౌఢో బ్రహ్మైవ త్రిజగత్క్రమః
యథా స్ఫురతిసర్గాదావేష పంచకసంభవః 14
తథైవాద్యాపి భూతత్వే యాతి కారణతా స్వయమ్
ఏవం నజాయతే కించి జ్జగజ్జాతం నలక్ష్యతే. 15

కేవలము కల్పనానర్థితమగునదెట్లు సత్యముగాగలదు? సృష్ట్యాదియందు, తన్మాత్రపంచకమును, తద్భూతజగత్తును, బ్రహ్మచైతన్యమునుండియే వికసించుచున్నవి. బ్రహ్మమే జగత్కార్యమును కారణమునుగూడనై యుండుటవలన, జగత్తను పదార్థమింకొకటి జన్మించలేదు, జన్మించినట్లు ఎవ్వరికిని అగపడియుండలేదు.

స్వప్నసంకల్పపురవ దసత్సదనుభూయతే
బ్రహ్మాకాశపరాకాశే జీవాకాశత్వమాత్మని. 16

స్వప్న దృష్టములగు నగరాదులు అసత్తులయ్యు సద్వస్తువులవలె అనుభూతములగునట్లు, పరమప్రకాశ స్వరూపమగు బ్రహ్మాకాశమున జగత్తుయొక్క కాల్పనిక అస్తిత్వము గోచరించుచున్నది.

ఇతి చిత్యవదాతాత్మా పృథ్వ్యాదీనామసంభవాత్
ఇత్యేష జీవః కథితో వ్యోమ్ని ఖాత్మా ఇవోదితః. 17

పూర్వోక్తరీతి విశుద్ధచిన్మయ బ్రహ్మమున పృథ్వ్యాదుల ఉనికి అసంభవమగుటవలన, ఆకాశమున గంధర్వనగరాదులు గోచరించుటవలె, బ్రహ్మమున జీవుడు ప్రకాశించుచున్నాడు.

జీవాకాశస్స్వమం దేహం యథా విందతి తచ్ఛృణు
జీవాకాశః స్వమేవాసౌ తస్మింస్తు పరమేశ్వరే. 18

అపరమేశ్వరుడే జీవసమష్ట్యాకాశమున సద్రూపమున ప్రతీయమానుడగుచు, స్థూలదేహము నాశ్రయించురీతిని జెప్పుచున్నాను వినుము.

అణు తేజఃకణోఽస్మీతి స్వయం చేతతి చింతయా
యత్తదేవోచ్ఛూనమివ భావయత్యాత్మనాంబరే. 19

మొదట పరమేశ్వరునకు జీవకల్పన అగ్నిస్ఫులింగమువలె కొద్దిగ ఉదయించును; ఇట్టి కల్పనాబలమును జేసియే స్థూలజీవి ఉదయించును.

అసదేవ సదాకారం సంకల్పేందుర్యథా నసన్
తమేవ భావయన్ ద్రష్టృదృశ్యరూపతయా స్థితః. 20

సంకల్పిత చంద్రుడు మిథ్యయైనను సత్యమువలెనే గ్రహింపబడునట్లు, ఈ జీవభావము గూడ అసత్తయ్యు సత్తువలెనే ప్రతీయమానమగుచున్నది. పిమ్మట, భావనాబలముననే ద్రష్టయొక్క దృశ్యముగగూడ మారుచున్నది.

ఏకఏవ ద్వితామేతి స్వప్నే స్వమృతిబోధవత్
కించిత్స్థౌల్యమివాదత్తే తతస్తారకతాం విదన్. 21
యథాభావితమాత్రార్థ భావితాద్విశ్వరూపతః
సఏవ స్వాత్మా సతతోఽవ్యయం సోహమితి స్వయమ్. 22
చిత్తాత్ప్రత్యయ మాధత్తే స్వప్నే స్వామివ పాంథతామ్
తారకాకారమాకారం భావిదేహాభిధం తథా. 23
భావయత్యేతి తద్భావం చిత్తం చేత్యార్థతామివ
పరిత్యజ్యైవ తద్బాహ్యం తతస్తారకకోటరే. 24
అంతర్భాతి బహిష్ఠోఽపి పర్వతో ముకురే యథా
కూపసంస్థో యథా దేహః సముద్గకగతం వచః. 25

పిదప, ఆ సూక్ష్మతేజము స్ఫులింగభావమును బరిత్యజించి తన్ను స్థూలముగ భావించి, స్థూలమగుచున్నది. స్వప్నమున నిజమృత్యువు ననుభవించునట్లు, ఒకేవస్తువు రెండుగ మారినట్లు అగపడుచున్నవి. కాని, వాస్తవమునకు అది రెండగుచుండుటలేదు. ఆ లింగదేహము జ్ఞాన, చిత్తకల్పనలజేసి స్థూలశరీరమును గ్రహించి, ఆయా ఉపాధుల 'సోహం' భావమున భావితమగుచున్నది. ఈ లింగాకారమే భవిష్యత్-స్థూలశరీరమునకు గారణమగుచున్నది. పురుషుడు స్వప్నమున తన్ను పాంథునిగ తలచుకొనునట్లే, జీవుడు తన్ను శరీరిగ భావించుకొనును. చిత్తము ఏయేవిషయముల ఆకారమును దాల్చుచుండునో, జీవుడుగూడ అట్టివేయగు ఉపాధుల ధరించుచుండును. పర్వతము బయటనుండియు అద్దమున గనబడునట్లు, సర్వగామియగు ఈ ఆత్మ జ్యోతిర్మయ లింగశరీరమున 'అహం' అభిమానమును దాల్చి వెలయుచున్నది. నూతిలోబడినవాడు బయటకు రాజాలనట్లు, అయ్యది ఈ దేహాభిమానమును వదలలేకున్నది.

స్వప్నసంకల్పయోః సంవిద్వేత్త్యేతజ్జీవకోణకే
స్వరూపతారకాంతస్థో జీవోఽయం చేతతి స్వయమ్. 26



స్వప్నదర్శనమును, సంకల్పమును, ఈశరీరముననే జరుగునట్లు, జీవుడు స్ఫులింగరూపోపాధియందు అహంకారముతోగూడి, దానియందు ఉన్నవానిగ భావించుకొని, కల్పనామయదేహమును అనుభవించుచున్నాడు.

తదేతద్బుద్ధి చిత్తాది జ్ఞానసత్తాదిరూపకమ్
జీవాకాశః స్వతస్త్వత తారకాకాశకోశగమ్. 27

ఈ జీవబుద్ధి చిత్తము, సత్తలతోగూడి స్వయముగనే జ్యోతిరాకాశమధ్యమున అనగా లింగశరీరమున వెలయుచున్నది.

ప్రేక్షేఽహమితి భావేన ద్రష్టుం ప్రసరతీవ ఖే
తతో రంధ్రద్వయేనైవ భావిబాహ్యాభిధం పునః. 28

'నేను జూతును' అను భావముదయించిన, భవిష్యద్బాహ్యదృశ్యమును జూడ నేత్రముల నుండి దృష్టి ప్రసరించును.

యేన పశ్యతి తన్నేత్రయుగం నామ్నా భవిష్యతి
యేన స్పృశతి సానైత్వగ్యచ్ఛృణోతి శ్రుతిస్తు సా. 29
యేన జిఘ్రతి తద్ఘ్రాణం సస్వమాత్మని పశ్యతి
తత్తస్య స్వదనం పశ్చాద్రసనా చోల్లసిష్యతి. 30

దేనివలన గాంతుమో, అదినయనము, దేనివలన స్పృశింతుమో, అది త్వక్కు. దేనివలన విందుమో అదికర్ణము. వాసనచూచునది ఘ్రాణము. చవిచూచునది నాలుక అనంబడుచున్నవి.

స్పందతే యత్స తద్వాయు శ్చేష్టా కర్మేంద్రియవ్రజమ్
రూపాలోకమనస్కార జాత మిత్యపి భావయత్. 31

ఎద్దానివలన ప్రయత్నము, కర్మేంద్రియములు వికసించుచున్నవో, ఎయ్యది స్పందించుచున్నదో, దానిని వాయువందురు. ఈ వాయువే బాహ్యవిజ్ఞానమును, అంతర్విజ్ఞానమును గలిగించుచున్నది.

ఆతివాహికదేహాత్మా తిష్ఠత్యంబరమంబరే
ఏవముచ్ఛూనతాం తస్మిన్ భావయత్తేజసః కణే. 32
అసత్యాం సత్యసంకాశాం బ్రహ్మస్తే జీవశబ్దవత్
ఇత్థం సజీవశబ్దార్థః కలనాకులతాం గతః. 33

ఇట్లు, ఆతివాహికదేహియగు బ్రహ్మయే, స్థూలాకారమును ధరించుటవలన, స్థూలదర్శనము లభించుచున్నది. ఈయనయే లింగశరీరాది స్థూలవిషయములమధ్య ఆకాశమువలె వెలయుచున్నాడు. అసత్యమైనను సత్యమువలెదోచు కల్పనను ఆశ్రయించియే బ్రహ్మ జీవశబ్దార్థబోధకమగు జీవత్వమును గ్రహించినాడు.

ఆతివాహికదేహాత్మా చిత్తదేహాంబరాకృతిః
స్వకల్పనాంత ఆకారమండం సంస్థం ప్రపశ్యతి. 34

ఆతివాహిక దేహియగు ఆ పరమాత్మ స్థూలదేహావరణమునుండి, స్వబుద్ధి కల్పితమగు బ్రహ్మాండమును గాంచుచున్నాడు.

కశ్చిజ్జలగతంవేత్తి కశ్చిత్సమ్రాట్ స్వరూపిణమ్
భావిబ్రహ్మాండకలనాం పశ్యత్యనుభవత్యపి. 35

ఒకానొక జీవి జగత్తును, మఱొక జీవి సామ్రాట్స్వరూపమును, ఇంకొక జీవి భావి బ్రహ్మాండమును, గాంచుచున్నారు. అనుభవించుచున్నారు.

ఆత్మగర్భగృహాం చిత్తా ద్యథా సంకల్పమాత్మనః
దేశకాలక్రియాద్రవ్యకల్పనాం వేదనం సతత్. 36
భావయఞ్ఛబ్దనిర్మాతా శబ్దైర్బధ్నాతి కల్పితైః
ఆతివాహికదేహోఽసావిత్యసత్యజగద్భ్రమే. 37
అసత్య ఏవ కచతి స్వప్నే స్వోడ్డయనం యథా
ఇత్యనుత్పన్నఏవాసౌ స్వయంభూః స్వయముత్థితః. 38
ఆతివాహికదేహాత్మా ప్రభురాద్యః ప్రజాపతిః
ఏతస్మిన్నపి సంపన్నే బ్రహ్మాండాకారిణి భ్రమే. 39
న కించిదపి సంపన్నం నచజాతం న దృశ్యతే
తద్బ్రహ్మాకాశమాకాశ మేవస్థిత మనంతకమ్. 40

జీవుడు నిజగర్భగృహమగు చిత్తమునుండియే కల్పనానుసారముగ, కాలము, కార్యము, కల్పన, ద్రవ్యముల ననుభవించుచున్నాడు. ఆయాశబ్దములచే బద్ధుడగుచున్నాడు. వస్తుతః ఇది స్వప్న కల్పనవలె అసత్తగుటవలన అత్యంత అలీకము అదువలననే, దీనిని అనుత్పన్న మందురు. వాస్తవమున నుత్పత్తిలేకున్నను, విశ్వరూపుడును, ఆది ప్రభువుననగు స్వయంభువు ఇట్లు ఉత్పన్నమగు చున్నాడని వచింపవచ్చును - బ్రహ్మాండాకారమగు ఈ భ్రమయందు ఆతివాహిక దేహస్వరూపియగు ఆదిప్రభువు ప్రజాపతిగాక మరొకటిలేదు. ఇందేదియు ఉత్పన్నమవలేదు. ఏమియునులేదు. అగుపడుటలేదు. అనంతాకాశమువలె బ్రహ్మాకాశమే ఉన్నది.

సంకల్పనగరాకార మేతత్సదపి నైవసత్
అనిర్మిత మరాగం చ ఏతద్వై చిత్రముత్థితమ్. 41
అకృతం చానుభూతంచ న సత్యం సత్యవత్స్థితమ్
మహాకల్పే విముక్తత్వాద్బ్రహ్మాదీనామసంశయమ్. 42
స్మృతిర్నప్రాక్తనీ కాచిత్కారణం వా స్వయంభువః
తేన యాదృక్ స్వయంభూః స్యాత్తాదృక్తజ్జమిదం స్మృతమ్. 43

ఇది సత్తవలె గ్రహింపబడుచున్నను స్వప్నదృష్టనగరమువలె అలీకము. ఇది ఎట్టి ద్రవ్యముల వలనను ఒనర్పబడకున్నను, రంజితమవకున్నను, అత్యాశ్చర్యమును గలిగించుచు ప్రకాశించుచున్నది. ఈ అలీకదృశ్యము ఎవ్వరును సృష్టింపకున్నను, అనుభవింపకున్నను, సత్యమువలెననే ప్రతీయమానమగుచున్నది. మహాప్రళయ సమయమున బ్రహ్మాదులు లయమగుట నిశ్చితము; అగుచో వారి సృష్టిని గుఱించి వేరుగ చెప్పవలయునా ? సృష్టికర్త ఎటువంటివాడగునో జగత్తుగూడ అట్టిదే యగును.



అనాద్యనుభవస్త్వేత్థం యోఽత్రాస్త్యవనికాదికే
స్వప్నానుభూతం పృథ్వ్యాది ప్రబోధే యాదృశం భవేత్. 44
స్మృతః స వ్యోమమాత్రాత్మా సర్వదైవ స్మృతం జగత్
యత్ర యత్ర యథా తోయే ద్రవత్వం నామ భిద్యతే. 45
తత్రతత్ర తథా నాన్యః సర్గోఽస్తి పరమాత్మని
సృష్టిరేవమియం ప్రోథా సమ ఏవ త్వయం స్థితః. 46
భాత్యేవం నామ బ్రహ్మాండంవ్యోమాత్మైవాతినిర్మలమ్
దృశ్యమేవమిదం శాంతం స్వాత్మనిర్మితవిభ్రమమ్. 47
నిరాధారం నిరాధేయ మద్వైతం చైక్యవర్జితమ్
జగత్సంవిది జాతాయా మపి జాతం న కించన. 48
పరమాకాశమాశూన్య మచ్ఛమేవ వ్యవస్థితమ్
సర్వసంసారతా నాస్తి యదేవ తదవస్థితమ్. 49
నాధేయం తత్ర నాధారో నదృశ్యం న చ ద్రష్టృతా
బ్రహ్మాండం నాస్తి న బ్రహ్మ న చ వైతండికా క్వచిత్. 50

ఈజగత్తు స్వప్నమున అంతర్ధానమైనప్పుడు, పరమాత్మ కేవలాద్వయబ్రహ్మస్వరూపమున వెలయుచుండును. అప్పుడీదృశ్యములేవియు నుండవు. స్వప్నదర్శనానంతరము స్వప్నదృష్టములగు గృహాదులు కేవలము స్మృతి ఆకారముననే అనుభూతములగునట్లు, ఆకాశస్వరూపమగు జగత్కారణము గూడ, జగద్రూపమున అనుభూతమగుచున్నది. ద్రవత్వము నీటినుండి వేరుగానట్లు, సృష్టిగూడ పరమాత్మకంటె వేరుగాదు. ఈ బ్రహ్మాండము ఆకాశమువలె అతినిర్మలము, ప్రశాంతము, నిరాధారము, నిరాధేయము, అద్వయము, అనుపమమునై వెలయుచున్నది. ఇది బ్రహ్మమునుండి ఉత్పన్నమయ్యు, ఉత్పన్నమగుటలేదు. ఇది పరమాకాశమువలె, శూన్యమును, నిర్మలమునునై వెలయుచున్నది. వాస్తవమునకు, సంసారమనునదియేలేదు. ఇది ఆధేయముగాదు, ఆధారమునుగాదు, ద్రష్టకాదు, దృశ్యమునుగాదు. పెక్కుమాటలేల ? దీనియందు బ్రహ్మయనిగాని, బ్రహ్మాండమనిగాని చెప్పబడు పదార్థములులేవు. ఇవి వితండవాదములుమాత్రమే.

న జగన్నాపి జగతీ శాంతమేవాఖిలం స్థితమ్
బ్రహ్మైవ కచతి స్వచ్ఛ మిత్థమాత్మాత్మనాత్మని. 51
చిత్త్వాద్ద్రవత్వా త్సలిల మివావర్తతయాత్మని
అసదేవేదమాభాతి సదివేహానుభూయతే 52

జంగమస్థావరాదు లెవ్వియును లేవు. ఇవన్నియు జలముల సుడిగుండములు లేచునట్లు, బ్రహ్మము తనయందుతానే వీటిని గల్పించుకొనుచు విలీన మొనర్చుకొనుచున్నది. ఇయ్యది దృశ్యదశయందు అసత్తువలె ప్రకాశించియు దృశ్యరూపమున అనుభూత మగుచున్నది.

వినశ్యత్యసదేవాంతే స్వప్నే స్వమరణం యథా
అథవా స్వస్వరూపత్వా త్సదేవేదమనామయమ్
అఖండితమనాద్యంతం జ్ఞానమాత్రాంబరోదితమ్. 53

స్వప్నమున స్వమరణమునుగాంచి నిద్రావసానమున నయ్యది అలీకమని ఎఱుంగునట్లు జ్ఞానము గలిగిన ఈ సంసారము మిథ్యయని బోధపడును. అప్పుడు కేవలము, అఖండమును, అనాదియు అనంతమును నగు బ్రహ్మమునే జ్ఞానాకాశమున దర్శింపగలము.

ఆకాశఏవ పరమే ప్రథమః ప్రజేశో
నిత్యం స్వయం కచతి శూన్యతయా సమో యః
న హ్యాతివాహికవపుర్న తు భూతరూపీ
పృథ్వ్యాది తేన న సదస్తి యథా నజాతమ్. 54

ఇత్యార్షే శ్రీ వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే ఉత్పత్తి ప్రకరణే
స్వయంభూత్పత్తి వర్ణనంనామ త్రయోదశః సర్గః ॥ 13 ॥

ఆ పరమాకాశమున స్వయముగ శూన్యస్వరూపమున వెలయు ఆది ప్రజాపతి, అతివాహిక దేహధారి. అతని దేహము పాంచ భౌతికముగాదు, అందువలన, అజాతములగు శశశృంగాదులవలె, తత్సంభూతములగు పృథ్వ్యాదులుగూడ సత్తులుకావని గ్రహింపనది.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు ఉత్పత్తిప్రకరణమున
స్వయంభూత్పత్తి వర్ణనమను త్రయోదశ సర్గము ॥ 13 ॥

---

## చతుర్దశః సర్గః.

---

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

ఇత్థం జగదహంతాది దృశ్యజాతం నకించన
అజాతత్వాచ్చ నాస్త్యేవ యచ్చాస్తి పరమేవ తత్. 1

వసిష్ఠుడు:— అహంభావాపన్నములగు జగదాది దృశ్యసమూహము లేమియులేవు. ఇవి అజాతములగుటవలన లేనట్టివే. బ్రహ్మయొక్కటియే సత్పదార్థము, ఇతరములు గావు.

పరమాకాశమేవాదౌ జీవతాం చేతతి స్వయమ్
నిఃస్పందాంబోధికుహరే సలిలం స్పందతామివ. 2
ఆకాశరూపమజహదేవం వేత్తీవ హృద్యతామ్
స్వప్నసంకల్పశైలాదానివ చిద్వృత్తిరాంతరీ. 3

నిశ్చలమగు సముద్రమే చంచలమగు తరంగములుగ మారునట్లు, మొట్టమొదట పరమాకాశమే ఆకాశరూపమును త్యజింపకుండగనే జీవరూపమున ప్రకాశము నందుచున్నది. సంకల్పరూపమగు చిద్వృత్తియే అసంఖ్యములగు జీవరూపములను దాల్చుచున్నది.



పృథ్వ్యాదిరహితో దేహో యో విరాడాత్మకో మహాన్
అతివాహిక ఏవాసౌ చిన్మాత్రాచ్చ నభోమయః. 4
అక్షయః స్వప్నశైలాభః స్థిర స్వప్నపురోపమః
చిత్రకృత్త్విరచిత్తస్థ చిత్రసైన్యసమాకృతిః. 5
అనిఖాత మహాస్తంభ పుత్రికౌఘసమోపమః
బ్రహ్మకాశేఽనిఖాతాత్మా సుస్తంభే శాలభంజికా. 6

ప్రథమజీవియును, విరాట్టును, ప్రజాపతియునగు బ్రహ్మయొక్క చిత్స్వరూప ఆకాశ దేహమును అతివాహికమందురు. ఇది స్వప్నమున గనపడు కొండవలె ఆభాసించుచున్నది. ఇయ్యది చిత్రకారుని ఏకాగ్రచిత్తమున గల్పింపబడిన సేనాదళమువంటిది. ఒకానొక స్తంభమున బొమ్మ చెక్కబడకున్న, దానితో ఆ విరాట్పురుషుని బోల్పవచ్చును

ఆద్యః ప్రజాపతిః పూర్వం స్వయంభూరితి విశ్రుతః
ప్రాక్తనానాం స్వకార్యాణా మభావాదప్యకారణః. 7
మహాప్రలయపర్యంతేష్వాద్యకాలపితామహాః
ముచ్యంతే సర్వఏవాతః ప్రాక్తనం కర్మ తేషు కిమ్. 8

ఆది ప్రజాపతియగు ఈ బ్రహ్మకు సామాన్యప్రాణికున్నట్లు, ఉత్పాదక కారణములేదు. పూర్వపు ప్రజాపతులు మహాప్రళయసమయమున ముక్తులైనారు; ప్రాక్తన కర్మలు వారిని బంధింపలేదు.

సోఽకుడ్య ఏవ కుడ్యాత్మా దృశ్యాదృశ్యః స్వయంస్థితః
నచ దృశ్యం నచ ద్రష్టా న స్రష్టా సర్వమేవచ. 9

అద్దమున ప్రతిబింబించు గోడవలె, ఆదిప్రజాపతి దృశ్యమువలెనే యున్నను, స్వతంత్ర సత్తాశూన్యుడగుటవలన, దర్శన–అయోగ్యుడగుచున్నాడు. మఱియు, దృశ్య, దర్శన, స్రష్టలుగాకుండియు, అన్నియునగుచున్నాడు.

ప్రతి శబ్ద పదార్థానాం సర్వేషామేష ఏవ సః
తస్మాదుదేతి జీవాలీ దీపాలీ దీపకాదివ. 10

దీపమునుండి దీపము వెలిగింపబడునట్లు, వానినుండియే ఈ జీవసమూహములన్నియు ఉత్పన్నములగుచున్నవి.

సంకల్పఏవ సంకల్పాత్ కాలైతి త్మాదివర్జితః
ఆదిమాదివ నిఃశూన్యః స్వప్నాత్స్వప్నాంతరం యథా. 11
అస్మాదేకప్రతిస్పందా జీవాః సంప్రసరంతి యే
సహకారికారణానామభావాచ్చ సఏవ తే. 12
సహకారికారణానామభావే కార్యకారణమ్
ఏకమేతదతో నాన్యః పరస్పరవిలక్షణః. 13

సంకల్పమునుండి సంకల్పమును, స్వప్నమునుండి స్వప్నమును గలుగునట్లు, అతనినుండియే ఇవన్నియు గలుగుచున్నవి. వృక్షమునుండి శాఖలు వెలువడునట్లు అతని స్పందమువలననే జీవుడుత్పన్నమగుచున్నాడు. సహకారికారణము లేకున్న కార్యకారణము లభిన్నములగును. అందువలన, సృష్టికిని పరమాత్మకును భేదములేదు.

బ్రహ్మైవాద్యో విరాడాత్మా విరాడాత్మైవ సర్గతా
జీవాకాశః సఏవేత్థం స్థితః పృథ్వ్యాద్యసద్వతః. 14

ఎవ్వనియందు పృథ్వ్యాది అలీకవస్తువులు గనపడుచున్నవో, అతడే జీవాకాశస్వరూపుడగు ఆదిబ్రహ్మ, అతనినే విరాట్-ఆత్మ అనికూడ అందురు.

శ్రీరామ ఉవాచః—

కింస్యాత్పరిమితో జీవో రాశిరాహో అనంతకః
ఆహోస్విద స్త్యనంతాత్మా జీవపిండోఽచలోపమః. 15
ధారాః పయోముచఇవ శీకరా ఇవ వారిధేః
కణాస్తప్తాయస ఇవ కస్మా న్నిర్యాంతి జీవకాః. 16
ఇతిమే భగవన్బ్రూహి జీవజాలవినిర్ణయమ్
జ్ఞాతమేతన్మయాప్రాయ స్తదేవ ప్రకటీకురు. 17

శ్రీరాముడు:- భగవానుడా! ఈజీవుడపరిమితుడా? లేక పరిమితుడా? జీవులు పెక్కురా లేక, ఒక్కడా? పెక్కుమంది ఉన్నను వారు అచలమువలె అనంతస్వరూపులా? మేఘములనుండి జలధారలును, సముద్రమునుండి జలకణములును, తప్తాయఃపిండమునుండి స్ఫులింగములును వెలువడునట్లు, ఈజీవులెటనుండి వెలువడుచున్నారు? దీనిని నాకుజెప్పుడు. మీరునాకు జెప్పినదాని నంతటిని ప్రాయికముగ గ్రహించితినిగాని, విశేషముగ వర్ణింపుడు.

శ్రీ వసిష్ఠ ఉవాచః—

ఏకఏవ న జీవోఽస్తి రాశీనాం సంభవః కుతః
శశశృంగం సముద్దిశ్య ప్రయాతీవహి తే వచః. 18

వసిష్ఠుడు:- జీవుడొక్కడైనను లేడే! ఇక పెక్కుజీవులమాట ఏమి? కుందేటికొమ్మును దాల్చి ఏగుచున్నాడనునన్నట్లున్నవి నీ పల్కులు.

నజీవోఽస్తినజీవానాం రాశయః సంతి రాఘవ
నచైకః పర్వతప్రఖ్యో జీవపిండోఽస్తి కశ్చన. 19

రాఘవా! జీవుడులేడు, జీవరాశియునులేదు. పర్వతమువంటి జీవపిండమునులేదు.

జీవశబ్దార్థకలనాః సమస్తకలనాన్వితాః
నేహ కాశ్చన సంతీతి నిశ్చయోఽస్తు తవాచలః 20
శుద్ధచిన్మాత్రమమలం బ్రహ్మాస్తీహ హి సర్వగమ్
తద్యథా సర్వశక్తిత్వా ద్విందతే యాః స్వయం కలాః. 21



జీవుడు ప్రతిభాసగాక వాస్తవముగాదు. శుద్ధమును, సర్వముగను, పవిత్రమునునగు బ్రహ్మము తప్ప వేరొకవస్తువులేదు. అయ్యది సర్వశక్తిమంతము. అందువలన కల్పనాకాశలములన్నియు దానియందే ప్రతిష్ఠితములైయున్నవి.

చిన్మాత్రానుక్రమేణైవ సంప్రఫుల్లలతామివ
నను మూర్తామమూర్తాంవా తామేవాశు ప్రపశ్యతి. 22

సంకల్పవృత్తులు, చైతన్యమున ప్రతిబింబించి సాకారములును, నిరాకారములునునగు పదార్థములుగ ఆవిర్భవించుచున్నవి. ఇవి ఆ బ్రహ్మమునే కనంబడుచున్నవి. ఈ కల్పనావృత్తుల ప్రకాశము, వికసించు పూలతోగూడిన లతవంటిది. (లతమొగ్గదొడగి వికసించునట్లు, జగత్కల్పనాకౌశలముగూడ చైతన్యసంసర్గమున వికసించుచున్నది.) దీనిని గాంచునదిగూడ బ్రహ్మమే.

జీవో బుద్ధిః క్రియాస్పందో మనోద్విత్వైక్యమిత్యపి
స్వసత్తాం ప్రకచంతీం తాం నియోజయతి వేదనే. 23

జీవుడు, బుద్ధి, క్రియ, స్పందనము, మనస్సు ద్వైతభావము, బ్రహ్మసత్త - ఇవియే జ్ఞానగమ్యములగుచున్నవి. అస్తిత్వమేకమాత్రబ్రహ్మముననే ఉన్నది. అన్యపదార్థముల కస్తిత్వము బ్రహ్మమువలననే ఏర్పడుచున్నది.

సాఽబుద్ధైవ భవత్యేవం భవేద్బ్రహ్మైవ బోధతః
అబోధః ప్రేక్షయా యాతి నాశం నతు ప్రబుధ్యతే. 24

బ్రహ్మసత్తను తత్త్వతః తెలిసికొనక పోవుటవలననే, అది అన్యసత్తవలె ప్రతిభాతమగుచున్నది. తత్త్వతః, గ్రహించిన అదికాక వేరొకటి అగుపడదు. బ్రహ్మసత్తను ఆవరించియుండు అజ్ఞానమును, ఆత్మజ్ఞానము వినాశమొనర్చుచున్నది. కాని, అజ్ఞానమెట్టిదో చెప్పజాలము.

యథాంధకారో దీపేన ప్రేక్ష్యమాణః ప్రణశ్యతి
నచాస్య జ్ఞాయతే తత్త్వ మబోధస్యైవమేవహి. 25

దీపపు వెల్తురువలన చీకటినశించును గాని చీకటియన నేమియో చెప్పజాలము. అట్లే, జ్ఞానమువలన అజ్ఞానము నశించునుగాని, అజ్ఞానముయొక్క తత్త్వము నెఱుంగజాలము.

ఏవంబ్రహ్మైవ జీవాత్మా నిర్విభాగో నిరంతరః
సర్వశక్తిరనాద్యంతో మహాచిత్సార రూపవాన్. 26

అందువలన తేలునదేమన, బ్రహ్మమే జీవాత్మయని. ఇయ్యది అపరిచ్ఛిన్నము, అఖండము; సర్వశక్తిమంతము, అనాది, అనంతము, సత్యము, చైతన్యస్వరూపము.

సర్వానణుతయా త్వస్య నక్వచిద్భేదకల్పనా
విద్యతే యాహి కలనా సా తదేవానుభూతితః. 27

ఈ బ్రహ్మము సర్వస్వరూపము; దీనియందు భేదకల్పనలేదు. ఈ జగత్కల్పనముగూడ అపరోక్షానుభూతియందు బ్రహ్మమునందే పర్యవసించుచున్నది.

శ్రీరామ ఉవాచ:—

ఏవమేతత్కథం బ్రహ్మన్నేకజీవేచ్ఛయాఽఖిలాః
జగజ్జీవా న యుజ్యంతే మహాజీవైకతావశాత్. 28

శ్రీ రాముడు:- సరియే కాని, జీవసమిష్టియే మహాజీవుడనుచున్నారు. ఇతనికి అంగమైన వ్యష్టిజీవున కొకనికేదైన ఇచ్ఛజనించిన అందఱికిని ఇట్టిదేయగు ఇచ్ఛజనింపదా? జీవులకు పరస్పరభేద మేమియును లేదుకదా!

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

మహాజీవాత్మ తద్బ్రహ్మ సర్వశక్తిమయాత్మకమ్
స్థితం తథేచ్ఛమేవేహ నిర్విభాగం నిరంతరమ్. 29
యదేవేచ్ఛతి తత్తస్య భవత్యాశు మహాత్మనః
పూర్వం తేనేష్టమిచ్ఛాది తతోద్విత్వముదేతి యత్. 30

వసిష్ఠుడు:- బ్రహ్మమే సమిష్టి జీవరూపమును గ్రహించి, పిదప వ్యష్టిజీవరూపమును దాల్చుచున్నది. జగద్-వ్యవస్థ ఇచ్ఛారూపమున సర్వశక్తిమంతుడును, మహాజీవియును అగు అఖండబ్రహ్మమున నుండును. అతడు నిరంతర మెద్దానిని గోరుచుండునో, అయ్యది సత్వరము ఫలించుచుండును. సత్యసంకల్పము అతనిఇచ్ఛకు లోబడినదే. పూర్వమే అది యుండుటవలన వ్యష్టివిభాగము ఉత్పన్నమగుచున్నది. సమిష్టిజీవుడు వ్యష్టియగుటకూడ, ఆ బ్రహ్మముయొక్క ఇచ్ఛాలీలయే.

పశ్చాద్ద్విత్వవిభక్తానాం స్వశక్తీనాం ప్రకల్పితః
అనేనేత్థంహి భవతీత్యేవం తేన క్రియాక్రమః. 31.

తన అంశలగు జీవసమూహమును "ఇది ఇట్లగును" అని సంకల్పించి కల్పించుచున్నాడు

తంవినానుదయే త్వాసాం ప్రధానేచ్ఛైవ రోహతి
శక్త్యా హ్యజాతయా బ్రాహ్మ్యా నియమోఽయం ప్రకల్పితః. 32

కార్యము నొనర్పవలసినరీతిని అవలంబింపకపోయిన కార్యము సిద్ధింపదు. కాని, సమిష్టిజీవి తలచినంతమాత్రముననే కార్యము సిద్ధించును. వ్యష్టిజీవి ప్రయత్నమొనర్చినగాని ఫలింపదు. ఈ నియమమునకు వ్యతిక్రమము గోచరించినపట్ల అనగా మహాత్ముల కార్యములు సంకల్పమాత్రముననే ఈడేరినపట్ల, సమిష్టిజీవి ఇచ్ఛ ననుమానింపవలెను.

యస్యా జీవాభిధానాయాః శక్త్యపేక్షాఫలత్యసౌ
ప్రధానశక్తినియమానుష్ఠానేన వినా నతు. 33

వ్యష్టిజీవి ఇచ్ఛకుగారణము. సమిష్టిజీవి ఇచ్ఛ; ఇది ఫలించుటకుగూడ నదియే కారణమైయున్నది.

ప్రధానశక్తినియమైః సుప్రతిష్ఠో నచేద్భవేత్
తత్ఫలం శక్త్యధీనత్వాన్నేహితానాం క్వచిద్భవేత్. 34

సమిష్టిజీవి నిర్మించిన నియమమునకు అనగా ఈశ్వరనియమమునకు వ్యతిరేకముగ ఏ కార్యమును సిద్ధింపదు. సమిష్టిజీవి ఇచ్ఛ ఫలసిద్ధికి అనుకూలముగనుండిన కార్యము సిద్ధించును. ఏలగున



ఇవన్నియు ఈశ్వరేచ్ఛానుసారమే జరుగుచున్నవి. వ్యష్టిజీవి ఇచ్ఛవలననేమియు సిద్ధింపదు. (మహాత్ముల ఇచ్ఛానుసారము కార్యము సిద్ధించునను యీశ్వర నియమముండుటవలననే వారి కార్యము సిద్ధించుచున్నది.)

ఏవం బ్రహ్మ మహాజీవో విద్యతేఽంతాదివర్జితః
జీవకోటి మహాకోటి భవత్యథ నకించన. 35

బ్రహ్మస్వరూపుడగు మహాజీవి ఆద్యంతరహితుడు. అతడే కోట్లకొలదిగల జీవులయొక్కయు మహాజీవులయొక్కయు స్వరూపమైయున్నాడు. అతడుగానిదెద్దియులేదు.

చేత్యసంవేదనాజ్జీవో భవత్యాయాతి సంసృతిమ్
తదసంవేదనాద్రూపం సమాయాతి సమం పునః. 36

జీవబ్రహ్మలకు చైతన్యాంశమున భేదములేకపోయినను ఉపాధిభేదమున్నది. జీవసమిష్టియని చెప్పబడువానికి కారణ, సూక్ష్మశరీరములున్నవి. వ్యష్టిజీవికి ఈరెండునుగాక, క్రియాశ్రయమగు స్థూలశరీరముగూడనున్నది. వృత్తి, ఇచ్ఛ, ఫలముల తారతమ్యమునకు ఈ ఉపాధిభేదమే కారణమగుచున్నది. జడవస్తుసంసర్గముననే బ్రహ్మమునకు జీవభావమును, సంసారమునుగలుగుచున్నవి. ఈసంసర్గము దూరమైన సమస్వరూపము సిద్ధించును.

ఏవం కనిష్ఠజీవానాం జ్యేష్ఠజీవక్రమాక్రమైః
సముదేత్యాత్మజీవత్వం తామ్రాణామివ హేమతా. 37

తామ్రము (రాగి) రసౌషధాదియోగముననగాని, లేక స్పర్శవలననో సువర్ణమగునట్లు, జీవుడు బ్రహ్మభావమును, సమిష్టిజీవభావమును బొంది పరంపరాక్రమముగనో, లేక సాక్షాత్తుగనో పొందును.

అత్రాంతరే మహాకాశ ఇత్థమేష గణోఽవ్యసన్
స్వాత్మైవ సదివోదేతి చిచ్చమత్కరణాత్మకః. 38

హృదయమున ప్రకాశించు మహాకాశస్వరూపమగు ఆత్మయందు, జగత్తు అసత్తు అయినను సత్తువలె ప్రకాశితమగుచున్నది. వాస్తవమున కియ్యది చైతన్యచమత్కారము (లీల) గాక వేరొండుకాదు.

స్వయమేవ చమత్కారో యః సమాపద్యతే చితః
భవిష్యన్నామదేహాది తదహంభావనం విదుః. 39

ఈచైతన్యస్ఫూర్తి తనంతటదానే భవిష్యన్నామరూపములను గ్రహించుచున్నది.

చితో యస్మాచ్చిదాలేహ స్తన్మయత్వాదనంతకః
సఏష భువనాభోగ ఇతి తస్యాం ప్రబింబతి. 40

ఈచైతన్య బింబము, చిదాభాస ప్రతిబింబము — ఇవి చిన్మయ చిదాభాసలుగాక వేరొండుకావు. అందువలన, ఇవిగూడ అనంతములేయని గ్రహింపనగును. ఈ చిదాభాసయే జగద్రూపమున ఆత్మచైతన్యమున ప్రతిబింబించుచున్నది. ఈప్రకాశముగూడ చైతన్యప్రకాశమే.

పరిణామవికారాది శబ్దైస్సైవ చిదవ్యయా
తాదృగ్రూపాదభేద్యాపి స్వశక్త్యైవ విబుధ్యతే. 41

ఈ చిదాభాస — చైతన్యము నిత్యము; బింబచైతన్యమునుండి అభిన్నమైనను పరిణామాది శబ్దములవలన విభిన్నమైనట్లు తెలియబడుచున్నది, ఇదిగూడ అచ్చైతన్య శక్తివలననే సంభవించుచున్నది.

అవిచ్ఛిన్నవిలాసాత్మ స్వతోఽయత్స్వదనం చితః
చేత్యస్యచ ప్రకాశస్య జగదిత్యేవ తత్స్థితమ్. 42

చేతనము, జడము, జడప్రకాశముల అభిన్నానుభవము భ్రాంతివలన జగద్రూపమున వ్యవహరింపబడుచున్నది.

ఆకాశాదపి సూక్ష్మైషా యా శక్తిర్వితతా చితః
సా స్వభావత ఏవైతామహంతాం పరిపశ్యతి. 43

చేతన స్వరూపమగు బ్రహ్మముయొక్క వికాలశక్తి ఆకాశముకంటె సూక్ష్మము; అహంభావ దర్శనము దీనివలననే గలుగుచున్నది.

ఆత్మన్యాత్మాత్మనైవాస్యా యత్ప్రస్ఫురతి వారివత్
జగదంతమహంతాణుం తదైషా సంప్రపశ్యతి. 44

జలము, తరంగములవలె వాస్తవమున కభిన్నమయ్యు భిన్నముగ కన్పట్టు, అహంకార మూలక బ్రహ్మాండమును, చైతన్యశక్తి తనయంతటదానే, తనయందే దర్శించుచున్నది.

చమత్కారకరీ చారు యచ్చమత్కురుతే చితిః
స్వయం స్వాత్మని తస్యైవ జగన్నామకృతం తతః. 45

ఈ చిత్-శక్తి నిజరూపమున స్వయముగ ఏమనోహర వివర్త వైచిత్ర్యమును గల్పించుచున్నదో, అదియే జగత్తనంబడుచున్నది.

చితశ్చేత్యమహంకారః సైవ రాఘవ కల్పనా
తన్మాత్రాది చిదేవాతో ద్విత్వైకత్వే క్వసంస్థితే. 46

రాఘవా ! బుద్ధి, లేక అహంకార మనంబడునది చిత్-శక్తియొక్క వివర్తము మాత్రమే. ఇదియొక కల్పనగాక, వాస్తవముకాదు. అట్లే, పంచతన్మాత్రలుగూడ చైతన్యముయొక్క వివర్తములై యున్నవి. ఇంక ద్వైతభావన, ఏకత్వములను గుఱించి చెప్పవలసిన దేమున్నది?

జీవహేత్వాదిసంత్యాగే త్వంచాహంచేతి సంత్యజ
శేషః సదసతోర్మధ్యే భవత్యర్థాత్మకో భవేత్. 47

వాసనలను, కర్మలను పరిత్యజించి 'నీవు, నేను' అను భేదభావమును త్యజింపుము. అప్పుడు సత్యానృతముల, సత్యముమాత్రమే మిగిలియుండును.

చితా యథాదౌ కలితా స్వసత్తా సా తథోదితా
అభిన్నాదృశ్యతే వ్యోమ్నః సత్తాసత్తే నవిద్మహే. 48

మేఘములగప్పబడిన ఆకాశముయొక్క స్వరూపమును గ్రహింపజాలము. మేఘములు తొలగినదాని స్వచ్ఛస్వరూపము గోచరించును; ఈ ఆకాశముయొక్క అస్తిత్వముగూడ ఆకాశ



ముననే గోచరించుచున్నది. అట్లే, దృశ్యప్రపంచము తొలగిపోయిన చిత్-శక్తియొక్క స్వాభావిక సత్త గోచరించును; ఈసత్తగూడ దానికంటె వేరుగాదు. సత్తయననేమియో, అసత్తయన నేమియో మే మెఱుంగము. అత డప్పుడు స్వచ్ఛుడై వెలయునని మాత్రము చెప్పగలము.

విశ్వం ఖం జగదీహాఖ్యం ఖమస్తి విబుధాలయః
సాకారశ్చిచ్చమత్కార రూపత్వాన్నాన్యదస్తి హి. 49

మనశ్చేష్టా రూపకమగు ఈ సూక్ష్మజగత్తు శూన్యముమాత్రమే. ఇంద్రియాధిష్ఠితమగు స్థూలదేహమును, దేవనివాసయోగ్యమగు బ్రహ్మాండమునుగూడ శూన్యములే, ఇవన్నియు చైతన్యముయొక్క వివర్త పరివర్తనలైయున్నవి. మఱి, ఇవి దానినుండి భిన్నములుకావు.

యో యద్విలాసస్తస్మాత్స నకదాచన భిద్యతే
అపి సావయవం తస్మాత్తైక్యావానవయవే కథా. 50

ఏపదార్థ మేద్దానినుండి ఉత్పన్నమో, అదిఅద్దానినుండి భిన్నముకాదు, సావయవ పదార్థములకే ఈనియమము చెల్లినను, ఇక నిరవయవ పదార్థముల మాటేమి?

చితేర్నిత్యమచేత్యాయా నిర్నామ్న్యా వితతాకృతేః
యద్రూపం జగతోరూపం తత్తత్స్ఫురణరూపిణః. 51

చిత్-శక్తి స్వయంప్రకాశము. దీనికి నామరూపములులేవు. దీని స్ఫురణయే జగద్రూపమున ప్రతిబింబించుచున్నది.

మనోబుద్ధిరహంకారో భూతాని గిరయో దిశః
ఇతి యా యాస్తు రచనాశ్చిత స్తత్త్వాజ్జగత్స్థితేః. 52

మనస్సు, బుద్ధి, అహంకారము, పంచభూతములు, పర్వతములు దిక్కులు - ఇదంతయు చైతన్యరచనయే. ఏలయన, జగత్తుయొక్క స్వరూపము చైతన్యముననే పర్యవసించుచున్నది.

చితేశ్చిత్త్వం జగద్విద్ధి నాజగచ్చిత్త్వమస్తిహి
అజగత్త్వాదచిచ్చిత్త్వా ద్భానాద్భేదో జగత్కుతః. 53

జగత్తు చిత్-శక్తియొక్క ధర్మమని గ్రహింపుము. జగత్తును విడిచిన, చిత్-శక్తియొక్క శక్తిత్వమే లోపించిపోవును. జగద్భావము తొలగిన, జడపదార్థముయొక్క పరిణామముగూడ చిత్-శక్తియందే పర్యవసించును, అదిదూరమనినచో భేదజ్ఞానము తొలగదు. ఇక జగత్తునకు స్వతంత్రసత్త ఎటనున్నది?

చితేర్మరీచిబీజస్య నిజా యాంతశ్చమత్కృతిః
సా చైషా జీవతన్మాత్రమాత్రం జగదితి స్థితా. 54

చిత్-శక్తియందున్న ప్రపంచ ప్రకటనాశక్తి, జీవరూపమునను, తన్మాత్రరూపమునను ప్రతిభాతమై జగత్తట్లు కన్పడుచున్నది.

చిత్తాత్స్వశక్తికచనం యదహంభావనం చితః
జీవఃస్పందనకర్మాత్మా భవిష్యదభిధోఽహ్యసౌ. 55

చిత్తుతోఁగూడిన అహంభావస్ఫురణయే ప్రాణములోఁగూడి జీవుడను సంజ్ఞను బడయు చున్నది.

యచ్చిచ్చిత్త్వేన కచనం స్వసంపాద్యాభిధాత్మకమ్
స్వవికారై ర్వ్యవచ్ఛేద్యం భిద్యతే నో నవిద్యతే. 56

చిత్-శక్తియు, దానియొక్క స్ఫురణయు అహంభావము వలన వేరుపరుపబడి జీవసంజ్ఞను దాల్చినను, ఈ వ్యవచ్ఛేదధర్మము అలీకమగుటవలన, వాస్తవమగు భేదములేదు.

చిత్స్పందరూపిణోరస్తి నభేదః కర్తృకర్మణోః
స్పందమాత్రం భవేత్కర్మ సఏవ పురుషః స్మృతః. 57

చైతన్యప్రధానమగు అహంకారమే కర్త, క్రియాప్రధానమగు ప్రాణమే కర్మ. ఈ రెంటికిని భేదము లేదు. కర్తయొక్క ధర్మవిశేషమే కర్మ. అందువలన, కర్మయే జీవుడని చెప్పబడుచున్నది.

జీవశ్చిత్తపరిస్పందః పుంసాం చిత్తం సఏవచ
మనస్త్వింద్రియరూపంసత్సత్తాం నానేవ గచ్ఛతి. 58

ఈ క్రియామయ జీవుడే పురుషుని చిత్తము; ఈ చిత్తమే ఇంద్రియరూపమున ప్రకటితమై నానావిధములుగ ప్రతీయమానమగుచున్నది.

శాంతాశేషవిశేషంహి చిత్ప్రకాశచ్ఛటాజగత్
కార్యకారణకాదిత్వం తస్మాదన్యన్న విద్యతే. 59

ఈ జగత్తుయొక్క కార్యకారణభావము అలీకము. జగత్తు చిత్-ప్రకాశముయొక్క అంశమే అందువలన, జగత్తున భేదము 'అసలే' లేదు.

అచ్ఛేద్యోఽహమదాహ్యోఽహ మక్లేద్యోఽశోష్యఏవచ
నిత్యఃసర్వగతఃస్థాణు రచలోఽహమితి స్థితమ్. 60

ఛేదము, దాహము, శుష్కభావములు ఆత్మకులేవు. ఆత్మ సర్వవికార వివర్జితము. ఆత్మ నిత్యము, సర్వగము, స్థిరతరము.

వివదంతే తథాహ్యత్ర వివదంతో యథాభ్రమైః
భ్రమయంతోఽవయంత్వేతే జాతా విగతవిభ్రమాః. 61

తాను గాంచు భ్రమయందితరులను పడగొట్టుట, శాస్త్రమును గ్రహించక వివాదపడుట, [illegible] మా భ్రమ తొలగిపోయినది. బ్రహ్మతత్త్వమును గ్రహించితిమి.

దృశ్యే మూర్తేఽజ్ఞసంరూఢే వికారాదిపృథగ్భవేత్
నామూర్తే తజ్జ్ఞచితే చిత్తే సదసదాత్మని. 62

అజ్ఞానికడనే దృశ్యప్రపంచము మూర్తిమంతమై, వికారాదులతో గోచరించుచున్నది. కాని, జ్ఞానికి దృశ్య ప్రపంచమగుపడదు. అతడనుభవించు చిదాకాశమున, సదసద్భావములన్నియు పర్యవసించుచున్నవి.



చిత్తరా చేత్యరసతః శక్తిః కాలాదినామికాం
తనోత్యాకాశవిశదాం చిన్మధుశ్రీఃస్వమంజరీమ్. 63

చిద్వృత్తిము మాయయను వసంతాగమమున, జడాశక్తియను రససంచారమును బడసి, కాలాదులను మంజరులను, ఆకాశమున వికసింపజేయును.

స్వయంవిచిత్రం స్ఫురతి చిదండకమనాహతమ్
స్వయంవిలక్షణస్పందం చిద్వాయురండజాత్మకః. 64
స్వయంవిచిత్రంకచనం చిద్వారి న నిఖాతగం
స్వయంవిచిత్రధాతుత్వం శ్లేష్మాంగమపి నిర్మితమ్. 65
స్వవిచిత్రరసోల్లాసా చిజ్జ్యోత్స్నా సతతోదితా
స్వయంచిదేవప్రకట శ్చిదాలోకో మహాత్మకః. 66
స్వయమస్తంగతేబాహ్యే స్వజ్ఞానాదుదితాచితిః
స్వయంజడేషుజాడ్యేన పదంసాషుప్తమాగతా. 67
స్వయంస్పందితయాస్పంది చిత్త్వాచ్ఛితి మహానభః
చిత్ప్రకాశప్రకాశోహి జగదస్తిచనాస్తిచ. 68
చిదాకాశైకశూన్యత్వం జగదస్తిచనాస్తిచ
చిదాలోకమహారూపం జగదస్తిచనాస్తిచ. 69
చిన్మారుతపరిస్పందో జగదస్తిచనాస్తిచ
చిద్ఘనధ్వాంతకృష్ణత్వం జగదస్తిచనాస్తిచ. 70
చిదర్కాలోకదివసో జగదస్తిచనాస్తిచ
చిత్కజ్జలరజస్తైల పరమాణుర్జగత్రికమః. 71

ఆకాశము, స్పందధర్మియగు వాయువు, తేజము, జలరాశి, దేవాసుర మనుష్యభోగ్యమగు వసుంధర, ఓషధీశుడగు చంద్రుడు మహాజ్యోతియగు సూర్యుడు మొదలగు అనేకరూపముల బ్రహ్మప్రకటితి మగుచున్నది. బ్రహ్మసత్తగాక వీటికి స్వతంత్రసత్తలేదు. స్వరూపజ్ఞానమున దృశ్య ప్రపంచము నశించిన, చిద్బ్రహ్మ పూర్వభావముననే వెలయును. జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలయందు బ్రహ్మమే స్ఫురించుచున్నది. జడభావసమ్మేళనక్రియ, మనోభావప్రాప్తులయందే, ఈ మూడు అవస్థలును ఉన్నవి. బ్రహ్మసత్తనుండియే జగత్సత్త ఏర్పడుచున్నది. స్వరూపతః, జగత్తు అసత్యము. జగత్తు చిత్స్వరూప మహాకాశముయొక్క శూన్యభావము. జగత్తు చిత్స్వరూపవాయువుయొక్క స్పందనము, జగత్తు చిత్స్వరూప గాఢాంధకారముయొక్క నలుపు, జగత్తు చిత్స్వరూప సూర్యాలోకముయొక్క దినకల్పన. కనుక, ఇది స్వరూపతః అసత్యము, కాని అధిష్ఠానరూపమున సత్యము. దీపశిఖ ఆరిపోయిన మసిమాత్రమే మిగిలియుండునట్లు, జగత్తునశించినను బ్రహ్మమే మిగిలియుండును.

చిదగ్నావ్యణ్వంజగల్లేఖాజగచ్ఛిచ్ఛంఖశుక్లతా
జగచ్చిచ్ఛైలజఠరం చిజ్జలద్రవతా జగత్. 72

జగచ్చిదిక్షుమాధుర్యం చిత్ క్షీరస్నిగ్ధతా జగత్
జగచ్ఛిద్ధిమశీతత్వం చిజ్జ్వాలాజ్వలనం జగత్. 73
జగచ్చిత్సర్షపస్నేహో వీచిశ్చిత్సరితో జగత్.
జగచ్చిత్ క్షౌద్రమాధుర్యం జగచ్చిత్కనకాంగదమ్ 74
జగచ్చిత్పుష్పసౌగంధ్యం చిల్లతాగ్రఫలం జగత్
చిత్సత్తైవ జగత్సత్తా జగత్సత్తైవ చిద్వపుః. 75

జగత్తు, చిత్స్వరూపాగ్నియొక్క వేడిమి, చిత్స్వరూపశంఖముయొక్క తెలుపు, చిత్స్వరూప పర్వతముయొక్క గుహ, చిత్స్వరూప జలముయొక్క ద్రవత్వము, చిత్స్వరూప ఇక్షురసముయొక్క మాధుర్యము. చిత్స్వరూప దుగ్ధమునందలి స్నేహభావము (జిడ్డు), చిత్స్వరూప తుషారముయొక్క చల్లదనము, చిత్స్వరూపానలముయొక్క జ్వాల, చిత్స్వరూప సర్షపము (ఆవగింజ) యొక్క చమురు, చిత్స్వరూప నదియొక్క తరంగము, చిత్స్వరూప మధురముయొక్క మాధుర్యము. చిత్స్వరూప సువర్ణముయొక్క కేయూరము, చిత్స్వరూప కుసుమముయొక్క సౌరభము. చిత్స్వరూప లతాగ్రముయొక్క ఫలము. చిత్సత్తయే జగత్సత్త. జగత్సత్తయే జగత్తుయొక్క ఆకారము.

అత్రభేదవికారాది నభే మలమివ స్థితమ్
ఇతీదం సన్మయత్వేనసదసద్భువనత్రయమ్. 76

ఆకాశమున నీలిరంగు కనబడుచున్నను వాస్తవమునకది లేనట్లు, భేదవికారములు కనబడుచున్నను, వాస్తవమునకవి బ్రహ్మమునలేవు. భువనత్రయమిట్లు అసత్తయ్యు, సన్మయముగ కన్పడుటవలన, సచ్ఛబ్దవ్యవహార యోగ్యమగుచున్నది.

అవికల్పితదాత్మత్వా త్సత్తాసత్తైకతైవచ
అవయవావయవితా శబ్దార్థా శశశృంగవత్. 77
అనుభూత్యపలాపాయ కల్పితో యైర్థిగస్తుతాన్
నవిద్యతే జగద్యత్ర సాద్ర్యబ్ధ్యుర్వీనదీశ్వరమ్. 78

కల్పిత పదార్థముల సత్తలేక అసత్తు అధిష్ఠానసత్తకంటె వ్యతిరిక్తముకాదు. దానియొక్క సదసత్తలు సమానములై యుండును. 'అనుభవ విరుద్ధము' అని అవయవ అవయవిశబ్దముల అర్థకల్పననొనరించి, 'నిరాకార సాకారములకు సమాన సత్తయుండదు' అని దోషారోపణచేయువారికి ధిక్కారము. ఇట్టి శబ్దార్థకల్పన శశశృంగమువలె అలీకమని గ్రహింపనగును. నదనదీశైల సాగరములతో గూడిన మేదినికే స్వతంత్రసత్తలేని పట్ల, అవయవాది భ్రమకల్పనాప్రసక్తికి ఆస్కారమేముండునో, గ్రహింపనగును.

చిదేకత్వాత్ప్రసంగః స్యా త్కస్త్రత్రేతరవిభ్రమః
శిలాహృదయపీనాపి స్వాకాశే విశదైవ చిత్. 79
ధత్తేఽంతరఖిలం శాంతం సన్నివేశం యథాశిలా
పదార్థనికరాకాశే త్వేయమాకాశజో మలః. 80



సత్తాసత్తాత్మతాత్వత్తా మత్తాశ్లేషా నసంతి తే
పల్లవాంతరలేఖౌఘ సన్నివేశవదాతతమ్. 81

స్ఫటికము లోపలవెలుపల నిండియున్నట్లగపడినను, దానియందాకాశమున్నది; ఆ ఆకాశము స్వచ్ఛము. మఱియు, ఈ శిలయే నానాపదార్థములకు ప్రతిబింబ - అధిష్ఠానమగుచున్నది (అనగా నానావిధములగు పదార్థము లిందు ప్రతిబింబించుచున్నవి. అట్లే, చిన్మయమగు మాయగూడ బాహ్యాభ్యంతరముల జడమైనను, దానియందు చిత్ - ప్రతిబింబము పడుచున్నది. చిత్ - ప్రతిబింబముతో గూడిన మాయయందే అలీకజగత్తు ప్రతిభాతమగుచున్నది. పదార్థసమూహాంతర్గతమగు స్థూలాకాశమున, ఆకాశజనిత వాయ్వాదుల సంపర్కములేనట్లు, చిదాకాశమున సదసత్తులయొక్కయు, 'నీ, నా' యొక్కయు మాలిన్యములేదు. చిగురుటాకునందున్న సిరలు దానినుండి వేరుగాకున్నను, వేరైనట్లు కనబడునట్లు, జగత్తుకూడ బ్రహ్మమునుండి వేరుగాకున్నను వేరైనట్లు కన్పించుచున్నది.

అన్యానన్యాత్మకమిదం ధత్తేఽంతశ్చిత్స్వభావతః
సమస్తకారణౌఘానాం కారణాది పితామహః. 82

బ్రహ్మము, జగత్తులు పరస్పరాభిన్నములైనను ఈ జగత్తును బ్రహ్మమే ధరించుచున్నది బ్రహ్మ కారణ కారణమగు ఆదికారణము. ఈ బ్రహ్మమే చిత్తాధిష్ఠితమగు చైతన్యము.

స్వభావతోఽకారణాత్మ చిత్తంచిద్ధ్యనుభూతితః
నచాసత్త్వమచేత్యాయాశ్చితో వాచాపి సిద్ధ్యతి. 83

స్వరూపత, చిత్తునకు గారణములేదు. అనగా, చిత్తునకు లేక పదార్థములన్నింటికి స్వరూపావస్థ బ్రహ్మమే. (చిత్తునకు గారణములేదనుట స్వరూపావస్థను లక్షించి, చిత్తునకు గారణమున్నదనుట జౌపాధిక అవస్థను నిర్దేశించి) ఈ చిత్తు అనుభవగమ్యము. చేత్యపదార్థమునకు వ్యావహారిక సదసత్తులున్నవికాని, అచేత్యచిత్తుయొక్క అసత్తా వ్యవహారమువలన అసిద్ధము.

యదస్తి తదుదేతీతి దృష్టం బీజాదివాంకురః. 48

ఏలయన, బీజమున అంకురము వలెనుండునదే, వెలువడుచున్నది.

గగనమివసుశూన్యభేదమస్తి త్రిభువనమంగ మహాచితోఽంతరస్థాః
పరమపదమయం సమస్తదృశ్యం త్విదమితి నిశ్చయవాన్భవానుభూతేః. 85

వత్సా! ఆకాశమువలె ఈ మహాచిత్తునందున్న ఈ భేదశూన్య త్రిభువనములన్నియు, బ్రహ్మస్వరూపములే, అను నిశ్చయమును గలిగించుకొనుము.

శ్రీ వాల్మీకి రువాచ:—

ఇత్యుక్తవత్యథమునౌ దివసో జగామ
సాయంతనాయ విధయేఽస్తమినో జగామ,
స్నాతుం సభాకృతనమస్కరణా జగామ
శ్యామాక్షయే రవికరైశ్చ సహాజగామ. 86

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ-మహారామాయణే వాల్మీకీయే ఉత్పత్తిప్రకరణే
బ్రహ్మప్రతిపాదనంనామ చతుర్దశః సర్గః ॥ 14 ॥

ఇతి తృతీయో దివసః

శ్రీవాల్మీకి:- మూడవ దినము ఇట్లుపల్కుచుండ దివసావసానమయ్యెను. సాయంకాలవిధుల నాచరించుటకు కారణమగు సూర్యుడస్తమించెను. సాయంస్నానమొనర్ప సభ్యులు నమస్కరించి నిష్క్రమించిరి. పిదప, సూర్యోదయమవ, సూర్యకిరణములతో బాటు వారును మరల అరుదెంచిరి.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు ఉత్పత్తి ప్రకరణమున
బ్రహ్మప్రతిపాదనమను చతుర్దశసర్గము. ॥ 14 ॥

ఇది తృతీయ దినము.

## పంచదశః సర్గః

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

జగదాకాశమేవేదం యథా హి వ్యోమ్ని మౌక్తికమ్
విమలే భాతిస్వాత్మైవ జగచ్చిద్గగనం యథా. 1

వసిష్ఠుడు:- రామా! ఈదృశ్యజగత్తు చిదాకాశముగాక వేరొండుగాదు. నిర్మల-ఆకాశమున ముక్తాభ్రమగలుగునట్లు, నిర్మలమగు ఆత్మయందు, జగద్భ్రమ గలుగుచున్నది.

అనుత్కీర్ణైవ భాతీవ త్రిజగచ్ఛాలభంజికా
చిత్స్తంభేనైవ సోత్కీర్ణా నచోత్కర్త్రాత్ర విద్యతే. 2

త్రిభువనములను సాలభంజిక చిద్రూప స్తంభమున, చెక్కువారు లేనందున, చెక్కబడకుండగనే యున్నది.

సముద్రేఽంతర్జలస్పందాః స్వభావాదచ్యుతా అపి
వీచివేగా భవంతీవ పరే దృశ్యవిదస్తథా. 3

సాగరజలములకు వేగచాంచల్యము లుండుట సహజమైనట్లు, దృశ్యజగత్తు బ్రహ్మమున ప్రతీతమగుటకూడ సహజమే.

జాలాంతర్గత సూర్యాభా జాలాకారరజాంస్యపి
జగద్భానం ప్రతిస్థూలాన్యణుం ప్రతి యథాచలాః. 4
జగద్భానం న భాతీదం బ్రహ్మణో వ్యతిరేకతః
జాలసూర్యాంశుజాలంతు వ్యతిరేకానుభూతిదమ్. 5



ఈజగత్తు అజ్ఞానదృష్టియందు స్థూలమైనను, గవాక్ష ఛిద్రముగుండపడు సూర్యకిరణముల ప్రకాశించు పరమాణుసమూహమువలె, సూక్ష్మమై జ్ఞానియొక్క దృష్టి కగుపించుచున్నది. సూర్యకిరణ సహాయ్యములేకున్న పరమాణువుల గాంచజాలనట్లు, బ్రహ్మజ్ఞానములేకున్న, జగత్తుయొక్క సూక్ష్మభావ మగుపించదు.

అనుభూతాన్యపీమాని జగంతి వ్యోమరూపిణి
పృథ్వ్యాదీని నసంత్యేవ స్వప్నసంకల్పయోరివ. 6

చిదాకాశ స్వరూపమగు ఈజగత్తు పృథ్వ్యాదిరూపమున అనుభూతమైనను, స్వప్నకల్పనవలె అలీకము.

పిండగ్రహో జగత్యస్మిన్ విజ్ఞానాకాశరూపిణి
మరునద్యాం జలమివ న సంభవతి కుత్రచిత్. 7

మరుభూమియందున్న నదీజలప్రవాహముయొక్క జ్ఞానము గలుగునట్లు, విజ్ఞానకోశస్వరూపమగు ఈజగత్తునందు మూర్తత్వమెచటను సంభవింపదు.

జగత్యపిండగ్రాహేఽస్మిన్ సంకల్పనగరోపమే
మరౌ సరిదివాభాతి దృశ్యతా భ్రాంతిరూపిణీ. 8

మరునదీజల ప్రవాహమువలె, సంకల్పనగరోపమమగు నిరాకార దృశ్యజగత్తు భ్రమమాత్రమే.

స్వప్నాద్దృశ్యైవ జగతాం తులాదేశేన కేనచ
తులితా కలనోన్ముక్తా దృశ్యశ్రీర్వ్యోమ జృంభతే. 9
వర్జయిత్వాజ్ఞ విజ్ఞానం జగచ్ఛబ్దార్థభాజనమ్
జగద్బ్రహ్మస్వశబ్దానా మర్థే నాస్త్యేవ భిన్నతా. 10

జాగ్రదవస్థయందు స్వప్నదృష్టవస్తువులు అసత్తులని బోధపడునట్లు, జ్ఞానులకీ జగత్తు అసత్తని బోధపడుచున్నది. వారిద్దానిని బ్రహ్మస్వరూపా నతిరిక్తముగ గ్రహింతురు. అజ్ఞులే జగద్బ్రహ్మ శబ్దముల భేదమును గ్రహించుచున్నారు. వాస్తవమున కీరెంటికిని భేదమేలేదు.

ఇదంత్వచేత్యచిన్మాత్రం భానోర్భాతం నభఃప్రతి
తథాసూక్ష్మం యథామేఘం ప్రతి సంకల్పవారిదః. 11

ఆకాశమున సూర్యాలోకమును, సూక్ష్మమేఘమున సంకల్పమేఘమును, ప్రతిభాతములగునట్లు, ఈజగత్తుకూడ చిన్మయబ్రహ్మమున బ్రకాశించుచున్నది.

యథాస్వప్నపురంస్వచ్ఛం జాగ్రత్పురవరంప్రతి
తథాజగదిదంస్వచ్ఛం సాంకల్పికజగత్ప్రతి. 12

స్వప్నమునగాంచిన నగరమును, జాగ్రద్దశయందుగాంచు నగరమును అలీకములైనట్లు, ఈజగత్తును సంకల్పిత జగత్తునుగూడ అలీకములు. వీటినొకదానితో మరొకదానిని పోల్పవచ్చును.

తస్మాదచేత్యచిద్రూపం జగద్వ్యోమైవ కేవలమ్
శూన్యవ్యోమజగచ్ఛబ్దా పర్యాయా విద్ధి చిన్మయా. 13

అందువలన ఈజగత్తు చిన్మయ-ఆకాశముగాక వేరొండుగాదని గ్రహింపుము, జగత్తు మహాకాశము అనుపదములు సమానార్థబోధకములు; చిన్మయబ్రహ్మముయొక్క రూపాంతరములు.

తస్మాన్నకించిదుత్పన్నం జగదాదీహ దృశ్యకమ్
అనాఖ్యమనభివ్యక్తం యథాస్థితమవస్థితమ్ 14

జగద్దృశ్యము అనుత్పన్నము, ఇది నిరుపాధికమును, అప్రకాశ్యమును, యథాస్థితమునునై వెలయుచున్నది.

జగదేవం మహాకాశే చిదాకాశమభిత్తిమత్
తద్దేశస్యాణుమాత్రస్య తులాయాశ్చాప్రపూరకమ్. 15

ఈరీతిగ జగత్తు మహాకాశముననున్నది. అయినను బ్రహ్మము దానివలన అవృతముకాదు. ఈకల్పితజగత్తు చిదాకాశమును అణుమాత్రమైన ఆవరింపజాలదు.

ఆకాశరూపమేవాచ్ఛం పిండగ్రహవివర్జితమ్
వ్యోమ్ని వ్యోమమయం చిత్రం సంకల్పపురవత్స్థితమ్. 16

ఇయ్యది ఆకాశమువలె నిర్మలమును నిరాకారమునునై సంకల్పనగరమువలె, మహాకాశమునందే, ఆకాశమయ చిత్రమువలె వెలయుచున్నది.

అత్రేదం మండపాఖ్యానం శృణు శ్రవణభూషణమ్
నిఃసందేహోయథైషోఽర్థశ్చిత్తే విశ్రాంతిమేష్యతి. 17

నేనీవిషయమై మండపోపాఖ్యానము (లీలోపాఖ్యానము) అను శ్రుతిమధుర వృత్తాంతమును జెప్పుచున్నాను వినుము. దీనినివినిన నీమనస్సునుండి సందేహములు తొలగిపోవును. శాంతిని బడయుదువు.

శ్రీరామ ఉవాచః—

సద్బోధవృద్ధయేబ్రహ్మన్ సమాసేన వదాశు మే
మండపాఖ్యానమఖిలం యేన బోధో వివర్ధతే. 18

శ్రీరాముడు:- బ్రహ్మజ్ఞా! జ్ఞానవృద్ధికుపాయమగు మండపోపాఖ్యానమును వెంటనేనాకు సంక్షేపముగ, వచింపుడు. దీనిని వినిన జ్ఞానము వృద్ధినందునుగదా!

శ్రీ వసిష్ఠ ఉవాచః—

అభూదస్మిన్మహీపీఠే కులపద్మోవికాసవాన్
పద్మోనామనృపః శ్రీమాన్ బహుపుత్రో వివేకవాన్. 19
మర్యాదాపాలనాంభోధి ర్ద్విషత్తిమిరభాస్కరః
కాంతాకుముదినీచంద్రో దోషతృణహుతాశనః. 20
మేరుర్విబుధవృందానాం యశశ్చంద్రో భవార్ణవే
సరఃసద్గుణహంసానాం కమలామలభాస్కరః. 21
సంగ్రామవీరుత్పవనో మనోమాతంగకేసరీ
సమస్తవిద్యాదయితః సర్వాశ్చర్యగుణాకరః. 22



సురారిసాగరక్షోభ విలసన్మందరాచలః
విలాసపుష్పౌఘమధుః సౌభాగ్యకుసుమాయుధః. 23
లీలాలతాలాస్యమరు త్సాహసోత్సాహ కేశవః
సౌజన్యకైరవశశీ దుర్లీలావల్లికానలః. 24

వసిష్ఠుడు:- ఈభూమండలమున పూర్వము వివేకియు ఐశ్వర్యయుతుడును, బహుపుత్రకుడును నగు పద్ముడను మహారాజొకడు ఉండెను. ఆతడు స్వీయవంశమను సరోవరమందలి పద్మమువలె విలసిల్లుచుండెను. అతడు మర్యాదాపాలనమున *సముద్రుడును, శత్రువులను అంధకారమునకు సూర్యుడును, యువతులను కలువలకు చంద్రుడును, దోషములను తృణముల కగ్నియునైయుండెను. మఱియు, దేవగణములకు (వాసయోగ్యమగు) మేరువును, భవసముద్రమునకు యశశ్చంద్రుడును, సద్గుణములను హంసలకు సరోవరమును, సంపదలను పద్మములకు నిర్మలసూర్యుడును, యుద్ధమను లతకువాయువును మనస్సను ఏనుగను సింహమునునైయుండెను. అతడు ఆశ్చెరువును గొల్పుగుణముల కాటపట్టును, విద్యాప్రియుడును, దేవదానవులచే సముద్రమును తరచనుపయోగింపబడిన మందరపర్వతమువలె, సహిష్ణుడునునైయుండెను. ఆతడు విలాసములను పుష్పములకు వసంతుడును, సౌభాగ్యమున మన్మథుడును, లీలలను లతలనూచు విలాసవాయువును, సాహసమునను ఉత్సాహమునను విష్ణువును, సౌజన్యమను కలువలకు చంద్రుడును, దుశ్చేష్టలను విషలతల కగ్నియునైయుండెను.

తస్యాస్తి సుభగా భార్యాలీలా నామవిలాసినీ
సర్వసౌభాగ్యవలితా కమలేవోదితాఽవనౌ. 25
సర్వానువృత్తిలలితా లీలా మధురభాషిణీ
సానందమందచలితా ద్వితీయేందూదయస్మితా. 26
అలకాలిమనోహారి వదనాంభోజశాలినీ
సితాంగీ కర్ణికాగౌరీ జంగమేవ సరోజినీ. 27
లతావిలాసకుందౌఘభాసినీ రసశాలినీ
ప్రవాలహస్తాపుష్పాభా మధుశ్రీరివ దేహినీ. 28
అవదాతతనుః పుణ్యా స్పర్శనాహ్లాదకారిణీ
గంగేవ గాం గతా దేహవతీ హంసవిలాసినీ. 29
తస్యభూతలపుష్పేషోః సకలాహ్లాదదాయినః
పరిచర్యాం చిరంకర్తు మన్యా రతిరివోదితా. 30
ఉద్విగ్నే ప్రోద్విగ్నా ముదితే ముదితా సమాకులాకులితే
ప్రతిబింబసమా కాంతా సంక్రుద్ధే కేవలం భీతా. 31

---

*'మర్యాదాపాలనమున సముద్రుడు': మర్యాద అనగా, చెలియలికట్ట, నీతినియమము అను నర్థములున్నవి. సముద్రుడు, చెలియలికట్టను దాటనట్లు, పద్ముడు విధివిహితములగు నీతి నియమముల నుల్లంఘింప కుండెనని భావము—అను.

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే ఉత్పత్తిప్రకరణే
లీలోపాఖ్యానే రాజవర్ణనం నామ పంచదశః సర్గః ॥ 15 ॥

ఆతనికి లీలయను సౌభాగ్యవతి భార్యయై వెలయుచుండెను. ఆమె సర్వసౌభాగ్య సంపన్న యగుటవలన భూమండలమున కవతరించిన లక్ష్మివలె నొప్పుచుండెను. ఆలీలాదేవి మధురభాషిణియై, భర్తతోడను పరిజనులతోడను లలితగతి నెగడుచుండెడిది. అమ్మృదుమందగామిని హాసించునప్పు డింకొక చంద్రుడుదయించెనా యను నట్లుండెడిది. పద్మకర్ణికవలె గౌరాంగియగు ఆ లీలాదేవి ముఖ పద్మము ముంగురులను తుమ్మెదలవలన మనోహరమై యుండుటవలన నామె నడయాడు తామరపూవు వలె, శోభిల్లుచుండెను. విలాసముగ లతలను, పూవులను ధరించి ఆప్రవాళహస్త ఒప్పారుచు, పుష్ప శోభవలన రూపుదాల్చిన వసంతలక్ష్మివలె నొప్పుచుండెడిది. స్వచ్ఛమగు గంగవలె పవిత్రయు, హంస గమనయునగు ఆలీలాదేవిని స్పర్శించిన అసాధారణమగు ఆనందము లభించెడిది. ఆమెను గాంచిన, భూతలమున జీవులకానంద మొసగ అవతరించిన పద్ముడను కామదేవునకు పరిచర్య నొనర్ప అరుదెంచిన రతియా యనిపించెడిది. ఆమె, తనభర్త ఆందోళపడిన ఆందోళమునందెడిది. ఆనందితుడైన ఆనందించెడిది, ఆకులుడైన ఆకులమందెడిది. కోపమునందిన భయపడెడిది. వెయ్యేల, ఛాయవలె సంచరించెడిది.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు, ఉత్పత్తిప్రకరణమున
లీలోపాఖ్యానమున రాజవర్ణనమను పంచదశ సర్గము ॥ 15 ॥

---

## షోడశః సర్గః

---

శ్రీ వసిష్ఠ ఉవాచః—

భూతలాప్సరసా సార్ధ మనన్యదయితా పతిః
అకృత్రిమప్రేమరసం స రేమే కాంతయా తయా. 1

ఉద్యానవనగుల్మేషు తమాలగహనేషుచ
పుష్పమండపరమ్యేషు లతావలయసద్మసు. 2

పుష్పాంతఃపురశయ్యాసు పుష్పసంభారవీథిషు
వసంతోద్యానదోలాసు క్రీడాపుష్కరిణీషుచ. 3

చందనద్రుమశైలేషు సంతానకతలేషుచ
కదంబనీపగేహేషు పారిభద్రోదరేషుచ. 4

వికసత్కుందమందార మకరందసుగంధిషు
వసంతవనజాలేషు కూజత్కోకిలపక్షిషు. 5



నానారణ్యతృణానాంచ స్థలేషు మృదుదీప్తిషు
నిర్ఝరేషు తరత్తార సీకరాసారవర్షిషు. 6

శైలానాం మణిమాణిక్య శిలానాం ఫలకేషుచ
దేవర్షి మునిగేహేషు దూరపుణ్యాశ్రమేషుచ. 7

కుముద్వతీషు ఫుల్లాసు స్మేరాసు నలినీషుచ.
వనస్థలీషు కృష్ణాసు ఫుల్లాసు ఫలినీషుచ. 8

సురతైః సురతారుణ్యైః సుందరః సుందరేహితైః
ఈహితైః పేశలాన్యోన్య ఘనప్రేమరసాధికైః. 9

ప్రహేలికాభిరాఖ్యానై స్తథా చాక్షరముష్టిభిః
అష్టాపదైర్బహుద్యూతై స్తథాగూఢచతుర్థకైః 10

నాటికాఖ్యాయికాభిశ్చ శ్లోకైర్బిందుమతిక్రమైః
దేశకాలవిభాగైశ్చ నగరగ్రామచేష్టితైః. 11

స్రగ్దామమాలావలితై ర్నానాభరణయోజనైః
లీలావిలోలచలనై ర్విచిత్రరసభోజనైః. 12

ఆర్ద్రికుంకుమకర్పూర తాంబూలీదలచర్వణైః
ఫుల్లపుష్పలతాగుంజా దేహగోపనఖప్రణైః. 13

సమాలంభనలీలాభి ర్మాల్యాప్రహారణక్రమైః
గృహే కుసుమదోలాభి రన్యోన్యం దోలనక్రమైః. 14

నౌయానయుగ్మహస్త్యశ్వ దాంతోష్ట్రాదిగమాగమైః
జల కేలివిలాసేన పరస్పరసముక్షణైః. 15

నృత్యగీతకలాలాస్య తాలతాండవమండనైః
సంగీతకైః సంకథనై ర్వీణామురజవాదనైః. 16

ఉద్యానేషు సరిత్తీర వృక్షేషు వరవీథిషు
అంతఃపురేషు హర్మ్యేషు ఫుల్లదోలావదోలనైః. 17

వసిష్ఠుడు:- పద్ముడు భూలోక అప్సరసయగు ఆ లీలాదేవితోగూడి అకృత్రిమ ప్రేమరసము ననుభవింప, ఉద్యానవనములలోను, తమాల వనములలోను, మనోహరములగు పుష్పమండపముల యందును, అంతఃపురమున, పుష్పశయ్యలయందునను, పుష్పవీధులలోను, వసంతోద్యానముల ఉయ్యాల లందునను, కృత్రిమ సరోవరములలోను, చందన వృక్షములలోను, కల్పవృక్షముల నీడలయందును, కదంబనీప గృహములలోను, పారిజాతవృక్షముల నడుమను, వికసిత కుందమందారాది పుష్పముల మకరంద సుగంధముల యందును, కోకిలలుకూయుచున్న వసంతోద్యానములలోను, మెత్తటి పచ్చిక బయళ్లలోను, తుంపురులుజల్లు కొండవాగులలోను, మణిమాణిక్యములతో నొప్పు పర్వతప్రదేశముల యందును, దేవాలయములలోను, ఋషుల పుణ్యాశ్రమములలోను, [illegible] కలువలతోడను, నిగళ్ల [illegible]లోను, పరస్పర ప్రేమవివర్ధకములగు

సురతాది రమణీయక్రీడలతోడను, పరిహాసవాక్యములతోడను, పుణ్యకథాప్రసంగములతోడను, నానావిధ ద్యూతక్రీడలతోడను, నాటకములను, ఆఖ్యాయికలను పఠించుచును, శ్లోకముల గూఢార్థమును విచారించుచును, దేశకాలపాత్రోచిత వ్యవహారములతోడను, వివిధ అలంకారములను పుష్పములను అలంకరించుకొనియు, విలాసముగ నరించుచు, స్వాదుభక్ష్యముల భుజించుచు, కుంకుమ కర్పూర వాసిత తాంబూలము నములుచు, పుష్పిత లతాకుంజములు దాగుకొనుచును, నఖక్షతాదిశృంగార క్రీడలతోడను, పరుగెత్తి ఒండొరులను బట్టుకొనుచును, పూలలను లాగుకొనుచు, పూవు టుయ్యెలలూగుచు, నౌకావిహారమొనర్చుచు, ఏనుగు, గుఱ్ఱము, లొట్టియలమీద స్వారిచేయుచు, జలక్రీడలసల్పుచు, ఒండొరులను చూచుకొనుచు, నృత్యవాద్యముల సల్పుచు, లాస్యతాండవాది వివిధనృత్యముల నభినయించుచు, ఉద్యానవనములలోను, నదీతీరములందునను, గృహమధ్యమునను, క్రీడించుచుండెను.

సా తథా సుఖసంవృద్ధా తస్య ప్రణయినీ ప్రియా
ఏకదా చింతయామాస సుభ్రూః సంకల్పశాలినీ. 18

ఇట్లు, పరమసుఖములదేలియాడు ఆ రాజపత్ని ఒకప్పుడిట్లు తలపోసెను:—

ప్రాణేభ్యోఽపి ప్రియో భర్తా మమైష జగతీపతిః
యౌవనోల్లాసవాన్ శ్రీమాన్ కథం స్యాదజరామరః. 19

భర్త్రానేన సహోత్తుంగ స్తనీ కుసుమసద్మసు
కథం స్వైరం చిరం కాంతా రమే యుగశతాన్యహమ్. 20

“నా భర్తయగు యీ నా ప్రియుడు ప్రాణాధికుడు. ఇతడేయుపాయమున, జరామరణముల నందకుండ యౌవనమున నుండగలడు? నేనెట్లు, యౌవనము సళ్లకుండ నితనితో శతయుగములు కుసుమకుంజముల క్రీడింపగలను.

తథా యతే యత్నవత స్తపోజపయమేహితైః
రజనీశముఖో రాజా యథా స్యాదజరామరః. 21

“నేనిప్పుడు యమనియమాద్యనుష్ఠానముల నవలంబించి, తపోజపముల, నాచరించి, చంద్రవదనుడగు ఈ రాజు జరావిహీనుడును, మృత్యురహితుడునునగునట్లు యత్నింతును.

జ్ఞానవృద్ధాం స్తపోవృద్ధా న్విద్యావృద్ధానహం ద్విజాన్
పృచ్ఛామి తావన్మరణం కథం నస్యాన్నృణామితి. 22

ఏమొనర్చిన మనుష్యులు మరణింపరు? అని జ్ఞానవృద్ధులును, తపోవృద్ధులును, విద్యావృద్ధులునగు బ్రాహ్మణుల ప్రశ్నింతును.

ఇత్యానీయాథ సంపూజ్య ద్విజాన్పప్రచ్ఛ సా నతా
అమరత్వం కథం విప్రా భవేదితి పునః పునః. 23

లీలాదేవి ఇట్లు చింతించి, బ్రాహ్మణులను రప్పించి పూజించి, అమరత్వమెట్లు కలుగునని మరలమరల ప్రశ్నించెను.



విప్రాఊచుః :—

తపోజపయమైర్దేవి సమస్తాః సిద్ధసిద్ధయః
సంప్రాప్యంతేఽమరత్వంతు నకదాచన లభ్యతే. 24

విప్రులు:—జపతప నియమాదుల నాచరించిన ఇతరములన్నియు సిద్ధించునుగాని, అమరత్వము లభింపదు.

ఇత్యాకర్ణ్య ద్విజముఖా చ్చింతయామాస సా పునః
ఇదం స్వప్రజ్ఞయైవాశు భీతా ప్రియవియోగతః. 25

విప్రులిట్లు పల్క, లీలాదేవి విని పతివియోగభీతయై స్వబుద్ధిబలమున నిట్లు చింతించెను:—

మరణం భర్తురగ్రే మే యది దైవాద్భవిష్యతి
తత్సర్వదుఃఖనిర్ముక్తా సంస్థాస్యే సుఖమాత్మని. 26

“దైవాత్తు, భర్తమరణింపకమున్నె నాకు మరణముగల్గిన, నేను దుఃఖమునుండి విడివడి సుఖమునే పడయుదును.

అథవర్షసహస్రేణ భర్తాదౌ చేన్మరిష్యతి
తత్కరిష్యే తథా యేన జీవో గేహాన్న యాస్యతి. 27

“వెయ్యేండ్లు గడచిన పిమ్మటనైనను సరే, నాకంటె భర్తముందుగ మరణించిన, అతని ప్రాణములు గృహమునుండి వెలువడకుండనట్లొనర్తును.

తద్గృహమధ్యే భర్తృజీవేఽస్మిన్నిజే శుద్ధాంతమండపే
భర్త్రా విలోకితా నిత్యం నివత్స్యామి యథాసుఖమ్. 28

“అప్పుడు నా పతి ఈ అంతఃపురముననే తిరుగుచుండును. నేనాతనివలన చూడబడుచు, యావజ్జీవము సుఖముగనుందును.”

అద్యప్రభృత్యేతదర్థం దేవీం జ్ఞప్తిం సరస్వతీమ్
జపోపవాసనియమై రాతోషం పూజయామ్యహమ్. 29

“నేటినుండియే నా భర్తయొక్క అమరత్వమును సాధింప జపోపవాసాది అనుష్ఠానముల సల్పుచు, చిద్రూపిణియగు సరస్వతీదేవి నారాధింతును.”

ఇతినిశ్చిత్య సా నాథ మనుక్త్వైవ వరాంగనా
యథాశాస్త్రం చచారోగ్రం తథా నియమమాస్థితా. 30

లీలాదేవి ఇట్లు స్థిరపరచుకొని భర్తకు దెల్పకయే శాస్త్రానుసారము కఠోరనియమము నాచరింపదొడగెను.

త్రిరాత్రస్య త్రిరాత్రస్య పర్యంతే కృతపారణా
దేవద్విజగురుప్రాజ్ఞ విద్వత్పూజాపరాయణా. 31

స్నానదానతపోధ్యాన నిత్యోద్యుక్త శరీరికా
సర్వాస్తిక్యసదాచారకారిణీ క్లేశహారిణీ 32

యథాకాలం యథోద్యోగం యథాశాస్త్రం యథాక్రమమ్
తోషయామాస భర్తార మపరిజ్ఞాతసంస్థితిః. 33

ఆమె ఉపవసించుచు, దేవతలను, బ్రాహ్మణులను, గురువులను, పండితులను పూజించుచు, మూడురాత్రులు గడచినపిదప పారణ మొనర్చెడిది. స్నానదాన తపోధ్యానాది క్లేశకర కార్యముల శరీరమును వినియోగించుచు, శాస్త్రములనన్నింటిని విశ్వసించుచు, వాటిననుసరించుచు, శాస్త్రానుసారము యథాసమయమున భర్తను సేవించుచు, అతనికి సంతోషమును గూర్చుచుండెను.

త్రిరాత్రశతమేవం సా బాలా నియమశాలినీ
అనారతం తపోనిష్ఠా మతిష్ఠత్కష్టచేష్టయా. 34
త్రిరాత్రాణాం శతేచాథ పూజితా ప్రతిమానితా
తుష్టా భగవతీ గౌరీ వాగీశా సమువాచ తామ్. 35

బాలయగు లీలాదేవి ఇట్లుకఠోరతపమును ఆచరించుచు, త్రిరాత్ర శతవ్రతమును సల్పెను. పిదప, ఈ వ్రతమువలన, ఆరాధింపబడి పూజింపబడిన భగవతి వాగ్దేవి ప్రసన్నమై ఇట్లుపల్కెను.

శ్రీ సరస్వత్యువాచః—

నిరంతరేణ తపసా భర్తృభక్త్యాతిశాలినా
పరితుష్టాస్మి తే వత్సే గృహాణ వరమీప్సితమ్. 36

సరస్వతి:- వత్సా! పతిభక్తితోగూడిన ఈ నీ తపస్సునకు సంతసించితిని. ఇచ్చవచ్చిన వరము నుచ్చుకొనుము.

రాజ్ఞ్యువాచ:—

జయ జన్మజరాజ్వాలా దాహదోషశశిప్రభే
జయ హార్దాంధకారౌఘ నివారణరవిప్రభే. 37
అంబమాతర్జగన్మాత స్త్రాయస్వ కృపణామిమామ్
ఇదం వరద్వయం దేహి యదహం ప్రార్థయే శుభే. 38

రాజ్ఞి:- జన్మజరాజ్వాల దాహదోష శశిప్రభా! జయము! హృదయాంధకార నివారణ రవిప్రభా! జయము! అంబా! జగన్మాతా! నేగోరు రెండువరముల దయచేయుము, ఈ దీనురాలిని రక్షింపుము.

ఏకం తావద్విదేహస్య భర్తుర్జీవో మమాంబికే
అస్మాదేవహి మా యాసీన్నిజాంతఃపురమండపాత్. 39
ద్వితీయం త్వాం మహాదేవి ప్రార్థయేఽహం యదాయదా
దర్శనాయ వరార్థాయ తదా మే దేహి దర్శనమ్. 40

మాతా! నా భర్త మరణించిన అతని ప్రాణము (జీవాత్మ) నా అంతఃపురమునుండి వెలువడకుండునట్లు, అనుగ్రహింపుము. మఱియు మహాదేవీ! నేనుతలచుకొనినప్పుడరుదెంచి నాకు దర్శనమొసగు చుండుము.



ఇత్యాకర్ణ్య జగన్మాతా తథాస్త్వేవమితి స్వయమ్.
ఉక్త్వాంతర్ధానమగమ త్స్రోత్థాయోర్మిరివార్ణవే. 41

లీలయొక్క ఈ పల్కులనాలించి 'అట్లేయగుగాక' అని పచించి, సముద్రమున లేచిన తరంగమువలె, సరస్వతీదేవి అంతర్హితయాయెను.

అథ సా రాజమహిషీ పరితుష్టేష్టదేవతా
శ్రుతగీతేవ హారిణీ బభూవానందధారిణీ. 42

అనంతరము రాజపత్ని ఇష్టదేవతను ప్రసన్నురాలిగ గ్రహించి, గానశ్రవణతత్పరయగు లేడి వలె, ఆనందవిహ్వలయయ్యెను.

పక్షమాసర్తుకటకే దినారే వర్షదండకే
క్షణనాభౌ స్పందమయే కాలచక్రే వహత్యథ. 43

పిదప, పక్షములు, మాసములు, ఋతువులను వలయముతో గూడినదియు, దినములను అరములతోగూడినదియు, వర్షమను దండము కలదియు, క్షణమను నాభితోగూడినదియు, సూర్యుడను స్పందనముగలదియునగు కాలచక్రము తిరుగసాగెను (అనగా, రోజులుగడవసాగెను.)

అంతర్ధిమాజగామాస్యాః పత్యుస్తచ్చేతనం తనౌ
సందృశ్యమానమేవాశు శుష్కపత్రరసో యథా. 44

అనంతరము, శుష్కపత్రమునందలి రసమువలె పద్మిని స్థూలదేహచైతన్యము లింగదేహమున లీనమయ్యెను.

రణఖండితదేహేఽస్మిన్ మృతేఽంతఃపురమండపే
నిర్జలా నలినీవాసౌ పరాం మ్లానిముపాయయౌ. 45

అప్పుడు గృహమధ్యమున మృతుడైన భర్తనుగాంచి, నీటివెలుపలనున్న తామరపూవువలె, లీలాదేవి వాడువడెను.

విషోష్ణశ్వసనధ్వస్త సకలాధరపల్లవా
ప్రాప సా మరణావస్థాం సశల్యేవ మృగీ యథా. 46

వేడి నిట్టూర్పులవలన ఆమె అధరపల్లవములు మలినములాయెను. బాణముచే గొట్టబడిన లేడివలె ఆమె మృతప్రాయయయ్యెను.

ప్రాప సా తమసాంధత్వం తస్మిన్మరణమాగతే
దీపజ్వాలాలవే క్షీణే సద్మశ్రీరివ భూషితా. 47

దీపమారిపోయిన గృహశోభ తొలగునట్లు, భర్తృమరణమున లీలాదేవి తమసాచ్ఛన్నయాయెను.

కార్శ్యమాప క్షణేనాసౌ బాలా విరసతాం గతా
యథా స్రోతస్వినీ స్రోతఃక్షయే తీరవిధూసరా. 48

ప్రవాహము తీసిపోయిన, నది చవుదు వారునట్లు, లీలాదేవి కృశించి నీరసించెను.

క్షీప్రమాక్రందినీ క్షిప్రం మౌనమూకా వియోగినీ
బభూవ చక్రవాకీవ మానినీ మరణోన్ముఖీ. 49

ఆమె ఒకప్పుడు రోదింపసాగెను, మరొకప్పుడు మౌనమునుదాల్చెడిది. విరహపీడితయగు చక్రవాకివలె మరణింప నెంచుచుండెను.

అథ తామతిమాత్రవిహ్వలాం సకృపాకాశభవా సరస్వతీ
శఫరీం హ్రదశోషవిహ్వలాం ప్రథమా వృష్టిరివాన్వకంపత. 50

ఇత్యార్షే శ్రీ వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే ఉత్పత్తి ప్రకరణే
లీలోపాఖ్యానే రాజ్ఞీపరిదేవనంనామ షోడశః సర్గః ॥ 16 ॥

చెఱువు ఎండిపోయిన మిక్కుటముగ దుఃఖించు చేపరొడల తొలకరివాన దయబూనునట్లు, అమితముగ పరితపించు లీలాదేవి రొడల ఆకాశవాణి ప్రసన్నమయ్యెను.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు ఉత్పత్తిప్రకరణమున
లీలోపాఖ్యానమున రాజ్ఞీపరివేదనమను షోడశ సర్గము ॥ 16 ॥

---

## సప్తదశః సర్గః.

---

శ్రీ సరస్వత్యువాచః—

శవీభూతమిమం వత్సే భర్తారం పుష్పపుంజకే
ఆచ్ఛాద్య స్థాపయైనం త్వం పునర్భర్తారమేష్యసి. 1

సరస్వతి:— వత్సా! నీభర్తయొక్క శవమును పుష్పములతో గప్పి జాగ్రత్తగనుంచుము. భర్తను నీవు మరల పొందెదవు.

పుష్పాణిమ్లానిమేష్యంతి నో నచైష వినంక్ష్యతి
భూయశ్చ తవభర్తృత్వ మచిరేణ కరిష్యతి. 2

ఈపుష్పములలో నొక్కటియువాడిపోదు. నీభర్తయొక్క శరీరముగూడపాడుపడదు. ఇతడు [illegible] జీ[illegible] శీఘ్ర[illegible]భరింమును.

తదీయశ్చ జీవోఽసావాకాశవిశదస్తవ
న నిర్గమిష్యతి క్షిప్ర మితోఽంతఃపురమండపాత్. 3

ఆకాశమువలె నిర్మలమగు ఇతని జీవాత్మ, నీ అంతఃపురమును విడచి ఎచ్చటికిని అరుగఁడు.

ఇత్యుద్రేకేణిసయనా సమాకర్ణ్యేతి బంధుభిః
సా సమా[illegible] పయోభిరివ పద్మినీ. 4



పతింసంస్థాప్యతత్రైవ పుష్పపూరప్రగోపితమ్
కించిదాశ్వాసితాఽతిష్ఠ ద్దరిద్రేవ నిధానినీ. 5

లీలాదేవియును, ఆమె బంధుగులును ఈవాక్యముల నాలించిరి. లీలాదేవియు జలసంపర్కము నందిన పద్మినివలె, సమాశ్వాసితయయ్యెను. పిదప, పతిశరీరమును పుష్పములతో గప్పి, రహస్యముగ ధనరాశిని దాచిన పేదరాలుమాడ్కి, దీనభావమును వహించియుండెను.

తస్మిన్నేవదినే సైషా తస్మిఞ్ఛుద్ధాంతమండపే
అర్ధరాత్రే పరిజనే సర్వస్మిన్నిద్రయా హృతే. 6

జ్ఞప్తింభగవతీందేవీం శుద్ధధ్యానమహాధియా
దుఃఖాదాహ్వయయామాస సోవాచ సముపేత్య తామ్. 7

ఆదినముననే, అర్ధరాత్రివేళ అందరును నిద్రించుచుండ లీలాదేవి ధ్యానపరాయణయై, అతి దుఃఖముతో చిత్స్వరూపిణియగు సరస్వతీదేవి నాహ్వానించెను. సరస్వతీదేవి అరుదెంచి, ఇట్లుపల్కెను.

కింస్మృతాస్మిత్వయావత్సే ధత్సే కిమితి శోకితామ్
సంసారభ్రాంతయో భాంతి మృగతృష్ణాంబువన్మృధా. 8

వత్సా! నీవు నన్నేల ఆహ్వానించితివి? దుఃఖించుచున్నావేమి? ఈ సంసారము భ్రమమయమనియు, మృగతృష్ణవలె మిథ్యయనియు ఎఱుంగవా?

లీలోవాచః—

క్వమమావస్థితోభర్తా కింకరోత్యథ కీదృశః
సమీపం నయ మాం తస్య నైకా శక్నోమి జీవితుమ్. 9

లీల:— నాభర్త ఇప్పుడెటనున్నాడు. ఏమొనర్చుచున్నాడు? ఎట్లున్నాడు? నన్నాతని కడకు దీసికొని పొమ్మ! నేనొంటరిగ జీవింపజాలను.

శ్రీదేవ్యువాచః—

చిత్తాకాశం చిదాకాశ మాకాశంచ తృతీయకమ్
ద్వాభ్యాం శూన్యతరం విద్ధి చిదాకాశం వరాననే. 10

శ్రీదేవి:— వరాననా! చిత్తాకాశము, చిదాకాశము, ఆకాశములను త్రివిధాకాశములలో చిదాకాశమే శూన్యతరమని గ్రహింపుము.

తచ్చిదాకాశకోశాత్మ చిదాకాశైకభావనాత్
అవిద్యమానమప్యాశు దృశ్యతేఽథానుభూయతే. 11

ఈచిదాకాశముననే నీభర్తయొక్క ఆత్మయున్నది. చిదాకాశమును ధ్యానించిన నీవు దానినిగాంచ గలవు. క్రమముగ నటకజేగి దానిననుభూతమొనర్చుకొనగలవు. (చిదాకాశమన, బ్రహ్మము. దానిని ధ్యానించిన అంతయు నెఱుంగగలవు అని భావము.)

దేశాద్దేశాంతరప్రాప్తౌ సంవిదో మధ్యఏవ యత్
నిమేషేణ చిదాకాశం తద్విద్ధి వరవర్ణిని. 12

వరవర్ణినీ! నిమిషమధ్యమున నే చిత్తమొకచోటినుండి మరొకచోటికి పరిగిడుచున్నది. చిదాకాశము అనగా బ్రహ్మమే దీని నెల్లప్పుడు ప్రకాశిత మొనర్చుచున్నది. ఈ ప్రకాశమునే సంవిత్తు లేక జ్ఞానమందురు. మహాకాశ చిత్తాకాశముల బ్రకాశింపజేయునదియు, ఆధారమైనదియునగు సంవిదాకాశము నే చిదాకాశమని గ్రహింపుము.

తస్మిన్నిరస్తనిఃశేష సంకల్పా స్థితిమేషిచేత్
సర్వాత్మకంపదం తత్త్వం త్వం తదాప్స్యస్యసంశయమ్. 13

చిత్తవృత్తులను పరిత్యజించి, చిదాకాశమున స్థిరమువగల్గిన, నిశ్చయముగ సర్వాత్మకమగు బ్రహ్మపదమును బొందెదవు.

అత్యంతాభావసంపత్త్యా జగతశ్చైతదాప్యతే
నాన్యథా మద్వరేణాశు త్వంతుప్రాప్స్యసి సుందరి. 14

సుందరీ! అప్పుడీదృశ్యజగత్తుయొక్క అత్యంతాభావముకూడ బోధపడును. ఈతత్త్వజ్ఞానము లభించుట అతికష్టమేయైనను, నాప్రసాదమున (ఈశ్వరప్రసాదమున) నీకిది లభించును.

శ్రీ వసిష్ఠ ఉవాచః—

ఇత్యుక్త్వా సా యయౌ దేవీ దివ్యమాత్మీయమాస్పదమ్
లీలాతు లీలయైవాసీ న్నిర్వికల్పసమాధిభాక్. 15

ఇట్లుపదేశించి సరస్వతీదేవి తన స్థానమునకరిగెను. లీలాదేవి తద్వరప్రభావమున, అనాయాసముగ, అభ్యాసశ్రమలేకుండగనే నిర్వికల్పసమాధి నాశ్రయించెను.

తత్తత్యాజ నిమేషేణ సాంతఃకరణపంజరమ్
స్వదేహం ఖమివోడ్డీనా ముక్తనీడా విహంగమీ. 16
దదర్శ ఖస్థా భర్తారం తస్మిన్నేవాలయాంబరే
సంస్థితంపృథివీపాల మాస్థానే బహురాజని. 17
సింహాసనే సమారూఢం జయజీవేతిసంస్తుతమ్
ప్రస్తుతంమండలాసీక కార్యమాహర్తుమాదృతమ్. 18
పతాకామంజరీకీర్ణ రాజధానీగృహస్థితమ్
పూర్వద్వారస్థితాసంఖ్య మునివిప్రర్షి మండలమ్. 19
దక్షిణద్వారగాసంఖ్య రాజరాజేశమండలమ్
పశ్చిమద్వారగాసంఖ్య లలనాలోకమండలమ్. 20
ఉత్తరద్వారగాసంఖ్య రథహస్త్యశ్వసంకులమ్
ఏకభృత్యవినిర్ణీత దక్షిణాపథవిగ్రహమ్. 21
కర్ణాటనాథరచిత పూర్వదేశక్రియాక్రమమ్
సురాష్ట్రాధిపనిర్ణీత సర్వమ్లేచ్ఛోత్తరాపథమ్. 22
మాలదేశసమాక్రాంత సర్వపాశ్చాత్యతంగణమ్
దక్షిణాబ్ధితటాయాత లంకాదూతవినోదితమ్. 23



పూర్వాబ్ధితటమాహేంద్ర సిద్ధోక్తగగనాపగమ్
ఉత్తరాబ్ధితటాయాత దూతవర్ణితగుహ్యకమ్. 24
పశ్చిమాబ్ధితటాలోక వర్ణితాస్తమయక్రమమ్
అసంఖ్యబద్ధభూపాల కలాకీర్ణాఖిలాజిరమ్. 25
యజ్ఞవాటపఠద్విప్ర జితతూర్యాగ్రనిఃస్వనమ్
బందికోలాహలోల్లాస ప్రతిశ్రుద్వనకుంజరమ్. 26
గేయవాద్యోద్యతధ్వాన ప్రధ్వనద్గగనాంతరమ్
హయహస్తిరథారాజి రజోమేఘఘనాంబరమ్. 27
పుష్పకర్పూరధూపాఢ్యం గంధామోదితపర్వతమ్
సర్వమండలసంభార రచితానేకశాసనమ్. 28
యశఃకర్పూరజలద సుశుభ్రాంబరపర్వతమ్
రోదసీస్తంభభూతైక స్వప్రతాపజితార్కకమ్. 29
ఆరంభమంథరోదార కార్యసంవ్యగ్రభూమిపమ్
నానానగరనిర్మాణ సోద్యోగస్థపతీశ్వరమ్. 30

లీలాదేవి, లోహపంజరమువలె దుర్భేద్యమగు అంతఃకరణసమన్విత-స్థూలదేహాభిమానమును బరిత్యజించి, గూటినివదలి ఆకాశమున కెగురుపక్షివలె, చిదాకాశమున కెగసిపోయెను. ఆ చిదాకాశభవనమున పద్ముడసంఖ్యరాజగణపరివృతుడై, సభాస్థలమున సింహాసనారూఢుడై, రాచకార్యములను జూచుకొనుచుండెను. ఆసభాగృహము పతాకలతో శోభిల్లుచుండెను. పూర్వద్వారమున పెక్కండ్రు ఋషులును, మునులును, విప్రులును ఉండిరి. వారు పద్ముని 'జయజీవ' అని ఆశీర్వదించుచుండిరి. దక్షిణద్వారమున లెక్కకుమించిన రాజులును మహారాజులును నుండిరి. ఉత్తరద్వారమున పెక్కు రథములును ఏనుగులును, గుఱ్ఱములును ఉండెను. పశ్చిమద్వారమున చాలమంది యువతులుండిరి. ఒక భృత్యుడరుదెంచి దక్షిణాపథయుద్ధవార్తలను దెలుపుచుండెను. మరియొక భృత్యుడరుదెంచి కర్ణాటపతి పూర్వదేశము నాక్రమించుచున్నాడని తెల్పుచుండెను. ఇంకొక భృత్యుడరుదెంచి సురాష్ట్రపతి ఉత్తరదేశమందలి మ్లేచ్ఛులను వశపరచుకొనినాడని చెప్పుచుండెను. మరొకడు మాలవదేశాక్రమణ వార్తను ఎఱింగించుచుండెను. ఇంకొకడు పశ్చిమతంగణదేశవార్తలను నుడువుచుండెను. ఇంకొకడు దక్షిణసముద్రతీరమునందలి లంకాపురమును ఆక్రమించుటను దెల్పుచుండెను. పశ్చిమసముద్రతీరస్థ మహేంద్రపర్వతవాసియగు సిద్ధుడరుదెంచి, గంగనుగుఱించి చెప్పుచుండెను. ఉత్తరసముద్రతీరమునుండి అరుదెంచిన దూత, కుబేరానుచరులతో గల్గినయుద్ధమును వర్ణింపసాగెను. పశ్చిమసముద్రతీరవాసి అరుదెంచి అచ్చట సూర్యాస్తమయము నభివర్ణింపసాగెను. మఱియు ఆసభాగృహాంగణమున రాజులనేకులు బంధితులై యుండిరి. యజ్ఞశాలయందు బ్రాహ్మణులు వేదముల బఠించుచుండిరి; వారిమధురస్వరము శ్రేష్ఠవాద్యములగూడ తిరస్కరించుచుండెను. వందిమాగధుల కోలాహలములవిని, వన్యగజములు ప్రతిధ్వనుల నొనర్చుచుండెను. గానవాద్యముల మధురశబ్దములతో, గగనతలము ధ్వనితమగుచుండెను. ఏనుగులు, గుఱ్ఱములు, రథములు మున్నగువానివలన లేవనెత్తబడిన ధూళితో కప్పబడి ఆకసము మేఘముల గప్పబడెనాయనిపించుచుండెను. ఆభవనము పుష్పకర్పూర

ధూపముల గంధములతో నిండియుండెను. సామంతరాజు లరుదెంచి ఉపాయనముల నర్పించి, ఆజ్ఞలను బాలించుచుండిరి. యశోరాశివలె ధవళములగు ఆప్రాసాదములు గగనమును స్పర్శించుచుండెను; మఱియు, అట్టివేయగు స్తంభములతోగూడి శోభిల్లుచుండెను. రాజులు గురుతరకార్యములను గుఱించి చింతించుచుండిరి; నానావిధ నగరముల నిర్మింప విశ్వకర్మలను నియోగించుచుండిరి.

పపాతాథమహారంభా సా తాం నరపతేఃసభామ్
వ్యోమాత్మికా వ్యోమమయీం మిహికేవాంబరాటవీమ్. 31
భ్రమంతీం తత్రతామగ్రే దదృశు స్తే న కేచన
సంకల్పమాత్రరచితాం పురుషాఃకామినీమివ. 32

ఆకాశమునుండి హిమజలముపడునట్లు ఆకాశరూపిణియగు లీలాదేవి, ఆరాజుయొక్క ఆకాశమయ సభను బ్రవేశించెను. అటుతిరుగాడుచున్న లీలాదేవిని, సంకల్పిత యువతిని గాంచజాలనట్లు, అచ్చటివారు చూడలేకుండిరి.

తథా తే తాం నదదృశుః సంచరంతీం పురోగతామ్
అన్యసంకల్పరచితా మన్యేన నగరీం యథా. 33

సంకల్పరచిత నగరమును ఎవ్వరును ప్రత్యక్షముగ గాంచజాలనట్లు, ఎట్టఎదుటనే నడయాడుచున్నను, ఆమె నెవ్వరును కనలేకుండిరి.

ప్రాక్తనానేవ తాన్సర్వాన్ స్వాన్దదర్శ సభాగతాన్
భూభృతేవ సుసంప్రాప్తా న్నగరాన్నగరాంతరమ్. 34
తద్దేశాం స్తత్సమాచారాం స్తథా తానేవ బాలకాన్
తాపవబాలవనితా స్తాంస్తానేవచ మంత్రిణః. 35
తానేవ భూమిపాలాంశ్చ తాంస్తానేవచ పండితాన్
తానేవ నర్మసచివాన్ భృత్యాంస్తానేవ తాదృశాన్. 36
అథాన్యానప్యపూర్వాంశ్చ పండితాన్సుహృద స్తథా
వ్యవహారాం స్తథాన్యాంశ్చ పౌరానన్యాం స్తథై వచ. 37

లీలాదేవి పూర్వపు భృత్యువులను, రాజులనే గాంచెనుగాని, ఒకనగరమునుండి ఇంకొక నగరమునకు, వారు మారినట్లుండిరి. అందరును వారే. వారి ఆచరణగూడ మునుపటియట్లే ఉండెను. అబాలికలే, ఆమంత్రులే, మునుపటిరాజులే, పూర్వపుపండితులే. రహస్యవిచారములసల్పు ఆమంత్రులును, సేవకులును ఉండిరి. మునుపటి స్నేహితులు, పండితులు, పౌరులు మునుపటియట్లే పనులనొనర్చుచుండిరి.

మధ్యాహ్నకాలే దివసే ఘనదావాకులాదిశః
అంతరిక్షం సచంద్రార్కం సాంభోదపవనధ్వని. 38
మహీరుహానదీశైల పురపత్తనమండితమ్
నానానగరవిన్యాస జంగలగ్రామసంకులమ్. 39
ద్విరష్టవర్షం భూపాలం ప్రాక్తన్యా జరసోజ్ఝితమ్
ప్రాక్తనీం జనతాం సర్వాం సమస్తాన్ గ్రామవాసినః. 40



సా తానాలోక్య లలనా చింతాపరవశాభవత్
తస్మిన్నగరవా స్తవ్యాః కింతే సర్వే మృతాఇతి. 41

అట నామధ్యాహ్నము, దావానలతప్తములగు దిక్కులు, చంద్రసూర్యులు, అంతరిక్షము, మేఘములు, వాయువు, ఉండెను. పూర్వపులతలు, వృక్షములు, నదులు, నగరములు, పర్వతములు, గ్రామములు, అడవులు ఉండెను. అందరును మునపటియట్లే ఉండిరికాని, పద్ముడు మాత్రము వృద్ధశరీరమును బరిత్యజించి షోడశ వర్షీయయువకుడై రాజ్యమును బాలించుచుండెను. లీలాదేవి, పట్టణమునందలి వారందరును మరణించినారా? అనితలపోయసాగెను.

పునఃప్రజ్ఞప్తిబోధేన ప్రాక్తనాంతఃపురంగతా
క్షణేనచ దదర్శాత్ర సార్థరాత్రే తథైవ తాన్. 42
అథ సోత్థాపయామాస నిద్రాక్రాంతం సఖీజనమ్
అహో చాతీవ మేదుఃఖ మాస్థానం దీయతామితి. 43
భర్తుఃసింహాసనస్యాన్య పార్శ్వే తిష్ఠామ్యహం యది
పశ్యామిసభ్యసంఘాతం తత్రప్రజీవామి నాన్యథా. 44

ఇట్లు చింతించుచుండ సరస్వతీదేవి అనుగ్రహమున లీలాదేవి సమాధి భంగమయ్యెను. అప్పుడామె, నిద్రించుచున్న పరిచారికలను మునపటియట్లే గాంచెను. పిదప, ఆమె నిద్రించుచున్న సభాగణమును మేల్కొలిపి 'చాలకష్టముగనున్నది. నన్నురాజసభకు గొనిపొండు, అట సింహాసన పార్శ్వమున నిలబడుదును. సభ్యులను గాంచినచో జీవింతును. లేనిచో, మరణింతును.' అని తెలిపెను.

స రాజపరివారోఽథ తయేత్యుక్తే యథాక్రమమ్
ఆసీద్వినిద్రః సంవ్యగ్రః సర్వః సర్వస్వకర్మణి. 45
పౌరాన్సభ్యాన్సమానేతుం యయుర్యాష్టికపంక్తయః
వ్యవహారం కలయితు ముర్వ్యామర్కకరాఇవ. 46

వారందరును నిద్రనువీడి, ఈ సంగతిని పురవాసులకుదెల్పి, లీలాదేవి ప్రాణములగాపాడ బ్రయత్నింపసాగిరి. అప్పుడు, దండధరులగు భృత్యులు పురజనులను, సూర్యకిరణములట్లు, రాచకార్యముల నాలోచింప వొడ్డొకనిరాజనిరి.

ఆస్థానభూమిం భృత్యాశ్చ మార్జయామాసురాదృతాః
ప్రావృట్పయోదమలినం ఖం శరద్వాసరాఇవ. 47

వర్షకాల మేఘముల మలినమైన ఆకాశమును, శరత్కాలదివసము శుభ్రపరుచునట్లు, మఱికొందరు, సభాగృహమును శుభ్రపరుపసాగిరి.

అంగణంప్రతి దీపౌఘా స్తస్థుః పీతతమోంభసః
ఆశ్చర్యదర్శనాయేవసంప్రాప్తా ఋక్షపంక్తయః. 48

అట, అచ్చటచ్చట అచ్చెరువునుగొల్ప అమర్పబడిన దీపములు నక్షత్రములవలె ప్రకాశించుచు, అంధకారమును నీటిని ద్రావసాగెను.

జనతాః పూరయామాసుః పూర్వైరజిరభూమికాః
అబ్ధీన్ప్రలయ సంశుష్కా న్పురా సర్గఇవాంభసా. 49

ఎండువారిన సముద్రములు ప్రళయకాలమున నీటితో నిండునట్లు, సభాస్థలము క్షణములో జనులతో క్రిక్కిరిసెను.

ఆజగ్ముర్మంత్రి సామంతాః స్వంస్వంస్థానమనిందితాః
త్రైలోక్యే పునరుత్పన్నే లోకపాలా యథా దిశః. 50

సృష్ట్యాదియందు లోకపాలకు లొక్కరొక్కరే జనించి, తమతమదిక్కుల నాక్రమించుకొనునట్లు, మంత్రులును సామంతులును అరుదెంచి తమతమ ఆసనముల నాక్రమించుకొనిరి.

వపురాకీర్ణ కర్పూర సాంద్రావశ్యాయశీతలాః
ఉత్ఫుల్లకుసుమోద్వాంతమాంసలామోదితానిలాః. 51

అప్పుడు మంచుపడుటవలన గాలిచల్లపడి, వికసిత కుసుమగంధముతో, వీవసాగెను.

పర్యంతేషు ప్రతీహారా స్తస్థుర్ధవలవాససః
ఋష్యమూకార్కతాపార్త మేఘమాలా ఇవాద్రిషు 52

ఋష్యమూక పర్వతమున వసించు ఋషిగణము సూర్యకిరణముల సంతప్తమవ, వారికి సేద దీర్ప ఏర్పడు మేఘములవలె, ప్రతిద్వారముకడ ద్వారపాలకులు శుక్లవసనముల ధరించి నిలంబడిరి.

ప్రభాపీతతమఃపుంజాః పేతుః పుష్పోత్కరా భువి
చండమారుతవిధ్వస్తా స్తారకానికరా ఇవ. 53

ప్రళయవాయువువలన రాల్పబడిన నక్షత్రములవలె, సభాస్థలమున పుష్పములురాలి ధవళకాంతులనీనుచు, తమస్సును బోగొట్టసాగెను.

ఆస్థానం పూరయామాసు ర్మహీపాలానుయాయినః
ఉత్ఫుల్లకమలోత్కీర్ణం హంసా ఇవ సరోవరమ్. 54

హంసలు ప్రఫుల్లకమలములతో నిండిన సరోవరముయొక్క శోభను పెంపొందజేయునట్లు పద్మనరపతి అనుయాయులగు రాజన్యులరుదెంచి, ఆ సభనలంకరించి, దాని శోభనినుమడింప జేయుచుండిరి.

సింహాసనసమీపస్థే హైమచిత్రాసనే నవే
ఉపావిశదసౌ లీలా లీలేవ స్మరచేతసి. 55

దదర్శ తాన్నృపాన్సర్వా న్పూర్వానేవ యథాస్థితాన్
గురూనార్యాన్సఖీన్సభ్యాన్ సుహృత్సంబంధిబాంధవాన్. 56

మరుని హృదయమున రతీదేవివలె, లీలాదేవి రాజసింహాసన పార్శ్వమున సమర్పబడిన హేమసింహాసనము నధివసించి, మునపటివలెనున్న రాజన్యులను, గురువులను, స్త్రీలను, స్నేహితులను సభాజనమును, బంధుగులను గాంచెను.



సకలమేవహి పూర్వవదేవ సా సమవలోక్య ముదం పరమాం యయౌ
నృపతిరాష్ట్రజనంఖలు జీవనాభ్యుదితయాచ బభౌ శశివచ్ఛ్రియా. 57

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ-మహారామాయణే వాల్మీకీయే ఉత్పత్తిప్రకరణే
లీలోపాఖ్యానే సందేహారాష్ట్ర వర్ణనం నామ
సప్తదశః సర్గః ॥ 17 ॥

లీలాదేవి, మునుపటియట్లు అన్నియు నుండుటగాంచి, పరమానందమునందెను. మఱియు, మహారాజుతప్ప, అందరును జీవితులని దృఢపరచుకొనెను.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు ఉత్పత్తి ప్రకరణమున
లీలోపాఖ్యానమున సందేహారాష్ట్ర వర్ణ మను
సప్తదశ సర్గము. ॥17॥

---

## అష్టాదశః సర్గః

---

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

ఇత్థం వినోదయామీదం దుఃఖదం చిత్తమిత్యలమ్
బోధయిత్వేంగితై ర్భూపానాస్థానాదుత్థితాథ సా. 1

వసిష్ఠుడు:— లీలాదేవి ఇంగితమున దుఃఖితచిత్తమును వినోదింపజేయుచున్నాను, అని సభయందలి రాజులకు చెల్పి, సభనుండిలేచెను.

ప్రవిశ్యాంతఃపురం భర్తుః పార్శ్వేఽంతః పురమండపే
వివేశ పుష్పగుప్తస్య చింతయామాస చేతసా. 2

అటనుండి అంతఃపురమున కరిగి, పద్మని కళేబరము పుష్పములతో గప్పబడి ఉంచబడిన చోటునకరిగి ఇట్లు తలపోయసాగెను:—

అహో విచిత్రా మాయేయ మేతేఽస్మత్పురమానవాః
బహిరంతరవద్దేశే తత్రచేహ చ సంస్థితాః. 3
తాలీతమాలహింతాల మాలితా గిరయోఽప్యమీ
యథాత్రత తథేహాపి బత మాయేయ మాతతా. 4

మాయ విచిత్రమైనది! ఈ పౌరులందరు భర్తయొక్క స్థూలదేహపార్శ్వమున నున్నట్లే, చిదాకాశమునగూడ సూక్ష్మదేహమునను న్నారు. ఇట తాలతమాల హింతాలాది వృక్షములతోగూడిన పర్వతశ్రేణిని గాంచినట్లు, అటగూడ గాంచితిని.

ఆదర్శేఽంత ర్బహిశ్చైవ యథా శైలోఽనుభూయతే
బహిరంతశ్చిదాదర్శే తథా సర్గోఽనుభూయతే.

అద్దమునను, వెలుపలగూడ కొండ ఒకేమాదిరిగ కనుబడునట్లు, చిదాకాశమునను, వెలుపలను సృష్టి ఒకేతీరుగ కనంబడుచున్నది.

తత్ర భ్రాంతిమయః సర్గః కః స్యాత్కః పారమార్థికః
ఇతి పృచ్ఛామి వాగీశామభ్యర్చ్యైతమసంశయమ్. 6

వీటిలో నెయ్యది భ్రాంతి? ఎయ్యది పారమార్థికము? — ఈ విషయమును, వాగ్దేవి నారాధించి తెలిసికొని, నా సందియమును దీర్చుకొందును.

ఇతి నిశ్చిత్య తాం దేవీం పూజయామాస సా తదా
దదర్శ చ పురః ప్రాప్తాం కుమారీరూపధారిణీమ్. 7
భద్రాసనగతాం దేవీ ముపవిశ్య పురోగతా
పరమార్థమహాశక్తిం లీలాఽపృచ్ఛద్భువి స్థితా. 8

ఇట్లు చింతించి, ఆమె వాగ్దేవి నారాధించెను. అప్పుడు కుమారీరూపమును ధరించి దేవి యరుదెంచెను. లీలాదేవి మహాశక్తిస్వరూపిణియగు సరస్వతీదేవిని భద్రాసనమున గూర్చుండజేసి, తాను క్రింద గూర్చుండి ఇట్లు ప్రశ్నించెను:—

లీలోవాచ:—

అనుకంప్యాస్య నో దేవి భజంత్యుద్వేగముత్తమాః
త్వయైవం కిల సర్గాదౌ స్థాపితా స్థితిరుత్తమా. 9
తదిదం యత్పురః ప్రహ్వా పృచ్ఛామి పరమేశ్వరి
తద్బ్రూహి త్వత్కృతో నూనం సఫలో మే త్వనుగ్రహః. 10

లీల:— దేవీ! పరమేశ్వరీ! నీవు సృష్ట్యాదియందు స్థాపించిన మర్యాదను గుఱించి నాకు మిక్కుటమగు సందేహము గలిగినది. దానిని ప్రశ్నించుచున్నాను. తెలియపరచిన, నాయందు నీకున్న దయ సఫలమని తలంతును.

అస్త్యాదర్శో జగన్నామ్నః ఖాదప్యధికనిర్మలః
యస్య యోజనకోటీనాం కోటయోఽవయవో మనాక్. 11
నిఃసంధితవచోజ్యోతిర్ఘనో మృదుసుశీతలః
అవేత్యచిదితి ఖ్యాతో నామ్నా నిర్భిత్తిరగ్రతః. 12
దిక్కాలకలనాకాశ ప్రకాశనియతిక్రమాః
యత్రేమే ప్రతిబింబంతి పరాం పరిణతిం గతాః. 13
త్రిజగత్ప్రతిబింబశ్రీర్బహిరంతశ్చ సంస్థితా
తత్ర వై కృత్రిమా కా స్యాత్కాసౌ వా స్యాదకృత్రిమా. 14

జగత్తను అద్దము ఆకాశముకంటె నిర్మలము. దీనియందు కోటియోజనముల విస్తీర్ణతగల దృశ్యములుగూడ క్షుద్రములై కనిపించుచున్నవి. దీనినే వేదోక్తములగు మహావాక్యములు జ్యోతిర్మయము, సూక్ష్మము, శీతలము, అని నిర్దేశించుచున్నది. ఇది నిరావరణము, దీనినెద్దియు ప్రకాశింపజేయజాలదు; ఇదన్నిటిని ప్రకాశింపజేయుచున్నది. దిక్కులు, కాలములు, ఆకాశము, దీనినుండియే



ప్రకాశించుచున్నవి. నియతి ఇద్దానివలననే నియమింపబడుచున్నది. వస్తువులన్నియు ఇందే ప్రతిబింబించి లీనములగుచున్నవి. త్రిభువన—ప్రతిబింబ లక్ష్మి ఈ చిదాదర్శమునను, వెలుపలను గోచరించుచున్నది. ఈ రెంటిలో నెయ్యది కృత్రిమము? ఎయ్యది వాస్తవము?

శ్రీ దేవ్యువాచ:—

అకృత్రిమత్వం సర్గస్య కీదృశం వద సుందరి
కీదృశం కృత్రిమత్వం స్యాద్యథావత్కథయేతి మే. 15

శ్రీ దేవి:— సృష్టియందు మరల కృత్రిమము, అకృత్రిమము అన నేమియో నాకు జెప్పుము.

లీలోవాచ:—

యథాహమిహ తిష్ఠామి త్వంచ దేవి స్థితాంబికే
అసావకృత్రిమః సర్గ ఇతి దేవేశి వేద్మ్యహమ్. 16
యత్రాధునా స భర్తా మే స్థితః సర్గః సకృత్రిమః
అహం మన్యే యతః శూన్యో దేశకాలాద్యపూరకః. 17

లీల:— దేవేశీ! నీవును నేనును ఇటనున్నాము, ఇయ్యది అకృత్రిమ సర్గము అనియు, నాభర్త ఇప్పుడుండిన రీతిని కృత్రిమ సర్గమనియు, భావించుచున్నాను. ఏలయన అది శూన్యము, దేశకాలాపరిచ్ఛిన్నము.

శ్రీ దేవ్యువాచ:—

కృత్రిమోఽకృత్రిమాత్సర్గాన్న కదాచన జాయతే
నహి కారణతః కార్య ముదేత్యసదృశం క్వచిత్. 18

శ్రీ దేవి:— అకృత్రిమ సృష్టినుండి కృత్రిమసృష్టి ఉత్పన్నమవదు; కారణమునుండి విజాతీయమగు కార్యమెన్నడును ఉత్పన్నమవదు.

లీలోవాచ:—

దృశ్యతే కారణాత్కార్యం సువిలక్షణమంబికే
అంబ్వాదాతుమశక్తా మృద్ఘటస్తజ్జస్తదాస్పదమ్. 19

లీల:— అంబా! కారణముకంటె విసదృశములగు కార్యము లుత్పన్నములగుననుటకు, పెక్కు దృష్టాంతములున్నవి. ఘటకారణమగు మృత్తిక నీటినుంచుటకు తగకున్నను, ఘటము తగుచున్నది.

శ్రీ దేవ్యువాచ:—

సంపద్యతే హి యత్కార్యం కారణైః సహకారిభిః
ముఖ్యకారణవైచిత్ర్యం కించిత్తత్రావలోక్యతే. 20
వద తద్భర్తృసర్గస్య కిం పృథ్వ్యాదిషు కారణమ్
తద్భూమండలతో భూతి ర్జాతా తత్ర వరాననే. 21
గతం చేదిత ఉడ్డీయ కుతః స్యాదిహ భూతలమ్
సహకారీణి కానీవ కారణాన్యత్ర కారణే. 22

కారణానామభావేఽపి యోఽదేతి సహకారితా
తత్పూర్వకారణాన్నాన్య త్సర్వేణేత్యనుభూయతే. 23

శ్రీదేవి:_ సహకారికారణమునుండి కలుగు కార్యము ముఖ్యకారణముకంటె, ఒకింత విజాతీయమై కన్పట్టును. నీ భర్త ఇటనొకతీరుగను, అటనొకరీతిగను నుండుటకు తగుకారణమేమైన ఉన్నదా? పృథ్వ్యాది పంచభూతములు నీ భర్తయొక్క సృష్టికి గారణములు గావని గ్రహింపుము. వరాననా! ఇట జన్మించి అటకతిగినాడందువా? — యీ భూమండల మెచ్చటనున్నది. ఇదే అటకతిగినదా? అట కలుగకున్న అనురూపసృష్టి ఎట్లు సంభవించుచున్నది? నీ భర్త పుట్టుకయందు భిన్నత్వమును గల్పించు సహకారికారణములేదు. అందువలన తేలున దేమన, అన్యకారణములేకుండ జన్మించుటకు, పూర్వపు సృష్టులయందలి కామకర్మవాసనలే గారణములగుచున్నవి.

లీలోవాచ:—

స్మృతిఃసాదేవి మద్భర్తు స్తథా స్ఫారత్వమాగతా
స్మృతి స్తత్కారణంవేద్మి సర్గోఽయమితి నిశ్చయః. 24

లీల:_ దేవీ! నా భర్త సృష్టికి గారణము జన్మాంతర జ్ఞానమనియు, అయ్యదియె వృద్ధినంది సృష్టిగారణమగుచున్నదనియు గ్రహించుచున్నాను.

శ్రీ దేవ్యువాచ:—

స్మృతిరాకాశరూపాచ యథా తజ్జ స్తథైవ తే
భర్తుఃసర్గోఽనుభూతోఽపి స వ్యోమైవ తథాబలే. 25

శ్రీ దేవి:_ అబలా! సంస్కారము పురోవర్తివిషయ శూన్యత్వమునజేసి, ఆకాశరూపమై వెలయుచున్నది. ఇట్టి సంస్కారమునుండి కలిగినసృష్టి అనుభూతమగుచున్నను, ఆకాశమయమే అని గ్రహింపుము.

లీలోవాచ:—

స్మృత్యాకాశమయఃసర్గో యథాభర్తు ర్మమోదితః
తథైవేమమహం మన్యే స సర్గోఽత్ర నిదర్శనమ్. 26

లీల:_ నా భర్తయొక్క సృష్టి స్మృతి జనితమగుటవలన, ఆకాశస్వరూపమని నుడివితివి. అందువలన దృశ్యమానసృష్టిగూడ పైదృష్టాంతమును ననుసరించి, ఆకాశస్వరూపమేయని తలచుచున్నాను.

శ్రీదేవ్యువాచ:—

ఏవమేతదసత్సర్గో భర్తుస్తే ర్భాతి భాసురః
తథైవాయమిహాభాతి వక్ష్యామ్యేతదహం సుతే. 27

శ్రీ దేవి:_ బిడ్డా! అవునట్లే; నీ భర్తయొక్క సృష్టి అసత్తయినట్లే, ఈ దృశ్యమానసృష్టి కూడ అసత్తయినట్లు నేను (జ్ఞానప్రభావమున) కనుంగొనుచున్నాను.

లీలోవాచ:—

యథా పత్యురమూర్తోఽస్మా త్సర్గాత్సర్గో భ్రమాత్మకః
జాత స్తథా కథయ మే జగద్భ్రమనివృత్తయే. 28



లీల:_ శూన్య-ఆకాశస్వరూప సృష్టినుండి నా భర్తయొక్క భ్రమాత్మకసృష్టి సంభవించిన రీతిని వివరింపుము. దీన నాభ్రమ తొలగిపోవును.

శ్రీదేవ్యువాచ:—

ప్రాక్ స్మృతేర్భ్రాంతిమాత్రాత్మా సర్గోఽయముదితో యథా
స్వప్నభ్రమాత్మకో భాతి తథేదం కథ్యతే శృణు 29

శ్రీదేవి:_ పూర్వస్మృతినుండియే, స్వప్నభ్రమవలె, యీ సృష్టి ప్రకాశించినరీతిని జెప్పుచున్నాను వినుము.

అస్తిక్వచిచ్చిదాకాశే క్వచిత్సంసారమండపః
ఆకాశకాచదలవత్సంస్థానాచ్ఛాదితాకృతిః. 30
మేరుస్తంభస్థలోకేశ పురంధ్రీశాలభంజికః
చతుర్దశాపవరకస్త్రిగర్తోభానుదీపకః. 31
కోణస్థభూతవల్మీక వ్యాప్తపర్వతలోష్టకః
అనేకపుత్రజరఠ ప్రజేశబ్రాహ్మణాస్పదమ్. 32
జీవాఘకోశకారాఢ్యో వ్యోమోర్ధ్వతలకాలిమా
నభోనివాససిద్ధాఘ మశకాహితఘుంఘుమః. 33
పయోదగృహధూమాగ్రజాలావలితకోణకః
వాతమార్గమహావంశ స్థితవై మానకీటకః. 34
సురాసురాదిదుర్బాల లీలాకలకలాకులః
లోకాంతరపురగ్రామ భాండోపస్కరనిర్భరః. 35
సరఃస్రోతోఽబ్ధిసరసీ జలోక్షితమహీతలః
పాతాలభూతలస్వర్గ భాగభాసురకోటరః. 36

ఒకానొక చిదాకాశమున ఒకమారుమూల, ఆకాశమను గాజుతో కప్పబడిన, సంసారమను మండపమున్నది. ఈ గృహస్తంభమగు సుమేరుపర్వతమున, లోకపాలకులు నివసించుచున్నారు. ఈ స్తంభమున దేవతాస్త్రీలను బొమ్మలు చెక్కబడియున్నవి. చతుర్దశ భువనములిందలి గదులు. ముల్లోకములిందలి గుంటలు. సూర్యుడీఇంట నుండెడి దీపము. ప్రాణులు మూలమూలలనున్న పుట్టలు. పర్వతములు వాటిపైన మొలచు గడ్డిపరకలు. బహుపుత్రకుడును, వృద్ధుడునునగు ప్రజాపతి అందు నివసించు బ్రాహ్మణుడు. జీవులిందు, తాముకట్టుకొనిన గూటిలో తామేచిక్కుకొనునట్లు, బంధితులగుచున్నారు. ఆకాశమే యీ ఇంటియందున్నబూజు. అంతరిక్షమునచరించు సిద్ధులు, ఈ ఇంటి రొదచేయు దోమలు. వాతాయనములిందలి వెదుళ్లు, విమానమున చరించువారిందలి కీటకములు, ఈ గృహము, క్రీడించుచున్న సురాసురబాలకుల కలకలములతో నిండియున్నది. లోకములు, నగరములు, గ్రామములు, ఇందున్న కుండలు. ఇందలి నేల, సముద్రమను చెలువునీట తడపబడుచున్నది. పాతాళము భూతలము, స్వర్గము, యీ గృహగర్తములు.

తత్ర కస్మింశ్చిద్దేశస్మి న్కోణేవ్యోంబరకోటరే
[illegible] 37

ఈ సంసారమంటపమున, ఒక్కొక్కమూల, పర్వతములను లోష్టములక్రింద, క్షుద్ర క్షుద్ర గ్రామములను గర్తము లనేకములున్నవి.

తస్మిన్నదీశైలవనోపగూఢే సాగ్నిః సదారః సుతవానరోగః
గోక్షీరవాన్రాజభయాద్విముక్తః సర్వాతిథిర్ధర్మపరో ద్విజోఽభూత్. 38

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే ఉత్పత్తిప్రకరణే
లీలోపాఖ్యానే సకలజగద్భ్రాంతి ప్రతిపాదనం నామాష్టాదశః సర్గః ॥ 18 ॥

నదీవనశైలములతోనిండిన యీ దేశమున దారాయుతుడును, అగ్నిహోత్రియును, సపుత్రకుడునునగు ఒక బ్రాహ్మణుడు నివసించుచుండెడువాడు. అతడు రోగహీనుడును, రాజభయరహితుడును, శాంతచిత్తుడును, ధర్మపరాయణుడును, అతిథి సేవారతుడునునైయుండెను. అతని కధికమగు గోసంపదయుండెను.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు, ఉత్పత్తిప్రకరణమున
లీలోపాఖ్యానమున సకలజగద్భ్రాంతి ప్రతిపాదనమను అష్టాదశ సర్గము. ॥ 18 ॥



## ఏకోనవింశః సర్గః.

శ్రీదేవ్యువాచః—

విత్తవేషవయఃకర్మ విద్యావిభవచేష్టితైః
వసిష్ఠస్యైవ సదృశో నతు వాసిష్ఠచేష్టితః. 1

శ్రీదేవి;–ఆ బ్రాహ్మణుడు, విత్తము, వయస్సు, విద్య, వైభవము, యత్నములవసిష్ఠుని బోలియుండెను, కాని ఇక్ష్వాకుల పౌరోహిత్యమాతనికి లేకుండెను.

వసిష్ఠ ఇతినామ్నా సౌ తస్యాభూదిందుసుందరీ
నామ్నాత్వరుంధతీ భార్యా భూమివ్యోమన్యరుంధతీ. 2

అతని పేరుగూడ వసిష్ఠుడే. అతని కిందు సుందరియగు అరుంధతియను భార్యయుండెను. ఈమె భూలోకారుంధతియే.

విత్తవేషవయఃకర్మ విద్యావిభవచేష్టితైః
సమైవ సాప్యరుంధత్యా నతు చేతనసత్తయా. 3

ఈమెగూడ అన్ని విషయముల వసిష్ఠపత్నియగు అరుంధతిని బోలియుండెను; కాని, ఆమె జీవన్ముక్తురాలు, ఈమె జీవన్ముక్తి నందలేదు.



అకృత్రిమప్రేమరసా విలాసాలసగామినీ
సాస్య సంసారసర్వస్వమాసీత్కుముదహాసినీ. 4

ఈమె మృదుమందగామినియు, మధురహాసినియునైయుండెను. ఆబ్రాహ్మడీమెను అకృత్రిమమగు ప్రేమరసమున దనుపుచుండెను. ఆమెయే అతనికి సంసారమున నంతయునైయుండెను.

సవిప్రస్తస్య శైలస్య సానౌ సరలశాద్వలే
కదాచిదుపవిష్టఃసన్ దదర్శాథో మహీపతిమ్. 5

సమగ్రపరివారేణ యాంతమాఖేటకేచ్ఛయా
మహతా సైన్యఘోషేణ మేరోరివ బిభిత్సయా. 6

ఆబ్రాహ్మణుడొకప్పుడు అటనున్న పర్వతమున పచ్చికబయలున గూర్చుండి ఒకానొకరాజు పరివారముతో వేటాడుట కరుదెంచుచుండుటను గాంచెను. అతని సైన్యఘోషములు మేరువునుగూడ పగుల్చునట్లుండెను.

చామరైఃకీర్ణచంద్రాంశు పతాకాభిర్లతావనం
కుర్వాణం ఖం సితచ్ఛత్రమండలై రూప్యకుట్టిమమ్. 7

అశ్వపాదాఖనక్ష్మాజ రేణుపూరావృతాంబరమ్
హస్తికోత్తంభితకరవాతాట్టాలకగోపితమ్. 8

మహాకలకలావర్త ద్రవద్దిగ్ఘూర్ణితమండలమ్
కచత్కాంచనమాణిక్య హారకేయూరమండలమ్. 9

తమాలోక్య మహీపాల మిదం చింతితవానసౌ

అతని చామరములవలనను, పతాకములవలనను, లతావనమున వెన్నెలకాచుచున్నట్లుండెను. శ్వేతచ్ఛత్రములవలన ఆకాశము వెండిమేడలతో నిండినట్లుండెను. గుఱ్ఱపు గిట్టలలేచిన దుమ్ముతో ఆకాశము కప్పబడెను. ఏనుగులమీదనున్న అంబారీల వలన వాయుగతి నిరోధింపబడుచుండెను. సైనికుల కోలాహలమున దిక్కులు పిక్కటిల్లుచుండెను! అందరును మణులతో గూర్పబడిన సువర్ణహారములతోడను, కేయూరాది అలంకారములతోడను శోభిల్లుచుండిరి. బ్రాహ్మణుడిట్టివైభవములతో గూడిన రాజును గాంచి, ఈవిధముగ చింతించెను:–

అహోను రమ్యా నృపతా సర్వసౌభాగ్యభాసితా. 10

పదాతిరథహస్త్యశ్వ పతాకాచ్ఛత్రచామరైః
కదా స్యాం దశదిక్కుంజ పూరకోఽహం మహీపతిః. 11

కదా మే వాయవఃకుంద మకరందసుగంధయః
పాస్యంత్యంతఃపురస్త్రీణాం సురతశ్రమసీకరాన్. 12

కర్పూరేణ పురంధ్రీణాం పూర్ణేన యశసా దిశామ్
ఇందూదయావదాతాని కదా కుర్యాం ముఖాన్యహమ్. 13

రాజత్వమెంత మనోహరము! నే నెప్పుడు ఇతనివలె రాజునై ఏనుగులతోడను, గుఱ్ఱములతోడను, రథములతోడను, పదాతులతోడను, [illegible], పతాకలతోడను, చామరముల

తోడను, దిక్కులను నింతును? ఎన్నడు మందారాది సుగంధ గంధిత పవనమున, అంతఃపుర నారీ గణములకు రతిశ్రమవలన గలిగిన స్వేదబిందువులను బోగొట్టగలను? ఎప్పుడు, కర్పూరమున అంతఃపుర స్త్రీల ముఖమండలమును, యశస్సుతో దిఙ్మండలమును, చంద్రోదయమునవలె, ప్రకాశింపజేయగలుగుదును.

ఇత్థం తతః ప్రభృత్యేవ విప్రః సంకల్పవానభూత్
స్వధర్మనిరతో నిత్యం యావజ్జీవమతంద్రితః. 14

ఇట్లా బ్రాహ్మణుడు ప్రతిదినము చింతించుచు తనకర్మల నేమరకుండనుండెను.

హిమాశనిరివాంభోజం జర్జరీకర్తుమాదృతా
జలే జర్జరితేవాథ జరా ద్విజముపాయయౌ. 15

నీటియందున్న తామరపూవులను మంచును పిడుగు వాడజేయునట్లు, ముదిమి అరుదెంచి వారిని జీర్ణ మొనర్పసాగెను.

ఆసన్నమరణస్యాథ భార్యా మ్లానిముపాయయౌ
తస్య శామ్యతి పుష్పార్తా లతేవ గ్రీష్మభీతితః. 16

అతనిభార్య అతనిని మరణింపబోవువానిగ గ్రహించి, వసంతకాల లత గ్రీష్మభయమున మ్లానమగునట్లు, రోజురోజునకు పాలిపోసాగెను.

సామథారాధితవతీ సా తత్స్వామివాంగనా
అమరత్వంసుదుష్ప్రాపం బుద్ధ్వేమం సాఽవృణోద్వరమ్. 17

ఆ విప్రపత్నిగూడ నీవలెనే అమరత్వము అసంభవమని గ్రహించి, నన్నారాధించి, ఈ వరమును గోరుకొనెను:-

దేవి స్వమండపాదేవ జీవో భర్తృమృతస్య మే
మా యాసీదిత్యతి స్తస్యాః సపవాంగీకృతో మయా. 18

'దేవీ! నాభర్త మరణించిన, అతని జీవము నాగృహమునుండి వెలువరకుండు నట్లనుగ్రహింపుము' నేనును ఈవర మొసంగితిని.

అథ కాలవశాద్విప్రః స పంచత్వముపాయయౌ
తస్మిన్నేవ గృహాకాశే జీవాకాశతయా స్థితః. 19

పిదప, ఆబ్రాహ్మణుడు మరణించెను; అతని జీవచైతన్యము పూర్వవాసనాప్రభావమున ఆ గృహాకాశముననే నివసింపసాగెను.

సంపన్నః ప్రాక్తనానల్ప సంకల్పవశతః స్వయమ్
ఆకాశవపురేవైష పతిః పరమశక్తిమాన్. 20
ప్రభావజితభూపీఠః ప్రతాపాక్రాంతవిష్టపః
కృపాపాలితపాతాలస్త్రీలోకవిజయీ స్వపః. 21
కల్పాగ్నిరరివృక్షాణాం స్త్రీణాం మకరకేతనః
మేరుర్విషయవాయూనాం సాధ్వబ్జానాం దివాకరః. 22



ఆదర్శః సర్వశాస్త్రాణా మర్థినాం కల్పపాదపః
పాదపీఠం ద్విజాగ్ర్యాణాం రాకాధర్మామృతత్విషః. 23

ఆ బ్రాహ్మణుడు ఆ ఆకాశముననే తనసంకల్పనాబలమున పరమశక్తిసంపన్నుడగు రాజయ్యెను. అతడు, శక్తివలన పృథివిని జయించెను; ప్రతాపమున స్వర్గము నాక్రమించుకొనెను. కృపతో పాతాళమును పాలింపసాగెను: ఇట్లాతడు ముల్లోకముల జయించెను. అతడు శత్రువులను వృక్షములకు ప్రళయాగ్నియును, స్త్రీలకు మన్మథుడును, సంపదలను చంచలవాయువుల నడకట్టు మేరుపర్వతమును, సాధువులను పద్మములకు సూర్యుడునునైయుండెను. మఱియునాతడు శాస్త్రమున కాదర్శమును, యాచకులకు కల్పవృక్షమును, ద్విజులకాశ్రయమును, ధర్మమను అమృతమునకు పూర్ణచంద్రుడునునై వెలయుచుండెను.

స్వగృహాభ్యంతరాకాశే చిత్తాకాశమయాత్మని
తస్మిన్ ద్విజే శవీభూతే భూతాకాశశరీరిణి. 24
సా తస్య బ్రాహ్మణీ భార్యా శోకేనాత్యంతకర్శితా
శుష్కేవ మాషశింబీకా హృదయేన ద్విధాభవత్. 25

బ్రాహ్మణుడు పాంచభౌతికదేహమును బరిత్యజించి, గృహాకాశమున చిత్తాకాశమయశరీరమును దాల్చెను. అతనిభార్య అతనిశవము గాంచి దుఃఖవిహ్వలయాయెను; ఆమె హృదయము ఎండిన మినపకాడవలె రెండువ్రక్కలాయెను.

భర్త్రా సహ శవీభూతా దేహముత్సృజ్య దూరతః
అతివాహికదేహేన భర్తారం సముపాయయౌ. 26

అప్పుడామెగూడ కొయ్యబారి దేహమును బరిత్యజించి, అతివాహికదేహములు ధరించి, భర్తననుసరించెను.

నదీనిఖాతమివ తం భర్తారమనుసృత్య సా
ఆజగామ విశోకత్వం సా వాసంతీవ మంజరీ. 27

నది సముద్రాభిముఖమగునట్లు, ఆమె భర్తకడకేగి, వసంతకాలలతవలె, శోకమును బరిత్యజించి ఆనందించెను.

తత్రాస్య విప్రస్య గృహాణి సంతి భూస్థావరాదీని ధనాని సంతి
అద్యాష్టమం వాసరమాప్తమృత్యోర్ద్విజో గిరిగ్రామకకందరస్థః. 28

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే ఉత్పత్తిప్రకరణే
లీలోపాఖ్యానే బ్రాహ్మణ మరణం నామైకోన
వింశతితమః సర్గః ॥ 19 ॥

ఆ బ్రాహ్మణదంపతులు మరణించి నేటికెనిమిది దినములైనవి. వారి జీవములు స్థూల శరీరమును బరిత్యజించి గిరిగ్రామమున ఆయింటనే వసించుచున్నవి. అట, వారి భూములు, స్థిరచరాస్తులు, F28 ధనరత్నగృహాదులు అట్లేయున్నవి.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు, ఉత్పత్తిప్రకరణమున
లీలోపాఖ్యానమున బ్రాహ్మణమరణమను
ఏకోనవింశ సర్గము ॥ 19 ॥

—:0:—

## వింశః సర్గః

శ్రీ దేవ్యువాచ:—

స తే భర్తాద్య సంపన్నో ద్విజో భూపత్వమాగతః
యాఽసావరుంధతీనామ బ్రాహ్మణీ సా త్వమంగనే. 1

శ్రీదేవి:– ఆబ్రాహ్మణుడే నీభర్తయగు పద్ముడు, ఇప్పుడు రాజత్వమును బొంది, రాజ్యమును పాలించుచున్నాడు. నీవే అరుంధతియను ఆ బ్రాహ్మణపత్ని వి.

ఇహేమౌ కురుతో రాజ్యం తౌ భవంతౌ సుదంపతీ
చక్రవాకావివ నవౌ భువి జాతౌ శివావివ 2

మీరే పూర్వము బ్రాహ్మణదంపతులై, భూలోకమునందలి పార్వతీపరమేశ్వరులవలె నుంటిరి. ఇప్పుడు చక్రవాక మిథునమువలె విరహమునుబొందినారు; నీవు రాజ్యమును పాలించుచున్నావు.

ఏష తే కథితః సర్వః ప్రాక్తనః సంసృతిక్రమః
భ్రాంతిమాత్రకమాకాశ మేవం జీవస్వరూపధృక్. 3

పూర్వపు సృష్టి భ్రమయని తెలిపియుంటిని; బ్రహ్మాకాశమే (చైతన్యమే) భ్రమవలన జీవస్వరూపమును గ్రహించినది.

భ్రమాదస్మాచ్చిదాకాశే భ్రమోఽయం ప్రతిబింబితః
అసత్య ఏవవా సత్యో భవతోర్భవభంగదః. 4

ఈ భ్రమవలననే చిదాకాశమున భ్రమ ప్రతిబింబించుచున్నది. ఇది సత్యమైనది, మిథ్యయైనది, తెలిసిచో ఏమియునుండదు.

తస్మాద్భ్రాంతిమయః కః స్యాత్కో వా భ్రాంత్యుజ్ఝితో భవేత్
సర్గో నిరర్గలానర్థబోధాన్నాన్యో విజృంభతే.

కనుక, ఎయ్యది భ్రమయుకమో ఎటుగ ప్రయత్నించిన, సృష్టియొక్క ఆత్యంతిక శూన్యజ్ఞానము గలుగును.

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

ఇత్యాకర్ణ్య చిరం చారు విస్మయోత్ఫుల్లలోచనా
భూత్వోవాచ వచో లీలా లీలాలసపదాక్షరమ్.



వసిష్ఠుడు:– రామా! లీలాదేవి ఈ పల్కుల నాలించి, విస్మయవిస్ఫారితలోచనయై, మృదుమధురముగ నిట్లుపల్కెను.

లీలోవాచ:—

దేవి భోః స్త్వద్వచో మిథ్యా కథం సంపన్నమీదృశమ్
క్వ విప్రజీవః స్వగృహే క్వేమే వయమిహస్థితాః. 7

లీల:– దేవీ ! నీ పల్కు అసందర్భములుగ నున్నవే! ఇట్లెన్నడైన జరుగగలదా? ఆ బ్రాహ్మణుడు తుద్రమగు స్వగృహమున మరణించినాడు. మే మిట నున్నాము.

తాదృగ్లోకాంతరం సా భూస్తే శైలాస్తాదిశో దశ
కథంభాంతిగృహస్యాంత ర్మద్భర్తా యేష్వవస్థితః. 8

నా భర్త ఇప్పుడు పరలోకమున నున్నాడు. ఆటనున్న భూములు, పర్వతములు, దిక్కులు ఈ గృహమున నెట్లిముడగలవు ?

మత్తైరావతో బద్ధః సర్షపస్యైకకోటరే
మశకేన కృతం యుద్ధం సింహౌఘైరణుకోటరే. 9
పద్మాక్షే స్థాపితో మేరు ర్నిగీర్ణో భృంగసూనునా
స్వప్నాబ్దగర్జితం శ్రుత్వా చిత్రంనృత్యంతి బర్హిణః. 10
అసమంజసమేవైత ద్యథాసర్వేశ్వరేశ్వరి
తథాగృహాంతః పృథ్వీచ శైలాశ్చేత్యసమంజసమ్. 11

ఆవగింజయందు మదించిన ఐరావతమును బంధింపగలమా? దోమ సింహముతో పోరాడగలదా? తుమ్మెద మేరుపర్వతమును పద్మమునందుంచి మ్రింగగలదా? స్వప్నదృష్టమేఘముల గర్జనమువిని మయూరములు నర్తించునా? సర్వేశ్వరేశ్వరీ! ఇవి అసంభవములైనట్లు విప్రభవనమున పృథివీపర్వతాదులుండుట అసంభవములని తలపోయుచున్నాను.

యథావదేతద్దేవేశి కథయామలయా ధియా
ప్రసాదానుగృహీతేహి నోద్విజంతే మహాజనాః. 12

దేవీ! చిత్తశుద్ధినొసగు వాక్యముల నాకీ విషయమును దెల్పుము. మహాత్ములు, తామనుగ్రహించిన వ్యక్తి అయుక్తి ప్రశ్న మొనర్చినను ఆగ్రహింపరు.

శ్రీ దేవ్యువాచ:—

నాహంమిథ్యావదామీదం యథావచ్ఛృణు సుందరి
భేదనం నియతీనాంహి క్రియతే నాస్మదాదిభిః. 13

శ్రీ దేవి:– సుందరీ! నేనసత్యమును వచించుటలేదు, మరల చెప్పుచున్నాను, వినుము. అసత్యమాడరాదను నియమమును మేమే విధించితిమి. దానిని మేమే ఉల్లంఘింతుమా?

విభిద్యమానామన్యేన స్థాపయామ్యహమేవ యామ్
మర్యాదాం తాం మయాభిన్నాం కోఽపరః పాలయిష్యతి. 14

మేమే ఈ నియమము నుల్లంఘించిన, ఇక దీనినెవరు పాలింతురు ?

సగ్రామద్విజజీవాత్మా తస్మిన్నేవస్వసద్మని
వ్యోమ్న్యేవేదం మహారాష్ట్రం వ్యోమాత్మైవప్రపశ్యతి. 15

ఆ బ్రాహ్మణుని జీవాత్మ ఆకాశభవనమున, ఆకాశరూపమునంది, ఆకాశరాజ్యమును, గాంచుచున్నది.

ప్రాక్తనీ సా స్మృతిర్లుప్తా యువయోరుదితాన్యథా
స్వప్నే జాగ్రత్స్మృతిర్యద్వ దేతన్మరణమంగనే. 16

స్వప్నమున జాగ్రత్స్మృతి లోపించునట్లు, మరణించిన పూర్వపు స్మృతిలోపించును. అందువలన, మీకు విప్రదంపతులమైయుంటిమను జ్ఞానము గలుగుటలేదు.

యథాస్వప్నే త్రిభువనం సంకల్పేత్రిజగద్యథా
యథాకథార్థసంగ్రామో మరుభూమౌ జలంయథా. 17
తస్యబ్రాహ్మణగేహస్య సశైలవనపత్తనా
ఇయమంతఃస్థితాభూమిః సంకల్పాదర్శయోరివ. 18
అసత్యైవేయమాభాతి సత్యేవ ఘనసర్గతా
తస్మాత్సత్యావభాసస్య చిద్వ్యోమ్నఃకోశకోటరే. 19
అసత్యాద్యత్సముత్పన్నం స్మృత్యా నామ తదప్యసత్
మృగతృష్ణా తరంగిణ్యాం తరింగోఽపి నసద్యతః. 20

స్వప్నమున, సంకల్పమున, లోకములను గాంచుట, మరుభూమియందు నీటినిజూచుట గృహాకాశమున బ్రాహ్మణుడు వనపర్వతాదులతోనిండిన పృథివిని దర్శించుట సమానములు. చిన్న అద్దమున గన్పడు పెద్దవస్తువు, సూక్ష్మాంతఃకరణమున ప్రతిబింబించు విశాలజగత్తులు మిథ్యలైనట్లు, అటనున్న పృథ్వ్యాదులుగూడ మిథ్యలే; అవి సత్యస్వరూపమగు చిదాకాశముయొక్క ప్రతిబింబములు మాత్రమే, అందువలన, నిర్మలాకాశస్వరూపమగు పరబ్రహ్మమున అసత్యమగు సృష్టి సత్యమువలె ప్రతిభాతమగుచున్నది, జగత్తున వాస్తవమగు సత్యత్వము లేదు. కోశాంతర్గతుడగు చిదాత్మయొక్క సత్యత్వమే ఆరోపమాత్రమగు జగత్తున ప్రతిబింబించుచున్నది అని గ్రహింపుము. మరుభూమియందలి నదీతరంగములు సత్యములుగానట్లు, అసత్యస్మృతినుండి జనించిన పృథ్వ్యాదులుగూడ సత్యములుగావు.

ఇదం త్వదీయం సదనం తద్గేహాకాశకోశగమ్
విద్ధి మాంత్వాంచసర్వంచ తచ్చిద్వ్యోమైవ కేవలమ్. 21

ఈ నీ గృహము, గృహాకాశముననున్న నీవు, నేను, మఱి ఇతరములగు వస్తువులు చిదాకాశముగాక వేఱొండుగావని గ్రహింపుము.

స్వప్నసంభ్రమసంకల్ప స్వానుభూతిపరంపరాః
ప్రమాణాన్యత్రముఖ్యాని సంబోధాయప్రదీపవత్. 22

చీకటియందున్న వస్తువునుజూపు దీపమే ప్రధానకారణమైనట్లు, సంకల్పము, స్వప్నము, సంభ్రమము, అనుభూతి మొదలుగాగలవి జగన్మిథ్యాత్వబోధమునకు ప్రధానప్రమాణములగుచున్నవి.



స్థితోబ్రాహ్మణగేహాంత ర్ద్విజజీవ స్తదంబరే
ససముద్రవనాపృథ్వీ స్థితాబ్జఇవమట్పదః. 23

ఆ ఇంట, చిదాకాశముననే ఆవిప్రుడున్నాడు. తుమ్మెద పద్మమున నొకమూలనుండునట్లు సముద్రములతో గూడిన పృథివిగూడ అటనున్నది.

తస్యాఃకస్మింశ్చిదేకస్మి న్ప్రేలవే కోణకోటరే
ఇదంపత్తనదేహాది కేశోండ్రకఇవాంబరే. 24

నీలాకాశమున కేశదామభ్రమ కలుగునట్లు, ఆ ఆకాశమున గృహదేహాది పదార్థములున్నట్లు భ్రమగలుగుచున్నది.

తస్మిన్నస్మిన్పురే తన్వి తదేవసదనంస్థితమ్
తస్మాత్కిం త్రసరేణ్వంత ర్జగద్వృందమివస్థితమ్ 25

తన్వీ! ఒక్కత్రసరేణువుననే జగత్సమూహమున్నట్లగుపడుపట్ల, విప్రగృహమున నగరోపవనాదులనాయాసముగ నిముడగలవు.

పరమాణౌపరమాణౌ సంతి వత్సే చిదాత్మని
అంతరంతర్జగంతీతి కింత్వేతన్నామ శంక్యతే. 26

చిన్మయ పరమాణువున అనగా, మనస్సున జగత్తుండుపట్ల, సామాన్యవిషయమును గుఱించి శంకించుచున్నావేమి?

లీలోవాచ:—

అష్టమే దివసే విప్రః స మృతఃపరమేశ్వరి
గతోవర్షగణోఽస్మాకం మాతఃకథమిదంభవేత్. 27

లీల:- పరమేశ్వరీ! ఆ బ్రాహ్మణుడు మరణించి నేటికెనిమిది దినములైనవని చెప్పితివి. కాని, మేమిటచాల ఏండ్లనుండి ఉన్నామే? ఇదెట్లు వీలుపడును?

శ్రీదేవ్యువాచ:—

దేశదైర్ఘ్యంయథానాస్తి కాలదైర్ఘ్యంతథాంగనే
నాస్త్యేవేతియథాన్యాయం కథ్యమానం మయాశృణు. 28

శ్రీదేవి:- అంగనా! దేశమునకు దైర్ఘ్యములేనట్లు కాలమునకుగూడ దైర్ఘ్యములేదు ఈ విషయమును వివరించుచున్నాను, వినుము,

యథైతత్ప్రతిభామాత్రం జగత్సర్గావభాసనమ్
తథైతత్ప్రతిభామాత్రం క్షణకల్పావభాసనమ్. 29

జగత్సృష్టివలెనే, క్షణకల్పాది కల్పనామయమగు కాలముగూడ బ్రహ్మముననే అధ్యసింపబడుచున్నది.

క్షణకల్పంజగత్సర్వం త్వత్తామత్తాత్మజన్మనాం
యథావత్ప్రతిభాసస్య వక్ష్యే క్రమమిమంశృణు. 30

క్షణములు, కల్పములు, త్రిభువనములు నీవు నేను మన్నగు వస్తుసమూహములు, పరమాత్మ యొక్క ప్రతిభాసలైన తెఱగును వివరించుచున్నాను, వినుము.

అనుభూయక్షణంజీవో మిథ్యామరణమూర్ఛనమ్
విస్మృత్యప్రాక్తనంభావ మన్యం పశ్యతిసువ్రతే. 31

సువ్రతీ! జీవుడు క్షణకాలము మిథ్యామోహమునబడి, ప్రాక్తన సంస్కారమును మరచి, అన్యథా గాంచును.

తదేవోన్మేషమాత్రేణ వ్యోమ్న్యేవ వ్యోమరూప్యపి
ఆధేయోఽయమిహాధారే స్థితోఽహమితిచేతతి. 32

అప్పుడు, చిదాకాశముననున్న ఆకాశరూపియగు జీవుడిట్లు, తలపోయును:—"నేను ఆధేయమయ్యు ఆధారమున నున్నాడను.

హస్తపాదాదిమాన్దేహో మమాయమితి పశ్యతి
యదేవచేతతివపు స్తదేవేదం స పశ్యతి. 33

హస్తపాదాది ఇంద్రియములతోఁగూడిన యీ దేహము నాదియే. ఇందే నేను వసించుచున్నాడను.

ఏతస్యాహం పితుఃపుత్రో వర్షాణ్యేతాని సంతి మే
ఇమే మే బాంధవా రమ్యా మమేదం రమ్యమాస్పదమ్. 34

ఈ జనకునకు పుత్రుడనై జన్మించితిని. ఇంతవయస్సు గడచినది. ఈ బందుగులు నావారే, ఈ రమ్యగృహములు నావియే.

జాతోఽహమభవం బాలో వృద్ధింయాతోఽహమీదృశః
బాంధవాశ్చాస్య మే సర్వే తథైవ విచరంత్యమీ. 35

"నేను జన్మించి బాల్యమునుగడపి వృద్ధుడనైతిని. నా బంధుమిత్రులు మునపటియట్లే ఉన్నారు.

చిత్తాకాశఘనైకత్వా త్స్వప్న్యేఽపిభవంతితే
ఏవంనామోదితేఽప్యస్య చిత్తేసంసారఖండకే. 36
నకించిదప్యభ్యుదితం స్థితం వ్యోమైవ నిర్మలమ్
స్వప్నేద్రష్టరియద్వచ్చి త్తద్వద్దృశ్యే చిదేవ సా. 37

చిత్తాకాశ ప్రభావముననే ఇట్టి భ్రమజ్ఞానము గలుగును. స్వప్నమువలెనే పరలోకానుభవముగూడ కలుగును. అందువలననే, ద్రష్ట, దృశ్యములు చిత్స్వభావములనియు, ఇవి వాస్తవమునకు నిర్మల చిదాకాశములుగాక అన్యములుగావనియు చెప్పియుంటిని.

సర్వగైకతయాయస్మా త్స్వస్వప్నదృష్టదర్శనా
యథాస్వప్నేతథోదేతి పరలోకదృగాదిభిః. 38
పరలోకే యథోదేతి తథైవేహాభ్యుదేతి సా
తత్స్వప్నపరలోకేహ లోకానామసతాంసతామ్. 39



సమనాగపి భేదోఽస్తి వీచీనామివ వారిణి
అతోజాతమిదంవిశ్వ మజాతత్వాదనాశిచ. 40

సర్వవ్యాపియగు ఈ చిత్-శక్తియే స్వప్నమును గాంచుచున్నది, దృశ్యదర్శన స్వరూపమిదియే. స్వప్నమున నుదయించునట్లే, ఇది పరలోకమునగూడ ఉదయించుచున్నది, అందువలన, అసత్యములగు లోకములు సత్యములట్లు కనంబడుచున్నవి. నీటికిని కెరటములకును భేదములేనట్లు, ఇహలోక, పరలోక, స్వప్నలోకములకు భేదములేదు. భేదబుద్ధి భ్రమనుండియే కలుగుచున్నది. జగద్భావము భ్రమయొక్క పరిణామమగుటవలన దీనికస్తిత్వమేలేదు; అస్తిత్వాభావమువలన నియ్యది అజాతము, అనశ్వరము అగుచున్నది.

స్వరూపత్వాత్తునాస్త్యేవ యచ్చభాతి చిదేవ సా
యథైవచేత్యనిర్భానా పరమవ్యోమరూపిణీ. 41
సచేత్యాపి తథైవైషా పరమవ్యోమరూపిణీ
తస్మాచ్చేత్యమతోనాన్య ద్వీచిత్వాదివ వారితః. 42

కాని, ప్రతిభాతమగుచున్నదంతయు చిత్తుగాక మరొకటిగాదు, ఇది సర్వదా ఆకాశస్వరూపమే. దృశ్యములన్నియు దీన ఆరోపింపబడియున్నవి. వీటికి ప్రత్యేకసత్తలేదు. తరంగములు జలములకంటె వేరుగానట్లు, ఈ ఆరోపిత సృష్టిగూడ చిదాకాశముకంటె వేరుగాదు.

వీచిత్వంచ రసేనాస్తి శశశృంగవదేవహి
సైవచేత్యమివాపన్నాఽస్వభావాదచ్యుతాప్యలమ్. 43
తస్మాన్నాస్త్యేవదృశ్యోర్థః కుతోఽతోద్రష్టృదృశ్యధీః

నీటియందు, కుందేటికి కొమ్మువలె, తరంగములు మిథ్యయైనట్లు, చిదాకాశముకంటె, అన్యమగు సృష్టిలేదు — ఉన్నట్లగపడు ఈ సృష్టి మిథ్య; చిదాకాశమే స్వప్రభావమున, జగదాకారమునగనంబడుచున్నది. దృశ్యపదార్థమనునదే లేకుండుటవలన, ద్రష్టృ దృశ్యబోధకూడ మిథ్యయే.

నిమిషేణైవ జీవస్య మృతిమోహాదనంతరమ్. 44
త్రిజగద్దృశ్యసర్గశ్రీః ప్రతిభాముపగచ్ఛతి
యథాదేశంయథాకాలం యథారంభంయథాక్రమమ్. 45
యథోత్పాదంయథామాతృ యథాపితృయథారసమ్
యథావయో యథాసంవి ద్యథాస్థానం యథేహితమ్ 46
యథాబంధుయథాభృత్యం యథేహాస్తమయోదయమ్
అజాతఏవజాతోఽహ మితి చేతతి చిద్వపుః. 47

జీవుడు మరణమను మోహమునందినవెంటనే, త్రిభువన దృశ్యము ప్రతిభాతమగును. అది పూర్వస్మృతి ననుసరించియేయుండును — పూర్వము గాంచిన కాలము, ఆరంభము, క్రమము, జగత్తు, పిత, మాత, వయస్సు, జ్ఞానము, బంధువులు, భృత్యులు, యత్నము, స్థానము, క్షయము, ఉదయములనే మరల చిత్-శరీరమును ధరించిన జీవుడు కాంచును.

దేశకాలక్రియాద్రవ్య మనోబుద్ధీంద్రియాదిచ
ఘటిత్యేవ మృతేరంతే వపుఃపశ్యతియావనే. 48
ఏషామాతాపితాహ్యేష బాలోఽభూవమహంత్వితి
నానుభూతోఽనుభూతోవా యఃస్యాత్స్మృతిమయఃక్రమః. 49
పశ్చాదుదేత్యసౌ తస్య పుష్పస్యేవ ఫలోదయః
నిమిషేనైవ మే కల్పో గతఇత్యనుభూయతే. 50
రాత్రిర్ద్వాదశవర్షాణి హరిశ్చంద్రే తథాహ్యభూత్
కాంతావిరహిణామేకం వాసరం వత్సరాయతే. 51

'నేను జన్మించితిని, బాలుడనైయుంటిని, ఈమె నాతల్లి, యీయన నాతండ్రి' అనుబోధ పూర్వస్మృతి బలముననే కల్గును; దేశకాలాదుల బోధకూడ లభించును. పిదప, పుష్పమునుండి ఫలము వచ్చునట్లు, పూర్వస్మృతికల్గును. అప్పుడాతడు, హరిశ్చంద్రుడు ఒకరాత్రిని ద్వాదశవత్సరములని తలచినట్లు, విరహి ఒకదినమును సంవత్సరమని భావించునట్లు, ఒక్కనిముషములో కల్పము జరిగిన దనుకొనును.

మృతోజాతోఽహమస్యామే పితేతిస్వప్నతాస్విమ
అభుక్తస్యైవభోగస్య భుక్తధీరుపజాయతే. 52

అప్పుడాతనికి, భుజింపనివానికి భోజనభ్రాంతివలె, 'నేను జన్మించితిని, మృతించితిని, నా తండ్రి, తల్లి' అను బుద్ధిజన్మించును.

భుక్తేఽప్యభుక్తధీర్దృష్ట మిత్యలం కితవాదిషు
శూన్యతాకీర్ణతామేతి తుల్యంవ్యసనముత్సవైః
విప్రలంభోఽపి లాభశ్చ మదస్వప్నాదిసంవిది. 53

అప్పుడు, శూన్యస్థానము జనాకీర్ణమట్లుగను, విపత్తు ఉత్సవమువలెను, వంచన లాభమట్లుగను దోచును.

తైక్ష్ణ్యంయథామరిచబీజకగేస్థితంస్వం
స్తంభేషు చారచితపుత్రకజాలమంతః
దృశ్యంత్వనన్యదిదమేవమజేఽస్తిశాంతం
తస్యాస్తి బంధనవిమోక్షదృశః కుతః కాః.

ఇత్యార్షే శ్రీ వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే ఉత్పత్తి ప్రకరణే లీలోపాఖ్యానే పరమార్థ ప్రతిపాదనంనామ వింశతితమః సర్గః ॥ 20 ॥

మిరియపుగింజయందు కారమును, స్తంభమున, చెక్కబడని బొమ్మయునుండునట్లు, భ్రమమయమగు దృశ్యజగత్తు అజుడును, నిత్యుడునునగు పరమపురుషు నాశ్రయించుకొనియున్నను, దానికి పృథక్-సత్తలేదని ముక్త పురుషులు గ్రహింతురు.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు ఉత్పత్తిప్రకరణమున లీలోపాఖ్యానమున పరమార్థప్రతిపాదనమను వింశ సర్గము ॥ 20 ॥

## ఏకవింశః సర్గః.

శ్రీదేవ్యువాచ:—

ప్రతిభాంతి జగంత్యాశు మృతిమోహాదనంతరమ్
జీవస్యోన్మీలనాదక్ష్ణో రూపాణీవాఖిలాన్యలమ్. 1

శ్రీదేవి:— కళ్లు విప్పిజూచిన నానావిధరూపములగుపడునట్లు, జీవుడు మృతినందినవెంటనే అసంఖ్యాకములగు దృశ్యజగత్తు లగపడును.

దిక్కాలకలనాకాశ ధర్మకర్మమయానిచ
పరిస్ఫురంత్యనంతాని కల్పాంతస్థైర్యవంతిచ. 2

దిక్కులు, కాలము, ఆకాశము, ధర్మము, కర్మలు—ఇవి కల్పాంతమువఱకు స్థిరముగనుండు వస్తువులు; ఇవన్నియు ఆ చిదాకాశమున ప్రస్ఫురితములగును.

నానుభూతం న యద్దృష్టం తన్మయా కృతమిత్యపి
తత్క్షణాత్స్మృతితామేతి స్వప్నేస్వమరణం యథా. 3

జీవుడనుభవింపనివి, గాంచనివి, ఒనర్పనివి, అగు విషయములుగూడ, స్వప్నమున నిజ మృత్యువువలె, స్మరణకువచ్చును.

భ్రాంతిరేవమనంతేయం చిద్వ్యోమవ్యోమ్నిభాసురా
అపకుడ్యాజగన్నాన్నా నగరీకల్పనాత్మికా. 4
ఇదంజగదయంసర్గః స్మృతిరేవేతి జృంభతే
దూరకల్పక్షణాభ్యాస విపర్యాసైకరూపిణీ. 5

ఈభ్రాంతికి, కల్పితనగరమునకువలె, మూలములేకున్నను, చిదాకాశమున వెలయుచుండును. పిదప నీభ్రాంతి, 'ఇది జగత్తు, ఇదిసృష్టి, ఇదిదూరము, ఇదిదగ్గర, ఇదిక్షణము, ఇది అల్పకాలము' అను భ్రమగమారి పూర్వ స్మృతి విజృంభించుచుండును.

నానుభూతానుభూతాచ జ్ఞప్తిరిత్థం ద్విరూపిణీ
పూర్వకారణరిక్తైవ చిద్రూపైవప్రవర్తతే. 6

అనుభూతములును, అననుభూతములునునగు స్మృతులు రెండును కారణరహితమగు చిద్రూపముననే వెలయుచుండును.

నానుభూతేఽనుభూతత్వం సంవిదంతరుదేత్యపి
స్వప్నభ్రమాదావన్యస్మిన్పితరీవ పితుఃస్మృతిః. 7

స్వప్నభ్రమయందు వస్తుస్మరణ కలుగునట్లును, తండ్రివలెనున్నవానిని గాంచిన తండ్రి గుర్తుకు వచ్చునట్లును, అననుభూతవస్తువులుగూడ అనుభూతములను భ్రమగల్గును.

కదాచిత్స్మృతితాం త్యక్త్వా ప్రతిభామాత్రమేవ సత్
భాతి ప్రథమసర్గేషు రూపేణ తదనుక్రమాత్. 8

సంకల్పమయమగు ఈసంసారముగూడ సృష్టికాలమున విధాత కల్పనయందు ఇమిడియుండెను; పిదప నయ్యదియే స్థూలమగుచు క్రమముగ రూపమును దాల్చుచున్నది.

దృశ్యం త్రిభువనాదీద మనుభూతం స్మృతౌ స్థితమ్
కేషాంచిత్తన్ని కేషాంచిన్నానుభూతం స్మృతౌస్థితమ్. 9

ప్రతిభాసత ఏవేదం కేషాంచిత్స్మరణం వినా
చిదణూనాం ప్రజేశత్వం కాకతాలీయవద్యతః. 10

తన్వీ! ఈజగద్దృశ్యమును కొందఱు స్మృతియందే అనుభవించుచున్నారు. కొందఱికియ్యది స్మృతియందు అనుభవాకారమున నుండును, మఱికొందఱికి కాకతాలీయముగ స్మరణలేకుండగనే అనుభవమునకు వచ్చుచున్నది.

అత్యంతవిస్మృతం విశ్వం మోక్ష ఇత్యభిధీయతే
ఈప్సితానీప్సితే తత్ర నస్తః కాచనకస్యచిత్. 11

ఈ సంసారమును సంపూర్ణముగ విస్మరించుటయే ముక్తి అనంబడుచున్నది. అందువలన, ఈసంసారమున గోరదగినదిగాని, నిరాకరింప దగినదిగాని, ఏమియులేదు.

అత్యంతాభావసంపత్తిం వినాహంతా జగత్థితేః
అనుత్పాదమయీ హ్యేషా నోదేత్యేవ విముక్తతా. 12

అహంజ్ఞానమును, తదనువర్తియగు దృశ్యజగత్తుయొక్క అత్యంతాభావమును దెలియనిదే ఈముక్తి లభించదు.

రజ్జ్వాంసర్పభ్రమః సర్పశబ్దార్థాసంభవంస్థితమ్
అనుత్పాదమయం త్యక్త్వా శాంతోఽపిహి నశామ్యతి. 13

త్రాటియందు పాము అనుశబ్దమును, దానియొక్క అర్థమును ఆరోపింపబడియుండు నంతవఱకు సర్పభయము తొలగదు.

అర్థశాంతో నశాంతోఽసౌ సమేత్యర్థతయా పునః
ఉదేత్యేకపిశాచాంతే పిశాచోఽన్యోహ్యధీమతః. 14

యోగమున నిరోధింపబడిన చిత్తమునకు శాంతి లభించుచున్నదే? అనిన— ఈ శాంతి, శాంతికాదు. యోగము భంగమైన సంసృతి అరుదెంచి మరల మునుపటియట్లే, ఒకదయ్యము వదలిన మరొకదయ్యమువచ్చి మూఢునిబట్టుకొనునట్లు, పట్టుకొనును.

సంసారశ్చాయమాభోగీ పరమేవేతి నిశ్చయః
కారణాభావతో భాతి యదిహాభాతమేవతత్. 15

తత్వజ్ఞానమే ముక్తికికారణము. ఈ జ్ఞానము లభించిన, ఈసంసారము బ్రహ్మమేయను బోధకలుగును.

లీలోవాచః—

బ్రాహ్మణబ్రాహ్మణీరూపే సర్గే కారణసంస్మృతిః
కథమభ్యుత్థితా సాస్య స్మరణీయమిదం వినా. 16

లీల:- పూర్వసంస్కారమే సృష్టికిగారణమని గ్రహించితిని. బ్రాహ్మణుని యొక్కయు, అతని భార్యయొక్కయు సృష్టికిగారణమగు సంస్కారమెటనుండి అరుదెంచినది? దానిని నేనెన్నడును అనుభవించియుండలేదే?



శ్రీదేవ్యువాచః—

పితామహస్మృతిస్తత్ర కారణం తస్య న స్మృతిః
పూర్వం నసంభవత్యేవ ముక్తత్వాత్పద్మజన్మనః. 17

పూర్వం నసంభవత్యేవ స్మరణీయమితిస్వయమ్
పద్మజాదిత్వమాయాతి చైతన్యస్యతథాస్థితేః. 18

అభూవమహమిత్యన్యః ప్రజానాథః ప్రజాపతేః
కాకతాలీయవత్కశ్చిద్భవతి ప్రతిభామయః. 19

దేవి:- మృతికి పిమ్మట దృశ్యమగుపడుటకు కారణము సంస్కారముకాదు. సృష్టియొక్క స్మృతియే కారణము. కాని, బ్రహ్మ ముక్తుడగుటవలన నతనికి పూర్వస్మృతియుండదు; అందువలన నియ్యదియు కారణముగాజాలదు. సృష్టియొక్క పూర్వశరీరమునకు గారణమగు మాయయే చైతన్య సంపర్కమున నూతనప్రజాపతిగ మారుచున్నది. ఇట్లు, ప్రజాపతినుండి ప్రజాపతి జన్మించుచున్నాడు. అతనికి 'నేను ప్రజాపతిని' అనుజ్ఞానము మాత్రమే కల్గును. కాని వీరిలో కొందఱికి, కాకతాలీయముగ పూర్వస్మృతితోగూడిన ప్రతిభ వికసించును.

ఏవమభ్యుదితే లోకే నకించిన్నకదాచన
క్వచిదభ్యుదితం నామ కేవలం చిన్నభఃస్థితమ్. 20

సృష్టులన్నియుగూడ ఇట్లే మిథ్యారూపమున చైతన్యాకాశమున నుదయించినట్లు కనంబడుచున్నవి. వాస్తమునకివి ఎన్నడును ఉదయించు చుండుటలేదు.

ద్వివిధాయాఃస్మృతేరస్యాః కారణం పరమంపదమ్
కార్యకారణభావోఽసావేక ఏవ చిదంబరే. 21

బ్రహ్మకు గల్గు ద్వివిధస్మృతులకు గారణము, పరబ్రహ్మమే; ఇయ్యదొక్కటియే కార్యకారణ స్వరూపమై చిదాకాశమున, వెలయుచున్నది.

కార్యంచ కారణంచైవ కారణైః సహకారిభిః
కార్యకారణయోరైక్యాత్తదభావాన్న శామ్యతి. 22

కార్యము, కారణము, సహకారికారణములు పరబ్రహ్మముననే వెలయుచున్నవి. కార్య కారణముల అభేదజ్ఞానమే ముక్తి. ఈ జ్ఞానములేకున్న ముక్తి లభింపదు.

మహాచిద్రూపమేవ త్వం స్మరణం విద్ధివేదనమ్
కార్యకారణతా తేన స శబ్దో నచ వాస్తవః. 23

అందువలన, పూర్వస్మృతి అఖండ చిన్మయమని గ్రహింపుము. కార్యకారణ శబ్దములందే యున్నవి, వాస్తవమునకు వాటికి భిన్నసత్తలేదు.

ఏవం నకించిదుత్పన్నం దృశ్యం చిజ్జగదాద్యపి
చిదాకాశే చిదాకాశం కేవలం స్వాత్మని స్థితమ్. 24

కనుకనే జగదాదిదృశ్యము లుత్పన్నములగుటలేదని చెప్పబడుచున్నవి. ఇవి, కేవలము పరమాత్మస్వరూపమగు చిదాకాశముననే వెలయుచున్నవి.

లీలోవాచ:—

అహోను పరమాదృష్టి ర్దర్శితా దేవి మే త్వయా
రూపశ్రీర్జాగతీ ప్రాతః ప్రభయేవేక్షణద్యుతిః. 25
ఇదానీమహమేతస్యాం యావత్పరిణతా దృశి
నాభ్యాసేన వినా తావద్బింధీదం దేవి కౌతుకమ్. 26
యత్రాసౌ బ్రాహ్మణో గేహే బ్రాహ్మణ్యాసహితోఽభవత్
తం సర్గం తం గిరిగ్రామం నయ మాం తం విలోకయే. 27

లీల:- దేవీ! నీవు ప్రసాదించిన దివ్యదృష్టివలన, ప్రాతఃకాలసూర్య తేజమున నయనములు బహిర్జగత్తును గాంచునట్లు, నేను పరమజ్ఞానమును బొందితిని. ఇప్పుడు నాకా బ్రాహ్మణగృహమును గాంచ, కుతూహలము బొడముచున్నది. అందువలన, నన్నా గిరిగ్రామగృహమునకు - ఆ బ్రాహ్మణుడు పత్నితో నివసించినచోటుకు - గొనిపొమ్ము.

శ్రీదేవ్యువాచ:—

అచేత్యచిద్రూపమయీం పరమాం పావనీం దృశమ్
అవలంబ్యేమమాకార మపముచ్య భవామలా. 28
తతః ప్రాప్స్యస్యసందేహం వ్యోమాత్మానం నభఃస్థితమ్
భూమిష్ఠనరసంకల్ప్యే గగనాంతః పురం యథా. 29
ఏవంస్థితే తం పశ్యావః సహసర్గమసర్గలమ్
అయం తద్దర్శనద్వారే దేహోహి పరమార్గలమ్. 30

దేవి:- నీవు, మొట్టమొదట, సమాధిప్రభావమున స్థూలదేహమును బరిత్యజించి, అచేత్యచిద్రూపమగు పవిత్రదృష్టినవలంబించి, పవిత్రవగుమ్ము. అట్లయిన, నీవు మర్త్యలోకవాసియగు జీవుడు కల్పనాబలమున ఆకాశనగరమును గాంచునట్లు, చిదాకాశమునందున్న ఆకాశ స్వరూపసృష్టిని గాంచ గలవు. ఈ స్థూలదేహము సృష్టిదర్శనమునకు ప్రతిబంధకము.

లీలోవాచ:—

అమునా దేవి దేహేన జగదన్యదవాప్యతే
న కస్మాదత్ర మే యుక్తిం కథయానుగ్రహాగ్రహాత్. 31

లీల:- దేవీ! ఈ దేహమున్న అన్యజగత్తు నేల గాంచజాలము? కారణమేమి? దయయుంచి నాకు దెల్పుము.

శ్రీదేవ్యువాచ:—

జగంతీమాన్యమూర్తాని మూర్తిమంతి ముధాగ్రహాత్
భవద్భిరవబుద్ధాని హేమాసీవోర్మికాధియా. 32
హేమ్న్యూర్మికారూపధరేఽప్యూర్మికాత్వం నవిద్యతే
యథా తథా జగద్రూపే జగన్నాస్తిచ బ్రహ్మణి. 33



శ్రీదేవి:- వాస్తవమునకు ఈ దృశ్యజగత్తు ఆకృతిరహితము; మిథ్యాజ్ఞానవశమున ఆకృతి యున్నట్లగపడుచున్నది. బంగారమని తెలిసియున్నను ఉంగరము ఉంగరమనంబడుచున్నది. వాస్తవమునకు బంగారమున ఉంగరమనునది లేదు. అట్లే, ఈ దృశ్యజగత్తుకుగూడ, పరబ్రహ్మవ్యతిరేకమగు సత్తలేదు. అందువలన నియ్యది మిథ్య.

జగదాకాశమేవేదం బ్రహ్మైవేహ తు దృశ్యతే
దృశ్యతే కాచిదప్యత్ర ధూలిరంబునిధావివ. 34

ఈ జగదాకాశము బ్రహ్మముకంటె వేరొండుకాదు. సముద్రమున ధూళిలేకున్నను ప్రతిబింబమగు ధూళి కన్పడునట్లు, నిరాకారమగు బ్రహ్మమున మిథ్యయగు జగత్తుయొక్క ఆకృతి కనంబడుచున్నది.

అయంప్రపంచో మిథ్యైవ సత్యంబ్రహ్మాహమద్వయమ్
అత్రప్రమాణం వేదాంతా గురవోఽనుభవ స్తథా. 35

ఈ ప్రపంచము మిథ్య, 'నేను బ్రహ్మము' అను జ్ఞానమొక్కటియే సత్యము. ఈ విషయమున వేదాంతశాస్త్రము, తదనుభవజ్ఞులగు గురువులు, స్వానుభవములే ప్రమాణములు.

బ్రహ్మైవ పశ్యతిబ్రహ్మ నాబ్రహ్మబ్రహ్మపశ్యతి
సర్గాదినామ్నాప్రథితః స్వభావోఽస్యైవ చేదృశః. 36

బ్రహ్మమే బ్రహ్మమును గాంచుచున్నది. బ్రహ్మముకానిది బ్రహ్మమును గాంచజాలదు. జగత్తును గల్పించి జగన్నామమున వ్యవహరింపబడుటయే బ్రహ్మముయొక్క స్వభావము.

నబ్రహ్మజగతామస్తి కార్యకారణతోదయః
కారణానామభావేన సర్వేషాం సహకారిణామ్. 37

బ్రహ్మమున జగత్కారణముగాని, జగత్కార్యముగాని లేదు. లేక మఱేట్టిసహకారి కారణమును లేదు. (అది విశుద్ధము)

యావదభ్యాసయోగేన నశాంతా భేదధీ స్తవ
నూనం తావదతద్రూపా నబ్రహ్మ పరిపశ్యసి. 38

అభ్యాసబలమున భేదజ్ఞానము తొలగనంతవఱకు, నీవు బ్రహ్మస్వరూపమును బొందజాలవు; బ్రహ్మదర్శన మొనర్పజాలవు.

తత్రరూఢిముపాయాతా యఇమే త్వన్మదాదయః
అభ్యాసాద్బ్రహ్మసంపత్తేః పశ్యామ స్తేహి తత్పరమ్. 39

అభ్యాసబలమున బ్రహ్మవిషయికమగు దృఢజ్ఞానమును సంపాదించిన, మనకాపరమపదమును దర్శించు అధికారము లభింపగలదు.

సంకల్పనగరస్యైవ మమాకాశమయం వపుః
బ్రహ్మైవ చాంతఃపశ్యామి దేహేనానేన తత్పదమ్. 40

నా శరీరము, సంకల్ప నగరమువలె, ఆకాశస్వరూపము. అందువలన, నేను దీనియందుగూడ బ్రహ్మపదమును గాంచగలుగుచున్నాను.

విశుద్ధజ్ఞానదేహా హ్యాస్తథైతే పద్మజాదయః
బ్రహ్మాత్మజగదాదీనామంశే సంస్థానమంగనే. 41

అంగనా! బ్రహ్మాదులగు మహాత్ముల శరీరములుగూడ విశుద్ధ విజ్ఞానమయములగుటవలన, బ్రహ్మస్వరూపమగు జగత్తునందుండియే వారు బ్రహ్మమును దర్శింపగలుగుచున్నారు.

తవాభ్యాసం వినా బాలే నాకారో బ్రహ్మతాంగతః
స్థితఃకలనరూపాత్మా తేన తన్నానుపశ్యసి. 42

బాలా! అభ్యాసము లేకుండుటవలననే, నీదేహము బ్రహ్మస్వరూపమునందలేదు. అందు నీవు గిరిగ్రామమును గాంచజాలకున్నావు.

యత్రస్వసంకల్పపురం స్వదేహేన నలభ్యతే.
తత్రాన్యసంకల్పపురం దేహోఽన్యో లభతే కథమ్. 43

నీవు నీ దేహముననే సంకల్పనగరమును గాంచజాలకున్నావు. ఇక, అన్యదేహము నాశ్రయించి అన్యసంకల్పితమగు నగరము నెట్లు గాంచగలవు?

తస్మాదేనం పరిత్యజ్య దేహం చిద్వ్యోమరూపిణీ
తత్పశ్యసి తదేవాశు కురు కార్యవిదాంవరే. 44

కార్యజ్ఞురాలా! అందువలన నీ వీ దేహమును పరిత్యజించి, చిన్మయస్వరూపమును బొందుము. అప్పుడైన నీ వా గిరిగ్రామమును గాంచగల్గుదువు.

సంకల్పనగరం సత్యం యథాసంకల్పితంప్రతి
సదేహంవా విదేహంవా నేతరం ప్రతి కించన. 45

మానసశరీరమున మానసికనగరమును, స్థూలశరీరమున స్థూలనగరమును గన్పడును. సంకల్పనగర వ్యవహారమునకును, భోగమునకును సంకల్పమే తోడ్పడుచున్నది.

ఆదిసర్గే జగద్భ్రాంతి ర్యథేయం స్థితిమాగతా
తథాతదాప్రభృత్యేవం నియతిఃప్రౌఢిమాగతా. 46

సృష్ట్యారంభమునుండి జగద్భ్రమవలెనే, ఆరూపముననే జీవుని అదృష్టరాశిని బలపర్చుచున్నది.

లీలోవాచ:—

త్వయోక్తం దేవి గచ్ఛావో బ్రాహ్మణబ్రాహ్మణీజగత్
సహేతీదమిదం వచ్మి కథం గంతవ్యమంబ హే. 47

ఇమందేహమిహాస్థాప్య శుద్ధసత్త్వానుపాతినా
చేతసా తం పరం యామి, లోకం త్వం కథమేషి తత్. 48

లీల:- దేవీ! మనమిర్వురముగలసి ఆ విప్రదంపతులున్న తావున కరుగుదమంటివి అంబా! నేనిచ్చట ఈ దేహమును విసర్జించి, విశుద్ధ సత్త్వస్వరూపమగు చిత్తము నాధారపరచుకొని, అట కరుగుచున్నాను. నీవెట్లరిగెదవో, వచింపుము.



శ్రీ దేవ్యువాచ:—

సంకల్పవ్యోమవృత్తిస్తే యథాసన్నాపిఖాత్మకః
నకుడ్యాత్మా నకుడ్యేన రోధ్యతే నాపి కుడ్యహా. 49

శ్రీదేవి:- నీకు సంకల్పవృత్తి మగుపడుచున్నను, అది శూన్యస్వరూపమయినట్లు, నా దేహము నీ కగుపడుచున్నను ఆకృతిరహితమేయని గ్రహింపుము. శూన్యము శూన్యమును భేదింపగలదు; ఆకారరహితములగు రెండువస్తువులు పరస్పర ప్రతిబంధకములు కాజాలవు.

శుద్ధైకసత్త్వనిర్మాణం చిద్రూపస్యైవ తత్కిల
ప్రతిభానమతస్తస్మాత్పరస్మాద్భిద్యతే మనాక్. 50

నా దేహము శుద్ధసత్త్వగుణమున నిర్మింపబడినది; చిత్స్వరూప ప్రతిభాస. అందువలన, పరబ్రహ్మమునకును, దీనికిని భేదమేలేదు.

సోఽయమేతాదృశో దేహో నైనం సంత్యజ్య యామ్యహమ్
అనేనైవ తమాప్నోమి దేశం గంధమివానిలః. 51

యథా జలం జలేనాగ్నిరగ్నినా వాయునానిలః
మిలత్యేవమతో దేహో దేహైరన్యైర్మనోమయైః. 52

నేను నీ దేహమును బరిత్యజింప నక్కరలేదు; దీనితోడనే అట కరుగగలను. గంధముతో వాయువు, నీటితో నీరు, నిప్పుతో నిప్పు, గాలితో గాలి కలియునట్లు, నా మనోమయదేహము మనోమయదేహముతో గలయగలదు.

నహిపార్థివతా సంవిదేత్య పార్థివసంవిదా
ఏకత్వం కల్పనాశైలశైలయోః క్వాహతిర్మిథః. 53

కల్పితశైలమును వాస్తవమగు శైలము డీకొనజాలనట్లు, పార్థివదేహము అపార్థివదేహముతో గలియజాలదు. (అందువలన, నీవీదేహమును పరిత్యజింపనిదే, గిరిగ్రామమును గాంచజాలవు).

ఆతివాహికఏవాయం తాదృశైశ్చిత్తదేహకః
ఆధిభౌతికతాబుద్ధ్యా గృహీతశ్చిరభావనాత్. 54

నీ దేహముగూడ ఆతివాహికమేకాని, చాలకాలమునుండి ఆధిభౌతికమని తలపబడుటవలన పార్థివమైనది.

యథాస్వప్నేయథా దీర్ఘకాలధ్యానే యథాభ్రమే
యథాచ సతిసంకల్పే యథాగంధర్వపత్తనే. 55

వాసనాతానవం నూనం యదా తే స్థితిమేష్యతి
తదాతివాహికో భావః పునరేష్యతి దేహకే. 56

స్వప్న, ధ్యాన, భ్రమ, సంకల్ప, గంధర్వనగరములు తద్విషయికమగు జ్ఞానము తగ్గుచు వచ్చిన, అవి క్రమముగ క్షీణించునట్లు, నీవాసనలు క్షీణించిన ఆధిభౌతిక భావములొలగిపోయి నీ శరీర మాతివాహిక మవగలదు.

లీలోవాచ :—

అతివాహికదేహత్వ ప్రత్యయే ఘనతాంగతే
తామవాప్నోత్యయం దేహో దశామాహో వినశ్యతి. 57

లీల:— సమాధి మున్నగు ఉపాయముల అతివాహిక జ్ఞానము దృఢమైన, అప్పుడు ఈ శరీరము స్థితినందును? ఇది నశించునా?

శ్రీ దేవ్యువాచ :—

యదస్తినామతత్త్రైవ నాశానాశక్రమోభవేత్
వస్తుతోయచ్చనాస్త్యేవ నాశస్స్యాత్తస్యకీదృశః. 58

దేవి:— క్షీణించుట లేక నశించుటలు సద్వస్తువు విషయముననే జరుగగలవు. అసద్వస్తు సంబంధమున నివెట్లు సంభవించును?

రజ్జ్వాంసర్పభ్రమేనష్టే సత్యబోధవశాత్సతే
సర్పో నసన్న ఉన్నష్టో వేత్యేవం కైవ సాకథా. 59
యథా సత్యపరిజ్ఞానాద్రజ్జ్వాం సర్పో నదృశ్యతే
తథాతివాహికజ్ఞానా ద్దృశ్యతే నాధిభౌతికః. 60

బిడ్డా! రజ్జువున సర్పభ్రమకలిగినది. ఆ భ్రమ తొలగినపిమ్మట, సర్పమేమైనది? చచ్చినదా? అను ప్రశ్న కలుగునా? సత్యజ్ఞానము కలిగినపిమ్మట, మఱి త్రాటియందు పామగుపడనట్లు, అతివాహిక భావము లభించిన, ఆధిభౌతికభావము తొలగిపోవును.

కల్పనాపి నివర్తేత కల్పితా యది కేనచిత్
సా శిలా సముపాస్త్యేవ యా నేహాస్తి కదాచన. 61

కల్పన ఎవ్వరివలననైన కల్పింపబడిన పక్షమున, అయ్యది సత్యోపదేశమున శాంతించును. ఎప్పటికిని లేని శిల లేనేలేదు.

పరం పరే పరాపూర్ణ మిదం దేహాదికం స్థితమ్
ఇతిసత్యం వయం భద్రే పశ్యామో నాభిపశ్యసి. 62

ఈ దేహాదులన్నియు ఆ పరబ్రహ్మముననే పరిపూర్ణ భావముననున్నవి. దీనిని మేము సత్య స్వరూపమున గాంచుచున్నాము. నీకిట్టి జ్ఞానములేకుండుటవలన, దీనిని గనుగొనజాలకున్నావు.

ఆదిసర్గే భవేచ్చిత్త్వం కల్పనాకల్పితం యదా
తదా తతఃప్రభృత్యేకసత్త్వం దృశ్యమవేక్షతే. 63

సృష్ట్యాదియందు చిత్స్వభావము కల్పితమైనప్పటినుండియు, అద్వయసత్తయే దృశ్యరూపమున బహిర్గ్రహింపబడుచున్నది.

లీలోవాచ :—

ఏకస్మిన్నేవ సంశాంతే దిక్కాలాద్యవిభాగిని
విద్యమానే పరేతత్త్వే కలనావసరః కుతః. 64



లీల:— దిక్కాలానవచ్ఛిన్నమగు అద్వయ పరతత్త్వమొక్కటియే నెగడుచుండ, కల్పనతో బనియేమి?

శ్రీ దేవ్యువాచ:—

కటకత్వం యథాహేమ్ని తరంగత్వం యథాంభసి
సత్యత్వంచ యథాస్వప్నసంకల్పనగరాదిషు. 65
నాస్త్యేవ సత్యనుభవే తథా నాస్త్యేవ బ్రహ్మణి
కల్పనావ్యతిరిక్తాత్మతత్స్వభావాదనామయాత్. 66
యథా నాస్త్యంబరే పాంసుః పరే నాస్తితథా కలా
అకలాకలనం శాంత మిదమేకమజం తతమ్. 67
యదిదం భాసతే కించిత్తత్తస్యైవ నిరామయమ్
కచనం కాచకస్యేవ కాంతస్యాతిమణేరివ. 68

శ్రీ దేవి:— సువర్ణమున కటకత్వము, జలముల తరంగత్వము, స్వప్నసంకల్పముల సత్యత్వము లేనట్లు విశుద్ధ సత్స్వభావమగు బ్రహ్మమున నెట్టికల్పనయులేదు. ఆకాశమున ధూళిలేనట్లు, సృష్ట్యాదియందు పరబ్రహ్మమున ఎట్టిరూపమును లేకుండెను. ఆ బ్రహ్మము శాంతమును, అద్వయము, అజమునై యుండెను. మణియందు ప్రకాశించునవన్నియు దాని ప్రతిబింబములైనట్లు, ఈ దృశ్యములన్నియు బ్రహ్మముయొక్క ప్రతిబింబములే.

లీలోవాచ:—

ఏతావంతం చిరంకాల మేతే దేవి వయం వద
భ్రామితాః కేన నామాపి ద్వైతాద్వైతవికల్పనైః. 69

లీల:— దేవీ! అట్లయిన మమ్మెవరు ద్వైతాద్వైత జ్ఞాన విమూఢులుగనొనర్చి భ్రమింపజేయుచున్నారు? వచింపుము.

శ్రీ దేవ్యువాచ:—

అవిచారేణ తరలే భ్రాంతాసి చిరమాకులా
అవిచారః స్వభావోత్థః స విచారాద్వినశ్యతి. 70

శ్రీ దేవి:— చంచలా! నిన్నింతవఱకు అవిచారస్వరూపమగు మోహమే భ్రమింపజేయుచున్నది. స్వభావజనితమగు అవిచారము విచారమువలన నశించును.

అవిచారో విచారేణ నిమేషాదేవ నశ్యతి
ఏషా సత్త్యైవ తేనాంతరవిద్యైషా నవిద్యతే. 71

అవిచారమను ఈ అవిద్య విచారము అను జ్ఞానమువలన నశించిపోవును. ఈ అవిద్యగూడ బ్రహ్మసత్తకంటె భిన్నముకాదు.

తస్మాన్నైవావిచారోఽస్తి నావిద్యాస్తి నబంధనమ్
నమోక్షోఽస్తి నిరాబాధం శుద్ధబోధమిదం జగత్. 72

అందువలన, వాస్తవమునకు అవిచారములేదు, అవిద్యలేదు, బంధములేదు, మోక్షములేదు, కేవలము విశుద్ధబోధస్వరూపమగు బ్రహ్మయొక్కటియేయున్నది. జగత్తు దానియందు అధ్యారోపిత మగుచున్నది, అని గ్రహింపుము.

ఏతావంతం యదా కాలం త్వయైతన్న విచారితమ్
తదా నసంప్రబుద్ధా త్వం భ్రాంతైవాభవ ఆకులా. 73

ఈ తత్త్వమును నీ వింతవరకు విచారింపకుండుటవలన, భ్రాంతి నిన్ను కలచుచున్నది.

అద్యప్రభృతి బుద్ధాసి విముక్తాసి వివేకినీ
వాసనాతానవం బీజం పతితం తవచేతసి. 74

ఇప్పుడు నీవీ విషయమును గ్రహించి ప్రబుద్ధవైనావు. విదేహజ్ఞానమును బొందినావు. ముక్తిని బడసితివి. వాసనలు క్షీణించిపోయినవి.

ఆదావేవహి నోత్పన్నం దృశ్యం సంసారనామకమ్
యదా తదా కథం తేన వాస్యం తే వాసనాపి కా. 75

నీ చిత్తమున సంసారదృశ్యము మరల ఉత్పన్నమవదు; ద్వైతభావము నిన్నాక్రమింపజాలదు.

అత్యంతాభావసంపత్తౌ ద్రష్టృదృశ్యదృశాం మనః
ఏకధ్యానే పరే రూఢే నిర్వికల్పసమాధిని. 76
వాసనాక్షయబీజేఽస్మిన్ కించిదంకురితే హృది
క్రమాన్నోదయమేష్యంతి రాగద్వేషాదికా దృశః. 77
సంసారసంభవశ్చాయం నిర్మూలత్వముపైష్యతి
నిర్వికల్పసమాధానం ప్రతిష్ఠామలమేష్యతి. 78

నిర్వికల్పసమాధియందు చిత్తమద్వయ బ్రహ్మమున స్థిరీకృతమైన, ద్రష్టృ దృశ్య దర్శనములు లోపించిపోవును. అప్పుడు హృదయక్షేత్రమున వాసనాబీజ మొకింత అంకురించియుండినను, రాగద్వేషాది భావములు నశించిపోవును. సంసారకారణములగు రాగద్వేషాదులు నశింప, నిర్వికల్పసమాధియందు ప్రతిష్ఠలభించును.

విగతకలనకాలిమాకలంకా గగనకలాంతరనిర్మలాంబనేన
సకలకలనకార్యకారణాంతః కతిపయకాలవశాద్భవిష్యసీతి. 79

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే ఉత్పత్తి ప్రకరణే లీలోపాఖ్యానే లీలావిశ్రాంత్యుపదేశో నామ ఏకవింశః సర్గః ॥ 21 ॥

ఇట్లు నభ్యసించిన సంసారభావనయను కాలిమ (నలుపు, లేక మచ్చ) తొలగిపోవును. అల్పసమయముననే, ఆకాశమునందువలె, నిర్మల పరమాత్మ నవలంబించుటవలన భ్రాంతిమయ కార్యము లొక్కయు, తత్కారణమగు సంకల్పములయొక్కయు నాశనమగు మోక్షమును బొందెదవు.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు, ఉత్పత్తిప్రకరణమున లీలోపాఖ్యానమున విశ్రాంత్యుపదేశమను ఏకవింశ సర్గము. ॥ 21 ॥

## ద్వావింశః సర్గః.

శ్రీదేవ్యువాచ:—

యథా స్వప్నపరిజ్ఞానాత్స్వప్నదేహో నవాస్తవః
అనుభూతోఽప్యయం తద్వద్వాసనాతానవాదసన్. 1

శ్రీదేవి:- స్వప్నమని గ్రహించిన స్వప్నమిథ్యాత్వము తెలియబడునట్లు, వాసనాక్షయమైన, స్థూలదేహమగుపడుచున్నను, 'అసత్తు' అనుబోధ కల్గును.

యథా స్వప్నపరిజ్ఞానాత్ స్వప్నదేహః ప్రశామ్యతి
వాసనాతానవాత్తద్వ జ్జాగ్రద్దేహోఽపి శామ్యతి. 2

స్వప్నజ్ఞానానంతరము స్వప్నదేహము నశించునట్లు, వాసనాక్షయమైన జాగ్రద్దేహముకూడ క్షీణించును.

స్వప్నసంకల్పదేహాంతే దేహోఽయం చేత్యతే యథా
తథా జాగ్రద్భావనాంతే ఉదేత్యేవాతివాహికః. 3

స్వప్నమునుండియో లేక సంకల్పమునుండియో తేరుకొనినపిమ్మట, స్థూలదేహమగుపడునట్లు, జాగ్రద్భావననుండి విడివడినపిమ్మట, ఆతివాహిక దేహము ప్రకాశించును.

స్వప్నే నిర్వాసనాబీజే యథోదేతి సుషుప్తతా
జాగ్రత్యవాసనాబీజే తథోదేతి విముక్తతా. 4

వాసన లేమియు లేకున్న స్వప్న మంతరించి సుషుప్తి కలుగునట్లు, స్థూలదేహమును, వాసనాబీజమును నశించిన, ముక్తి లభించును.

యేయం తు జీవన్ముక్తానాం వాసనా సా నవాసనా
శుద్ధసత్త్వాభిధానం తత్సత్తాసామాన్యముచ్యతే. 5

జీవన్ముక్తుల వాసన, వాసన గాదు, అది శుద్ధసత్త్వస్వభావముయొక్క సామాన్యసత్త అని చెప్పబడుచున్నది.

యా సుప్తవాసనా నిద్రా సా సుషుప్తిరితిస్మృతా
యత్సుప్తవాసనం జాగ్రద్ఘనోఽసౌ మోహ ఉచ్యతే. 6

నిద్రాసమయమున వాసనలులేకున్న, సుషుప్తి అందురు; జాగ్రద్దశయందు సుప్తములైయున్న వాసనలను మోహమందురు.

ప్రక్షీణవాసనా నిద్రా తుర్యశబ్దేన కథ్యతే
జాగ్రత్యపి భవత్యేవ విదితే పరమే పదే. 7
ప్రక్షీణవాసనా యేహ జీవతాం జీవనస్థితిః
అముక్తైరపరిజ్ఞాతా సా జీవన్ముక్తతోచ్యతే. 8

జాగ్రత్సుషుప్తులు వాసనాశూన్యములైన స్థితిని తురీయమందురు. జ్ఞానమున వాసనలు నశింప ఇట్టిస్థితి లభించును. దీనినే బ్రహ్మప్రాప్తియనికూడ నుడువుదురు. దీనికంటె ఉత్కృష్టమగు స్థితిలేదు. సంసారమునందున్నను ఒకని జీవితము వాసనాశూన్యమై నెగడిన, దానిని జీవన్ముక్త స్థితియందురు. బద్ధజీవులు దీనిని గ్రహింపజాలరు.

శుద్ధసత్త్వానుపతితం చేతఃప్రతనువాసనమ్
ఆతివాహికతామేతి హిమం తాపాదివాంబుతామ్. 9

మంచు వేడివలన నీరుగమారునట్లు, వాసనాశూన్య చిత్తము శుద్ధసత్త్వస్వభావమునందిన ఆతివాహిక మగును.

ఆతివాహికతాం యాతం బుద్ధంచిత్తాంతరైర్మనః
సర్గజన్మాంతరగతైః సిద్ధైర్మిలతి నేతరత్. 10

జ్ఞానబలమున ప్రబుద్ధమై, ఆతివాహికభావమునందిన చిత్తమే అన్యచిత్తముతోడను, జన్మాంతరీయ పదార్థములతోడను సృష్ట్యంతర పదార్థములతోడను కలియగలదు.

యదా తేఽయమహంభావః స్వభ్యాసాచ్ఛాంతిమేష్యతి
తదోదేష్యతి తే స్ఫారా ద్రుశ్యాంతా బోధతా స్వయమ్. 11

అభ్యాసబలమున దేహాభిమానము దూరమైన, దృశ్యజ్ఞానముగూడ తొలగిపోవును. అప్పుడు నీకు విశాలమగు జ్ఞానము లభింపగలదు.

ఆతివాహికతాజ్ఞానం స్థితిమేష్యతి శాశ్వతీమ్
యదాతదా హ్యసంకల్పాల్లోకాన్ద్రక్ష్యసి పావనాన్. 12

ఆతివాహిక జ్ఞానము దృఢమై, స్థిరమైన, నీవు పవిత్రలోకముల గాంచగలవు.

వాసనాతానవే తస్మాత్కురు యత్నమనిందితే
తస్మిన్ప్రౌఢిముపాయాతే జీవన్ముక్తా భవిష్యసి. 13

అనిందితా! వాసనలు క్షయమైపోవు ఉపాయము నాశ్రయింపుము. ఈ వాసనాక్షయ స్థితి స్థిరమైన, జీవన్ముక్తి నందగలవు.

యావన్నపూరితస్త్వేష శీతలో బోధచంద్రమాః
తావద్దేహమవస్థాప్య లోకాంతరమవేష్యతామ్. 14

శీతలుడగు బోధచంద్రుడుదయింపనంతవఱకీ స్థూలదేహమును బరిత్యజించి, లోకాంతరముల గాంచుము. (వేరొండు ఉపాయములేదు.)

మాంసదేహోమాంసదేహే నైవ సంశ్లేషమేష్యతి
నతు చిత్తశరీరేణ వ్యవహారేషు కర్మసు. 15
యథానుభవమేవైతద్యథాస్థితముదాహృతమ్
ఆబాలసిద్ధసంసిద్ధం న నామ వరశాపవత్. 16

మాంసమయదేహము మాంసమయదేహముతోడనే కలియగలవు. ఇతరమగు చిన్మయదేహముతోగలసి ఎట్టిపనిని ఒనర్పజాలదు. (అందువలన నీవు నా శరీరము నాశ్రయించి ఆట కరుగజాలవు.) నా అనుభవము ననుసరించియే నీకీ విషయమును జెప్పితిని. అందరును ఈ విషయము నెఱుంగుదురు. వరశాపములవలె, సిద్ధిబలమున, ఇకార్యము జరుగజాలదు.

అవబోధఘనాభ్యాసా ద్దేహస్యాస్యైవ జాయతే
సంసారవాన [illegible] రీరతా. 17



ఉదేష్యంతీచ సైవాత్ర కేనచిన్నోపలక్ష్యతే
కేవలంతు జనైర్దేహో మ్రియమాణోఽవలోక్యతే. 18

నిరంతర జ్ఞానాభ్యాసబలమున వాసనాసమూహము క్షీణించిన, ఈ దేహమునసే ఆతివాహిక దేహమును బడయవచ్చును. మరణానంతరము ప్రతిజీవియు ఆతివాహికదేహమునందును; దీనిఉత్పత్తిని ఎవ్వరును గనుగొనజాలరు. జనులు కేవలము మృతదేహమునుమాత్రమే కనుగొందురు.

దేహస్త్వయం న మ్రియతే నచజీవతి కించ తే
కేకిల స్వప్నసంకల్ప భ్రాంతౌ మరణజీవితే. 19
జీవితంమరణంచైవ సంకల్పపురుషే యథా
అసత్యమేవ భాత్యేవం తస్మిన్పుత్రి శరీరకే. 20

పుత్రీ! ముక్తపురుషుని దృష్టియందీ దేహమునకు ఉత్పత్తి వినాశములులేవు; ఇతని జీవనమరణములు గూడ స్వప్న సంకల్పమువలె భ్రమయని చెప్పబడుచున్నవి. సంకల్పనిర్మితపురుషుని జీవనమరణములు మిథ్యలైనట్లు, ఈదేహముయొక్క జీవనమరణములుకూడ మిథ్యయని గ్రహింపుము.

లీలోవాచః—

తదేతదుపదిష్టంమే జ్ఞానందేవి త్వయాఽమలమ్
యస్మిన్ శ్రుతిగతే శాంతి మేతి దృశ్యవిషూచికా. 21
అత్రోపకురు మే బ్రూహి కోఽభ్యాసః కీదృశోఽథవా
సకథం పోషమాయాతి పుష్టే తస్మింశ్చ కింభవేత్. 22

లీల:— దేవీ! నీవుపదేశించు పవిత్రజ్ఞానమును వినుచుండగనే, నాదృశ్య-దర్శనరోగము నశించుచున్నది. కాని, ఇప్పుడెట్టి అభ్యాస మనసరమో, ఈ అభ్యాసము దృఢపరచుటకేమి ఒనర్పవలయునో, దాని నాచరించిన ఎట్టిఫలము లభించునో, దయయుంచి చెప్పుము.

శ్రీదేవ్యువాచ:—

యద్యేన క్రియతే కించి ద్యేనయేన యదాయదా
వినాభ్యాసేన తన్నేహ సిద్ధిమేతి కదాచన. 23

శ్రీదేవి:—ఎవడైన, ఎప్పుడైన, ఏదైన కార్యమును ఆచరించిన, అది అభ్యాసములేకున్న సిద్ధింపదు.

తచ్చింతనం తత్కథనం మన్యోన్యం తత్ప్రబోధనమ్
ఏతదేకపరత్వంచ తదభ్యాసం విదుర్బుధాః. 24

అందువలన, బ్రహ్మమును గుఱించి చింతించుట, ప్రసంగించుట, ప్రబోధించుకొనుట, స్థిరమైయుండుటనే పండితు లభ్యాస మనుచున్నారు.

యే విరక్తా మహాత్మానో భోగభావనతానవమ్
భావయంత్యభవాయాంత ర్భవ్యా భువి జయంతి తే. 25

ఏ మహాత్ములు సంసారమున విరక్తినంది, జనన మరణశాంతి నిమిత్తము మనస్సున భోగవాసనల క్షయమొనర్చుకున్నారో, వారే జగత్తున జయమందుచున్నారు.

ఉదితౌదార్యసౌందర్య వైరాగ్యరసరంజితా
ఆనందస్పందినీ యేషాం మతిస్తేఽభ్యాసినఃపరే. 26

ఎవ్వరిబుద్ధి ఔదార్యమున సుందరమై, వైరాగ్యరసముననిండి, ఆనందము ననుభవించుచున్నదో, వారే పరమసాధకులు.

అత్యంతాభావసంపత్తౌ జ్ఞాతృజ్ఞేయస్యవస్తునః
యుక్త్యా శాస్త్రైర్యతంతే యే తే బ్రహ్మాభ్యాసినఃస్థితాః. 27

యుక్తులతో శాస్త్రాలోచన నొనర్చి, జ్ఞాతృజ్ఞేయముల అత్యంతాభావమును గ్రహింపగలుగువారే బ్రహ్మాభ్యాసు లనంబడుచున్నారు.

సర్గాదావేవ నోత్పన్నం దృశ్యంనాస్త్యేవ తత్సదా
ఇదం జగదహంచేతి బోధాభ్యాసఉదాహృతః. 28

సృష్ట్యాదియందు దృశ్యములేదు, మఱియు ఇతరసమయములయందుగూడ లేదు. అందువలన, జగత్తు లేదు, నేను లేను, నీవు లేవు అను జ్ఞానమునే బోధాభ్యాస మందురు.

దృశ్యాసంభవబోధేన రాగద్వేషాదితానవే
రతిర్బలోదితా యాసౌ బ్రహ్మాభ్యాసఉదాహృతః. 29

ఇట్లు, దృశ్య మసంభవమని గ్రహించినపిమ్మట, పరమాత్మయందుగలుగు ఆసక్తినే బ్రహ్మాభ్యాస మందురు.

దృశ్యాసంభవబోధేన వినా ద్వేషాదితానవమ్
తప ఇత్యుచ్యతే తస్మాన్నజ్ఞానం తచ్చదుఃఖతత్. 30

దృశ్యమిథ్యాజ్ఞానము, రాగద్వేషక్షయములు లేకుండ ఆచరింపబడు యత్నములు మూఢములును, దుఃఖకారణములును, తాపదాయకములును నగుచున్నవి.

దృశ్యాసంభవబోధోహి జ్ఞానం జ్ఞేయంచ కథ్యతే
తదభ్యాసేన నిర్వాణ మిత్యభ్యాసో మహోదయః. 31

దృశ్యాసంభవ బోధయే జ్ఞాన జ్ఞేయములను పేరిట వ్యవహరింప బడుచున్నది. దీని అభ్యాసమే గొప్ప అభ్యాసము, దీనినే నిర్వాణమందురు.

భవబహులనిశానితాంతనిద్రా సతతవివేకవిబోధవారిసేకైః
ప్రగలతి హిమశీతలైరశేషా శరది మహామిహికేవ చేతసీతి. 32

శరత్కాలమందలి మంచు వాన, ప్రబల జలపాతమున తొలగునట్లు, నిరంతర వివేకాభ్యాసమను నీటివలన దడుపబడిన చిత్తమునొక్క సంసారశర్వర్యనురాగమను నిద్ర దూరమైపోవును.

ఇత్యుక్తవత్యథ మునౌ దివసో జగామ
సాయంతనాయ విధయేఽస్తమినో జగామ.
స్నాతుం సభాకృత నమస్కరణా జగామ
శ్యామాక్షయే రవికరైశ్చ సహా జగామ. 33



ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే ఉత్పత్తిప్రకరణే
లీలోపాఖ్యానే విజ్ఞానాభ్యాస వర్ణనం నామ ద్వావింశః సర్గః ॥ 22 ॥

చతుర్థం దినమ్.

వాల్మీకి:- మహర్షి వసిష్ఠు డిట్లుపదేశించుచుండ, సాయంకాల మాయెను; సాయం విధుల నాచరించుటకు గారణమగు సూర్యుడస్తమించెను. అప్పుడువారు నమస్కరించి, సాయంకృత్యముల నాచరింప నరిగిరి. తెల్లవారిన పిమ్మట, మరల వారు సూర్యకిరణములతో బాటు అరుదెంచిరి.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు ఉత్పత్తి ప్రకరణమున
లీలోపాఖ్యానమున విజ్ఞానాభ్యాస వర్ణనమను
ద్వావింశ సర్గము. ॥ 22 ॥
ఇది చతుర్థ దివసము.



## త్రయోవింశః సర్గః.

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

ఇతి సంకథనం కృత్వా తస్యాం నిశి వరాంగనే
సుప్తేపరిజనే నూన మథాంతఃపురమండపే. 1
దృఢాఖిలార్గలద్వారగవాక్షే దత్తచేతసి
పుష్పప్రకరనిష్ఠ్యూత మాంసలామోదమంథరే. 2
అమ్లానమాలావసన శవపార్శ్వాసనస్థితే
సకలామలపూర్ణేందు వదనద్యోతితాస్పదే. 3
సమాధిస్థానకం గత్వా తస్థతుర్నిశ్చలాంగికే

వసిష్ఠుడు:- ఆరాత్రి లీలాదేవియు, సరస్వతీదేవియు అట్లు సంభాషించుచుండిరి - తలుపులనన్నిటినివేసి, పరిజనులు నిద్రించుచుండిరి. ఆ తావు, పూలతావితో నిండియుండెను. పద్మిని శరీరము వాడువడని పూలతో గప్పబడియున్న చోటనే, వారు సమాధినాశ్రయించి, నిశ్చలాంగులైరి. అప్పుడు, వారి వదనములనుండి, పూర్ణ చంద్రునినుండివలె, కాంతి వెలువడసాగెను.

రత్నస్తంభాదివోత్కీర్ణే చిత్రే భిత్తావివార్పితే. 4
సర్వాస్తత్యజతుశ్చింతాః సంకోచం సముపాగతే
దివసాంత ఇవాబ్జిన్యా ప్రసృతామోదలేఖికే. 5
బభూవతుర్భృశం శాంతే శుద్ధే స్పందవివర్జితే
గిరౌ శరది నిర్వాత ఇవ భ్రష్టాభ్రమాలికే. 6

వారు రత్నస్తంభమున చెక్కబడిన బొమ్మలవలె శోభిల్లుచుండిరి. వారి ఇంద్రియ వ్యాపారములు కట్టువడెను. సాయంకాలమందలి తామరలజంటవలె, వారు, సంకుచితభావమునందిరి. శరత్కాలమున, గాలిలేని కొండకొననున్న మేఘములవలె, వారు నిశ్చలులైరి.

నిర్వికల్పసమాధానా జ్జహతుర్బాహ్యసంవిదమ్
యథా కల్పలతే కాంతే పూర్వమృత్వంతరే రసమ్. 7

కల్పలత నూతనఋతువున పూర్వఋతురసమును బరిత్యజించునట్లు, వారిర్వురును నిర్వికల్పసమాధి నాశ్రయించి బాహ్యజ్ఞానమును త్యజించిరి.

అహంజగదితిభ్రాంతి దృశ్యస్యాదావనుద్భవః
యదా తాభ్యామవగత స్త్వత్యంతాభావనాత్మకః. 8
తదా దృశ్యపిశాచోఽయ మలమ స్తంగతోద్వయోః

అనఘా! నేను, దృశ్యజగత్తు — ఇవి అత్యంతము మిథ్యలని గ్రహించినప్పుడే, వారినుండి దృశ్యపిశాచి తొలగిపోయెను.

అసత్త్వాదేవచాస్మాకం శశశృంగమివానఘ. 9
ఆదావేవహి యన్నాస్తి వర్తమానేపి తత్తథా
భాతం వా భాతమేవాతో మృగతృష్ణాంబువజ్జగత్. 10

కుందేటికొమ్మువలె అలీకమగు వస్తువే, మృగతృష్ణవలె మన కగపడుచున్నది.

స్వభావకేవలం శాంతం స్త్రీద్వయం తద్బభూవ హ
చంద్రార్కాదిపదార్థౌఘై ర్ధూరముక్తమివాంబరమ్. 11

అప్పుడా యువతు లిర్వురును, దృశ్యదర్శనభావమునుండి విడివడి సూర్యచంద్రాది శూన్యమగు ఆకాశమువలె, శాంతభావమును వహించిరి.

తేనైవ జ్ఞానదేహేన చచార జ్ఞప్తిదేవతా
మానుషీత్వితరేణాశు ధ్యానజ్ఞానానురూపిణా. 12

సరస్వతీదేవి జ్ఞానమయదేహమును, లీలాదేవి భౌతికాభిమానశూన్యమును; ధ్యానజ్ఞానమయమునునగు దేహమును అవలంబించి, సంచరింపసాగిరి.

గేహాంతరేవప్రాదేశ మాత్రమారుహ్య సంవిదా
బభూవతుశ్చిదాకాశ రూపిణ్యౌ వ్యోమగాకృతీ. 13

వారు, పరిమితమగు ఆ గృహాకాశమునుండియే దూరాకాశమున చిదాకాశ స్వరూపమును గ్రహించిరి.

అథతే లలనే లీలా లోలే లలితలోచనే
స్వభావాచ్చేత్యసంవిత్తే ర్నభో దూరమితో గతే. 14
తత్రస్థేవాథ చిద్వృత్త్యా పుప్లువాతే నభస్థలమ్
కోటియోజనవిస్తీర్ణం దూరాద్దూరతరాంతరమ్. 15



అనంతరము లలితలోచనలగు ఆ లలన లిర్వురును, పూర్వజ్ఞానము ననుసరించి ఆకాశమున చాలదూరమరిగిరి. అటనుండియే చిద్వృత్తిసాయమున, కోటియోజనవిస్తీర్ణమగు ఆకాశమున దూర దూర ప్రదేశముల విహరింపసాగిరి.

దృశ్యానుసంధాననిజస్వభావా దాకాశదేహేఅపితే మిథోఽత్ర
పరస్పరాకారవిలోకనేన బభూవతుః స్నేహపరే వయస్యే. 16

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే ఉత్పత్తిప్రకరణే
లీలోపాఖ్యానే జ్ఞానదేహాకాశగమనం నామ త్రయోవింశః సర్గః ॥ 23 ॥

ఆ సఖీద్వయముయొక్క శరీరము చిదాకాశమయమైనను, పూర్వసంకల్పములతో గూడిన మనస్సుగలవారగుటవలన, పరస్పరము స్నేహమయదృక్కుల వీక్షించుకొనసాగిరి.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు ఉత్పత్తిప్రకరణమున
లీలోపాఖ్యానమున జ్ఞానదేహాకాశగమనము త్రయోవింశ సర్గము ॥ 23 ॥

## చతుర్వింశః సర్గః

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

దూరాద్దూరమభిప్లుత్య శనైరుచ్చైఃపదంగతే
హస్తం హస్తేసమాలంబ్య యాంత్యౌ దదృశతుర్నభః. 1

వసిష్ఠుడు:- వారు చేతులు కలుపుకొని దూరప్రదేశములనుదాటి, క్రమముగ ఉన్నతస్థానముల నధిరోహించుచు, నభోమండలమును వీక్షింపసాగిరి.

ఏకార్ణవమివోచ్ఛూనం గంభీరం నిర్మలాంతరమ్
కోమలం కోమలమరుదాసంగసుఖభోగదమ్. 2

ఆ ఆకాశమండలము సముద్రమువలె విస్తీర్ణము; గంభీరము, నిర్మలము, కోమలమునై యుండెను. చల్లటిగాలి తగులుచుండుటవలన హాయిగానుండెను.

ఆహ్లాదకమలం సౌమ్యం శూన్యతాంభోనిమజ్జనాత్
అత్యంతశుద్ధం గంభీరం ప్రసన్నమపి సజ్జనాత్. 3

అది చిత్తాహ్లాదకరమును, అతిసుందరమును, సుఖదాయకమును, శుద్ధమును, సజ్జనుని చిత్తముకంటె ప్రసన్నమునైయుండెను.

శృంగస్థనిర్మలాంభోద పీనోదరసుధాలయే
విశశ్రమతురాశాసు పూర్ణచంద్రోదరామలే. 4

వారు మధ్యమధ్య సుమేరుశిఖర మేఘశకలములవలెను, సువిశాల పూర్ణ చంద్రోదయమువలెను నిర్మలములగు దేవతల సౌధముల విశ్రమింపసాగిరి.

సిద్ధగంధర్వమందార మాలామోదమనోహరే
చంద్రమండలనిష్క్రాంతే రేమాతే మధురానిలే. 5

వారు చంద్రమండలమును దాటి, సిద్ధగంధర్వుల మందారమాల సౌరభమును గొనివచ్చు సుమధురవాయువుల సేవించుచు ఆనందింపసాగిరి.

సస్నతుర్భ్యారిఘుర్మాంతే తడిద్రక్తాబ్జసంకులే
సరసీవ జలాపూర మంథరే మేఘమండలే. 6

ఎండవేడి మిక్కుటమనిపించిన, రక్తకమలములబోలు మెఱుపులతోగూడి నీటితో నిండి మధురములైన జలదమండలముల చెఱువునందువలె స్నానమొనర్పసాగిరి,

భూతలౌఘమహాశైల మృణాలాంకురకోటిషు
దిక్షు బభ్రమతుః స్వైరం భ్రమర్యౌ సరసీష్వివ. 7

వారు, నలుదిక్కులగల హిమవత్కైలాసాది పర్వతములను, మృణాళనాళముల (=తామరతూండ్లు) విహరించుచు, సరోవరమున, తిరుగాడు తుమ్మెదలజంటవలె నొప్పిరి.

ధారాగృహధియా ధీర గంగానిర్ఝరధారిణి
భ్రేమతుర్వాతవిక్షుబ్ధ మేఘమండలమండపే. 8

ఆకాశగంగా ప్రవాహమున తడిసి, గాలిలోతిరుగాడు మేఘమండల మండపములందు, ధారాగృహములను భ్రమతో విహరింపసాగిరి.

తతో మధురగామిన్యౌ విశ్రామ్యంత్యౌ స్వశక్తితః
శూన్యేదదృశతుర్వ్యోమ మహారంభాతిమంథరమ్. 9

అనంతరము మధురగామినులగు ఆకామిను లిర్వురతమ శక్తివనుసరించి శూన్యపథమున పయనమొనర్చుచు, విశ్రమించుచు, భువననిర్మాణ సంక్లిష్టమగు అప్పుదేశమును గాంచనొడంగిరి

అదృష్టపూర్వమన్యోన్యం సర్వసంకటకోటరమ్
అపూర్యమాణమాశూన్యం జగత్కోటిశతైరపి. 10

ఆ ఆకాశదేశమధ్యభాగమున, అనేక లోకములు ఒకదానితరువాత మరొకటిగ వ్యాపించియుండెను. కోటికోటి జగత్తులుండినను అది నిండుబడకుండెను. — అయ్యది అంత విశాలమైనది. ఇంకను చాలచోట్ల శూన్యముగ నేయుండెను.



ఉపర్యుపర్యుపర్యచ్చ రన్యైరన్యైర్వృతంపృథక్
విచిత్రాభరణాకారై ర్భూతలైః సువిమానకైః. 11

దానిపై పైభాగముల విచిత్రములతో శోభిల్లు భూలోకము లనేకములుండెను; అవి విచిత్రాకారములగు విమానములతో సమున్నతములై వెలయుచుండెను.

పరితఃపూరితవ్యోమ్నాం మేర్వాదికులభూభృతామ్
పద్మరాగతటోద్యోతైః కల్పజ్వాలోపమోదరం. 12

నాలుగుదిక్కుల సుమేర్వాది కులపర్వతములు చుట్టుముట్టియుండెను, ఆ పర్వతముల పద్మరాగాది మణిమయప్రదేశముల కాంతివలన నాప్రదేశము ప్రళయాగ్నివలె శోభిల్లుచుండెను.

ముక్తాశిఖరమాపూర్ణై ర్హిమవత్సానుసుందరమ్
కాంచనాద్రిస్థలార్చిర్భిః కాంచనస్థలభాసురమ్. 13

ఒకతావు, ఆ పర్వతములయొక్క ముత్తెపుకొనల కాంతులవలన హిమసానువువలె సుందరమై వెలయుచుండెను; ఇంకొకతావు కాంచనపర్వత కాంతుల కాంచనమయ స్థలమువలె వెలుగుచుండెను.

మహామరకతాభాభిః శాద్వలస్థలనీలిమమ్
ద్రష్టృదృశ్యతయాసక్త జాతధ్వాంతోత్థకాలిమమ్. 14

ఇంకొకప్రదేశము మరకతమణుల కాంతులచేసి. పచ్చికబయలువలె నగుపడుచుండెను ఈ కాంతులు మిఱుమిట్లుగొల్పుచు, చీకటిపడినదాయన జేయుచుండెను.

పారిజాతలతాలోల విమానగణకేతనమ్
అతో మంజరికాకారమివవైడూర్యభూతలమ్. 15

అట, పారిజాతవనములపైన చలించుచున్న పతాకలతో, సంచరించుచుండెను; ఆచోటు, సమీపదృష్టికి వనమంజరులరెను, దూరదృష్టికి వైడూర్యమణిమయ భూమివలెను, గన్పడుచుండెను.

మనోవేగమహాసిద్ధ జితవాతగమాగమమ్
విమానగృహదేవస్త్రీ గేయవాద్యసఘుంఘుమమ్. 16

మనోవేగమున నరుగు సిద్ధులు వాయువునుగూడ వేగమున మించుచుండిరి. విమానగృహములు దేవతాస్త్రీల వాద్యధ్వనులతో నిండియుండెను.

త్రైలోక్యవరభూతౌఘ సంచారవిరలాంతరమ్
అన్యోన్యాదృష్టసంచార సురాసురకులాకులమ్. 17

ముల్లోకములనున్న జీవులతో నాచోటును నింపినను, అయ్యది నిండువడదు. సురాసురులందు సంచరించుచున్నను, ఒకరినొకరు కనుకొనజాలకుండిరి.

పర్యంతస్థితకూష్మాండ రక్షఃపైశాచమండలమ్
వాతస్కంధమహావేగ వహద్వైమానికవ్రజమ్. 18

తుదికోసలకూష్మాండ రాక్షస పిశాచమండలములుండెను. వాయుప్రవాహముయొక్క, ఎగుడు దిగుడుల ననుసరించి, వైమానికు లత్యంత వేగమున బయనించుచుండిరి.

వహద్విమానసీత్కార ముష్టిగ్రాహ్యఘనధ్వని
గ్రహర్క్ష ఘనసంచారా త్ప్రచలద్వాతయంత్రకమ్. 19

విమాన ధ్వనులముందట మేఘధ్వనులు వినబడకుండెను. గ్రహనక్షత్ర సంచారమున వాయుయంత్రము చలించుచున్నట్లుండెను.

నికటాతపదగ్ధాల్ప సిద్ధసిద్ధోజ్ఝితాస్పదమ్
అర్కాశ్వముఖవాతాస్త దగ్ధముగ్ధవిమానకమ్. 20

సూర్యునికడనున్న హీనసిద్ధులు వేడితాగజాలక, తమతమస్థానముల ద్యజించుచుండిరి అటనున్న విమానములుగూడ సూర్యాశ్వనిశ్వాసముల దగ్ధములగుచుండెను.

లోకపాలాప్సరోవృంద సంచారాచారచంచలమ్
దేవ్యంతఃపురికాదగ్ధ ధూపధూమాంబుదాంబరమ్. 21

లోకపాలకులును, అప్సరసలును సంచరించుచుండుటవలన చంచలమై యొప్పుచుండినను, అంతఃపురవాసినులగు దేవీగణము వెలిగించిన దీపధూమముల అంబరము మేఘమాలావృతమైనట్లుండెను.

స్వస్వర్గాహూతదేవస్త్రీ స్వాంగవిభ్రష్టభూషణమ్
సామాన్యసిద్ధసంఘోగ్ర తేజఃపుంజతమోబలమ్. 22

ఇంద్రచంద్రాదులవలన నాహ్వానింపబడిన దేవస్త్రీలు త్వరగా చనుచుండుటవలన, వారి భూషణములు జారిపడుచుండెను. (విశేషములగు అణిమాదిసిద్ధులులేని) హీనసిద్ధుల తేజము మాయమై, తమస్సు వృద్ధినందుచుండెను.

బలవత్సిద్ధసంఘట్ట గమాగమవిఘట్టితైః
ఘనైఃసాంశుకపార్శ్వస్థ హిమవన్మేరుమందరమ్. 23

బలిష్ఠులగు సిద్ధుల రాకపోకలవలన చెదరిన మేఘములు, ప్రక్కలనున్న హిమ, మేరు పర్వతముల బడుటవలన నవి వస్త్రముల ధరించినట్లు, శోభిల్లుచుండెను.

కాకోలూకైర్గృధ్రభాసై రాశిభూతైశ్చ తైర్వృతమ్
నృత్యద్భిర్డాకినీసంఘై స్తరంగైరివ వారిధిమ్. 24

ఇంకొకచోట, కాకులు, గుడ్లగూబలు, గ్రద్దలు, రాబందులు గుమిగూడియుండెను. సాగర తరంగములవలె డాకినీగణము నృత్య మొనర్చుచుండెను

ప్రవృత్తైర్యోగినీసంఘైః శ్వకాకోష్ట్రఖరాననైః
నిరర్థంయోజనశతం గత్వా గచ్ఛద్భిరావృతమ్, 25

కాకముఖములును, శునకముఖములును, ఉష్ట్రముఖములును, గార్దభముఖములునునగు యోగినీగణము వ్యర్థముగ తిరిగి మరల, ఆచోటుకేవచ్చి చేరుకొనుచుండెను.



లోకపాలపురోధ్వాంత ధూమధూమ్రే౽భ్రమందిరే
సిద్ధగంధర్వమిథున ప్రారబ్ధసురతోత్సవమ్. 26

ధూమాంధకారమున గప్పబడిన మేఘమందిరముల, సిద్ధగంధర్వ మిథునములు లోకపాలకులముందర సురతోత్సవమును జరుపుచుండిరి.

స్వర్గగీత స్తవోన్మత్త మదనాక్రాంతమార్గగమ్
అనారతవహద్ధిష్ణ్యచక్రలక్షితపక్షకమ్. 27

ఆస్వర్గపథమున జను జీవులు గీతములవిని కామోన్మత్తులగుచుండిరి. అనవరతముతిరుగు జ్యోతిశ్చక్రమున, శుక్లకృష్ణపక్షముల విభాగము స్పష్టముగ కన్పడుచుండెను.

వాతస్కంధనిఖాతాంత ర్వహత్త్రిపథగాజలమ్
ఆశ్చర్యాలోకనవ్యగ్ర సంచరత్త్రిదశార్భకమ్. 28

వాయుచక్రమున ఆకాశగంగాజలములు ప్రవహించుచుండెను. దేవబాలకు లీయాశ్చర్యమును జూడ పరుగిడుచుండిరి.

సదేహసంచరద్వజ్ర చక్రశూలాసిశక్తిమత్
క్వచిన్నిర్భిత్తిభవనం గాయన్నారదతుంబురు. 29

వజ్ర చక్ర, శూల, అసి, శక్త్యాద్యాయుధాధిష్ఠాతృ దేవతలు, సంచరించుచుండిరి. పునాదులులేని ఇళ్లగపడుచుండెను. తుంబురునారదాదులు పాటలు బాడుచుండిరి.

మేఘమార్గమహామేఘ మహారంభాకులంక్వచిత్
చిత్రన్యస్తసమాకార మూకకల్పాంతవారిదమ్. 30

పెద్దదియగు మేఘములు ప్రళయమేఘములతో గూడియుండెను. ఇంకొకచోట, గర్జనరహితములగు మేఘములు బొమ్మలవలె నగుపడుచుండెను.

ఉత్పతత్కజ్జలాద్రీంద్ర సుందరాంభోధరం క్వచిత్
క్వచిత్కనకనిష్పంద కాంతతాపాంతవారిదమ్, 31

ఇంకొకచోట, అంజనపర్వతమువలె, మేఘములు లేచుచుండెను. సాయంకాల మేఘములు, కనకప్రవాహమువలె, సుందరములై కన్పట్టుచుండెను.

క్వచిద్దిగ్దాహతాపాఢ్య మృష్యమూకాంబుదాంశుకమ్
క్వచిన్నిష్పవనాంభోధి సంరంభం శూన్యతాజలమ్. 32

ఇంకొకచోట,, వర్షము గురిసినపిమ్మట, మేఘములు ఋష్యమూకపర్వతముయొక్క వస్త్రములవలె కన్పడుచుండెను. ఇంకొకచోట, శూన్యప్రదేశము నిశ్చలమగు సముద్రమువలె నగుపడుచుండెను.

క్వచిద్వాతనదీప్రోథ విమానతృణపల్లవమ్
క్వచిచ్చలదలివ్రాత పృష్ఠత్వక్కాంతినిర్మలమ్. 33

ఇంకొకచోట వాయునదియందు పరుగిడువిమానములు, తృణపల్లవములవలె కన్పడుచుండెను. ఇంకొకచోట, ఎగిరెడు తుమ్మెదలు రెక్కలకాంతితో శోభిల్లుచుండెను.

క్వచిన్మేరునదీకల్ప వాతధూలివిధూసరమ్
క్వచిద్విమానగీర్వాణ ప్రభాచిత్రబలాంగకమ్. 34

ఇంకొకతావు, గాలివలన లేవనెత్తబడిన దుమ్ముతోగూడి, మేరునదివలె కన్పడుచుండెను. ఇంకొకచోట, విమానముల చరించు దేవతలతో విచిత్రమై పట్టుచుండెను.

క్వచిన్నిరంబరోన్మత్త మాతృమండలమాలితమ్
క్వచిన్నిత్యం నవక్షీబ క్షుబ్ధయోగీశ్వరీగణమ్. 35

ఇంకొకచోట, దిగంబరులగు మాతృదేవతలు నృత్యము సల్పుచుండిరి. ఇంకొకచోట, ఉన్మత్తలును, క్షుబ్ధలునునగు యోగీశ్వరీగణముండెను.

క్వచిచ్ఛాంతసమాధిస్థ విశ్రాంతమునిమాలితమ్
సమం దూరాస్తసంరంభ సాధుచిత్తమనోహరమ్. 36

ఇంకొకచోట సమాధియందు విశ్రాంతి నందినవారును, శాంతచిత్తులునగు మునులుండిరి; ఈ తావులన్నియు శాంతప్రకృతములై నిశ్చలసాధు చిత్తమువలె, మనోహరమైయుండెను.

గాయత్కిన్నరగంధర్వ సురస్త్రీమండలంక్వచిత్
క్వచిత్ స్తబ్ధపురాకీర్ణం వహత్పురవరం క్వచిత్. 37

ఇంకొకచోట కిన్నరులు, గంధర్వులు, దేవతాస్త్రీలును గానమొనర్చుచుండిరి. కొన్ని తావుల స్థావరములగు సామాన్యనగరములును, మరికొన్ని తావులవలె కదలెడినగరములును నుండెను.

క్వచిద్రుద్రపురాపూర్ణం క్వచిద్బ్రహ్మమహాపురమ్
క్వచిన్మాయాకృతపురం క్వచిదాగామిపత్తనమ్. 38

ఇంకొకచోట రుద్రపురియుండెను. ఇంకొకచోట బ్రహ్మయొక్క పట్టణముండెను మరొకచోట, మాయానిర్మితమగు పట్టణముండెను. ఇంకొకతావున భవిష్యత్-నగరముండెను.

క్వచిద్భ్రమచ్చంద్రసరః క్వచిత్స్తబ్ధమయంసరః
క్వచిత్సరత్సిద్ధగణం క్వచిదిందుకృతోదయమ్. 39

ఇంకొకచోట, చంద్రుని దలపించు మాయాసరోవరముండెను, అది కదలుచుండెను, ఇంకొకచోట, కదలని చెఱువులుండెను. ఇంకొకచోట, సిద్ధులు వచ్చుచు బోవుచుండిరి, ఇంకొకచోట, చంద్రుడుదయించుచుండెను.

క్వచిత్సూర్యోదయమయం క్వచిద్రాత్రితమోమయమ్
క్వచిత్సంధ్యాంశుకపిలం క్వచిన్నీహారధూసరమ్. 40



ఇంకొకచోట, సూర్యుడుదయించుచుండెను. మరొకచోట, చీకటి రాత్రియుండెను. ఇంకొకచోటు, సంధ్యారాగమున పింగళమైయుండెను. ఇంకొకచోటు, మంచువలన ధూసరమైయుండెను.

క్వచిద్ధిమాభ్రధవలం క్వచిద్వర్షత్పయోధరమ్
క్వచిత్స్థలఇవాకాశ ఏవ విశ్రాంతలోకపమ్. 41

ఇంకొకచోటు, మంచువంటి మబ్బులతోగూడి తెల్లగనుండెను. ఇంకొకచోట వర్షించు మేఘములుండెను. ఇంకొకచోట, భూమియందువలె, ఆకసమున లోకపాలకులు విశ్రమించుచుండిరి.

ఊర్ధ్వాధోగమనవ్యగ్ర సురాసురగణంక్వచిత్
పూర్వాపరోత్తరాయామ్యదిక్సంచారాకులం క్వచిత్. 42

ఇంకొకచోట, సురాసురులు ఊర్ధ్వాధోదేశ గమనాగమనముల వ్యగ్రులైయుండిరి. ఇంకొకచోట, నలుదిక్కులు జనసంచారమున నిండియుండెను.

అపియోజనలక్షాణి క్వచిద్దుష్ప్రాపభూధరమ్
అవినాశితమఃపూర్ణం దృషద్గర్భోపమంక్వచిత్. 43

ఇంకొకచోట, లక్షయోజనములదూరము గడచిచూచినను పర్వతములే లేకుండెను. ఇంకొకచోటు, దట్టమగు చీకటితో నిండియుండుటవలన, పర్వతగుహావలె గన్పడుచుండెను.

అవినాశిబృహత్తేజః క్వచిదర్కానలోపమమ్
హిమానీజఠరాశీతం క్వచిచ్చంద్రాదిసద్మసు. 44

ఇంకొకచోట వినశ్వరమగు తేజముతో గూడియుండుటవలన, సూర్యుడుగూడ అగ్నివలెనే కన్పడుచుండెను. ఇంకొకచోటనున్న చంద్రుడను భవనము మంచువలన నత్యంత శీతలమైయుండెను.

క్వచిద్వహత్ప్రోవృత్త కల్పవృక్షలతావనమ్
క్వచిద్దైత్యహతోత్తుంగ ప్రపతద్దేవపత్తనమ్. 45

ఇంకొకచోట, కల్పలతలతోనిండిన వనముండెను. ఇంకొకచోట, రాక్షసులు దేవపురిని విరుగగొట్టుచుండిరి.

వైమానికనిపాతేన వహ్నిలేఖాంకితంక్వచిత్
క్వచిత్కేతుశతోత్పాత మిథఃసంఘట్టపట్టితమ్. 46

ఇంకొకచోట, వైమానికులు క్రిందబడుచు తోకచుక్కవలె నగుపించుచుండిరి. ఇంకొకచోట, నూర్లకొలది 'జెండాలు' ఒకదానినొకటి రాచుకొనుచు, ఎగురుచుండెను.

క్వచిచ్ఛుభ్రగవాగ్రేణ ప్రగృహీతాగ్ర్యమండలమ్
క్వచిద్రాత్రితమోవ్యాప్తం క్వచిద్దివసభాస్వరమ్. 47

ఇంకొకచోట శుభగ్రహములు ఉన్నతస్థానములనుండెను. ఇంకొకచోటు రేచీకటి తోడను, మరొకచోటు పగటి వెలుగులతోడను నిండియుండెను.

క్వచిదుద్గర్జదంభోదం క్వచిన్మూకామలాంబుదమ్
వాతావకీర్ణ శుక్లాభ్ర ఖండపుష్పోత్తరంక్వచిత్. 48

ఇంకొకచోట, మేఘములు గర్జించుచుండెను. మరొకచోట, నిర్మలములగు మేఘములు గర్జింపకుండెనుండెను. ఇంకొకచోట, గాలివలన నెగురగొట్టబడిన మేఘశకలములు తెల్లని పూలవలె కన్పడుచుండెను.

క్వచిదత్యంతనిఃశూన్య మవదాతమనంతరమ్
ఆనందమృదుశాంతాచ్ఛం జ్ఞస్యేవ హృదయంతతమ్. 49

ఇంకొకతావు, పరమపదమును గ్రహించినవాని హృదయమువలె అత్యంతశూన్యమును, స్వచ్ఛమును, అవకాశవిహీనమును, ఆనందమయమును మృదువును, శాంతమును, నిర్మలమును, విశాలమును నై యుండెను.

శుక్రవాహనభేకౌఘైః క్వచిద్గలకృతారవమ్
శూన్యతావారివలితం క్షేత్రమాకాశవాసినామ్. 50

ఇంకొకచోట, శుక్రునివాహనములగు కప్పలు, కంఠమును విప్పి "బెక బెక" లాడుచుండెను. ఆకాశవాసుల క్షేత్రములు శూన్యమను నీటితో నిండియుండెను.

మయూరహేమచూడాది పక్షిభిఃక్వచిదావృతమ్
విద్యాధరీణాం దేవీనాం వాహనైర్విహితాస్పదైః. 51

విద్యాధర స్త్రీలయొక్కయు, దేవతా స్త్రీలయొక్కయు వాహనములగు మయూరాది విహంగములు, ఇంకొకచోట నుండెను,

క్వచిదభ్రాంతరోన్నృత్య ద్గుహమాయూరమండలమ్
క్వచిదగ్నిశుకైః శ్యామం శాద్వలానామివస్థలమ్. 52

ఇంకొకచోట మేఘమండలమున, కుమారస్వామి వాహనములగు మయూరములు నాట్యమాడుచుండెను. ఇంకొకచోటు, అగ్ని వాహనములగు చిలుకలతోనిండి, పచ్చికబయలు వలె కన్పడు చుండెను.

క్వచిత్ప్రేతేశమహిష మహిమ్నా వామనాంబుదమ్
క్వచిదశ్వస్తృణగ్రామ శంకాగ్రస్తాసితాంబుదమ్. 53

ఇంకొకచోట, యమవాహనమగు మహిషము నల్లటిమేఘములగాంచి, ఇంకొకదున్నయనితలచి, డీకొనుచుండెను, ఇంకొకచోట, గుఱ్ఱములు గడ్డియనుకొని మేఘములను నములుచుండెను.

క్వచిద్దేవపురవ్యాప్తం క్వచిద్దైత్యపురాన్వితమ్
అన్యోన్యాప్రాప్యనగరం నగరంధ్రకరానిలమ్. 54



కొన్నితావులనున్న దేవాసుర పురములనడుమ, కొండలలేవనెత్తగలిగిన గాలి వీచుచుండుట వలన, వారొండొరులు ఇతరుల పట్టణముల బ్రవేశింపజాలకుండిరి.

క్వచిత్కులాచలాకార నృత్యద్భైరవభాసురమ్
క్వచిత్సపక్షశైలేంద్ర సమనృత్యద్వినాయకమ్. 55

ఇంకొకచోట మలయపర్వతమువలె, బృహదాకారుడగు భైరవుడు నృత్యము సల్పుచుండెను. ఇంకొకచోట, ఱెక్కలుకల్గిన పర్వతమువలె, గరుడపక్షి నర్తించుచుండెను.

క్వచిద్ఘర్ఘరవాతౌఘ పక్షప్రోడ్డీనపర్వతమ్
క్వచిద్గంధర్వనగర సురస్త్రీవృందబంధురమ్. 56

ఇంకొకచోట, పెద్దగాలికి రెక్కలతోగూడిన పర్వతములు లేచుచుండెను. ఇంకొకచోటు, గంధర్వనగరములతోడను, దేవతాస్త్రీలతోడను నిండియుండెను.

క్వచిద్వహద్గిరిధ్వస్త వృక్షలక్షోచ్ఛ్రితాంబుదమ్
క్వచిన్మాయాకృతాకాశ నలినీజలశీతలమ్. 57

ఇంకొకచోట, తిరిగెడు కొండలనుండి పడిన చెట్లవలన మేఘమండలము సమున్నతమై కన్పట్టుచుండెను. ఇంకొకతావు, మాయాకల్పితములగు ఆకాశపద్మములతోడను, నీటితోడను, చల్లగనుండెను.

క్వచిదిందుకరాకృష్టి శీతలాహ్లాదమారుతమ్
క్వచిత్తప్తానిలాదగ్ధ ద్రుమపర్వతవారిదమ్. 58

ఇంకొకచోట, చంద్రకిరణములగూడ నాకర్షించు శీతలవాయువు వీచుచుండెను. ఇంకొకచోట, ఉత్తప్తాగ్నివలన చెట్టు చేమలు, కొండలు, మేఘములు దహింపబడుచుండెను.

క్వచిదత్యంతసంశాంత వాతాదేకాంతనిర్ధ్వని
క్వచిత్పర్వతతుల్యాభ్ర శిఖాకూటశతోదయమ్. 59

ఇంకొకచోట, ప్రశాంతవాయువు నిశ్శబ్దముగ వీచుచుండెను. ఇంకొకచోట పర్వతతుల్యములగు కొమ్ములతోగూడిన మేఘము లనేకములు లేచుచుండెను.

క్వచిత్ప్రావృడ్భవోన్మత్త ఘనాభ్రరవఘర్ఘరమ్
క్వచిత్సురాసురగణ ప్రవృత్తరణదుర్గమమ్. 60

ఇంకొకచోట, వర్షాకాల మేఘములు ఉన్మత్తములై 'ఘుర్ఘుర' స్వరమున గర్జించుచుండెను. ఇంకొకతావున సురాసురులు పోరాడుచుండుటవలన, చొర వీలుపడకుండెను.

క్వచిద్వ్యోమాబ్జినీహంసీ స్వనాహూతాబ్జవాహనమ్
క్వచిన్మందాకినీతీర నలినీలుంఠకానిలమ్. 61

ఇంకొకచోట ఆకాశకమలముల విహరించి హంసీగణము హంసల నాహ్వానించుచుండెను. ఇంకొకచోట, మందాకినీతీరవాయువులు, పద్మగంధమును హరించుచుండెను.

స్వశరీరేణగంగాది సరితాం సన్నిధానతః
ప్రోడ్డీనమత్స్యమకర కులీరాంబుజకూర్మకమ్. 62

ఇంకొకతావున, గంగాది నదీ సంపర్కమున, చేపలు, మొసళ్లు, ఎండ్రకాయలు, నత్తలు, తాబేళ్లు, మొదలగు జలజంతువులు లేచుచుండెను.

పాతాలగార్కజనిత భూచ్ఛాయాకాకచోపనైః
క్వచిత్క్వాచిన్మండలేషు గ్రస్తచంద్రార్కమండలమ్. 63

సూర్యుడు పాతాళమున కరుగుటవలన కొన్నితావుల సూర్యగ్రహణమును, పృథివి నీడ పడుటవలన కొన్నితావుల చంద్రగ్రహణమును, నగుపడుచుండెను.

క్వచిత్స్వర్గానిలాధూత మాయాకుసుమకాననమ్
పతత్పుష్పహిమాసార త్రసద్వ్యోమానికాంగనమ్. 64

ఇంకొకచోటనున్న మాయాపుష్పోద్యానములయందలి పుష్పములు స్వర్గవాయువులవలన రాల్పబడుచుండెను. ఇంకొకచోట, విమానముల సంచరించు యువతులపై పూవులును, మంచు తుంపురులును బడుటవలన, వారు 'ఉలిక్కి' పడుచుండిరి.

ఉదుంబరోదరమశకక్రమభ్రమ జ్జగత్త్రియాంతరగతభూతసంచయం
విలంఘ్య తద్వరలలనే ఖముచ్చకై ర్మహీతలం పునరపి గంతుముద్యతే. 65

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే ఉత్పత్తిప్రకరణే
లీలోపాఖ్యానే గగనవర్ణనం నామ
చతుర్వింశః సర్గః ॥ 24 ॥

అట, త్రిలోకవాసులగు జీవులు ఉదుంబర మధ్యమముననున్న దోమలవలె చరించుచుండిరి. ఈ విషయములనన్నింటిని గాంచుచు వారు పోసాగిరి. అనంతరము వారు ఆకాశమండలమున విశ్రమించి, మరల భూలోకమునకు బోసాగిరి.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు, ఉత్పత్తిప్రకరణమున
లీలోపాఖ్యానమున గగనవర్ణనమను
చతుర్వింశ సర్గము ॥ 24 ॥





## పంచవింశః సర్గః

శ్రీవసిష్ఠ ఉవాచ:—

నభఃస్థలాద్గిరిగ్రామం గచ్ఛంత్యౌ కంచిదేవ తే
జ్ఞప్తిచిత్తస్థితంభూమితలం దదృశతుః స్త్రియా. 1

వసిష్ఠుడు:—ఆ రమణులిర్వురు ఆకసమునుండి గిరిగ్రామమున కరుగుచు, జ్ఞప్తిదేవి చిత్తమున నున్న భూమిని గాంచిరి. (సరస్వతీదేవి తన కల్పనాబలమున, లీలకు భూమిని జూపెట్టెను.)

బ్రహ్మాండనరహృత్పద్మం దిగష్టకదలం బృహత్
గిరికేసరసంబాధం స్వామోదభరసుందరమ్. 2

ఈ భూమండలము, బ్రహ్మాండమను మనుజుని హృదయపద్మము; అష్టదిక్కులు దీని దళములు; నాలుగు కెలకులనున్న కొండలు కేసరములు; ఈభూమండలపద్మము స్వసౌరభముననే సుందరమై వెలయుచున్నది.

సరిత్కేసరికానాల మధ్యేఽవశ్యాయబిందుకమ్
శర్వరీభ్రమరీభ్రాంత భూతౌఘమశకాకులమ్. 3

నదీసమూహములు ఏతత్ పద్మకేసరీనాళములు, తదంతరగత జలములు, హిమబిందువులు. రాత్రియను భ్రమరము దీనిచుట్టును దిరుగుచున్నది. ప్రాణిసమూహములే దీని దోమలు.

అంతర్గుణగణాకీర్ణం సురంధ్రైః సుషిరైర్వృతమ్
ఉహ్యమానపయఃపూరై ర్దివసాలోకకాంతిమత్. 4

దీని మధ్యప్రదేశము భోగములను తంతువులతో నిండియున్నది. నీటితోనిండిన పాతాళమే దీని రంధ్రము; ఈ నీరు దీనినిచుట్టి ప్రవహించుచున్నది. దివసాలోకమున నిది ప్రకాశించుచున్నది.

రసార్ద్రం ఖే భ్రమద్ధంసం రాత్రిసంకోచభాజనమ్
పాతాలపంకనిర్మగ్న నాగనాథమృణాలకమ్. 5

ఈ భూపద్మము శృంగారాది రసములతో నార్ద్రమైయున్నవి. ఆకసమున చరించుచు సూర్యుడే దీని ననుసరించు హంస. రాత్రియందిది సంకుచిత మగుచున్నది. పాతాళమను పంకమున నున్న వాసుకియే దీని నాళము.

కదాచిదాప్పదాంబోధి కంపకంపితదిగ్దలమ్
అధోనాలగతానంత దైత్యదానవకంటకమ్. 6

సముద్రమే ఈ పద్మమున కాధారము. సముద్రముకంపించిన, దీని దిక్‌దళములుగూడ చలించును. ఈ పద్మనాళమున దేవదానవులను కంటకములున్నవి.

అసురస్త్రీణవల్లర్యా సంభోగసుకుమారయా
ప్రాప్య భూభృన్మహాబీజహృదయం భూతబీజయా. 7

జంబూద్వీపఇతిఖ్యాతాం విపులాం తత్రకర్ణికామ్
సరిత్కేసరికానాలాం నగరగ్రామకేసరామ్. 8

పర్వతములు దీని బీజములు. ఇవి అసురస్త్రీలను లతే నాశ్రయించుకొనియున్నవి. దీనికి జంబూద్వీపమను కర్ణికయొకటి ఉన్నది. నదులు ఈ కర్ణికానాళములు; గ్రామములు, నగరములు దీని కేసరములు.

కులశైలేశ్వరోత్తుంగ బీజసప్తకసుందరీమ్
మధ్యస్థోచ్చమహామేరు బీజాక్రాంతనభస్థలీమ్. 9

ఈ కర్ణిక, ఉన్నతములగు సప్తకులాచలపర్వతములను బీజములతోగూడియున్నది; దీని మధ్యనున్న సుమేరుపర్వతమను బీజము ఆకాశమునాక్రమించుచున్నది.

సరఃప్రాలేయకణికాం వనజంగలధూలికామ్
స్థలేష్వామండలాంతస్థ జనజాలాలిమండలామ్. 10

సరోవరములన్నియు ఈ పద్మదళమునను మంచుతుంపురులు. అరణ్యములే దీనిధూళి. ఈ భూపద్మకర్ణికామధ్యదేశమున వసించుజీవులను, తుమ్మెదలతో బోల్పనగును.

తాంయోజనశతాకారైః ప్రతిరాకం ప్రభోధిభిః
సాగరై భ్రమరై ర్వ్యాప్తాం దిక్చతుష్టయశాలిభిః. 11

ఈ (జంబూద్వీప) కర్ణికను, ప్రతిపౌర్ణమియందు, నాలుగుదిక్కుల శతయోజనవిస్తీర్ణములై వ్యాపించియున్న సాగరములను భ్రమరములు చెలరేగి ముట్టుచున్నవి.

దిగ్దలాష్టకవిశ్రాంత ససురాంభోధిషట్పదామ్
భ్రాతృభిర్నవభిర్భూపై ర్నవధా పరికల్పితామ్. 12

దీని దిగ్దళముల, సురలును సముద్రములు అను భ్రమరములు విశ్రమించుచున్నవి. సోదరులగు తొమ్మిదిమందిరాజులు దీనిని భారత, భద్రాశ్వ, కేతుమాల్యాది నవభాగములుగ విభజించినారు.

లక్షయోజనవిస్తీర్ణా మాకీర్ణాంచ రజోలవైః
నానాజనపదవ్యూహా స్థిరావళ్యాయసీకరామ్. 13

ఈ భూమియొక్క వైశాల్యము లక్షయోజనములు; ఇది రజోకణములతో నిండియున్నది. జనపదములను చెదరని మంచుతుంపురులు దీననున్నవి.

...పాత్తు ద్విగుణం మానం లవణార్ణవలేఖయా
...త్యా వలితాం బాహ్యా ప్రకోష్ఠమివ కంబునా. 14

దీనికం... రెండింతలగు లవణసముద్రము దీనిని, ఆభరణము చేతిని జుట్టియుండునటు, చుట్టియున్నది.

తతోఽపి ద్విగుణం దేహం దధత్యావలయాకృతిమ్
జగద్భా...తాం శాకాఖ్యద్వీపలేఖయా, 15



తతోఽపిద్విగుణాకారం ధారయంత్యాచ వేష్టితామ్
ప్రత్యగక్షీరపూర్ణాబ్ధిలేఖయా స్వాదుశీతయా. 16

తరువాత దీనికంటె రెండింతలు పెద్దదగు శాకద్వీపము, పద్మలతావలయమువలె, ఆవరించుకొనియున్నది. దీని నలుప్రక్కల రెండింతలు పెద్దదగు క్షీరసముద్ర మావరించుకొనియున్నది. ఇది సుస్వాదు శీతలము.

తతోఽపిద్విగుణాకారం ధారయంత్యోపవేష్టితామ్
నానాజనాలంకృతయా కుశాఖ్యద్వీపలేఖయా. 17
తతోఽపిద్విగుణాకారం ధారయంత్యాచవేష్టితామ్
దధ్యబ్ధిలేఖయానిత్య సంతర్పితసురౌఘయా. 18

తరువాత రెండింతలు పెద్దదగు కుశద్వీపమున్నది. దీన జనసంఖ్య మెండుగనున్నది. దీనిని, నలుప్రక్కల ద్విగుణాకారమగు దధిసముద్ర మావరించికొనియున్నది. ఇది ప్రతిదినము దేవతలకు దృప్తినిచ్చుచున్నది.

తతఃక్రౌంచాభిధద్వీప లేఖయైవంప్రమాణయా
వేష్టితాం ఖాతరచయా నవాం నృపపురీమివ. 19
తతోఽపిచ ఘృతాంభోధి లేఖయైవంప్రమాణయా
తతోఽపి శాల్మలీద్వీప లేఖయా మలపూర్ణయా. 20
తతఃసురామహాంభోధి లేఖయా పుష్పశుభ్రయా
శేషస్య దేహలతయా హరిమూర్తి మివావృతామ్. 21

తరువాత ఈ తీరుగనే క్రౌంచద్వీపమున్నది. అది, కందకములతోగూడి నూతనరాజపురివలె నొప్పుచున్నది. దీని నావరించి ఘృతసముద్రమున్నది. పిదప, పాపపూర్ణమగు శాల్మలీద్వీపమున్నది. పిదప, పూవులవలె తెల్లనగు కల్లుసముద్రమున్నది. అది శాల్మలీద్వీపమును, శేషుడు విష్ణుని చుట్టుయున్నట్లు, ఆవరించుకొనియున్నది.

తతో గోమేదకద్వీప లేఖయైవంప్రమాణయా
ఇక్ష్వబ్ధిలేఖయాప్యేవం హిమవత్సానుశుద్ధయా. 22
తతోఽపిపుష్కరద్వీప లేఖయా ద్విగుణస్థయా
అంతే స్వాదూదకాంభోధి లేఖయైవంప్రమాణయా. 23

పిదప, గోమేదక ద్వీపమును, దాని నావరించి ఇక్షుసముద్రమును, మంచుకొండలును నున్నవి. తరువాత, పుష్కరద్వీపమును, మంచినీటి సముద్రమునున్నవి.

తతో దశగుణేనాథ పాతాలతలగామినా
నిఖాతవలయేనోచ్చైః శ్వభ్రసంభారరూపిణా. 24
పాతాలగామిమార్గేణ వలితాం భయదాత్మనా
పతస్మాత్షలు సర్వస్మాత్తతో దశగుణోచ్ఛ్రయా. 25

ఆవ్యోమసు చతుర్దిక్షు శ్వభ్రసంభారభీమయా
అర్ధోన్నానతమోరూప లగ్ననీలోత్పలస్రజా. 26

నానామాణిక్యశిఖర కల్హారకుముదాబ్జయా
లోకాలోకాచలోత్తాల విపులోద్దామమాలయా. 27

వలితాం త్రిజగల్లక్ష్మీ ధమ్మిల్లవలనామివ
ఏతస్మాదేవ సర్వస్మాత్తతో దశగుణాత్మనా. 28

అజ్ఞాతభూతసంచార నామ్నారణ్యేన మాలితామ్
ఏతస్మాదేవ సర్వస్మాత్తతో దశగుణాత్మనా. 29

నభసేవ చతుర్దిక్కం వ్యాప్తామతులవారిణా
ఏతస్మాదేవసర్వస్మాత్తతో దశగుణాత్మనా 30

మేర్వాదిద్రావణోత్కేన జ్వాలాజాలేనమాలితామ్
ఏతస్మాదథసర్వస్మాత్తతో దశగుణాత్మనా. 31

మేర్వాద్యచలసంఘాతం నయతా తృణపాంసువత్
వహతాద్రీంద్రవిస్ఫోట కారిణా జవహారిణా. 32

నిఃశూన్యత్వాదశబ్దేన మరుతా పరితో వృతమ్
ఏతస్మాదథసర్వస్మాత్తతో దశగుణాత్మనా. 33

పరితో వలితం వ్యోమ్నా నిఃశూన్యైకరూపిణా
అథయోజనకోటీనాం శతేన ఘనరూపిణా

వ్యాప్తం బ్రహ్మాండకుడ్యేన హైమేనాపి ద్వివర్ణ్యణా. 34

పిదప, మంచినీటిసముద్రముకంటె పెద్దదగు ?లమున్నది. అది పాతాళలోకమునకు బోవుచున్నది. అతి భయంకరమై వెలయుచున్నది. ఈగర్తమున పైకిలేచి కన్పడు చక్రవాళపర్వతములున్నవి. వీటిసగభాగ మంధకారముననుండుటవలన, నీలోత్పలమాలవలన కప్పబడియున్నదా యనిపించుచుండును. వీటి శిఖరముల, నానావిధమాణిక్యములు, కుముదములు, కల్హారములునున్నవి. ఇవి త్రిభువనలక్ష్మియొక్క కేశదామములవలె నగుపించుచున్నవి. తరువాత దానికంటె పదిరెట్లు పెద్దదగు అరణ్యమున్నది. అందు ప్రాణిసంచారములేదు. పిదప, పదిమడుంగులు పెద్దదగు అగాధజలరాశి, ఆకాశమువలె, వ్యాపించియున్నది. పిదప, పదిరెట్లు పెద్దవగు అగ్నిజ్వాలలున్నవి. అవి మేర్వాది పర్వతములనే కఱిగించునట్లుండును. పిదప పదిరెట్లు పెద్దదగు వాయుప్రవాహముండెను. అది కొండలను పిండిచేయునట్లును, గడ్డివలె లేవనెత్తగలిగినట్లును, ఉండెను. శూన్యప్రదేశమగుటవలన దాని శబ్దము వినరాకుండెను. పిదప, పదిరెట్లెక్కుడగు శూన్యాకాశము వ్యాపించియుండెను. తరువాత, శతకోటి యోజనములు. వ్యాపించి, దట్టమైయున్న సువర్ణమయ బ్రహ్మాండ కుడ్యమున్నది. అది రెండు భాగములుగనుండెను.

ఇతి జలధిమహాద్రిలోకపాల త్రిదశపురాంబరభూతలైః పరీతమ్
జగదుదరమవేక్ష్యమానుషీ ద్రాగ్భువి నిజమందిరకోటరం దదర్శ. 35



ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే ఉత్పత్తిప్రకరణే
లీలోపాఖ్యానే భూలోకవర్ణనం నామ పంచవింశః సర్గః ॥ 25 ॥

ఇట్లు, లీలాదేవి సాగరములతోడను, మహాచలములతోడను, లోకపాలకులతోడను, దేవపురులతోడను, ఆకసముతోడను, భూతలముతోడను నిండియున్న భువనముల నాలోకించి, భూమండలముననున్న గిరిగ్రామదేశమును సందర్శించెను.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు ఉత్పత్తిప్రకరణమున
లీలోపాఖ్యానమున భూలోక వర్ణనమను పంచవింశ సర్గము. ॥ 25 ॥

———:0:———

## షడ్వింశః సర్గః.

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

ఇతి తే వరవర్ణిన్యౌ తతో బ్రహ్మాండమండలాత్
నిర్గత్యాన్యదనుప్రాప్తే యత్ర తద్బ్రాహ్మణాస్పదమ్. 1

వసిష్ఠుడు:— ఈ ప్రకారమా యుత్తమస్త్రీ లిర్వురును, బ్రహ్మాండ మండలమును దాటి ఆ బ్రాహ్మణుని గృహమున కఱిగిరి.

తతో దదృశతుః సద్మ స్వమేవం సిద్ధయోషితౌ
అదృశ్యేఏవ లోకస్య మండపం బ్రాహ్మణాస్పదమ్. 2

లీలాదేవియు, సరస్వతీదేవియు, అదృశ్యరూపమున ఆ విప్రగృహమునఁ బ్రవేశించిరి.

చింతావిధురదాసీకం బాష్పక్లిన్నాంగనాముఖమ్
విధ్వస్తప్రాయవదనం శీర్ణపర్ణాంబుజోపమమ్. 3

నష్టోత్సవపురప్రాయ మగస్త్యాత్తమివార్ణవమ్
గ్రీష్మదగ్ధమివోద్యానం విద్యుద్దగ్ధమివద్రుమమ్. 4

దుఃఖముచే వ్యాకులురైన దాసీజనమును, కన్నీటిధారలచేవాడి, శుష్కించిన కమలమువలె మలినమైన ముఖములుగల స్త్రీలును గలినట్టియు, ఉత్సవరహితమగు నగరమువలెను, అగస్త్యునిచే శుష్కింపజేయబడిన సముద్రమువలెను, గ్రీష్మఋతువు నందలి సూర్యవేడిమిచే తపింపబడిన వనవాటికవలెను, పిడుగుబడుటచే దగ్ధమైన వృక్షమువలెను నున్న ఆ గృహమును వారు చూచిరి.

వాతచ్ఛిన్నమివాంభోదం హిమదగ్ధమివాంబుజమ్
అల్పస్నేహదశం దీపమివాలోకనభేదనమ్. 5

ఆసన్నమృత్యుకరుణాకులవక్త్రకాంతి సంశీర్ణజీర్ణతరుపర్ణవనోపమానమ్
వృష్టివ్యపాయపరిధూసరదేశరూక్షం జాతంగృహేశ్వరవియోగహతం గృహం తత్. 6

గృహపాలకుని వియోగముచే నా గృహము, వాయువుచే ఛిన్నభిన్నమైన మేఘమువలెను, మంచుచే నశింపజేయబడిన కమలమువలెను, స్వల్పతైలముగల దీపమువలెను, మృత్యువాసన్నమైన వాని కరుణాక్రాంత ముఖమువలెను, శుష్కించిన వృక్షములుగల అరణ్యమువలెను, అనావృష్టిచే నాశనముగాబడిన ప్రదేశమువలెను, నుండెను.

అథ సా నిర్మలజ్ఞాన చిరాభ్యాసేన సుందరీ
సంపన్నా సత్యసంకల్పా సత్యకామా చ దేవవత్. 7

తదనంతరము, చిరకాలాభ్యాసముచే నిర్మలజ్ఞానమును బొందిన ఆ లీలాదేవి, దేవతలవలె సత్యసంకల్ప యాయెను.

చింతయామాస మామేతే దేవీం. చేమాం స్వబంధవః
పశ్యంతు తావత్సామాన్యలలనారూపధారిణీమ్. 8

ఈ నా బంధువులు, నన్నును, సరస్వతీదేవిని సామాన్య స్త్రీరూపమును ధరించిన వారివలె యున్నట్లు చూచుగాక, యని లీలాదేవి తనచిత్తమున దలఁచెను.

తతో గృహజనస్తత్ర సందదర్శాంగనాద్వయమ్
లక్ష్మీగౌర్యోర్యుగమివ సముద్భాసితమందిరమ్. 9

అటు తరువాత, ఆ గృహమున నున్నవారందరును, గృహమంతటిని ప్రకాశింపజేయునట్టి, లక్ష్మి, పార్వతి వలెనున్న ఆయిర్వురు స్త్రీలను గాంచిరి.

ఆపాదవివిధామ్లాన మాలావసనసుందరమ్
వసంతలక్ష్మ్యోర్యుగల మివామోదితకాననమ్. 10
సర్వౌషధివనగ్రామం పూరయంత్యోరసాయనైః
శీతలాహ్లాదసుఖదం చంద్రద్వయమివోదితమ్. 11
లంబాలకలతాలోల లోచనాలివిలోకనైః
కిరత్కువలయోన్మిశ్ర మాలతీకుసుమోత్కరాన్. 12

వారిద్దరును, శిరస్సుమొదలు పాదములవరకును, క్రొత్తపూమాలలచే నలంకరింపబడిన వారును, రూపవతులును, తనశోభచే వనమునంతను వికసితమొనర్చు వసంతఋతువువలె నున్నవారును, అయియుండిరి. మరియు, అప్పుడు, అమృతమయమగు వెన్నెలచే ఓషధులను, వనములను, గ్రామాదులను వ్యాపించి ఆనందమును గల్గజేయు యిర్వురు చంద్రు లుదయించినట్లుండెను. వ్రేలాడుచున్న పొడవైన వెండ్రుకల సమీపముననున్న చంచలమైన నేత్రములను తుమ్మెదలచే కూడిన నీలకమలములవలె నున్న, వారు దివ్యమగు మాలతీ పుష్పములను వర్షింపజేయుచున్నట్లుండిరి.



ద్రుతహేమరసాపూర సరిత్సరణహారిణా
దేహప్రభాప్రవాహేణ కనకీకృతకాననమ్. 13
సహజాయా వపుర్లక్ష్మ్యా లీలాదోలావిలాసినః
త ఏతే చ తరంగాఢ్యా నిజలావణ్యవారిధేః. 14
విలోలబాహులతికా యుగేనారుణపాణినా
కిరన్నవనవం హైమం కల్పవృక్ష లతావనమ్. 15
పాదైరమృదితామ్లాన పుష్పకోమలపల్లవైః
స్థలాబ్జదలమాలాభై రస్పృశద్భూతలంపునః. 16
తాలీతమాల ఖండానాం శుష్కాణాం శుచిశోచిషామ్
ఆలోకనామృతాసేకై ర్జనయద్బాలపల్లవాన్. 17

బంగారు నీటిప్రవాహముతో సమమగు దేహకాంతులవారచ్చటి అడవిని సువర్ణమయ మొనర్చిరి. వారు, లావణ్య లక్ష్మికొఱకు గల్పింపబడిన ఉయ్యాలలవలెను, స్వభావసుందరమగు బ్రహ్మ సముద్రమునందలి తరంగముల వలెను నుండిరి. ఎఱ్ఱటి చేతులతో గూడిన బాహులతల నూచుచు, వారు, నూతనములును హేమమయములును నగు కల్పలతావనములను గల్పించుచుండిరా యనునట్లుండెను. వాడువడని పూలవలెను, మెట్టతామరలవలెను నున్న తమ పాదములతో వారు భూమిని స్పర్శించిరి. వారి వీక్షణామృతమున ఎండి పొలిపోయిన, తాళతమాల వృక్షములుగూడ మరల చిగిర్చిన ట్లుండెను.

నమోఽస్తు వనదేవీభ్యా మిత్యుక్త్వా కుసుమాంజలిమ్
తత్యాజ జ్యేష్ఠశర్మాథ సార్థం గృహజనేన సః. 18
పపాతపాదయోర్గేహే తయోర్వై కుసుమాంజలిః
ప్రాలేయ సీకరాసారః పద్మిన్యా ఇవ పద్మయోః. 19

'వనదేవీద్వయమునకు నమస్కారము' అని జ్యేష్ఠపుత్రుడగు జ్యేష్ఠశర్మ గృహజనులతో గూడి, వారికి కుసుమాంజలి నర్పించెను; ఆ పుష్పాంజలి, తామరతీగె యందున్న పువ్వులమీద మంచుబొట్లు పడినట్లుండెను.

జ్యేష్ఠశర్మాదయ ఊచుః—

జయతం వనదేవ్యౌ నో దుఃఖనాశార్థమాగతే
ప్రాయః పరపరిత్రాణ మేవ కర్మ నిజం సతామ్. 20

జ్యేష్ఠశర్మాదులు:- వనదేవీద్వయమునకు జయమగుగాక! మీరు మా దుఃఖమును బోగొట్ట అరుదెంచినారు. సామాన్యముగ ఇతరులను రక్షించుటయే సాధుధర్మము.

ఇతి తద్వచనాంతే తే దేవ్యావూచతురాదరాత్
ఆఖ్యాత దుఃఖం యేనాయం లక్ష్యతే దుఃఖితో జనః. 21

ఇట్లు వారుపల్క, "మీరెవ రేదుఃఖమును బొందుచున్నారో వచింపు" డని వారిర్వురను ఆదరముతో బల్కిరి.

జ్యేష్ఠశర్మాదయస్తే తే దేవ్యాః ప్రతి యథాక్రమమ్.
నిజం తద్దుఃఖమాచఖ్యు ర్దంపతివ్యసనాత్మకమ్. 22

పిదప, జ్యేష్ఠశర్మాదులు విప్రదంపతుల మరణమున దమకు గల్గిన దుఃఖమును జెప్పిరి.

**జ్యేష్ఠశర్మాదయ ఊచుః:—**

దేవ్యావభవతాం స్నిగ్ధావిహ బ్రాహ్మణదంపతీ
సర్వాతిథీ కులకరా స్తంభభూతౌ ద్విజస్థితేః. 23

తావద్యగృహముత్సృజ్య సపుత్రపశుబాంధవమ్
స్వర్గంగతౌ నః పితరౌ తేన శూన్యం జగత్త్రియమ్. 24

జ్యేష్ఠశర్మాదులు:- దేవులారా! ఇట నతిథుల కాశ్రయమును, బ్రాహ్మణమర్యాద కాధారమును, దీనదయాపరులును నగు బ్రాహ్మణ దంపతులుండిరి. వారు పుత్రులతోడను బంధుగులతోడను పశువులతోడను నిండిన గృహమునువీడి స్వర్గమున కఱిగిరి. వారు, నా తల్లిదండ్రులు. అందువలన నాకీ మూడులోకములును శూన్యములైనవి.

పక్షిణో గృహమారుహ్య విక్షిపంతః ప్రతిక్షణమ్
దేహం శూన్యే మృతం భక్త్వా శోచంతి మధురైః స్వరైః. 25

(పెంపుడు) పక్షులు ఇంటిమీద కెగిరి, రెక్కల నాడించుచు, మృతదేహమును గుఱించి కరుణస్వరమున రోదించుచున్నవి.

గుహాగురుగురారావ ప్రలాప లపనాకులః
సరిత్స్రాలాశ్రుధారాభిః పరిరోదితి పర్వతః. 26

ఈ పర్వతము గుహయను ముఖమును దెఱచి, 'గురుగురు' ధ్వనియను విలాపము నొనర్చుచు, నదియను అశ్రుధారలను వెలువరించుచు దుఃఖమును వెలిబుచ్చుచున్నది.

నిర్ఝరాక్రందకారిణ్యో ముక్తాంబరపయోధరాః
తప్తనిఃశ్వాస విధ్వస్తాః పరం కార్శ్యమితా దిశః. 27

దిక్కులు మేఘములను వస్త్రములను విడచి వేడినిట్టూర్పు గాలులనపసి, దేవతలకుగూడ దుఃఖము నిచ్చుచున్నవి.

క్షతవిక్షత సర్వాంగః కరుణాక్రందకర్కశః
ఉపవాసరతో గ్రామో దీనో మృతిపరః స్థితః. 28

గ్రామవాసులందరును 'నెత్తినోరు' బాదుకొని ఏడ్చుటవలన, వారి శరీరము నలిగిపోయినది. వారు తిండిని దినుటలేదు. దీనులై కరుణతో దుఃఖించుచు, బ్రతుకుతీపిని వదలుకొనినారు.

దివసంప్రతి వృక్షాణా మవశ్యాయాశ్రుబిందవః
గుచ్ఛలోచనకోశేభ్య స్తాపోష్ణాని పతంత్యధః. 29

ప్రతిదినము, చెట్లజొంపములను కళ్లనుండి, శోకాగ్నివలన, మంచు అను కన్నీటిబొట్లు క్రిందపడుచున్నవి.



ప్రశాంతజనసంచారా రథ్యాక్షారవిధూసరః
విధవావిగతానందా సంశూన్య హృదయాస్థితా. 30

జనసంచారములేకుండుటవలన బాటలు, ఆనందరహితలును, శూన్యహృదయలును నగు విధవలవలెనై, చవుడు బారిపోయినవి.

కోకిలాలిప్రలాపిన్యో వృష్టి బాష్పహతాలతాః
ఉష్ణోష్ణశ్వసనా దేహం ఘ్నంతి పల్లవపాణిభిః. 31

వేడిగాలులను నిట్టూర్పులతో గూడిన వర్షమను కన్నీటితో గొట్టబడిన లతలు, కోకిల, తుమ్మెదల రవములతో రోదించుచు, చిగుళ్లను చేతులతో తమ దేహమును గొట్టుకొనుచున్నవి.

ఆత్మానం శతధాకర్తుం బృహచ్ఛ్వభ్రశిలాతలే
నిర్ఝరాః ప్రపతంత్యేతే తాపతప్తశరీరకాః. 32

దుఃఖతప్తములగు కొండవాగు తమ్ము 'ముక్కలు చెక్కలు' చేసికొనుటకోయన, తాళ్లక్రిందనున్న గుంటలలో బడుచున్నవి.

నిఃశంకయాగతశ్రీకా ఘూకావిలులితాశయాః
అంధేన తమసా పూర్ణా గృహాః గహనతాంగతాః. 33

శోభారహితములును, నిస్సబ్ధములును, తమోపూర్ణములును నగు ఈ గృహములన్నియు, అరణ్యములట్లు మారినవి.

ఉద్యానపుష్పఖండేభ్యో రుదద్భ్యో భ్రమరారవైః
పూతిగంధో వినిర్యాతి స్వామోదాపరనామకః. 34

భ్రమరధ్వనులను రోదనములతో నిండిన ఉద్యానవన పుష్పములనుండివెలువడు సుగంధముగూడ దుర్గంధమువలె తోచుచున్నది.

చైత్రద్రుమవిలాసిన్యో విరసాః ప్రతివాసరమ్
లతాః కృశా విలీయంతే సంకుచద్గుచ్ఛలోచనాః. 35

వసంతవృక్షసమూహముల శాఖలు రోజురోజుకు నీరసములై కృశించుచున్నవి; వాటి పూలగుత్తులను కన్నులు వాడిపోయి గుంటలు పడినట్లగపడుచున్నవి.

ప్రక్షేప్తుమంబుధౌ దేహం ప్రవృత్తా గంతుమాకులాః
కుల్యాః కలకలాలోలం దోలయంత్యస్తనుం భువి. 36

కలకలధ్వని నొనర్చునదులు సముద్రమున తమ దేహమును త్యజింప పరిగిడుచు, నేలపై కొట్టుకొనుచున్నవి.

అశంకమశకాపాత స్పందమప్యతిచాపలమ్
కలయంత్యః స్థితావాప్యో నిస్పందానందమాత్మని. 37.

బావులన్నియును నిశ్చలములై యున్నవి; దోమవాలినను అవి మిక్కుటముగ కదలుచున్నవి.

గాయత్కిన్నరగంధర్వ విద్యాధరసురాంగనమ్
నూనమద్యనభోజాత మస్మత్తాతాభ్యలంకృతమ్. 38

నా పితృదేవత లరుగుటవలన లభించిన ఆనందము వలననే, ఆకాశమున కిన్నర గంధర్వ విద్యాధరాదులు గాన మొనర్చుచున్నారు.

తద్దేవ్యాక్రియతాం తావ దస్మాకం శోకనాశనమ్
మహతాం దర్శనం నామ నకదాచన నిష్ఫలమ్. 39

కనుక మీరు నా దుఃఖమును బోగొట్టుడు: గొప్పవారి దర్శనము వ్యర్థము కాదు.

ఇత్యుక్తవంతం సా పుత్రం మూర్ధ్ని పస్పర్శ పాణినా
పల్లవేనానతానమ్రం మూలగ్రంథిమివాబ్జినీ. 40

ఇట్లు పల్కుచున్న పుత్రుని మస్తకమును లీలాదేవి, పద్మినివంగి దళమూల గ్రంథిని స్పర్శించునట్లు స్పృశించెను.

తస్యాః స్పర్శేన తేనాసౌ దుఃఖదౌర్భాగ్యసంకటమ్
జహౌ ప్రావృడ్ఘనాసంగా ద్గ్రీష్మతాపమివాచలః. 41

పర్వతము వర్షకాల మేఘముల వలన దాకబడి ఎండవేడిమినుండి విడివడునట్లు, జ్యేష్ఠశర్మ లీలాదేవి స్పర్శవలన, దుఃఖమును దురదృష్ట బాధనుండి విడివడెను.

సర్వోగృహజనః సోఽథ తయోర్దేవ్యోర్విలోకనాత్
లక్ష్మీవాన్ దుఃఖనిర్ముక్తో బభూవామృతపో యథా. 42

అనంతరము, గృహజనులందరును గూడ ఆదేవులవలన వీక్షింపబడి, దుఃఖమునుండి విడివడి శోభాసంపన్నులైరి.

శ్రీ రామ ఉవాచ:—

తయాస్యలీలయామాత్రా పుత్రస్య జ్యేష్ఠశర్మణః
కస్మాన్న దర్శనం దత్తం మోహం తావన్నిరాకురు. 43

శ్రీరాముడు:— తల్లియగు లీలాదేవి పుత్రునకు తన రూపమునేల గనపరచలేదు? నా ఈ సందియమును దూర మొనర్పుడు.

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

బుద్ధః పృథ్వ్యాదిబోధేన యేన పృథ్వ్యాదిసంఘకః
తస్యపిండాత్మతాం ధత్తే వ్యోమైవాన్యస్య కేవలమ్. 44

వసిష్ఠుడు:— పృథ్వ్యాది భూతములయందు ఎవనికి భూతములను బుద్ధి దృఢమైయున్నదో వానికవి యట్లే కన్పడును. ఇతరులు వాటిని పరమాకాశముగనే కాంతురు.

అసదేవాంగ సదివ భాతి పృథ్వ్యాదివేదనాత్
యథా బాలస్య వేతాలో నాభాతి తదవేదనాత్. 45

పృథ్వ్యాదుల జ్ఞానమున్న అసత్పదార్థము గూడ సత్పదార్థము వలెనే కన్పట్టును. వేతాళుడను పదార్థము లేదను జ్ఞానమున్న, బాలుడు వేతాళుని గాంచజాలడు.



యథాపృథ్వ్యాదినా భాత మపృథ్వ్యాది భవేత్క్షణాత్
స్వప్నేస్వప్నపరిజ్ఞానాత్తథా జాగ్రత్యపి స్ఫుటమ్. 46

'ఇది స్వప్నము' అను జ్ఞానము కలిగిన, స్వప్నపదార్థముల బోధ నశించునట్లు, జాగ్రదవస్థయందు జ్ఞానము కలిగిన పృథ్వ్యాది పదార్థములుగూడ మిథ్యలను బోధకలుగును.

పృథ్వ్యాదిఖతయాబుద్ధం ఖమిత్యేవానుభూయతే
తథాహి క్షుబ్ధధాతూనాం కుడ్యేషు ఖఇవోద్యమః. 47

పైత్యరోగమున చలించిన మతిగల పురుషునకు, స్ఫటిక కుడ్యమున ద్వారబుద్ధి కలుగునట్లు, పృథ్వ్యాదులయందు ఆకాశబుద్ధి కలిగిన, అవి ఆకాశములుగనే గోచరించును.

స్వప్నేనగరముర్వీవా శూన్యం ఖాతంచబుధ్యతే
స్వప్నాంగనాచ కురుతే శూన్యాప్యర్థక్రియాం నృణామ్. 48

ఖంపృథ్వ్యాదితయా బుద్ధం పృథ్వ్యాది భవతిక్షణాత్
మూర్ఛాయాం పరలోకోఽపి ప్రత్యక్షమనుభూయతే. 49

స్వప్నమున నగపడు, భూమ్యాదులు శూన్యములు లేక ఆకాశ స్వరూపములై గోచరించుచున్నవి; ఈ స్వప్నమున నగపడు స్త్రీ శూన్య స్వరూపమైనను కార్యకారిణి యగుచున్నది. అట్లే ఆకాశమున పృథ్వ్యాది జ్ఞానము కల్గిన అది క్షణములో పృథ్వ్యాది రూపమున ప్రతిభాత మగుచున్నది మూర్ఛయందు పరలోకము గూడ ప్రత్యక్షమగుచున్నవి.

బాలోవ్యోమైవ వేతాలం మ్రియమాణోఽంబరే వనమ్
కేశోండ్రకం ఖమన్యస్తు ఖమన్యో వేత్తి మౌక్తికమ్. 50

బాలుడు ఆకాశమున బేతాళుని గాంచుచున్నాడు. మరణింపబోవువాడు అరణ్యమును, ఇతరులు కేశగుచ్ఛమును, చక్షురోగి ముత్యములను గాంచుచున్నాడు.

త్రస్తక్షీబార్ధనిద్రాశ్చ నౌయానాశ్చ సదైవ ఖే
వేతాలవనవృక్షాది పశ్యంత్యనుభవన్తి చ. 51

భీతులును, ఉన్మత్తులును, అర్ధ నిద్రితులును, నౌకావిహారులును నగువారు ఆకాశమున సర్వదా అరణ్యము, వృక్షము మున్నగువాటిని గాంచుచున్నారు; మఱియు, స్పష్టముగ ననుభవించుచున్నారు.

యథా భావితమేతేషాం పదార్థానామతో వపుః
అభ్యాసజనితం భాతి నాస్త్యేకం పరమార్థతః. 52

అందువలన, ఈ పదార్థసమూహముల ఆకారము కల్పనయందే ప్రతీత మగుచున్నది; వాస్తవమునను వీటికట్టి ఆకృతియును లేదు.

లీలయాతు యథావస్తు బుద్ధా పృథ్వ్యాదినాస్తితా
ఆకాశమేవ సంవిత్త్యా భాతి భ్రాంతితయోదితమ్. 53

కాని, లీలాదేవి పృథ్వ్యాదుల అసత్తనే గ్రహించినదిక చిదాకాశమే భ్రాంతిబలమున నానారూపములు దోచుచున్నదని ఆమె స్పష్టముగ గ్రహించినది.

బ్రహ్మాత్మైకచిదాకాశ మాత్రబోధవతో మునేః
పుత్రమిత్రకలత్రాణి కథం కాని కదా కుతః. 54

చిదాకాశ స్వరూపమగు బ్రహ్మమే అంతయునని గ్రహించిన మననశీలునకు పుత్రమిత్ర కళత్రాది జ్ఞానమెట్లు కల్గును?

దృశ్యమాదావనుత్పన్నం యచ్చ భాత్యజమేవ తత్
సమ్యగ్జ్ఞానవతామేవం రాగద్వేషదృశౌ కుతః. 55

అసలునకు దృశ్యపదార్థము లుత్పన్నము లవనే లేదు. నీవు గాంచునదంతయు అజమగు ఆ బ్రహ్మమే. సంపూర్ణజ్ఞానము కలిగినవారికి రాగద్వేషాదు లెట్లుగలుగును?

హస్తః శిరసి యద్దత్తో లీలయా జ్యేష్ఠశర్మణః
తత్ప్రభావస్థితారంభసంబోధాయాశ్రితేః ఫలమ్. 56

లీలాదేవి జ్యేష్ఠశర్మ శిరస్సున చేతినుంచుట, అతనికి తత్త్వజ్ఞానము కలుగునిమిత్తము; ఇది అతని పూర్వ పుణ్యఫలము. లీల కాతనియందు పుత్రబుద్ధిలేదు. అందువలననే ఆమె, అతనికి మాతృ రూపమున దర్శన మొసగలేదు.

బోధో హి చేతతి యథైవ తథాఽనుభాతి
సూక్ష్మస్తు ఖాదపి తథాఽతితరాం విశుద్ధః
సర్వత్ర రాఘవ స ఏవ పదార్థజాలం
స్వప్నేషు కల్పితపురేష్వనుభూతమేతత్. 57

ఇత్యార్షే శ్రీ వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే ఉత్పత్తి ప్రకరణే
సిద్ధదర్శన హేతుకథనంనామ షడ్వింశః సర్గః ॥ 26 ॥

రాఘవా! బోధోదయమైన, ఆకాశముకంటెను సూక్ష్మమగు విశుద్ధ బ్రహ్మపదార్థమే గోచరించును. స్వప్నమున, సంకల్పపురమున అనుభవింపబడునదిగూడ, బ్రహ్మముగాక వేరొండుకావు.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు, ఉత్పత్తిప్రకరణమున
లీలోపాఖ్యానమున సిద్ధదర్శనహేతుకథనమను షడ్వింశసర్గము. ॥ 26 ॥

## సప్తవింశః సర్గః

శ్రీ వసిష్ఠ ఉవాచః—

తస్మిన్ గిరితటే గ్రామే తస్య మండపకోటరే
అంతర్ధిమాశ్వాయయతు స్తత్రస్థే ఏవ తే స్త్రియా. 1



వసిష్ఠుడు:_ ఆ రమణులిర్వురు గిరిగ్రామమున బ్రాహ్మణ గృహమునుండియే అదృశ్యలైరి.

అస్మాకం వనదేవీభ్యాం ప్రసాదః కృత ఇత్యథ
శాంతదుఃఖే గృహజనే స్వవ్యాపారపరస్థితే. 2

"వనదేవులు మమ్మనుగ్రహించినా"రని దలచి అటనున్న గృహజనులందరును దుఃఖమునువీడి, వారివారిపనుల నొనర్పసాగిరి.

మండపాకాశసంలీనాం లీలామాహ సరస్వతీ
వ్యోమరూపా వ్యోమరూపాం స్మయాత్తూష్ణీమివస్థితామ్. 3

ఇట్లు, ఆ గృహ మండపాకాశదేశమున లీనమై, విస్మయమునంది, తూష్ణీంభావమును దాల్చియున్న లీలాదేవితో నాకాశస్వరూపిణి యగు సరస్వతీదేవి ఇట్లుపల్కెను.

సంకల్పస్వప్నయోర్యేషాం యత్ర సంకథనం మిథః
యథేహార్థక్రియాం ధత్తే తయోఃసా సంకథా తథా. 4

స్వప్నసంకల్పముల జరిగినసంభాషణ మిథ్యయైనను, అది కార్యముగ పరిణతమగునట్లు, వారి సంభాషణగూడ కార్యరూపమున బరిణమించెను.

పృథ్వ్యాదినాడీప్రాణాది ఋతేఽప్యభ్యుదితా తయోః
సా సంకథనసంవిత్తిః స్వప్నసంకల్పయోరివ. 5

భౌతిక శరీరము, నాడీప్రాణములు వారికి లేకున్నను స్వప్నసంకల్పములందువలె వారికి సంభాషణారూపకమగు జ్ఞానముగల్గెను.

శ్రీ సరస్వత్యువాచ:—

జ్ఞేయం జ్ఞాతమశేషేణ దృష్టా దృష్టార్థసంపదః
ఈదృశీయం బ్రహ్మసత్తా కిమన్యద్వద పృచ్ఛసి. 6

సరస్వతి:_ తెలిసికొనదగిన దానినంతటిని నీవు లెస్సగా తెలిసికొంటివి. దృశ్యపదార్థములను గూడ గాంచితివి. బ్రహ్మసత్తయొక్క స్వరూపమిట్టిదే. అజ్ఞానమున్న జగద్భ్రమకల్గును. జ్ఞానోదయమైన నాశనమగును. ఇంక నీవేమి తెలిసికొనగోరెదవో, వచింపుము.

లీలోవాచ:—

మృతస్య భర్తుర్జీవోఽసౌ యత్ర రాజ్యం కరోతి మే
తత్రాహం కిం న తైర్దృష్టా దృష్టాస్మీహ సుతేన కిమ్. 7

లీల:_ నాభర్తయొక్క జీవుడు రాజ్యమొనర్చుచున్న చోటనున్నవారు నన్ను గాంచజాలక పోయిరి. నాసుతుండు గాంచగల్గినాడు. కారణమేమి? వచింపుము.

శ్రీ సరస్వత్యువాచ:—

అభ్యాసేన వినా వత్సే తదా తే ద్వైతనిశ్చయః
నూనమస్తంగతో నాభూ[illegible]ం వరవర్ణిని. 8

అద్వైతం యో న యాతోఽసౌ కథమద్వైతకర్మభిః
యుజ్యతే తాపసంస్థస్య ఛాయాంగానుభవః కుతః. 9
లీలాస్మీతి వినాభ్యాసం తవ నాస్తంగతోఽభవత్
యదా భావస్తదా సత్యసంకల్పత్వమభూన్న తే. 10
అద్యాసి సత్యసంకల్పా సంపన్నా తేన మాం సుతః
సంపశ్యత్విత్యభిమతం ఫలితం తవ సుందరి. 11
ఇదానీం తస్య భర్తుస్త్వం సమీపం యది గచ్ఛసి
తత్తేన వ్యవహారస్తే పూర్వవత్సంప్రవర్తతే. 12

సరస్వతి:- బిడ్డా! 'అభ్యాసము దృఢమవకుండుటవలన ద్వైతభావన నీకప్పుడు నశింపలేదు. వరవర్ణినీ! ఇంకను నీ ద్వైతబుద్ధి సంపూర్ణముగ నశింపలేదు. ద్వైతభావము తొలగనంతవఱకు అద్వైత కర్మల ఫలము లభింపదు. ఎండలో నిలుచుచుండిన నీడయొక్క చల్లదనము అనుభవమునకు వచ్చునా? అభ్యాసము లేకుండుటవలన, "నేను రాజపత్నియగు లీల" నను భావము నీనుండి తొలగలేదు. నీకు సత్యసంకల్ప ముదయింపలేదు. నేడు నీవు సత్యసంకల్పరాలవైతివి. సుందరీ! అందువలననే "పుత్రుడు నన్ను గాంచుగాక" అను నీ అభిలాష నెరవేరినది. ఇప్పుడు నీవు భర్తకడకతెగిన నతనితో వెనుకటి యట్లు మెలగగలవు.

లీలోవాచ:—

ఇహైవ మందిరాకాశే పతిర్విప్రో మమాభవత్
ఇహైవ స మృతో భూత్వా సంపన్నో వసుధాధిపః. 13
ఇహైవ తస్య సంసారే తస్మిన్ భూమండలాంతరే
రాజధానీపురే తస్మిన్పురంధ్ర్యస్మి వ్యవస్థితా. 14
ఇహైవాంతఃపురే తస్మిన్స మృతో మమ భూపతిః
ఇహైవాంతఃపురాకాశే తస్మిన్నేవ పురే నృపః. 15
సంపన్నో వసుధాపీఠే నానాజనపదేశ్వరః
సర్వార్జవజవీభావ ఇహైవైవం వ్యవస్థితః. 16
అస్మిన్నేవ గృహాకాశే సర్వా బ్రహ్మాండభూమయః
స్థితాః సముద్గకే మన్యే యథాంతః సర్షపోత్కరాః. 17
సదాఽదూరమహం మన్యే తద్భర్తుర్మమ మండలమ్
క్వచిత్పార్శ్వే స్థితమిహ యథా పశ్యామి తత్కురు. 18

లీల:- ఈ మందిరాకాశముననే ఈ బ్రాహ్మణుడు నా భర్తయైనాడు. ఇటనే అతడు శరీరమును త్యజించి రాజైనాడు. ఈ సంసారముననే, ఈ భూమండలముననే, ఈ రాజధానియందే నేనాతనికి భార్యనైతిని. ఈ అంతఃపురముననే రాజు మృతినందినాడు. ఈ పురమున అంతఃపురాకాశముననే, అతడు నానాజనపదములకు అధిపతియైనాడు. సముద్గకమున ఆవగింజలుండునట్లు, ఈ గృహాకాశముననే బ్రహ్మాండమంతయు నిమిడియున్నది. మనమిప్పుడు నాభర్తయున్నచోటికి చాల దగ్గరగనే యుంటి మనుకొందును. నేనద్దాని నిటనుండియే కాంచునట్లనుగ్రహింపుము.



శ్రీదేవ్యువాచ:—

భూతలారుంధతి సుతే భర్తారస్తవ సంప్రతి
త్రయో నామాథవాభూవన్ బహవః శతసంమతాః. 19
నేదీయసాం త్రయాణాంతు ద్విజస్తే భస్మతాంగతః
రాజా మాల్యాంతరగతః సంస్థితోఽంతఃపురే శవః. 20

శ్రీదేవి:- పుత్రీ! భూతలారుంధతీ! నీకు పెక్కుమంది భర్తలున్నారు. ఇప్పుడు నీకు ముగ్గురున్నారు. వారిలో మొదటివాడగు వసిష్ఠుడు (బ్రాహ్మణుడు) భస్మమై పద్ముడను రాజైనాడు. అతని శవమే పుష్పములతో గప్పబడి అంతఃపురమున నున్నది.

సంసారమండలే హ్యస్మిం స్తృతీయో వసుధాధిపః
మహాసంసారజలధి పతితో భ్రమమాగతః. 21

అతడే ఈ సంసారమున విదూరథుడను పేర రాజైనాడు. ఇప్పుడాతడు సంసారమను మహాసముద్రజలములబడి భ్రాంతుడైనాడు.

భోగకల్లోలకలనావికలో మలచేతనః
జాడ్యజర్జరచిద్వృత్తిః సంసారాంభోధికచ్ఛపః. 22
చిత్రాణి రాజకార్యాణి కుర్వన్నప్యాకులాన్యపి
సుప్తస్థితో జడతయా న జాగర్తి భవభ్రమే. 23

సంసారసముద్రతరంగములగు భోగసమూహములబడి అతడు వికలుడైనాడు. అతని చేతనము మలినమైనది, చిద్వృత్తి తమస్సున జీర్ణమైనది, అతడు సంసారసముద్ర — కచ్ఛపమైనాడు, విచిత్రములగు రాజ్యకార్యముల చిక్కుకొనినాడు. తమస్సున, మునిగిపోయి భవభ్రమనుండి మేల్కొనుట లేదు.

ఈశ్వరోఽహమహం భోగీ సిద్ధోఽహం బలవాన్సుఖీ
ఇత్యనర్థమహారజ్జ్వా వలితోఽవశతాంగతః. 24

"నేను ప్రభుడను, భోగిని, సిద్ధుడను, బలవంతుడను, సుఖిని" అను అనర్థపాశమున నాతడు బంధింపబడి తన స్వాతంత్ర్యమును పోగొట్టుకొనినాడు.

తత్కస్య వద భర్తుస్త్వాం సమీపం వరవర్ణిని
వాత్యా వనాంతరం గంధలేఖామివ నయామ్యహమ్. 25

వరవర్ణినీ! అందువలన, గాలి సుగంధకణములను ఒకవనమునుండి ఇంకొకవనమునకు గొనిపోవునట్లు, నిన్నెవనికడకు గొనిపోవలయునో వచింపుము.

అన్య ఏవ హి సంసారః సోఽన్యో బ్రహ్మాండమండపః
అన్యా ఏవ తథా వత్సే వ్యవహారపరంపరాః. 26

ఈ సంసార మొకతీరుగను, ఆ బ్రహ్మాండమండపమింకొక తీరుగనునున్నది. బిడ్డా! అచ్చట వ్యవహార సమూహములుగూడ భేదించుచున్నవి.

సంసారమండలానీహ తాని పార్శ్వేస్థితాన్యపి
దూరంయోజనకోటీనాం కోటయ స్తేష్వివాంతరమ్. 27

ఆ సంసారమంటపములన్నియును, జ్ఞానదృష్టితో బరికించిన నీపార్శ్వమున నే ఉన్నవి కాని, సంసారదృష్టితో బరికించిన, కోటియోజనముల దూరముననున్నవి.

ఆకాశమాత్రమేతేషా మిదం పశ్య వపుఃపునః
మేరుమందర కోటీనాం కోటయ స్తేష్వవస్థితాః. 28

జ్ఞానదృష్టియందు ఇవి ఆకాశస్వరూపములు మాత్రమే. వీటియందే కోటికోటి మందర పర్వతములున్నవి.

పరమాణౌ పరమాణౌ సర్గవర్గానిరర్గలమ్
మహాచితేఃస్ఫురంత్యర్క-రుచీవ త్రసరేణవః. 29

సూర్యకిరణములం దనేకములగు త్రసరేణువు లుదయించునట్లగపడునట్లు, ఆ మహాచైతన్య స్వరూపమునుండియే, ప్రతిపరమాణువున సృష్టిసమూహములు వికసించుచున్నవి.

మహారంభగురూణ్యేవ మపిబ్రహ్మాండకాని హి
తులయా ధానకామాత్ర మపి తాని భవంతి నో. 30

ఈ బ్రహ్మాండసమూహములసృష్టి, కష్టకరమును, గొప్పదియును నైనప్పటికిని, పరమార్థ దృష్టితో బరికించిన నియ్యవి మట్టిగింజతోనైనను సరిరావు.

నానారత్నామలోద్ద్యోతో వనవద్భాతి ఖే యథా
పృథ్వ్యాదిభూతరహితా జగచ్చిద్భాతి చింతయా. 31

నానావిధములగు రత్నకిరణము లాకాశమున అరణ్యమువలె గన్పడునట్లు, ఈ జగత్తుకూడ మాయవలన నిట్లగపడుచున్నది. జ్ఞానచింతతో బరికించిన, ఈ పృథ్వ్యాదులు శూన్యములుగ నగుపించును.

కచతిజ్ఞప్తిరేవేదం జగదిత్యాదినాత్మని
[illegible]పృథ్వ్యాది సంపన్నం సర్గాదావేవ కించన. 32

భ్రాంతివలననే, ఈ ఆత్మయందు జగత్తు స్ఫురించుచున్నది. వాస్తవమునకు, సృష్ట్యాది [illegible]ది భూతములతోగూడిన పదార్థమే లేకుండెను.

[illegible]భాతరంగః సరసి భూత్వాభూత్వాపునర్భవేత్
విచిత్రాకారకాలాంగదేశాజ్ఞప్తావలం తథా. 33

సరోవరమున తరంగములు మాటిమాటికిలేచి విలీనమగునట్లు, విచిత్రాకారములగు కాల భాగములును (దినరాత్ర్యాదులు) దేశభాగములును (పృథ్వ్యాదులు) జ్ఞానచైతన్యమునలేచి విలీనము లగుచున్నవి.



లీలోవాచ:—

ఏవమేతజ్జగన్మాతర్మయా స్మృతమిహాధునా
మమేదంరాజసం జన్మ నతమో నచసాత్త్వికమ్. 34

లీల:— జగన్మాతా! అవునట్లే. నా ఈ జన్మ సాత్త్వికము గాదు. తామసికము గాదు. రాజసము అని నాకు గుర్తునకు వచ్చుచున్నది.

బ్రహ్మణస్త్వవతీర్ణాయా అష్టౌజన్మశతాని మే
నానాయోనీన్యతీతాని పశ్యామీవాధునా పునః. 35

బ్రహ్మమునుండి వెలువడి నానావిధయోనులంబడి, ఎనిమిదివందల జన్మము లెత్తినట్లు ఇప్పుడు మరల స్పష్టముగ గాంచుచున్నాను.

సంసారమండలే దేవి కస్మింశ్చిదభువం పురా
లోకాంతరాబ్జభ్రమరీ విద్యాధరవరాంగనా. 36

దేవీ! నేను పూర్వమొక సంసారమండలమున విద్యాధరలోక-పద్మ-భ్రమరమగు విద్యాధరినైయుంటిని.

దుర్వాసనాకలుషితా తతోఽహం మానుషీస్థితా
సంసారమండలేఽన్యస్మిన్ పన్నగేశ్వరకామినీ. 37

పిదప, చెడ్డకోరికలవలన పాడువడి, మనుష్యజన్మను గ్రహించితిని. పిదప, ఇంకొక సంసార మండలమున నాగరాజపత్నినైతిని.

కదంబకుందజంబీరకరంజవనవాసినీ
పత్రాంబరధరాశ్యామా శబర్యహమథాభవమ్. 38

అనంతరము, కదంబ, కుంద, జంబీరాది వృక్షములతోగూడుకొనిన అరణ్యమున ఆకులను గట్టుకొను శబరినై జన్మించియుంటిని.

వనవాసనయా ముగ్ధా సంపన్నాహమథోద్ధతా
గులుచ్ఛనయనా పత్రహస్తా వనవిలాసినీ. 39

ఆ జన్మమున వనవాసముననుండుటజేసి, ధర్మకార్యములను మఱచి మదించియుంటిని. అందువలన, పూలగుత్తులను కన్నులుగలదియు, ఆకులను చేతులుగలదియు, నగు వనలతనై జన్మించియుంటిని

పుణ్యాశ్రమలతా సాహం మునిసంగపవిత్రితా
వనాగ్నిదగ్ధా తస్యైవ కన్యాభూవం మహామునేః. 40

అప్పుడు, పుణ్యప్రదమగు మున్యాశ్రమమున నుండుటవలన పవిత్రనైతిని. పిదప దావానలమున దహింపబడి, ఆ ఋషికి గూతురునై జన్మించితిని.

అస్త్రీత్వఫలదాత్యాణాం కర్మణాం పరిణామతః
రాజాహమభవంశ్రీమాన్సురాష్ట్రేషు సమాఃశతమ్. 41

పుణ్యకర్మబలమున స్త్రీజన్మమును విడిచి, పురుషజన్మను గ్రహించి సురాష్ట్రదేశమున నూఱేండ్లు ఏలితిని.

తాలీనాం తలకచ్ఛేషు రాజదుష్కృతదోషతః
నకులీ నవవర్షాణి కుష్ఠనష్టాంగికాభవమ్. 42

ఆజన్మమయం బొనర్చిన పాపకృత్యముల ఫలముగ జలప్రదేశమగు తాళవనమున ముంగిసనై జన్మించితిని. అప్పుడు, నాశరీరము కుష్ఠరోగమున క్రుళ్ళిపోయెను. ఈ స్థితియందు తొమ్మిది వత్సరములు గడపితిని.

వర్షాణ్యష్టౌ సురాష్ట్రేషు దేవి గోత్వం కృతం మయా
మోహాద్దుర్జనదుష్టాజ్ఞ బాలగోపాలలీలయా. 43

దేవీ! పిదప, సురాష్ట్రదేశమున ఆవునై జన్మించి మూఢులగు గొల్లపిల్లలతో గలసి, ఎనిమిదేండ్లు గడపితిని.

విహంగ్యా వైరవిన్యస్తా వాగురా విపినావనౌ
క్లేశేనమహతాచ్ఛిన్నా అధమా వాసనా ఇవ. 44

పిదప, అరణ్యమున పక్షినై జన్మించితిని. వేటగాడు పన్నినవలలోబడి, అధమవాసనను ఛేదించునట్లు, దానిని ఛేదించితిని.

కర్ణికాక్రోడశయ్యాసు విశ్రాంతమలినా సహ
పద్మకుడ్మలకోశేషు భుక్తకింజల్కయా రహః. 45

తరువాత, భ్రమరినైజన్మించి పద్మకర్ణికలయందున్న శయ్యలమీద భ్రమరములతో విశ్రమించుచుండెడుదానిని; ఇంకొకప్పుడు కింజల్కములను భుజించుచుండెడుదానిని.

భ్రాంతముత్తుంగశృంగాసు హరిణ్యా హరినేత్రయా
వనస్థలీషు రమ్యాసు కిరాతాహతమర్మయా. 46

పిదప, చక్కటి కన్నులుగల లేడినై ఎత్తైన కొమ్ములుగల్గి, కొండలతోగూడిన వనముల దిరిగితిని. అటనొకదినమున కిరాతునిచే మర్మస్థలమున గొట్టబడి మరణించితిని.

పృష్టం నష్టాసు దిక్ష్వబ్ధి కల్లోలై రుహ్యమానయా
మత్స్యాంబుకచ్ఛపాచ్ఛేదే మోఘమానసతాడనమ్. 47

[illegible], చేపనైజన్మించి, సముద్రతరంగముల దేలియాడుచు, ఒకతాబేలు వీపుమీద నెక్కితిని. [illegible] కజాలరికొట్టగా, ఆ దెబ్బనుండి తప్పించుకొని నీటబడితిని.

పీతం చర్మణ్వతీతీరే గాయంత్యా మధురస్వరమ్
పులింద్యా సురతాంతేషు నాలికేరరసాసవమ్. 48

పి[illegible] చర్మణ్వతీనదీ తీరమున కిరాతినినై జన్మించితిని. అప్పుడు మధురస్వరమున పాటలు పాడుచు ప్రియునితో రమి[illegible] కొబ్బరికల్లు [illegible]గుచుండెడుదా[illegible]



సారసీసరసాలిన్యా సీత్కారమధురస్వరం
సారసః సురతైః స్వైరం సామంతశ్చాపురంజితః. 49
తాలీతమాలకుంజేషు తరలాననేత్రయా
క్షీబప్రేక్షణవిక్షోభైః కృతం కాంతావలోకనమ్. 50

పిదప, సారసపక్షినైజన్మించి మధురస్వరముతోడను సురతక్రీడలతోడను యథేచ్ఛగ సంచరించుచు, సారసేశ్వరుని సంతోషపరచుచుండెడి దానిని. ఇంకొకప్పుడు, తాలతమాలకుంజముల గూర్చొని మదిరోన్మత్తములగు తరళ నయనములతో నాథుని బరికించుచుండెడు దానిని.

కనకస్యందసందోహ సుందరై రంగపంజరైః
స్వర్గేఽప్సరోఽంబుజిన్యాశు తోషితాః సురషట్పదాః. 51
మణికాంచనమాణిక్య ముక్తానికరభూతలే
కల్పద్రుమవనే మేరౌ యూనా సహ రతం కృతమ్. 52

అనంతరము, స్వర్గలోకమున అప్సరసనై జన్మించి, పద్మినివలె, బంగారుకాంతులనీను అవయవసంపదలతో సురలను భ్రమరములకు సంతోషమును గూర్చితిని. ఒక్కొక్కప్పుడు, సుమేరు పర్వతముననున్న కల్పకవనములలో మణిమాణిక్యకాంచన ముక్తాసమూహములతో నలంకరింపబడిన భూతలమున యువకులతోగూడి రతిక్రీడ సల్పుచుండెడు దానిని.

కల్లోలాకులకచ్ఛాసు లసద్గుచ్ఛలతాసు చ
వేలావనగుహాస్వబ్ధేశ్చిరం కూర్మతయా స్థితమ్. 53

పిదప, తరంగములవలన దడుపబడుచున్న గట్లుగల సముద్రతీర లతావన మధ్యముననున్న గుహాయందు తాబేలునైపుట్టి, పెక్కుదినములు గడపితిని.

తరత్తారతరంగాసు దోలనం సరసాలినామ్
చలచ్ఛదపటాలీషు రాజహంస్యం మయాకృతమ్. 54

తరువాత, ఉబ్బెత్తుగలేచు అలలతోగూడిన సరోవరతీరమున, అయ్యాలలచే నూపబడు [illegible]కులతోగూడిన చెట్టుమీద రాజహంసనై ఊగితిని.

శాల్మలీదలలోలానా మాందోలనదరిద్రతామ్
మశకస్య మయాలోక్య దీనం మశకయాస్థితమ్. 55

పిదప, బూరుగుచెట్టుమీద నూగు దోమలనుజూచి, నాకుగూడ అట్లూగ బుద్ధిపుట్ట, దోమనై జన్మించితిని.

తరత్తారతరంగాసు చంచద్వీచ్యగ్రచుంబనైః
భ్రాంతం శైలస్రవంతీషు జలవంజులలీలయా. 56

పిదప, వేతస లతనై, పెద్ద అలలతోగూడిన కొండవాగుచే కొట్టబడి చలించుచుండెడిదానను.

గంధమాదనమందార మందిరే మదనాతురాః
పతితాః పాదయోః పూర్వం విద్యాధరకుమారకాః. 57

కీర్ణకర్పూరపూరేషు తల్పేషు వ్యసనాతురా
చిరం విలులితాశ్మేందు బింబేష్వివ శశిప్రభా. 58

అనంతరము విద్యాధరకులమున జన్మించితిని. అట, గంధమాదన పర్వతమున మందార వృక్షములతోఁగూడిన భవనముల, విద్యాధర యువకులు మదనాతురులై నాపాదముల బడెడువారు. చంద్రమండలమున వెన్నెల యుండునట్లు, కర్పూరము చల్లబడిన శయ్యల బరుండినను, దుఃఖము నన్ను వీడకుండెను.

యోనిష్వనేకవిధదుఃఖ శతాన్వితాసు
భ్రాంతం మయోన్నమనసన్నమనాకులాంగ్యా
సంసారదీర్ఘ సరితశ్చలయా లహర్యా
దుర్వార వాతహరిణీ సరణక్రమేణ. 59

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే ఉత్పత్తిప్రకరణే
లీలాజన్మాంతరవర్ణనం నామ సప్తవింశః సర్గః ॥ 27 ॥

వాతప్రవాహమున హరిణి భ్రాంతితో దిరుగాడునట్లు, నేను, అనేకవిధములగు దుఃఖములతో నిండినవియును, నానావిధములునునగు యోనుల తిరుగాడి, సంసార నదీతరంగముల లేచిపడుచు, బలముదక్కి, వ్యాకుల భావమున భ్రమించితిని.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు ఉత్పత్తిప్రకరణమున
లీలోపాఖ్యానమున లీలాజన్మాంతరవర్ణనమను సప్తవింశ సర్గము ॥ 27 ॥



## అష్టవింశః సర్గః.

**శ్రీరామ ఉవాచః—**

వజ్రాంగసారాద్బ్రహ్మాండ కుడ్యాన్నిబిడమండలాత్
కోటియోజనసంపుష్టా త్కథం తే నిర్గతేఽబలే. 1

శ్రీరాముడు:—ఆ రమణులిర్వురును, కోటియోజనములు వ్యాపించియున్నదియును, వజ్రమువలె కఠినమును, నిబిడమునునగు బ్రహ్మాండమండలమును భేదించి, ఎట్లు వెల్వడగల్గిరి?

**శ్రీ వసిష్ఠ ఉవాచః—**

క్వబ్రహ్మాండం క్వతద్భిత్తిః క్వాత్రాసా వజ్రసారతా
కిలావశ్యంస్థితే దేవ్యావంతఃపురవరాంబరే. 2



వసిష్ఠుడు:- రామా! ఆ బ్రహ్మాండ మెచ్చటి? ఆభిత్తి ఎచ్చటి? దాని వజ్రకఠినత్వ మెచ్చటి? ఆ అంతఃపురాకాశముననే, వారిర్వురును ఉండిరని గ్రహింపుము.

తస్మిన్నేవ గిరిగ్రామే తస్మిన్నేవాలయాంబరే
బ్రాహ్మణః స వసిష్ఠాఖ్య ఆస్వాదయతి రాజతామ్. 3

ఆ గిరిగ్రామ గృహాకాశముననే వసిష్ఠనాముడగు ఆ బ్రాహ్మణుడు రాజ్యము ననుభవించినాడు.

తమేవమండపాకాశ కోటకం శూన్యమాత్రకమ్
చతుఃసముద్రపర్యంతం భూతలం సోఽనుభూతవాన్. 4

ఆ శూన్యాకాశమండపముననే ఆ బ్రాహ్మణుడు పద్మ్రుడై, చతుఃసముద్ర ముద్రితమగు భూమి ననుభవించినాడు.

ఆకాశాత్మని భూపీఠం తస్మిం స్త్రదాజపత్తనమ్.
రాజసద్మానుభవతి సచ సాచాప్యరుంధతీ. 5

ఆ రాజును, అరుంధతియు ఆకాశమండలముననే రాజగృహమును రాజపురిని అనుభవించిరి.

లీలాభిధానా సాజాతా తయాచ జ్ఞప్తిరర్చితా
జ్ఞప్త్యాసహా సముల్లంఘ్య ఖమాశ్చర్యమనోహరమ్. 6

ఆ అరుంధతియే అట లీలయై, సరస్వతి నారాధించి, ఆపెతోఁగూడి మనోహరమగు ఆకాశమండలమును దాటినది.

ప్రాదేశమాత్రే నభసి సా తత్రైవగృహోదరే
బ్రహ్మాండాంతరమాసాద్య గిరిగ్రామకమందిరే. 7
బ్రహ్మాండాత్పరినిర్గత్య స్వగృహే స్థితిమాయయా
స్వప్నాత్స్వప్నాంతరంప్రాప్య యథాతల్పగతఃపుమాన్. 8

వాస్తవమునకు, లీల సరస్వతీదేవితోఁగూడి ఆ పరిమిత గృహాకాశముననే, నిద్రితుడు స్వప్నమును గాంచి, మఱొక స్వప్నమునుగాంచునట్లు, ఇంకొక బ్రహ్మాండమున కఱుగుట, గిరిగ్రామమును గాంచుట, మఱొక బ్రహ్మాండమున కఱుగుట, మరల గిరిగ్రామమున కరుదెంచుటలను అనుభవించినది.

ప్రతిభామాత్రమేవైత త్సర్వమాకాశమాత్రకమ్
నబ్రహ్మాండం నసంసారో నకుడ్యాది నదూరతా. 9

ఇదంతయు భ్రాంతియే; వాస్తవమునకు ఆకాశముగాక వేరొండు వస్తువులేదు; బ్రహ్మాండము, సంసారము, దూరము మొదలగునవి మిథ్య.

స్వచిత్తమేవ కచతి తయోస్తాదృఙ్మనోహరమ్
వాసనామాత్రసోల్లేఖం క్వబ్రహ్మాండం క్వసంసృతిః. 10

వాసనాప్రభావముననే వారి చిత్తమున ఈ మనోహర దృశ్యములన్నియు ప్రతిఫలించినవి. బ్రహ్మాండ మెచ్చటి? సంసార మెచ్చటి?

నీరావరణమేవేదం జ్ఞప్త్యాకాశమనంతకమ్
కించిత్స్వచిత్తేనోన్నీతం స్పందయుక్త్యేవ మారుతః. 11

కదలికతోఁగూడిన ఆకాశమే వాయురూపమున గ్రహింపబడునట్లు, వారి చిత్తకల్పనవలననే చిదాకాశము ఆవరణరహితమగు బ్రహ్మాండముగ కల్పింపబడినది.

చిదాకాశమజం శాంతం సర్వత్రైవహి సర్వదా
చిత్త్వాజ్జగదివాభాతి స్వయమేవాత్మనాత్మని. 12

ఈ చిదాకాశము సర్వత్ర, సర్వదా, జన్మరహితమును, శాంతమునునై వెలయుచున్నదని గ్రహింపుము. ఇదియే, చిత్తకల్పనవలన తనయందుతానే జగద్రూపమున ప్రకాశించుచున్నది.

యేన బుద్ధంతు తస్యైత దాకాశాదపి శూన్యకమ్
నబుద్ధం యేన తస్యైత ద్వజ్రసారాచలోపమమ్. 13

ఈ తత్త్వమును గ్రహించినవానికి ఈ జగత్తు ఆకాశముకంటె శూన్యమై కన్పట్టును. గ్రహింపని అజ్ఞునకు వజ్రమువలె దృఢమై కన్పట్టును.

గృహా ఏవ యథా స్వప్నే నగరం భాతి భాసురమ్
తథై తదసదేవాంత శ్చిద్ధాతౌ భాతి భాస్వరమ్. 14

స్వప్నమున నగరాదులు స్పష్టముగకన్పడునట్లు, చిత్పదార్థమున అసత్తఅగు ఈ సంసారము సత్తవలె ప్రతిభాసించుచున్నది.

యథామరౌ జలంబుద్ధం కటకత్వంచ హేమని
అసత్సదివ భాతీదం తథా దృశ్యత్వమాత్మని. 15

మరుభూమియందు జలజ్ఞానమును, సువర్ణమున కటకత్వజ్ఞానమును గలుగునట్లు, ఆత్మయందు ఈ దృశ్య సమూహములు అసత్తులయ్యు సత్తులవలె నగుపించుచున్నవి.

ఏవమాకథయంత్యౌ తే లలనే లలితాకృతీ
గృహాన్నిర్యయతుర్బాహ్యం చారుచంక్రమణక్రమైః. 16

లలితాకృతులగు ఆ లలన లిర్వురును వెనుక జెప్పినట్లు సంభాషించుకొనుచు మెల్లదిగ అడుగులు వైచుకొనుచు ఇంటిబయటకు వచ్చిరి.

అదృశ్యే గ్రామలోకేన ప్రేక్షమాణే పురోగిరిమ్
చుంబితాకాశకుహరం స్పృష్టాదిత్యస్యమండలమ్. 17

వారచ్చటివారి కగపడకుండనుండిరి. వారి ఎట్టయెదుట ఒక కొండయుండెను. అది ఆకాశమును భేదించి సూర్యమండలమును స్పర్శించుచున్నట్లుండెను.

నానావర్ణాఖిలోత్ఫుల్ల విచిత్రవననిర్మలమ్
నానానిర్ఝరనిర్హ్రాద కూజద్వనవిహంగమమ్. 18

ఆ పర్వతమునందున్న అడవి నానా వర్ణములును, వివిధములును, విచిత్రములునునగు వృక్షములతోడను, వికసించిన పుష్పములతోడను నిండి, నిర్మలమైయుండెను. నానా విధములగు పక్షులయొక్కయు, సెలయేళ్లయొక్కయు ధ్వనులు వినవచ్చుచుండెను.



విచిత్రమంజరీపుంజ పింజరాంబుదమండలమ్
స్వభ్రమచ్ఛగులుచ్ఛాగ్ర విశ్రాంతఖగసారసమ్. 19

విచిత్రములగు పుష్పమంజరులు మేఘమండలములవలె గన్పడుచుండెను; వాటిపైన సారస పక్షులు విశ్రమించుచుండెను.

సారవంజులవిస్తార గుప్తాఖిలసరిత్తటమ్.
అసమాప్తశిలాశ్వభ్ర లతావర్తనమారుతమ్. 20

అటనున్న లోయలలో వేతసలతలు దట్టముగా నల్లుకొనియుండుటవలన, గాలి కట్టుపడియుండెను.

పుష్పాగ్రపిహితాకాశ కోశకుడ్యకవారిదమ్
పతద్దీర్ఘసరిత్స్రోతః స్ఫురన్ముక్తాకలాపకమ్. 21

వికసిత పుష్పములతోఁగూడిన వృక్షపంక్తులు ఆకాశకోణముననున్న మేఘములను కప్పివేట్టుచుండెను. సెల ఏటి నీటిధారలు ఎత్తునుంచి పడుచుండెను. అప్పుడుచిందిన జలబిందువులు ముత్తెములవలె కన్పట్టుచుండెను.

చలద్వృక్షవనవ్యూహా వాతవేల్లిసరిత్తటమ్
నానావనాకులోపాంత చ్ఛాయానతతశీతలమ్. 22

నదుల గట్టులనున్న చెట్లు గాలిచే కదల్పబడుచుండెను. అటనున్న అడవులలో నీడ ఎల్లప్పుడును చల్లగనేయుండెను.

అథతే లలనే తత్ర తదా దదృశతుః స్వయమ్
తంగిరిగ్రామకం వ్యోమ్నః స్వర్గఖండమివచ్యుతమ్. 23

అనంతరము వారిద్దరును ఆకాశమునుండి పడిన స్వర్గభాగమువలెనున్న గిరిగ్రామమును దర్శించిరి.

రటత్త్వణాలీ పటలం పూర్ణపుష్కరిణీగణమ్
ద్విజైః కుచకుచైః కూజత్స్వాలీలాశ్వభ్రకచ్ఛకమ్. 24

ఆ గ్రామమునుండి గిలకలతో నీరుతోడు చప్పుడు వినఁగుచుండెను. అటనటనున్న చెఱువులు నీటితో నిండియుండెను. నీటపట్లున్న తావుల పక్షులు, 'కుచకుచ' ధ్వనులు వినవచ్చుచుండెను.

గచ్ఛద్గోవృందహుంకార కరాలాఖిలకుంజకమ్
కుంజగుల్మకఖండాఢ్యం సచ్ఛాయఘనశాద్వలమ్. 25

ఆలమందలు పోవుచు హుంకారధ్వని నొనర్చుచు, భయమును గలిగించుచుండెను. అచ్చటనున్న పొదలలో కొన్ని తావుల గుల్మములుండెను. మఱికొన్నిచోట్లు, యవధాన్యముతోఁగూడి పచ్చగ నగుపించుచుండెను.

దుష్ప్రవేశార్కకిరణం దృషన్నీహారధూసరమ్
ఉదగ్రమంజరీపుంజ జటాలంబిశిఖాంతరమ్. 26

ఆ అరణ్యమున కొన్నిచోట్ల, సూర్యకిరణములుగూడ ప్రవేశింపజాలకుండెను. కొన్నిచోట్ల, మంచు పడుటవలన, రాళ్లుగూడ పాలిపోయియుండెను. కొన్నికొన్ని చెట్లమీద పూల గుత్తులతోగూడిన తీగలు వ్రేలుచు, జడలవలె కన్పట్టుచుండెను.

శిలాకుహరవాఃస్ఫాల ప్రోచ్ఛలన్ముక్తనిర్ఝరైః
స్మారితాచలనిర్ధూత క్షీరోదకజలశ్రియమ్. 27

కొన్ని చోట్ల, రాతిగుంటలలో నీరుపడుచుండ చిందులు పైకిలేచి, ముత్యములవలె నగపడుచు, పాలసముద్రమును దరచునప్పుడు పైకిలేచిన బిందువులను గలపించుచుండెను.

ఫలమాల్యమహాభార భాసురై రజిరద్రుమైః
ఆనీయ పుష్పసంభారం తిష్ఠద్భిరివ సంకులమ్. 28

కొన్నికొన్ని తావుల ముంగిటనున్న చెట్లు పూలతోను, పండ్లతోను శోభిల్లుచు, పూల కానుకలను పట్టుకొనివచ్చి నిలుచుచుండినట్లుండెను.

తరత్తరంగఝాంకార కారిమారుతకంపితైః
కీర్ణపుష్పసమావృష్టం ద్రుమైరపి రసాకులైః. 29

తరంగములవలె ధ్వనించు వాయువువలన కదల్పబడిన వృక్షములుగూడ అర్థులకు పుష్పముల నొసంగుచున్నట్లుండెను.

అశంకితశిలాకూట స్రవదబ్బిందుటంకృతైః
కించిత్కృతరవంగుప్తై రశంకైః శంకితైః ఖగైః. 30

అచ్చట, సందేహము (భయము) నకు దావులేకున్నను, నిర్భయముగ గూర్చొనిన పక్షులు, కొండనుండిపడు నీటి సవ్వడినివిని, బాణపు చప్పుడని భ్రమసి ఎలుగిడు చుండెను.

ఉత్ఫాలలహరీశ్రాంత సీకరాస్వాదనాకులైః
నద్యాముడుపరావర్త వృత్తిభిర్విహగైర్వృతమ్. 31

కొన్నిచోట్ల, హంసలు నదీతరంగముల విశ్రమించుచు, నీటినిద్రావు తొందరలో ఒకచోటి నుండి మరొకచోట, నక్షత్రములవలె, వ్రాలుచుండెను.

ఉత్తాలతాలవిశ్రాంత కాకాలోకనశంకితైః
బాలైః ప్రగోపితామిక్షా ఖండం జీర్ణస్వభుక్తకైః. 32

చలిని దినదలచు పిల్లలు, తాటిచెట్లమీదనున్న కాకులను జూచి, అవి తన్నుకొని పోవునను భయముతో తమ చేతనున్న జున్ను ముక్కలను దాచుచుండిరి.

పుష్పశేఖరసంభార వసనగ్రామ బాలకమ్
ఖర్జూరనింబజంబీర గహనోపాంతశీతలమ్. 33

ఇంకొకచోట, పూలను శిరోభూషణములుగను, వస్త్రములుగను గట్టుకొని ఊరిపిల్లలు ఆడుకొనుచుండిరి. మఱియొకతావు, ఖర్జూర నింబజంబీరాది వృక్షము లుండుటవలన, చల్లగ నుండెను.



క్షౌమాగ్రహస్తాంబరయా మంజరీపూర్ణకర్ణయా
క్షుత్క్షీణయాక్రాంతరథ్యం గ్రామకేటకకాంతయా. 34

ఆ అడవిబాటల అధములును దరిద్రులును నీచులును నగువారి ఆడుబిడ్డలు పూలను చెవిలో నిడుకొని, మాసినబట్టల గట్టుకొని, ఆకలిమంట కాల్చుచుండ క్షుద్రకీటకములవలె, పడియుండిరి.

సరిత్తరంగసంఘట్ట సంరావాశ్రుతసంకథమ్
కర్మజాడ్యఘనత్రాస వాంఛితైకాంత సంస్థితమ్. 35

ఇంకొకతావున నదీతరంగ ధ్వనులు మిక్కుటముగ నుండుటవలన మాటలుగూడ వినరాకుండెను. ఇంకొకచోట, పనిపాటల నొనర్ప భయపడు సోమరులు ఒంటరిగ నుండిరి.

దధిలిప్తాస్యహస్తాంసైః స్నిగ్ధపుష్పలతాధరైః
నగ్నైర్గోమయపంకాంకై ర్బాలై రాకులచత్వరమ్. 36

ఇంకొకచోట, దిగంబరులగు పిల్లలు వంటినిండ పేడపూసుకొని, నోటికిని చేతులకును భుజములకును పెరుగు పట్టించుకొని, చక్కటి పువ్వులను, తీగెలను, గైకొని ముంగిట నాడుకొనుచుండిరి.

తీరశాద్వలవల్లీనాం దోలాందోలనకారిభిః
తరంగైర్వ్యాహ్యమానస్య లేఖికాంకితసైకతమ్. 37

ఇంకొకచోట నదీ తరంగములు తీరముననున్న తృణకణముల గదల్ప అవి ఇసుకమీద గీతలు గీయుచుండెను.

దధిక్షారఘనామోద మత్తమంథరమక్షికమ్
కామభుక్తార్థతోద్బాష్ప జర్జరాబలబాలకమ్. 38

ఇంకొకచోట, పాలు పెరుగుల వాసన తగుల, ఈగలు నెమ్మదిగ లేచుచుండెను. మరొకచోట, రోగపీడితులగు బాలుర అపథ్యభోజన మొనర్ప రోదించుచు కన్నీళ్లు కార్చుచుండిరి.

గోమయాసిక్తవలయ కరనారీకృతక్రుధమ్
ధమ్మిల్లవలనావ్యగ్ర త్రస్తస్త్రీవిహసజ్జనమ్. 39

మఱియొకచోట, పాచిపనుల నొనర్చుచుండ, చేతులు, చేతిగాజులు గోమయలిప్తములయిన యువతిని, జుట్టుముడివేసుకొని తొందరపడుచున్న రమణిని గాంచి, తోటివారు పరిహసించుచుండిరి.

దాంతపుష్పచ్ఛదోత్పన్న పతత్కుకుదవాయసమ్
గృహరథ్యాగణద్వార కీర్ణక్రూరకురంటకమ్. 40

ఋషులు, బలికర్మకై విడచిన అక్షతలను భుజింపవచ్చిన కొండకాకులను పూలతోడనో, ఆకులతోడనో తఱుముచుండిరి. ఇంటినుండి బయటకుపోవు త్రోవలందచ్చటచ్చట రక్కసపొదలు మొలచియుండెను.

గృహపార్శ్వస్థితశ్వభ్ర కుంజైః కుసుమితప్రభైః
ప్రత్యహంప్రాతరాగుల్ఫ మాకీర్ణకుసుమాజిరమ్. 41

కొన్నితావుల, గృహపార్శ్వముననున్న పూపొదలనుండి ప్రతిదినము పూలు రాలిపడు చుండుటవలన, అవి మడమయెత్తున పేరుకొనియుండెను.

చరచ్చమరసారంగ జాలజంగలఖండకమ్
గుంజానికుంజసంజాత శష్పసుప్తమృగార్భకమ్. 42

అరణ్యభాగముల చమరీమృగములును, లేళ్లును సంచరించుచుండెను. అచ్చట లతాకుంజములనున్న పచ్చికమీద లేడిపిల్లలు పరుండియుండెను.

ఏకాంతసుప్తవత్సైక కర్ణస్పందాస్తమక్షికం
గోష్ఠోచ్ఛిష్టీకృతదధిన్వసృక్కిస్పందిమక్షికం. 43

ఇంకొకచోట, పరుండిన ఆవుదూడలు చెవుల నూచుటవలన ఈగలు లేచిపోవుచుండెను. ఇంకొక తావున, గొల్లపిల్లలు మూతికంటుకొనియున్న పెరుగుమీద ఈగలు వ్రాలి జుమ్మని రొద చేయుచుండెను.

సమస్తసద్మసంక్షీణ మక్షికాక్షిప్తమక్షికమ్
ఫుల్లాశోకద్రుమోద్యాన కృతలాక్షికమందిరం. 44

మఱియొకచోట, యజమానులు తేనెపెట్టెలను తఱిమి తేనెపట్టులను ఇంటికి పట్టుకొని వచ్చుచుండిరి; ఇంకొకచోట, అశోక వృక్షోద్యానవనముల, లక్క ఇండ్లను వినోదార్థము నిర్మించుచుండిరి.

నీకరాసారమరుతా నిత్యార్ద్రి వికచద్రుమం
కదంబముకులప్రోత సమస్తచ్ఛాదనతృణమ్. 45

ఇంకొకచోట, విప్పారిన పూలతో నిండియున్న చెట్లు, నీటి బొట్లను గొనివచ్చు గాలివలన దడుపబడుచుండెను; ఇంటికప్పులు కడిమి మొగ్గలతో నలంకరింపబడి యుండెను.

ప్రతికృత్తలతాఫుల్ల కేతకోత్కరపాండురమ్
వహత్ప్రణాలపటలీ రణద్ఘురుఘురారవమ్. 46

ప్రతి బంధకములగు లతలను కొట్టివేయుటవలన, మొగలిపొద వికసించి, పాండురమై యుండెను. ఇంకొకచోట, కాలువలలో నీరుపారుచు చప్పుడు చేయుచుండెను.

వాతాయనగుహానిర్యత్ సౌధవిశ్రాంతవారిదమ్
పూర్ణపుష్కరిణీపంక్తి పూర్ణరాజగృహోత్తరమ్. 47

సౌధముల విశ్రమించుచున్న మేఘములు కిటికీల నుండి వెలువడుచుండెను. నీటితో నిండిన చెఱువులలో తామరపువ్వులు ఒత్తుగ వికసించి, నిండుచందురునివలె నగపడుచుండెను.

నీరంధ్రవిటపిచ్ఛాయా శీతలామలశాద్వలం
సర్వాశాప్రాగ్రవార్బిందు ప్రతిబింబిత తారకం. 48

దట్టములగు చెట్లనీడలనున్న పచ్చికబయళ్లు చల్లగనుండెను. పచ్చికమీద నీటిబొట్లుపడి నక్షత్రములవలె నగుపించుచుండెను.



అనారతపతత్ఫుల్ల హిమవర్షసితాలయం
విచిత్రమంజరీపుష్ప పత్రసత్ఫలపాదపం. 49

ఎడతెగకుండ పువ్వులును, మంచుబొట్లును పడుచుండుటవలన సౌధములన్నియు శుక్ల వర్ణమును దాల్చెను. కొన్నిచోట్ల, చెట్లమీద విచిత్రములగు పూలగుత్తులును, ఫలములును వ్రేలుచుండెను.

గృహాకక్ష్యాంతరాలీన మేఘసుప్తచిరంటికం
సౌధస్థమేఘవిద్యుద్భి రనాదేయప్రదీపకం. 50

సువాసినులు ఇంటిమీద వ్రాలిన మేఘములశయనించియుండిరి. అటనున్న మేఘముల మెఱుపులు నిరంతరము వెలయుచుండుటవలన, దీపముల అవసరము లేకుండెను.

కందరానిలభాంకార ఘనఘుంఘుమమండపం
చరచ్చకోరహారీత హారిణీహారిమందిరం. 51

ఇంకొకచోట, పర్వతగుహలను ప్రవేశించువాయుధ్వని, ప్రతిధ్వనితమగుచుండెను. చకోరములు, చిలుకలు, లేళ్లు, తిరుగుచుండుటవలన ఇళ్లు మనోహరములై కన్పడుచుండెను.

ఉన్నిద్రకందలోద్భ్రాంత మాంసలామోదమంథరైః
మరుద్భిర్మందమాయాతు మార్ద్రైర్లోలపల్లవమ్. 52

ఇంకొకచోట, వాయువు వికసించిన కందళీపుష్పసౌరభమును గొనివచ్చి, చిగుళ్లను చలింపజేయుచుండెను.

లావకాలాప లీలాయా మాలీసలలనాగణం
కోకకోకిలకాకోల కోలాహలసమాకులమ్. 53

ఇంకొకతావున లలనలు, చిలుకలు గోరువంకలు మొదలైన పక్షులపల్కుల వినుచుండిరి. ఇంకొకచోట, కాకులు కోకిలలు కోలాహల మొనర్చుచుండెను.

తాలతాలతమాలాబ్జనీలతత్ఫలమాలినమ్
వల్లీవలయవిన్యాస విలాసవలితద్రుమమ్. 54

ఇంకొకచోట, ఫలయుక్తములగు తాలతమాలసాలనీప వృక్షములుండెను; మఱియొకచోట మనోహరముగ లతలు చెట్లను జుట్టుకొనియుండెను.

ఆలోలపల్లవలతావలితాయనానా
ముత్ఫుల్లకందలశిలీంధ్రసుగంధితానామ్
తాలీతమాలదలతాండవమండపానా
మారామఫుల్లకుసుమద్రుమశీతలానామ్. 55

మఱియొకచోట, కదలెడుతీగలతో దారి అరికట్టబడి యుండెను. ఇంకొకచోట, వికసించిన కందళీపుష్పములతోడను, నేలతాడిపువ్వులతోడను సురభిళమైయుండెను. ఇంకొకచోట ఇండ్లు తాళ, తమాలపత్రములతో గట్టబడియుండెను. [illegible] పుష్పద్రుమములతో చల్లగనుండెను.

సారావవారిచలనాకులగోకులానా
మానీలసస్యకుసుమస్థలశోభితానామ్
తీరద్రుమప్రకరగుప్త సరిద్రయాణాం
నీరంధ్రపుష్పితలతాగ్రవితానకానామ్. 56

ఇంకొకచోట, ఆవులు 'అంబా' యని అరచుచు నీటినుండిలేచి వచ్చుచుండెను. ఇంకొక తావు, నీలిపువ్వులతోడను, సస్యములతోడను శోభిల్లుచుండెను. గట్టుననున్న చెట్లవలన నదీప్రవాహ మొక్కొక్కపట్ల అడ్డగింపబడుచుండెను. ఇంకొకచోట, పుష్పములు దట్టముగ వికసించి వితానము (చాందినీ) వలె నగుపడుచుండెను.

ఉద్యానకుందమకరంద సుగంధితానాం
గంధాంధషట్పదకులాంతరితాంబుజానామ్
సౌందర్యతర్జితపురందరమందిరాణాం
రాజీవరాజిరజసారుణితాంబరాణామ్. 57

ఇంకొకచోట, ఉద్యానవనములు కుందపుష్ప మధురసౌరభముతో నిండియుండెను. తుమ్మెదల వాసనవలన మత్తెక్కి పద్మములను గప్పిపుచ్చుచుండెను. ఇంకొకతావుననున్న సౌధముల ముందర ఇంద్రపురిగూడ పరాజితమగుచుండెను. మఱియొకతావున ఆకాశము పద్మరజముతో నెఱ్ఱబడియుండెను.

రంహోవహద్గిరినదీరవఘుర్ఘురాణాం
కుందావదాతజలసద్ద్యుతిభాసురాణామ్
సౌధస్థితోల్లసితఫుల్లలతాలయానాం
లీలావలోలకలకంఠవిహంగమానామ్. 58

ఇంకొకతావు, వేగముగపారెడు సెలయేళ్ల ఘుర్ఘురధ్వనులతో నిండియుండెను. ఇంకొక చోటు తెల్లటి మొయిళ్లతో నిండియుండెను. ఇంకొకచక్కి, సౌధముల వికసితపుష్పములతోగూడిన లతాగృహములుండెను. ఇంకొకచోట పక్షులు లీలగా మధురస్వరమున బాడుకొనుచుండెను.

ఉల్లాసికౌసుమదలాస్తరణస్థయూనా
మాపాదమావలితమాల్యవిలాసినీనామ్
సర్వర్తుసుందరనవాంకురదంతురాణాం
శోభోల్లసద్వరలతాకులమార్గణానామ్. 59

ఇంకొకచోట, వికసితపుష్పశయ్యల యువకులు పరుండియుండిరి. యువతులు పాదముల వఱకు ప్రేలు మాలలను ధరించియుండిరి. చాలచోట్ల, చక్కటి పచ్చిక మొలచియుండెను.

సంజాతకోమలలతోత్పలసంకులానాం
తిష్ఠత్ప్రమోదపటసంవలితాలయానామ్
నీహారహారహరితస్థలవిశ్రుతానాం
సౌధస్థమేఘతడిదాకులితాంగనానామ్. 60



ఇంకొకచోట, కలువతీగెలు దట్టముగ నల్లుకొనియుండెను. ఇండ్లలో మేఘములు పట ములవలె నుండెను. మఱియొకచోట పచ్చికలు నీహారహారమును ధరించియుండెను. మఱియొకతావున, అంగనలు గృహములనున్న మేఘముల మెఱుపులనుగాంచి, ఉలిక్కిపడుచుండిరి.

నీలోత్పలోల్లసితసౌరభసుందరాణాం
హుంకారహారిహరితోన్ముఖగోకులానామ్
విశ్రబ్ధముగ్ధమృగసారగృహాజిరాణా
మున్నృత్యబర్హిఘనసీకరనిర్ఝరాణామ్. 61

ఇంకొకతావు, నీలోత్పలముల నెత్తావివలన చక్కగనుండెను. ఇంకొకచోట, ఆల మందలు హుంకారము సల్పుచు పచ్చిక మేసవబోవుచుండెను. సెలయేళ్ల నీటిబొట్లు పడ, నెమళ్లు వర్షమనుకొని నృత్యము సల్పుచుండెను. ఇంటిముంగిట, లేళ్లు ఎట్టి బెదురునులేక పరుండియుండెను.

సౌగంధ్యమత్తపవనాహతవిల్లవానాం
వప్రౌషధిజ్వలనవిస్మృతదీపకానామ్
కోలాహలాకులకులాయకులాకులానాం
కుల్యాకులాకలకలాశ్రుతసంకథానామ్. 62

సుగంధవాయువు ప్రవహించుచు శ్రమను బోగొట్టుచుండెను. గోడలమీద జ్యోతిర్లత లుండుటవలన దీపముల అవసరములేకుండెను. పక్షులగూళ్లు కోలాహలముతో నిండియుండెను. సెలయేళ్ల నీటిసవ్వడివలన ఇతరుల పల్కులు వినరాకుండెను.

ముక్తాఫలప్రకరసుందరబిందుపాత
శీతాఖిలద్రుమలతాతృణపల్లవానామ్
లక్ష్మీమనస్తమిత పుష్పవికాసభాజాం
శక్నోతి కః కలయితుం గిరిమందిరాణామ్. 63

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే ఉత్పత్తిప్రకరణే
గిరిగ్రామ వర్ణనం నామాష్టావింశః సర్గః ॥ 28 ॥

అచ్చటచ్చట ముత్యములబోలు మంచుబొట్లు పడుచుండుటవలన, వృక్షములు, లతలు, తృణములు, పల్లవములు చల్లనైయుండెను. వృక్షములు నెల్లప్పుడు వికసించిన పుష్పము లుండుటవలన వాటిశోభ తరగకుండెను. ఇట్టివగు ఆ గిరిగ్రామగృహముల శోభను వర్ణింప నేరితరము? (వర్ణింప శక్యముగాదనుట.)

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు, ఉత్పత్తిప్రకరణమున
లీలోపాఖ్యానమున గిరిగ్రామవర్ణనమను అష్టావింశ సర్గము ॥ 28 ॥



## ఏకోనత్రింశః సర్గః.

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

తత్రతే పేతతుర్దేవ్యౌ గ్రామేఽంతఃశీతలాత్మని
భోగమోక్షశ్రియా శాంతే పుంసీవ విదితాత్మని. 1

వసిష్ఠుడు:— శాంత్యాది సాధనసంపన్నుడును, ఆత్మతత్త్వజ్ఞుడునునగు పురుషుని భోగమోక్షములు సమీపించునట్లు, ఆ దేవత లిద్దరును ఆ గ్రామమును ప్రవేశించిరి. అది చల్లగనుండెను.

కాలేనై తావతా లీలా తేనాభ్యాసేన సాభవత్
శుద్ధజ్ఞానైకదేహత్వాత్త్రికాలామలదర్శినీ. 2

లీలాదేవి అభ్యాసబలముననే జ్ఞానమయదేహమును దాల్చి భూతభవిష్యద్వర్తమానకాల విషయములను గ్రహింపగల్గెను.

అథ సస్మార సర్వాస్తాః ప్రాక్తనీః సంసృతేర్గతీః
సా స్వయంస్వరసేనైవ ప్రాగ్జన్మమరణాదికాః. 3

అందువలననే ఆమె పూర్వజన్మలయొక్కయు, మరణములయొక్కయు, సంసారముయొక్కయు గతిని అనాయాసముగ తెలిసికొనగల్గెను.

లీలోవాచ:—

దేవి దేశమిమం దృష్ట్వా త్వత్ప్రసాదాత్స్మరామ్యహమ్
ఇహ తత్ప్రాక్తనం సర్వం చేష్టితం చేష్టితాంతరమ్. 4

లీల:— దేవీ! నేను నీ అనుగ్రహమువలననే ఈ దేశమును గాంచి పూర్వజన్మలను కర్మలను స్మరింపగలుగుచున్నాను.

ఇహాభూవమహం జీర్ణా శిరాలాంగీ కృశాసితా
బ్రాహ్మణీ శుష్కదర్భాగ్రభేదరూక్షకరోదరా. 5

నేను పూర్వ మిచ్చోటనే బ్రాహ్మణినై జన్మించియుంటిని. నా శరీరము జీర్ణమును, శీర్ణమును, మలినమును, శుష్కమునునై యుండెను. ఎండిన దర్భలను చీల్చుటవలన నా అరచేయి మోటువారెను.

భర్తుః కులకరీ భార్యా దోహమంథానశాలినీ
మాతా సకలపుత్రాణామతిథీనాం ప్రియంకరీ. 6

నేను కవ్వముతో పెరుగు తరచుచుండెడుదానిని. భర్తయొక్క వంశమును పెంపొందజేసితిని. పెక్కుమంది పుత్రులు నాకుండిరి. అతిథులను సేవించి వారికి ప్రీతినిగూర్చితిని.

దేవద్విజసతాం భక్తా సిక్తాంగీ ఘృతగోరసైః
భర్జనీ చరుకుంభాది భాండోపస్కరశోధినీ. 7

దేవతలను, ద్విజులను, సాధువులను భక్తితో జూచుచుంటిని. పాలు, నెయ్యి నావొంటి కంటుకొనియుండెడివి. భర్జనపాత్ర, చరుస్థాలి, కుంభము మొదలగు గృహోపకరణములను శుభ్రపరచుచుండెడుదానిని.



నిత్యమన్నలవాక్త్రైక కాచకంబుప్రకోష్ఠకా
జామాతృదుహితృభ్రాతృ పితృమాతృప్రపూజనీ. 8

చేతికి ఒకే గాజును, (పెక్కులున్న ఒకదానితో మఱొకటి, పనిచేయునప్పుడు, తగిలి చిట్లిపోవునను భయమున) తొడగుకొంటిని; దానికి ఎల్లప్పుడును (అన్నప్రదాన మొనర్చుచుండుటవలన) మెతుకంటుకొని యుండెడివి. నేను కూతురు, అల్లుడు, తమ్ముడు, తల్లిదండ్రులు మొదలగు బంధుగులను సేవించుచుంటిని.

ఆదేహం సద్మభృత్త్యైవ ప్రక్షీణదినయామినీ
వాచం చిరంచిరమితి వాదిన్యనిశమాకులా. 9

దేహమున్నంతవఱకు పనిపాటలతో రాత్రింబవళ్లు గడపితిని. పని తొందరగ ముగియవలెనను ఉద్దేశముతో, 'త్వరగా త్వరగా' అని దాసీలను మందలించుచుంటిని.

కాహం కఇవ సంసార ఇతి స్వప్నేఽప్యసంకథా
జాయా శ్రోత్రియమూఢస్య తాదృశస్యైవ దుర్ధియః. 10

ఛాందసుడును, మలినబుద్ధియునగు నా భర్త నావలెనే పనులలో మునిగి తేలుచుండెడువాడు. 'మేమెవరము? — ఈ సంసారమేమి?' అను ప్రశ్నలే మాకు కలలోనైన తట్టలేదు.

ఏకనిష్ఠా సమిచ్ఛాక గోమయేంధనసంచయే
మ్లానకంబలసంవీత శిరాలకృశగాత్రికా. 11

నా శరీరము శుష్కించి ఎముకలు బయటపడెను; దీనిని కప్పిఉంచ కంబళమును గప్పుకొనియుంటిని. సమిధలను, కూరలను, కట్టెలను, గోమయమును జాగ్రత్తతో సంగ్రహించుచుంటిని.

తర్ణకీకర్ణజాహస్థ కృమినిష్కాసతత్పరా
గృహశాకాయనానేక సత్వరాహూతకర్షరా. 12

ఒకొక్కప్పుడు ఆవుదూడల చెవులలోనున్న పురుగులను తొలగించుచుంటిని. మఱొకప్పుడు ఆకుకూర మళ్లకు నీరుకట్ట, సేవకులను బిల్చుచుంటిని.

నీలనీరతరంగాంత తృణతర్పితతర్ణకా
ప్రతిక్షణం గృహద్వార కృతలేపనవర్ణకా. 13

నదులగట్టుననున్న పచ్చికను దూడలకు బెట్టెడుదానిని. ప్రతిక్షణము గడపలకు పట్లుపెట్టి ముగ్గుతో నలంకరించుచుంటిని.

నీత్యర్థం గృహభృత్యానామాదీనకృతవాచ్యతా
మర్యాదానియమాదబ్ధే ర్వేలేవానిశమచ్యుతా. 14

నేను నా మర్యాదను, సద్రమువలె, దాటక, భృత్యులు చెడ్డపనులొనర్చిన వారిని శిక్షించుచుంటిని.

జీర్ణపర్ణసవర్ణైక కర్ణదోలాధిరూఢయా
కాష్ఠతాడ్యజరాభీత జీవవృత్త్యైవ చిహ్నితా. 15

ఇట్లు కొంతకాలముగడువ నా శరీరము ఎండుటాకువలె నయ్యెను. వృద్ధాప్యమున తలవణుకసాగెను; చెవులు ఉయ్యాలలవలె కదలుచుండెను, కఱ్ఱ చేతఁగొనినవానిచే దణ్డింపబడినవానివలె, వార్ధక్యముచే తఱుమబడి భయమునందితిని. క్రమముగ వార్ధక్యచిహ్నములు పొడసూపసాగెను.

ఇత్యుక్త్వాసంచరంతీ సా శిఖరిగ్రామకోటరే
సంచరంత్యాః సరస్వత్యా దర్శయామాస సస్మయమ్. 16

శ్రీ వసిష్ఠుడు:— ఓ రామచంద్రా! లీలాదేవి ఇట్లు సంభాషించుచు, గిరిగ్రామమున దిరుగాడుచు, సరస్వతీదేవికి విస్మయముతో నటనున్న వస్తువులనన్నిటిని జూపదొడగెను:—

ఇయంమే పాటలాఖండ మండితాపుష్పవాటికా
ఇయంమే పుష్పితోద్యాన మండపాశోకవాటికా. 17

ఇయ్యది పుష్పవనము; ఇందు పాటలవృక్షములున్నవి. ఇయ్యది పుష్పితములగు అశోకములతోగూడిన ఉద్యానమండపము.

ఇయంపుష్కరిణీతీర ద్రుమాఽగ్రంథితతర్ణకా
ఇయం సా కర్ణికానామ్నీ తర్ణికాముక్తపర్ణికా. 18

ఇదిగో, ఈ చెఱువుగట్టుననున్న చెట్టుకు గట్టబడిన ఈ ఆవుదూడ ఇప్పుడే పుట్టినది. ఈ కన్పడు ఆవుదూడపేరు 'కర్ణిక'; ఇయ్యది నా వియోగ దుఃఖమును సహింపజాలకున్నది.

ఇయం సా మేఽలసాకీర్ణా వరాకీ జలహారికా
అద్యాష్టమం దినంబాష్పక్లిన్నాక్షీపరిరోదితి. 19

ఈ నా పరిచారిక, నా వియోగదుఃఖమున పనియనిన అశ్రద్ధవహించినది. ధూళిధూసరాంగియై, ఎనిమిదిరోజులనుండి కన్నీళ్లుగార్చుచున్నది.

ఇహ దేవి మయాభుక్త మిహాశయితమిహాస్థితం
ఇహాసుప్తమిహాపీత మిహాదత్తమిహాహృతం. 20

దేవీ! ఇచ్చట నేను భుజించెడు దానిని, ఈ తావున గూర్చుండెడుదానిని, ఇచ్చట నుండెడుదానిని, ఇచ్చట నిద్రించెడుదానిని, ఇట నీరుద్రాగెడుదానిని, ఈ ప్రదేశమున వస్తువులను సమగూర్చియుంచెడు దానిని.

ఏష మేజ్యేష్ఠశర్మాఖ్యః పుత్రో రోదితి మందిరే
ఏషా మే జంగలే ధేను ర్దోగ్ధ్రీ చరతి శాద్వలం. 21

ఇదిగో, నాపుత్రుడీ భవనమున రోదనమొనర్చుచున్నాడు; ఇతనిపేరు జ్యేష్ఠశర్మ. ఈ వనమున నా పాడిఆవు తిరుగాడుచున్నది.

గృహే వసంతదాహాయ రూక్షతారవిధూసరం
స్వదేహాకువపంచాతం పశ్యేమం ప్రఘణం మమ. 22



ఇయ్యది నా గృహద్వారము. ఇది గవాక్షపంచకముతోగూడి పంచేంద్రియయుతమగు నా శరీరమువలెనున్నది. ఇది నాకు మిక్కుటమగు ప్రీతి నొసంగెడిది. గాని, ఇప్పుడు ఎండవేడికి కాగి, చవుడుబారినది.

తుంబీలతాభిరుగ్రాభిః పుష్టాభిరివ వేష్టితం
మహానసస్థానమిదం మమ దేహామివాపరమ్. 23

ఇది వంటఇల్లు; దీనిని నా అపరశరీరమని చెప్పవచ్చును. దీనిమీద, నే పెంచిన ఆనపపాదు లావుబారిన తీగెలతో నలముకొనియున్నది.

ఏతేరోదనతామ్రాక్షా బంధవోభువిబంధనమ్
అంగదార్పితరుద్రాక్షా ఆహారంత్యనలేంధనమ్. 24

నా బందుగులు తమ శరీరములనున్న ఆభరణములను త్యజించి, రుద్రాక్షలను ధరించినారు. వారికన్నులు, నిరంతరరోదనమున ఎఱ్ఱబడినవి.

అనారతం శిలాశచ్ఛే గుచ్ఛాచ్ఛోటనకారిభిః
తరంగైః స్థగితాకారం స్పృష్టతీరలతాదలైః. 25
సీకరాకీర్ణపర్యంత శాద్వలస్థలసల్లతైః
శిలాఫలహకాస్ఫాల ఫేనిలోత్పలసీకరైః. 26
తుషారీకృతమధ్యాహ్న దివాకరకరోత్కరైః
ఫుల్లపుష్పోత్కరాసార ప్రణాదోత్కటద్రుమైః. 27
విద్రుమైరివసంక్రాంత ఫుల్లకింశుకకాంతిభిః
వ్యాప్తయా పుష్పరాశీనాం సముల్లాసనకారిభిః. 28
ఉహ్యమానఫలాపూర సువ్యగ్రగ్రామబాలయా
మహాకలకలావర్త మత్తయా గ్రామకుల్యయా. 29
వేష్టిత స్తరలాస్ఫాల జలధౌతతలోపలః
ఘనపత్రతరుచ్ఛన్న చ్ఛాయాసతతశీతలః. 30
అయమాలక్ష్యతేఫుల్ల లతావలనసుందరః
దలద్గులుచ్ఛకాచ్ఛన్న గవాక్షో గృహమండపః. 31

ఇయ్యది నదీపరివేష్టితమగు గృహమండపము. ఈ నది గట్టుననున్న చెట్లకొమ్మలు వంగియుండుటవలన, తరంగములు వాని నూపుచున్నవి. ఒక్కొక్కప్పుడివి తీరభూమిని స్పర్శించుచున్నవి. ఈ వృక్షశాఖలవలనను, నదీజలములవలనను, మధ్యాహ్న సూర్యకిరణములుగూడ చల్లబడినవి. పూలుపూచియున్న చెట్లు, భ్రమరగీతముల విని కుతూహలములైయున్నట్లు నిలబడియున్నది. కింశుకపుష్పములు వికసించి పొగడములవలె నగపడుచున్నతావు చాలరమ్యమై నెగడుచున్నది. లతలమీద నీటిబొట్లు నిలబడియున్నవి. అలలు రాళ్లకు దగల నురుగు లేచుచున్నది; దీనినుండి కలువల తీవితోగూడిన తుంపురులు బయటకువచ్చుచున్నవి. నదీప్రవాహమున తేలుచుపోవుచున్న ఆమ్రాదిఫలములకైకొన ఊరిపిల్లలు తొందరపడుచున్నారు. ఈ నదియందు పెద్దతరంగములు లేచుచు భయమును గొల్పు

చున్నవి. గట్టునసున్న రాళ్లే అలలచే గడుగబడి శుభ్రముగనున్నవి. గృహమండపము అతని జొంపముల తోగూడిన చెట్లు ఇటనట నుండుటవలన, చల్లగనున్నది. ఈ మండపమున పుష్పలతలుగూడనున్నవి. గవాక్షముల వికసితపుష్పములును, పళ్లగుత్తులును వ్రేలుచున్నవి.

అత్ర మే సంస్థితో భర్తా జీవాకాశతయాకృతిః
చతుస్సముద్రపర్యంత మేఖలాయాః భువఃపతిః. 32

ఈ గృహమంటపమున నాభర్త జీవాకాశరూపమున వెలయుచున్నాడు. అతడు నిష్క్రియుడైనను, నాల్గుసముద్రములను మొలనూలుధరించిన భూమికాధిపత్యమును వహించుచున్నాడు.

అస్మృతంపూర్వమేతేన కిలాసీదభివాంఛితమ్
శీఘ్రంస్యామేవరాజేతి తీవ్రసంవేగధర్మిణా. 33

'పూర్వమితడు రాజునగుదునని వాంఛించియున్నాడు' అని నాకు గుర్తునకుదగులుచున్నది.

దినైరష్టభిరేవాసౌ తేన రాజ్యం సమృద్ధిమత్
చిరకాలప్రత్యయదం ప్రాప్తవాన్ పరమేశ్వరి. 34

పరమేశ్వరీ! ఆ వాంఛాబలమున నే ఎనిమిదిరోజులలో అభిలషితమును, సమృద్ధమునునగు రాజ్యమును బొందినాడు.

అత్రాసౌ భర్తృజీవో మే స్థితో వ్యోమ్ని గృహే స్వవః
అదృశ్యః ఖే యథా వాయు రామోదో వానిలే యథా. 35

ఆకాశమున వాయువు, వాయువున సౌరభము అదృశ్యములై వెలయునట్లు, నా భర్త రాజయ్యు ఈ గృహాకాశమండపమున నే వెలయుచున్నాడు.

ఇహైవాంగుష్ఠమాత్రాంతే తద్వ్యోమ్న్యేవ పదంస్థితమ్
మద్భర్తృరాజ్యం సమవగతం యోజనకోటిభాక్. 36

అంగుష్ఠమాత్రపరిమితమగు ఈ గృహాకాశదేశమున నే నాభర్త ఏలెడు రాజ్యమున్నది. కాని; భ్రాంతివలనయ్యదియే కోటియోజనములు వ్యాపించియున్నట్లగపడుచున్నది.

ఆవాం ఖమేవ ఖస్థంచ భర్తృరాజ్యం మమేశ్వరి
[illegible]ర్ణం సహస్రైః శైలానాం మహామాయేయమాతతా. 37

[illegible]శ్వరీ! మేమిద్దరము ఆకాశస్వరూపులమే; నాభర్త పాలించెడు రాజ్యముగూడ ఆకాశమాత్రమే[illegible] కాని, ఇయ్యది, మా మహిమవలన వేలకొలది పర్వతములతో నిండియున్న[illegible]

[illegible]దేవిభర్తృనగరం పునర్గంతుం మమేప్సితమ్
[illegible]హి తత్రగచ్ఛావః కిందూరం వ్యవసాయినామ్. 38

దేవి! నాభర్తయొక్క రాజ్యముగాంచ మరల నాకు కోర్కెగలుగుచున్నది. కనుకరమ్ము, మనమరుగుదము. ప్రయత్న[illegible]



శ్రీ వసిష్ఠ ఉవాచః—

ఇత్యుక్త్వాప్రణతాదేవీం సాప్రవిశ్యాశుమండపం
విహంగీవ తయా సాకం పుప్లువే సినిభం నభః. 39

వసిష్ఠుడు:— లీల ఇట్లుపల్కి, దేవికి నమస్కరించి, ఆ మంటపమును తొందరగ ప్రవేశించి, పదునైనకత్తివలె స్వచ్ఛమగు ఆకాశమండలమున, పక్షివలె దేవితోగూడి ఎగసెను.

భిన్నాంజనచయప్రఖ్యం సౌమ్యైకార్ణవసుందరం
నారాయణాంగసదృశం భృంగపృష్ఠామలచ్ఛవి. 40
మేఘమార్గమతిక్రమ్య వాతస్కంధావనిం తథా
సౌరమార్గమథాక్రమ్య చంద్రమార్గమతీత్యచ. 41
ధ్రువమార్గోత్తరంగత్వా సాధ్యానాంమార్గమేత్యచ
సిద్ధానాంసమతీత్యోర్వీ ముల్లంఘ్యస్వర్గమండలమ్. 42
బ్రహ్మలోకోత్తరంగత్వా తుషితానాంచమండలం
గోలోకం శివలోకంచ పితృలోకమతీత్యచ. 43
విదేహానాం సదేహానాం లోకాను త్తీర్యదూరగమ్
దూరాద్దూరమధోగత్వా కించిద్బుద్ధ్వా బభూవ సా. 44
పశ్చాదాలోకయామాస సమతీతం నభస్థలమ్
యావన్నకించిచ్చంద్రార్కతారాద్యాలక్ష్యతే హ్యధః. 45
తమస్తిమితగంభీరమాశాకుహరపూరకమ్
ఏకార్ణవోదరప్రఖ్యం శిలోదరఘనస్థితమ్. 46

పిదప, పలుచని కాటుకవలెను, నారాయణుని శరీరమువలెను, భ్రమరపుచ్ఛమువలెను నల్లనివగు మేఘములను భేదించి, మేఘమార్గమునుదాటిరి. ఆ మేఘమండలము కదలికలేని సముద్రమువలె నుండెను. పిదప వారు వాయుపథమును, సూర్యచంద్రమార్గములను, ధ్రువలోకమును, సాధ్యలోకమును, సిద్ధలోకమును, భూమిని, స్వర్గమును, బ్రహ్మలోకమును క్రమముగ నతిక్రమించిరి. అటునుండి నిత్యసంతుష్టులగు జనులుండు వైకుంఠమునకేగిరి. అటనుండి శివలోక, పితృలోకముల కతిగిరి. పిమ్మట, విదేహులును, సదేహులునునగు (శివసారూప్యముక్తులు) వారుండు లోకములనుగూడ దాటిరి. ఇట్లు, దూరదూరప్రదేశముల కఱుగుచుండ లీల తన అపరిచ్ఛిన్నస్వరూపమును విస్మరించెను. అప్పుడు వెనుదిరిగిచూడ ఆపెకు, చంద్రసూర్యతారాది గ్రహములగుపడలేదు. రాతిగుండెవలె అభేద్యమగు చీకటి కనబడెను. అయ్యది నలుదిక్కులు వ్యాపించియుండెను.

లీలోవాచః—

తద్దేవిభాస్కరాదీనాం క్వాథస్తేజో గతం వద
శిలాజఠరనిష్పందం ముష్టిగ్రాహ్యం తమఃకుతః. 47

లీల:— దేవీ! సూర్యచంద్రాదుల తేజ మెచ్చటికిబోయినది? రాతిగుండెవలె చలింపనిదియు పిడికిలితో బట్టుకొనదగునదియునగు ఈ అంధకార మెచ్చటినుండి వచ్చినది?

శ్రీదేవ్యువాచ:—

ఏతావతీమిమాం వ్యోమ్నః పదవీమాగతాసి భోః
అర్కాదీన్యపి తేజాంసి యతోఽదృశ్యాంతఏవ నో. 48
యథామహాంధకూపాధః ఖద్యోతో నావలోక్యతే
పృష్ఠగేన తథేహాతో నాధఃసూర్యోఽవలోక్యతే. 49

శ్రీ దేవి:- బిడ్డా! సూర్యచంద్రాదులు కాంతి చొరవీలులేనంతటి దవ్వునకు మన మరుదెంచినాము; అందువలననే అవి మనకగపడకున్నవి. లోతగు నూతిలోనున్న మిణుగుఫురుగగపడనట్లు వారికవి అగపడవు.

లీలోవాచ:—

అహోను పదవీందూర మావామేతాముపాగతే
సూర్యోప్యధోఽణుకణవ న్న మనాగపి లక్ష్యతే. 50
ఇతఉత్తరమన్యాస్యా త్పదవీ కానుకీదృశీ
కథంచ మాతరేతవ్యా కథ్యతామితి దేవి మే. 51

లీల:- సూర్యుడణువువలె మనకగపడనంతదూరమునకు వచ్చితిమా? ఆశ్చర్యము! మాతా! ఇక మనమరుగవలసిన దారి ఎట్టిదిః ఎట్లరుగవలెను? దేవీ! వచింపుము.

శ్రీ దేవ్యువాచ:—

ఇత ఉత్తరమగ్రే తే బ్రహ్మాండపుటకర్పరమ్
యస్యచంద్రోదయోనామ ధూలిలేశాః సముత్థితాః. 52

శ్రీ దేవి:- నీకుముందర బ్రహ్మాండకర్పర మగుపడబోవుచున్నది. సూర్యచంద్రాదులిందుండి లేచిన ధూళికణములు.

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

ఇతిప్రకథయంత్యౌ తే ప్రాప్తే బ్రహ్మాండకర్పరమ్
భ్రమర్యావివశైలస్య కుడ్యం నిబిడమండపమ్. 53
అక్లేశేనైవ తే తస్మా న్నిర్గతే గగనాదివ
నిశ్చయస్థంహియద్వస్తు తద్వజ్రగురు నేతరత్ 54
నిరావరణవిజ్ఞానా సా దదర్శ తత స్తతమ్
జలాద్యావరణంపారే బ్రహ్మాండస్యాతిభాసురమ్. 55
బ్రహ్మాండాద్దశగుణత స్తోయం తత్ర వ్యవస్థితం
అస్థితం వేష్టయిత్వాతు త్వగివాక్షోటపృష్ఠగా. 56
తస్మాద్దశగుణోవహ్ని స్తస్మాద్దశగుణోఽనిలః
తతో దశగుణం వ్యోమ తతఃపరమమంబరమ్. 57
తస్మిన్పరమకే వ్యోమ్ని మధ్యాద్యంతవికల్పనాః
నకాశ్చన సముద్యంతి వంధ్యాపుత్రకథా ఇవ. 58



కేవలం వితతంశాంతం తదనాదిగతభ్రమం
ఆద్యంతమధ్యరహితం మహాత్యాత్మని తిష్ఠతి. 59

వసిష్ఠుడు:— ఇట్లు మాటలాడుకొనుచు, తుమ్మెదలజంట కొండగోడను సమీపించునట్లు వారు బ్రహ్మాండమండపమును చేరుకొనిరి. దానిని వారు శూన్యప్రదేశమును దాటునట్లు దాటిరి. సత్యబుద్ధియున్నవస్తువే వజ్రమువలె కఠినమైనట్లు అగుపడును. శుద్ధచిత్తలగు ఆ లలనను బ్రహ్మాండమునకు వెలుపలి, గోడవలెనున్న నీటిని గాంచిరి. అది అత్యంతమనోహరమై యుండెను. ఆ నీరు బ్రహ్మాండముకంటె పదిరెట్లెక్కుడుగనుండి, అక్షోట బీజమును చర్మమావరించుకొని యుండునట్లు, దానిని ఆవరించియుండెను. పిదప వారు పదిరెట్లెక్కుడుగనున్న అగ్నిని, వాయువును, చిదాకాశమును గాంచిరి. దానియందు ఆదిమధ్యాంతములు, వంధ్యాపుత్రకల్పనవలె, అలీకములు. అయ్యది విశాలమును, శాంతమును, ఆదిమధ్యాంతరహితమునునై, ఆత్మయందు వెలయుచుండెను. దానియందు అవిద్యాది భ్రమలులేకుండెను.

ఆకల్పముత్తమబలేన శిలా పతేచ్చే త్తస్మిన్బలాత్పతగరాడపిచోత్పతేచ్చేత్
తద్యోజనం నలభతే విమలేఽంబరేఽంత ర్యాకల్పమేకజవగోఽప్యథమారుతోఽపి. 60

ఇత్యార్షే శ్రీ వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే ఉత్పత్తి ప్రకరణే పరమాకాశ వర్ణనంనామ ఏకోనత్రింశత్తమః సర్గః ॥ 29 ॥

ఏనుండి ఆకల్పాంతము రాళ్లవానగురిసినను, అతివేగముతో గరుత్మంతుడరుదెంచినను, వాయువు ప్రళయపర్యంతము ప్రవహించినను, ఆ ఆకాశసీమను చేరజాలవు.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు ఉత్పత్తిప్రకరణమున లీలోపాఖ్యానమున పరమాకాశ వర్ణనమను ఏకోనత్రింశ సర్గము. ॥ 29 ॥



## త్రింశః సర్గః.

శ్రీవసిష్ఠ ఉవాచ:—

పృథివ్యప్తేజసాం తత్ర నభస్వన్నభసోరపి
యథోత్తరం దశగుణానతీత్యావరణాత్ క్షణాత్. 1
దదర్శ పరమాకాశం తత్ప్రమాణవివర్జితం
తథా తతం జగదిదం యథా తత్రాండమాత్రకం. 2
తాదృశావరణాన్సర్గాన్ బ్రహ్మాండేషు దదర్శ సా
కోటిశఃస్ఫురితాన్ వ్యోమ్ని త్రసరేణూనివాతపే. 3

మహాకాశమహాంభోధౌ మహాశూన్యత్వవారిణి
మహాచిద్ద్రవభావోత్థాన్ బుద్బుదానర్బుదప్రభాన్. 4
కాంశ్చిదాపతతోఽధస్తాత్కాంశ్చిచ్చోత్పరిగచ్ఛతః
కాంశ్చిత్తిర్యగ్గతీనన్యాన్ స్థితాం స్తబ్ధాన్స్వసంవిదా. 5

వసిష్ఠుడు:- వారుక్షణములో ఆ బ్రహ్మాండమండలమున దశగుణాధికములగు పంచభూతావరణములనుదాటి, పరమాకాశమును దర్శించిరి. ఆ పరమాకాశమున ఈ జగత్తును, అండప్రమాణములగు అసంఖ్యజగత్తులును ఉండెను. మఱియు, సూర్యకిరణములలోను త్రసరేణువులవలెనున్న, ఆవరణములగాంచిరి. మహాకాశమున శూన్యజలచిద్రవత్వమునుండి కోట్లకొలదిగ జగత్తులు లేచుచుండెను. వాటిలో కొన్ని పైకిలేచుచుండెను. కొన్ని క్రిందపడుచుండెను. కొన్ని 'వంకరటింకరగ' తిరుగుచుండెను. కొన్ని నిశ్చలములైయుండెను. ఇదంతయు ఆ యా బ్రహ్మాండములనున్న జీవుల జ్ఞానము ననుసరించియే జరుగుచుండెను.

యత్రయత్రోదితా సంవిద్యేషాంయేషాం యథాయథా
తత్రతత్రోదితం రూపం తేషాంతేషాం తథాతథా. 6
నైవైవతత్ర సామోర్ధ్వం నాధో నచ గమాగమౌ
అన్యదేవ పదంకించిత్తస్మాద్దేహాగమంహి తత్ 7
ఉత్పద్యోత్పద్యతే తత్ర స్వయం సంవిత్స్వభావతః
స్వసంకల్పైః శమంయాతి బాలసంకల్పజాలవత్. 8

ఎవరికి, ఎచ్చట, ఎట్లు ప్రాక్తనవాసనాజ్ఞానము స్ఫురించుచుండునో, వారికి ఆ యా తావుల అట్టిరూపములే అగపడుచుండును. కాన, తత్త్వజ్ఞులకు ఊర్ధ్వాధోమధ్య దేశకల్పనయేలేదు. అచ్చట కలుగుటయునులేదు. వారు కేవలము ద్వైతవిహీనమగు బ్రహ్మమునే కాంచుచుందురు. వెనుకజెప్పబడినలోకములు అజ్ఞుల శరీరప్రాప్తిని నిర్దేశించి చెప్పబడినవి. అజ్ఞానమువనే, 'బాలుని చిత్తకల్పనవలె, ఆ బ్రహ్మాండము లుత్పన్నములై నశించుచున్నవి.

శ్రీ రామ ఉవాచ:—

కిమధఃస్యాత్కిమూర్ధ్వంస్యాత్కింతిర్యక్తత్ర భాసురే
ఇతి బ్రూహి మమ బ్రహ్మన్నిహైవ యది నస్థితం. 9

శ్రీరాముడు:- ఊర్ధ్వాధోతిర్యక్ కల్పనలు అననేమి? అయ్యవి అధిష్ఠానమగు బ్రహ్మమునలేకున్న బ్రహ్మాండమున నెట్లుండగలవు? వచింపుడు.

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

ససర్వావరణా ఏతే మహాత్యంతవివర్జితే
బ్రహ్మాండా భాంతి దుర్దృష్టే ర్వ్యోమ్ని కేశోండ్రకోయథా. 10

వసిష్ఠుడు:- రేచీకటికన్నులవానికి ఆకాశమున కొప్పు అగపడునట్లు, అవిద్యయందున్న వానికి సాకారహితమగు పరమపదమున ఈ బ్రహ్మాండము లగపడును.



అస్వాతంత్ర్యాత్ప్రధావంతి పదార్థాః సర్వఏవయత్
బ్రహ్మాండే పార్థివో భాగ స్తదధస్తూర్ధ్వమన్యథా. 11

పదార్థములన్నియు ఈశ్వరేచ్ఛ ననుసరించియే ప్రవర్తించుచున్నవి; వారికి స్వాతంత్ర్యము లేదు. ఈ బ్రహ్మాండమున పార్థివభాగము క్రిందుగను, ఆకాశము మీదుగనునున్నది.

పిపీలికానాం మహతాం వ్యోమ్నివర్తులలోష్టకే
దశదిక్కమధః పాదాః పృష్ఠ మూర్ధ్వముదాహృతం. 12

అధోదేశమున 'ఆకాశముననున్న మట్టిముద్దయను చీమకాలు' అని జ్యోతిర్విదులు వచించుచున్నారు.

వృక్షవల్మీకజాలేన కేషాం చిద్ధృదిభూతలం
ససురాసురదైత్యేన వేష్టితం వ్యోమనిర్మలం. 13

కొన్నికొన్ని బ్రహ్మాండభూముల చెట్టుపుట్టలుమాత్రమేయున్నవి; మనుష్యులులేరు. ఆకాశభాగమున దేవ, దైత్య, కిన్నరులున్నారు.

సంభూతం సహభూతేన సగ్రామపురపర్వతం
ఇదం కల్పన భూతేన పక్వాక్షోటమివ త్వచా. 14

అక్షోటఫలము చర్మముతోగూడి ఉత్పన్నమగునట్లు, కొన్ని బ్రహ్మాండములు అప్పటి కప్పుడే కల్పింపబడిన చతుర్విధప్రాణి సమూహముతోడను, గ్రామములతోడను, పురములతోడను, పర్వతములతోడను ఉత్పన్నములగుచున్నవి.

యథా వింధ్యవనాభోగే ప్రస్ఫురంతి కరేణవః
తథా తస్మిన్పరాభోగే బ్రహ్మాండత్రసరేణవః. 15

వింధ్యపర్వతముననున్న కొన్నికొన్ని తావులయందే ఏనుగులు పుట్టునట్లు, బ్రహ్మమాయతో గూడినచోట్ల, త్రసరేణువులవంటి బ్రహ్మాండము లనేకము లుత్పన్నము లగుచున్నవి.

తస్మిన్సర్వం తతః సర్వం తత్సర్వం సర్వతశ్చయత్
తచ్చసర్వమయోనిత్యం తథా తదణుకం ప్రతి. 16

ఇవన్నియు చిదాకాశముననేయున్నవి, చిదాకాశమునుండియే జన్మించుచున్నవి, చిదాకాశముననే లీనములగుచున్నవి. ఈ సృష్టవస్తువులన్నిటికిని ఈ ఆత్మవస్తువే కారణమగుచున్నది. మఱియు నిదియే అంతయునైయున్నది.

శుద్ధబోధమయేతస్మిన్పరమాలోకవారిధౌ
అజస్రమేత్యగచ్ఛంతి బ్రహ్మాండాఖ్యా స్తరంగకాః. 17

శుద్ధబోధమయమగు చిదాకాశసముద్రమున బ్రహ్మాండములను తరంగము లనేకములు నిరంతరము లేచుచు, మరల నందే లీనములగుచున్నవి.

అంతఃశూన్యాః స్థితాః కేచిత్సంకల్పాత్మయదాత్రయః
తరంగా ఇవ తోయేబ్ధౌ ప్రోక్ష్యంతే శూన్యతార్ణవే. 18

'ఆ చిదాకాశ సముద్రమున ఇంకను లేవవలసిన తరంగము లనేకములున్నవి. సంకల్ప రహితములగుటవలన కొన్ని అంధకారస్వరూపములై శూన్యమున నిద్రితములై యున్నవి' — అని అనుమానింపబడుచున్నది.

కేషాం చిదంతఃకల్పాంతః ప్రవృత్తో ఘుర్ఘురారవః
నశ్రుతోఽన్యైర్న చజ్ఞాతః స్వభావేన రసాకులైః. 19

కొన్నికొన్ని బ్రహ్మాండ - తరంగముల కల్పాంతసూచక ధ్వనులు విషయరసమోహితు లగు వారి చెవులకు వినబడుటలేదు; బుద్ధికి గోచరించుటలేదు.

అన్యేషాం ప్రథమారంభే శుద్ధభూషు విజృంభతే
సర్గః సంసిక్తబీజానాం కోశేఽంకురకలా యథా. 20

నీటవదులబడిన గింజలనుండి అంకురములు వెలువడునట్లు, మొట్టమొదట ప్రారంభింపబడిన బ్రహ్మాండసమూహముల విశుద్ధములగు జీవ సమూహములు లేచుచున్నవి.

మహాప్రలయసంపత్తౌ సూర్యార్చిర్విద్యుతోఽద్రయః
ప్రవృత్తాగలితుం కేచిత్తాపే హిమకణా ఇవ. 21

వేడి మంచుగడ్డను కరిగించునట్లు, కొన్నికొన్ని బ్రహ్మాండములకు మహాప్రళయ మరుదెంచుటవలన సూర్యచంద్రాదులు భూమిని దగ్ధమొనర్చి కరిగించుచున్నారు

ఆకల్పం నిపతంత్యేవ కేచిదప్రాప్తభూమయః
యావద్విశీర్యజాయంతే తథా సంవిన్మయాః కిల. 22

కొన్నికొన్ని బ్రహ్మాండములు పట్టుగొమ్మదొరకక, మఱి ఇంకన్నటికిని లేచు ఆశ లేకుండ, అధోభాగమున బడుచున్నవి. ఇట్లు పడుట సంభవముకాదని ఎంచకుము. ఇవన్నియును చిద్రూపములు; అందువలన బ్రహ్మాండముల ఉత్పత్తిపతనాదుల కల్పనకు తావున్నది.

స్తబ్ధా ఇవ స్థితాః కేచిత్కేశోండ్రకమివాంబరే
వాయోః స్పందా ఇవా భాంతి తథా ప్రోదిత సంవిదః. 23

కొన్నికొన్ని బ్రహ్మాండములు స్తబ్ధములైయున్నవి. ఆకాశమున కేశోండ్రకము, వాయువున స్పందము బ్రకాశించునట్లు, పైనజెప్పబడిన కల్పనలుగూడ ఉదయించుచున్నవి.

ఆచారాద్వేదశాస్త్రాణామాద్యపవాన్యథోదితే
ఆరంభోఽపి తథాన్యేషామనిత్యః సంస్థితః క్రమః. 24

పూర్వజన్మలయందాచరింపబడిన జ్ఞానకర్మాద్యనుష్ఠానములవలననే ప్రజాపతియైన ఒకానొకనిచే ఈ బ్రహ్మాండములో సృష్టింపబడుచున్నవి ఈ కల్పముననున్న సృష్టికిని తరువాత వచ్చు కల్పముననుండు సృష్టికిని భేదముండిన నుండవచ్చును; ఇది శాస్త్రసంగతము.

కేచిద్బ్రహ్మాదిపురుషాః కేచిద్విష్ణ్వాదిసర్గపాః
కేచిచ్చాన్యప్రజానాథాః కేచిన్నిర్నాథజంతవః, 25



కొన్ని బ్రహ్మాండములను బ్రహ్మసృష్టించినాడు. కొన్ని బ్రహ్మాండములను విష్ణువు గల్పించినాడు. కొన్ని బ్రహ్మాండములను ప్రజాపతి రచించినాడు. కొన్నిటికి కర్తయేలేదు; అవి కేవలము మృగపక్ష్యాదులతో నిండియున్నది.

కేచిద్విచిత్రసర్గేశాః కేచిత్తిర్యఙ్మయాంతరాః
కేచిదేకార్ణవాపూర్ణా ఇతరే జనివర్జితాః. 26

కొన్ని బ్రహ్మాండములను గొందఱు కలసి విచిత్రముగ సృష్టించుచున్నారు. కొన్ని ఏకాకారసముద్రములో నిండియున్నవి. కొన్నిటియందు సృష్టియేలేదు. కొన్నిట మనుష్యులేలేరు.

కేచిచ్ఛిలాంగనిష్పిండాః కేచిత్క్రిమిమయాంతరాః
కేచిద్దేవమయాఏవ కేచిన్నరమయాంతరాః. 27

కొన్ని పాషాణములతో నిండియున్నవి. కొన్ని క్రిములతోగూడియున్నవి. కొన్ని కేవలము దేవతలతోడను, కొన్ని కేవలము మనుష్యులతోడను నిండియున్నవి.

కేచిన్నిత్యాంధకారాఢ్యాస్తథా కీలితజంతవః
కేచిన్నిత్యప్రకాశాఢ్యాస్తథా శీలితజంతవః. 28

కొన్నిటి అంధకార మావరించియున్నది. అందు గుడ్లగూబలం వంటివగు జంతువు లున్నవి. కొన్ని ప్రకాశముతోనిండి, మనుష్యాది ప్రాణులకు నివాసమై వెలయుచున్నవి.

కేచిన్మశకసంపూర్ణా ఉదుంబర ఫలశ్రియః
నిత్యంశూన్యాంతరాః కేచిచ్ఛూన్యస్పందాత్మజంతవః. 29

కొన్ని బ్రహ్మాండములు మశకములతోనిండి ఉదుంబరఫలములవలె నగుపడుచున్నవి; కొన్ని బ్రహ్మాండములు శూన్యములు. కొన్నిట చలనములేని జంతువులున్నవి.

సర్గేణ తాదృశేనాన్యే పూర్ణా యేఽంతర్ధియామిహ
కల్పనామపి నాయాంతి వ్యోమపూర్ణాచలో యథా. 30

తాదృగంబరమేతేషాం మహాకాశం తతంస్థితమ్
ఆజీవితంప్రగచ్ఛద్భిర్విష్ణ్వాద్యైర్యన్నమీయతే. 31

ఇట్టి వేయగు సృష్టులతోనిండిన బ్రహ్మాండము లింకను అనేకములున్నవి. అవి యోగుల కల్పననుగూడ నతిక్రమించుచున్నవి. ఈ బ్రహ్మాండములన్నియు శూన్యముననేయుండి, విశాల మహాకాశమువలెనున్నవి. విష్ణ్వాదిదేవతలు తమ జీవితమునంతటిని వినియోగించినను, వీటి పరిమాణమును దెలియజాలరు.

ప్రత్యేకస్యాండగోలస్య స్థితఃకటకరత్నవత్
భూతాకృష్టికరోభావః పార్థివఃస్వస్వభావతః. 32

కటకమున రత్నములు పొదుగబడియుండినట్లు, ఈ బ్రహ్మాండముల భూతాకర్షణశక్తి యున్నది. అందువలననే జలాది ఆవరణములు తొలగిపోకుండనున్నవి.

యః సర్వవిభవో౽స్మాకం ధియాం నవిషయం తతః
తజ్జగత్కథనేశక్తిర్నమమాస్తిమహామతే. 33

మహామతీ! ఈ జగత్తును నాయోపిక కొలది వర్ణించితిని. ఇక వర్ణించుశక్తి నాకు లేదు.

భీమాంధకారగహనే సుమహత్యరణ్యే
నృత్యంత్యదర్శితపరస్పరమేవమత్తాః
యక్షా యథా ప్రవితతే పరమాంబరే౽ంత
రేవంస్ఫురంతి సుబహూని మహాజగంతి. 34

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే ఉత్పత్తిప్రకరణే
విచిత్ర బ్రహ్మాండకోటి వర్ణనం నామ త్రింశః సర్గః ॥ 30 ॥

భయంకరమగు చీకటితో నిండియున్న అరణ్యమున ఉన్మత్తులై అదృశ్యభావమున దృశ్యమొనర్చు యక్షగణమువలె, ఈ మహాకాశమున ఎన్నివందల బ్రహ్మాండములున్నవో వర్ణింప సాధ్యము కాదు.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు ఉత్పత్తిప్రకరణమున
లీలోపాఖ్యానమున విచిత్రబ్రహ్మాండ వర్ణనమను త్రింశ సర్గము ॥ 30 ॥

---

## ఏకత్రింశః సర్గః

**శ్రీ వసిష్ఠ ఉవాచ:—**

ఏవమాకలయంత్యౌ తే నిర్గత్యజగతో నిజాత్
అంతఃపురం దదృశతుర్ఘటిత్యేవ వినిర్గతే. 1

స్థితపుష్పభరాపూర్ణ మహారాజమహాశవం
శవపార్శ్వోపవిష్టాంత శ్చిత్తలీలాశరీరకమ్. 2

ఘనరాత్రితయాల్పాల్ప మహానిద్రాజనాకులమ్
ధూపచందనకర్పూర కుంకుమామోదమంథరమ్. 3

తమాలోక్యాపరంభర్తుః సంసారం గంతుమాదృతా
పపాత లీలా సంకల్పదేహేనాత్రైవ తన్నభః. 4

వసిష్ఠుడు:— లీలయు, సరస్వతీదేవియు నిట్లు సంభాషించుచు, తాము గాంచుచున్న జగత్తునుండి వెలువడి, హఠాత్తుగ అంతఃపురమును గాంచిరి. అచ్చట పుష్పముల గప్పబడిన పద్మరాజు శవ ముండెను; దాని ప్రక్క సమాధిమగ్నయగు లీలాదేవి శరీరముగూడ నుండెను. దీర్ఘమగు ఆ రాత్రియందచ్చట నున్నవారెవరికిని గాఢనిద్ర వచ్చుచుండుటలేదు. ధూప, చందన కుంకుమాదుల సౌరభముతో నాల్గుదిక్కులు నిండియుండెను. లీలాదేవి ఆ సంసారమును గాంచి, అచ్చటి కరుగ నిచ్ఛించినంత మాత్రముననే, ఆమె సంకల్పదేహ మచ్చటి కరిగెను.



వివేశ భర్తుః సంకల్పసంసారం కించిదాతతమ్
సంసారావరణం భిత్త్వా భిత్త్వా బ్రహ్మాండకర్పరమ్. 5

ఆమె మరల బ్రహ్మాండకర్పరమును భేదించి, భర్తయొక్క సంకల్పమయ సంసారమును ప్రవేశించెను.

ప్రాప సార్ధం తయా దేవ్యా పునరావరణాన్వితమ్
బ్రహ్మాండమండపం స్ఫారం తం ప్రవిశ్య తథా జవాత్. 6

ఆమె దేవితోగూడి ఆవరణయుతమగు ఆ విశాల బ్రహ్మాండ మండపమును సమీపించి వెంటనే అందు ప్రవేశించెను.

దదర్శ భర్తుః సంకల్ప జగజ్జంబాలపల్వలమ్
సింహీవ శైలకుహరం తమో జలదపంకిలమ్. 7

దేవ్యౌ వివిశతుస్తత్తే వ్యోమ వ్యోమాత్మికే జగత్
బ్రహ్మాండే౽ంతర్యథా పక్వం మృదుబిల్వం పిపీలికే. 8

ప్రవేశించి భర్తయొక్క సంసారమును గాంచెను; అది బురదగుంటవలె నుండెను. సింహములు మేఘపంకిలమగు గుహను, చీమలు మారేడుపండును ప్రవేశించునట్లు వారు ఆకాశ శరీరముతో ఆ బ్రహ్మాండాకాశమును ప్రవేశించిరి.

తత్రలోకాంతరాణ్యద్రీ నంతరిక్షమతీత్య తే
ప్రాపతుర్భూతలం శైలమండలాంభోధిసంకులమ్. 9

మేరుణాలంకృతం జంబూ ద్వీపం నవదలోదరమ్
గత్వాథ భారతే వర్షే లీలానాథస్య మండలమ్. 10

ఆ బ్రహ్మాండాకాశముననున్న లోకాంతరములను, పర్వతములను, అంతరిక్షమును దాటి పర్వతములతో నిండి, సముద్రముచే జుట్టబడి, సుమేరువుచే నలంకరింపబడి, నవధావిభక్తమగు జంబూద్వీపమున కరుదెంచి, భారతవర్షముననున్న పద్మునిరాజ్యమును ప్రవేశించిరి.

ఏతస్మిన్నంతరే తస్మిన్మండలే మండితావనౌ
చక్రే౽వ స్కందనం కశ్చిత్సామంతో౽ద్రి క్షమాధిపః. 11

తేన సంగ్రామ సంరంభే ప్రేక్షార్థం సముపాగతైః
త్రైలోక్యభూతైస్తద్వ్యోమ బభూవాత్యంతసంకటమ్. 12

లీలయు సరస్వతీదేవియు నటకఱిగినప్పుడు, సామంతరాజులతోగూడి సింధురాజు లీలానాథుని దేశము నాక్రమింప యత్నించుచుండెను; అందువలన పెద్దయుద్ధము జరుగుచుండెను. దానిని గాంచవచ్చిన త్రిలోకవాసులతో నాకాశము నిండియుండెను.

అశంకితాగతే తత్తే దేవ్యౌ దదృశతుర్నభః
నభశ్చరగణాక్రాంత మంబుదైరివమాలితమ్. 13

సిద్ధచారణగంధర్వ గణవిద్యాధరాన్వితమ్
శూరగ్రహణ సంరబ్ధ సుర్గలోకాప్సరోవృతమ్. 14

రక్తమాంసోన్ముఖోన్మత్త భూతరక్షః పిశాచకమ్
పుష్పవృష్టిభిరాపూర్ణహస్తవిద్యాధరాంగనమ్. 15
వేతాలయక్షకూష్మాండైర్వృందాలోకనసాదరైః
ఆయుధాపాతరక్షార్థం గృహీతాద్రితటైర్వృతమ్. 16
అస్త్రమార్గనభోభాగ విద్రవద్వ్యాతమండలమ్
అహోపురుషికాక్షుబ్ధప్రేక్షకామోదనోద్భటమ్. 17
ఆసన్నభీమసంగ్రామ కిం వదంతీ పరస్పరమ్
లీలాహాస విలాసోత్క సుందరీధృతచామరమ్. 18
ధర్మాప్రేక్ష్య ప్రయాతాగ్ర్య మునిస్వస్త్యయనస్తవం
సంపన్నానేకలోకేశ వనితావసరస్తవమ్. 19
స్వర్గార్హశూరానయన వ్యగ్రేంద్రభటభాసురం
శూరార్థాలంకృతోత్తుంగ లోకపాలాఖ్యవారణం. 20
అగచ్ఛచ్చూరసన్మానోన్ముఖగంధర్వచారణం
శూరోన్ముఖామరస్త్రైణ కటాక్షేక్షితసద్భటమ్. 21
వీరదోర్దండకాశ్లేష లంపటస్త్రీగణాకరం
శుక్లేన శూరయశసా చంద్రీకృతదివాకరం. 22

లీలయు సరస్వతీదేవియునటుల నిశ్శంకగా నరిగి గాంచిన దేమన — ఆకాశము గగనచరులతో నిండి, మేఘములతో నిండియున్నట్లగపడుచుండెను. ఆకాశమున సిద్ధులు, చారణులు, గంధర్వులు, విద్యాధరులు మున్నగువారుండిరి. అప్సరసలు శూరపురుషుల నాహ్వానించుచుండిరి. రక్తమాంసములను గొనుటకై తో, భూత, పిశాచ, రాక్షసగణము లానందనృత్యము సల్పుచుండెను. విజయమునందిన వారిపైజల్లు, విద్యాధరాంగనలు చేతపూలనుంచుకొనిరి. యుద్ధమును గాంచి వచ్చిన బేతాళకూష్మాండాది పిశాచములు, బాణములు మీదపడుననుభయమున కొండలమాటున నక్కియుండెను; బాణములు పడుచున్నతావునుండి భూతములు తొలగిపోవుచుండెను. యోధులు అహంకారముతో యుద్ధమొనర్చుచు, చూపరుల కానందమును గలిగించుచుండిరి. ‘భీమసంగ్రామమే’ యని జనులు పరస్పరము పల్కుకొనుచుండిరి. లీలాహాసవిలాసయుతలగు దేవతాస్త్రీలు చామరములను ధరించియుండిరి. తమ ధర్మబలమునచేసి ఆకసమున అదృశ్యులై యున్న మునులీభయంకర సంగ్రామమును గాంచి, దేవస్తవమును బఠించుచుండిరి. లోకపాలకుల భార్యలుగూడ స్తవముల నొనర్చుచుండిరి. స్వర్గమున నుండదగినవారిని గొనిరా నింద్రదూతలు తొందరపడుచుండిరి; కొందఱు ఐరావతాదిగజముల నలంకరించుచుండిరి. స్వర్గమున కరుదెంచు శూరులను గంధర్వచారణులు గౌరవార్థ మెదుర్కొనుచుండిరి. వీరులను జెందగోరు దేవతాస్త్రీలు, శూరులపై పువు తమచూడ్కులను బరపుచుండిరి. వారిని కౌగలించుకొన తొందరపడుచుండిరి. ఆ వీరుల యశస్సునచేసి సూర్యుడుగూడ చంద్రునివలె తెల్లబడెను.

**శ్రీరామ ఉవాచ:—**

భగవన్ శూరశబ్దేన కీదృశః ప్రోచ్యతే భటః
స్వర్గాలంకరణం కః స్యాత్కో వా డింభాహవో భవేత్. 23



శ్రీరాముడు:— భగవంతుడా! ఎట్టిభటుని వీరు డందురు? స్వర్గమున కలంకార మెట్టివారు? ఎవరు స్వర్గవాసమునకు దగరు?

**శ్రీవసిష్ఠ ఉవాచ:—**

శాస్త్రోక్తాచారయుక్తస్య ప్రభోరర్థేన యో రణే
మృతోఽథవా జయీ వా స్యాత్స శూరః శూరలోకభాక్. 24

వసిష్ఠుడు:— శాస్త్రవిహితముగ నాచరించు ప్రభువుయొక్క ప్రయోజననిమిత్తము యుద్ధమున ప్రాణముల ద్యజించువాడు (లేక జయించువాడు) శూరుడనబడును ఇట్టివాడు స్వర్గమున కేగును.

అన్యథా ప్రాణికృత్తాంగో రణే యో మృతిమాప్నుయాత్
డింభాహవహతః ప్రోక్తః స నరో నరకాస్పదం. 25

శాస్త్రవిరుద్ధముగ సంచరించు ప్రభునికొఱకు పోరాడి, మడిసినవాడు స్వర్గమునకు దగడు, అతడు నరకమున కరుగును.

అయథాశాస్త్రసంచారవృత్తేరర్థేన యుధ్యతే
యో నరస్తస్య సంగ్రామే మృతస్య నిరయోఽక్షయః. 26

శాస్త్రవిరుద్ధాచరణుడగు ప్రభునికొఱకు యుద్ధమొనరించి మరణించువాడు అనంత నరకమున కేగును.

యథాసంభవశాస్త్రార్థలోకాచారానువృత్తిమాన్
యుధ్యతే తాదృశస్త్వేవ భక్తశూరః స ఉచ్యతే. 27

శాస్త్రసంగతముగను, లోకసమ్మతముగను ఆచరించు ప్రభునికొఱకు పోరాడువాడు, భక్తుడు, శూరుడనంబడును.

గోఽర్థే బ్రాహ్మణస్యార్థే మిత్రస్యార్థే చ సన్మతే
శరణాగతయత్నేన స మృతః స్వర్గభూషణమ్. 28

సన్మతీ! గోబ్రాహ్మణ హితముకొఱకును, మిత్రునికొఱకును, శరణాగతులను రక్షించు నిమిత్తమును యుద్ధమొనర్చి మృతించువాడు స్వర్గాభరణ మనంబడును.

పరిపాల్యస్వదేశైకపాలనే యః స్థితః సదా
రాజా మృతాస్తదర్థం యే తే వీరా వీరలోకినః. 29

స్వదేశరక్షణార్థము పోరాడి మృతించు రాజును, అతని భటులును స్వర్గమున కేగుదురు.

ప్రజోపద్రవనిష్ఠస్య రాజ్ఞోఽరాజ్ఞోఽథవా ప్రభోః
అర్థేన యే మృతా యుద్ధే తే వై నిరయగామినః. 30

ప్రజాపీడన మొనర్చువాడును, పరరాజునగు వానికొఱకు పోరాడి మరణించువాడు నరకమున కరుగును.

యే హి రాజ్ఞామరాజ్ఞాం వాప్యయథాశాస్త్రకారిణాం
రణే మ్రియంతే ఛిన్నాంగాస్తే వై నిరయగామినః 31

రాజ్యాశానిమ్ము లేక మరొకదేయగుగాక, శాస్త్రవిరుద్ధముగ నాచరించువానితో బోరాడి మృతించిన నిశ్చయముగ నరకమున కరుగును.

ధర్మ్యం యథా తథా యుద్ధం యది స్యాత్త్వరి సంస్థితిః
నాశయే యురలం మర్త్యాః పరలోకభయోజ్ఝితాః. 32

ధర్మయుద్ధమునకును, అధర్మయుద్ధమునకు ఫలమొక్కటియేయైన, జనులు అధర్మయుద్ధమునకై ప్రాణులను జంపుదురు.

యత్ర యత్ర హతః శూరః స్వర్గ ఇత్యపశోక్తయః
ధర్మ్యే యోద్ధా థ వేచ్ఛూర ఇత్యేవం శాస్త్రనిశ్చయః. 33

శూరుడేస్థితియందు మరణించినను స్వర్గమున కరుగుననుట లోకప్రమాదము మాత్రమే; ధర్మయుద్ధమున మరణించువాడే స్వర్గమున కరుగుననుట శాస్త్రవచనము.

సదాచారవతామర్థే ఖడ్గధారాం సహంతి యే
తే శూరా ఇతి కథ్యం తే శేషా డింభాహవాహతాః 34

సదాచారపరాయణులగువారిని రక్షింప యుద్ధమొనర్చువారే శూరులు; తక్కినవారు స్వర్గమున కరుగజాలరు. వారొనర్చునది బాలయుద్ధము (అనగా యుద్ధముకాదు.)

తేషామర్థేరణే వ్యోమ్ని తిష్ఠంత్యుత్కంఠితాశయాః
శూరీభూత మహాసత్త్వ దయితోక్తి సురాంగనాః. 35

ఆకాశమున జరించు దేవతాస్త్రీలు, ధర్మయుద్ధమొనర్చు శూరులను గాంచి, ఉత్కంఠిత చిత్తమున 'మేమీశూరుని వరింతుము' అని పల్కుకొనుచుందురు.

విద్యాధరీ మధురమంథరగీతిగర్భం
మందారమాల్యవలనా కులకామినీకం
విశ్రాంత కాంత సురసిద్ధ విమానపంక్తి
వ్యోమోత్సవోచ్చరిత శోభమివోల్లలాస. 36

ఇత్యార్షే శ్రీ వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే ఉత్పత్తిప్రకరణే యుద్ధప్రేక్షకాస్థితాంబర వర్ణనం నామ ఏకత్రింశత్తమః సర్గః ॥ 31 ॥

ఆసంగ్రామరంగ ఆకాశదేశమున విద్యాధరనారులు మధుర గానము సల్పుచుండిరి. దేవతాస్త్రీలు శూరుల మెడలోవేయ మందారమాలలను గ్రుచ్చుచుండిరి. దేవతలయొక్కయు, సిద్ధులయొక్కయు విమానము లాగియుండెను. అప్పుడాకాశము ఉత్సవస్థానమువలె శోభిల్లుచుండెను.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు, ఉత్పత్తిప్రకరణమున లీలోపాఖ్యానమున యుద్ధప్రేక్షకాస్థితాంబరవర్ణనమను ఏకత్రింశ సర్గము ॥31॥

